# ĀRĀDHANA

(A RELIGIOUS MONTHLY MAGAZINE)

**ANNUAL & FEBRUARY 1956**

*Anent* THE TEMPLES

FOR THE TEMPLES

BY THE TEMPLES

*(in Andhra State)*


*" Go deep inside the temple and you will find me there "*—MOTHER



---


PUBLICATION OFFICE:

" ĀRĀDHANA "

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department*
*( Andhra )*

MASULIPATAM

ANNUAL SUBSCRIPTION (Inland) Rs. 12/-

PER SINGLE COPY (THIS ISSUE) Rs. 2/-

# ఆరాధన

మన్మథ | మాసపత్రిక | వార్షిక - మాఘములు

## విషయసూచిక

పుట

### తెనుగు



## CONTENTS

PAGE

### ENGLISH

"ఆనందరూప మమృతం య ద్విభాతి"




సకృ దేవ ప్రపన్నాయ 'త వాస్మీ'తి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥

సంపుటము ౨ — మన్మథ వార్షిక - మాఘములు — సంచికలు ౧, ౨

## దైవీ స్వస్తి రస్తు నః। స్వస్తి ర్మానుషేభ్యః॥

జయ మాఘమున ప్రథమావిర్భావము నొందిన "ఆరాధన" ప్రథమ వార్షికసంచికను మన్మథ మాఘమున వెలువరచుకొనుట ముదావహము. ఆంధ్రదేశమునందలి దేవాలయములను చారిత్రక, శిల్ప, మాహాత్మ్య దృష్టులతో ప్రజలకు కనబరచుటయే "ఆరాధన" ప్రధానమగు యాశయము. సంవత్సరము కృషిలో ముప్పదికి తక్కువ కాకుండ దేవాలయములను పైదృష్టితో నిరూపింపగల్గినదీ "యారాధన"; ఈ గమనముననే నడువసాగిన తన యభీష్టమును పూర్తిగ నెరవేర్చుకొనుటకు "ఆరాధన"కు పురుషాయుషవత్సరములు కావచ్చును. తన సదాశయములతో దినదినాభివృద్ధినొంది ప్రజల మన్ననలనొంది శతవార్షికసంచికను కూడ వెలువరచుకొన్నపుడే తనస్థితి చరితార్థమగును. "సంస్థవలన వ్యక్తి ఉపకారమునొందును, సంస్థకొరకు వ్యక్తులు; గాని వ్యక్తులకొరకు సంస్థయై వ్యక్తులవలన సంస్థయునికి గానేరదు" అను నగ్నసత్యముతో ప్రతిష్ఠింపబడిన పవిత్రసంస్థలగు దేవాలయముల కనుబద్ధమగు యీ "ఆరాధన" సంస్థకూడ తన పవిత్రాశయములను నెరవేర్చుకొనుచు దేవాలయములవలెనే సుప్రతిష్ఠితమై తన యాశయమును నెరవేర్చుకొని పురుషాయుషమును బడసి శతవార్షిక సంచికను కూడ వెలువరుచకొనకల్గునని యాశించుచున్నాము.

ఆంధ్రదేశమునందలి దేవాలయ శిల్పనిర్మాణ చాతురీవైభవమును ప్రజల కెఱుకపరచుటకు మొదటి (కవరు) పుటయందు దేవాలయశిల్పచాతుర్యము, త్రిలింగదేశ సూచకముగ ప్రసిద్ధ త్రిలింగములు, వైష్ణవచిహ్నములగు శంఖచక్రములు, చూపబడినవి.

దైవభక్తిని ప్రజలకు ప్రబోదించుట "ఆరాధన" యాశయములలో నొకటి గాన, కేవలము భక్తివలన మానవుడు ముక్తినొందగల్గును, అని నిరూపించుటకు రెండవ (కవరు) పుటయందు శ్రీ కాళహస్తీశ్వరస్వామికి, కన్నప్పనయనాడు తన కంటినికూడ భక్తిచే సమర్పించుట చూపబడినది. ఇందు తెలియదగినది, "దౌర్బల్యము, బలవత్త్వము, క్రౌర్యము, మౌఢ్యము, ఈ నాలుగును భగవదారాధనమునకు ప్రబలవిరోధులు. కాని నిశ్చలమగు భక్తిభావమున్నంతనే భగవద్ధ్యానమున నవి తిరోహితములగును" అని. ఇయ్యది నిరూపించుటకే, సాలీడు, మత్తగజము, క్రూరసర్పము, మూఢవ్యాధుడు, ఈశ్వరునారాధించి ముక్తి నొందగల్గిరని చిత్రమున నిరూపింపబడినది.

తత్త్వజ్ఞానమువలన కూడ ముక్తి కలుగునని నిరూపించుట కూడ "ఆరాధన" యాశయములలో నొకటియై యున్నది. ఈ తత్త్వజ్ఞానమును శ్రీ విద్యారణ్యస్వామి శిష్యునకుపదేశింపుచున్నట్లు కడపటి చిత్రమున చిత్రింపబడినది.

## ప్రధాన చిత్రము - త్రివర్ణ చిత్రము - శ్రీ కనకదుర్గాంబ - విజయవాడ

సుశోభితమగు విశాల ఆంధ్రదేశ మణిహారమునకు మధ్యమణి విజయవాడ. ఏ కేంద్రదృష్టిలో నైనను ఈనగరము కేంద్రముగనే కనబడును. ఇట్టి కేంద్రనగరమున, పురాతనప్రతిష్ఠితము శ్రీ కనకదుర్గాక్షేత్రము, క్షేత్రమునందలి ప్రధానదేవత **శ్రీ కనకదుర్గ.** శ్రీ కనకదుర్గాంబ యారాధకులకు యభీష్టము నమకూర్చునని యాశించుచు ఈ చిత్రము ప్రకటింపబడినది.

శాంతి చిత్రము - పుష్పాంజలి - త్రివర్ణము.

ఆరాధనలో నేవిధముగనైనను పుష్పోపహారము ప్రధానము-షోడశోపచారములలో పుష్పోపచారము పండ్రెండ యుపచారముగను, తరువాతను కూడ పరిగణింపబడినది. పండ్రెండు సంచికలను వెలువరచు కొనినదని సూచించుటకును ఆరాధన పుష్పాంజలితో సమాప్తి నొందింపబడుటను సూచించుటకును "పుష్పాంజలి"ని ప్రకటించుకొన్నది "ఆరాధన"

## విజ్ఞప్తి

పత్రికానిర్వహణ మష్ట కష్టములలో నొకకష్టము. అందును, అలౌకికమగు దైవిక విషయములను సేకరించుట కడుదుర్లభము. సేకరించినను యథాతథముగ ప్రచురించుట సుదుర్లభము. ఇట్టి క్లిష్టతరమగు కార్యమున, దేవాలయ నిర్వహణమునందు వలెనే ప్రజా, ప్రభుత్వ, పరిపాలక సహకారము లావశ్యకములు. ఈ "ఆరాధన" నిర్వహణమునందు ప్రభుత్వ మందజేయు సహకారము ప్రశంసనీయము. ప్రభుత్వమువారికి మా కృతజ్ఞతను ఈ సందర్భమున నివేదించక పోవుట కర్తవ్యతా విముఖతయగును. గాన ప్రథమమున మాన్యులు దేవాదాయధర్మాదాయశాఖా మంత్రివర్యులును అగు శ్రీ కల్లూరి చంద్రమౌళి గారికి "ఆరాధన" భక్త్యంజలి సమర్పించుచున్నది.

పరిపాలకుల యాదరాభిమానములతో నిండిన సహకారమే కార్యసాధక మగునసుట లోకవిదితము. ఇట్టి యాద రాభిమానములను "ఆరాధన"కు సర్వతోముఖముగ సమకూర్చుచు సంపూర్ణమగు సహకారము నొనర్చుచున్న దేవాదాయ పరిపాలనాశాఖ కమిషనరువారగు శ్రీ వెంకటరెడ్డిగారి అవిరత కృషియే "ఆరాధన" వార్షిక సంచికను వెలువరచు కొనుటకు ముఖ్యకారణము. బహుజనాదరమునొంది బహుముఖముల "ఆరాధన" వ్యాప్తినొందుటయే అవిరతమగు వారి కృషి యాశయములను ఫలింపజేసి యారాధింపజేయుటయే తన కృతజ్ఞతను తెలియపరచుట. ఆ విధముగ వారి నార ధింపజేసి కృతజ్ఞతను నివేదించుట "ఆరాధన" ముఖ్యకర్తవ్యము.

ఇతరమగు సాధనసంపత్తి యెంత యుండినను, విద్వద్వతంసుల విజ్ఞానధనమే వైజ్ఞానికపత్రికల నిర్వహణకు ముఖ్యసంపద. తమ విజ్ఞానధనముచే "ఆరాధన" ను సంపన్నముగా చేయు విద్వద్వతంసులకు నమోవాకములు. ఈ సందర్భమున "ఆరాధన" ఆవిర్భావమునుండియు తమ యమూల్యమగు వ్యాసరత్నములచే "ఆరాధన" నలంకరింప చేయుచున్న శ్రీ రామేశం, యమ్.ఏ. ఐ.ఏ.యస్. వారికి కృతజ్ఞతను ప్రకటింపకపోవుట "ఆరాధన" స్వధర్మనిర్వహ ణము నొనర్పని దగును ; పూజ్యులగు వారికి ప్రణామాంజలి యర్పింపబడుచున్నది.

ఇట్లే సర్వజనాకర్షకములగు తమ వ్యాసరాజములతో "ఆరాధన" ను జనాదరణీయముగ నొనర్చుచున్న "యథార్థవాది" ని నుతించుట యథార్థవాదమే యగును.

దేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖయందలి, ఇతరోన్నతోద్యోగులు, దేవాలయధర్మకర్తలు, నిర్వాహకులు, మొదలగు పాలకవర్గము యొక్క విశేషసహకారము "ఆరాధన" వ్యాప్తి యందత్యంత మపేక్షితము; వారి సహ కారముండిన ఆంధ్రదేశమునందలి దేవాలయ స్వరూపస్వభావములను జనసామాన్యమున కెఱుకపరచుట సులభము. సామాన్యముగ ప్రతిమండలమునందలి ప్రధానమగునట్టియు ప్రాచీనమైనట్టి దేవాలయ స్వరూప స్వభావములను తెలిసి కొనుట కర్తవ్యము. అందుకనియే ముందు ఈ వార్షికసంచికయందు గుంటూరు మండలమునందలి దేవాలయములు నిరూ పింపబడినవి. మిగిలిన మండలములందలి ప్రధానదేవాలయ స్వరూపస్వభాములుకూడ యిట్లే ప్రకటింపబడుచుండును. ఇట్టి యుద్యమమునందు పరిపాలనాశాఖయందలి అసిస్టెంటు కమిషనరుల, దేవాలయధర్మకర్తల, నిర్వాహకోద్యోగుల సహాయసంపత్తి ముఖ్యసాధకము. ఇంతవరకును "ఆరాధన" యందు వారు చూపెడి యాదరాభిమానములకు వారికి కృతజ్ఞతను నివేదించుచు మున్ముందు కూడ యింతకంటే విశేషమగు సహాయసహకారముల నొనర్పదగునని "ఆరాధన" నివేదించు చున్నది.

"ఆరాధన" యభివ్యాప్తిని, అభివృద్ధిని కాంక్షించుచు ఈ "వార్షికసంచిక" కు వారి యమూల్యములగు అభినందన సందేశముల నందజేసిన మహాశయులకు మా వందనముల నర్పించుచు వారిసందేశముల నిందు ప్రథమముగ పొందుపరచుచున్నాము.

(సహాయసంపాదకుడు)



VICE-PRESIDENT
INDIA

NEW DELHI

27 January,56.

Dear Sir,

I am glad to know that "Aradana" will have its Annual Number. I send my best wishes for its success.

Yours faithfully,

(S.Radhakrishnan).

Shri R.Venkata Reddi,
Hindu Religions & Charitable
Endowments (Admn.)Dept.,
Guntur-2.

Hon'ble Shri Justice B. Jagannadha Das, M.A.,M.L.




**JUDGE, SUPREME COURT,**
**INDIA.**

*New Delhi, the* 24th December 1955.

Dear Sir,

I am glad to note that you are proposing to bring out the Annual Number of "ARADHANA" in January next. I have been reading the various numbers of Aradhana as soon as they are received. Though I have not been able to find sufficient time to read them as closely as I would have liked, I find, even on a cursory reading, that the matter is instructive and inspiring. It is necessary that we should all know the basic features of our religion and the historical and other material connected with the Temples which sustain faith and devotion. I think the Magazine is serving a very useful purpose. I wish it all success.

Yours sincerely,

B. Jagannadhadas

(B.Jagannadhadas)

Shri R. Venkata Reddi Garu,B.A.,B.L.,
Commissioner,
H. R. & C. E. (Administration) Dept.,
Guntur. (Andhra State).



GOVERNOR
ANDHRA

RAJ BHAVAN
KURNOOL

26th December 1955.

I am glad to learn that the annual number of "Aradhana" will be published next month. This monthly magazine, published by the Commissioner, Hindu Religious and Charitable Endowments Department, aims at propagating knowledge of the ancient holy places in India with special reference to the Andhra State, and their history, traditions, etc. It is a fact that we in India do not know enough about our own holy places, though they occupy a significant part in our cultural, religious and spiritual life. The aims of the journal are therefore most laudable, and I hope the journal will fulfil in ample measure the objects with which it has been started. I wish all success to the annual number.

C. M. Trivedi

GOVERNOR.



GOVERNOR, ORISSA

HAVAN
CUTTACK

The 23rd December, 1955.

A MESSAGE

I gladly respond to the request for a message to the Annual Number of the "ARADHANA" magazine, which is proposed to be published next month.

Our shrines have ever been honoured as dynamos of spiritual power, and there is much in their traditions of worship or service which it behoves the community to cherish. The publication of a journal like "ARADHANA", therefore, serves a real need by helping to sustain interest in those hoary traditions and I wish the magazine all success in that laudable endeavour.

(P. S. Kumaraswamy Raja)

N. SANJIVA REDDY
*Deputy Chief Minister*




*Kurnool,*
21st December 55.

Dear Sri Venkata Reddi,

I am glad to note that you are publishing the annual number of the religious magazine "Aradhana". I hope it will serve the good purpose of enlightening the people with moral principles and thus make them live a better social life in the present Democratic State where everybody should know his rights and responsibilities. I wish all the success for your endeavours.

Yours sincerely,

N. Sanjiva Reddy

Sri R. Venkata Reddy, B.A., B.L.,
Commissioner, H.R.E. Department,
GUNTUR.

# దేవవైభవము

జమ్ములమడక మాధవరామశర్మ

[ అన్నవరము శ్రీ సత్యనారాయణస్వామి కళ్యాణోత్సవ సమయ మహాసభలోని ఉపన్యాసము ]

భారతదేశీయులు తమ మాతృదేశమును మహాదేవాలయముగ భావింతురు. తమ దేహమును దేవాలయముగ సంభావింతురు. చరాచరాత్మకమయిన సర్వవిశ్వమును దేవాలయముగ భావించి భావపరిపాకమును సంపాదింతురు. భారతీయుని భావము సర్వము దేవాలయమొనర్చినది- "మాతా పృథివీ, పుత్రోఽహంతస్యాః" ఈ పృథివి నా తల్లి నే నామె పుత్రుడను. ఇట్టి దృష్టిభావపరిపాకముతో భారతీయుడెంతేని భావించెను. తద్భావఫలములయిన కొన్ని కొన్ని విశేషములను మనము కొన్ని కొన్ని సమయములందు తెలిసికొనగలము. మన దేవాలయములెట్లావిర్భవించినవో వాని విశిష్టత యెట్టిదో తద్వైభవములెట్లున్నవో గుర్తించి నేటి మానవుడు తన కర్తవ్యమును సక్రమముగ నిర్వహింపగలడు. మానవు డుపాసనమొనరించి తరించును. తనవారి తరింపజేయును. దేవావతారము తనకుపాస్యము; ఉపాసనమనునది మానవుని మానసక్రియ. మనసు పరిశుద్ధమయిన సర్వము విశుద్ధమగును. మానవుని మనోమయదేహము పవిత్రము విమలమునగుట కుపాసన మావశ్యకమయినది. మానవునకు భావదేహము లయిదు కలవు. అన్నమయ దేహము, ప్రాణమయ దేహము, మనోమయ దేహము, విజ్ఞానమయ దేహము, ఆనందమయ దేహము. అను దేహపంచక తత్త్వవిజ్ఞానము దేవాలయము నిర్మించినది. కరచరణాద్యవయవములగూడి రక్తమాంసాదిశోభితమై లావణ్యస్ఫురణమున స్పృహణీయముగ భాసించు నీదేహ మన్నమయము. ఇందు కోట్లకొలది రక్తాణువులున్నవి, మహావిశ్వమున గ్రహతారాదు లెట్లసంఖ్యాకములో! యట్లె యిందును. అందువలె నిందన్నియు సహేతుకముగ సనియమముగ సక్రమముగ ప్రవర్తించును. క్షుద్రమగు దేహమేమి? అందలి నానాణువులు నియతముగ వర్తించుటేమి? ఇవి సామాన్య మానవున కాశ్చర్యకారి. దేహమునందలి యే యణువును క్రమము మీరదు. హద్దు దాటదు. అంతటి వినయరీతి యచట గలుగుటకు ప్రాణశక్తి సంచారము కారణము. అణువణువు నావరించి ప్రాణశక్తి చోదకమై ప్రేరకమై ప్రవర్తకము ప్రవర్ధకము నగుచున్నది. అన్నమయ మిట్లు సస్పందమగుటకు ప్రాణమయ దేహము నిమిత్తము, అన్నమయమంతట నిండియున్నది. దీని నతిక్రమించియున్నది; అది బహిరంతర్వలయమున మహాగతితో సవాగతితో నున్నది. మనకు తెలిసియునున్నది. తెలియకయునున్నది. అది యున్నది. దాని యునికిసట్లు నియతము చేయునది, సీమితముచేయునది, నిత్యసంచలనముండునట్లు చేయునది మన మనస్సు. అన్నమయాణువును వాయవీయము ప్రసరింపచేయగా నా వాయవీయాణువును మనోమయము సంచరింపజేయును. ప్రతి ప్రాణాణువును మనోమయము నియమింపగలదు. మన మనోనియమనము ప్రాణనియమనము. మనోణువు ప్రాణాణువు నిండియున్నది. ఈ మనోమయ దేహము పరిశుద్ధమగుట కుపాసనము కావలయును. ఈ యుపాసన సౌకర్యమునకె దేవావతారమున్నది. మనోమయ మిట్లు సంకల్పవికల్పముల సంతతధారలో నేల చిక్కుకొన్నది? అది యొక మాలిన్యము; దాని క్షాళనమునకె యుపాసనము. మనోమయమాలిన్యము తొలగునేని జీవుడమలుడగును. విమల విజ్ఞానము సంపాదించును. ఈ తను ప్రాణమనముల నిత్యసంచార మొక విజ్ఞానము నిరంతరము కాంక్షించుచున్నది. ఆ విజ్ఞానధారాశీకరములె మనః ప్రాణశరీరముల కమృతధారలిచ్చును. నిరంతర విజ్ఞానవివేక కాంక్ష జ్ఞాతముగనో యజ్ఞాతముగనో మనకంవర కున్నది. మనోమయమునకు విజ్ఞానమయము కవచమయినది. ప్రత్యణువు విజ్ఞానాణువు సాధించుటకు అవిశ్రాంతముగా యత్నించుచున్నది. ఈ యత్నసిద్ధి విజ్ఞానమయదేహసిద్ధి. అనంత విజ్ఞానకణములన్నియు వేనికవిగానన్నియు నొకటిగానానందపథము నుద్దేశించి ధావించుచున్నవి. ఆ యానందామృతలాభమునవె వానికి చరితార్థత. ఇట్టి చరితార్థత యానందమయశుద్ధిసిద్ధి. ఈ చరితార్థతకె యుపాసన మావశ్యకము. అన్నమయమాదిమదేహము. ఆనందమయ మంతిమ దేహము. మనోమయము మధ్యమము. ఇది యుభయ సంబంధి. ఇటు భౌతికమున అటు అభౌతికమున సంచారప్రచారము లిచ్చునది మనోమయమె. మనోమయ విశిష్టతనూ ప్చుటకె దేవాలయమావిర్భవించినది.

దేవాలయముపాసనార్థమనుట బాగున్నది. దేవాలయముల కిట్టి యాకారమేల? దీని యర్థమేమి? అంతరార్థమేమి? అని సుముఖులకు విముఖులకు గలుగు సందే

హము. సందేహమునకు నొక దేహమున్నది. దీని విస్తృతముగ గుర్తించుట సముచితమయిన యుపాసనము.

భారతీయుల వైదికధర్మపతాక యాగము. యాగశాల యందిష్టకోపధానమున నగ్నికుండ మేర్పరతురు. అందు నిత్యసన్నిహితము రుద్రాగ్ని. అది చిదగ్ని. ఆ చిదగ్ని శోభితమయిన యాగశాల వహ్నికుండము సూక్ష్మభావనముతో నిభాలనము చేయుదుమేని దేవాలయ స్ఫురణమవభాసించును. లోలోతుగానుండు దాని నూర్ధ్వప్రసృతముగ భావించితిమేని దేవాలయవిధి గోచరించును. అగ్నికుండమున నిటుకలు పేర్చురీతి వాని సంఖ్యానము నిర్మాణము కూర్పు చేర్పు నేర్పు అన్నియు దేవాలయమున నున్నవి. శిఖరశోభితమయిన పర్వతము మనకు దేవాలయమును స్ఫురింపజేయగలదు. సర్వాహుతుల నందుకొని సర్వదేవుల సంతుష్టి పొందించు సర్వదేవముఖుడయిన యగ్నీష్టియాగములందు మన యర్చనల గైకొనినాడు. రూపాంతరమున ఆకారాంతరమున దేవాలయ సుప్రతిష్ఠితుడై యభ్యర్చితుడగుచున్నాడు. యాగశాలలో చిదగ్ని నారాధింతుము. దేవశాలలో చిదగ్ని నారాధింతుము. యాగశాలలోని యిష్టక రచన దేవాలయ రచనయయినది. మనకు దేవాలయము యాగాలయము.

మన దేవాలయము లందింకను భావపరీపాకములున్నవి. మహామేరుపర్వతము పరివేష్టించి పరితః గ్రహాదులున్నవని మన జ్యోతిర్విద్య చూపుచున్నది. అన్నియు మేరువు ప్రదక్షిణము చేయుచున్నవి. అన్నిటికి మేరు వుత్తరమున నున్నది. మేరువ నుత్తరస్థితి. దేవాలయములోని చిన్మయదేవుడు సర్వగ్రహతారాపరివేష్టితుడని ఆలయనిర్మాణ వైభవమె చెప్పును. చుట్టునున్న దేవప్రతిమలె మూకభాషలో చెప్పును. దేవీపూజా పవిత్రహస్తులు సామయికులు దేవ్యర్చనము చేయునపుడు శ్రీచక్రమారాధింతురు. అది భూప్రస్తారమని కైలాసప్రస్తారమని మేరుప్రస్తారమని వివిధవిధముల నున్నది. అందలి మేరుప్రస్తారవిధి దేవాలయనిర్మాణభాగ్యమిట్లగుటలో హేతువుగా గోచరించును. యాగమన్నది విశిష్టవ్యక్తిచేయు బ్రహ్మారాధనము. దేవాలయము సమష్టిరూపమున నొనరించు మహారాధనము. అదియె యిది, యిదియె యది. అది యిది నొకటి.

అదిగో! అట్లాకసమున జూడుడు! నక్షత్రవిద్యను భావింపుడు. అభిజిత్తుతోగూడిన అశ్విన్యాదినక్షత్రముల సంభావింపుడు. ఆ ఇరువది యెనిమిది నక్షత్రములకు పాదదేవతలు నాలుగు కలుపగా ముప్పది రెండాకృతులు మనసులలో దిగినవి కదా! వీని పరిధిలో క్రమక్రమోర్ధ్వసోపానములు భావింపవలెను. సతతోర్ధ్వగమనమున కీసోపానములు వలయాకారముననున్నవి. మొదటి యావరణమున ముప్పది రెండంటిమి. రెండవ యావరణమున నిరువది నాలుగు మండలములున్నవి. మూడవ యావరణమున పదియారు మండలములు గలవు. నాల్గవ యావరణమున నెనిమిది మండలములున్నవి. అయిదవ యావరణమున నొకటియె మండలము. కాగా, $32+24+16+8+1=81$ మండలముల వభాసించును. దీని నెట్లు చెప్పుదును? ఇట్లు చెప్పుదును. అటు తొమ్మిది యిటు తొమ్మిది గదులుండునట్లు గీతలు గీయుడు! అయిదావరణములు గల్గును. ఒక్కొక యావరణమున నెన్ని యుండునో నేను చెప్పినవన్నియుండును. అది యేమి? అందెన్నియున్నవో పెద్దలు చెప్పగా నేనును చెప్పుదును. అవి యన్నియు కలిసి 81 యగును. ఈ యెనుబది యొకటి సృష్టి రహస్యము. దీనిని తొమ్మిదవ యెక్కము విశదముచేసినది. దేవాలయనిర్మాణము విశదముచేయుచున్నది. దేవాలయ చెక్కడములపై ఈ మండల ప్రతిష్ఠాదేవతలున్నారు. భచక్రమంతయు కేంద్రచేతన ననుసరించి పరిభ్రమించును గదా! అది మన దేవాలయనిర్మాణవైభవమున నున్నది. భచక్రము భాలించి దేవాలయనిర్మాతలు దేవాలయము భాలించినారు. భావసిద్ధిపొందినారు. మనము దీని భావించి భచక్రము భావింతము. భావసిద్ధి పొందుదుము. ఇది మన దేవాలయనిర్మాణ వైభవము. ఇది మన తలకెక్కవలయునని తలయెత్తి చూచుటకు తగినట్లు దేవాలయనిర్మాణము జరిగినది. మనము తలయెత్తుకొని తిరుగగలిగితిమి. వీనిని ఇట్టివానిని దేవాలయనిర్మాణమున మనము భావించినచో ఎంత తిరిగినను తల తిరుగదు.

దేవాలయ విధానమొక వాస్తుమండల రహస్యము ననుసరించియున్నది. వాస్తుమండల మరువదినాలుగు ప్రవిభాగములతోనుండును. అంతకు ముందుచెప్పిన ముప్పది రెండునకు ఈ అరువదినాలుగు సంఖ్యకు సంబంధము కలదు కదా! మన భవనములకు వాస్తుపురుషుడున్నాడు. దేవాలయము గ్రామవాస్తువు పరిసరవాస్తువు ననుసరించి నిర్మితము. అందుననె యిది సామూహికవిధానము. ఇది సంఘశ్రేయము. ఇది సమాజహితము.

మనదేహము దేవాలయము. దేవాలయమున శిఖరమున్నది. దేహమున శిఖయున్నది. దేహదేవాలయమున స్వాత్మసంవేదనము పొందుదురు గావుతమని భారతీయులు దేవాలయము నిర్మించిరి. ఈ విధముగ దేవాలయము సంభావించుట యుక్తప్రక్రియ. అన్యుల విధానముల నిందతుకుకొని యేమో యేమో భావములందు గందరగోళముపడుట భారతీయుల కభ్యస్తవిద్యకాదు. అది యట్టిది విశ్వాసోత్పాదకమును కాదు. కాజాలదు. సర్వములకు జాలినది మన వైభవము.

మన దేవాలయములందు విగ్రహమున్నది. అది శిలామయము, దారుమయము, హేమమయము, ధాత్వాద్యాకార సంభవమెదేని కావచ్చును. ఏదేని యొకటి యున్నది. ఉండును. నేటికి నేపాలమున, టిబ్బతుదేశమున, చీనా భూమిలో, జపానులో దారుమయ మారాధించువారున్నారు. వారివారి విధానములకన్నిటికి మన దేవాలయవైభవము భూపము చెప్పగలదు. ఇది వారలకు వారి వారలకు తుష్టి పుష్టి నీయగలదు. మన భరతభూమిలో శివశక్తి మందిరములు ప్రాచీనములని "చరిత్ర తెలిసినది" యను వారనుదురు. మిశ్రదేశమున, ఫినీషియాలో, బ్రిటనులో విశ్వమంతట గల సర్వప్రాచీన దేవభూములు భారతీయుల దేవబలమును జాటియు చాటకయు జెప్పినవి. చెప్పుచున్నవి. ఇంకను జెప్పగావుత! భారతదేశమున సర్వత్ర దెవమందిరములున్నవి. నానాయున్నవి. ఏల యున్నవో? ఇన్నియున్నవె! భారతదేశము భక్తినివాసము. భారతదేశము వైరాగ్య బాసురము. భారతదెశ మాత్మసంయమనని దేశము. దేవమందిరము లిన్నిఎన్నోయుండుట కిది కారణము. శ్రేయఃప్రెయముల కలియగలిపి దేవుని సేవించుట భారతీయుని పవిత్రసంకల్పము. అభారతులు కేవలము ప్రేయము కాంకింతురు. వారి కిహమె స్వర్గము. భారతీయుని దేవమందిర మిహపరసంధాన విద్యాలయము. అందుననె భారతీయులెల్లరు దేవమందిరముల కడకేగి ప్రాకారాది విగ్రహాంత విశేషములనన్నిటి సమీకింతురు. ఇచటి శిల్పవిశేషముల సుందరతను వర్ణించుట విరి సంప్రదాయముకాదు. ఈ శిల్పము లెట్లు సుశ్లిష్టములయినవో భావింతురు. ఎట్లు సంగతములయినవో భావింతురు. ఏల వాని నట్లుకూర్చిరో సంభావింతురు. వాని యర్థమూహింతురు. అర్థమూహింతురా? అర్థములు కల్పింతురా? అశ్లీలమూర్తులు దేవళములందున్నవే! చూడరాని బొమ్మలున్నవే! జూడజాలని దృశ్యములున్నవే! కొన్ని బొమ్మలు చూడవలసివచ్చునని కన్నులు మూసికొందురే! వాని నెవరేని చెప్పగా వారిచేతనే చెవులు మూయించుకొందురే! ఇవియేమి? దేవళమునం దుండుటేమి? ఇది యంతయు పాలకప్రభువుల దుర్విలాసితా చిహ్నము. వారి యుబలాటము తీరని చేష్టలు కదా! ప్రాకారములందన్నిబొమ్మలా? గోపురములందట్లు వరుసలు తీరి వస్త్రములు విడిచిరే! అట్లె రథములెక్కరే! గోడలందట్లె యతుకుకొనిపోయిరె!!! ఇట్లనేక విధముల నవీనుల భావరేఖలు సాగుచున్నవి. దేవాలయములందు దేవశాస్త్రముల గుర్తించుటపోయి కామశాస్త్రముల గుర్తింపవలసివచ్చినదేమి? యనుచున్నారు. ఈ యభిప్రాయములతోడనే వారా బొమ్మలు నిర్మించిరని మన మూహపట్టి నిశ్చయించుట తగునా? దేవాలయనిర్మాణమున వారికి శాస్త్రములున్నవి. గోడలెట్లు కట్టవలయునో, గోపురము లెట్లు కూర్పవలయునో, శిల్పములెట్లు చెక్కవలయునో వారలకు నియతియున్నది. భౌతికము లౌత్పాతికములగు దోషము లెప్పుడేని కలుగునని యవి కలుగకుండుటకై యట్టి బొమ్మలు చెక్కుట యాచారము. వజ్రపాతాదులవలన అనర్థములు కలుగకుండునట్లు అట్టి భయములు రాకుండునట్లు రక్షార్థమట్టి శిల్పములుంచుట చిరకాలమునుండివచ్చు పూర్వాచారము. నేటికి నట్టి యాచారపరిపాలనమున్నది. దృష్టిదోషములు తగులకుండునట్లు గడ్డిబొమ్మలను చెట్లపాదులలో నుంచుచున్నారు. ఈ దేవాలయములందలి ఈ బొమ్మలను జూడ నోపనివారు ఆ గడ్డిబొమ్మలను జూడగలరని యెవరు భావింతురు? కాని వారాబొమ్మలను కన్నువిప్పి జూతురు. సులోచనము లుంచుకొనియు జూతురు. ఏల చూతురు? అవి స్వయంనిర్మితములు. అథవా నిర్మాపితములు. వాని మూలభావము వారికి పరిచితము. అందువలన వారలకు వానిలో నేవగింపులేదు. అవి రక్షణాత్మకమయిన కార్యమును నిర్వహించినవని వారి నమ్మకము. ఒక్కొక పాడి గేదె కుండెడు పాలు పితుకును. వ్రక్క నెవరేని జూతురు. అది మడమ విరుగ దన్నును. అది దృష్టిదోషమని భావించి మడుమ నొప్పిగానున్నను దిష్టితాడు వేయించును. సావడిలో గడ్డిబొమ్మ అట్టిది పెట్టించును. అప్పుడు విశ్వాసము కుదిరి దోగ్ధ రెండుకడవలు పిండును. నవనవలాడు తమలపాకుతోట యున్నది. అందరందు ప్రవేశింపరాదు. అట్టి యామె పూలుపెట్టుకొననిది వచ్చెనా తోట నిలువున మాడును. ఇక ఆ తోట రెక్కొన జాలుటకు వికృతరూపము కల బొమ్మలుపెట్టుట తప్పని సరి. ఈ యవశ్యకార్య మాచరించిన యాతోటమాలి తపోధనుడాకు పంచించి తీరును. తోటమాలీ! తపోధనా! ఇందుకేనా? ఈ చేతలన్నీ? అను వారెవరు? ఇట్టి వందరకు తెలియును. అందరు చేయుదురు. దేవళమువారు చేసిరి. ఉత్పలఖండమను గ్రంథమిట్లనినది.

వజ్రపాతాది భీత్యాది
వారణార్థం యథోదితం
శిల్పశాస్త్రేపి మణ్యాది
విన్యాసం పౌరుషాకృతిం.

పిడుగుపాటు మొదలగువాని భయములు కలుగకుండ నివారించుటకై శిల్పశాస్త్రమునగూడ మణికల్పనములు పురుషాకృతు లేర్పఱుపవలయునట. అట్లు వానినేర్పఱచిరి. అట్లేర్పఱుపవలెనని యగ్నిపురాణమును చెప్పినది.

అథశ్శాఖాచతుర్థాంశే
ప్రతీహారౌ నివేశయేత్

మిథునైః పత్రవల్లీభిః
శాఖాశేషం విభూషయేత్—

శాఖలచతుర్థాంశములందు ప్రతీహారుల నేర్పఱుపుడు. మిథునచిత్రముల నిర్మింపుడు. పత్రవల్లికలు కూర్పుడు. శాఖాశేషమట్లు భూషితముచేయుడని శాస్త్రనియమము. ఈ నియమానుసారము మిథునచిత్రము లేర్పరచిరి. అట్టి శిల్పముల చెక్కిరి. చెదురుచున్నవు ముద్దులతో చిక్కని రంగులతో కొందరు వేసిన బొమ్మల తడివి యన్నిటిపై సల్ల రాళ్లు వేయవలెను. కొంత ప్రాచీనముగ చెక్కినవాని జూడుడు! అందు శాస్త్రబంధమున్నది. కదిరిలో కరవదిలో పుస్తాపులో రథముల జూచి వాని విశేషముల భావించి సంగతి గుర్తించు మేధావులున్నారు. కామశాస్త్రరీతుల కన్పట్టవచ్చును. అవి యట్లె యుండును. గడ్డిబొమ్మల రీతి వెగటుగ నుండవు. కామయోగము కూడియుండును. విద్యాధరభోగముల కలిసియుండును. గంధర్వవిలాసముల కలిసియుండును. యక్షిణీ విహారముల కూడియుండును. భోగములందు యోగదృష్టి కలవారి రీతి విలాసములుగ కన్పడును. భోగశిల్పమువెంట యోగశిల్పము, దానివెంట యోగిశిల్పము, అచట రాగ శిల్పము, అచట విరాగిశిల్పము బాఱులు బాఱులుగ కూర్పు పొందును. వానినట్లె భావింపుడు.

మానవు డుపాసించి తరించుటకు దేవాలయ వైభవము నమర్థము. ఆతనికి భక్తి గలుగజేయుటకు దేవాలయ మనుకూలము. దేవాలయ మధ్యాత్మచింతాసక్తినుత్పాదించును. తన్మూలముననె సామాజికమయిన శ్రేయస్సు లాభించును. అందరకభిగమ్యుడు దేవుడు. ఎవరికే యభిరుచి యున్నను ఆ యభిరుచి వక్రమయినను అవక్రమయినను, వారేయే మార్గముల సంచరించువారయినను మానవులకందరకు భగవానుడొకడె శరణ్యుడు. జలములకన్నిటికి సాగరుడె గతి, పెద్ద లిట్లనిరి.

." రుచీనాంవైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథజుషాం
నృణామే కోగమ్య స్త్వమసిపయ సామర్ణవ ఇవ "

అందరొక దేవతనె యారాధింపరు. కాని యందరారాధించునది యొక దేవతయే. తలకొక్క యభిరుచి యుండును. అది వారి సత్త్వాదిగుణములబట్టి యుండును. తదనుసారము వారు దేవతనారాధింతురు. దేవతనో, ఉపదేవతనో యారాధింతురు. పరమాత్మ విభూతి సాత్త్వికముగ రాజసముగ తామసముగ నుండును. ఆయా విభూతుల నట్లట్లారాధింతురు. వారి వారి యారాధనము వారివారికి తగును. గీతాచార్యుడేమనినాడు ? అనినాడుకదా!

" యాంతిదేవ వ్రతా దేవాణ్ పితౄన్యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యాః యాంతి మద్యాజినోపి మాం"

కొందరు దేవుల వ్రతములందర్చింతురు. వారలకు దేవప్రాప్తి కలదు. కొందరు పితృవ్రతులగుదురు. వారు పితరుల బొందుదురు. భూతములనె కొందరు యాగశాలలందర్చింతురు. వారు భూతప్రియులగుదురు. కొందరు విశిష్టులు నన్నె యారాధింతురు. వారునన్నె పొందుదురు. కాన ఎవరెవ రేయే దేవళమున నెట్లెట్లారాధించినను నిషేధింప నవసరములేదు. అట్లె యొనర్పవలయునని నిర్బంధింప నవసరమును లేదు.

భూతములు ప్రేతములు తద్యోనులయిన దేవప్రకృతులు భగవానుని నికృష్టవిభూతులు; లోకమున ప్రేతోపాసకులున్నారని మనకందరకు తెలియదుకాని కొందరకు తెలియును. శవము నారాధించి శివమెత్తినవారున్నారు. తాము శివులై శవమును శివరూపము చేయువారున్నారు. వేని నేమియు ననక తంత్రగ్రంథములను జూడుడు. మృతపిత బ్రతికియున్నప్పటికన్న సమధిక శక్తికలవాడు. అతని పూజించిన శక్తినిచ్చును. ఆ శక్తిని సంపాదించి కొందరు సమాజముద్ధరింతుమనువారు కలరుకదా! వృక్షము ప్రేతస్థానమని కొందరు నిర్దేశించిరి. దుష్టుల యాత్మలు చేదుచెట్ల నెక్కును. మంచివారి యాత్మలు తీయని పండ్లలో దూరును. వృక్షములు ప్రేతములకు వాసములని యాలోచన గలవారలకందరకు గోచరించును. ధర్మరాజాదులు వృక్షమున ప్రేతమున్నదని చెప్పి కంకభట్టాదు లయినారు. జమ్మి ప్రేతస్థానము. వెలగ అట్టిది. అశ్వత్థమునందది యున్నది, ఇంకనున్నది: వటమున నెన్నియో నున్నవి. ఒక్కొక చెట్టున కొక్కొకటి చిరప్రసిద్ధమై యున్నది. ఈ యున్నది అను జ్ఞానమున్నవా రాయా వృక్షముల నారాధింతురు. స్తుతింతురు. బలియిత్తురు. పూజింతురు. భావింతురు. ఎంతయో చేయుదురు. ఈ పూజావ్రతము లింతటితో నాగుటలేదు. ఒక స్త్రీయందు ప్రేతమావాహనము చేయుదురు. ఒక పురుషునందావాహనము చేయుదురు. వారు ప్రేతావిష్టులై ఎంతయో చెప్పుదురు. ఎన్నియో చెప్పుదురు. ప్రేతావిష్టులయిన నారీనరులు సామాన్యులయిన నారీనరులకన్న శక్తి కలవారు. వారొనరించు ప్రార్థనలు వెంటనె ఫలించును. కొందరు కొందరు ప్రార్థనా శక్తులు అసక్తులు అట్టి నారీనరులచే దేవీదేవుల నర్చింపజేసి యిష్టముల బడయుచున్నారు.

కొందరు కొన్ని విశిష్టవిధులవలంబింతురు. "స్పిరిట్"ను ఆహ్వానింతురు. తద్విధుల యాచరణమున తృప్తివహింతురు. ప్రేతపూజ లాచరింతురు. తన్నిరీక్షణమునకై ధ్యానమవలంబింతురు. నీలవస్త్రము వారలకాచ్ఛాదనము కావలయును. అందయస్కాంత శక్తు లధికముగా నున్నవట. విద్యుద్ధారలందు ప్రసరించునట. " స్పిరిట్ " వారియం

దావేశించును. వారలకు పరలోక ప్రజ్ఞ కలుగును. పరలోకాత్మ నాహ్వానింతురు. పరలోకాత్మ యా నీలపటావృతుల కడకు వచ్చి యా నీలవస్త్రము తొలగించును. నీలవస్త్రము దవళవస్త్రముగ జేయును. ఆ సాధకుడు జ్యోతిర్మయుడగును. అది యాతని సంపత్తి. అది వైభవము.

చీనా జపాను మొదలగు దేశములలో దేవదాసీగణముచే పితృపూజ చేయింతురు. వారియందు శక్తులు రాగా వీరు వారుజేరి యా శక్తులు సంపాదింతురు. పితరులందు నైమిత్తిక పితరులున్నారు. నిత్యపితరులున్నారు. ఇట్లె నిత్యఋషులు, నిత్యదేవతలు నైమిత్తిక ఋషులు నైమిత్తిక దేవతలు సమాహూతులై పూజలు గైకొందురు. పూజకుల ననుగ్రహింతురు. వ్యక్తులశక్తులు వికసించుటకు సంఘశక్తులు దివ్యశక్తులు నుపయోగించును. అయా సాధకవ్యక్తులు నానావిధముల తమ శక్తులను స్ఫురింపజేసికొనుటకు యత్నింతురు గదా! ఈ చెప్పినవానిలోనివి శక్త్యుల్లాసమునకు సమర్థములని యెంచిరి.

దేవతలు దేవత లనుచున్నాము కదా! దేవత లెవరు? వారు రూపమున నున్నారా? కేవలము మంత్రరూపులా? సంకేతస్వరూపులా? ఇట్టి శంకాశతము కల్పించుకొని యాస్కుడు నిరుక్తమున నిట్లు నిర్వచనముచేసినాడు.

" అథాకారచింతనం దేవతానాం. పురుషవిధాః
స్యురిత్యేకం, అపురుషవిధాః స్యురిత్యపరం
అపివా ఉభయవిధాః స్యుః "

దేవతలయాకార మాలోచింతము. పురుషాకారమున నుందురని కొందరు. వనితాకారమున నుందురని కొందరందురు; ఉభయవిధముగనుందురని మేమందుమనినాడు. దేవతలు చక్కని విద్యావైదుష్యముకలవారని శతపథమనుచున్నది. దేవతలు విబుధులు కదా! వీరిలో నిత్యనైమిత్తికభేదము లెట్టివో మన మెఱుగక తప్పదాయె. గ్రామదేవతలు, గృహదేవతలు, వనదేవతలు నైమిత్తికదేవతలని భావింతము. వనస్థలుల స్థాపించి వనస్పతుల ప్రతిష్ఠించి వనదేవతల నర్చించుచున్నాము. తులసి, మారేడు మొదలగునవి యిట్టివి. వీనియందు వనదేవతలు ప్రాసాదము కట్టుదురు. గృహదేవార్చన మెందరికో సంప్రదాయాచారముగనున్నది. అందు గృహదేవతలారాధనముల గైకొనుచు మనల ననుగ్రహించుచునె యున్నారు. గ్రామదేవతల మన మెఱుగుదుము. గ్రామమునందున్న పతివ్రతలందరు గ్రామదేవతలు. మనయిళ్లకు ముత్తయిదువులువచ్చి పూజలు గైకొందురు. సువాసిని యర్చనాపీఠమున కుంకుమపూజలు స్వీకరింతురు. వీరు గ్రామదేవతలు. గ్రామదేవతల విశిష్ట ప్రభావములె చిన్నచిన్నగుళ్లు గోపురములు కట్టించినవి. నదీపర్వతములకు అశ్వత్థాది మహావృక్షములకు బయటికి కన్పడు రూపముకాక లోరూపమొకటి చేతనాత్మకమున్నదని శాస్త్రజ్ఞులంగీకరించిరి. వానియందలి దేవతలు మనల జూచుచునెయున్నారు. మనము చూడకున్నామన్నమాట యేల?

నిత్యపితృగణమునకు నివాసస్థానము పిత్రులోకము. వారి భౌతికజగద్రక్షణకార్యభారము వహింతురు. జగత్ప్రక్రియానుకూలమయిన వరమాణునియోజనము వారి క్రియ. జగత్తులోని క్రియాసంచాలనమువారి ప్రక్రియ. మానవుల స్థూలశరీరములందు వారు చక్కగా స్వాస్థ్యము రక్షింతురు. వారు మనపూజల గైకొందురు. ఋషి దేవతాపితరులందు దేవతలు భగవానుని కార్యములందొకప్పుడు ప్రతినిధులగుదురు. కార్యపకులగుదురు. ఋషులధ్యాత్మశక్తి ప్రధానులు. దేవత లధిదైవశక్తి ప్రధానులు. పితృదేవత లధిభూతశక్తి ప్రధానులు. పితృగణమఖిలజగము వ్యాపించియున్నది. వారు మన యర్చనాదులచే సంతుష్టులై మనకు హితమాధానింతురు.

ఏకత్రింశత్పితృగణా యైర్వ్యాప్తమఖిలం జగత్
తే మేఽనుతృప్తాః తుష్యంతు యచ్ఛంతుచ సదా హితం

అని పిత్రర్చనములంచందరసనె యందురు. ఋషులు జ్ఞానమయసృష్టి సంరక్షింతురు. నిత్యపితరులవలె, నిత్యదేవతలవలె, నిత్యఋషులు బ్రహ్మాండపదమున స్థిరపదము పొందియున్నారు. జ్ఞానమయసృష్టి సంరక్షణము ఋషుల కార్యము. అనేక రూపములవారు విజ్ఞానము రక్షింతురు. అనేకవిధముల నవతరింతురు. మహర్షులై, దేవర్షులై, బ్రహ్మర్షులై, శ్రుతర్షులై, రాజర్షులై. కాండర్షులై విజ్ఞానవిశ్వచాలనము చేయుదురు. పితరు లవతరింపరు. అవతరింపకనె తమశక్తుల సంక్రమింపజేయుదురు. అవి వారల యిచ్ఛ. అట్టి యిచ్ఛ పొడమెనేని మాతృగర్భమున శంకరాదులవలె జన్మింతురు. విశ్వచాలనమంతయు దైవీవిభూతి. దేవత లవతరింతురు. మంత్రచేతనమున నావిర్భవింతురు. మన యుపాసనముల గుర్తింతురు. మనము పాసింపగలుగుదుము.

ఉపాసించువారల కంపరకు విగ్రహారాధన మావశ్యకమా? యను సంశయమె మన కక్కఱగానిది. విగ్రహారాధనమన్నది విగ్రహముయొక్క యారాధనమని మన మనము. విగ్రహమందారాధనమనియె మనమనవలయును. ఇది శ్రేయోనిదానము. మనకెన్నియో ప్రతిమలున్నవి.

శైలీ, దారుమయీ, లౌహీ, లేప్యా, లేఖ్యాచ సైకతీ।
మనోమయీ, మణిమయీ, ప్రతిమాష్ట విధాస్మృతా॥ వారి వారి యభీష్టముబట్టి ప్రతిమా స్వీకారమున్నది. దేవాలయ ప్రతిమ సర్వాభీష్ట ప్రతీకము. మనమారాధించు ప్రతిమా తత్వమిది.

గవాం సర్వాంగజం క్షీరం స్రవేత్ స్తనముఖాద్యథా
తథా సర్వాగ్రతో దేవః ప్రతిమాదిషు రాజతే॥

గోవుల సర్వాంగసంగతమయిన క్షీరము స్తనములనుండియే స్రవించునట్లు దేవచైతన్యము ప్రతిమలందు ప్రతిభాసించును. మనము ప్రతిమయం దాత్మచైతన్యమునే దేవభావమున నారాధింతుము. కాని యొకటి యున్నది. ప్రతిమయెట్లున్ననేమి? మన భావనమె కదా ముఖ్యము. అన్న నిర్లిప్తవృష్టి యంత సముచితముకాదు. చూడుడు;

అభిరూప్యాచ్చ బింబస్య పూజాయాశ్చ విశేషతః
సాధకస్యచ విశ్వాసాత్ దేవతాసన్నిధిర్భవేత్॥

ప్రతిమాత్మకమయిన దేవబింబమభిరూపముగా నుండవలెను. లావణ్యస్ఫురణముతో నుండవలెను. ఉండవలసిన దేవతాస్ఫూర్తి కొరవడకుండవలెను. విశిష్టములగు పూజలచ్చట చక్కగ సాగవలెను. సాధకునకందు గట్టి విశ్వాస మావశ్యకము. ఇట్లున్ననే దేవతా సాన్నిధ్యము భాసించును. శిల్పి ప్రతిమానిర్మాణమున కావలసిన కొలతలు కొలుచుకున్నంతన చాలదు. తగినంత ధ్యానమాతనికి గావలయును. ధ్యానించి ధ్యానించి సుందర రూపము నాతడు నిష్పాదింపవలెను. ఇది బింబమందలి యాభిరూప్యము, ఇది యింతటితో సంపూర్ణము కాలేదు. మంత్ర చైతన్యానుభూతి కల వ్యక్తి ప్రాణప్రతిష్ఠ యొనర్పవలయును. సావధానపూజ లొనర్పవలయును. అప్పుడే ప్రతిమయందు దివ్యశక్తులా విర్భవించును.

"దేవాయతనాని కంపంతే, దైవతప్రతిమా హసంతి, రుదంతి, నృత్యంతి, స్ఫుటంతి, స్విద్యంతి, ఉన్మీలంతి, నిమీలంతి"- సామవేదము.

ఈ వైదికసూక్తి దేవాయతనముల నిత్యచేతనతను నిరూపించుచున్నది. సాధకుల ఫలవిశేషములను దేవ ప్రతిమలు చెప్పును. దేవప్రతిమలందు తమ భవిష్యత్తును జూచుకొను సాధకుల చరితము లనేకములున్నవి. అవి యన్నియు కల్పనములని భావించు దౌర్బల్యము మనకేల?

"ఏహి! అశ్మానమాతిష్ఠ!
అశ్మా భవతు తే తనుః"

దేవా! రమ్ము! ఈ రాతి నావేశింపుము. ఇది నీకు శరీరమగుగావుత; అని అథర్వవేదము చెప్పినది. మూర్తి తత్త్వమిట్టిదని గుర్తింపనపుడు మూర్తి పూజావిషయమై యెన్నియేని పలుకుదురు. మన ధ్యానానుకూలమయిన మూర్తి దేవతలందు మనకు గోచరించును. భాగవత మిట్లనినది.

త్వం భావయోగ పరిభావితహృత్సరోజః
ఆస్సేశ్రుతేక్షితపథో మనునాథ! పుంసాం
యద్యద్ధియా త ఉరుగాయ! విభావయంతి
తత్తద్వపుః ప్రణయసే సదనుగ్రహాయ.

ఓ మంత్రమహేశ్వరా! సకల సంస్తూయమాన వైభవా! సాధకుల భావయోగమున హృదయమునందు గోచరింతువు. నిన్ను సాధకులెట్లు భావింతురో యట్లు శరీరము ధరించి సాక్షాత్కరింతువు. కావున మూర్తి భావానుసారి. భావానుసారి యయినంత మాత్రమునఁది మన కల్పనా సారము కాదు. అది నిత్యము, స్థిత స్వరూపము. అనంత రూపములందు మంత్ర గుప్తములై విలీనములై యున్నవి. వానినే సాధకులు సంభావించి గుర్తింతురు. పరాసు దేశమున నొక కన్య సంగీతరసిక పతధర్మభక్త వీణానాదమున మేళవించి గానముచేసినదట. ఆ గానమునకు రూపము కట్టినది. చూడగా చూడగా నామెకచట పటలోని ధ్యేయ దేవుడు గోచరించినాడు. ఇక నాపల్లె తుష్టయై సంతుష్టయె భారతీయు నొకని పిలిపించి "ఏమయా! భారతీయా! మీకు చిరంతన మయిన వెదమున్నదట. అది గానయోగ్యమట! పాడుమయ్యా! పాడుము! నేసందలి రూపము గుర్తించుకొనవలసియున్నది" అని యామె కోరినది. ఆ భారతీయుడు తాను వైదిక వంశమున జన్మించిన వాడయ్యు వేదవాక్యము రామి సిగ్గుపడి క్షమవేడి తన కప్పటికి స్ఫురించిన చిననాటి వల్లె వేతలో మఱచగా మిగిలిన కాలభైరవస్తుతిలోని యొక శ్లోకార్ధమును పఠించినాడట. అమె యంతియె చాలునను కొని యా యర్ధశ్లోకము కొలిచినది. అంతటి కొలుపూరక పోదు. వెంటనే కాలభైరవ (శునక) రూపము కొంత గోచరించినదట. ఇట్లు ధ్యానశ్లోకములందు ధ్యేయరూపము సుగుప్తమయినది. రూపతత్త్వ మిట్లున్నది. ఇంక నెంతయో గూఢముగ నున్నది.

దేవవైభవము సమాజహితమాపాదించును. సంఘమున కుపయోగించును. మానవసమూహాత్మకమయిన సంఘమునకు నియామకమయిన దేవమందిరము నెవరు దూరము చేయరు. దేవనీతి ననుసరించియె మానవసమాజ నీతి యుండును. ఉండవలయును. కాకున్న నీతి యనీతి యగును. రీతి యరీతియగును. దేవాలయమునందు మానవసమాజజీవనోపయోగిత నన్వేషించి పొందుట యుక్తకార్యము. మానవుని యాకాంక్ష రెండువిధములనుండును. ఒకటి యాపన్నివారణకాంక్ష. మరియొకటి సంపత్సంపాదనకాంక్ష. ఒకటి యైహికమయిన సకలభోగరాగము. మఱియొకటి యాముష్మికమయిన రాగము. అవియే ప్రేయస్సు శ్రేయస్సును. ఈ యుభయము దేవాలయమున సిద్ధించును. రుద్రాధ్యాయము ననుసరించి మనము శివాభిషేకమొనరింతుముకదా! రుద్రాధ్యాయము లోని నమకచమకముల పరిశీలింపుడు. నమకము నమోవాకములుతో నిండియున్నది. చమకమభీష్ట పదార్థములు గూడియున్నది. నమకమునందలి మహాదేవస్తుతికిని చమక

మండలి పలములకును పరస్పరసంబంధమున్నది. సమాజాభ్యుదయమునకు తగిన హితసంపత్తి చమకమందుండుట స్పష్టము. ఏ మంత్రమున కెట్టి సంబంధమున్నదో? దాని ప్రయోగమెట్టిదో? వినియోగమెట్టిదో? అదియంతయు సంప్రదాయవిద్య. స్పష్టము చేయవలయునని యందరడుగపలదు. ఇట్టి మంత్రావిర్భావమాన్యతలు ప్రకాశ్యములు కావు గోప్యములు కావని యభినవగుప్తపాదులనిరి. మంత్రచేతను లట్లెయందురు. అట్టివానిని అనావిలచిత్తముతో నవ్యాకుల హృదయముతో నంతేవాసి నియమముతో స్వీకరించుట సముచితము. నమక చమక ప్రరూఢములు రుద్రాభిషేక విధానములందరికి కావు. కాని తత్ఫలము లందరికి పలయునవి. సూతసంహితలో రుద్రాధ్యాయము శ్లోకరూపమున నున్నది. మహాభారతమున ద్రోణపర్వములో శ్లోకాత్మకముగనున్నది. శ్రీరుద్రబాష్యములో స్తుతిరూపమున రుద్రసూక్తమున్నది. ఈ శ్లోకములు మంత్రసంహితలు. వానినందరు పఠింపుడని సంప్రదాయగురువులచే ననిపించుకొనుడు. తత్ప్రయోజనమసులభముకాదు.

దేవవైభవకాములు దేవకైంకర్యము లొనరించి యభీష్టచిత్తసంతోషము పొందుచున్నారు. కొందరాత్మ కైంకర్యమనుసరింతురు. ధ్యా న స మా ధి మ గ్ను లై దేవవిభూతి ననుభవింతురు. మరికొందరు పూజాకైంకర్య పరాయణులు పంచపూజచేయుదురు. షోడశోపచారపూజ కావింతురు. చతుష్షష్ట్యుపచార పూజ నిర్వహింతురు. అహోరాత్రపూజలు చేయుదురు. పూజార్థము పవిత్రాశయ శోభితము. పంచాయతన మహాదేవపూజ నిర్వహింతుముకదా? అందు దేవి శివుడు విష్ణువు సూర్యుడు గణపతి యున్నారు. వీరు పంచభూతాత్మకులమయిన మన తత్త్వములకు సంబంధించి యున్నారు. గంధ పుష్ప ధూపదీప నైవేద్యములన్న పంచపూజ సంప్రదాయమందున్నది. ఇది పంచభూతాత్మకము.

"ఆకాశస్యాధిపో విష్ణుః
అగ్నేశ్చైవమహేశ్వరీ।
వాయోః సూర్యః క్షితేరీశో
జీవనస్య గణాధిపః॥"

అని కాపిల తంత్రము పలికినది. మనయందున్న పంచభూతములను ప్రతీకాత్మకముగ భావించి పంచభూత ప్రభువుల కర్పించు చున్నాము. మన పంచభూతముల ప్రవిలాపమొనర్చుచున్నాము. పంచభూత స్వభావములకు సరియయిన వినియోగము సంభావించుచున్నాము. ఇట్టి భావశుద్ధితో నిర్వహించు పంచపూజ సర్వాభీష్టము. ప్రతిమా ప్రతిష్ఠాపన మహాసమయమున మహాసాధకు లెందరో శక్తి సంచాలనముచేసినారు. కళావాహన మొనర్చినారు. మంత్రచైతన్య ముంచినారు. వానిని గర్భాలయమున భద్రముగా రక్షించుట గ్రామనగర దేశరాష్ట్ర సౌభాగ్యము. చేతన దివ్యశక్తుల ప్రకటించుటకై సాధకముఖ్యు లనుష్ఠానములొనర్చి, పురశ్చరణములుచేసి, యభిషేకాదులాచరించి, యర్చనలు కావింతురు. యజ్ఞపవిత్ర ద్రవ్యముల కూర్తురు. కొందరు బలియిత్తురే? అదియేమి? అను ప్రశ్నలు కొందరకు వినపడును. తదర్థమిట్లు వ్యాఖ్యాతము. బ్రహ్మవిదుడు బ్రహ్మయగును. శివుడై శివుని భజింపవలెను. అరుద్రుడు రుద్రు నర్చింపరాదు "అహందేవీ" అన్న యభేద ప్రత్యయము సంపాదింపవలెను. పూజారంభమున "దాసోఽహం" అనుకొను సాధకునకు "దా" నశింపవలెను. అప్పుడాతడు "సోఽహం" భావకుడగును. బలిదానమున "దా" నశించునని పూర్వవిదులనినారు. బలిదానమనునది యాత్మబలిదానము. అది పశ్రుపుబలిదానము. అదియె బాహ్యముగా ఇంద్రియప్రియవస్తు బలిదానమయినది. ఇంద్రియలోలురు జిహ్వాచపలులాత్మ నిగ్రహము సంపాదించుకొనుట కిది మార్గము; బలియనునది యిది త్యాగము, అన్నిట త్యాగబుద్ధి గలుగజేయు పూజా కైంకర్యము లోకమున విస్తృతమై యున్నది. మరియొకటి బోధన కైంకర్యము. దేవ వైభవము చెప్ప విశేషములెన్నో యున్నవి. వాని నా పామరముబోధింపవలెను. బోధించు గ్రంథములున్నవి. గ్రంథార్థముల గుర్తించిన పండితులున్నారు. వారు గ్రంథగ్రంథులను విప్పి బోధింతురు. బోధించుట వారొనరించు కైంకర్యము. లోకమజ్ఞాన హతము కాకూడదు. క్షణ క్షణము జ్ఞానము సంపాదించుటకు బోధనకైంకర్యమపేక్షితము. ఆయా దేవాలయములకు సంబంధించిన పురాణములను తంత్రములను ఇతిహాసములను సంప్రదాయములను విశేషములను బోధనకింకరుడు ప్రబోధింపవలెను. అపార్థము రాకుండునట్లు విశ్వాస ముదయించునట్లు సాధకులకు సంతుష్టి గలుగునట్లు నానార్థములు తొలగునట్లు ప్ర బో ధిం ప వ ల యు ను. వేదపారాయణములందుకొఱకె నిర్ణీతములు. వేదశ్రుతి శ్రుతిగోచరము కాగా అజ్ఞాతములు సుజ్ఞాతములగును. శ్రుతిలోని స్వరసంధానము సందట్ట ప్రభావమున్నది. ఆ సుస్వరపరిపూత వాయుమండలము విశ్వమునె పవిత్రముచేయును. సమయములందు విషమ పరిస్థితులురాగా, విప్లవములురాగా, చిక్కు సమస్యలు కలుగగా దేవాలయమంటపమున పద్మాసన సుస్థితుడయిన పండితుడు పరిశోధించి తత్త్వము ప్రబోధించును. విప్లవానంతర సమయములందు లోకమును సీమానియతముచేసి శాంత్యభ్యుదయములను నెలకొల్పుటకు బోధన కైంకర్యము కావలెను. మరియొకటి కళాకైంకర్యము. కళలన్నియు దేవముఖముగ విరాజిల్లును. చిరంజీవములగును. మతధర్మ సంబద్ధములగు కళలె యాదర్శజీవన

మిచ్చును. కళాకంపుకము కళానాథతత్త్వముద్బోదించును.
శిల్ప చిత్ర లాస్య నాట్య గేయ పార్య కవితాకళలు భగవ
దారాధన పరములు. వీని విస్తరణమె లోక సమాజమున
నానావృత్తులనిచ్చి యా జీవమిచ్చినది. ఉదయాది సాయం
పర్యంతము, తదాద్యుదయ పర్యంతము కళాహృదయులు
దేవుని సేవింతురు. ఇది కళాకైంకర్యము. ఇట్టి విధాన
మున కళలు కలుషితములు కావు. విజ్ఞాన వివేకములు
ప్రసాదించును. విలాసవినోదముల దూరీకరించును. కళా
సమారాధితుడయిన పరమేశ్వరుడు లోకమున కైశ్వర్యము
ప్రసాధించును. ప్రసాదించును. వేరొకటి పోషణ కైంక
ర్యము, విద్యాశాల వైద్యశాల శస్త్రశాల శాస్త్రశాల గోశాల గజ
శాల కలాశాల సర్వశాలలు దేవాలయాధీనములు. ఉపవిద్య
లందలి కృషివిద్య దేవమాన్యములందు సఫలమగును.
నానాధాన్యములు దేవక్షేత్రములందు పండును. ఇట్టి
యసంతపోషణము దేవళమున జరుగును. ఇట్టి వానిని
ధనికులగువారు దేవప్రమాణ విశ్వాసములతో నవశ్యము
పోషింపవలయునని దేవశాసనము. ఇట్టి కైంకర్యము
లెన్నియో దేవవైభవద్యోతకములు. సర్వజనులకు సర్వవిధ
ముల సర్వవృత్తులనిచ్చి సర్వవిదుల సహకారములతో దేవా
లయమె సమాజము రక్షించును. సర్వద్రవ్యము దేవాధీన
మయినపుడె యిట్టి సమాజహితము. దేవాలయ వైభవ
మంతయు సంఘనముపకారమునకని సహస్రశీర్షుల మై
పలుకవచ్చును. సర్వవిధానములు దేవాలయాధీనములై
శోభించును. ఇవి యిట్లే యుండవలయునని ప్రాచీన శిలా
శాసనములు చెప్పుచున్నవి. దేవద్రవ్యమునకు వినియోగ
విధానమును పాలకుల శాసన దానపత్రములు వ్యాఖ్యా
నించుచునే యున్నవి.

దేవపూజా సామగ్రి వనదేవతా ప్రభావితము. ఓషధీ
సారము. మూలికా మహత్తరము, రసాయన సంవిధాన
జీవము. గణనాయకుని పూజాసామగ్రి భావింపుడు; ఆయా
వస్తుసామగ్రి గుణములను చరకాదులు నిరూపించిన విధాన
మాలోచింపుడు. వాని పరస్పర సమ్మేళనమున క్రమసమ్మే
ళనమున కలుగు రాసాయనిక విశేషముల గుర్తింపుడు.
మూలికల గుర్తించిన వైద్యవిద్యాంసుల రమ్మనుడు,
చెప్పుమనుడు. వారుమాత్రము చాలరు. ధర్మవిధుల గుర్తిం
చిన ధర్మవిదులు సంస్కార మహత్వముల గుర్తించిన
వారు నిందు చెప్పవలసిన దెంతయో యున్నది. కాల
విదులు, ముహూర్తవిదులు, మంత్రవిదులు, దేవతత్త్వ
విదులు, పదార్థతత్త్వవిదులు, ఒకరొకరి సహాయమున
తత్త్వము తెలిసికొని లోకమునకు జెప్పవలయును. అందరు
కలసి యేకతత్త్వము నేకవిధముగ జెప్పగలిగినప్పుడు గణ
నాయకుడు గణరాజ్య సౌరాజ్యము రక్షించును. ఈ యపే
క్షితముపేక్షితము కారాదు. తత్త్వపరిశోధన మావశ్యకమని
దేవప్రసాద స్వీకారము దేవతీర్థసేవనము మనకు ద్బోధించు
గావుత. దేవాలయములకు సంబంధించిన వైద్యవిద్య
నారాధించినవారు మూలికా పరీక్ష చేయుదురు. తత్త్వము
చెప్పుదురు. వారవిరుద్ధముగ జెపుదురు గావుత. పూజా
ద్రవ్యములవలన ప్రజ్ఞామేధాదిలాభమున్నది. సత్సంతాన
లాభమున్నది. ఉత్తమ సంతానము కావలెనని పురుష
సంతానము కావలెనని పండిత దుహిత కావలెనని కాంక్ష
పడువారెట్టి పాటులుపడ నక్కరలేకుండగనే సాపాటులోని
మూలికా సేవనమున అభీష్టము లభించునని బృహదారణ్య
కోపనిషత్తు సూచించుచునే యున్నది. దేవవిదులు ప్రబో
ధించుచునే యున్నవి. ఇదియు సమాజహితమయిన దేవ
వైభవముకదా ?

దేవసమక్షమున నిలిచి యర్ధమీలితయై దేవదాసి యదుగో
నాట్యమొనరించుచున్నది. ప్రాగన్నులవారు పరిశీలింపుడు.
దేవళమునందు భావకుడయిన శిల్పి, దేవునకొక యాకృతినె
కూర్చినాడు. కాని యందనేక రూపములున్నవి. నానా
రూపములకు సమన్వయ సంధాయకమయిన సమరస
రూపవైభవమునె శిల్పి చూచిచూపినాడు. దేవపూజ లొన
రించు నాతడు లయాంగ కల్పనమున దేవునకు మంత్రా
త్మకమయిన సంపూర్ణరూప మాపాదించినాడు. దేవదాసి
తన విశాలనేత్రములతో, జ్ఞానాంజనశలాకపూత వట్టించు
కొనిన నేత్రములతో దేవుని చూచు విధమున చూచినది.
చూచినదె తడవుగా లోజూపు కలుగ నామె భగవద్రూప
వైభవము కాంచినది. తనయుందాపాదించుకొనినది.
మూకభాషలతో చేష్టాభాషలతో భాషలుకాని భాషలతో దేవ
రూపమునకు భాష్యము నామె యాభాషించినది. అటు
జూడ నిటుజూడ దేవవైభవమె భాసించును. శ్రీ విష్ణువు
నకు నాలుగు హస్తములందు నాలుగాయుధములున్నవి.
ఆ యాయుధ మీ హస్తమున నీయాయుధమునా హస్తమున
నున్నట్లు భావింపరూపభేద మేర్పడు చున్నదేమి ? ఇట్లా
భేదము నిరువది నాలుగయినవి. అవియె కేశవాది నామ
భేదములకు నిదానములయినవి. ఈ రూపభేదముల సన్ని
టిని దేవదాసి రూపించి నిరూపించినది. దేవదాసి దేవదా
సిగా ధన్యజీవ. విష్ణువునందు శివునందు దేవియందు
ఆయుధభేదమున నామభేదము కలుగుట సంప్రదాయ
విద్యాగుప్తము. ఆ గుప్త విద్యను దేవదాసి యారాధించి
నిరూపించుచున్నది. మనల ననుగ్రహించు భగవద్రూప
ములనె మనము సహస్రనామములందు మంత్ర చైతన్య
ప్రభావమున గుర్తించి కూర్చికొనినాము. శిల్ప చిత్రములు
వీనినె వ్యాఖ్యానించి చెప్పను. రోగముల బోగొట్టి భగవ
ద్రాగముకూర్చు సంగీత రాగములీ వ్యాఖ్యానమునకె టీకలు,

కారికలు. దేహము దేవాలయముగా సంభావించు ప్రజ్ఞ కలిగిననాడు దేహమునందున్న షట్చక్రములు దేవాలయా వరణములు ఎట్లెట్లు పరస్పర సంబంధము కలిగియున్నవో గోచరించును. మన మనసు మననగుటకు మనము మన సార యత్నింపవలయుననియె దేవవైభవ వ్యాఖ్య. మనసు లందనేక రీతులున్నవి. ఒకొకని మనస్సు వజ్రము. ఏమి చేసినను మారదు. మరియొకని మనసు ఇనుపముక్క. కాకవచ్చునట్లు కాచి, సమ్మెటమీద సాచి నాలుగుదెబ్బలు వేసితిమా! ఏయాకారమయిన కలుగును. వేరొక మనసు నల్లరాతిబండ; అయిననేమి? సుత్తి శాణముపట్టి పేడు రేపితిమా! దేవీ రూపము వచ్చును. కాకున్న రుబ్బుడు పత్రమేని యగును. మరియొక మనసు కొయ్య. ఉలిబడి తలకు లొంగి జిగ్గడిరూపము ధరించును. మరియొకటి లక్కపుడక; అగ్గిదగ్గర కరిగికరిగి మెత్తనై సుతిమెత్తనై మనమేమి యెత్తిన వాని నన్నిటి హత్తుకొనును. మరియొక మనసున్నది. మననన్న మననది మనసు. నవనీత ప్రాయ మయిన మనసు. ఈ మనసందరికి వలయునని దేవభావ కుల మనసు. ఈ విశ్వప్రపంచమున ప్రాచీనము, ఈనాటికి సజీవము దేవవైభవము. నవీనుల జీవనము తదనుసార మున నగునేని వసుధైకధర్మ ప్రచారము కలుగును. మూర్తి ద్వేషులకు ద్వేషము నశించుట మానవ సంసారాభ్యుదయ మార్గము. మానసరాజ్యము వికసించుటకు దేవాలయము కావలయునని ప్రపంచమేకవాక్కుగా పలుకుచున్నది. దమనము లేక వంచనము లేక దేవాలయ వివేకము ప్రసా రము చేయించుట చేయుట లావశ్యకములు. ఈనాటికే యెన్నియో దేవసంప్రదాయ విశేషములు నష్టప్రాయముల యినవి. పునర్నష్టములు కాకుండునట్లు మనము సమీ క్షించుట యుక్తక్రియ. సశాస్త్రయమయిన యర్చకుల యారాధనమునకు తగిన పరీక్షలు లోకమునకు సమధి కోత్సాహమీయగలవు. ఆయా యాగమములందలి సంప్ర దాయముల నుద్బోధించి ప్రజావివేకము కలుగజేయుట ఆరాధనారాధన. శ్రీ సత్యదేవుడు తన స్వరూప వివేక మందించి సర్వలోకములచే సేవలు చేయించుకొనగలడు. ఆత్మకుండలి నుద్బోధించుకొని దేవాలయకుండలి నీ తత్త్వ మున సంవాదముపలక్షించుకొని విశ్వాసమందలి నిస్వా భావ్యమున ఆత్మధన్యతను సంపాదించుట సాధకుని కర్తవ్యము. అట్టి సాధనపథమునందెట్టి ప్రమాదపాటు రాకుండుటకు తగిన ప్రబోధము లిప్పింప శ్రీ సత్యదేవ సంకల్పము. ఆ సంకల్పము నిర్వహింప దేవపరిచారకులం దరు యత్నింతురు.

॥ ఓమ్ తత్సత్ ॥

---

సహస్ర శీర్షాపురుషః ।
సహస్రాక్షః సహస్రపాత్ ।
సభూమిం విశ్వతో వృత్వా ।
అత్యతిష్ఠ ద్దశాంగులమ్ ॥
పురుష ఏవేదగ్ం సర్వం।
యద్భూతం యచ్చ భవ్యం॥
ఉతామృతత్వ స్యేశానః ।
యదన్నే నాతిరోహతి ॥
ఏతావానస్య మహిమా ।
అతోజ్యాయాగ్ంశ్చ పూరుషః ।
పాదోఽస్య విశ్వాభూతాని ।
త్రిపాదస్యామృతందివి ॥

# విగ్రహములందలి కొన్ని విశేషములు

ఆగమాచార్య, అకులమన్నాడు, పార్థసారథి భట్టాచార్యులు

ఈ విచిత్ర విశాల ప్రపంచమునకు సృష్టికర్త ఒక్కడుండవలయునని మానవుడు తెలిసికొనిన నాటి నుండియు ఆ సృష్టికర్తయొక్క గొప్పతనమును ధారకముగను పోషకముగను భోగ్యముగను సంతతముగ స్మరించుచు అతని నారాధించుట యామానవునకు సహజాతమై యుండినది. అట్లే ప్రపంచమందలి వివిధ చిత్తవృత్తులు గల మానవులందరును తమయొక్కగాని తమకు ప్రియులగు తోటి మానవులయొక్కగాని ఇతర జంతువులయొక్కగాని పదార్థములయొక్కగాని మతములయొక్కగాని ప్రతిరూపమును తమ జ్ఞాపకమునకై నిర్మించికొని యాప్రతిరూపమును చూచి యానందించుట మన యనుభవము సందున్నది. ఇట్టి ప్రతిమానిర్మాణ కౌశలము సృష్టియందలి ఇతర ప్రాణిజాతములం దెచ్చటను లేనిది మానవుని యందు మాత్రమే విలక్షణముగ నున్నది. ఖండాంతరములందీ ప్రతిమలు నిర్వహించెడి పాత్రము పలువిధములుగ నుండినను భారతభూమియందీవిధాన మత్యంతము విలక్షణముగనున్నది. భారతదేశ నాగరికత వేదములు అగమములు ఇతిహాసములు పురాణములాదిగాగల వాఙ్మయమందు చిత్రితమైయున్నది. పై గ్రంథరాశి యందు ఈ బ్రహ్మాండమున మానవులతోబాటుగ సంచరించెడి చేతనములు ఊర్ధ్వాధో లోకములలో దేవయోనులు అసురయోనులు పలువురు కలరని చెప్పబడుచున్నది. వీరలందరును మానవులవంటి పాంచభౌతిక శరీరములను గాక విలక్షణమగు శరీరములను ధరించి సంచరించుట కలదు. ఒకప్పుడు వీరలకు మానవులతో సంఘర్షణము సంబంధముకూడా కలిగినట్లు చెప్పబడినది. ఈ కాలమందట్టివి కలిగినట్లు మన యనుభవమునందున్నట్లు కనుబడుటలేదు.

సృష్టికర్తకు సృష్టికార్య నిర్వహణమునందును రక్షణ కార్యమునందును సంహారకార్యమునందును సహాయపడుటకు పైచెప్పబడిన దేవతలలో చాలామంది నియుక్తులై వారలు మానవుల దైనందిన కార్యములలో నిత్యసంబంధము కలిగియుందురు. ఇట్టివారలలో సూర్యుడు, చంద్రుడాదిగాగల గ్రహములను ఇంద్రుడు అగ్ని మొదలుగాగల దిక్పతులను ప్రధానముగ చెప్పవచ్చును.

'సృష్టిస్థిత్యంతకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్
స సంజ్ఞాం యాతి భగవానేక ఏవ జనార్దనః'

అనునట్లు సృష్టిస్థితిసంహారములను చేయునపుడు ఒక్కొక్క కార్యమును చేయునపుడు ఆయాకార్య నిర్వాహోచితముగ బ్రహ్మ విష్ణు శివుడను పేరులతో శ్రీ మహావిష్ణు ఒక్కడే ఈ కార్యములను నిర్వహించునని యనవచ్చును; లేదా దేవతాంతరపారమ్యవాదులు వారల వారల ఇష్ట దైవతములనా స్థానమందుంచుకొనవచ్చును. ఇట్టి గొప్ప శక్తులను పూజించి వారలవలన ఇష్టార్థములను బడయవచ్చుననుట మన ప్రాచీనుల సిద్ధాంతము. అట్టి వారలను పూజించుటకు ఆయాదేవతలకు ఆయా రూపములను మహర్షులు జ్ఞానదృష్టిచే సాక్షాత్కరించికొని వారల యనుభవమును తరువాతివారి యనుష్ఠానమునకై గ్రంథస్థముచేసిరి. ఆయా స్వరూపములతో విగ్రహములను నిర్మించుట ఆ విగ్రహములను భద్రపరచుటకు ఉచితములగు మందిరములను నిర్మించుట అందా విగ్రహములను మంత్రయుక్తముగ ప్రతిష్ఠించి అందు దేవతాసాన్నిధ్యమును కల్పించుట నాటిని నిత్యము పూజించుట మొదలగు కార్యకలాపమంతయు శాస్త్రరూపమున మహర్షులు రచియించిరి.

అయితే ఈదేవతా పూజనుగురించి ఆయా గ్రంథములందు విభిన్నమగు ప్రకారములు చెప్పబడుతున్నవి. భగవదారాధనము అమూర్తము సమూర్తమునని రెండు విధములుగ నుండునని కొందరి మతము. అమూర్తమనగా భగవానుని ధ్యానించి అగ్నియందు మంత్రయుక్తముగ నాజ్యాది ద్రవ్యములచే హోమమమాచరించుట. సమూర్తము విగ్రహమందు అర్ఘ్యాద్యుపచారములచే పూజించుట యగును. 'మానసీ, హోమపూజా, బేరపూజా' అని మానసికముగ భగవానుని దివ్యమంగళ విగ్రహమును సంకల్పించికొని మానసికములగు నుపచారములచే నాతని నారాధించుటను పై యమూర్త సమూర్త యజనములతోచేర్చి పైయారాధనమును మూడువిధములుగా కొందరు వివరించిరి. దీని నింకను వివరించుచు 'అర్చాయాం స్థండిలేఽగ్నౌవా సూర్యేవాప్సు హృది ద్విజే, ద్రవ్యేణ భక్తియుక్తోఽర్చేత్స్వ గురుం మామమాయయా' (శ్రీ భాగవతే ౧౧-౨౭) అని విగ్రహములందును స్థండిలమందును అగ్నియందును సూర్యమండలమందును హృదయమునందును ఉదకములందును నన్నారాధించ దగునని శ్రీ భాగవతమందు చెప్పబడినది. పై చెప్పబడిన అన్ని ప్రకారములును విరుద్ధ

ములు కావు. గ్రంథాన్తరములందు ఇందుకనుకూలముగ చెప్పబడియెడి ప్రకారాంతరములును వైదికులకు పాదేయ ములు కాగలవు.

ఇక విగ్రహములను ప్రస్తావించుచు 'శైలీ దారుమయీ లౌహీ, లేప్యా లేఖ్యా చ స్తైకతీ, మనోమయీ మణిమయీ ప్రతిమాష్టవిధా స్మృతా'॥ యని శిల, దారువు, లోహము, చిత్రము, రేఖ, మృత్తు, మనోమయము, మణిమయముగా యెనిమిది విధములుగ నుండునని శ్రీ భాగవతమందు చెప్పబడినది. ఈ వివరములే ఆగమములందు మరింత విస్తరించి చెప్పబడుచున్నవి.

పూజా సౌకర్యము నుద్దేశించియు శాస్త్రీయములగు మరి కొన్ని నియమముల ననుసరించియు పూజార్థములుగ కల్పింపబడిన విగ్రహములలో పరస్పర వైలక్షణ్యము కల్పింపబడినది. వైఖానసాలయములందు చెప్పబడిన విగ్రహములలో ధ్రువులు, కౌతుకులు, స్నాపనము, ఔత్సవము, బలి, యను పేరులతో ఐదు విధములుగ విగ్రహ ములు కలవు. ఆలయమునందు గర్భాలయమునందు ధ్రువ కౌతుక విగ్రహములుంపవలెను. తక్కిన విగ్రహ ములుకూడా గర్భగృహమందుండుటయు కలదు. ధ్రువ విగ్రహము ననుసరించిప్రాయికముగ కౌతుకాది విగ్రహము లుండును. భేదముగల చోటులుకూడ విస్తరించికలవు. ఆ వివరమును అవసరమగు చోట నిరూపింతును.

ధ్రువబేరము (విగ్రహము) తామ్రము, శిల, దారువు ఈ మూడు ద్రవ్యములతో చేయదగును. దారువుకంటె శిల, శిలకంటె తామ్రము ఉత్తమము. ఈ బేరము చిత్రము చిత్రార్ధము చిత్రాభాసము నని మూడు విధములగును. అందుత్తమము చిత్రము మధ్యమమర్ధచిత్రము, అధ మము చిత్రాభాసము. మానము, ప్రమాణము, ఉన్మానము, పరిణామము, ఉపమానము, లంబమానమునని యారు విధములగు మానముతో నొప్పెడి స్వరూపమును చిత్ర మనియు సగభాగము మాత్రము తెలియవచ్చునది అర్ధ చిత్రమనియు కేవల రేఖామయముగ దెలియవచ్చునది అభాసమనియు లక్షణము చెప్పబడుచున్నది. అందు లోహనిర్మితముగాని మృణ్మయముగాని చేయునపుడు చిత్ర మును మాత్రమే చేయవచ్చును. అర్ధచిత్రమును లోహ ముతోను మృత్తుతోను చేయరాదు. శిలతోను దారువుతోను అర్ధచిత్రమునుగాని చిత్రమునుగాని చేయవచ్చును. అభాసమును వివరించి చెప్పవలసినచో పటము, భిత్తి మొదలగు వానిపై రంగులతో చిత్రించిన బింబమని యన వచ్చును. చిత్రబేరమందర్చించుట ఐహికాముష్మిక ఫల ప్రదము. అర్ధచిత్రార్చనము కేవలాముష్మికప్రదము. అభాసమందర్చనము కేవలమైహికఫలప్రదమునగును.

అభాసము మరల చలమనియు అచలమనియు రెండు విధ ములగును. పటమునందు లిఖించిన రూపమును చల మనియు భిత్తియందు చిత్రించినవానిని అచలమనియు చెప్పుదురు. చలాచలములం దచలముత్తమమైనది.

ప్రాయికముగ మన ఆంధ్రావనియందు ప్రతిష్ఠింపబడిన ధ్రువ విగ్రహములన్నియు చిత్రభేదమందు చేర్చబడి యుండును. అర్ధచిత్రములను పరిశీలించ దగియున్నవి. అభాసములు కానరావు. దారు విగ్రహముల నిర్మాణము మిక్కిలి శ్రమసాధ్యముగ గనుబడుచున్నది. ఈ విగ్రహ మును చేయుటకు శూలస్థాపనము, అష్టబంధము, రజ్జు సంస్కారము మృత్సంస్కారము, ఘటీశర్కరా సంస్కా రము, పటాచ్ఛాదనము, వర్ణలేపనము నను విధముగ ఏడు సంస్కారములు బహు విస్తరించిన క్రియావిశేషములు కలవి చెప్పబడుచున్నవి. పుణ్యవృక్షముల సారము (చేవ) నుంచి తీయబడిన కొన్ని సంస్కృతములగు శూలములు ఉద్దిష్ట విగ్రహముయొక్క అయా యెముకల స్థానమందు యేర్పరచబడును. ఇది మొదటిదగు శూలసంస్కారము. అవల శ్రీవేష్టకము మొదలగు యెనిమిది ఓషధిద్రవ్యము లను చూర్ణించి దానిని తైలమందును గోఘృతమందును లెక్కప్రకారము వుంచి కాచి ఆ కాచిన అష్టబంధమును ద్రవ్యమును చేయబోవు విగ్రహమునకు మేదఃస్థానీయ ముగ భావించి దారు శూలములపై పూయవలయును. అవలి కొబ్బరి నారతో పేనబడిన సన్నని దారములను సిరా స్థానీయములుగ బింబమునంతను చుట్టి రాగితీగతో ఆ చుట్టిన దారమును గట్టిగా బిగించి తిరిగి దానిపై సన్నని నూలుదారమును చుట్టవలయును. అవల శుద్ధమగు సస్య క్షేత్రమందుండిగాని అశోష్యమగు జలాశయమందుండిగాని పరిశుద్ధమగు మృత్తును తెచ్చి యెండించి వస్త్రపూతముచేసి పాకమునకు తగిన శుద్ధ వాలుకలనందు కలిపి మద్దిచెక్క మొదలగు కషాయ వృక్షముల కషాయమును క్రొత్త కుండలో పోసి ఒక నెలదినములామృత్తికను కషాయ తోయమందు ఇతర సుగంధ ద్రవ్యములతో కలిపి అధి వాసము చేయవలెను. అవల మరి కొన్ని ఓషధి ద్రవ్య ముల త్వక్కులతో చేయబడిన కషాయముతోను త్రిఫల కషాయముతోను మరియొక అర్ధమాసమామృత్తునధివాసి తము కావింపవలెను. అవల యవసారము గోధుమపిండి, పెరుగు, తేనె, ఘృతము, అవిశనూనె, మారేడిపండ్ల గుజ్జు మొదలగు ద్రవ్యములందు నానపెట్టవలెను. అవల పసుపు త్రికటుకములు వెలగబంక కొన్ని పూలరసములు మొద లగువానిని కలిపి మూడు రాత్రులు ఉంచవలయు. ఈ పదార్థమును మాంసస్థానీయముగ తలచి పై రజ్జు బంధ ముపై సమర్పింపవలయును. దీనిని చేతితోకాక తదర్హా

మగు పనిముట్లుతో చేయవలెను. ఈ మృదము చెడకుండ విగ్రహము సర్వాంగస్ఫూర్తి చెందువరకు మధ్య మధ్యను రజ్జువును కట్టుచుండవలెను. ఆఖరు మృత్తుపై రజ్జువును కట్టరాదు. ఆయా స్థానములందు నవరత్నములనుంచి యెండించి యావెనుక శర్కరా సంస్కారము చేయునది. అవల యేదేని పుణ్యక్షేత్రమందుండి త్రవ్వి గులకరాళ్ళను తెచ్చి మెత్తగా చూర్ణముచేసి త్రిఫల కషాయములో భావన చేసి యెండించి కపిత్థనిర్యాసతోయమున దడిపి ప్రత్తితో నూరి మెత్తని యాద్రవ్యముతో విగ్రహమును తీర్చవలెను. అవల తెల్లని సన్న నూలు వస్త్రమును దెచ్చి శర్కరాకుల ముపై కప్పవలయును. మృత్తును శర్కరను పటమును క్రమముగ మాంసము రక్తము చర్మము అని భావించునది. తరువాత ఆయా ఓషది ద్రవ్యములచే చేయబడిన వర్ణముల (రంగుల)చే బింబము నలంకరించునది. వర్ణ సంస్కారముతో విగ్రహము పూర్తియగుచున్నది. ఇచ్చట శూలస్థానమగు దారువును శిలాశూలముగ చేయుటయు కలదు.

విగ్రహములన్నియు సాధారణముగ మూడు విధములుగ నుండునని యున్నది. ఆ విధములను స్థానకము, ఆసనము శయనమునని యందురు. స్థానకమనగా నిలచునియుండు విగ్రహములు; ఆసనములు లేక ఆసీనములనగా కూర్చునియుండునవి; శయనము లేక శయానములనగా పండుకొనియుండునవి. యానకము లేక వాహనములందధిష్ఠించువానిని స్థానకములుగ పరిగ్రహించుట కలదు. తరుచుగ వేంకటేశ్వరుని బింబములు నిలచునియు లక్ష్మీనారాయణ సీతారామ బింబములు కూర్చునియు రంగనాయకుని బింబములు శయనించియు ఉండుట మనకనుభవమందున్నది. స్థానకాసనశయనములను నీ మూడు విధముల బింబములు మరల యోగము, భోగము, వీరము, విరహమునని ప్రత్యేకముగ నాలుగేసి భేదములు కలిగియున్నవి. కాగా ఆ బేదములవలన విగ్రహములు యోగస్థానకము, భోగస్థానకము, వీరస్థానకము, విరహస్థానకము యోగాసనము, భోగాసనము, వీరాసనము, విరహాసనము, యోగశయనము, భోగశయనము, వీరశయనము విరహశయనమునని పండ్రెండు విధములగుచున్నవి. ఈ పండ్రెండు విధములును మరల ఒక్కొక్కటి ఉత్తమమధ్యమాధమ భేదములచే ముప్పదియారు తెరగులగును. మొదటి నాల్గు విభాగములలో చెప్పిన విరహవిభేదమునే అభిచారికమనియు చెప్పుట కలదు. ఈ విభేదమునకు ప్రయోజనమిట్లు చెప్పబడినది. భగవత్తత్త్వజ్ఞానమును కోరినవారలు యోగమార్గమునను, ఐహికభోగములను కాంక్షించెడివారలు భోగమార్గమునను, వీర్యకాంక్షులగువారలు వీరమార్గమునను, అభిచారాది కృత్యములచే శత్రువులను జయించగోరువారలు విరహమార్గమునను ప్రతిష్ఠార్చనాదులజేయుట విహితమైయున్నది. అట్లే సకలమగు నభ్యుదయముల నపేక్షించువారలు స్థానకమూర్తిని, సుప్రతిష్ఠమగు నర్థకామములను వాంఛించెడివారలు ఆసీనమూర్తిని, అపునరావృత్తికమగు మోక్షమును కోరెడివారలు శయానమూర్తిని ఆరాదించుటయు శాస్త్రసిద్ధమైయున్నది.

స్థానకాది బేదములచే ఈ బింబములు ప్రతిష్ఠింపదగిన గర్భగృహములపై నిర్మించదగిన విమానముల నామరూపములు భేదించుచున్నవి. మొత్తముపై శాస్త్రములందు తొంబైఆరు విధములగు విమానముల స్వరూపలక్షణము చెప్పబడియుండుట నీయెడ జ్ఞాపకముంచుకొన దగినది.

మొట్టమొదటి స్థూలవిభాగమందు ఆయా విగ్రహములకు చెప్పబడిన హస్తసంఖ్యయందును ఆయా హస్తములలో ధరించెడి ఆయుధస్వరూపమునందును హస్తముల విన్యాసమందును కల వైవిధ్యముచే పరస్పరము భేదము యేర్పడుచున్నది. అట్లే కొన్ని సందర్భములందు ప్రధాన పురుషవిగ్రహములకు ఉభయపార్శ్వములందో,ఒక పార్శ్వమందో ఉండెడి దేవీవిగ్రహముల సాన్నిధ్యము అసాన్నిధ్యములు భేదకాకారములు అయియుండును. అందుత్తమమధ్యమాధమముగ చెప్పబడిన యవాంతర విభాగమందు ఉత్తమ కల్పమందు చెప్పబడిన పరివారదేవతలలో కొందరిని విడచిపుచ్చుటచే క్రమముగ మధ్యమాధమబేదములేర్పడుచున్నవి. విరహము లేక అబిచారిక ప్రకారమునందు మాత్రము ఆ బింబము లక్షణహీనముగ చేయబడవలయుననుట విశేషము.

శాస్త్రమునందు చెప్పబడినట్లు పైప్రకారముగ ఆంధ్రదేశమున నేయే చోటులందు ఏయే కక్ష్యకుచెందిన విగ్రహములు కలవని పరిశీలించుట పరిశోధకులకు కొంత వినోదమును చేకూర్చవచ్చును. శాస్త్రమునకు లక్ష్యము నమకూర్చబడినదగును.

కడపటిది ద్రవ్యము తామ్రము. నిర్మించదలచిన బింబమును ముందుగా తేనె మైనము తెచ్చి కరిగించి వడియగట్టి శుద్ధమగు నామధూచ్ఛిష్టముతో విగ్రహమును చేయవలెను. ఆ విగ్రహముపై మృదువగు మృత్తికతో మూసకట్టి ఆతపమున యెండబెట్టవలెను. యెండిన మూసను కొలిమియందు కాని రంధ్రద్వారముగ లోని మైనమును కరగించి బైటకుదీయవలెను. తరువాత మూసలో తామ్రమును కరగిపోసి యావల మూసను పగులగొట్టినంతట లోని తామ్రము విగ్రహరూపముగ గనుపడును. మోటుగ నున్నట్టి యా విగ్రహమును ఉలి పోగరు మొదలగు సన్నని పనిముట్లతో

చెక్కి విగ్రహమును సంస్కరించవలెను. అవల పీఠమును చేసి విగ్రహమునకు సంధానముచేయవలెను.

విగ్రహముల అవయవముల కొలతలు మొదలగు వివరములు విస్తరించి అగమశాస్త్రములందును శిల్పశాస్త్రములందును సూక్ష్మేక్షికతో వ్యాఖ్యానింపబడియున్నవి. ఆయా కర్మల నారంభించుటకు జ్యోతిశ్శాస్త్రము ననుసరించి ముహూర్తములు నిర్ణయింపబడియున్నవి. ఈ రహస్యములను శ్రద్ధతో పరిశీలించదగియున్నది.

ఒక్కొక్క దశయందును ఒక్కొక్క కార్యముకూడ మంత్రపురస్కృతముగ హోమము దేవతావాహనము మొదలగు ననేక సంస్కారములను చేసి చేయవలసియున్నది. ఈ కార్యములందు కర్మకారులగు శిల్పుల హస్తలాఘవము సిద్ధహస్తత శిల్పశాస్త్రజ్ఞాన సంపత్తి యెంతటి అవసరమో అంతకు నూరురెట్లు అధికముగ శాస్త్రజ్ఞులగు అచార్యుల మంత్రశక్తి తపశ్శక్తి అవసరమైయుండును. ఇందెంతమాత్రము అప్రత్యయము చెందరాదు.

'స్థాపకస్య తపోయోగాత్పూజాయాశ్చాతిశాయనాత్
అభిరూప్యాచ్చ బింబస్య దేవః సాన్నిధ్యమృచ్ఛతి'

అనునది శాస్త్రనిర్ణయము.

---

# విగ్రహారాధనము విష్వచార్వైశిష్ట్యము

*పండిత, వేదాంతం విప్రనారాయణాచార్యులు*

కృష్ణాజిల్లా రెలిజియస్ ఇన్‌స్ట్రక్టర్, నిజాంపెట, బందరు.

శ్లో॥ చిదచిత్పరతత్వానాం తత్వయాథార్థ్యవేదినే
వైఖానసాయ మునయే। నమో మమ గరీయసే॥

దేహధారులైన జీవులకు సంతతసుఖాభిలాషయేకాని దుఃఖకాంక్షలేదనుట సర్వజనవిదితము; సుఖమనగా అశుభవిధ్వంసకమైనదనికాని- ఇంద్రియవ్యాపారము నాప్యాయనముగా కొనసాగించునదనిగాని అర్థము. ఈసుఖము ఐహికమనియు అముష్మికమనియు రెండువిధములు; ఇందాముష్మికము స్వర్గాదికమనియు మోక్షమనియు మరల రెండువిధములు. ఈ లోకమందు భౌతికదేహముతో దారపుత్రారామగృహక్షేత్రానుభవసుఖము ఐహికము; భౌతికదేహావసానమందు స్వకృతపుణ్యవిశేషముచే భువరాదిలోకములందనుభవించు సుఖము స్వర్గాదికము; జన్మకూపమందు జలకుండికవలె ముహుర్ముహుర్మజ్జనోన్మజ్జనక్రమముతో పరిభ్రమించుచున్న జీవి భగవత్కరుణా కటాక్షవీక్షితుడై తత్పాదారవిందాశ్రయణము చేసి జననమరణరూపమైన సంసరణమునుండి విముక్తి జెందుట మోక్షసుఖము. ఇందేసుఖమైనను ఉపాయసాధ్యముగాని, ఇచ్ఛామాత్ర ప్రభవముకాదు; ధర్మార్థకామ మోక్షములు నాల్గును. సుఖసాధకములే. (సూ) చోదనాలక్షణార్థోధర్మః, అనుటచే వేదవిధివాక్యములచే తెలియదగినది ధర్మము;॥ శ్రు॥ దేవానామాయతనే యజతే, (తైత్తిరీయము) ఆయతనే=సోపపీఠాధిష్ఠాన పాదవర్గకపోతబంధాదియుతే, పూజామందిరే దేవానాం=విష్ణ్వాదీనాం, విష్ణ్వాదిదేవానిత్యర్థః, ద్వితీయార్థేషష్ఠీ, యజతే= పూజయతి, అనేనసగుణోపాసనం, దివ్యచిన్మయకల్యాణాద్భుతగాత్రస్య పరమాత్మనః నిత్యనివాసాయ, పూజామందిరశ్చపరికల్పనీయః, ఇతిచ ద్యోత్యతే. ఈదేవతారాధనము అమూర్తమనియు, సమూర్తమనియు, రెండువిధములు;

శ్లో॥ అమూర్తమగ్నౌహోమంస్యాత్సమూర్తం బేరపూజనం। ఇతి, తానుపూజించదలచిన దేవతనుద్దేశించి అగ్నిహోత్రమందు, హవిరపూపాదులతో వ్రేల్చుట, అమూర్తపూజనము, తాపూజించదలచిన దేవతారూపమును, దారుశిలాలోహాదులతో నిర్మించి, పూజించుట సమూర్తపూజనము, ఇందమూర్తయజనమున కన్న బేరపూజనమే శ్రేష్ఠమైనదని శ్రు॥ నాయమాత్మా బలహీనేనలభ్యో, నచప్రమాదాత్తపసోవాప్యలింగాత్, ఏతైరుపాయైర్యతతే యస్తువిద్వాంస్తస్యైషఆత్మా విశతేబ్రహ్మధామ; అనుశ్రుతి వలనను, శ్లో॥ వాతోర్మిచంచలచిత్త మదాలంబనమస్థిరం। సాకారోపాసనే నైతత్ స్థిరంభవతి నిశ్చలం॥ అనుస్మృతివలనను గూడ ధృవపడుచున్నది. ఈదేవతారూపములు, వివిధములుగానున్నవి. వివిధ దేవతారూపములను పూజించువారును, ఉండియున్నారు, ఇట్లుండుటకు కారణమేమి? ఏ దేవతనారాధించువారికేఫలముకలుగుచున్నది? అను విషయములు విమర్శనీయములు. వివిధ దేవతారూపము లుండుటకు కారణము విశ్వవ్యాపన శీలుడైన సర్వేశ్వరుడు తాజేయ దలచిన సృష్టిస్థితి లయముల నిర్వహించుటకు త్రిమూర్త్యాత్మకుడుగాను సృష్టిగతజీవుల వివిధ కామనా విశేషముల నీడేర్చుటకు ఇంద్రాది దేవతారూపములతోను,

ఉన్నటుల స్మృతీతిహాస పురాణముల వలన తెలియు
చున్నది. అది సమంజసమే. రాష్ట్రపాలకు డొక్కడై
యుండియు పాలితప్రజల వివిధ సౌకర్యముల కొరకు
తరతమ భేదములతో గూడిన యధికారుల నియమించి
కార్య నిర్వహణము జేయుచుండ జగత్పాలకుడైన సర్వే
శ్వరుడు శ్లో॥ యద్యద్విభూతి మత్సత్వం శ్రీ మదూర్జిత
మేవవా। తత్తదేవావగచ్ఛత్వం మమతేజోంశ సంభవం ॥ అని
గీతలో చెప్పినట్లు వివిధ దేవతారూపములతో నుండి దేహ
ధారుల కామనా విశేషముల నీడేర్చు చుండుట ఆశ్చర్యా
వహము గాదు. ఇక ఏ దేవతారూప మారాధించిన వారి
కే ఫలము కలుగు చున్నదను విషయము కలదు. వివిధ
దేవతారూపములును పూజనీయములే కాని॥ శ్లో॥ కామై
స్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః । యో యో
యాంయాం తనుం భక్త శ్శ్రద్ధ యార్చితు మిచ్ఛతి॥ తస్యత
స్యాఽచలాంశ్రద్ధాం తామేవ విదధామ్యహం। దేవాన్దేవ
యజోయాంతి మద్భక్తా యాంతి మామపి॥ ఆబ్రహ్మ భవనా
ల్లోకాః పునరావర్తినోఽర్జున। మాముపేత్యతు కౌంతేయ పున
ర్జన్మనవిద్యతే॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం
నమస్కురు। మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోసి
మే॥ "ప్రకృతిబద్ధులైన జీవులు మాయావేశితులై కామితార్థ
ముల సాధించుటకు ఆయాదేవతా రూపముల నారాధించు
చుందురు. ఎవడే రూపముతో నున్న దేవత నారాదించుట
కుద్యమించునో వాని కాదేవతారాధన మందలి శ్రద్ధా భక్తు
లతిశయింప జేయువాడను నేనే. ఇతర దేవతారాధకులు
ఆయాదేవతాఽనుగ్రహమును బడసి పరిమిత సుఖములను
భవించు చుందురు. నన్ను పూజించువారు అపరిమితై
హిక సుఖము లనుభవించి సంసరణము నుండి విముక్తి
నొందుదురు. సత్యలోక పర్యంతముగల లోకము లన్నియు
జనన మరణాదుల కాలవాలములే; నాలోకమన్ననో పునరా
వృత్తి రహితమైన శాశ్వత సుఖము నిచ్చును. పునరావృత్తి
రహితమైన నాలోకము జేరవలెనన్నను అపరిమితైహిక
సుఖము లనుభవింప వలెనన్నను నన్నే పూజించ వలెను.
నాకు నమస్కరింప వలెను." ఇత్యాది గీతావాక్యములు
శ్రీ మన్నారాయణో పాసనము అపరిమితైహికాముష్మిక
సుఖదమని తెలుపు చున్నవి. కనుకనే (ఋగ్వేదే) ప్రవః
పాన్తమంధసోధియాయతే। మహేశూరాయ విష్ణవేచార్చత ॥
(ఉపనిషదంతరే) ధృతోర్ధ్వ పుండ్రః పరమీశితారం నారా
యణం పూజయతిస్మ భక్త్యా। అఘార్ఘ్యాదిభిః పౌరుష సూక్త
మంత్రై స్సంప్రాప్ను యాద్విష్ణుపదం మహాత్మా॥(శ్రీ వైఖాన
సకల్ప సూత్రే) అగ్నౌ నిత్యహోమాంతే విష్ణోర్నిత్యార్చా
సర్వదేవార్చా భవతి (అగ్నిర్వై దేవానామవమో విష్ణుః
పరమ స్తదంతరేణ సర్వా అన్యాదేవతాః) తస్మాద్గృహే దేవా
యతనే వా భక్త్యా భగవంతం నారాయణ మర్చయే
త్తద్విష్ణోః పరమంపదం గచ్ఛతీతి విజ్ఞాయతే (మరీచి కృత
విమానార్చనకల్పే) అథాఽయం దేహజన్మకృత్వా భార్యా
మయపాశ నిబంధితః భగవన్మాయయా మోహితత్వాత్ కామ
క్రోధ లోభ మోహ మద మాత్సర్య హింసాదీనికరోతి యోని
ద్వారేణ నిష్క్రమ్య పాపీయసీం యోనింప్రావ్య పునర్జా
యమానః స్వర్గ నరకఫలేషు కర్మసుప్రవర్తితే తస్మాత్
భగవంతం సమాశ్రిత్య భక్త్యా నారాయణము పాసీత, తదా
రాధనేన సంసారార్ణవని మగ్నో జీవాత్మానం నారాయణం
పశ్యతి, సోప్య పునరావృత్తికం దివ్యలోకం ప్రాపయతి, పశ్చా
త్కృత కృత్యోభవతి; సంసారాన్ముక్తి మోక్షః, భగవంతం
నాన్యథా ప్రాప్నోతీతి విజ్ఞాయతే (విష్ణుపురాణే) అనారాధిత
గోవిందై ర్నరైః స్థానంనృపాత్మజ। నహిసంప్రాప్యతే శ్రేష్ఠం
తస్మాదారాధయాచ్యుతమ్ (అంగీరసస్మృతౌ) యస్యాన్త
స్సర్వమేవేవ మచ్యుతస్యావ్యయాత్మనః। తమారాధయ
గోవిందం స్థానమగ్ర్యం యదిచ్ఛసి॥ (పులస్త్యః) పరంబ్రహ్మ
పరంధామ యోసౌబ్రహ్మ పురంతథా। తమారాధ్యహరిం
యాతిముక్తి మభ్యేతిదుర్లభాం॥ ఇత్యాదిశ్రుతిస్మృతీతిహాస
పురాణ పరశ్శత ప్రమాణములచే॥ శ్లో॥ ఆరాధనానాం
సర్వేషాం విష్ణోరా రాధనంపరం॥ అనిపర్యవసన్న మగు
చున్నది ఈవిష్ణుదేవుడు ॥శ్రు॥ సవాఏష పురుషః పంచధా
పంచాత్మా ॥ పర వ్యూహ విభవ అంతర్యామ్యర్చా రూప
ములతోనుండి అధికారిక భేదములచే సేవింప బడు
చున్నాడు. ఇందు పరత్వము ॥ శ్లో ॥ పరత్వం నిష్కలం
ప్రోక్తం॥ నిష్కలంనామ = అఖిలహేయ ప్రత్యనీక కళ్యాణ
గుణములతో గూడిన స్వేతర సమస్తవస్తు విలక్షణానంత
జ్ఞానానందైక స్వరూపము. అయ్యది సత్యకామ సత్యసం
కల్పత్వాది లక్షణోపేతమై- శ్లో॥ వైకుంఠేతు పరేలోకే
శ్రియాసార్ధం జగత్పతిః। ఆస్తేవిష్ణు రచింత్యాత్మా భక్తైర్భా
గవతైస్సహ॥ అనేకకోటి బ్రహ్మాండముల కూర్ధ్వభాగమందు
సనాతనమై నిత్యమై అతిహిత ప్రకాశవంతమై దేవైరప్య
నభిలక్ష్యమైన శ్రీవైకుంఠమందు నిత్యులైన అనంతగరుడ
విష్వక్సేనాదులకును ముక్తజీవులకును మాత్రము సేవించ
తగియున్నది॥ శ్లో ॥ వ్యూహం సకలముచ్యతే = వ్యూహస్వరూ
పము పైనచెప్పబడిన లక్షణములతో గూడి పురుష
సత్యాచ్యుతానిరుద్ధ భేదములతో ఆమోదాది లోకములందు
నిత్యశుద్ధ ముక్త స్వభావులచే సేవింప బడుచున్నది॥ శ్లో॥
వైభవాస్త్వవతారాస్స్యుః॥ శ్లో ॥ యదాయదాహి ధర్మస్యగ్లాని
ర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా
మ్యహం॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృ
తాం। ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే॥
అనిచెప్పినట్లు మత్స్యకూర్మాద్యవతార రూపములు; ఇయ్యవి

శ్లో॥ తత్కాల సన్నికృష్టైక లక్ష్యత్వాద్వి భవాత్మనః॥ అవతారకాలముల నాటి భగవద్భక్తులకు సేవనీయములై సేవించబడినవి శ్లో॥ హృద్గతం చాంతరాత్మికమ్। అణోరణీయాన్మ హతోమహీయానాత్మాగు హాయాంనిహితోఽస్యజంతోః॥ తమక్రతుః పశ్యతి వీతశోకోధాతు ప్రసాదాన్మ హిమాన మీశం॥ శ్లో॥ ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥ ఇత్యాద్యుక్త విధయా దేహధారిణా మాత్మాగుహాయాం సన్నిహితః అన్తర్యామీత్యుచ్యతే సతు శ్లో॥ విశుద్ధయోగ సంసిద్ధైశ్చింత్య త్వాదంతరాత్మనః॥ అనుటచే నాడీశుద్ధిని చెందిన యోగీంద్రులచే మాత్రము సేవించ తగియున్నాడు॥ శ్లో॥ దారులోహ శిలామృత్స్నాశరీరేఽర్చాత్మకస్మృతః॥ దారులోహ శిలామృదాది రూపము అర్చారూపము॥ శ్లో॥ అర్చావతార స్సర్వేషాం బాంధవో భక్తవత్సలః। అర్చాత్మన్యేవ సర్వేషామది కారో నిరంకుశః॥ సర్వసులభుడై అర్చారూపమైన సర్వేశ్వరుని దేవతిర్యఙ్మనుష్యాది జీవులందరును ఆరాధించి ఐహికా ముష్మిక సుఖముల సాధించుటకు అవకాశము కల్గియున్నది. ఈ అర్చావతారము స్వయంవ్యక్తము, దివ్యము, ఆర్షము లేక సైద్ధము, పౌరాణము, షము అనుభేదములచే ఐదు విధములు.

శ్లో॥ స్వయంవ్యక్తంతు తత్ప్రోక్తం యత్రాఽసౌహరిరవ్యయః। స్వేచ్ఛయా లోకరక్షాయై భూమ్యామావిర్భ వేత్స్వయమ్॥ స్వయంవ్యక్తస్థలేపూజా సర్వలోకశుభప్రదా। స్వయం భక్తజనాఽభీష్టా విచార్యైవ ప్రయచ్ఛతి॥ లోకసంరక్షణముకొరకు భగవాను డర్చావతారియై ఆవిర్భవించుటస్వయంవ్యక్తము, స్వయంవ్యక్తస్థలమందలి దేవతా పూజనము లోకమంతకును శ్రేయస్కరము; అచ్చటి దేవుడు భక్తుల కామితార్థములను పుష్కలముగా సమకూర్చుచున్నాడు. శ్లో॥ దేవైఃప్రతిష్ఠితో యత్రహరిరావిర్బభూవహ। తద్దివ్యస్థలముద్దిష్టం దేవోదివ్య ఉదీర్యతే॥ దివ్యస్థలస్థపూజాతు శతయోజన విస్తృతమ్। పునాతిపరితోదేశం నాత్ర సందేహఇష్యతే॥ బ్రహ్మాదిత్రయస్త్రిం శత్కోటి దేవతలలో ఎవరైనను శ్లో॥ కర్మభూమిస్తుసంప్రోక్తా భూమిర్యోఽర్చ హితత్సుహా॥ అని తలచి ఫలార్థులై ప్రతిష్ఠించి పూజించిన దేవతా ప్రతిమలు దివ్యములనియు, అట్టి దేవతా ప్రతిమలున్న స్థానములకు దివ్యదేశములనియు పేరు. దివ్యదేశములందలి దేవతా పూజ ఎటు చూచినను నూరు యోజనముల మేరకు ఫలదాయకమైనది. శ్లో॥ యేతు పూర్వార్జితై రేవతపోభిః పరమాత్మని। రక్తాత్మాన స్తపస్సిద్ధా స్సంకల్ప్య స్వతపఃఫలమ్॥ దేవదేవం జగన్నాథం నారాయణమనామయం। ప్రతిష్ఠాప్య క్వచిద్బింబే సమభ్యర్చ్యా విశేషతః। ఉజ్జీవనాయ లోకానాం ప్రదాస్యంతీహపూజనమ్। సదేశస్సైద్ధ ఇత్యుక్తః సైద్ధా తత్రార్చ్యసేచ్యతే॥ సైద్ధస్థలేతు యాపూజా సర్వశాంతి కరీస్మృతా। పంచాశద్యోజనం తస్య పరితః పావయేన్మహీమ్॥ మహర్షులు తపస్సిద్ధికొరకు దేవతా ప్రతిమల స్థాపించి పూజించి సిద్ధిపొందిన పిమ్మట లోకాఽనుగ్రహముకొరకు విడచివెళ్లిన స్థానములు ఆర్షములనియును సైద్ధములనియును పిలువబడుచున్నవి. ఆర్షస్థలమందలి దేవతారాధనము శాంతి దాయకమై ఏబది యోజనముల మేరకు ఫలదాయకమై యున్నది శ్లో॥ గాధా పౌరాణికీ భూయాత్తత్పురాణ స్థలంమతమ్। అజ్ఞాత కర్తృకాణ్యత్ర స్మర్యంతే ప్రాయశోబహు॥ దశయోజనపర్యంతాం భూమింతు పరితస్సకృత్। పునాతిదేశః పౌరాణః॥ ఆలయనిర్మాణము ఎవరుచేసినది తెలియబడక స్థలమాహాత్మ్యములు కలిగి యున్న స్థానములు పౌరాణికములు. పురాణ స్థలముల యందలి దేవతాపూజనము పదియోజనములమేరకు ఫలదాయకమైనది. శ్లో॥ మానుషం పంచమంప్రోక్తం స్థలంయత్ర విశేషతః। గ్రామేవా నగరేవాపి శాస్త్రోక్తే సుమనోరమే। మనుష్యాః పుణ్యకర్మాణః తత్ర తత్ర దినే దినే। ప్రేరితా భగవద్భక్త్యా ధనినోనిర్ధనా అపి। నిర్మాయ భగవద్గేహం ప్రతిష్ఠాప్యశ్రియః పతిం। వైఖానసేన శాస్త్రేణ పాంచరాత్రేణవా పునః అర్చయంతి విశేషేణ తత్స్థలం మానుషం స్మృతమ్॥ మానుషస్థల పూజాతు యోజనం పరితస్థలమ్। పావయేత్తస్యతుప్రోక్తా శక్తిరన్యాతు తావతీ॥ పూర్వజన్మార్జిత స్వకృత పుణ్యవిశేషములచే భగవద్భక్తులైన మానవులు ధనికులు స్వార్జితద్రవ్యముతోను నిర్ధనులు యాచ్నాలబ్ధ ద్రవ్యముతోను నిర్మించబడిన దేవాయతనములు మానుషస్థలములు. మానుషస్థల మందలి దేవతా పూజనము యోజనము మేరకు ఫలదాయకమైనది. భారత దేశమందు మహా మహిమవంతములైన స్వయంవ్యక్తాది మానుషస్థల పర్యంతముగల పంచవిధ స్థలములు అనేకము లున్నవి, స్వయంవ్యక్తాది పంచవిధ స్థలములందును॥ శ్లో॥ యథాకర్మణ ఏకత్ర కల్పితాః పంచవహ్నయః। తథైవైక విమాన స్యపంచ బేరాణికల్పయేత్॥ అగ్న్యాధానాది యజ్ఞములందు గార్హపత్యాఽన్వాహార్యా హవనీ యావసథ్య సభ్యాగ్ని కుండముల కల్పించి క్రియాతంత్రము నిర్వర్తించు చున్నట్లు ప్రతి ఒక్కొక్క దేవాలయము నందును ఆరాధనా సౌకర్యము కొరకును విషయ విశేష ఫలప్రాప్తి కొరకును ధ్రువము, కౌతుకము, ఔత్సవము, స్నాపనము, బలిబేరమునను ఐదు బేరము లుండ వలెననియు॥ శ్లో॥ అథవాత్రీణి బేరాణి యథాత్రేతాగ్ని కల్పనమ్॥ యజ్ఞకర్మ లందశక్తులగు వారు గార్హపత్యాఽన్వాహార్యా హవనీయ కుండములు నిర్మించి క్రియాతంత్రము నిర్వర్తించు కొనునటుల ద్రవ్యహీనులగు వారీ విగ్రహారాధన యజ్ఞమందును ధ్రువము, కౌతుకము

ఔత్సవము, నను మూడు బేరముల నిర్మించి ఆరాధించ
వచ్చుననియు శ్లో॥ ధ్రువార్చా బేరమేకంతు కుర్యాదౌ
పాసనాగ్నివత్। ధ్రువార్చా బేరమొక్కటియే ప్రతిష్ఠించి
ఆరాధించుటకును అవకాశము కలదని భగవచ్ఛాస్త్ర సగ్ం
హితాకారులగు భృగుమరీచ్యత్రి కశ్యపాదులు చెప్పి
యున్నారు. విత్తశాఠ్యం నకారయేత్. అనుటచే ద్రవ్యసం
పత్తికలవారు ఉత్తమ మార్గమునే అనుకరించ వలెను.
శ్లో॥ అశక్తస్యాఽ ధనాఢ్యస్యేచ్ఛా సర్వత్ర కథ్యతే।
ధృవంతు గ్రామ రక్షార్థం॥ ఇయ్యది పంచబేరములలోను
ముఖ్యమైనది; ధృవమనగా కదలికలేనిదని అర్థముకదా!
ధృవబేరము శిలతోగాని దారువుతోగాని నిర్మించ వచ్చును.
లోహముతోకూడ ధృవబేర కల్పనము చేయవచ్చునని కొంద
రంగీకరించి యున్నారు. ధృవబేరము త్రిషోడశ జీవకళాపరి
పూర్ణము; ఇట్టి ధృవబేర మధివసించిన గ్రామము సర్వతో
భద్రముగా నుండునని భావము శ్లో॥ అర్చనార్థంతు
కౌతుకమ్। నిత్యార్చన విశేషార్చనముల కొరకు ప్రధాన
మైన బేరము కౌతుక బేరము శ్లో॥ ఉత్సవార్థ మథౌత్స
వమ్॥ విష్ణుపంచక విషువాయనాది దినములందును గ్రామ
మందు మారీస్ఫోటకాది రోగములు వ్యాపించినపుడు గ్రామ
క్షేమము కొరకును గ్రామోత్సవములు జరుపు కొనుటకు
ఔత్సవబేరము శ్లో॥ స్నానార్థం స్నపనం ప్రోక్తం॥ అనా
వృష్ట్యాదిదోషములు ప్రాప్తించినపుడు తచ్ఛాంతికొరకు
చేయబడు స్నపన విశేషములన్నియు చేయుటకు స్నపన
బేరము శ్లో॥ బల్యర్థం బలిబేరకమ్॥ నిత్యనైమిత్తి కాది
బలినిర్వర్తనము కొరకు బలిబేరము; ఇట్లుగా పంచబేరము
లును అయానమయములందు యథాపరాధితములై ఆరాధ
కుల కామితార్థముల నీడేర్చు చున్నవి. కౌతుకబేరమునకు
సమర్పింపబడు నిత్యార్చనము॥ శ్లో॥ ప్రత్యూషః ప్రాత
కాలశ్చ మధ్యాహ్నశ్చాపరాహ్ణకః। సాయంకాలోఽర్థరా
త్రశ్చ పూజాకాలస్తు షడ్విధః॥ ఏవంషట్కాల పూజాయా
మైహికాముష్మికప్రదమ్॥ ఉషఃకాలార్చనము, ప్రాతఃకాలా
ర్చనము, మాధ్యాహ్నికార్చనము, అపరాహ్ణార్చనము
సాయంకాలార్చనము, అర్థరాత్రార్చనము, అని ఆరు
విధములు; ఇందొక్కొక్కకాల మందు చేయబడు అర్చ
నము ఒక్కొక్క ఫలము నిచ్చుచున్నది. శ్లో॥ ఉషఃకాలా
ర్చనం చైవంనరస్త్రీ శిశువృద్ధయే॥ ఉషఃకాలమనగా అరుణో
దయకాలము; ఈకాలమందు చేయబడు నిత్యార్చనముచే
స్త్రీపురుషబాలాదులభివృద్ధిజెందుదురు॥ శ్లో॥ ప్రాతఃకాలా
ర్చనంచైవ జపహోమాది వృద్ధయే॥ ప్రాతఃకాలమందు
చేయబడు నిత్యార్చనముచే జపహోమాది కార్యములు
నిర్విఘ్నముగా కొనసాగును॥ శ్లో॥ మాధ్యాహ్నేచార్చనం
చైవరాజరాష్ట్రాభి వృద్ధయే మాధ్యాహ్ని కార్చనము రాజులు
రాష్ట్రాభివృద్ధిని జెందించుట కనుకూలపడును॥ శ్లో॥ అప
రాహ్ణార్చనంచైవాఽసురాణాం నాశహేతవే॥ అపరాహ్ణకాల
మందు చేయబడు నిత్యార్చనము కర్మ విఘ్నకారులైన
రాక్షసుల నశింపజేయును॥ శ్లో॥ సాయంకాలార్చనంచైవ
సర్వసస్యాఽభివృద్ధయే॥ సాయంకాలము నందు చేయబడు
నిత్యార్చనము ఆహారపదార్థముల నభివృద్ధి చేయును.
శ్లో॥ అర్థరాత్రార్చనంచైవ చతుష్పాదభి వృద్ధయే॥ అర్థ
రాత్రార్చనము పశుసంతతి నభివృద్ధి జేయునదైయున్నది.
ఈవిధముగా షట్కాలార్చనము ఐహిక సుఖములనొన
గూర్చి ఆముష్మిక మందు దుర్లభమైన మోక్షము నొసగు
చున్నది. షట్కాలార్చనముచేయుటకు పూజకసంపత్తియు
అర్థికస్తోమతయు అవశ్యకములు ఒకే ఒకఅర్చకుని
నియమించి షట్కాలార్చనము జరిపించుటకు శక్యము
గాదు; కనుకనే సాధారణ స్థలము లందంతటను శ్లో॥ షట్కా
లంవాత్రికాలం వాద్వికాలం కాలమేవవా॥ అని భగవచ్ఛాస్త్ర
సంహితాకారు లవకాశమును కల్పించి యున్నారు. గ్రామా
భ్యంతర మందుండు దేవాలయము లన్నింటి యందును
అర్థికస్తోమతయు అధికాధిక పూజకసంపత్తియు నున్నచో
త్రికాలార్చనము చేయించి భగవచ్ఛాస్త్ర సంహితాకారులు
చెప్పిన విగ్రహారాధనా ఫలమును పొంద వచ్చును. త్రికాల
ముల యందు అర్చామూర్తికి అవస్థా భేదము లున్నటుల
శ్లో॥ ప్రాతఃకాలేతు బాల్యం స్యాన్మధ్యాహ్నే యౌవనంతథా।
సాయాహ్నేవార్థ కంబింబ మితిమూర్తి స్త్రిధాభవేత్॥ అను
శ్లోకము వలన తెలియు చున్నది. ఇందొక్కొక్క అవస్థా
విశేషమందున్న మూర్తి ఒక్కొక్క ఫలమును నమ
కూర్చును॥ శ్లో॥ బాల్యే పుష్టికరం ప్రోక్తం॥ బాల్యావస్థ
యందున్న మూర్తిని పూజించుటచే పుష్టికలుగుచున్నది
శ్లో॥ యౌవనే శ్రీకరంతథా॥ తారుణ్యావస్థ యందలి బేర
పూజనము ఐశ్వర్యమొసగు చున్నది శ్లో॥ వార్థకేమోక్షదం
చైవత్రివిధాత్వర్చనంభవేత్॥ సాయంకాలమందు వార్థ
క్యావస్థయందున్న బేరపూజనము దుర్లభమైన మోక్ష
మొసంగును. ఇట్లైహికా ముష్మిక సుఖదమైన విగ్రహారా
ధనమును॥ శ్లో॥ విచిత్రాదేహ సంపత్తి రీశ్వరాయ నివేది
తుమ్। కల్పితా బ్రహ్మణా పూర్వం హ స్తపాదాది సంయుతా॥
అనుభావముతో సమధి కోత్సాహ ప్రేరితశ్రద్ధా భక్తులు కల
వారై ప్రోత్సహించుచు భగవత్కైంకర్యముల యందు
పాల్గొని అప్రాకృతదివ్యచిన్మయ కల్యాణాద్భుత స్వరూపి
యైన సర్వేశ్వరుని కరుణా కటాక్షవీక్షణములకు పాత్రులు
కాగలందులకు కోరు చున్నాను

శ్లో॥ సాకారో పాసనాచైషా వర్ధతాంశర దశ్శతమ్।
వైఖాన సార్యదివ్యాజ్ఞా వర్ధతామభి వర్ధతామ్॥

ఇతిశమ్

# విగ్రహపూజ — మన దేవాలయాలు

బులుసు వేంకటరమణయ్య

జాతీయతాభ్యున్నతికీ, జాత్యభివృద్ధికీ, వ్యక్తిత్వానికీ మతంకూడా ముఖ్యమనే సంగతి అన్ని దేశాలవారూ సమ్మతించినదే! మానవుడు ఏదో యింత తిని, గుడ్డ కట్టుకొని కేవలం జీవించడానికయితే మతంతో సంబంధం లేదు. కాని, జీవితం సుఖమయంగానూ, కొంత తృప్తికరంగానూ సాగాలంటే—మానవునిలో మానవత్వం కావాలంటే మతం అవసరమనీ, మతధర్మాలను అనుసరించినప్పుడే మానవుడు లెక్కలోకి వస్తాడనీ మనం నిశ్చయించవచ్చును.

మతంలో ఒక ముఖ్య ఘట్టం భగవదారాధన. దేవాలయాదుల ప్రతిష్ఠలు చేసి, వాటిలో దేవతామూర్తులను నిలిపి, యథావిధిగా ఆరాధిస్తూ ముక్తిమార్గాన్ని అన్వేషించడం ఒక పద్ధతి. యోగులైనవారు యోగసమాధిలోనుండి భగవత్స్వరూపాన్ని ఆత్మలోనే దర్శించడం మరొక పద్ధతి. ఈ విషయమే జాబాలోపనిషత్తులో—

> 'శివమాత్మని పశ్యన్తి
> ప్రతిమాసు న యోగినః,
> అజ్ఞానాం భావనార్థాయ
> ప్రతిమాః పరికల్పితాః,'

అని చెప్పబడివున్నది.

విగ్రహపూజ యెగవేద్దామనే అభిప్రాయం కలవాళ్ళు కొందరు ఇట్టి శ్లోకాలు అందరికీ సమన్వయిస్తాయని అనుకోవడంకద్దు. 'భగవంతుడు సర్వవ్యాపకడా! ఒక్క గుడిలోనే మూర్తి స్వరూపంగానే వుండలేదుకదా! గుడిలోకి వెళ్ళి దేవదర్శనం చేసుకోవడం యెందుకూ? మేము మనస్సులోనే ధ్యానం చేస్తాం' అని కొందరు అనుకోవచ్చు. కాని అతి చంచలమైన మనస్సు. కొంత నిలకడగా వుండడానికి ఏదయినా స్వరూపం లక్ష్యంగా వుండకతప్పదు. యోగులకంటే యితరులైనవారు తప్పకుండా విగ్రహపూజ చేయవలసినదే! విగ్రహారాధనను నిరసిస్తూవున్న మతాంతరులుకూడా ఏదో ఒక చిహ్నాన్ని తమ ప్రార్థనా మందిరాల్లో నెలకొల్పడంకద్దు. క్రైస్తవుల చర్చులలో శ్లీవాన్ని (శిలువను) నిలుపుతారు. బ్రహ్మసమాజం మున్నగు మతాలను అనుసరించేవారుకూడా తమ కారాధ్యులైన ప్రవర్తకుల చిత్రాలను నిలుపుతారు. మహమ్మదీయులు తమ మతోత్సవాలలో మతప్రవర్తక చిహ్నాలను ఊరేగించడంకూడా ఊరేగిస్తారు. జైనులూ, బౌద్ధులూ తమ మందిరాల్లో మతప్రవర్తకుల మూర్తులను నిలిపి ప్రార్థనలు జరుపుతారు. ఇవన్నీకూడా తమ మనఃస్థైర్యానికీ, లక్ష్యసిద్ధికీ అనువైన సాధనాలేకదా!

విగ్రహారాధనమూ, అందుకోసం దేవాలయ నిర్మాణమూ హిందూమతంలో ప్రాచీనాలుకావనీ, బౌద్ధ జైన మతాలు వ్యాపించాక—వారి సంఘారామాలూ, శిల్పాలూ మొదలైనవాటిని చూచి హైందవులు దేవాలయ నిర్మాణానికీ, విగ్రహారాధనకీ ప్రారంభించారనీ కొందరు భ్రాంతిపడుతున్నారు. కాని హైందవ విగ్రహాలు చాలా ప్రాచీనకాలంనుంచీ-అంటే చాలా వేలసంఖ్య ఏండ్లనుంచీ కానవస్తూవున్నవి.

వేదంలో విష్ణువును గురించిన ప్రశంసవున్నది. మూర్తి స్వరూప వర్ణనలు అందులో కనబడుతవి. వేదాలకు మొదట వ్యాకరణం వ్రాసిన యాస్కుడు మూర్తి పూజను తెలియజేశాడు. పాణినిమహర్షి తన అష్టాధ్యాయిలో (6-96) 'ప్రతికృతి'ని గురించి ప్రశంసించాడు.

వాఙ్మయంలో అతి ప్రాచీనమైన రామాయణాన్నిబట్టి చూస్తే ఆకాలంలో దేవాలయాలూ, విగ్రహారాధనా విరివిగా వున్నట్టు తెలుస్తుంది. లంకలోని దేవాలయాల వివరణ అందున్నది. దీన్నిబట్టి దక్షిణ హిందూదేశంలో విగ్రహారాధన యెంత ప్రాచీనమైనదీ తెలుస్తున్నది.

సృష్టిలోని మహత్తరమైన ప్రతి వస్తువూ దేవత్వ విశిష్టమని మన ప్రాచీనుల ఆశయం. ఆ అభిప్రాయంతోటే వేదాల్లోని సూక్తాల్లో వర్ణనలు కనబడతవి. పర్వత దేవతలూ, నదీదేవతలూ, వనదేవతలూ చాలామంది మన వాఙ్మయంలో కానవస్తూవుంటారు. అద్భుత సృష్టిని - ప్రతీదాన్నీ ఆరాధించే తత్వం భారతీయులది! అందుచేతనే కళాఖండాలూ, వీరులూకూడా ఆరాధింపబడడం క్రమంగా వాడుకలోకి వచ్చింది. ఈవిధంగా మృగాలనూ, చెట్టుచేమలనూ, నదులనూ, సరస్సులనూ పూజించడం యిప్పటికీ మనదేశంలో వుంటున్నది.

మన లౌకిక వాఙ్మయాన్ని పరిశీలించి చూచినా విగ్రహారాధన చాలాకాలంనుంచీ వున్నట్లు తెలుస్తునేవున్నది. గాధాసప్తశతిలో దేవాలయ ప్రశంస ఉన్నది.

విగ్రహారాధనం దక్షిణ భారతదేశంలోనే యెక్కువ వ్యాప్తమైనట్లున్నూ, అతిప్రాచీనమైనట్లున్నూ తెలుస్తున్నది. దేవాలయ నిర్మాణమూ, శిల్పకళావైశిష్ట్యమూ దక్షిణదేశంలోనే ప్రసిద్ధమైనట్లు అందరూ అంగీకరిస్తారు. రామేశ్వరం, శ్రీరంగం, తిరుపతి మున్నగు స్థలాల్లో గల దేవాలయాలు ప్రాచీనాలని అందరికీ తెలుసును.

దక్షిణ భారతదేశంలో కానవచ్చిన మొదటి మూర్తి స్వరూపం క్రీస్తుపూర్వం 2-వ శతాబ్దదని ఇప్పటికి నిర్ణయించారు. అది గుడిమళ్ళలో వుండే శివలింగమట! దీన్నిబట్టి ఇప్పటివరకూ జరిగిన పురాతత్త్వ పరిశోధనవల్ల విగ్రహారాధనలో - దక్షిణప్రాంతంలో ఆంధ్రదేశమే ముందంజవేసినట్లు స్పష్టమౌతున్నది. అక్కడ శివునికి అయుధం గండ్ర గొడ్డలిగా కానవస్తున్నదట.

క్రీస్తుపూర్వం 175-135 నడుమ నిర్మితమైన గరుడ స్తంభం ఒకటి బేస్ నగరంలో కానవచ్చినదట. దీన్నిబట్టి చూస్తే శివ, కేశవుల పూజలు చాలాకాలంనుంచీ వున్నట్లు తెలుస్తూవున్నది.

దేవాలయ ప్రతిష్ఠ సప్తసంతానాల్లోనూ ఒకటని మన పెద్దలు నిర్వచించారు. కుగ్రామాలను కొన్నింటిని విడిచిపెట్టి చూస్తే మనదేశంలో దేవాలయాలు వుండని గ్రామాలు గాని, పట్టణాలుగాని కానరావు. విష్ణువు ప్రధానంగా వున్న చోట శివుడు క్షేత్రపాలకుడుగానూ, శివుడు ప్రధాన దైవంగా వున్న చోట విష్ణువు క్షేత్ర పాలకుడుగానూ వుంటారు. ఈవిధంగా శివకేశవు లిద్దరికీ దేవాలయాలుండే స్థలాలే చాలా కానవస్తాయి. మిక్కిలీ చిన్న గ్రామమయి, రెండు దేవాలయాలను పోషించే శక్తి గ్రామానికి లేకపోతే ఒక్క దేవాలయమైనా వుంటుంది. దీన్నిబట్టి మనవారు ఎట్టి కట్టుబాట్లు ఏర్పాటుచేసినదీ, మత సామరస్యాన్నిగురించి ఏవిధంగా పాటుపడినదీ తెలుస్తూ వున్నది.

దేవాలయాలు గ్రామాలకు పెట్టని కోటలై, యెట్టి ఉపద్రవములూ కలుగకుండా రక్షకములయి వుంటాయని మన ప్రాచీనుల విశ్వాసం. ఏ దేవత, ఏ దిక్కున-ఏవిధంగా ఉంటే ఉచితంగా వుంటుందో నిర్ణయాలుకూడా చేయబడి వున్నవి. గ్రామానికి పశ్చిమ దిశను విష్ణ్వాలయమూ, ఈశాన్య దిక్కున శివాలయమూ, తూర్పున పశ్చిమాభిముఖంగా సూర్యుని ఆలయమూ వుండవలెనట! దుర్గ దక్షిణ దిక్కునను, సుబ్రహ్మణ్యస్వామి వాయవ్య దిక్కున వుండవలెను. ఉత్తర దిక్కున సప్తమాతృకలు, విఘ్నేశ్వరుడు ఉత్తరముఖంగా ఉండవలెనట! సరోవరతీరాన్ని జ్యేష్ఠాదేవి గుడి ఉండవలెనట! జ్యేష్ఠాదేవి గుడులు ఏ స్థలాల్లో వున్నదీ మనకు తెలియరాదు; కాని గ్రామదేవతల గుడులు మాత్రం గ్రామసీమలో—చెరువుగట్టునా, యేటి గట్టునా—తోటల మొదటా, పొలాల గట్టుమీదా వుండడం కద్దు. ఈ దేవతలు గ్రామరక్షణ బాధ్యతను యావత్తూ వహించడంచేత ఊరి పొలిమేరలో వుండవలసివస్తున్నట్టు తెలుస్తున్నది. ఆయా దేవతల అనుగ్రహం సంపాదించడం కోసం విశేషోత్సవాలు జరపడం ఉన్నది.

భగవద్దర్శనంకోసం దేవాలయం ప్రవేశించినప్పుడే మనస్సు చాంచల్యం విడిచి, తన్మయత పొందడం అవసరం. అందుకోసమే దేవాలయ గోపురాలమీదా, మండపాల స్తంభాలమిదా అపూర్వమైన శిల్పం ప్రదర్శింపబడుతుంది. గర్భగుడిలోకి వెళ్ళేలోగా-దేవాలయంలోని అద్భుత శిల్పాలనూ, నిర్మాణ పద్ధతినీ చూచి, అందరూ తన్మయులౌతారు. అందువల్ల విగ్రహాలను చూచేటప్పటికే చిత్త స్థైర్యం ఏర్పడి ఆయన ధ్యానంలో లీనంకావడం సులభంగా జరుగుతుంది. నిర్బంధం అనేది ఆక్కరలేకుండానే దేవాలయంలోకి వెళ్ళి భగవంతుని దర్శించుకొవడం అందరికీ నిత్యకృత్యంగా తయారవుతుంది.

పూర్వం భారతదేశంలో మరిదేనికి లోపంవుండినా, అధ్యాత్మికదృష్టికీ, దైవభక్తికీ, పారమార్థికచింతకూ లోపం వుండేదికాదు. ప్రతి గ్రామంలోనూ దేవాలయాలు ఏర్పడ్డాయంటే—అలా జరగడానికి ప్రజల సహకారమూ, ఔదార్యమూ ఎంత ఉండినదీ వ్యక్తమవుతున్నది. దేవాలయ నిర్వహణ బాధ్యత గ్రామం మొత్తంమిద వుండేది. అందుకోసం మాన్యాలూ, అవీ ఏర్పడ్డాయి. మనకు లభిస్తూవున్న శాసనాలను పరిశీలిస్తే–చాలావరకూ–ప్రభువులే కాకుండా సామాన్యులుకూడా దీపారాధనకయినా కొంత త్యాగం చేసినట్లు స్పష్టంగా కనబడుతుంది. దేవాలయంలోని నిత్య, నైమిత్తిక కార్యకలాపంలో అందరూ పాల్గొనేవాడు.

మతాంతరులు కొన్ని నియమాలను తప్పకుండా పాటిస్తూ వుంటారు. నియమిత దినాల్లోనూ, నియమిత కాలంలోనూ వారి ప్రార్థనలకు వెళ్లకపోతే గొప్ప అపరాధం చేసినట్లు భావింపబడుతుంది. మన మతాల్లో అట్టి నిర్బంధాలు లేకుండానే భగవదారాధనలు జరుగుతూ వుండడంవల్ల మతకర్తలు కఠినమైన నియమాలు ఏర్పాటుచెయ్యలేదు కాని, కాలం మారిపోయింది.

పాశ్చాత్యులు భారతదేశానికి పరిపాలకులుగా ఉన్న కాలంలో దేవాలయాల స్థితిగతుల్లో అభివృద్ధి జరుగలేదు. మతవిషయాల్లో వారు జోక్యం కలుగచేసుకొనకపోవడం వల్ల ఆయా దేవాలయాల ధర్మకర్తలూ, అధికారులూ దేవాదాయాన్ని తన యిష్టంవచ్చినట్లు వినియోగంచెయ్యడం జరిగేది. ప్రభుత్వం నెరపేవారు మతాంతరులగుటవల్లనూ వారి మతప్రచారం బాగుగా జరుగుటవల్లనూ, కొందరు తమ మతాన్ని విడిచి యితర మతం స్వీకరించడం కూడా జరిగేది.

భారతీయులకు శాసనసభాప్రవేశం కలిగి, వారి తీవ్ర కృషివల్ల దక్షిణ భారతదేశంలో దేవాదాయ, ధర్మాదాయాల సంస్థ ఏర్పడేవరకూ ఆంధ్రదేశంలోని పెద్ద దేవాలయాల స్థితి చాలా అధ్వాన్నంగా ఉండేది. ఈ సంస్థ పర్యవేక్షణ

వల్ల చాలా దేవాలయాల ఆర్థికపరిస్థితి చక్కబడడమూ, ఎక్కువ ధనం మిగలడమూ, మిగిలిన సొమ్ము గొప్ప విద్యాసంస్థలకు ఉపయోగించడమూ జరుగుతున్నది.

ఆధ్యాత్మిక విషయాలతో అంతగా సంబంధంలేక— కేవలం వృత్తులకోసమూ, ఉద్యోగసంపాదనకోసమూ ఉపయోగపడే ఆంగ్లవిద్యావ్యాపనంవల్ల భారతీయ మతాలు బాగా దెబ్బతిన్నవి. ఆంగ్లభాష నభ్యసించేవారిలో చాలామంది దృక్పథం మారుత్రోవను పట్టింది. దైవభక్తి కొరవడింది. విగ్రహారాధనపట్ల వైముఖ్యం ఏర్పడింది.

ఇప్పటివారిలో చాలామందికి విగ్రహారాధనపట్ల విపరీతాభిప్రాయం వుండడం విచారకరం! 'విగ్రంహంలోనే దేవుడున్నాడా? విగ్రహారాధన యెందుకు?' అనేవారు శ్రీ వివేకానందస్వామి ఆ విషయంలో చెప్పిన సమాధానాన్ని ఒకసారి గమనిస్తే బాగుండును.

స్వామీజీ ఆళ్వారుసంస్థానమున నున్నపుడు ఆ మహారాజునకును విగ్రహారాదనపట్ల నమ్మకము కుదురకుండెనట! అప్పుడు స్వామీజీ మహారాజావారి పటమును తెప్పించి దానిపై ఉమ్మివేయవలసినదని అచటివారిని కోరగా ఎవ్వరును అట్టి పనికి సాహసింపరైరట! అప్పుడు స్వామీజీ 'కేవలం కాగితమూ, రంగూమాత్రం వున్నా, చిత్రాన్ని అవమానించడం మహారాజావారిని అవమానించినట్లు ప్రజలు భావిస్తున్నారుకదా! ఆ విధంగానే విగ్రహాలు కర్రా, రాయీ అయినా భగవంతుని లక్షిస్తూవున్నవి. విగ్రహాలను పూజించేవారు 'ఓ కర్రా! ఓ రాయీ! అని సంబోధిస్తారా?' అని సమాధానం చెప్పారట! అంతటితో ఆ మహారాజుకు విగ్రహారాధననుగురించిన దురభిప్రాయం తొలగిపోయింది.

మనం ఇన్నాళ్ళూ పాశ్చాత్యవ్యామోహంలో పడిఉన్నాం. స్వధర్మ నిర్వహణం చేస్తే నలుగురిలోనూ చులకన అయిపోతామనే భ్రాంతి ఉండినది. కాని, స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ భ్రాంతులన్నీ తొలగుతున్నవి. ఇప్పుడు యువక హృదయాల్లో మతవిషయంలోకూడా నూతన చైతన్యం కలగవలసివున్నది. ఇదివరలో మతాంతరులు తమ మత ప్రచారంకోసం సర్వసన్నాహాలూ చేసినట్లే మనముకూడా మన మతాల వైశిష్ట్యాన్ని ప్రబోధించడానికి పునః ప్రయత్నం చెయ్యవలసి వున్నది. ఇందుకొనం మతోపన్యాసాలూ, 'ఆరాధన'వంటి పత్రికల్లో ప్రకటింపబడే వ్యాసాలూ, సులభశైలిలో మతవిషయక గ్రంథప్రకటనా, మతకర్తల జయంతులను జరిపి, వారి ప్రబోధాన్ని వ్యాప్తిచెయ్యడం మొదలైనవి ఎంతో అవశ్యకములు. ఇందుకు ప్రభుత్వమూ, ప్రజాసంస్థలూ, విజ్ఞులూ, ప్రజానీకమూ ఏకాభిప్రాయంతో పనిచెయ్యవలసి ఉన్నది.

---

వేదాహమేతం పురుషం మహాంతం।
ఆదిత్యవర్ణం తమసస్తుపారే।
సర్వాణి రూపాణి విచిత్యధీరః।
నామాని కృత్వాఽభివదన్ యదాస్తే॥

ధాతాపురస్తాద్య ముదాజహార।
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వానమృత ఇహభవతి।
నాఽన్యః పంథా అయనాయ విద్యతే॥

॥ ఓమ్ తత్సత్ ॥

# వైదిక తాంత్రిక వాఙ్మయములు, తద్ధర్మములు.

నీలకంఠశాస్త్రి, కౌండిన్య.

నారాయణ సమారంభాం విద్యాశంకర మధ్యమామ్।
కల్యాణానంద పర్యంతాం వందే గురుపరంపరామ్॥

ప్రపంచమునందు ఏవాఙ్మయమును జూచినను అందలి ప్రాచీనతమంబగు వాఙ్మయము ఆధ్యాత్మిక విషయములకు సంబంధించినదే యగుచు అయ్యదియే మతమునకు మూలాధారముగా నొప్పుచుండుట మనకు సర్వత్ర విదితమగు చున్నది. ఏమతము నైనను ఏజాతి నైనను బరికించినచో అంతటను ఇయ్యదియే గోచరించు చుండును. అంతియగాదు; అనన్తరోత్పన్నమగు భాషా వికాసమునకు గూడ ఇందలి భాషయే నిదాన మగుటయు గాన వచ్చుచున్నది. దీనిని బట్టి ప్రపంచము నందలి యాయా దేశములలో గలప్రాచీన భాషయందలి వాఙ్మయము, అందు ప్రతిపాదింపబడిన సూత్రములును ఆయా దేశముల యొక్క భాషాసారస్వతాచారముల ప్రాశస్త్యమునకు నిదానమగుచున్నట్లు మన మూహింప వచ్చును.

ప్రకృతము అత్యంత సనాతనమగు భారతదేశమునందలి యార్య నాగరికత తత్ప్రతిపాదకమగు వైదిక వాఙ్మయము ఖండాన్తరవాసులను సైతము తన విశిష్టతతో నుఱ్ఱూతలూపి యాశ్చర్య చకితులను గావించినది. అందు చేతనే భారతీయేతరు లందరు గూడ మహా శ్రద్ధతో కూలంకషముగా దాని యందలి విషయములను పరిశోధించుటకు ప్రయత్నించు చుండిరి. ఇక భారతీయులలో యీ మధ్య కాలమున తద్విమర్శనము కొంత కుంటుపడినను కొన్ని శతాబ్దుల పూర్వము వరకు యీపరిశోధనములు మిక్కుటముగ జరుగుచునే యుండెడివి. కాని ఆనాటి భారతీయ విమర్శ పరిశోధనములకును యీనాటి భారతీయేతర విమర్శ పరిశోధనములకును విశేషమగు నంతరముగలదు ప్రాచీన భారతీయ విమర్శకులు తత్సంప్రదాయములను బాగుగా నెరింగి యుండుటచే తమవైదిక వాఙ్మయము ఏప్రయోజనమునకై పుట్టినదో అయ్యది చెడకుండ పురుషుల యాశయములను గనుగొని విపులీకరించుచు, వాని వాని వలన గలుగు మంచి చెడ్డలను నిరూపించుచు ప్రమాణబుద్ధితో విమర్శించి అర్థానిని లోకమున ప్రచారము గావించిరి; తత్ప్రయోజనమును గూడ బడసిరి.

భారతీయేతరులు తదనుయాయులు గూడ వేదార్థము నెట్లు తెలిసికొన వలయును ; అను విషయముననే ఒక విధమగు విప్రతిపత్తిని వహించుట చేతను వారల సంప్రదాయమున ఏగ్రంథమును అర్థము చేసికొనుటకును వైదిక వాఙ్మయమున గల నిబంధనలు లేక పోవుట చేతను ఇట్టి సంప్రదాయము నెరుంగక మానుషబుద్ధి ప్రతి విషయమును ఇతరానపేక్షముగనే తెలిసికొన గలదను స్వాతంత్ర్యమును వహించి అర్థము చెప్ప దొడంగిరి. ఇట్టి యభిప్రాయము తోడనే నేడు సంస్కృత వాఙ్మయమునకు మహోపకృతి నొనర్చిన "మోక్షమూలరాచార్యుడు" వైదికభాషకు సంబంధించిన 'శతం కేంటుం' భాషలకు గల సంప్రదాయముల ననుసరించి వేదములకు తాను చెప్పిన యర్థము శ్రీ విద్యారణ్యులు చెప్పినయర్థముతో కొంతవరకు సరి పోవు చున్నదని వ్రాయదొడగెను. అంతియేగాని ఒకశాస్త్రమునకు అర్థము చెప్ప వలయు నన్నచో అందుకొన్ని ఇతర శాస్త్రముల సహకారము సంప్రదాయజ్ఞానము గూడ నుండ వలయునని ఈతడు ప్రధానముగా తలంచి యుండలేదు. ఈ రెండు వ్యాఖ్యానములను మనము దగ్గర నుంచి చూచినచో వీనిలోని తారతమ్యము మనకు సుగోచరము కాగలదు. అదియుగాక నేటివరకు బయల్వెడలిన యధునాతన వైదిక వాఙ్మయ విమర్శనములను మనము జాగ్రత్తతో పరిశీలించినచో వేదములలో తలమానికము అనదగిన యజుర్వేదమును గూర్చిన సరియగు విమర్శన మొకటియును కానరాదు. ప్రధానముగా ఋగ్వేదమును గూర్చియు గౌణముగా నథర్వణమును గూర్చియు విమృశించిన గ్రంథములే ప్రచురముగ గానబడు చున్నవి. ప్రాచీన విమర్శనములు దీనికి విపరీతములు. దీనికి గారణము నేటి విమర్శకులకు యజుర్వేద విమర్శకతా శక్తి కుంటుపడుటయే యని చెప్పక తప్పదు. అయ్యది కేవల కర్మవిషయమగుటచే దానికి సంబంధించిన శాస్త్రము చదువక అందు వీరల సామాన్య విమర్శనమునకు ఋగ్వేదము మున్నగు వాని యందువలె తావు దొరకదు. ఏది ఎట్లైనను పాశ్చాత్య విమర్శనాను సారియగు నేటి విమర్శన పద్ధతివలన కొంత ప్రయోజనము లేకపోలేదు. కాని ఈ రెండు విధములగు విమర్శనములను గూడ నేడవలంబించినచో ఈ శాస్త్రము లోకోపకారి అభివృద్ధి నొందు ననుటలో సందియము లేదు. ప్రకృతము ననుసరింతము.

వైదిక వాఙ్మయము నందు జనుల చతుర్విధ పురుషార్థములును చర్చింప బడినవి. జనుల సహజప్రవృత్తిని క్రమశిక్షణతో శాస్త్రీయ మొనర్చి జనులను ఎట్టివిప్రతి

పత్తుల నొందకుండ చేయుటయే వైదిక వాఙ్మయము యొక్క ప్రధాన తాత్పర్యము. కావుననే జీవుని గర్భ ప్రవేశము మొదలు, జన్మ, స్థితి, మరణము, అలౌకికానుభవము, మరల గర్భ ప్రవేశము వరకు గల స్థితి ఇందు వర్ణింపబడి పురుషుడు తన యౌన్నత్యమునకు ఎద్దాని నెట్లు చేయవలయునో చెప్పబడినది. ఇట్లే పురుషుడు ఏది చేసిన అథమస్థితి నందునో అయ్యది నిషేధింపబడినది.

ఇట్లు భారతీయుల ప్రవృత్తికి జీవగఱ్ఱయగు వేదములు సంఖ్యకు నాలుగైనను శాఖాభేదముచే బహు సంఖ్యాకములైనవి. అనగా ఆయా వేదములను దేశమున ప్రవర్తింపజేసిన ప్రవర్తకులను బట్టి ఆయా శాఖలేర్పడినవి. అందు యజుర్వేదము నూట యొక్క శాఖలుగాను, సామవేదము వేయి శాఖలుగాను, అథర్వణము తొమ్మిది శాఖలుగాను, ఋక్కు ఇరువది యొక్క శాఖలుగాను చీలి మొత్తము వేదమంతయు వేయి నలువది యొక శాఖలుగా వృద్ధి నందినది. ఇయ్యది పాతఞ్జలమగు విభాగము. వేదశాఖలను దెలుపు చరణవ్యూహము మున్నగువాని యందు ఈ సంఖ్య ఈషద్భేదముతో నొప్పు చున్నది

దీనిని బట్టి ద్విజులకు స్వశాఖాధ్యయనము విధింపబడి యుండుటచే వేదమును నిత్యాధ్యయనము గావించు ద్విజులలో పతఞ్జలి కాలము నాటికి ఒకవేయి నూట నలుబదియొక్క భేదములు కనుపట్టు చుండెనని యూహింప వచ్చును. కాని నేటికాలమున భారతదేశ మంతటను బరీక్షించినచో ద్విజులలో అన్నిశాఖల వారలలో పది పంఢ్రెండ్రు శాఖలకు లోగానే కన్పట్టు చున్నవి. దీనిని బట్టి నేటి కాలమునకు వేద విద్య క్రమముగా ఎంత వరకు క్షీణించినదో మనకు తెలియగలదు. ఈక్షీణత పూర్వకాలముననే ప్రారంభమైనట్లు మన ప్రాచీన వాఙ్మయమును బట్టి తెలియును.

## స్మృతులు

భారతీయుల ధర్మముల కన్నింటికిని వేదములే పరమ ప్రమాణమగుట చేతను అట్టివేదములు నానాముఖములుగ నుండుట చేతను వేదములలోని ధర్మములు చాలా సూక్ష్మేక్షికతో చూచినగాని తెలియ బడక పోవుటచేతను, తత్తద్ధర్మబోధకములగు వేదశాఖలు కొన్ని నశించి పోవుట చేతను భారతీయుల ధర్మములను సువ్పష్టముగ వారలకు దెలిపి వైదిక ధర్మము ప్రవర్తింప జేయుట యొకకాలమున యావశ్యక మైనది. అందులకై తమ తపస్సంపత్తిచే సత్యద్రష్టలగు ఋషులు ఐహికములు ఆముష్మికములును అగు ధర్మములు సువ్పష్టముగ జనులకు నిర్వచించి ప్రవర్తింప జేయవలసి వచ్చినది. అందులకై స్మృతులు బయలు వెడలినవి. స్మృతియను నామము చేతనే ఈయవి స్మరించి వ్రాయబడినట్లు అర్థమగు చున్నది. సనాతన ధర్మపరాయణులగు భారతీయులు వేదములు భగవంతుని ముఖము నుండి అప్రయత్నముగనే ప్రాణుల ఉచ్ఛ్వాస నిశ్వాసములట్లుబయల్వెడలిన వనియు, అందుచే నయ్యవి అపౌరుషేయములనియు, అందు చెప్పబడిన ధర్మములను మనము మార్పరాదనియు విశ్వసింతురు. ఇక స్మృతులన్ననో మన్వాదులచే స్మృతములగుట వలన మానుష కల్పితములనియు అవ్వానికి వేదము సంపలి విషయమును బోధించుట చేతనే ప్రాముఖ్యము సిద్ధించుననియు తలంతురు. ఈమన్వాది స్మృతులయందు ఆర్యుల యధ్యాత్మికములు సాంఘికములు రాజకీయములు అగు కర్మ లన్నియు ధర్మ బద్ధములగా నంస్కరింపబడి ప్రచారము గావింప బడినవి. పురుషుడు వేకువ లేచినది మొదలు మరల రాత్రి శయనించు వరకుగల అన్ని విధములగు కర్మలును, అట్లే మాతృగర్భ ప్రవేశము మొదలు మరణము వరకు గల కృత్యములును మరణా నంతరము తత్సంబంధులచే గావింప బడవలసిన కర్మలును గూడ సక్రమముగా దేశకాల నియమములతో నిర్వచింప బడియున్నవి. జాగ్రత్తతో మనము పరిశీలించిన ఈ స్మృతులందు తెలుప బడిన కర్మలలో జాలవరకు సాంఘికాదులు కొన్నిపక్క మిగిలిన యదృష్టములగు ధర్మములకు సంబంధించిన విషయములు, తదనుకూలములగు నాచారములు, అనాది కాలమునుండి నేటివరకు ఒకే రీతిగానే ప్రవర్తించు చుండుట ఒక అపూర్వమగు విషయమే. ఇట్టి అనూచాన సంప్రదాయము మరి ఏదేశము నందు గానము. తక్కిన దేశముల యందును తక్కిన మతముల యందును ఇట్టివి ఆయాదేశము లందలి ఆయా ప్రసిద్ధ పురుషులచే తత్తత్ కాలముల యందు చెప్ప నలవి కాని మార్పులను బొందింప బడినట్లు చరిత్రా ధారముల వలన మనలకు దెలియ వచ్చు చున్నది. ఇక ఈశ్రౌత స్మార్తములగు మన ధర్మములును ఆచారములును కేవలము మూఢాచారములుగాక పురుషతేజోభి వర్ధకములని నేటి శాస్త్రజ్ఞులు సప్రమాణముగ ఋజువు చేసి యుండుటగూడ ఒక విశేషవిషయమేగాని తన్నిరూపణము ప్రకృతమిచట అప్రస్తుతము. ఈ స్మృతి గ్రంథములనే ధర్మశాస్త్రములని గూడ వ్యవహరించుట గలదు. ఏనాడు స్మృతులు ఆర్యవ్యవహార ధర్మములకు ఆవలంబములుగా ప్రమాణ పదవిని అధిష్ఠించినవో ఆనాడు స్మృతి గ్రంథములలో ఒక ప్రమాద స్థితి గూడ ఏర్పడినది. కొందరు సాహసులు తొలుత తాము వైదిక ధర్మముల యందు అనగా మన్వాది శిష్ట స్మృతి బోధితమగు ధర్మము

నందు తమ యుచ్ఛృంఖల వృత్తిచే విముఖులై తమచేత అవలంబింపబడు అవైదికమగు నాచారమును లోకమున ప్రచారమును గావించుటకై తమ పాండిత్య ప్రకర్ష వలన కొన్ని గ్రంథములను రచించి అయ్యవి ఋషికర్తృకములు అను భ్రాంతి పుట్టునట్లు ఋషుల పేరిట ప్రచురింప గడంగిరి. అట్లే మరికొందరు తమకభీష్టములను తమ వే నాచరింపబడు ననార్య ధర్మములను శాస్త్రీయములను జేయుటకై ఆనాడు ప్రసిద్ధములగు స్మృతుల యందు ప్రక్షిప్తములుగా జొప్పింప దొడంగిరి. ఇట్టి దురవస్థయే వేదశాఖలు కొన్ని లోపించిన వెనుక ఉపనిషత్తుల యందు కూడ వెల్వడి అవైదిక సిద్ధాన్త బోధకములగు పెక్కులుపనిషత్తులు వెలసినవి. అల్లోపనిషత్తను గ్రంథము ఉపనిషత్తుగ నేడు ప్రకటింప బడినదని తెలియు చుండుటచే మన ఉపనిషత్తులస్థితి ఎట్టిదో యూహింప వచ్చును. అందుచేతనే శిష్టులు ఉపనిషత్తులలో పండ్రెండింటికి మాత్రమే పరమ ప్రామాణ్యము నొసంగిరి. ప్రకృతము స్మృతులలో గలిగిన ఈ రెండు విధములగు ప్రమాదములలో ప్రసిద్ధ స్మృతులందు ప్రక్షిప్తములను జేర్చుట కంటె ప్రత్యేక స్మృత్యాభాసములను రచించుట చేతనే గ్రంథ కర్తల అభీష్టము కొంత నెరవేరెను. ఏలయన ఆనాడు దేశము నందలి ధర్మప్రవర్తకులకు శిష్టస్మృతులు వేదములవలె అధ్యయనాదులచే సతత పరిచితము లగుటవలన వీరల ప్రక్షిప్తభాగములు లెక్కకు రాజాలక పోయెను. కాని ఆర్య ధర్మ నిర్ణయమున నేడు మాత్ర మాశ్లోకములు కొంత విసంవాదమును గలిగించుచున్నవి. ఇక స్మృత్యాభాసములన్నను ధర్మప్రమాణ నిర్ణయమున ఆనాడే కొంత యలజడిని కలిగించినట్లు తెలియుచున్నది. కావుననే ప్రమాణనిర్ణయమున ప్రాచీనులు స్మృతిసామాన్యమంతయు ధర్మనిర్ణయమున ప్రమాణమగునా యని ఆశంకించి వేదోక్త ధర్మమునకుగాని వేదానుసారి మన్వాది శిష్ట స్మృతులు బోధించు ధర్మమునకుగాని విరుద్ధార్థ బోధకములగు స్మృతులు ధర్మనిర్ణయమున నెంత మాత్రము ప్రమాణములుకా జాలవనియు అందుచే నయ్యవి శిష్టాపరిగ్రాహ్యములనియు నిర్ణయించి యున్నారు.

ఇట్లే కొన్ని సూక్ష్మములగు ధర్మములు గ్రంథము నందు నిబద్ధములుగానివియు గొన్ని గలవు. ప్రజల యొక్క ధార్మిక వ్యవహారముల యందు ఒకానొకచో కొన్ని విశయములు గల్గుటయు అట్టి సమయమున ధర్మవృద్ధులగు మహర్షులు ఒక పరిషత్తునేర్పరిచి అందా ధర్మ సూక్ష్మములను నిర్ణయించుటయు ప్రాచీన సంప్రదాయము. అట్టి పరిషత్సభ్యుల స్వరూపమును మనువు—

"త్రైవిద్యో హేతుకః తర్కీ నైరుక్తో ధర్మపాఠకః।
త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాత్ దశావరా॥
(మను ౧౨—౧౧౧)

అని నిర్వచించి యున్నాడు. ధర్మనిర్ణయమును బట్టి దేశీయుల సచ్ఛీలము వృద్ధి నొందును గావున అట్టి ధర్మమును జాగ్రత్తతో నిర్ణయింప వలయుననియు అట్టి నిర్ణయమున 'ఓట్ల'తో నెంత మాత్రము ప్రయోజనము లేదనియు, అర్థకామాసక్తుడు కాని ధార్మికు డొక్కడైనను ధర్మమును నిర్ణయింప నర్హుడనియు మనువు తలంపు; దీనినే యాతడు—

"ఏకోపి వేదవి ద్ధర్మం యం వ్యవస్యేద్ద్విజోత్తమః।
సవిజ్ఞేయః పరోధర్మః నాజ్ఞానాముదితోఽయుతైః"
(మను ౧౨—౧౧౩)

అని చెప్పి యున్నాడు. ఇంత జాగ్రత్తతో మనువు చెప్పుటకు కారణమేమనగా భారతీయుల పవిత్రతమగు విశ్వాసము—

"ధర్మ ఏవ హతో హన్తి, ధర్మోరక్షతి రక్షితః।
తస్మాద్ధర్మో న హన్తవ్యో మా నో ధర్మో హతోఽవధీత్॥"
(మనువు ౮—౧౫) అని

ఇట్టి దృష్టిగల ధార్మికులగు మహర్షులు ఎంత జాగ్రత్తతో ధర్మమును చూచు చుండిరో పరిపాలకులచే ఆ ధర్మమును పరిపాలింప జేయుచుండిరో సహృదయులు గ్రహింప గలరు.

(సశేషము)

# మానవజీవిత పరమార్థము

శ్రీ వేదాం తిరువేంగళాచార్యులు, గుంటూరు.

నిర్వాణం సర్వధర్మాణాం నివృత్తిః పరమాస్మృతా ।
తస్మాన్నివృత్తిమాపన్నశ్చరేత్సర్వాంగ నిర్వృతః ॥
మహాభారతము శాంతిపర్వము

మానవులమగు మనమంతరమును "పునరపిజననం పునరపి మరణం" అని శ్రీ శంకరభగవత్పాదులు వచించినట్లు జనన మరణ ప్రవాహరూపమగు యీ సంసారమునబడి దరితోవ కనబడకున్నాము. మన కెన్నడును ఈ స్థితి తప్పనిదేనా? ఇట్లుండుటయే పరమార్థమా? మనకేదైనా గత్యంతరమున్నదా? అను విషయము నాలోచింపవలసియున్నది. ఎంతటి మేధావంతులుగూడ ప్రపంచమునందలి దుర్గ్రాహ్య విషయములనుగూర్చి విమర్శించి నిర్ణయింతురేగాని మానవుని జీవితపు పరమార్థమునుగూర్చి యాలోచించుట యరుదు. బాహ్యవస్తు విమర్శనమేగాని ఆంతరంగిక విషయపరిజ్ఞానము మృగ్యము. ప్రాచీనులు "ఆత్మానం విద్ధి" యని మొట్టమొదట తన్నుతానెరుగవలెనని నుడివిరి. ఇదియే "ఇంటగెల్చి రచ్చగెల్చుట" యను తెనుగు సామెత. మన యాత్మకు నెలవు శరీరమే కదా? అట తత్త్వమును దెలిసినగాని గెలువవలసిన (ఇంద్రియములు - అరిషడ్వర్గములను) గెలువజాలడు. తరువాతగాని బాహ్యవిషయములను గెలువగల సామర్థ్యమతని కేర్పడదు. అని యాసామెతయొక్క తాత్పర్యము. మొట్టమొదట తనయాత్మనుగూర్చి ప్రతివారును తెలుసుకొనవలసిన యావశ్యకతయే. మనయాత్మలు మన శరీరములకన్న వేరుగనున్నవా? లేవా? మనము జీవించునది ఆత్మచేతనా? ప్రాణముచేతనా? ఆత్మ లేకున్న జీవితము నడువదా? యీ విషయములు విచారింపవలసియున్నవి. ప్రాచీనులు "నప్రాణేన నాపానేన మర్త్యో జీవతికశ్చన । ఇతరేణతు జీవంతి యస్మిన్నేతావుపాశ్రితౌ" అని విచారించి నిర్ణయించియేయున్నారు. ఆ విచారమునే మనము సరిగా తెలిసికొని యనుభవమునకు దేవలయును. అట్టి మన జీవితమును దాని పరమార్థమును బాగుగా విచారించుకొనవలయును. ఆత్మ లేనిదే కేవలము ప్రాణము వలన జీవితము నడువదనియు జీవితమున కాత్మయే ప్రధానమనియు తెలియవలెను. ఇక నా జీవితమెట్టిదో విచారింతము.

మన జీవితము రెండు విధములు—ఈ లోకములోనిది. పరలోకములోనిది ఈ రెండుయందును వివేకముతో ప్రవర్తించునదియు, తద్భిన్నమును అని రెండవ విభాగము. ఈ లోకమునందలి జీవితము బాల్యమునందును రాగాంధమగు యౌవనమందును వివేకముతో ప్రవర్తింపబడుట కడుదుర్లభము. ఇట్లే పరలోక జీవితముగూడ ఫలాభిలాషతో కర్మలనొనరించి స్వర్గనరకాదుల బొందుట.

ఇంక ఉత్తమమగు జీవితము - గురు ముఖమున యుక్తముగా సత్యయనమొనర్చి తత్త్వమును గ్రహించి ఫలాభిలాషను వీడి స్వధర్మమును గావుచు జ్ఞానవైరాగ్యాదులచే భగవంతు నారాధించునది—ఇది యీలోకపు ఉత్తమ జీవితము. ఇక పరలోకమున నిట్టి యుత్తమ జీవితము:—తత్త్వజ్ఞానోపాసనా ఫలితముగా నేర్పడు బ్రహ్మానుభవ జీవితము.

ఈ ద్వివిధములగు రెండు జీవితములందును మనము మన యభిలాషలకు ప్రతిబంధకములు లేకుండ జీవింపవలెంతుము. అందుకు మిగిలిన లోకములుగూడ శాంతి సమృద్ధితో కలకలలాడుచుండుట యావశ్యకము. అపుడే మన జీవితముగూడ ఆనందము నొందగల్గును. మృష్టాన్నము సమకూడుటయేదుర్లభము. లభ్యమైన మృష్టాన్నమనుభవించుట యంతకంటే దుష్కరము. కావున లోకమున సుఖముగా, నిరుపద్రవముగా జీవింపకల్గువారందరును శాంతిని సమ్మానించుకొనక తప్పదు. చివరకు దేవలోకము, బ్రహ్మలోకము, వారైనను శాంతిని సమకూర్చుకొనక తప్పదు. అట్టి శాంతి పంచభూత ధాత్రికముల శాంతితోగాని మనకేర్పడదు. అందువలననే మంత్రపాఠము లంతటను శాంతి పఠింపబడును. అట్టి శాంతి మనకు మనోవాక్కాయములందు శాంతిని సమకూర్చును. మంత్రము చివర "ఓం శాంతిః, శాంతిః, శాంతిః" అని ముమ్మారు శాంతి పఠింపబడును. అచట పరబ్రహ్మ స్వరూపమును తద్వాచకమును తత్త్వమునగు ప్రణవమును గూర్చుటలో నొక విశేషముగూడ వ్యక్తమగుచున్నది. క్రమముగా మనోవాక్కాయములందు శాంతి సమకూడవలసిన యావశ్యకతతోబాటు శ్రీమన్నారాయణుని అనుస్మరణము ఆవశ్యకమనియు పై త్రివిధములగు శాంతులను సమకూర్పగలుగువాడు శ్రీమన్నారాయణుడే యనియు అతని యనుస్మరణము తద్వాచకమగు ప్రణవముతో కర్తవ్యమనియు నట వ్యక్తమగును.

ఇప్పటికి శాంతియే మానవ జీవితమునకు పరమార్థమని యేర్పడినది. కాని అట్టి శాంతి సమకూడు నుపాయమేమి? శ్రీమన్నారాయణుడు శాంతి సంధాతయని వ్యక్త

మైనను ఆతని వాస్తవస్వ రూపమేదియో, అతనికిని ఈ శాంతికిని గల సంబంధ మెట్టిదియో ఆతడెట్లు యీశాంతిని సమకూర్చునో. ఈ విషయములను తెలిసి కొన వలయును. వాస్తమగు శాంతి లభింప వలయునన్న వాస్తవజ్ఞాన మావశ్యకము. "తత్త్వజ్ఞానాచ్ఛాంతిః" అని పెద్దలనిరి. వాస్తవ జ్ఞానము వలన లబ్ధమైన శాంతియే శాంతిగాని మిగిలినది శాంత్యాభాసము. వాస్తవ సుఖమును గోరువారు నిజమైన శాంతిని బొందవలెను. ఆట్టి శాంతికి తత్త్వజ్ఞాన మావశ్యకము. తత్త్వజ్ఞానము లేనివానికి స్వర్గాది పత్యముండినను వాస్తవ శాంతి కలుగనందున వాస్తవమగు సుఖము చేకూరదు "స్వర్గేపి పాతభీతస్య క్షయిష్ణో ర్నాస్తి నిర్వృతిః" అని యున్నది గదా! తత్త్వజ్ఞానము వలన శాంతి సుఖములు లభించునని ప్రాచీనులు నిర్ణయించియే యున్నారు. వారి యనుభవమును దర్శన శాస్త్రములుగా రచించిరి. మనయందలి ప్రేమ వాత్సల్యముల చేతనే వారు వారి యను భవమును "దర్శనము"లుగా మనకు ప్రసాదించిరి. అందుకనియే "మాతా పితృ సహస్రేభ్యోపి వత్సలతరంశాస్త్రం" అను నానుడి; అంతియేగాక వారి యనుభవమె మనకు శాస్త్రరూపమున ప్రసాదించుటచే "యథా భూత వాదిహి శాస్త్రం" అని గూడ పెద్దలందురు.

అయిన నీశాంతి యేర్పడుటకు మార్గమేది? తృప్తి, సంతుష్టి యనునవి యుండిన తప్పక శాంతి లభించును. అసంతృప్తి యుండిన శాంతియే కనబడదు. గనుకనే పెద్ద లిట్లంటిరి.

వ్యాప్తిం జెంపక పగవక।
ప్రాప్తంబగు కొంచెమైనం బది వేలనుచున్
దృప్తిం జెంపని మనుజుడు
సప్త ద్వీపములనైన జక్కంబడునే (భాగవతము)

ఈ యసంతృప్తికి యాశాపాశము కారణము. ఆశాపాశా బద్ధులు సకల లోకములకును బద్ధులగుదురు, దాసులగుదురు.

ఆశాయా యే దాసాస్తే దాసాస్సర్వ లోకస్య।
ఆశా యేషాం దాసీ తేషాం దాసాయతే లోకః॥

అని గదా! సూక్తి; ఈ యాశవలన రాగద్వేషము లుదయించును. రాగద్వేషములు తత్త్వ జ్ఞానమునకు సర్వథా ప్రతి బంధకములు. ఈ రాగద్వేషములను జయింప వలెనన్న ఇంద్రియముల సరికట్టవలెను. ఇంద్రియములను నిరోధింప వలేనన్న చిత్తవృత్తి సరికట్ట వలయును. చిత్తవృత్తి సరికట్టుటకు పరమేశ్వరుని ధ్యానమావశ్యకము; పరమేశ్వరుని యందు చిత్తవృత్తి గల్గినవానికి ఇంద్రియములు వశమగును, "వశేహియస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా" అనుట వలన ఇంద్రియములను విషయముల నుండి మరలించి చిత్తవృత్తిని పరమేశ్వరు నందుంచినచో తత్త్వజ్ఞానము సులభము. తత్త్వజ్ఞానము వలన శాంతి సుఖములు సుగమములు. ఇట్టి శాంతికి పరమ సాధనముగా భక్తి ప్రపత్తులను సుడివెదరు. ఇంతకును పర్యవసితార్థము వాస్తవ సుఖమునకు శాంతి కారణమనియు, అట్టి శాంతికి తత్త్వజ్ఞానమావశ్యక మనియు, తత్త్వజ్ఞానమునకు ఇంద్రియ నిరోధమావశ్యక మనియు, అట్టి ఇంద్రియముల నియమించుటకు పరమేశ్వరుని యందు భక్తి, ప్రపత్తియు యావశ్యకములనియు తేలినది. శాంతి కలిగిన మానవునకు నిత్యసుఖము లభించునని మహాభారతమున నిట్లు వచింప బడినది.

"శమార్థం సర్వశాస్త్రాణి విహితాని మనీషిభిః।
సఏవ సర్వశాస్త్రజ్ఞః యస్య శాంతం మనస్సదా॥
యత్ శ్రుతం న విరాగాయ న ధర్మాయ న శాంతయె।
సుబద్ధమపి శబ్దేన కాక వాశిత మేవతత్॥"

అని; ఇట్టి శాంతి లభించుటకు సర్వ ధర్మములను పరిత్యజించిన వానికైనను భగవంతుని శరణొంది యాతని కైంకర్యము వలన గూడ లభించునని శ్రీ కృష్ణభగవానుడు గీతయందిట్లు వచించెను గదా!

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

అని; అనగా కేవలము భక్తిభావమున పరమేశ్వరు నారాధించుట వలన గూడ శాంతి సుఖములు చేకూరునని తాత్పర్యము. సన్న్యాసమువలని తత్త్వజ్ఞానము, భక్తి, (కర్మ జ్ఞాన రూపమగునది) ఈ రెంటి యందును పరమేశ్వరుని కైంకర్య రూపమగు కర్మయోగమే విశిష్టమైనదని గీత యందె చెప్పబడినది.

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయస కరావుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతె॥

అని; కనుక పరమాత్మ కైంకర్య రూపమగు కర్మనొనర్చు వానికి బ్రహ్మయందా హితములగుట వలన నవి కర్మప్రతిబంధకములు కాకపోగా ఫలమును పరమాత్మయందర్పణమొనర్చును కనుక నైష్ఠికమైన శాంతి-భగవత్ప్రాప్తిరూపమగు శాంతి-తప్పక చేకూరును. మోక్షము గూడ భగవత్ప్రాప్తి రూపమగు నీ పరమశాంతికే ముఖ్యమగు పరమ సాధనము, కనుక భగవ దారాధనమును తప్పక యొనరించుట మన జీవితమునకు అత్యంతావశ్యకము. ఈ విషయమున మన మతాచార్యులు సమాస్తార్య జాతికిని పరమ పూజ్యులునగు శ్రీ శంకర భగవత్పాదులు, శ్రీ భగవద్రామానుజులు, శ్రీ మధ్వాచార్యులు నిరూపించిన మార్గములు యించుకంత నిరూపింప బడును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

# WE LOOK BACK

*By*

V. VENKATAKRISHNAYYA

*Editor*

Wtih this issue ARADHANA having completed its one year of work enters to the second year in the cause for which this journal was started as laid down in the Government order under which this journal has been working. The primary object and the rationale of this journal's existence is the spread of temple culture, firstly in Andhra and secondly over a wider field. This object we have sought to achieve by conducting this journal in two languages, Telugu for Andhra and English for the wider public. Articles have been published dealing with all aspects of the temple and written by acknowledged masters in their special fields. ARADHANA has by now gathered round itself a band of devoted Journalists whose zeal and erudition are beyond question. ARADHANA feels that it can not sufficiently thank them for their gracious co-operation unfailingly extended to it.

We may be pardoned for giving expression to a note of sorrow when we look back on the work of this year. Two of the journal's pillars have gone down on in the persons of Sri C. V. L. Varaprasada Rao garu and Sri Sri Sri Jagadguru Kalyanananda Bharati Mantacharya Swamula varu. The first of them was practically the founder of this journal. Between him and Dr. R. Subrahmanyam, Superintendent of Archaelogy, Guntur, the idea of a Journal exclusively devoted to temple culture took shape long ago and when Sri Varaprasada Rao garu became the Deputy Commissioner for Endowments he worked hard to make this dream a reality and with the gracious help of the Commissioner and the Government he has succeeded in bringing out this journal. The labour of birth entails numerous travails, all which he has been able to see it through. Mistakes are inevitable in venturing into a new and unbroken field but on that account the good of worthy men should not be interred with their bones.

Sri Swami, from whose hand this journal has received numerous marks of grace, including a regular series of valued contributions, was a type by himself. He had vast erudition and was a master of Sanscrit, Telugu, and English, in all of which he wielded a facile pen. He was an authority on Mantra, Agama, Tantra, Mimamsa and Jyotisha sastras a unique range and variety of scholarship to be met with in these days. A daring thinker, but zealously devoted to Sanatana Dharma, he was a becon light for all those believers, who wanted just such a champion who could meet, argument with argument, pramana with pramana, any propounder of unorthodoxy, western or eastern.

The death of these two pillars no doubt a serious loss and handicap for Aradhana. But we should like to believe and hope that our country can throw up many such to step into the breach in the fight for the cause for which they had literally spent their lives. It was a Roman Consul who replied to a victor, who was sympathising with him on his heroic death with the remark that Rome had few to compare with him, stringingly that Rome had numbers like him. Hanuman tells Sita that 'The leaders are not sent on errands. that he was the least of the Vanara hordes'. We hope that persons in

authority and scholars will flock in, to fill the gap created by the sudden demise of the above mentioned stalwarts.

However, we are also sorry to confess that we have not received from the public the support we expected. Our roll of subscribers is short. Making all allowance for inevitable delays yet when we consider that in Andhra alone where we find more than six thousand religious institutions, the numbers we have been able to secure as our subscribers from them are depressingly poor. This Journal is 'anent the temples, for the temples, and by the temples in Andhra State' and is published under the aegis of Hindu Religious and Charitable Endowments Department of this State, which fact should be sufficient gaurantee that the Journal will be conducted with all care and efficiency. This is a unique journal; and there is no other journal anywhere, striving for these objectives. We hope that with the help of all the cultured in the land. we shall have a brighter future.

The co-operation we invite from the devoted general public in Andhra, while it does not exclude a call for financial support, is on a still higher level. We believe that there will be none with a soul so dead as not to proudly acknowledge the spiritual debt we owe to those ancient rishis who have given their all, all comforts and several times even their lives to discover the paths, very secret in their very nature and very risky for their posterity. Any one with the least knowledge of Agamas will easily know that one has to be prepared for the worst when venturing on these hazy realms between life and death where every thing is shadowy and the next step unwarily taken may land us into a bottomless ravine over a precipice. Yet those pioneers have taken all this trouble to secure to their posterity the Gupta Vidyas, whereby alone man ascends into the realms of immortality, where there is only bliss in-effable and eternal. The Ancients called our obligation to these benefactors the Rishi Rina and they have also prescribed a way of discharging this Rina. The way is simple. Learning what they have taught and teaching to others and thereby propagating these Sastras is a simple way of discharging this debt. We hope we are still holders of the view that an undischarged debtor will have the worst of it on the other side of the veil-of death-the secrets of beyond which no mortal returns to unfold, once he crosses over to the other side. Thus it becomes imperative that scholars in these rare sastras should propagate them and should bestow on others that knowledge and Aradhana affords just the kind of forum they require for the propose.

The Historian's contributions will be welcomed by this journal since they reveal to us the faith by which our ancestors lived and died leaving to us so much unperishing heritage, which is still the glory of this country. The walls of temples bear all records which help us to reconstruct those ancient days with a degree of accuracy surprising indeed, when we consider the ravages of time, wind and rain, and the hand of the invading depredator, inspite of which they survive to remind us of those happy days of the infancy of our race. The inscriptions on temple walls reveal to us not only the lives and the events of the kings and Generals but also of the poor and the lowly and their faith. We had been then the companions of gods and the historian who would reveal to us that mystic relationship will be our greatest creditor. Yet very few are working at these materials and we are sorry that till now practically only one or two have been making the results of their labour available to us. The pages of ARADHANA will ever be open

to all the other friends too when they choose to come in. We hope that moment will be sooner than later.

The Epigraphist and the Archaeologist are the two arms of the historian and our appeal to the latter includes both of them. On the shoulders of the archeologist there is a greater burden as just now there is a fear that new heresies are being forged by the so called archaeologists. One of them we may mention as an example. It is being propagated, on fairly flimsy grounds, that Siva is a Dravidian God and not an Aryan God, that he was adopted by the Aryans later. The evidence for this heresy is the wonderful discovery of a solitary figure of a man in Padmasana, with three horns above him, and with a bull resting by the side. False history is capable of doing more harm than good and the activity of the Dravida Kazagam etc. in the south should make us remove the mania resultant of false history. The so called history is now, instead of uniting people, making them hostile of each other. It therefore behoves the historian, archaeologist and the Epigraphist to turn his attention to the temples, study them from their angles of special study and give us a true picture of our ancient religious culture as it truly was.

To the Silpi we have got a special appeal to make. Unfortunately the race of Andhra Silpis is now practically extinct and the few that remains of the race are languishing without support from the public. Even the books on Silpa Sastra are getting worm eaten. It becomes the duty of every silpi to at least publish what he knows, so that this knowledge may survive for the future Silpis. The Government is keen on restoring temples in decay and the Silpis will occupy their former place of honour very soon. So we hope that the pages of ARADHANA will have enlightening articles regularly on Silpa with special reference to temples. We hear that the Madras Government is shortly opening a Silpa School near Mahabalipur. We hope that some enterprising temple authority will depute a competent person to study there and make that knowledge available to the Andhra Public through the pages of ARADHANA.

Every village temple has got its own story of its genesis and growth and those stories are intertwined with stories of saints, local history, tradition and fable. The old tradition lives as yet in the mouths of the older generation who believed it and lived in and by it. If these elders depart there is no way of preserving the old fable and tradition. The trustees of temples and the educated and cultured of the village shoud take care betimes to preserve the local history and ARADHANA welcomes such stories. The contributors need not shrink back in the fear that the form of their lobours will not be artistic. The matter it is that is important.

It is a long long way to the goal we have set ourselves and even the effort will be praiseworthy even if it be at a snail's pace. In our philosophy there is a Pipeelika way as well as a Vihanga marga i. e. the way of an ant creeping up to the topmost branch of a tree in contrst to the bird's way of flying straight to the top-point. We hope that our labours will be appreciated and supported.

---

115. మవాప్నోతి పాలనా దచ్యుతం పదం । ౭॥దేవద్రవ్యం తిలార్థార్ధ మర్ధం భక్షతి యో నరః శ్వా

116. నయోనిశతం గత్వా చాండాలే ష్వభి?(పి) జాయతే ॥౮॥

There is another inscription on a slab in the temple of Gopalaswami of Durgi. This is of the time of Queen Rudrama Mahadevi who succeeded Ganapati Deva. This inscription states that while Rudrama Mahadevi who was the Pattoyuddhala of Ganapati Deva was ruling at Orungal and her servant Gandapendara Janniga Devaraju was govering the country from Panungallu to Marjavada, a Karnam by name Namayya consecreted the image of Gopinatha at Dugya in Pallmadu and made a grant of lands and assigned certain taxes for his worship.

It has already been stated above that the Kayasta family helped the Kakathiyas to come to power. There were also a number of other families like the Ayya family, the Malyala family, the Induluri family which were feudatory chieftains of the Kakathiyas. Gangayya-Sahini was the first member of the Kayasta family. He was assisted by the Minister, Namadeva Pandita and Jannigadeva. This inscription also mentions that Jannigadeva was ruling the country. It also shows that by the time of this inscription, Gangayya-Sahini ceased to exist and it is probable that Jannigadevaraju might have succeeded him. The extent of the dominion of these Kayastas remains unchanged. It is interesting to note that the capital is referred as Orungallu. This is a mediaeval term which was used for Warrangal. There is one school of thought which states that Orungallu is a corrupt form of Orukallu which means in tamil "one stone" and the sanskrit translation of this is "Ekasila Nagara" which also means one stone. It is of course a matter for consideration how far this can be accepted. The inscription is dated in Saka 1191, జేష్ఠ శుద్ధదశమి Monday.

By astronomical calculations it can be seen that in Saka 1191 జేష్ఠ శుద్ధదశమి ends on Sunday and corresponds to May, 12, 1269 A.D. The word Monday is probably an error. The inscription runs to 110 lines and is as follows.

1. స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహా
2 మండలేశ్వర పరమ మాహేశ్వర వినయవి-
3. భూషణ శ్రీ [అన్మ] కొండ పుర వరాధీశ్వర
4. శ్రీ స్వయంభూదేవ దివ్య శ్రీ పాదపద్మారా-
5. ధకులైన కాకతీయ్యు గణపతిదేవ మహారా
6. జుల [పట్టో] ద్ధతి యైన శ్రీ రుద్రమహాదేవి
7. ఓరుంగల్లు నిజరాజధానిగాను సుఖసం
8. కథా వినోదంబులం బ్రిథివి రాజ్యము సే
9. యుచు-డగాను తత్పాదపద్మోపజీవి
10. యైన స్వస్తి శ్రీ మతు మండళిక బ్రహ్మరా
11. క్షనగండపెండార జన్నిగ దేవరాజు పా-
12. నుంగల్లు మొదలుగాను మాజఱ వాడ దాం
13. కాను ఏలి సుఖలీలను రాజ్యము సేయుచు
14. ండగాను ॥ బ్రహ్మకులోత్తముండును కాస్య
15. పగోత్ర పవిత్రుండును నందాపుర అగ్ర-
16. హార ప్రభుముఖ్యుండును యైన స్వదరం
17. మల్లపరాజు కొడుకు కరణము నామన

18. య పల్లినాంటిలోని దుగ్య పట్టణమునం
19. దు శ్రీగోపినాధ దేవరం బ్రతిష్ట సేసి దేవ
20. ర అంగరంగభోగాలకు ఇచ్చిన వ్రిత్తి క్షే
21. త్రాలు స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౧౯౧
22. అగు నేంటి శుక్లసంవత్సర జ్యేష్ట శుద్ధ ౧౦ సో।
23. కరణము నామయ దుగ్యన తన వ్రిత్తి ఏల్న
24. ఇచ్చిన వెలిపొలము ఖ ౪ నీరునెల గం [గా]
25. సముద్రము ఉత్తరవుం గొంమునకు -
26. ఱతురు ౧ గంగానముద్రము దక్షిణకొ -
27. మున చవుటచెను....రెవినాఇని చెఱు
28. వు వెనకను....క్షదేనని వ్రిత్తి క్రయము
29. నిల్చి యిచ్చిన వెళిపొలము ఖ ౧ త్రిపురా -
30. రిదేవ నిమిత్తి దుగ్యను వెలిపొలము ఖ ౩
31. నీర్నేల గంగానముద్రము దక్షిణవుం
32. గొంమున అఱకట్టను గుఱుతులు ౧ కరణ
33. ము [వె] ంమ్మయ [తన వ్రిత్తి] వల్న నిచ్చిన వెలిపొ -
34. లమును శ్రీ రామేశ్వరభట్ల వెంమ్మయు తన వ్రి
35. త్తి వర్ని నిచ్చిన వెలిపొలము న ఖ వల్లబుండు
36. తన వ్రిత్తి వళ్ని నిచ్చిన వెలిపొలము న ౨ కోమ -
37. టిపెడెమాడి సెట్టి కొడుకు అన్నెయ ఇ.......
38. ఏ కుత్తికదేవరె వెట్ని వ్రిత్తి క్రయము వి [లిచి]
39. ఇచ్చిన వెలిపొలము న ౨ బ్రమ్మరాజు అ -
40. ప్పన సహస్రనామాల వెరుమాడి వ్రిత్తి క్ర -
41. యము విల్చి ఇచ్చిన వెలిపొలము ఖ ౧
42. మండయ కొమ్మయ తన వ్రిత్తీ కోలగొట్ట
43. పొలమున నిచ్చిన వెలిపొలము ఖ ౧ కొ -
44. మరగిరి దేవండు [మారె] వల్లి నిచ్చిన వెలిపొ -
45. లము న ౧౦ [వ] వ్వినాఇని కొమ్మినా ఇండు
46. ఉ [ప్పొ] ల నిచ్చిన వెలిపొలము న ౧౦ బొల్వి
47. నాఇని కొడుకు............అన్నమ
48. నాఇని కొడుకు....ల్లినా ఇండూను అతు
49. కూర నిచ్చిన వెలిపొలము న ౧౦ ఖర స
50. ంత్సర పుష్య శు ౨ గు। జోరమ భ
51. ట్ల వ్రిత్తి మగెసు వెలిపొలము విశ్వనాం
52 ధ భోట్ల వారితోడి పాలు న ౧౦ ను కర -
53. ణము నామయ విల్చి శ్రీ
54. గోపినాంధన్కి ధారాపూర్వకము
55. సేసె॥ నందన సంవత్సర కార్తీక శు ౧౧
56. గు। దుగె కంచి పెరుమాడి వ్రిత్తి వెలిపొల
57. ము మిరియాల తెరువు ఉత్తరం న ౧౦ నే
58. నూను కరణం నామయ క్రయం విలి
59. చ్చిశ్రీ గోపినాంధనికి సమర్పణ సే -

60. సె॥
61. శ్రీ [గోపి] నాథ దేవర వ్రిత్తి క్షేత్రాలు -
62. ....నేసిన క్రమము। దేవర అముదు పడి
63. ....ము నిర్మలమ ౨॥ అచ౯నబోగమున
64. కు వెలిపొలము ఖ ౩ దీపాలనూనెకు
65. [వెలి] పొలము న ౧౦ శ్రీప రంగభోగాలవారి
66. జీతరావులు మద్దెలవాండ్రు ౨ కి ఖ ౨ ఆవజ
67. కానికి ఖ ౧ కాళకానికి ఖ ౧ దాసెకానికి ఖ ౧
68. తుకానికి న ౧౦ మో [భ] రతకు ఖ ౧ పాత్రలు ౫
69. కి ఖ ౨ పాడీడిసియాణితలు ౧౦ కు ఖ ౨ న ౧౦
70. [వీర] ణ తిండ్లవారు ౪ ఖ ౧ [బొమ్మ....
71. డివానికి] న ౫ జేగంటలవారు ౨ కి న ౧౦ పకసం
72. కులవారు ౨ కి న ౧౦ ధవళసంకులవారు ౨
73. కి న ౧౦ [పెద్దగవుఙ్జు] వారు ౨ కి న ౧౦ నన్నగా
74. ళ వానికి న ఖ గాడగువానికి న ౫ దవ్వ కో
75. ల వానికి న ౫ అంగరేకకు న ౫ సువాసికి న ౫
76. తిరుమజ్జనానకు తీర్థాలు తెచ్చెడి కావడి వ-
77. డుగునకు న ౫ కంభపుముట్టి చెలగెడి ఊలి
78. గపు బానెనకు న ౪ సంప్రదాయము తెన్నకూ
79. తవానికి న ౫ అట్టు వెరసి జీతగావులవారు ౪
80. కూను వెలిపొలము ఖ ౧౬ న ౪ స్వస్తి శ్రీ మతు
81. [ని] స్సంకవీర బాల్నాణని మల్లిఖార్జున నాణంక
82. పు వారు ఇచ్చిన మేర శ్రీ గోపీనాథ దేవర వ్రి-
83. త్తి చెలుకాంపులు ఎవ్వరు డున్నినాను పంగ
84. తప్పు పంగసుంకము పన్ను కాని కదిరిశనము
85. ఏమేరల వారూను ఏమీం గానలేదు సవ౯మా
86. న్యముగాను సర్వబాధాపరిహారముగాను
87. ఆ చంద్రాక౯స్థాణగాను ఇచ్చె। దేవర దీపాల
88. కు నూనె నడవెడి గానువు ౧ కి అరిసుంకము
89. పన్ను కానిక ఎల్లమెరలూను సవ్వ౯మాన్యము। ఊ
90. రి ఉత్తరాన తొడ్లలోన దేవరకు పూవుందోంట ౧
91. కూరతోంట ౧ చాలూమూలాను ఉభయ
92. నానాదెసి వెక్క౯ండ్రూను దేవరకు ఇచ్చిన సుం
93. కము ఊరను ఏమిసరకులు అమ్మినాను
94. విల్చినాను గద్యనాన విసాము గొనెడిది। ఇ సుం
95. కము ఎత్తి దేవరకు శ్రీగంధమూను గుగ్గిలమూ
96. ను విడెము పోంకలూను అకులూ విల్చి త్రికా
97. ల అవసరాలకూను నంబులు నడువువారు
98. ఇంత వట్టు వ్రిత్తులూను మెరలూను॥ పల్లినా-
99. ండు ఎవ్వరు ఏలినాను ధమ్మ౯వు తప్పక నడ
100. పి ఇ పుణ్యము సేకోని ప్రిథివి రాజ్యము సేయ
101. ం గలవారు మంగళమహా శ్రీ శ్రీ శ్రీ

102 స్వదత్తం ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
103. పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥ ౧
104. స్వదత్తం పరదత్తం వ్వా యో హరేతి వసుంధరాం।
105. షష్టివర్ష్యసహస్రాణి విష్టాయాం జాయతే
106. క్రిమి ॥ ౨ ...దేవద్రవ్యం తిలార్ధార్ధమర్ధార్ధం భ
107. క్షతి యో నరః। శ్వానయోనిశతం గత్వా చాం
108. డాలేష్వపి జాయతే॥ 3 మాషమేకం సువర్ణ-
109. స్యా ద్భూమౌ దవ్యార్ధ మంగుళం। హరన్నర
110. క మాప్నోతి యావదాభూతసంప్లవం॥ ౪

There are also two short inscriptions one on a slab set up in the courtyard of the temple of Vankeswaraswami and the other on a slab set up in the temple of Gopalaswami. Both these are in Saka 1219 or 1297 A.D. corresponding to the cyclic year Hevalambi. We know that Queen Rudrama reigned about 1290 A.D. and this inscription is definitely of the reign of the last of the Kakathiyas, viz , Pratapa Rudradeva. The first inscription states that GOKULAPOCHI NAYAKA, a dependent of General Rudra Deva made a gift of lands to the temple of Vankeswara Deva of Dugya. The General is described as "SRIMAN MAHA SAKALA SENAPATHI" and is said to be ruling the land. The year of the grant is Saka 1219, cyclic year Hevalambi పుష్యశుద్ధ, ప్రథమ Thursday, Makara Sankranthi. Astronomically, the date works out to December 26, 1297 A.D. Thursday. The tithi was శుద్ధద్వాదశి 12. The inscription is in 16 lines and is as follows.

1. స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౨౧౯ అ-
2 [ంధి] హేమళంబి సంవత్సర। పుష్య శుద్ధ ౧ [గు]
3. రువారము నాండు మకరసంక్రాం [తిపు]
4. ణ్యకాలమునప్పుడు స్వస్తి శ్రీమన్మహా.......
5. సకల సేనాధిపతి రుద్రదేవండు ప్రిథివి [రా]-
6. జ్యము సేయుచుండగాను తత్పా [దపద్మో]
7. పజీవియైన పరనారీసహోదరరా....
8. యకవరద మక పాంచాలస్వామి దోహర-
9. గండ శ్రీ అహోబళదేవ దివ్య శ్రీ పాదపద్మారా-
10. ధకుండైన స్వస్తి శ్రీమతు గొంగుల పోచినాయు
11. ండు దుగ్య శ్రీ వంకేశ్వరదేవర అంగరంగభో
12. గాలకు ఇచ్చిన ప్రిత్తి దుగ్య పొలంలో ని నిధి వరిపాటి
13. తెర్వు ఉత్తరాన చవుట పడియలకడను రేగడు
14. ఖ ౧ నీర్నెల రేవినాయుని చెఱ్వు వెనక భావి ఉత్తరా
15. నకు। ఆపద్మట ప। ఇ చేలకు పంగ తప్పను-
16. [లగ] నుంకాలు సర్వమాన్యం

The next inscription states that Gongula Pochinayaka and Perumareddi Pothineni garu made gifts of land to God Gopinatha of Dugya while Rudra Deva, commander of all forces of the King was governing the country. The date of the inscription was Saka 1219 corresponding to the cyclic year Hevalambi, పుష్యశుద్ధ 12 corresponding to Thursday, Maha Sankranthi. In this inscription the tithi is given as 1 which was obviously incorrect. The dates of both these inscriptions are identical and the donor is also the same man. It is, therefore, clear that both these temples which are now completely

desolate and deserted, must have been very flourishing institutions in those days to merit grants from such high personages. The inscription is in 15 lines and is as follows:

1. స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౨౧౯ అగు నేంటి హేమ
2. శంబి సంవత్సర పుష్య శు ౧౨ గురువారమునా
3. ండు మకరసంక్రాంతిపుణ్య కాలము నప్పుడు
4. స్వస్తి శ్రీ మన్మహారాయ సకల సేనాధిపతి రుద్ర
5. దేవండు ప్రిథివి రాజ్యము సేయుచుండగాను
6. తత్పాదపద్మోప జీవియైన పరనారీసహోదర [రా] య
7. నాయక దండ్డ పలక పాంచాలస్వామి ద్రోహర
8. గండ శ్రీ అహోబళదేవ దివ్య శ్రీ పాదపద్మా -
9. రాధకుండైన స్వస్తి శ్రీమతు గోంగుల పోచినా
10. ఇండు దుగ్య శ్రీగోపినాథ దేవర అంగరం
11. గభోగాదులకు ఇచ్చిన వ్రిత్తి వెలిపొలము ఊరి
12. తూప్పుణన అడిగప్పల తెరువు దక్షిణాన రేగడు
13. పొలమేర పద్మటను ఖ ౨
14. దార వేముల పొలమున నీర్నేలనూ....నాతి కా
15. ల్వ వెనక ను మూలమఱతురు ౧

It will thus be seen from the inscriptions of Durgi that Kakathiya empire was having a very peaceful and undisputed sway over this area of Andhra Desa right through the three reigns of Rudra III, Ganapathi Deva and Rudrama and also Pratapa Rudra Deva. The inscriptions are an effective testimony to the greatness of the Kakathiya empire and enable us to have a correct idea of the chronology of this famous mediaeval Andhra Kingdom. It is a great pity that the existence of these inscriptions and the importance of the temples are not well-known and that no attempts are being made to preserve these valuable historical records.

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు.



# ĀRĀDHANA

(A RELIGIOUS MONTHLY MAGAZINE)

**MARCH 1956**

*Anent* THE TEMPLES
FOR THE TEMPLES
BY THE TEMPLES

*(in Andhra State)*

*" Go deep inside the temple and you will find me there"*—MOTHER



---

PUBLICATION OFFICE:

" ĀRĀDHANA "

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department*
*(Andhra)*

MASULIPATAM

ANNUAL SUBSCRIPTION Rs. 12/-

PER SINGLE COPY Rs. 1/-

# ఆరాధన


మన్మథ | మాసపత్రిక | ఫాల్గుణము


విషయసూచిక — పుట

## తెనుగు

గమనిక:—రెండవ సంపుటము నుండియు సంచికల పుటల సంఖ్య అనుస్యూతముగా నుండును. ఈ పుటల సంఖ్య తెనుగు వ్యాసములకు వేరుగను, ఆంగ్లవ్యాసములకు ప్రత్యేకముగను నియబడినది.



Note:—*(Continuous Number for Pages of English articles also is given for Vol. II.)*

## CONTENTS

PAGE

### ENGLISH

" ఆనందరూప మమృతం య ద్విభాతి "




సకృ దేవ ప్రపన్నాయ 'త వాస్మీ'తి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥

సంపుటము ౨ | మన్మథ - ఫాల్గుణము | సంచిక 3

ముఖచిత్రము - త్రివర్ణచిత్రము

# పరాశక్తి - శ్రీ భ్రమరాంబాదేవి - శ్రీశైల క్షేత్రము

యామామనంతి మునయః ప్రకృతిం పురాణీం
విద్యేతి యాం శ్రుతిరహస్యగిరో గృణంతి।
తామర్థ పల్లవిత శంకరరూపముద్రాం
దేవీం అనన్యశరణశ్శరణం ప్రపద్యే॥

—కాళిదాసమహాకవి.

యావద్భారతదేశమునందు శ్రీశైలక్షేత్రము ప్రఖ్యాతము - ఈక్షేత్రమునందలి ప్రధానదేవతలు శివశక్తిరూపులగు **శ్రీ మల్లికార్జునస్వామి, శ్రీ భ్రమరాంబాదేవి.** భారతదేశమునకు రక్ష లని సుతికెక్కిన అష్టాదశశక్తులలో నొకటి—పరాశక్తి - శ్రీ భ్రమరాంబ.

పూర్వమున చంద్రమతి యను తపస్విని మల్లికాదామములచేతను అర్జునపుష్పములచేతను పూజలొనర్చి పరమశివుని ప్రసన్నునిగాజేసి కొనినందున ఇచటి శివునకు **మల్లికార్జును**డనియు, ప్రసన్నుడగు పరశివుడు చంద్రమతిని అర్ధాంగిగాగైకొని "భ్రమరకీట న్యాయమమున భక్తుల జూతు"వని యనుగ్రహించినందువలన నిచటి శక్తికి **భ్రమరాంబ** యనియు ప్రఖ్యాత నామములు.

గీ॥ మల్లి కాపుష్పములతోడ మమ్ము బూజ
సల్పితివి కాన మల్లికార్జునుడ నేను।
"భ్రమరకీటక న్యాయము" భక్తులయెడ
జూతువట్లౌట భ్రమరాంబ వైతివీవు॥ అని

పరమేశ్వరానతిపలన ప్రథితమగు పరాశక్తిరూపమగు **శ్రీ భ్రమరాంబాదేవి**
త్రివర్ణ చిత్రమిందు పొందుపరుపబడినది—(స॥ సం॥)

---

# శ్రీ శైల క్షేత్రము

వి. వెంకటకృష్ణయ్య (ఎడిటర్)

"పునర్జన్మ నవిద్యతే"

అది యెవరికి? ఎప్పుడు? "శ్రీ శైలశిఖరం దృష్ట్వా" అని పెద్దల వాక్కు. శ్రీ శైలశిఖరము నొక్కసారి దర్శించిన చాలునఁట, మరి పునర్జన్మ లేదఁట. పరమశివుడు పాపములన్నిటిని కడిగి విభవంబు లిచ్చునఁట. కావున ప్రతిమానవుడును జీవితమున నొక్కసారియైనను శ్రీశైల దర్శనము చేసికోవలెనుగదా. అదిగాక మఱి ఇంకొక విశేషము.

"త్రిలింగదేశము మనదే నోయి
తెలుంగు లంటె మనమే నోయి"

అన్నాఁ డొకమహాకవి. "త్రిలింగదేశ" మనగా నేది? అన్నప్పుడు ఒక్కొక్క రొక్కొకపథమును దొక్కుచున్నారు; కాని తక్కినరెం డేవోయని సందేహము లున్నను శ్రీశైలము వానిలో నొకటి యనుట కేసందేహమును లేదు. అది మన దేశమునకు దిక్సూచివంటిది. ఏ దేవాలయమునను, ఏ పూ జా కా ల ము నం దు ను సంకల్పమును చెప్పుటలో "శ్రీశైలస్య ఆగ్నేయ-లేక, ఈశాన్యప్రదేశే" అనియే చెప్పకోవలెను. మనదేహమున నెత్తురువలె అది ఆంధ్రదైనందిన జీవితమున నొక్కభాగ మయినది.

శివకవులలో ప్రథముఁడు పాలకురికి సోమనాథుడు శివపండితులలో ప్రథముడైన మల్లికార్జున పండితారాధ్యుని గుఱించి రచించిన 'పండితారాధ్య' చరిత్రములో 'యాత్రా ప్రకరణము' నెంతో బాగుగ వర్ణించినాడు. శ్రీగిరికిఁ బోవు మునుల వర్ణన యెంత మనోహరముగ నున్నది!

"చిక్కుచు, మోకాళ్ళఁ జేతు లానుచును
వంగుచు, వ్రాలుచుఁ డొంగుచుఁ జనుచుఁ
జెంగుచు, నొండొరుఁ జేయూదికొనుచు
కను లేని పాటలఁ గట్టి పాడుచును
చని చని చిందుల, జతుల పాడుచును."

భక్తివివశులైన వారి పల్కులు:—

"చేదుకో, చేదుకో, శ్రీగిరినాథ
చేదుకో, చేదుకో, శ్రీశైలనిలయ
చేదుకో, మల్లయ్య, చేదుకొ"మ్మనుచు.

మనముకూడ అక్కడి కెందుకు యాత్ర చేయరాదు? ఇంకను గొంచెము చదివియే పోవుదము. ఇదిగో శిలాశాసనముల సంపుటి. కాకతీయుల కీశ్రీశైలముపై నెందు ప్రేమ. రుద్రమదేవి ప్రతాపరుద్రులకు మెండుకొను భక్తి. ఆరాజులు 70 గ్రామముల స్వామికి సమర్పించినారఁట. ఆలయము ధర్మకర్త ఈశ్వరశివాచార్యు లను శైవపీఠాధిపతి. (నె. 27 శిలాశాసనము.)

క్రీ. శ. 1299 జగదెబ్బగండ అనవేమన్నరెడ్డి తండ్రి స్మరణగా వీరమంటపమును పాతాళగంగకు మెట్లను కట్టించినాడు.

క్రీ. శ. 14 శతాబ్దికొనను కదంబరాజపుత్రి, రెండవ హరిహరుని భార్య (38 శాసనము) విఠలాంబ పాతాళగంగ మెట్లను బాగు చేయించినది. క్రీ. శ. 1405లో ఆమె భర్త ముఖమంటపమును గట్టించినాడు.

చారిత్ర గ్రంథములఁ జూతము.

7-వ శతాబ్దిలో హుయాన్‌సాంగు వ్రాతల ప్రకారము నాగార్జున బౌద్ధుడు శ్రీగిరి యారామములో నుండి అందు గ్రంథాలయము నెలకొల్పినాడు. ఆ శ్రీగిరి ఈ శ్రీశైలమేమో?

శ్రీగిరి రాజ్యమును బాలించి, శైవమతమును బాడు చేయుటకుఁ బూని నాశమైనవారు "ఇక్ష్వాకు"లను రాజ సంతతి, మూడవ శతాబ్దివారు. అంతకుముందె గుప్తులకన్నె చంద్రావతి స్వామిని వలచి తపించి ప్రత్యక్షము చేసికొని, తా నర్పించు మల్లికాదామము కాంతిలో అర్జున (తెల్లగ) ముగ స్వామి యుండ-మల్లికార్జునుడుగ - నుండవలెనని వరము గొన్నదట.

శ్రీకృష్ణరాయల కాలములో ఈ శ్రీగిరి విషయాధిపుడు శాంతిలింగప్ప. ప్రభువును సామంతుడును మండపములఁ గట్టించినారు, బావులు త్రవ్వించినారు, తూర్పు గోపురమును బాగుచేయించినారు. శ్రీగిరియందలి వారల కగ్రహారము లిచ్చినారట. అనాఁ డీగిరి పెద్ద పట్టణం కాబోలు!

ఒకప్పుడు గర్భాలయము లోవైపంతటను బంగారు నీరు పూసిన రేకులు కప్పియుండినవట. అవి ఏమైనవో? హర! హర! హర! ఆనాటి నీభక్తు లెందేగినా రయ్యా, శ్రీగిరి మల్లన్నా, చెవిటి మల్లన్నా, మాయార్తులు ఐహిక వేదనల వినని నిన్ను చెవిటివాఁ డన్నారుపో. నీ సంగతి కూడ నీవు చూచుకోలేవా? రోహిలాలు నీభాండారమును రెండువందల యేండ్లక్రింద దోఁచి, భ్రమరాంబా ప్రతిమను తూటుపోవ గుండ్లు పెట్టి కాల్చినారట! ఊరకున్నవానిని నిన్నేమ సందును? ఆనాఁడు తల్లియే త్రినేత్రమును



శ్రీశైలక్షేత్రము - శిల్పచిత్రము - శ్రీ నటరాజస్వామి.

దెరచినదిలే. ఆపాపులు కృష్ణ దాటుచు కొందరు మునిగి చచ్చినారు. దోపిడి పంచుకొనుటలో తగవులాడి ఒక్కరు మిగులకుండ సర్వనాశన మైనారు. "నీవు స్వయంభువవు; ఈ లింగము తొమ్మిదవది. దీనిక్రింద నెనిమిది లింగము లున్నవి. చివరది పరుసవేది" యని నిక్రింద త్రవ్వఁ బూనినవారికి కొందరికి దినము గడువక చావు వచ్చిన దటఁగా ?

అర్ష వాఙ్మయమును జూతము.

అయిదువే లేడుల స్కాందపురాణములో శ్రీశైలఖండము కలదు. భారతతీర్థ యాత్రాప్రకరణములలో ఈ శ్రీశైల ప్రశంస యున్నది. రెండువే లేడులక్రింది శంకరాచార్యులు శివానందలహరిలో రెండు శ్లోకములలో "శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్" అని కీర్తించినాడు.

తెలుగుదేశమునకు ఆ పేరు తెచ్చిన త్రిలింగములలోనిది యొకటి అన్నాము. ద్వాదశజ్యోతిర్లింగములలో రెండు తెలుగుదేశమున నున్నవి. ఆరెంటిలో నిది యొక్కటి.

దేవీభాగవతములో శక్తుల యావిర్భావమును వర్ణించు టలో నిక్కడ భ్రమరాంబను చెప్పినాడు. ఈయమ్మ 'హ్రీంకారమయ'యఁట. కన్నడదేశములో నెక్కడనో పుట్టి పార్వతితోఁ గులుకుచున్న వృద్ధ మల్లికార్జునయ్యను పెండ్లి చేసికొనుటకు తపస్సు చేసి, పెద్ద భార్యకంటే తానే పెద్ద యైనది. శివరాత్రినాడు జరుగునది ఆమె కల్యాణమే. శ్రీచక్రప్రతిష్ఠ, సహస్రలింగ ప్రతిష్ఠ, ఆమెయుందే. ఆమె కొరకు మల్లన్న 'యువక' మల్లికార్జునుఁ డైనాడట. మనము కాశియందువలె కులభేద జాతిభేద వయోభేద స్త్రీ పురుష వివక్షత లేక తాకి నుదుడు - శోణితలంబునకుఁ గాదు - శివశిరస్సునకే తాకించి, మ్రొక్కి ధూళికడుగని కాళ్ళతో ధూళి దర్శనము కావించుకొనునది ఈ యువక మల్లికార్జునుడినే.

శిలాదుని కొడుకు నందితమ్ముఁ డన్నమీద పోటికి తాను పర్వతముకాగా, తనమీద నుండునట్లు ఆ అయ్యగారు వర మిచ్చినాఁడు. ఆయమ్మ మొనమొన్న శివాజీమహా రాజు భక్తిపారవశ్యమున శిరసు కోసికోపోగా ప్రత్యక్షమై 'భవానీఖడ్గ'మిచ్చి గోబ్రాహ్మణదేవతలఁ గాపాడు మన్నదట. ఆయన యొక గోపురమును గట్టించి ఆమె పనిపైనే జనినాడట.

> "నల్లవో నల్లవో నగరాజరాజ
> మల్లయ్యా, మల్లయ్యా, మహనీయతేజ
> సిరిగిరి మల్లన్న, శరణన్న, జాలు
> పరమపాతకకొట్లు భస్మమై పోవు
> సిరిగిరి, శరణు, శ్రీగిరినాథ శరణు
> సిరిగిరి మల్లయ్యా, శరణుల శరణు."

అయిదుమార్గము లిక్కడికిఁ జేర్చునుగాని నందేల నుండి బస్సుపై 57 మైళ్లు వచ్చి పెద్ద చెఱువున దిగి చెంచులతలకు సామా నెక్కించి, 6 మైళ్ళు కొండ లెక్కుచు దిగుచు, శ్రమపడుచు, భీమునికొలను చేరవలె. ముందు ఉత్తరముగా నుండును చుక్కలపై నుండును. చుక్కల పర్వతము 1 మైలు మై లెక్కవలె. ఈ కొలను, కుంతికై భీముడు కల్పించినది, లేకున్న దప్పికి నీరమే దొరకదు. దారిలో ఆ జంగముచిన్నది యేమి చేయును, దప్పితీర్చు కొన నే నిచ్చిన యెంగిలి నీరునే తాగినది! మెట్లు ఎగుడు, దిగుడు. ఎక్కుడుము. "చేదుకో శ్రీగిరి శివ శివా శరణు"

ఇది కైలాసద్వారము. ఇక సరాసరి 3 మైళ్ళు త్తర ముగా సాగి ఎడమచేతివైపు చిట్టడివిలో దూరాన చెంచు గూడెమును జూచుచు, తీరైన మెట్లు దిగుచు, బండల మీద నడచి నడచి, వచ్చిన చూడఁగలము, ఒకచరియపై శ్రీశైలముకోట. ఈగిరికి తూర్పు - పడమర - ఉత్తరము కొండలు కృష్ణానది. అవిగో బ్రహ్మగిరి, విష్ణుగిరి. ఉత్తర మున-ఇవిగో శిఖరేశ్వరము హాటకేశ్వరము తూర్పున. దక్షిణ మున భీముని కొలను లోతులోయలో కృష్ణలోఁ గలియు కొండయేరు. పదునెనిమిది చదరపు మైళ్ళ పీఠభూమి. నడుమ నీకోట. ఈ గోడలమీద ఎంత చిత్రముగ చెక్కి యున్నారు. ఈ విగ్రహములు; రామాయణ గాథలో, శివ లీలలో? పడమట ఏనుగుల కొలను; ఎనిమిది మూలలు అష్టభైరవులు. ఆగమము భైరవాగమమా! పడమట నయిదు మఠములు దూరమున గనవచ్చుచున్నవి. పాండవు లందుండిరట, సిద్ధులు....ఋషులు....ఈనాటి కిని దేవత లర్ధరాత్రమున స్వామిని గొల్చిపోదురట.

'శివా శివ, శ్రీగిరి శివా శరణు' ఉత్తరమున రెండు కొలనులు, కొంచెము దూరములో 'కర్మారము' (కర్మ హరము) కొండ లోయలోనికి వాగు దుముకుచున్నది. వీర శైవవీరులు ఇందు దుమికి, పశుపతికి తమ జీవాత్మల నర్పించి, నిష్కలుమలై కైలాసము చేరుదురట. లోనికి బోవుదము మొదటి ఆవరణము. దేవాలయ మంతరాపర ణమున నున్నది, స్వామికిఁ బ్రదక్షిణము చేయుదము. ఈ ఆవరణమున పడమటి దిక్కున అదిగో భ్రమరాంబా లయ మున్నది; పడమట ప్రాకారమున గోపురము లేదే? కొదమ అన్నిదిక్కులను గలవు. దేవాలయ నిర్మాణము తలక్రిందులు చేసిన మేరుయంత్రమువలె నున్నది. లక్షల యాత్రికులకై వసతులు, కుడ్లిగివారి యాస్థానము, వీరశైవ భోజన సత్రము, ఆఫీసు, తోట, తోటలో పూడిపోయిన కొలను కలవు. మరల మెట్లు దిగుదము, లోనియావరణ మునఁ లోనజుట్టును మండపములు, పూజారులిండ్లు, దేవాలయము.

ఇదిగో ఆలయము. పల్లవులో చాళుక్యులో ఈ విమానశిల్పులు? ముందు ముఖమండపము, దానియందు మండపమున యెంత పెద్ద నంది! అబ్బా, ఒక్కరాయిలో చెక్కినారు! ఆయుత్తరముననే వీరమండపము; దాని చెంత బ్రహ్మాండమైన వటవృక్షము - గోచీల బైరాగులు పూజలు చేయుచున్నారో! ఎన్ని లక్షలో ఈజనము. వీరశైవులు స్మార్తులును. జంగముల యార్భాటము, ఔత్తరాహుల యాగడము. మహారాష్ట్రుల హకారస్వరములు. కన్నడీల కలుగొలుపు మాటలు, తెలుగుల కేకలు, చెవులు చిల్లులు పోవుచున్నవి. ఇదిగో అన్నపూర్ణ సత్రము. దాదాపు పంద్రెండు సత్రములిందున్నవట. దేవళము లోనికి బోవుటకు ఒక రూపాయి కాన్క. ప్రస్తుతము ఇదియే ఈ యాదిబిక్షువున కాదాయమట. ఇదిగో వీరులు ప్రాతకాలములలో మొక్కుబడులపై, తమ్ము కొఱత వైచుకొను కొర్రు. దేవాలయమువా రెంత కష్టపడుచున్నారో! ఇన్ని యేర్పాటులకు, తోటీలకు, మాలీలకు, విద్యుద్దీపములకు, పంపులకు, పాత్రసామగ్రికి, సత్రమునకు వసతులకు, యెంత ఖర్చు అగునో? వీరికి మిగలునది ఏముండునో? స్వామి నీదరిద్ర మెన్నడు తీరునోయీ చెవిటి మల్లన్నా? పూజారి జంగమయ్య: అంబపూజకు బ్రాహ్మణుడే కావలెనట. ఎప్పుడు నీమముల మడులు ఆచారములు అమ్మలకే.

ఈ భక్తుల కెంత పుణ్యమో! అన్నదానము చేయు ఈస్వాముల కెంత పరిపాకమో! స్వామిదర్శనము చేసి, పాతాళగంగకుం బోయి, మునిగి, నీరము తెచ్చి ఈ గంగానాధుని శిరమున ముంతల నభిషేకించితిమి. యాత్రయయినది. లోకమనోహర నృత్యము చేయుచున్న ఓయుత్తరము నటరాజా; పెద్దకడుపుతో, తొండముతో మమ్ము దలించుచున్న గణపతిమూర్తీ; సెలవు,

"గురులింగ, గురులింగ, మల్లికార్జునలింగ
శరణయ్యా, శరణయ్యా, శరణుల, లింగన్న
అమ్మ భ్రమరాంబికా, అమ్మ చంద్రావతీ
మల్లికాదామంపు మహనీయతేజమున
వెలుగు మీ కెల్లరకు వేయివిధముల శరణు"

---

# ఆలయ సౌందర్య పోషణ

కె. రాయకృష్ణప్ప, బి. ఏ.

(దేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖ)

ఆంధ్రుల ఆస్తికత్వమునకు ప్రబల నిదర్శనములు దేవాలయములు. ఇట్టి ఆలయములు మన ఆంధ్రదేశములో **6339** గలవు. వార్షికాదాయము వెయ్యిరూపాయలకు లోపుగ గలిగినవి, అందులో **3174** వున్నవి. ఈ దేవాలయములు రెండురకములు. మొదటి తరగతి దేవాలయములు ధర్మకర్తల పరిపాలనలో నున్నవి. రెండవ తరగతివి అర్చకుల స్వాధీనములో నున్నట్టివి. అర్చకుల స్వాధీనములోగల దేవాలయముల సందర్భములో ప్రస్తుత చట్టము బలహీనమగుటచేత సత్వరచర్యకు విలంబనమగుచున్నది. ఇటీవల ప్రభుత్వము వారిచే అర్చకుల స్వాధీనములలోని ఆస్తుల పంపకమునకు సంబంధించిన రాజీలు అమలు జరుపుటకు చర్యలుతీసుకొనబడుచున్నవి.

భక్తికి నిలయములై, పరమేశ్వరసేవకు మందిరములైన యీ ఆలయములు ఒకనాడు మహోన్నత స్థితిలో వర్ధిల్లినవి.

కాని రానురాను ఆలయములశోభ - అర్చకుల ప్రతిభ తీసికట్టు అగుచున్నది.

ఆలయముల బాహ్యరూపము, అంతఃశుద్ధి, నిత్యారాధన, వీనియందు బహుముఖ లోపములు ప్రస్తుతముకన్పడుచున్నవి.

తొలుత దేవాలయ బాహ్యసౌందర్య పోషణ గమనింపదగినది. భక్తబృందమును ఆకర్షించి వారికి హృదయానంద భాగ్యమొసంగి, ఇది కైలాసమా-వైకుంఠమా, అను మైమఱపు గల్పించునట్టి ఆలయ ప్రాంతమును నిర్మించుటయే బాహ్య సౌందర్య పోషణ యనవచ్చును. కన్నులపండువ జేయు అలంకరణతో, వీనులవిందుచేయు మంత్రోచ్చారణతో భక్తులకనురక్తి కలిగించుటకూడ బాహ్య సౌందర్యపోషణయే. ఇట్టి కృషికి డిపార్టుమెంటు అధికారులు దేవాలయకార్యనిర్వాహకులు సమిష్టిసాధన జేయవలయును.

ఈ బాహ్య సౌందర్యపోషణ గర్భాలయమునుండి ప్రారంభమగుచు ప్రాకారముతో ముగియవలెను.

గర్భాలయము పరిశుభ్రముగా సిమెంటుపూతతో నిర్మాలిన్యముగా నుండవలెను. గోడలుకూడ అట్లులనే యుండవలెను. పైకప్పు గోపురముకూడ మాలిన్య రహితమై సంప్ర



శ్రీశైలక్షేత్ర దుర్గముసంపలి శిల్పచిత్రములు - శివకల్యాణదృశ్యము.

వాయ సిద్ధమై నయనానందకరదృశ్యముగా శిల్పనైపుణి యొప్పుచు ప్రతిమాయుక్తమై యుండవలెను. ఆగమశాస్త్రానుగుణ్యమైన శిల్పరచన ప్రతిష్ఠించవలెను; గాని అవినీతికరమైన వ్యంగ్య చిత్రములకు స్థానము రాకూడదు. ఒకమాదిరి లేతపసుపు పూత మంచి అందమె. గర్భాలయములోని గోడలకు గూళ్లుండరాదు. ఈ గూళ్లలో అర్చకులు నానారకములగు చెత్తపదార్థములను వుంచుట కవకాశము గల్గును.

రెండవది అంతరాలయశోభ. గర్భాలయములో ఎట్టి పరిశుభ్రత వివరింపబడెనో అట్టి జాగ్రత్త అంతరాలయ సౌందర్యపోషణకుకూడ అత్యావశ్యకము.

మూడవది ముఖమండపము. ఇందులోనే తైర్థికులు సమావేశమై భగవద్దర్శన భాగ్యమును పొందెదరు. ఉత్సవములలో యీ సమావేశములధికసంఖ్యాకములుగా నుండును. సూర్యరశ్మి, వర్షము, ఇత్యాది వాతావరణ బాధల విషయమై మిక్కిలి శ్రద్ధవహించి ముఖమండపమును పరిశుద్ధ స్థితిలో నుంచవలసియున్నది.

నాల్గవది దేవాలయమునకు సంబంధించిన నూయి లేక పుష్కరిణి. భక్తులు మంగళస్నానమును చేసిన పిదప దేవతాదర్శనమును చేయుదురు. ఈ స్నానఘట్టము నిర్మాలిన్యముగా నుండవలయును. దుర్గంధ వాతావరణమును అరికట్టవలెను. ముఖ్యముగా ఉత్సవములకు ముందు జలమును ఆరోగ్యశాఖాధికారుల సలహాల ననుసరించి పరిశుభ్రపఱచవలెను. స్నానసౌకర్యములను గల్పించ వలసిన బాధ్యతను ఆలయాధికారులు తప్పక గుర్తించవలెను.

అయిదవది వాహనశాల. స్వామివారి వాహనములను చక్కని స్థితిలో వుంచుటకు భద్రపరచుటకు వాహనశాల ముఖ్యావసరము. తర్వాతది హోమశాల. మూడవది కళ్యాణ మండపము. ఇవి చక్కని స్థితిలో నున్నచో ఆలయ శోభ ద్విగుణీకృతమగును.

ఆరవది ప్రాకారములు. చుట్టు ప్రాకారములు సుందరముగా నుండవలెను. అప్పుడే ఆలయ సౌందర్యము అభివృద్ధి చెందగలదు. గ్రామమునకుగూడ యిది మంగళప్రదము.

ఆలయ ప్రాంగణమునంతయు సిమెంటు పూతతోగాని కడపరాళ్ల పరుపుతోగాని చక్కగా చేయబడినచో అది అందమునకు నిలయమై ఆనందమునిచ్చును.

ప్రతిదేవాలయమునకు నొక ఆఫీసుగది యుండవలెను. అందులోనే ఆలయమునకు చెందిన రికార్డులు యావత్తును భద్రపఱచవలెను. మత ప్రశస్తినందిన పుస్తకము లుండవలెను. భక్తులు ఆయా గ్రంథములను పఠించుటకు తగు సౌకర్యములను కల్పించవలెను.

అతిముఖ్యమైన విషయము పూలతోట. ఒక అందమైన దృశ్యము నిరంతరానంద ప్రదాయకము. సొగసైన సుమములను మించినవిలేవు. సరిక్రొత్తసువాసనలతో పూలను ఓడించ గల్గినవిలేవు. అందుచేతనే అవి పవిత్రములై దేవార్చనకు అర్హత నందుకొన్నవి. ఇట్టి పూలతోటలు ఆలయములలో విరివిగా నుండవలెను. ఈ దేవతా వనములు నందనవనములై సుమసౌరభముతో భక్తులను బ్రహ్మానంద భరితులను జేయును. స్వామి సేవకు సుమనస్సమృద్ధి లభించును. దేవతావిగ్రహములకు యీ దేవతావన పుష్పములతోనే అలంకరణ చేయుట ముఖ్యావసరము. పసువు తప్పిన కొనుగోలు పూలతో అలంకరణ చేయుట ఎక్కువ సమంజసముకాదు.

ఆలయములున్నవి. అత్యావశ్యకములైన పనులున్నవి. కాని తగిన ధనసంపత్తి చాల ఆలయములకులేదు. గర్భాలయ, అంతరాలయ - ముఖమండప - కూపవిషయములు ప్రతిదేవాలయమునకు ఆవశ్యకములైనవి గనుక, ఏవి దేవాలయములు ధనలోపము కలిగియున్నవో ఆయా దేవళములకు సామాన్యోపకారకనిధి (కామన్ గుడ్ ఫండు) నుండి విరాళము లిచ్చుట మంచిపని. ఈ విషయములో డిపార్టుమెంటువారు ధర్మకర్తల సహకారముతో తగు చర్య తీసుకొనుచున్నారు.

ఇక విగ్రహాలంకరణ విషయములో మన ఆంధ్రదేశీయ అర్చకులకు, తమిళదేశీయ అర్చకులకు అమిత భేదము కానవచ్చుచున్నది. తెలుగుదేశములోని అర్చకులు వాస్తవముగా తమిళ అర్చకులకన్న వివేకవంతులు, విద్యావంతులుగా నుండవచ్చును. కాని వారి విద్యావివేకములు కొన్ని చోట్ల అర్చనాదికములకన్న వాదోపవాదములకు వినియోగింపబడుచున్నవి. కళాసమన్వితమైన విగ్రహాలంకరణమును ఆంధ్ర అర్చకులు చాలచోట్ల అలవర్చుకొనరు. దాక్షిణాత్య దివ్యస్థలములను సందర్శించిన భక్తులు మన తెలుగు దేవళములను తిలకించి ఆశాభంగము నందక మానరు. మన అర్చకుల పూజావిధానము కూడ కొన్ని చోట్ల శాస్త్రీయపద్ధతి ననుసరించుటలేదు. వచ్చిన భక్తుల లోనైన మత సంబంధ ప్రవృత్తి గన్పడునుగాని అదేవృత్తి గల కొందరు అర్చకులలో భక్త్యుద్రేకము, మత సంప్రదాయము మాటవరుసకైన లేకపోవుట కడుంగడు శోచనీయము. ఈ కారణముల వలననే ప్రభుత్వమువారు అర్చకులకు తరిఫీదునిచ్చి వారి విజ్ఞానాభివృద్ధికి మార్గదర్శకములైన కొన్ని పరీక్షలను ప్రారంభించనున్నారు.

శివాలయములో ఈ క్రింద నుదహరింప బడినవి కనీసపు అవసరములు. రుద్రాక్షమండపము, నాగాభరణము, జటాజూటము, త్రిశూలము, రుద్రాక్షమాల, వెండి త్రిపుం

త్రము, పత్రత్రినేత్రము, ఇరుపార్శ్వముల వ్రేలాడు దీపికలు-అఖండజ్యోతి-క్రక్షేమపీఠము-పంచపాత్రలు-ఉద్ధరిణి జేగంట - రుద్రపాదుకలు - రెండు పళ్లెములు-చామరము-ఛత్రము-ధారాపాత్ర-తీర్థబిందె-గర్భాలయములో చిన్నచిన్న విద్యుద్దీపములు ట్యూబులైటు, నక్షత్రమాల-గోపురమంతట విద్యుద్దీపికలు (ఇట్టివి పశ్చిమ గోదావరి జిల్లాలో గునుపూడి-పాలకొల్లు-ద్వారకాతిరుమల దేవళములకు గలవు) ముఖమండపముపైన ఎదుట శివకళ్యాణ విగ్రహములు- ఒకవైపు సుబ్రహ్మణ్యస్వామి నెమలివాహనిముతో, మరొక ప్రక్క కుమారస్వామి-ఇరుపార్శ్వముల భార్యలు - మూలలకు నందులు-సిమెంటు విగ్రహములు నెలకొల్పబడి యుండిన బాగుండును.

పార్వతీఆలయములో - రుద్రాక్షమండపము - మకరతోరణము-బంగారుకళ్లు-కనుబొమ్మలు-తెలుపురాళ్లతోగల అర్ధచంద్రము-కెంపురాళ్లతోగల సత్తు-బులాకి - మంగళ సూత్రములు-కనీసము రెండు సిల్కుచీరలు-5 నూలు చీరలు-దైనందినాలంకరణకు - త్రిశూలము - సర్వాంగ కవచము - కిరీటము-వ్రేలాడు దీపికలు - అఖండజ్యోతి, క్షేమపీఠము, పంచపాత్రలు - ఉద్ధరిణి - జేగంట-రుద్రపాదుకలు- రెండు పళ్లెములు - చామరములు - తీర్థపుబిందె - నక్షత్రమాల, విద్యుద్దీపమాల అవసరములు. ధనసమృద్ధిగల దేవళములలో పై సామగ్రి స్వర్ణరూపమునగాని రజతరూపమున గాని అలంకరించుట సమంజసము.

విష్ణ్వాలయములో కిరీటము-సర్వాంగకవచము-బంగారుకళ్లు-కనుబొమలు-ఊర్ధ్వపుండ్రము-మకరతోరణము - క్షేమపీఠము వ్రేలాడు దీపికలు- అఖండ దీపము-పంచపాత్రలు-ఉద్ధరిణి శఠారి - రెండు పళ్ళెములు-చామరములు-నక్షత్రమాల ముఖ్యావసరములు. ముఖమండపముపై - మధ్యభాగమున శ్రీదేవీ భూదేవీ సమేత శ్రీ విష్ణువు సిమెంటు విగ్రహములు - ఒకవైపు కాళీయ మర్దన విగ్రహములు - మరొకవైపు గరుడవాహనారూఢుడైన శ్రీ కృష్ణుడు రుక్మిణీ సత్యభామా సమేతుడై యుండవలెను.

శ్రీ మహాలక్ష్మి ఆలయమునకు పార్వతీ ఆలయమునకు ఒక్క త్రిశూలభేదము వినా వేరొండు మార్పులేదు.

జ్యోతియే జ్ఞానము. ఇట్టి అఖండజ్యోతిని ఆలయములలో వెలార్చక పోవుటయే మొట్టమొదటి శోచనీయకర విషయమైయున్నది. జ్యోతిర్మయుడైన దేవుని సందర్శించి జ్ఞానానందభాగ్యమును బడయనుల్లాసముసవచ్చెడి భక్తులకు కటిక చీకటిలో గల దేవుని చూచుటవలన ఎట్లుండునో - యీ మహాపాతక మెవరిదో యూహించవలసి యున్నది. ఈ లోపమును ఆలయాధికారులు అర్చకులు సరిదిద్దవలెను.

రెండవది హారతి విషయము. తమకు తామేసాటి యన్నట్లు దాక్షిణాత్యార్చకులు భక్తులను హారతితో బ్రహ్మానంద భరితులుగా చేయుచున్నారు. కాని ఆ నేర్పు మన ఆంధ్రదేశీయ అర్చకులలో అరుదు. ఆగమ శాస్త్రానుగుణ్యముగాగల హారతి పద్ధతులను, విద్వాంసుల సలహాల ననుసరించి నిర్వహించుటకు మన అర్చకులు ముందంజ వేయవలెను. కుంభహారతి-అష్టోత్తర శతదీపికా ప్రదర్శనమువంటి హారతి పద్ధతులను వారు తప్పక నేర్చుకొనవలసియున్నది.

ఆలయములో మతవాతావరణము విజయవంతముగా నిర్వహింపబడవలెనన్న యీ సలహాలను ఆచరించుట అవసరము; అందరు అర్చకులు ఆగమపరీక్షలకు హాజరై అందుత్తీర్ణులు కావలెను. తెలుగుదేశ దేవళములలో ప్రముఖాలయ అర్చకులను, తరిఫీజుకై దాక్షిణాత్య ప్రదేశములకు పంపించవలెను. ఆగమపాఠశాలలు నెలకొల్పబడవలెను. ఆగమశాస్త్ర వేత్తలను ఉపాధ్యాయులుగా నియమించవలెను. పెద్దపెద్ద దేవాలయములలో స్వస్తిని ముఖ్యముగా ప్రోత్సహించవలెను. ప్రతి శివాలయములో నిత్యాభిషేకము అత్యావశ్యకము. 360 మంది భక్తులను తన్నిమిత్తమై ఎంచుకోవలసిన బాధ్యత ఆలయాధికారులదే. దానివలన నిత్యాభిషేక విధానము నిర్విఘ్నముగా కొనసాగగలదు.

ప్రతి విష్ణ్వాలయములో ప్రత్యేక పూజలు, భోగములు సాగించవలెను. శుక్రవారములలో మహాలక్ష్మికి పార్వతీదేవికి కుంకుమ పూజలు నిర్విఘ్నముగా నిర్వహింప బడవలెను. అయిదువేల రూపాయలకు పైన రాబడిగల ఆలయములలో నిత్యపురాణ కాలక్షేపము లుండవలెను. లక్షపత్రి పూజలు- ఏకాహములు- భక్తుల బహువిధ సహకారముతో నిర్వహింప బడవలెను.

సాయంసమయములలో ఆలయ ప్రాంగణములందు భజన సమ్మేళనము బ్రహ్మానందప్రదము. తదనుగుణమగు పరికరములను ఆలయాధికారులు సేకరించవలయును. అయాచితముగ - కొందరు భక్తులు ప్రతిఫలాపేక్షలేక-భజన కాలక్షేపములను చేయుట మన ఆంధ్రదేశమున పరిపాటి. ఇట్టి ఆకర్షణలను విజయప్రదమొనరించు శక్తి - సమర్థులైన ధర్మకర్తలకే చలామణి యగును. అందుచేతనే ధర్మకర్తలకు మతానురక్తి - భక్తిప్రపత్తి ముఖ్యావసరము.

ఆదివారములలో-ఆలయములలో ‘‘హిందూమత ప్రశస్తి’’ని గురించి చక్కని ఉపన్యాసముల నేర్పాటు చేయవచ్చును. కళాశాలలలోని పండితులను - పాఠశాలలలోని పండితులను ఈ కార్యక్రమమునకై ఆహ్వానింపవచ్చును. వాద పరీక్షల నేర్పాటుచేసి విద్యార్థులకుకూడ అవకాశమీయవచ్చును.

6 మొదలు 8 సంవత్సరముల బాలికలచే ఉదయము పాయంత్రములందు "స్వామిసంకీర్తనము" చేయించుట వలన అమందానందము గూడును. భగవన్నుతికై పండిత ప్రకాండులచే చక్కని పాటలను రచియింపజేయుటవలన వినూత్నగేయ గానము వీనులవిందు చేయగలదు. హిందూమతోద్ధరణ-భక్తిగానమువలన ఆస్తికత్వము-వర్థిల్లుటకు ఇది సమంచితపథము.

ఇంతేగాక విద్వాంసులైనవారిని మతప్రచారకులుగా నియమించి వారిని ఆలయములలో మతోపన్యాసముల నిచ్చుటకై నియోగించవలెను. తగు పారితోషికమొసంగ వచ్చును. మత ఖ్యాతికి యిది మంచిమార్గము.

అన్నవరము - సింహాచలమువంటి ధనసమృద్ధి గలిగిన దేవళములలో వేదసభలను ఏర్పాటుచేయుట ముదావహము. దీనివలన వేదమహిమ, భారతజాతీయత, హిందూమత విఖ్యాతి తేటతెల్లము కాగలదు. ఆగమవేత్తలను ఆహ్వానించి సన్మానించి అష్టవిద్యలకు అండనీయవలయును. అప్పుడు వేదవిద్యలు వర్థిల్లును.

50,000 రూపాయలకు పైన రాబడిగల ఆలయములలో చిన్ని ఏనుగులుండవలెను. ఈ గజ సహాయముననే జలాశయమునకు మేళతాళములతో తీర్థపు బిందెనుగొని జలసేకరణచేయుట సదాచారము. అర్చకుడు పీతాంబరధారియై, మతావలంబియై, ప్రాతః కాలముననే పైకార్యక్రమమును నిర్వహించవలసియున్నది. అది కునుకు పడుచున్న హిందూమతమును మేల్కొల్పు కోడనూతయై ప్రజా హృదయములలో పాపభీతిని పుట్టించు ఆస్తికతను దేవాలయములందు తాండవించు మతప్రశస్తిని ప్రబోధించును.

ఈ సచరాచర ప్రపంచములో గల ఖండఖండాంతరములలోని ప్రతి ప్రజానీకమునకు మతము - మతావలంబనము గలదు. తన జాతి తన మతమును మఱచిపోదు. నాగరిక వ్యామోహమున మన హిందూమతము నానాటికి క్షీణదశలో నడుచుచున్నది. ఈ హిందూ మతోద్ధరణకు మొదటి పునాది హిందూ దేవాలయాభివృద్ధి. హైందవ దేవళములను నేను మనవిచేసినట్లు బహువిధ సౌందర్య భాజనములుగా నొనర్చినగాని, జీర్ణ దేవాలయములను పునఃప్రతిష్ఠితములుగా జేసినగాని ఈ దేవాలయాభివృద్ధి కార్యక్రమము విజయవంతము కాజాలదు.

ఆంధ్ర దేశీయ అర్చకులు - ఆలయాధికారులు - ఈ విషయమున ప్రత్యేక శ్రద్ధనిచ్చి ఆలయములను పరిశుద్ధ ప్రాంతములుగాజేసి జీర్ణ దేవాలయములకు ధనసహాయము చేసి తెలుగుదేశములో గల అన్ని ఆలయములను ప్రశాంత స్థితితో 'అవి దేవాలయములే' అను ప్రఖ్యాతిని తెచ్చుటకు నిరంతర కృషి చేయవలెను.

అప్పుడే అర్చకుడు, ధర్మకర్త, తమ బాధ్యతలను గుర్తించినట్లు నిర్ణయింపబడును. లేనియెడల వారిద్దరు ఆస్తికత్వమునకు భంగము కలిగించిన పాతకము-హిందూమత పతనమునకు సాయపడిన నేరమునకు నిశ్చితబాధ్యులగుదురనుట నిస్సంశయము.

మన భారతదేశము కర్మభూమి. అందు వెలుగుచున్న విజ్ఞానజ్యోతి ఖండ ఖండాంతరములకు వెలుగు ప్రసాదించుచున్నది. ఆ జ్యోతియే అఖండ హిందూమత జ్యోతి. అది సదా వెలుగుగాక.

ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!

( ఆల్ ఇండియా రేడియోవారి సౌజన్యముతో )

---

సత్యం జ్ఞానమనంతం నిత్యమనాకాశం పరమాకాశమ్ ।
గోష్ఠ ప్రాంగణరింఖణలోల మనాయాసం పరమాయాసమ్ ।
మాయాకల్పిత నానాకార మనాకారం భువనాకారమ్ ।
క్ష్మామానాథ మనాథం ప్రణమత గోవిందం పరమానందమ్ ॥

# దివ్యక్షేత్రముల మహిమ - శ్రీ గన్నాథము

పండిత, ఆకులమన్నాడు-పార్థసారధి భట్టాచార్య.

భారత దేశమందలి సుప్రసిద్ధ దివ్యక్షేత్రములలో శ్రీజగన్నాథము ఒక్కటిగ ప్రశంసింపబడుచు వచ్చుచున్నది. ఈక్షేత్రమునకు 'పూరి' అనియు సంస్కృతమున 'పురుషోత్తమ క్షేత్రము' అనియుకూడ వ్యవహారముకలదు. ఈ పుణ్యక్షేత్రము 'ఒరిస్సా మండలమున తూర్పు సముద్ర తీరమున నున్నది.

ఇచ్చటి దేవాలయము చాలగొప్పది. గర్భగృహము అంతరాలయము ముఖమండపము మహామండపము ప్రాకారము పాకశాల ఉద్యానములు మొదలుగునవి మిక్కిలి విశాలమగు నిర్మాణములు. ఇట్టి వైశాల్యముగల సన్నివేశములుకల ఆలయములు భారతభూమియందు మరి కొన్నికలవా యను సంశయముకూడ కలుగుట సహజము. గర్భగృహమున శ్రీ జగన్నాథస్వామి, ప్రక్కన సుభద్రాదేవి, ఆమె ప్రక్కన బలదేవుడు, మరియొకయెడ సుదర్శనదేవుడు ఇట్లు నాలుగు దివ్యమూర్తులు అమరియుందురు. ఈ మూర్తులు దారువుతో నిర్మించబడినవి. దారువిగ్రహ నిర్మాణము ఆగమశాస్త్రములందును శిల్పశాస్త్రమునందును సవిమర్శముగ చెప్పబడినదిగాని యిచ్చటి నిర్మాణము విలక్షణమై యొప్పుచున్నది. ఈ నిర్మాణము కేవలము సనాతన సదాచార సిద్ధమేగాని శాస్త్రమునకు సంబంధించినట్లు కనుబడదు. ఈ దివ్యమూర్తులకు అన్నిటికిని విస్పష్టముగ తెలియవగునట్లు కరచరణావ్యవయవస్ఫూర్తి కానవచ్చుట లేదు. పురుషాధిక ప్రమాణముగల ఈ బింబములకు విశాలమైన ముఖమండలములుమాత్రము తెలియవచ్చును. తక్కిన మహాంగములలో అధఃకాయమొకే మొండెముగను వ్రేళ్ళు లేని హస్తములునుమాత్రమే మనకు తెలియును. ముఖమండలము వర్ణచిహ్నితమై యుండును. ఆభరణాలంకారాదులుకూడ లేవు. ఉత్సవమూర్తులుకూడ వున్నట్లు లేదు. ప్రాయికముగ జగన్నాథుని జెప్పునప్పుడు మొండి జగన్నాయకుడని చెప్పుటకలదు. కృష్ణావతార సమాప్తికాలమందు భగవానుని దివ్యశరీరము సంస్కారము చేయబడుచుండగా అర్ధదగ్ధమగు కళేబరము సముద్రములో త్రోయబడి ద్వారకనుండి ఈ క్షేత్రమునకు సముద్రమార్గమున రాగా ఈ దివ్యశరీర మిచ్చట ప్రతిష్ఠింపబడి యారాధింపబడుచుండెనని చెప్పుట కలదు. దానిచే నద్యాది మొండిగా ఉండిపోయెనని వారియభిప్రాయము.

మరియొక యుపపత్తి ఈ విధముగ చెప్పబడుచున్నది. పూర్వమొకప్పుడు భరతభూమిని ఏలిన రాజులలో మహాభక్తి సంపన్నుడగు నొకరాజు ఉండెను. ఆతనికి పూర్వజన్మార్జిత పుణ్యసంచయముచే భగవానుని దివ్యమంగళ విగ్రహమును నిర్మించి ప్రతిష్ఠించి యారాధించవలెనని కోరిక కలిగెను. అంత నాతడు తపస్సంపన్నుడగు నొక శిల్పిని పిలిపించి తన కిష్టమగు నొక రూపమును నిర్ణయించి అట్టి లక్షణములతో ఒక బింబమును నిర్మించునట్లు నియమించెను. అందుకా శిల్పి యంగీకరించి అట్టి బింబమును నిర్మించుట కొక వ్యవధిని నిర్ణయించుకొని ఆ నియమిత కాలమున బింబమును పూర్తిచేసి యిచ్చునట్లును ఆ నియమిత కాలములోగా యెవ్వరును తన బింబమునుగాని నిర్మాణ పద్ధతినిగాని చూచుటయో పరీక్షించుటయో చేయరాదనియు ఒక సమయమును జేసి పని చేయనుపక్రమించెను. కొంత కాలము గడచి వ్యవధి పూర్తికాకమునుపే రాజున కాత్రము కలిగి శిల్పి సమయమును మీరి ఒక నాటి సమయమున శిల్పిలేని కాలములో కర్మాగారమును ప్రవేశించి బింబములను చూచెను. అప్పటి కాబింబములు పూర్తిగావింపబడక అసమాప్తములుగ నుండిపోయెను. శిల్పియు ఇక ముందుచేయవలసిన పనిని చేయ నిరాకరించెను. రాజు వ్యసనపడుచుండగా భగవాను డశరీరవాక్కు రూపమున ప్రత్యక్షమై రాజునుద్దేశించి ఇట్లని యాదేశించెను. 'ఓ రాజా! బింబములు పూర్తికాలేదని నీవు వ్యసనపడవద్దు, నీకు నేను సాక్షాద్దర్శనము నీయదలచిన స్వరూపమింతవరకే. నీవు ఈ యాకారమునే నా దివ్యరూపముగ దలచి ఈ బింబములను ప్రతిష్ఠించి పూజించుము' అని చెప్పగా రాజును అట్లు జేసెననియు ఇప్పుడు దర్శన మొసంగుచుండిన రూపమే రాజుకు సాక్షాత్కరించిన రూపమై యుండెననియు ఇచ్చటి పెద్దలు చెప్పుదురు.

శిలలైనను దారువులైనను వానిపై సునిశితములగు చిత్రపు పనులను చేయుదలచినట్టి శిల్పులకు దారువులను తమకు సర్వస్వాధీనము జేసికొని తమ ఇష్టానుసారముగ పనిచేయుటకు అవకాశము కలదని వారి మతము. శిలలకేమి దారువులకేమి ప్రబోధనసమయము స్వాప సమయము సుషుప్తి సమయము నను నెన్నియో యవస్థలు కలవనియు ఒకానొక యవస్థలోనయ్యవి వెన్నవలె మార్దవము కలిగినవి కాగా అట్టి సమయములు కనిపెట్టి శిల్పులు అవలీలగ వానిపై పని చేయుదురనియు చెప్పుదురు. కొన్ని అపూర్వములగు రసాయన ద్రవ్యముల చేర్పుచే కఠిన పదార్థములకు మార్దవము కల్గించుట సాధ్యమనియు అధునికుల

కూడ చెప్పుట ప్రసిద్ధమైయున్నది. ప్రాచీనులలో ఈ సామర్థ్యము విస్తారముగ నుండియుండెడిదనుటకు శాస్త్ర ప్రమాణమేకాక ఇప్పటికి జీవద్దశలోనున్న కళాఖండములే సాక్ష్యమీయగలవు. పూర్వము రెడ్డిరాజుల కాలములో కొంత వీడుఖిల్లాకు దిగువు ప్రదేశమందు కట్టబడి ఇప్పుడు శిధిలమై పాడుపడియున్న పెద్ద దేవాలయ పునర్నిర్మాణ సందర్భములో ఆ వేణుగోపాలస్వామివార్ల బింబమును నిర్మించిన శిల్పి విషయములోకూడ శిల్పి యేర్పరచిన గడవుకు ముందే ఇతరులచే స్పృశింపబడిన బింబము అసంపూర్ణముగనే నిలచిపోయిన కథను ఇదేవిధముగ వర్ణించుట కలదు.

ఋగ్వేదమందు దశమమండలమున 'అదోయద్దారుప్లవతేసింధోః పారే అపూరుషమ్' అను నాను పూర్విగలయొక మంత్రము కలదనియు ఆ మంత్రముమేరకు ఈ బింబ నిర్మాణమునకు వలయు దారువు సముద్రమునుండి అలలలో కొట్టుకుని యాదృచ్ఛికముగ నిచ్చటి సముద్రమునకు వచ్చునని మంత్రార్థము ఏర్పడుచున్నదనియు విద్యారణ్య మాధవాచార్యులవారు చెప్పుటకలదు. బింబము దారు కల్పితముగుటచే దానికి యేదో కొంతకాలమునకు శైథిల్యము సంభవించుట సహజము. బింబము జీర్ణమగు సమకాలమున దైవయోగమువలన నూతన దారువు సముద్రమున వచ్చి తీరమున నిలచును. దానిని తెచ్చి నూతన బింబములను ప్రాచీన బింబములవలెనే నిర్మించి ప్రతిష్ఠించి ప్రాతవానిని తీసివేయుట కలదు. ఇట్లు యాదృచ్ఛికముగ సముద్రతీర మందు లభించెడి దారువుగాక వేరొక విధముగ కూడ దారువును సంపాదించి బింబములను నిర్మించుటయు ప్రస్తుతము ఆచారమందు వచ్చుచున్నట్లు కొందరు పెద్దలు చెప్పుదురు. ఆప్రకారమిది ఆలయమునందలి బింబములకు శైథిల్యము కలుగుట విధి కల్పితము. దానికొక కాలనియతి అనగా పండ్రెండు సంవత్సరములో ఇరువది సంవత్సరములో నలువదియో నూరో అను నియతి లేదు. ఆ శైథిల్యము అర్చకులకు తెలియగలదు. వారు దానిని గుర్తించి అధికారులకు చెప్పుదురు. అధికారులు అప్రమత్తులై నూతన బింబ నిర్మాణమునకు అర్హమగు దారువును అరణ్యప్రదేశమున నన్వేషింతురు. ఈ బింబముల కుక్తమైనది నింబవృక్షము. ప్రాత విగ్రహములకు తుల్యమగు ప్రమాణము కలిగిన నాల్గు బింబములకు సరిపడునట్టి నాలుగు వృక్షము లొకేచోటున పుట్టి పెరిగి యుండవలెను. అదృష్టవశముచే అట్టి వృక్ష సమూహము కంటబడినచో వారా చోటును వృక్షములను భగవత్ప్రతినిధిగ భావించి శుభముహూర్తమున వానికి ఉచితోపచారములచే పూజచేసి సంప్రదాయానుసారముగ వైదికకార్యములను జరిపి వృక్షములను ఛేదించి పవిత్రమగు వాటిని అడవి నుంచి సన్నిధికి చేర్చెదరు. కాలమతిక్రమింపక ఆ వృక్ష ఖండముల కారాధనము జరుగుచుండును. అవల సమర్థుడగు శిల్పిని పిలచి బింబ నిర్మాణము ఆరంభింప జేయబడును. అతడు వృక్ష ఖండములను సన్నిధిలో నుంచుకొని ప్రాచీన బింబములను మనసులో ధ్యానించుచు అదేరీతిగ నూతన బింబములను నిర్మించును. అపైన బింబములకు ప్రాణ ప్రతిష్ఠ చేయురీతి మరింత విచిత్రముగ నుండును. ఈ ప్రక్రియ ఈ దివ్యక్షేత్రమునకు అసాధారణము. ప్రతిష్ఠాకలాపమనునది మహాప్రతిష్ఠ దిన మునకు పూర్వాంగముగ కొన్ని దినములు జరిగినను ప్రాణ ప్రతిష్ఠ రోజు చాల ప్రధానమైనది. నూతన బింబములు గర్భగృహమున పురాతన బింబముల కెదురుగ నిలుపబడును. ప్రాణప్రతిష్ఠ చేయుటకు నియమించబడిన ఆచార్యుడు విశాలమగు గర్భగృహమునందు ఒంటరిదై నిలచియుండును. ముందుగానే అతనికి కండ్లు తెలియ రాకుంత గట్టిగా కండ్లను వస్త్రముతో కట్టి ఆలయములో విగ్రహములచెంత వదలెదరు. అతడు భగవద్ధ్యానముచేసికొనుచు శుభముహూర్తమును గుర్తించి ప్రాణప్రతిష్ఠా ప్రక్రియకుపక్రమించును. అనగా ప్రధాన బింబమునకు కుక్షి ప్రదేశమున నొక రంధ్రముండి ఆరంధ్రము ఒక మూతతో మూయబడియుండునట. అతడా మూతను తీసి చేతితో చూడగా కుక్షిప్రదేశమున నుండెడి యవకాశభాగములో ఒక ఘనపదార్థము అతని చేతికి తగులునట. ఆ పదార్థము ఏమైనదీ దాని స్వరూప స్వభావములనింతవరకు తెలిసినవారెవ్వరుగాని లేరని చెప్పుదురు. ఆ పదార్థమును చేతితో దీసికొని నూతన బింబముయొక్క కుక్షియందు సమంత్రకముగ దానిని ప్రవేశపెట్టునట. ఆ పదార్థము నూతన బింబమందు ప్రవేశించినంతనే నూతన బింబము సుప్రతిష్ఠముకాగలదట. అవల యేదైన వైదికకలాపము జరుగవచ్చును. తలుపులను తెరచి ప్రాచీన బింబముల నుద్ధరించి బైటకు తెచ్చి నూతన బింబములను ఉచిత స్థానమున నిలుపుదురు. ప్రాత బింబములను యథావిధిగ బైటప్రాకారమునదో పవిత్రమగు స్థలాంతరమునదో భూమియందు లోతైన గర్తమును త్రవ్వి అందు స్థాపించి ఆ నేలపై పుష్పోద్యానములను నిర్మింతురు. ప్రాణప్రతిష్ఠ చేసిన ఆచార్యుడు అనతికాలమున నీలోకమును విడచి తప్పక భగవత్సాన్నిధ్యము చేరుటకలదు. ఐనను 'కృతకృత్యాః ప్రతీక్షన్తే మృత్యుం ప్రియమివాతిథిమ్' అనునట్లు భగవత్సాన్నిధ్యమును చేరుట యందాత్రము కలిగిన మహనీయులు వృద్ధులు యువకులు యెవరైనను వారివారి అదృష్ట విశేషముచే ప్రోత్సహించబడి అహమహమికతో

ఇట్టి కైంకర్యము లభింపదగునేమను నాశతో ఈ కైంకర్యమునకు ముందుకు వచ్చుటను అతిశయోక్తిగా మనము భావించరాదు. పూర్వకాలమందిట్టి ప్రాణప్రతిష్ఠ చేయువారలు ప్రతిష్ఠా క్షణోత్తర క్షణమందు గర్భమందిరముననే కాలధర్మము చెందుచుండిరనుటయు ప్రతీతికలదు. ఈ పునఃప్రతిష్ఠా విధానము జీర్ణోద్ధారమని శాస్త్రములందు పేర్కొనబడెనది. కాని ఈ దివ్యక్షేత్రమందీ కలాపమునకు 'కళేబరయాత్ర' యను సంకేత వ్యవహారము ప్రసిద్ధమై వచ్చుచున్నది. ఇది ప్రతిష్ఠయందలి విశేషము.

'ఇక నిత్యారాధనమందు మరియొక విశేషము. ప్రతిరోజు భగవానునకు షట్కాలారాధనము జరుగుచుండును. సాధారణ దినములలో ప్రతిదినము సుమారు నూరు మూటలు(బస్తాలు) బియ్యము అన్నప్రసాదముగను ఇంకను భక్ష్యములు పలువిధములు విశేషించి నివేదనము సమర్పింపబడును.

కారము పులుసు మాత్రము చేర్చుటలేదని యందురు. ఉప్పుకూడ చేర్చుటలేదు. విశేషదినములలోను ప్రార్థనారూపముగను చేయబడు అన్నప్రసాదము అపరిమితముగ నుండును. ప్రసాదము భగవత్సన్నిధానమునకు చేర్చబడిన వెనుక నివేదనము చేయుటకు ఒక అర్చకుడు గుడిలో ఉండును. బహిర్ద్వారకవాటములు మామూలుగ మూయబడును. భగవానునకు మంత్రపూతమగు హవిస్సును సమర్పించుటకు ముందుగ నా యర్చకుడు తన యరచేతిలో ఉదకము నుంచుకుని ఆ యుదకము నేకాగ్రముగ చూచుచుండునట. భగవానుడు బింబమూర్తినుండి దివ్యశక్తితో బయటికి విజయముచేసి ప్రసాదముల పంక్తకు నడచుట అర్చకుని యరచేతి యందలి తీర్థమందాతనికి తెలియ వచ్చునట. అట్లే ప్రతి గమనమును ఆతనికి అదృష్ట వశముగా సాక్షాత్కరించును. భగవానుని గమనాగమనములను ప్రతీక్షించిన అర్చకుడు భగవానుని నివేదనమైనట్లు తెలిసికొని ద్వారములను తెరచునట. ఒకప్పుడీ నివేదన సమయము పూర్తియై తలుపులు తెరచుటకు కొన్ని నిమిషములును ఒకప్పుడు అంతకంటె అధికముగను కాలము పట్టునట. ఒకప్పుడు భగవానుడు స్వీకరించకయే నిరుత్సాహియై వేచియుండిన అర్చకుడు తలుపులు తెరచి ఆయంశమును అధికారులకు నివేదించునట. ప్రసాదములందలి పారిశుద్ధ్యము భోగ్యత మొదలగు గుణసంపత్తియందలి తరతమభావముచేత భగవానుడా నివేదితములను స్వీకరించుటలో త్వరనుగాని మాంద్యమునుగాని చూపువహించుటచే నివేదనకాలము వృద్ధిహ్రాసముల జెందునట. నివేదితములగు ప్రసాదములందు పారిశుద్ధ్యము లేకపోయినప్పుడు భగవానుడు వానిని స్వీకరించుటయే లేదట.

అర్చకులు చెప్పెడు ఈ యుపపత్తిని విశ్వసింపజాలక వారలయందీర్ష్య చెంది వారల నిర్ణయమును పరీక్షింపదలచి పరిభవము జెందిన కొందరధికారుల చరిత్రమును ఈసందర్భమున వివరించుట అవసరము కావచ్చును. ఒకానొకప్పుడొక గొప్ప సంపన్నుడగు గృహస్థుడు అనేకవేల రూప్యములను వెచ్చించి మహాప్రసాదమును సిద్ధముచేయించి భగవానున కర్పింపజేసెను. నాడాప్రసాదమును ప్రభువు ఆరగించలేదు. అర్చకులా విషయము నధికారులకు నివేదించిరి. ప్రసాదము వ్యర్థమై తన ప్రార్థనము పూర్తి కావింపబడకుండుటకు ఖిన్నుడైన గృహస్థుడు అర్చకులు తననుండి యేదైన పారితోషికమును పొందజాలక తనను వంచనచేసి యుందురని భ్రమపడి అధికారులతో చెప్పి ఆప్రసాదమందెట్టి దోషమైనను కలదాయని పరిశీలింప గోరెను. భగవానుడు స్వీకరించనట్టి ప్రసాదమును ఇతరత్ర వినియోగించెడి ఆచారముమాత్ర మక్కడలేదు. అది యెంతటి ప్రసాదమైనను ఎట్టి ప్రసాదమైనను దానిని ఒక లవముకూడ బైటకు రాకుండ భూమిలో ఖననము చేయుట సంప్రదాయము. అట్లు ఖననము చేయునప్పుడు సూక్ష్మముగా పరిశీలించిచూడగా ఎక్కడనో ఆప్రసాదమున నొక పిల్లిపిల్ల చచ్చిపడియుండుటను వారు చూచి ఆశ్చర్యము జెందిరట. పిల్లికూన ప్రసాదములో పడుటకు గతి యెద్దియై యుండునని పాకశాలను పరీక్షించగా అప్పటికి పాకశాల పైభాగమున నొకమూల నొక మార్జారము దానితో మరి రెండు కూనలు కనుబడినవట. అశుచి దుష్టమగు పదార్థము భగవానునకు తెలియుననుటకు వేరేమి సాక్ష్యము కావలెను? ఈ తీరున భగన్మానసమును ప్రకారాంతరముగ తెలిసికొన గలిగిన అర్చకులు మహాభాగ్య సంపన్నులు! ఇట్లె మరియొక సందర్భములో భగవానుడు స్వీకరించక విడచిన ప్రభూతాన్న మందు మత్స్యమొకటి యగుపడిన విశేషమునుకూడ చెప్పుదురు.

'సర్వం జగన్నాథం' అను లోకోక్తిని తెలియనివారు మన భారతభూమియందు ఉండరని నా నమ్మకము. ఈ దివ్యక్షేత్రమున దృష్టిదోషము స్పృష్టిదోషము పాటింపబడుటలేదు. సన్నిధి ప్రసాదమును జాతిమత కుల వివక్షత లేక సమస్తాస్తికులు స్వీకరింతురు. మహాప్రసాదమును గురించిన తాటస్థ్యముగాని నిందగాని అసహ్యాపచారముగ పరిగణింపబడుచున్నది. క్షేత్రమందలి సామాన్య గృహస్థులను ఆరంభముచేసి సంపన్నులగు గ్రామవాసులేమి ఇక్కడ విడిసియుండెడి నూరుసంఖ్యగల మఠ నివాసులేమి అధికారులేమి ఆశ్వచండాల పర్యంతము ప్రతిదినము రెండు వేళలందుగాని లేక ఒక్క పూటగాని భగవత్సన్నిధినుండి లభించెడి ప్రసాదమును స్వీకరించనివారు లేరని నా వినికి.

ఇచ్చటి రథయాత్రకూడ అతిశాస్త్రమును అతిలోకమునై యున్నది. మూలమూర్తులను ముగ్గురు మూర్తులు అనగా శ్రీ జగన్నాథుడు, బలదేవుడు, సుభద్రాదేవి, వీరలను మూడు రథములపై, అధిరోహింపజేసి ఏకపంక్తిని నిలిపి రథ యాత్రను జరిపెదరు. ఈ రథయాత్ర ప్రతిసంవత్సరము ఆషాఢమాసమునందు జరుగును. దానిని సేవించుటకు యావద్భారత మందుండి లక్షలాది భక్తులు విజయము చేసి శ్రీవారిని సేవించి ఉజ్జీవించెదరు. ఇచ్చటి ఇంద్ర ద్యుమ్న సరోవరము మొదలగు తీర్థములు, సముద్ర మట్టము, స్నానమునకు పేర్కొనబడినవి. ప్రాచీనకాలము నుండి రేపటివరకును అవిచ్ఛిన్నముగ ఏకరీతిగ జరిగెడి కళేబరయాత్రనుగురించియు నివేదన రహస్యమును గురించియు సంగ్రహముగ నివేదించుట మాత్రమే ఈ చిన్నివ్యాసమందు నా ఉద్దేశము. క్షేత్రమాహాత్మ్య విస్తరము వ్రాయుట నాకు అలవికానిపని. సర్వసాధారణమగు నితర విశేషములను జెప్పుట అంతటి అవసరమును కాదని తలచెదను.

ఒక్కొక్కచోటను ఆయా ఆలయము లందలి ఒక్కొక్క ప్రత్యేకతను మనము తెలిసికొనగలిగినపుడు మనము సేక రించిన వివిధ రహస్యములను సమిష్టిగాచేర్చి అట్టి అన్ని విశేషములు అన్ని అర్చాబింబములందును సమష్టిగా అన్వయింపగలవను చిత్తవృత్తిని సాధించుటకట్టి విశేషము లను యెవరికి తెలసినంతవరకు వారలు ఇతరులకు నివేదించుట మంచిదని ప్రార్థించెదను.

'నీలాచలనివాసాయ నిత్యాయ పరమాత్మనే।
సుభద్రాప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్.॥

---

# ఉపాసనారహస్యము

(గతసంచిక తరువాయి)

జ్యోతిష విద్వాన్, ఆగమవిశారద, తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి.

## 5

శివశక్తులకు పంచవిధ సామ్యమును బోధించునదిగాన సమయమతమనబడును. అట్టి సమయమతమును విచా రించుటకు ముందు శ్రీచక్రమందు గల దేవతా విశేష ములు తెలుసుకొనుట అవసరము. శ్రీచక్రము నవయో న్యాత్మకములగు నవచక్రములతో యేర్పడినది, అని పూర్వమే చెప్పబడినది. ఈ నవచక్రములలో నున్న దేవతావిశేషములు క్రమముగా యిట్లు శాస్త్రమునందు చెప్పబడియున్నవి. అందు

(1) పరబ్రహ్మచక్రమగు సర్వానందమయరూప బిందు చక్రమునందు షోడశకళానిత్యలకు మూలమగు షోడశాక్షర మంత్రరూపమై ఓడ్యాణపీఠాదిదేవతయగు మహా త్రిపుర సుందరి యను శక్తి నమస్తదేవతారూపమై సమస్త మంత్ర రూపమై సర్వవర్ణాత్మకమై సర్వచక్రాధిదేవతయై నాదబిందు కళాతీతమై శివశక్తిసంపుటమైన షట్త్రింశతత్త్వాత్మకమై ఆత్మరూపముతో యలరారుచున్నది. ఈ చక్రాధిదేవత యగు మహా త్రిపురసుందరి పరాపర రహస్యయోగిని యను పేరుతో శాన్తరసరూపిణియై ప్రకాశింపుచున్నది.

ఇట్లు సహస్రారకమలమందు చతుష్కోణ మధ్యవర్తి యగు బిందుమధ్యలో పరాపర రహస్యమైన బిందువగు శక్తిలో నాదమగు శివుడు సమస్త జగదుత్పత్తిహేతువగు శివశక్తి సంపుట నాదబిందు కళాతీతతత్త్వమై ఆత్మయను పరబ్రహ్మ ప్రకాశింపుచున్నాడు—

(2) సర్వసిద్ధిప్రదమగు త్రికోణచక్రమునందు ప్రథమ కోణమైన అగ్నిచక్రమున కామగిరిపీఠాధిదేవత ఇచ్ఛా శక్త్యాత్మక సృష్టికృత్యమునకు కారణమగు వాగ్బీజముతో శక్తికూటరూపమగు అగ్నిఖండరూపిణియై కామేశ్వరీశక్తి యునూ,

ద్వితీయ కోణమైన సూర్యచక్రమున జాలంధరపీఠాధి దేవత జ్ఞానశక్త్యాత్మక స్థితికృత్యమునకు కారణమగు కామ రాజ బీజముతో మధ్యకూటరూపమగు సౌరఖండరూపిణియై వజ్రేశ్వరీశక్తియునూ,

తృతీయ కోణమైన సోమచక్రమున పూర్ణగిరిపీఠాధి దేవత క్రియాశక్త్యాత్మక సంహార కృత్యమునకు కారణమగు శక్తిబీజముతో ప్రథమకూట రూపమగు సోమఖండ రూపిణియై భగమాలినియునూ ప్రకాశింపుచున్నారు. ఈ చక్రాధిదేవత త్రిపురాంబయను శక్తి అతిరహస్యయోగిని అద్భుతరసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు త్రికోణచక్రమగు చతుర్దళపద్మమందు త్రికోణ కర్ణికతోగూడిన మూలాధార చక్రమందు అతి రహస్య

యోగినియగు సాకినీశక్తి అస్థ్యధిదేవతయై పంచముఖము లతో అంకుశము మొదలుగా గల ఆయుధములను ధరించి వరదాంబాది యోగినులతో ప్రకాశింపుచున్నది.

మూలాధారస్థపద్మేశ్రుతిదళలసితే పంచవక్త్రాంత్రి నేత్రాం
ధూమ్రాభామస్థిసంస్థాంసృణిమపి కమలం పుస్తకం జ్ఞానముద్రాం
బిభ్రాణాంబాహుదండైః సులలితవరదా పూర్వ శక్త్యా వృతాంతాం
ముద్గాన్నాసక్తచిత్తాం మధుమదముదితాం సాకినీంభావ యామః ॥

(3) సర్వరోగహరమగు అష్టాకరచక్రమందు అష్టవర్గాత్మకబీజములతో క్రమముగా వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, సర్వేశ్వరీ, కౌళినీవాగ్దేవతలు దానిమ్మపువ్వు రంగు గలిగి నాల్గు చేతులతో ధనుర్బాణములు అక్షమాల పుస్తకమును ధరించి ప్రకాశింపుచున్నారు. ఈ చక్రాధిదేవత త్రిపురాసిద్ధాయను శక్తి రహస్యయోగిని హాస్యరసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు వసుకోణచక్రమగు షడ్దలపద్మమందు వసుకోణ కర్ణికతోగూడిన స్వాధిష్ఠాన చక్రమందు రహస్యయోగిని యగు కాకినీశక్తి మేదోధాత్వధిదేవతయై నాల్గు ముఖము లతో శూలము మొదలుగా గల ఆయుధములను ధరించి బందిన్యాదియోగినులతో ప్రకాశింపుచున్నది.

స్వాధిష్ఠానాఖ్య పద్మేరసదళలసితే వేదవక్త్రాంత్రినేత్రాం
హస్తాభ్యాంధారయంతీంత్రి శిఖగుణకపాలా భయా న్యాత్త గర్వాం
మేదోధాతు ప్రతిష్ఠామలిమదముదితాంబంధినీ ముఖ్యా యుక్తాం
పీతాందధ్యోదనేష్టామభిమత ఫలదాం కాకినీంభావ యామః ॥

(4) సర్వరక్షాకరమగు అంతర్దశారచక్రమందు యకారాది దశబీజములతో క్రమముగా సర్వజ్ఞా, సర్వశక్తి, సర్వైశ్వర్యప్రదా, సర్వజ్ఞానమయీ, సర్వవ్యాధివినాశనీ, సర్వాధారస్వరూపా, సర్వపాపహరా, సర్వానందమయీ, సర్వరక్షాస్వరూపిణీ, సర్వేప్సితఫలప్రదా - శక్తులు కర్పూర గౌరవర్ణము గలిగి నాలుగుచేతులతో వరదాభయములు పుస్తకము, అక్షమాలయును, ఆయుధములు ధరించి ప్రకాశింపుచున్నారు. ఈ చక్రాధిదేవత త్రిపురమాలినీశక్తి నిగర్భయోగిని రౌద్రరసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు అంతర్దశారచక్రమగు దశదళపద్మమందు దశకోణ కర్ణికతో గూడిన మణిపూర చక్రమందు నిగర్భయోగిని యగు లాకినీశక్తి మాంసాధిదేవతయై మూడు ముఖములతో వజ్రాది ఆయుధములు ధరించి డామర్యాది యోగినులతో ప్రకాశింపుచున్నది.

దిక్పత్రేనాభి పద్మేత్రివదనవిలసద్దంష్ట్రిణీం రక్తవర్ణాం
శక్తిందంభోళిదండావ భయమపి భుజైర్ధారయన్తీం మహోగ్రాం
డామర్యాద్యైఃపరీతాం పశు జనభయదాం మాంసధాత్వైకనిష్ఠాం
గౌడాన్నాసక్త చిత్తాం సకల సుఖకరీం లాకినీం భావయామః ॥

(5) సర్వార్థసాధకమగు బహిర్దశారచక్రమందు కాది దశబీజములతోక్రమముగా సర్వసిద్ధిప్రదా,సర్వసంపత్ప్రదా, సర్వప్రియంకరీ, సర్వమంగళకారిణీ, సర్వకామప్రదా, సర్వదుఃఖవిమోచనీ, సర్వమృత్యుప్రశమనీ, సర్వవిఘ్ననివారిణీ, సర్వాంగసుందరీ, సర్వసౌభాగ్యదాయినీ - శక్తులు హిమాంశుసంకాశ వర్ణముతో నాల్గు చేతులు వరదాభయ పుస్తకాక్షమాలలతో ముక్తాహారములతో ప్రకాశింపుచున్నారు. ఈ చక్రాధిదేవతయగు త్రిపురా శ్రీ దేవి కులోత్తీర్ణ యోగిని భీభత్సరసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు బహిర్దశార చక్రమగు ద్వాదశదళపద్మమందు దశ కోణకర్ణికతో గూడిన అనాహతచక్రమందు కులోత్తీర్ణ యోగినియగు రాకినీశక్తి రక్తధాత్వధిదేవతయై రెండు ముఖములతో అక్షమాలికాది ఆయుధములను ధరించి కాళరాత్ర్యాది యోగినులతో ప్రకాశింపుచున్నది.

హృత్పద్మేభానుపత్రేద్వివదనలసితాం దంష్ట్రిణీం శ్యామవర్ణాం
అక్షంశూలంకపాలం డమరుమపి భుజైర్ధారయన్తీం త్రినేత్రాం
రక్తస్థాంకాలరాత్రి ప్రభృతి పరివృతాం స్నిగ్ధభక్తైకసక్తాం
శ్రీమద్వీరేంద్రవంద్యా మభిమతఫలదాం రాకినీం భావయామః ॥

(6) సర్వసౌభాగ్యదాయకమగు చతుర్దశకోణచక్రమందు టాదిచతుర్దశబీజములతో క్రమముగా సర్వసంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వాహ్లాదినీ, సర్వసమ్మోహినీ, సర్వస్తంభినీ, సర్వజృంభిణీ, సర్వవశంకరీ, సర్వరంజనీ, సర్వోన్మాదినీ, సర్వార్థసాధనీ, సర్వసంపత్తిపూరణీ, సర్వమంత్రమయీ, సర్వద్వంద్వక్షయంకరీ - శక్తులు ప్రవాళ వర్ణము గలిగి నాల్గు చేతులతో అభయవరదములు ధనుర్బాణములు ధరించి ప్రకాశింపుచున్నారు. ఈ చక్రాధి దేవతయగు త్రిపురవాసినీశక్తి సంప్రదాయయోగిని భయానక రసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు చతుర్దశకోణ చక్రమగు షోడశదళ పద్మమందు చతుర్దశకోణ కర్ణికతోగూడిన విశుద్ధి చక్రమందు సంప్రదాయయోగినియగు డాకినీశక్తి త్వగ్ధాత్వధిదేవతయైఖట్వాంగము మొదలుగాగల ఆయుధములను ధరించి ఒకముఖముతో అమృతాంబాది యోగినులతోనూ ప్రకాశింపుచున్నది.

గ్రీవాకూపే విశుద్ధౌ నృపదళకమలే శ్వేతరక్తాంత్రినేత్రాం
హస్తైః ఖట్వాంగఖడ్గౌ త్రిశిఖమపి మహాచర్మ
సంధారయన్తీం
వక్త్రైనైకేనయుక్తాం పశుజనభయదాంపాయ
సాన్నైకసక్తాం
త్వక్స్థాంవందేఽమృతాద్యైః పరివృతవపుషండాకినీం
వీరవంద్యాం ॥

(7) సర్వసంక్షోభణమగు అష్టదళ చక్రమందు కావ్యష్ట వర్ణబీజములతో క్రమముగా అనంగకుసుమా, అనంగ మెఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగమాలినీ-శక్తులు రక్త వర్ణము గలిగి రెండు హస్తములతో పుష్పబాణములు చెరకువిల్లు ధరించి ఎర్రని పుష్పమాలలతో ప్రకాశింపు మన్నారు. ఈ చక్రాధిదేవతయగు త్రిపురసుందరీ శక్తి గుప్తతరయోగిని కరుణారసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు అష్టదళ చక్రమగు ద్విదళపద్మ ప్రథమదళమందు అష్టదళ కర్ణికతోగూడిన ఆజ్ఞాచక్రమందు హాకిని శక్తి గుప్తతర యోగిని మజ్జాధాతు అధిదేవతయై ఆరుముఖములతో తెల్లని వర్ణముకలిగి జ్ఞానముద్ర మొదలగు ఆయుధములు ధరించి హంసవత్యాది యోగినులతో ప్రకాశింపుచున్నది.

భ్రూమధ్యే బిందు పద్మేదళ యుగకలితే శుక్ల
వర్ణాం కరాబ్జైః
బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుకమమలామక్షమా
లాంకపాలాం
షట్చక్రాధారమధ్యాం త్రినయనలసితాం
హంసవత్యాది యుక్తాం
హరిద్రాన్నైక సక్తాంసకల సుఖకరీం హాకినీం
భావయామః ॥

(8) సర్వాశా పరిపూరకమగు షోడశదళ చక్రమందు అకారాది షోడశస్వర బీజములతో క్రమముగా కామాకర్షిణీ బుద్ధ్యాకర్షిణీ అహంకారాకర్షిణీ శబ్దాకర్షిణీ స్పర్శాకర్షిణి రూపాకర్షిణీ రసాకర్షిణీ గంధాకర్షిణీ చిత్తాకర్షిణీ ధైర్యాకర్షిణీ స్మృత్యాకర్షిణీ బీజాకర్షిణీ ఆత్మాకర్షిణీ అమృతాకర్షిణీ శరీరాకర్షిణీ-శక్తులు రక్తవర్ణము గలవారై పాశము అంకుశము అను ఆయుధములను ధరించి స్వర్వాభరణములతో ప్రకాశింపుచున్నారు. ఈ చక్రాధిదేవతయగు త్రిపురేశ శక్తి గుప్తయోగిని వీరరసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు షోడశదళ చక్రమగు ద్విదళపద్మ ద్వితీయ దళమందు షోడశదళ కర్ణికతోగూడిన ఆజ్ఞాచక్రమందు గుప్త యోగినియగు హాకినీశక్తి పూర్వమువలెనే ప్రకాశింపుచున్నది.

(9) త్రైలోక్య మోహనమగు చతురస్ర చక్రములో ప్రథమ రేఖయందు అకారాది హ్రస్వస్వరములు ఎనిమిది బీజములతో అసితాంగభైరవ రురుభైరవ చండభైరవ క్రోధభైరవ ఉన్మత్తభైరవ కపాలభైరవ భీషణభైరవ సంహారభైరవు లున్నారు.

ద్వితీయ రేఖయందు అకారాది దీర్ఘస్వర బీజములతో బ్రాహ్మీమాహేశ్వరి కౌమారీ వైష్ణవీ వారాహీ ఇంద్రాణీ చాముండా మహాలక్ష్మీ శక్తులున్నా,

తృతీయ రేఖయందు ముద్రాబీజములతో సర్వసంక్షోభిణీ సర్వవిద్రావిణీ సర్వాకర్షిణీ సర్వశంకరీ సర్వోన్మాదినీ సర్వమహాంకుశా సర్వఖేచరీ సర్వబీజ సర్వయోని సర్వత్రిఖండముద్రా శక్తులు ప్రకాశింపుచున్నారు. ఈ చక్రాధిదేవత త్రిపురాశక్తి ప్రకటయోగిని శృంగారరసరూపిణియై యలరారుచున్నది.

ఇట్లు భూపురత్రయ చతుష్కోణ చక్రము సహస్రార చక్రమందు కర్ణికారూపమై అకారాదిక్షకారాన్తము అను లోమవిలోమముగా పదవార బీజములతో అమృతాది మహా యోగినులతోగూడిన సహస్రసోపానములతో ప్రకాశించు చతుర్ద్వారములయందు గంధాకర్షిణీ రూపాకర్షిణీ రసాకర్షిణీ స్పర్శాకర్షిణీ యను శక్తులచే సేవింపబడుచూ ప్రకటయోగినియగు యాకినీశక్తి శుక్రధాతు అధిదేవతయై సర్వాయుధములతో ప్రకాశింపుచున్నది.

ఇట్లు నాదరూపమగు శ్రీచక్రము బిందువగు దేహములో గల దేవతా విశేషములకు అవినాభావము తెలియుచున్నది. నాదమగు శివుడు బిందువగు శక్తి ఏకమై కళారూప బ్రహ్మాండ పిండాండములను సృష్టించి రక్షించి సంహారము చేయుచూ సమస్తమునకూ కారణమైయున్నారు.

పైన చెప్పనప్రకారము నాదరూపమగు శ్రీచక్రమును బిందువగు దేహమును గూర్చి విచారింతము. శివునివలన వెలువడిన నాదము పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ అను నాల్గు రూపములు గలదియని వెనుకనే చెప్పబడినది. అందు పరారూపమగు నాదము త్రికోణ చక్రముగనూ పశ్యంతీ నాదము అష్టకోణముగనూ మధ్యమా రూపమగు నాదము దశారద్వయముగనూ వైఖరీ రూపమగు నాదము చతుర్దశకోణరూపముగనూ పరిణామము పొందుటవలన శ్రీ చక్రము నాదరూపమెగాని వేరుగాదు

ఈ చతుర్విధనాదమువల్ల గలిగిన బిందువే శ్రీ చక్రమందు బిందువై ఆ బిందువే పది రూపములను పొంది దేహమందు ఆధారాదిచక్రములుగా పరిణామము పొందుట వలన బిందువనగా దేహముగాని వేరు గాదు. పరిణామము యీ క్రమముగా తెలియవలయును. ఆధార చక్రమందు నాల్గు దళములు నాల్గు బిందువులున్నూ స్వాధిష్ఠాన చక్ర

మందు ఆరు దళములు ఆరు బిందువులుగానున్నూ ఒకే బిందువు పరిణామము పొందినది. ఆధార రూపమగు నాల్గు బిందువులు స్వాధిష్ఠాన రూపమగు ఆరు బిందువులు కలిసి మణిపూర రూపచక్రమున పది బిందువులు అయి వున్నవి; మణిపూరకమందు పది బిందువులున్నూ వెనుకటి ఆధారస్వాధిష్ఠానములనే రెండు చక్రములుకలిసి పన్నెండు దళములై అనాహతచక్రము పరిణామము పొందియున్నది. అనాహతమందు గల పన్నెండు దళములున్నూ ఆధారమందు గల నాల్గు దళములున్నూ కలిసి పదునారు దళములై విశుద్ధ చక్రము పరిణామము పొందియున్నది. మరియూ మణిపూరక దళములు పదియున్నూ స్వాధిష్ఠానమందుగల దళములు ఆరున్నూకలసి పదునారు దళములై విశుద్ధి చక్రము పరిణామము పొందియున్నది. తిరిగి ఆధార చక్రమున్నూ స్వాధిష్ఠాన చక్రమున్నూ రెండు చక్రములు ఆజ్ఞా చక్రమందు గల రెండు దళములుగా పరిణామము పొందియున్నవి. అందువలన ఆధారస్వాధిష్ఠానచక్రములు రెంటిలోను మిగిలిన చక్రములు అంతర్భూతములై యున్న వనుట సిద్ధము. ఒక్క బిందువే పది బిందువులై యున్న వనుటసిద్ధము. ప్రధానబిందువు అగు మనస్సు క్రమముగా మనస్సు బుద్ధి చిత్తము అహంకారములుగా ఆధార మందునూ—కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య రూపములుగా స్వాధిష్ఠానమందునూ మారుటవలన సమస్త దేహము బ్రహ్మాండముగూడా బిందువగు శక్తికంటె వేరు గాదని తెలియుచున్నది.

శ్లో॥ దశధావిద్యతే బిందురేక ఏవపరాత్మకః
చతుర్ధాధారకమలే షోఢాధిష్ఠాన పంకజె
ఉభయాకారరూపత్వాదిత రేషాం తదాత్మతా॥

అనుటవలన ఒక్కటి యగు బిందువు మూలాధారాది షట్చక్రములుగా పరిణామము పొంది సహస్రార కమల మందు చతుష్కోణ కర్ణిక యగు బిందువై శక్తిరూపముతో నున్నది. ఆ బిందువగు శక్తిలో శివుడు నాదరూపమై యున్నాడు. అట్టి బిందువు సకల జగదుత్పత్తి స్థితిసంహార ములకు కారణమై యున్నది—

శ్రీ చక్రము సోమసూర్యాగ్న్యాత్మక త్రిఖండరూప మని పూర్వమె చెప్పబడినది. ఇప్పుడు శ్రీ చక్రమునకు కాలము నకు అవినాభావము చెప్పబడుచున్నది. ఇట్టి త్రిఖండము లలో సోమఖండాధిదేవత యగు చంద్రునకు గల పదు నారు కళలు పదునారు నిత్యలై విశుద్ధి స్థానమున ప్రతిభ మించుచున్నారు. ఇందులో పదునేను నిత్యలు పంచ దశ తిథి రూపములను పొంది కాలాత్మక సూర్యమండల మును పొంది కృష్ణపక్షమును, చంద్రమండలమును పొంది శుక్లపక్షమును కలుగజేయుచున్నారు. ఇట్టి నిత్యారూపము లగు కళలే పరాశక్తి ప్రతిపాదక పంచదశీ మంత్రగత వర్ణ రూపములై యున్నవి. ఈ వర్ణములకుగూడా త్రిఖండ త్వము గలదు. ప్రథమ ఖండము అగ్నిరూపము ద్వితీయ ఖండము సూర్యరూపము తృతీయ ఖండము సోమ రూపము అయియున్నవి. ప్రథమఖండమగు అగ్నికి ద్వితీయ ఖండమగు సూర్యునకు మధ్యలో హృల్లేఖ యగు భువనే శ్వరీ మంత్రముతో సంధానము చేయబడియున్నది; అనగా అగ్నిఖండమగు ఆధార స్వాధిష్ఠాన చక్రములకుపైన సూర్య ఖండమగు మణిపూరక అనాహత చక్రములకు క్రిందనూ రుద్రగ్రంథియునూ శ్రీ చక్రగతమగు అగ్నిఖండములో అష్ట కోణచక్రమునకు పైన సూర్యఖండములోని దశార చక్రము నకు మధ్య వృత్తత్రయములో ఏకవృత్తమును ఏర్పడి యున్నవి.

అట్లె ద్వితీయఖండమగు సూర్యఖండమునకు తృతీయ ఖండమగు సోమఖండమునకు మధ్యలో హృల్లేఖయగు భువనేశ్వరీ బీజముతో సంధానము చేయబడినది. అట్లె సూర్యఖండమగు అనాహత చక్రమునకు పైననూ సోమ ఖండములోని విశుద్ధి చక్రమునకు క్రిందనూ విష్ణుగ్రంథి యున్నూ శ్రీచక్రగతమగు చతుర్దశకోణ చక్రమునకు పైన అష్టదళ చక్రమునకు క్రింద ఏకవృత్తమున్నూ ఏర్పడి యున్నవి.

అట్లె తృతీయఖండమగు సోమఖండమునకు తురీయ ఖండమగు చంద్రఖండమునకు మధ్య హృల్లేఖయగు భువ నేశ్వరీ బీజముతో సంధానము చేయబడియున్నది. అటు లనే ఆజ్ఞాచక్రమునకు పైన సహస్రారమునకు క్రిందనూ బ్రహ్మగ్రంథియున్నూ శ్రీచక్రగతమగు షోడశదళ చక్రము నకు పైన చతుష్కోణచక్రమునకు క్రిందనూ ఏకవృత్తము న్నూ ఏర్పడియున్నవి. ఈవిధముగా చక్ర మంత్ర దేహ ములకు అవినాభావము గలదు. తిథిరూపములగు నిత్యలు కామేశ్వరీ భగమాలినీ నిత్యక్లిన్నా భేరుండా వహ్నివాసినీ మహా వజ్రేశ్వరీ రౌద్రీ త్వరితా కులసుందరీ నిత్యా నీల పతాకా విజయా సర్వమంగళా జ్వాలామాలినీ చిత్రా-యను పదునేను నిత్యలున్నూ సర్వత్రా అధిష్ఠానముగల త్రిపుర సుందరియగు నిత్యతోగూడి పదునారు నిత్యలూ శ్రీచక్రము నందు అంతర్భావము గలిగియున్నారు. యీ నిత్యలు శుక్ల కృష్ణ పక్షభేదములతో అగ్నిసోమరూపులై దివారాత్ర ములకు అధిదేవతలై యున్నారు (అగ్న్యంతర్భో భానుః అనుటవలన సూర్యుడు అగ్నికంటె వేరు గాడు) యీ నిత్యలు శ్రీచక్రమునందు యీ క్రిందివిధముగ నున్నారు. సహస్రారమందు చతుష్కోణమునకు పైన బిందువుకు క్రిందనూ సోమసూర్య అగ్నిరూప (భావనాత్మక) త్రికోణ మందు ప్రాగాదిక్రమముగా ప్రథమరేఖయందు ఐదుగు

చున్నూ ద్వితీయరేఖయందు ఐదుగురున్నూ తృతీయరేఖ యందు ఐదుగురున్నూ కామేశ్వరీ మొదలుగా పదునేను నిత్యలున్నూ చతుష్కోణ మధ్యవర్తి బిందువులో త్రిపుర సుందరియున్నూ యిట్లు నిత్యలు చంద్రఖండమందు కళారూపమై వెలయుచున్నారు. ఇట్లే అష్టకోణ చక్ర మందునూ అష్టదళచక్రమందునూ యిద్దరు నిత్యల ప్రకారమున్నూ షోడశదళ చక్రమందు వరుసగా పదునార్గురు నిత్యలున్నూ చతుర్దశ కోణమందు మొదటి యిద్దరుగాక మిగిలిన పదునాల్గు నిత్యలున్నూ బిందువునందు మొదటి యిద్దరున్నూ వశారయుగ్మమందునూ భూపురమందునూ యిట్లే అంతర్భావము గలిగియున్నారు.

ఇట్లు నాదాఖ్యకళయగు త్రిపురసుందరీ శక్తి చతుష్కోణ మధ్యవర్తి బిందులో చంద్రమండలమునందుండ తన చరణమునందుండి వెలువడు జ్యోత్స్నానామక సుధా ధారాసేచనమువల్ల విశుద్ధియందు చంద్రకళలకు కాన్తిని కలుగజేయుచుండగా పదునైదు కళలతో చంద్రుడు విశుద్ధిస్థానమున పరిభ్రమించుచుండును. సంవిత్కమల మగు అనాహత మందుండు సూర్యుడు ద్వాదశ కళలతో ద్వాదశాదిత్య రూపమును పొందియున్నాడు. ఇట్లు రాత్రి నాథుడగు చంద్రుడు విశుద్ధియందుండి పీయూషమును సవ్యమార్గముగా పరిభ్రమించుచూ ఆధారమువరకూ వ్యాపించిన డెబ్బది రెండువేల నాడులకు వర్షిస్తూండగా పగటికి కర్తయగు సూర్యుడు అనాహత మందుండి దక్షిణ మార్గముగా పరిభ్రమించుచూ ఆపీయూషబిందువులను ఉపాహరించుచున్నాడు. ఇట్లు తిరుగుటలో ఆధార మందు చంద్ర సూర్యులకు ఎప్పుడు సమావేశము జరుగునో అప్పుడు అమావాస్యవచ్చును. ఎప్పుడు చంద్ర సూర్యులు దూరమగుదురో అప్పుడు పూర్ణిమ వచ్చును.

ఇట్లు ఒక్కటియగు బిందువు ఆధారాది చక్రములుగా పరిణామము పొంది ఆధారమునందు కుండలినీ రూపముతో పైనచెప్పిన విధముగా చంద్రునివలన గలుగు అమృతమును త్రావుచు సర్వదా నిద్రావస్థను పొంది ఆధార కుండమందు వుండును; దీనినే కుండలినీ శక్తియందురు.

చంద్ర సూర్యులకు దేవయానము పితృయానము అను పేర్లతో ఇడాపింగళా మార్గములలో అహోరాత్రముల యందు సంచారము యోగశాస్త్ర సిద్ధము గాన సాధకుడు కుండలినీ శక్తి చాలనముచేసి షట్చక్రభేదనము చేయుటకు ముందు ఇడా పింగళయను నాడులలో ప్రయాణముచేయు హంసరూపమగు వాయువును రేచకపూరక ములతో ప్రాణాయామముచేసి అభ్యాస వశముచే కుంభకము వలన వాయువుచేత చంద్ర సూర్య మార్గములను అడ్డగించగా సంచారములేని కారణముచే సహస్రారమునుండి స్రవించు సుధను ఆస్వాదించుటకు సూర్యునకు శక్యము గాదు గనుక ఆధారకుండమును సూర్యకిరణ సంపర్కము లేకపోవుటచే మూర్ఛపుగును. దానివలన ఆహారములేని కుండలినీశక్తి కుపితయై బుసగొట్టుచు సర్పమువలె ఫూత్కారము చేయుచూ నిద్రమండి మేల్కొని ఉత్థానమైన యితర మార్గములు (అనగా ఇడ పింగళ) నిరుద్ధమగుటవలన సుషుమ్నా మార్గమున బయలువెడలి షట్చక్రభేదనము జేయుచు రుద్రగ్రంధి విష్ణుగ్రంధి బ్రహ్మగ్రంథులను భేదించి సహస్రారకమలమందుగల చంద్రమండల పీయూషమును గ్రహించి తన్మధ్యగత శివునితో కలసి ఆనంద రూపమును పొందును. ఇదియె కుండలినీ చాలనమని యోగశాస్త్రమునందు చెప్పబడుచున్నది, దీనినే మహావేధ యనిగూడ చెప్పుదురు. ఈ మహావేధా స్వరూపమును వాతులకేశ్వర తంత్రమునందు యిట్లు చెప్పబడినది—

భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా
శక్తిఃకుండలినీ నామబిసతంతు నిభాఽశుభా
మూలకందంఫణాగ్రేణ దంష్ట్వాకమలకందవత్
ముఖేనపుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమన్వితా
పద్మాసనగతా స్వస్థాగుదమా కుంచ్యసాధకః
వాయుమూర్ధ్వగతం కుర్వన్కుంభ కావిష్టమానసః
వాయ్వాఘాతవశాదగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్
జ్వలనాఘాతపవనా ఘాతైరున్నిద్రితోఽహిరాట్
బ్రహ్మగ్రంధింతతోభిత్వా విష్ణుగ్రంధింభినత్తతః
రుద్రగ్రంధిం విభిద్యైవ కమలానిభినత్తిషట్
సహస్ర కమలేశక్తిః శివెన సహమోదతె
సాచావస్థాపరాజ్ఞేయాసైవ నివృతికారణం ॥

ఇట్టి కుండలినీ ప్రబోధము శుక్ల పక్షమున మాత్రమే వీలుకలుగును గాని కృష్ణ పక్షమున వీలుగలుగదు. మరియు రాత్రులయందు మాత్రమె చంద్రకళా సంచారముగాన రాత్రులయందు సౌదామినీ కళారూపమగు భగవతీ సమారాధనము యుక్తము. రాత్రులు మధువును తయారు చేయుకాలములు. పగళ్లుమధువును హరించు కాలములు. ఈ విషయము శృతియున్నూ యిట్లు చెప్పియున్నది. తైత్తిరీయ కాఠకమున.

ఇయం వావ సరఘా। తస్యా అగ్నిరేవ సారఘం మధు। యావితాః పూర్వపక్షాఽపరపక్షయోరాత్రయః। తామధు కృతః। యాన్యహాని। తేమధువృషాః। తయోహవా ఏతా మధుకృతశ్చ మధువృషాగ్శ్చవేద। కుర్వంతిహాస్యైతా అగ్నౌమధు। నాస్యేష్టా పూర్తంధయంతి। అథయోనవేద। ధయంత్యస్యేష్టా పూర్తం ॥ ఇతి॥

గనుక సాధకులు యీ వివరము తెలసి రాత్రికాలముల యందే కుండలినీ ప్రబోధముచేసి భగవతీ అనుగ్రహముచే

సర్వకోరికలూ పొందుదురు. తెలియక ఆచరించినవారు కుండలినీశక్తి చాలనము చేయలేక భగవతీ అనుగ్రహమును పొందలేరు. కనుక చంద్రకళలే నిత్యారూపములు, నిత్యలేతిథి రూపములు, తిథులు కాలరూపములు, గాన కాలమునకు శ్రీచక్రమునందు అంతర్భావము గలదు. తిథులను చెప్పుటచే ఉపలక్షణముగా పక్షములు మాసములు ఋతువులు అయనములు సంవత్సరములుగూడ చక్రవిద్యయందు అంతర్భావము గలవియే యగుచున్నవి.

శ్రీచక్రము నాదాత్మకమగుటవలన నాదరూపములగు మాతృకలకుకూడ చక్రమందు అంతర్భావముగలదు. ఈ అంతర్భావమునుగూర్చి విచారింతము. మాతృకలు త్రిఖండాత్మకము గాన త్రిఖండాత్మకమగు చక్రమందు అంతర్భావము. యాదులు నాల్గు శాదులు నాల్గు అష్టకోణమందు అంతర్భూతమగుచున్నవి. కాని పంచవర్గములు చివర అక్షరములను వదలి పరుసగా దశారద్వయమునందు అంతర్భూతము. ఈవర్గముల చివర అక్షరములు బిందువులో అంతర్భూతము అకారాదిస్వరములు పదునాల్గున్నూ చతుర్దశకోణమునందు అంతర్భూతము అనుస్వార విసర్గలు బిందువులో అంతర్భూతము. ఇట్లు త్రిఖండాత్మక మాతృకలు త్రిఖండాత్మక చక్రమేగాని వేరుగాదు. ఇట్లే నాదబిందు సంయోగ రూపమగు కళలకుకూడ అంతర్భావము గలదు. అగ్నికళలు అగు పదియున్నూ యకారాది బీజములతో అగ్నిఖండమునందు అంతర్భూతము; సూర్యకళలు పన్నెండున్నూ కాదిబీజములతో సూర్యఖండమునందు అంర్భూతము; సోమకళలు పదియారున్నూ షోడశస్వరబీజములతో సోమఖండమునందు అంతర్భూతము. ఇట్లు నాదబిందుకళలకు చక్రదేహములకు మంత్ర చక్రములకు అవినాభావము గలదు. ఈ అవినాభావము తెలియనిదే పంచవిద సామ్యములు షడ్విధైక్యముగల సామయిక మతము తెలియదు గనుక చెప్పబడినది. ఇక సమయాచార రహస్యమును తెలుసుకొందము:—

## 6

శివశక్తులకు పంచవిధ సామ్యమును బోధించునదిగాన సమయమని చెప్పబడుచున్నది. పంచవిధ సామ్యమనగా అధిష్ఠానసామ్యము, అవస్థానసామ్యము, అనుష్ఠాన సామ్యము, రూపసామ్యము, నామసామ్యము - అనునవి. (1) అధిష్ఠాన సామ్యమనగా పరిదృశ్యమానమగు సమస్త బ్రహ్మాండమునకు అధిష్ఠానము సచ్చిదానంద రూపమగు బ్రహ్మ; అట్టి బ్రహ్మ నిర్గుణుడు నామరూప క్రియారహితుడు; సాక్షిమాత్రుడు శివుడు; అట్టి శివునియందు అభివ్యక్తమైన శక్తి సకల బ్రహ్మాండ నిర్మాణమునకు కార్యకర్త్రి. ఈ శక్తి శివునియందభివ్యక్తమగుటవలన శివునికంటె వేరుగాదు. శివుడు తన శక్తిని విడిచి జగత్తును నిర్మాణముచేయలేడు.

శివశ్శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవందేవో నఖలు కుశలః స్పందితుమపి ॥ అనుటవలన శక్తి శివుల కలయికే సృష్టికి కారణమగుచున్నది. కావున సమస్తమునకు కారణము శక్తి శివులగుటవలన శివశక్తులకు అధిష్ఠాన సామ్యముగలదు. మరియు "త్రికోణ రూపిణీ శక్తిః బిందురూపీ శివస్మృతః" అనుటవలన బిందు త్రికోణములకు అవినాభావముచేతనూ ఆధార స్వాధిష్ఠానములు శివశక్తి స్థానములగుటచేతనున్నూ శివశక్తులకు అదిష్ఠాన సామ్యము గలదు.

(2) అవస్థాన సామ్యము—శివుడు తచ్ఛక్తిభూతుడై సకలుడై సప్తతత్త్వములతో బ్రహ్మాండ పిండాండములను సృష్టించి తాను వేరుగాక "తత్సృష్ట్వాత దేవాను ప్రావిశత్" అనుటవలన చతుర్విధ జీవులయందు తాను శక్తిసహితుడై యుండి కాలాత్మకుడై తాను అచలుడైనను చలనాదులు గల్గినట్లు ప్రకాశింపుటవలన శివశక్తులకు అవస్థానసామ్యము గలదు. మరియు ఆనంద భైరవీ ఆనంద భైరవ రూపులగు శివశక్తులు సవాత్మకులై యుండుటవలన - అనగా— కాలవ్యూహ, కులవ్యూహ, నామవ్యూహ, జ్ఞానవ్యూహ, చిత్తవ్యూహ, నాదవ్యూహ, బిందువ్యూహ, కళావ్యూహ, జీవవ్యూహములను నవవ్యూహాత్మకత్వము ఆనంద భైరవునకు గలదు. ఇందులో కాలవ్యూహమనగా నిమేషాది కల్పము వరకూ గల కాలసముదాయము; కులవ్యూహమనగా నీలశ్వేతాదిరూప విశేషములు. నామవ్యూహమనగా సంజ్ఞారూపమగు నామసముదాయము. జ్ఞానవ్యూహమనగా సవికల్ప నిర్వికల్పాది విజ్ఞాన సముదాయము. చిత్తవ్యూహమనగా అహంకార చిత్త బుద్ధి మహా మనస్సులు అను అహంకార పంచకము. నాదవ్యూహమనగా పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ మొదలగునవి. బిందువ్యూహమనగా ఆధారాది షట్చక్ర సంఘము. కళావ్యూహమనగా పంచాశత్కళలు. జీవవ్యూహమనగా చతుర్విధ జీవులు (అండజ, స్వేదజ, ఉద్భిజ్జ, జరాయుజ మొదలగునవి) ఇట్టి నవవ్యూహాత్మకుడు పరమేశ్వరుడు. ఇక శక్తి నవాత్మకత్వము - నాదాత్మక శక్తి పరా, అనగా అంతఃకరణమందు ఊహాత్మికయై సత్వరజస్తమోగుణసామ్యావస్థను పొంది పరా అనియున్నూ సత్వగుణము రజోగుణము తమోగుణము అను మూడు రూపములగు వైషమ్యముగా పశ్యంతి అనియున్నూ మధ్యమా సూక్ష్మస్థూలాది రూపభేదములతో స్థూలరూపమగు వామా, జ్యేష్ఠా రౌద్రీ అంబికా ఇచ్ఛా జ్ఞాన క్రియా శాన్తా పరా అను రూపములతో శ్రీచక్రమందు ఊర్ధ్వాఽధోముఖములుగా వున్న నవశక్తి రూపములుగానున్నూ సూక్ష్మరూప

ముగా నాదరూపమగు నవవర్ణాత్మకముగాను,-అనగా అవర్గ కవర్గ చవర్గ టవర్గ తవర్గ పవర్గ యవర్గ శవర్గ క్షవర్ణ ములను నవవర్గ రూపముగానున్నూ పరస్పరమూ బేద ముతో స్థిరముగా మధ్యమా రూపమున్నూ ఈ నవవర్ణాత్మక మాతృక అన్యోన్య రూపమగు వైఖరీ రూపముగనూ వుండుటవలన మధ్యమారూపమగు చిచ్ఛక్తికి సవాత్మ కత్వము గలదుగనుక శివశక్తులకు శేష శేషిత్వము గలదు. అనగా ప్రళయమందు (సంహారావస్థయందు) సర్వప్రపంచ రూపమగు తత్వములు ఒకదానియందు ఒకటి లయమై ప్రధానమగు ప్రకృతిరూపము పొంది స్వాత్మయందు అంతర్భావముతో నుండుటవలన ఆత్మయగు పరమేశ్వరు నకు శేషత్వమున్నూ శక్తికి శేషిత్వమున్నూ కలుగుట వలననూ శక్తి శివులకు అవస్థాన సామ్యము గలదు.—

శ్రీచక్రము నాదాత్మకమని పూర్వమే చెప్పబడినది. అట్టి నాదాత్మక శ్రీచక్రమందు సవాత్మకమై నాదరూపిణి యగు శక్తికి అంతర్భావమును సాదింతము. పరా అనగా - గుణ సామ్యమగు పరారూపమగు - అనగా త్రిఖండ త్రిశక్తి త్రికూటాత్మకమగు సమష్టిరూప చక్రముగా చక్రమం దైక్యము. పశ్యంతీ - అనగా సత్వరజస్తమోగుణ వైషమ్య రూపములు సోమసూర్యాగ్ని రూపములగు త్రిఖండము లుగాను త్రిఖండమాతృకారూపముగాను త్రిశక్త్యాత్మకము గాను పంచదశాక్షరీ త్రికూటముగాను చక్రమందైక్యము. మధ్యమా—అనగా వెనుక చెప్పిన నవశక్త్యాత్మకముగాను నవవర్గాత్మకముగాను చక్రమందు ఐక్యము. వైఖరీ—అనగా పంచాశన్మాతృకారూపముగాను పంచాశత్కళారూపముగాను నిత్యారూపముగాను యోగినీ రూపముగాను చక్రమందు ఐక్యము.

ఇట్టి చక్రమందు నవవ్యూహములకు ఐక్యము గలదు. చంద్రసూర్యులు కాలాత్మకులు గనుక చక్రమందలి త్రిఖండాత్మక సోమసూర్యాగ్నులలో కాలవ్యూహమునకు ఐక్యము. చక్రమందలి యోగినులగు రక్తనీలాది రూప విశేష శక్తులలో కులవ్యూహమునకు ఐక్యము. సంజ్ఞారూప మగు నామ విశేష రూపములుగల శక్తులలో నామవ్యూహ మునకు ఐక్యము. చక్రమందు గల నవచక్రములలో దేహ మందు గల షట్చక్రములలోనూ జ్ఞానవ్యూహమునకు ఐక్యము. మనస్సనే ప్రధాన బిందువు దశథాపరిణామము పొంది చక్రాత్మకత్వమును పొందుటవలన ఆధారస్వాధిష్ఠాన ప్రకృతికములగు చతుష్కోణబిందువు లగుటవలన బిందు వ్యూహ చిత్రవ్యూహములకు ఐక్యము. నాదాత్మకమే శ్రీచక్ర మగుటవలన చక్రమందు నాదవ్యూహమునకు ఐక్యము. చక్రమందు గల మాతృకలు కళాత్మకములుగాన కళాత్మక చక్రమందు కళావ్యూహమునకు ఐక్యము. సర్వ వ్యూహము లకూ భోగ్యభోక్తృభేదముతో సర్వత్రా చక్రమందు జీవ వ్యూహమునకు ఐక్యము. ఇట్లు సవాత్మకులగు శక్తిశివులకు అవస్థానసామ్యము సిద్ధము.

(3) అనుష్ఠాన సామన్య మనగా—చిద్రూపాత్మికా శక్తి, చిద్రూపుడు శివుడు, అదిష్ఠానమగు చైతన్యమే, కారణాత్మకు డగు శివుడు చైతన్యరూపుడగు శివునికార్యమేశక్తి, కార్యము కారణముకంటె వేరు గాదు. కార్యాత్మక శక్తి కారణాత్మ కుడు శివుడు కనుక శివశక్తులకు అభేదము కావున శివ శక్తులకు అనుష్ఠాన సామ్యము గలదు. శైవ వైష్ణవాది దర్శనములలో శివుడు విష్ణువుగాను శక్తి లక్ష్మిగాను శివుడే శివుడుగాను శక్తియే గౌరీ పార్వతిగాను ఇట్లు మంత్ర రూపమంతయూ శివశక్తులయొక్క కార్యకారణరూపమే గాని వేరు కాకపోవుటవలన అనుష్ఠాన సామ్యముగూడా కలదు—

(4) రూపసామ్యమనగా — కామేశ్వరీ కామేశ్వరులకు రూపమునందుగూడ భేదము లేకపోవుట—

జపాకుసుమసంకాశౌమదఘూర్ణిత లోచనౌ

జగతఃపితరౌవందె భైరవీ భైరవాత్మనౌ ॥ అనుటవలన భైరవీభైరవులకు రూపసామ్యమున్నూ గలదు. కామేశ్వరు నకు చతుర్బాహువులు త్రినేత్రములు చంద్రార్ధము ధను ర్బాణములు పాశాంకుశములు; ఇట్లె కామేశ్వరికి చతు ర్బాహువులు త్రినేత్రములు చంద్రార్ధము ధనుర్బాణములు పాశాంకుశములు; ఇట్లు రూపముచేతగూడ శివశక్తులకు సామ్యము గలదు—

(5) నామసామ్యమనగా—భైరవీ భైరవులు-శివాశివులు. శాంకరి శంకరులు. కామేశ్వరీ కామేశ్వరులు. భవాని భవులు. ఇట్లు సర్వనామముయందూ కార్యకారణ రూపములుగా శివశక్తులు ఉండుటవలన నామసామ్యమున్నూ గలదు—

ఇట్లు పంచవిధ సామ్యములచేత శివశక్తులు అభేదమై యున్నారు. అభేదమగు శివశక్తులను షడ్విధైక్య సంధాన ముచే తెలియుటయే సమయ మతమనబడును-షడ్విధైక్య మనగా నాదబిందు కళలయొక్క ఐక్యమే షడ్విధైక్య మన బడును; నాదమనగా శ్రీచక్రము; బిందువనగా దేహమందు గల షట్చక్రసంఘము; వానియొక్క ఐక్యమనగా ఆధార చక్రము, చతుర్దళములు చక్రకర్ణిక, త్రికోణము-స్వాధిష్ఠాన చక్రము షడ్దళములు దాని కర్ణిక అష్టకోణము, మణి పూర చక్రము దశదళములు దాని కర్ణిక దశ కోణాత్మిక- అనాహత చక్రము ద్వాదశదళ పద్మము తత్కర్ణిక దశకోణ చక్రము- విశుద్ధి చక్రము షోడశదళ పద్మము తత్కర్ణిక చతుర్దశ కోణాత్మిక- ఇట్లు శివశక్తి చక్రములకు ఐక్యము- ఆజ్ఞాచక్రము రెండు దళములుగల పద్మము; యీ పద్మము నకు రెండు కర్ణికలు. ఒకటి అష్ట దళాత్మిక- రెండవది

షోడశదళాత్మిక- వీనిలో స్వాధిష్ఠానాంతమందు ఒకవృత్తము, యీ వృత్తమే రుద్రగ్రంధియనియూ అనాహతాంతమందు ఒక వృత్తము, యీ వృత్తమె విష్ణుగ్రంధి యనియూ, ఆజ్ఞా చక్రాంతమునందు ఒక వృత్తము, యీ వృత్తమే బ్రహ్మ గ్రంధి యనియూ వృత్తత్రయములతో వానిపైన సహస్రసో పానములతో గూడిన చతుర్ద్వారములతో భూపురమను చతుష్కోణము ఆచతుష్కోణ మధ్యములో కర్ణిక సహస్రా రకమలము ఆ సహస్రారకమలమందు సుధాసింధువు, సుధాసింధువులో బైందవస్థానము, బిందుమధ్యలో చింతా మణిగృహము, చింతామణి గృహములో పంచప్రేతాసనము, పంచప్రేతలనగా పంచకృత్యములకూ అధిపతులగు బ్రహ్మ రుద్ర ఈశ్వరులు కోళ్లుగనూ సదాశివుడు ఆస్తరణముగనూ ఉన్న సింహాసనమందు సింహశబ్దము సంహార రూపముగాన సంహారాత్మకమగు పంచప్రేతాసనమందు అహంశబ్దాభి ధేయమగు భగవతి (అనగా అకారస్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః। హకారోంత్యః కలారూపో విమర్శాఖ్యః ప్రకీర్తితః॥ అనుటవలన అకారమనగా ప్రకాశచరణాత్మక శివుడు హకార మనగా విమర్శచరణాత్మకశక్తి అహం అనగా శివ శక్తి సంపుటాత్మక నాదబిందు కళాతీతషడ్వింశ తత్వరూప పరాభగవతి) అట్టి భగవతి సమయాఖ్య యనబడును—

ఇట్టి నాదబిందు కళాత్మక శ్రీచక్రమందు పంచాశత్కళ లకు అంతర్భావము; కళలకు తిథ్యాత్మకత్వము తిథులకు నిత్యాత్మకత్వము నిత్యలకు మూలమంత్రగత పంచదశ వర్ణాత్మకత్వము మంత్రవర్ణములకు త్రిఖండత్వము త్రిఖండములకు సోమసూర్యాగ్నిత్వము సోమసూర్యాగ్ను లకు గ్రంధిత్రయాత్మకత్వము గ్రంధిత్రయముకు రుద్రవిష్ణు బ్రహ్మాత్మకత్వము గ్రంధిత్రయముకు మూలమంత్రగత హ్రీంకారత్రయాత్మకత్వము హ్రీంకారమునకు భువనేశ్వరీ మంత్రత్వము భువనేశ్వరీమంత్రమునకు మూలమంత్ర మందు ఐక్యము మూలమంత్రముకు చక్రమందు ఐక్యము చక్రముకు దేహమందు ఐక్యము చక్రదేహములకు నాద బిందువులలో ఐక్యము నాదబిందువులు శివశక్తులలో ఐక్యము శివశక్తులు కార్యకారణ రూపములుగా చిదాత్మ యందు ఐక్యము యిట్టి సమష్టిరూప సర్వైక్యముననే షోడైక్యమని చెప్పబడును—

ఇట్లు పంచవిధ సామ్యములచేతను షడ్విధైక్యనంధా నమువలన మహావేధాక్రమ మహిమవలన సమయాఖ్య భగవతియగు శక్తి తత్ప్రకృతి రూపములగు ఆధార స్వాధిష్ఠానములను భేదించుకొని బయలుదేరి అనాహత మందు గల సూర్యమండలము నాచ్ఛాదించి చంద్రమండల మందుగల పీయూషమును గ్రహించి ఆనందముతో మణి పూర చక్రమందు ప్రత్యక్షమగును. ఇట్లు మణిపూర చక్ర మందు ఆవిర్భవించు శక్తి (దశభుజములతో ధనుర్బాణ ములను పాశాంకుశములను అభయవరదములు పుస్తక అక్షమాల వీణ యను ఆయుధములను ధరించి ప్రకాశించు భగవతిని సమయాఖ్య భగవతియని చెప్పబడును) మతాం తరముగా చతుర్బాహువులతో ధనుర్బాణములు పాశాంకుశ ములను ధరించి ప్రకాశింపుచుండును; ఇట్టి భగవతిని ఆత్మయని సమారాధనమే సమయాచార రహస్యము.

పాశాంకుశౌతదీయౌతు రాగద్వేషాత్మికౌస్మృతౌ
శబ్దస్పర్శాదయోబాణాః మనస్తస్యా భవద్ధనుః
కరణేంద్రియచక్రస్థాం దేవీం సంవిత్స్వరూపిణీం
విశ్వాహంకారపుష్పైణ పూజయేత్సర్వసిద్ధిభాక్ ॥ అనుట

వలన సామయికమతమందు బాహ్యారాధనము నిషేధము అంగకలాపాదులు నిరస్తము —

బాహ్యపూజానకర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః
సాక్షుద్ర ఫలదా నృణాం ఐహికార్థైక సాధనాత్
అంతరారాధన పరాఃవైదికా బ్రహ్మ వాదినః
జీవన్ముక్తాః చరంత్యేతెత్రిమలోకెమవర్తతె॥ అనుట

వలన అంతరారాధనమగు సహస్రదళకమల మధ్య సుధా సింధులో బిందు మధ్యస్థమగు శివశక్తి సంపుటాత్మక పరా రూప సౌదామినీ శక్తి భజనమువలన సాయుజ్య ముక్తిని అనగా పునరావృత్తి రహిత శాశ్వతముక్తిని పొందుదురు.

ఆధార స్వాధిష్ఠానములు అందతామిస్రములుగనుక వానియొక్క ఉపాసనముచే ప్రయోజనము లేదు. మణి పూరమునుండి సహస్రదళ కమలమువరకూ చక్రపూజ అవసరము; అనగా ఈ చక్రోపాసకులు శ్రీదేవియొక్క సార్ష్టి, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యాది పంచ విధ ముక్తులను పొందుదురు. ఇందులో మణిపూరక చక్ర పూజాపరులు దేవియొక్క సార్ష్టినామక ముక్తి పొందుదురు; సార్ష్టియనగా దేవియొక్క పట్టణ సమీపములో మరియొక పట్టణమును నిర్మించుకొని సేవించుట.

(2) అనాహతమను సంవిత్కమల పూజాపరులు సాలోక్యనామక ముక్తిని పొందుదురు. సాలోక్యమనగా దేవియొక్క లోకములో నివాసముతో సేవించుట.

(3) విశుద్ధి చక్రోపాసకులు సామీప్యనామక ముక్తిని పొందుదురు. సామీప్యమనగా దేవియొక్క సమీపములో దివ్యదేహమును ధరించి సేవించుట - దీనినే అంగసేవకత్వ మనికూడా చెప్పుదురు.

(4) ఆజ్ఞా చక్రోపాసకులు సారూప్యనామక ముక్తిని పొందుదురు. సారూప్యమనగా దేవితో సమాన రూపమును వేరుగా దేహమున్నూ గలిగి సేవించుట. ఈ చతుర్విధ ముక్తులుగూడా గౌణములేగాని ముఖ్యములుగావు. ఇవి యన్నియూ బాహ్యదుఃఖాతీత స్వరూప ముక్తులు—వీని

కంటె పరమగు ముఖ్యమైన ముక్తి సాయుజ్య ముక్తియని చెప్పబడును. ఆత్యంతిక దుఃఖనివృత్తి గలిగి బ్రహ్మానంద సుఖమును పొందు శాశ్వత ముక్తియే సాయుజ్య ముక్తి; ఇట్టి సాయుజ్యముక్తిని సహస్రదళకమలోపాసనలగు సమయ మతావలంబులైన బ్రహ్మవేత్తలు పొందుదురు. సాయుజ్యమనగా శివశక్తి సంపుటాత్మక పరా భగవతితో ఐక్యము పొందుట. ఇదియె శాశ్వత ముక్తి; ఇట్టి పునరావృత్తి రహితముక్తి పొందుటకై సమయరూపమైన ఉపాసనము అవుసరమైయున్నది. ఇదియే ఉపాసనా రహస్యము, ఇదియె సమయమత రహస్యము—

కొందరు షడ్విధైక్యమును యీ క్రిందివిధముగా చెప్పుదురు. లింగసూత్రాత్మలకు - స్వాపఅవ్యాకృతులకు - క్షేత్రజ్ఞ పరమాత్మలకు- ఐక్యమె షడ్విధైక్యమని చెప్పుదురు- లింగాత్మయనగా ఏకాదశేంద్రియములు, తన్మాత్ర పంచకము కలసి షోడశేంద్రియ రూపమే లింగదేహము. సూత్రాత్మయనగా పిండాండమగు దేహమందుండి అర్చిరాది మార్గములను పొందించు వాయువు; ఇట్టి లింగాత్మ సూత్రాత్మలకు ఐక్యము—స్వాపుడు అనగా సుషుప్త్యవస్థయందు సాక్షియగు ప్రాజ్ఞుడు- అవ్యాకృతుడు అనగా అవిద్యాశబళిత బ్రహ్మ; ఇట్టి స్వాపునకు అవ్యాకృతునకు ఐక్యము- క్షేత్రజ్ఞుడు అనగా జీవుడు- పరమాత్మ యనగా పరబ్రహ్మ- ఇట్టి క్షేత్రజ్ఞ పరమాత్మలకు ఐక్యము— ఈ ఐక్యమునే షడ్విధైక్యమనిగూడా చెప్పుదురు- ఇట్టి సామయికమతమె శుభాగమ పంచకమగు వసిష్ఠ శుక సనత్కుమార సనక సనందన సంహితలలో చెప్పబడి శంకర భగవత్పాదుల సమ్మతమై అద్వైత మతావలంబులకు అవుసరమై యలరారుచున్నది—

(సశేషము)

---

# శ్రీకాకుళము - ఆంధ్ర విష్ణువు

*శ్రీమాన్ కవిరాజ శిరోమణి, పండిత, దేవి నరసింహచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.*

(1 సంపుటము - 12 వ సంచికానుబంధము)

## తెలుఁగు - తెనుఁగు

విన్నకోట పెద్దనామాత్యుఁడు కావ్యాలంకార చూడామణిలో

కం॥ ధరశ్రీపర్వతకాళే
శ్వరదాక్షారామసంజ్ఞవఱలఁ ద్రిలింగా
కరమగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగదేశమనఁ జనుఁగృతులన్ ॥

అనియు, "తత్త్రిలింగపదము తద్భవంబగుటచే
తెలుఁగు దేశమనఁగఁ దేటపడియె"

అనియు వ్రాసెను. ఇట్లె 17 వ శతాబ్దముననున్న కాకుమూరి అప్పకవియు, "తెలుఁగనుచు తద్భవము దాని వలనఁ బొడమె" అని వ్రాసియుండిరి. "త్రి" అనుదానికి "తె" అనియు, "లింగ" శబ్దము తద్భవమున "లుంగు" అయి, అందు పూర్ణానుస్వారము అర్ధానుస్వారముగా మారి "లుఁగు" శబ్దమేర్పడినదనుట అసంభవము. త్రిలింగపదము సమస్తపదము. తెలుఁగు పదము వ్యస్తపదము, అసలు "తెలు" అనునది దేశ్యపదము. అనగా స్వచ్ఛమైనదని యర్థము. ఇంక త్రిలింగశబ్దము కాకతీయ ప్రభువుల శైవమతవ్యాప్తికాలములో వారి రాజ్యమున 'శ్రీశైల, దాక్షారామ, కాళేశ్వరములను మూడు ప్రసిద్ధ లింగములుండుటచే రెండవ ప్రతాపరుద్రుని యాస్థానకవియగు విద్యానాథుఁడు" "తెలుఁగ"ను దేశ్య పదమునకు "త్రిలింగ" మని సంస్కృత రూపమును కల్పించిరని పలువురు పండితుల అభిప్రాయము. కాని యీ త్రిలింగశబ్దము విద్యానాథునికన్న కడుప్రాచీనమైనట్లు పలుశాసనములవల్లను, పురాణములవల్లను తెలియుచున్నది. "గణగవిజయాదిత్యుని "సాతలూరు" శాసనమున "సదక్షిణాపథః సత్రిలింగదేశమన్వపాలయత్" అని కలదు. క్రీ॥ శ॥ 150 ప్రాంతమందుండిన గ్రీకు ఖగోళశాస్త్రజ్ఞుడు "టాలెమీ" (Talemy) అను నతఁడు తన గ్రంథమున "ట్రిలింగాన్" అను పదమును ప్రయోగించెను. ఇది త్రిలింగశబ్దభవమనుట నిర్వివాదము. పూర్వము ప్రకటితమైన మార్కండేయ పురాణములో కూర్మరూపమునుఁ దాల్చిన విష్ణువు భారతవర్షమున వర్షవ్యాప్తినందినట్లును, అందు "ప్రాగ్వదనుండును, అపద

పుచ్ఛుండును, వక్షిణోత్తరపార్శ్వండునై, కృష్ణానది కుక్షిగాఁగలిగియుండినట్లును, దానికి "తిలంగు" దేశమని పెరైనట్లును,

"తిలంగాకుంజరదరీ కచ్ఛపాసాశ్చయేజనాః
కృష్ణవేణీ తథాకుక్షిరితి కూర్మస్య మధ్యతః" అని కలదు. దీనికి 1896 సం॥రంలో ముద్రితమైన ప్రతి 152 పేజీలో,

"త్రిలింగాః కుంజరదరీ కచ్ఛవాసాశ్చయెజనాః
తామ్రపర్ణీతథాకుక్షి రితికూర్మస్య దక్షిణః" అని దిద్దఁబడియున్నది. ఇందుచే "తిలంగు" అను దానికి "త్రిలింగ" మనియు, "కృష్ణవేణి" అనుదానికి "తామ్రపర్ణి" యనియు సంస్కరింపఁబడినట్లు కన్పట్టుచున్నది. ఈ విషయము,

"In the older edition of Markandeya-puranam there was no such form or word as "Trilinga" but instead there was the form "Tylinga" and some times "Tilagu". Therefore the form or word "Trilinga", which is to be found in the 1896th year's edition must have been an alteration of the older form "Tylinga" giving it a sanscrit form. So it is suggested that the present area of Andhra was once known as the "Trilingadesa" అని "Indian Cultural Heritage 2 వ వాల్యూంలో కలదు. ఇంక "తెలుఁగు" శబ్దము "త్రికళింగ" భవమా? అని విచారింతము. "కళింగ" శబ్దమును శ్రీకృష్ణదేవరాయలు "ఆముక్తమాల్యదలో" "మున్నుకళింగదేశ విజిగీషామనీషం చంద్తెత్తిపోయి" అని వ్రాసియున్నాడు. తెనాలి రామకృష్ణకవి తన పాండురంగమాహాత్మ్యములో పీఠికాపురము (పిఠాపురము)ను కళింగదేశాభరణమని వర్ణించెను. ఇది గోదావరికి యుత్తరమునఁ గలదు. మహేంద్రగిరి నుండి భీమునిపట్టణమువరకు నుత్తర కళింగమనియు, భీమునిపట్నమునుండి భోగాపురమువరకు మధ్యమకళింగమనియు, భోగాపురమునుండి గోదావరీతీరమువరకు దక్షిణ కళింగమనియు, "బొడ్డేరు" శాసనములోఁ గలదు. క్రీ॥ శ॥ 950 సంవత్సరములోని యుద్ధమల్లుని శిలాశాసనములో

"వేంగీభువః పతిరభూత్త్రిలింగకొట్టేః" అని కలదు. ఇట్లె ఖారవేలుని శాసనమందును "త్రికళింగము" పేర్కొనఁబడినది. క్రీ॥ శ॥ 12 శతాబ్దమున, చేదిదేశపు రాజగు "శ్రీమద్విజయసింహదేవుని వంశీయుఁడగు శ్రీకర్ణదేవుఁడు "త్రికళింగ"మును జయించి "త్రికళింగాధిపుఁడ"ని బిరుదు వహించినట్లు C. F. Cunningham సి. యఫ్. కన్నింగుహామ్ దొరగారి ఆర్కెలాజికల్ రిపోర్టులో కలదు. కాని అశోకుని శిలాశాసనములో నొక కళింగము మాత్రమే పేర్కొనెను. మరియు నీ దేశమున తిలలవలె రస (క్షీర) పూరితములగు గోవులు వేనవేలుండుటచే దీనికి "తిలగు" దేశమని పేర్వెలసినట్లు

"సరసాస్తిలవద్గావస్సంతి యత్రసహస్రశః
సదేశస్తిలగుర్నామ తతోసాయజ్ఞియస్మృతః ॥

అని కొందరును, యీ దేశమున తిలలు యెక్కువగ పండుటచే "తిలగు" దేశమని కొందరును వ్యుత్పత్తులుఁ జెప్పియుండిరి. దీనికి "తెలుఁగు" రూపము కలిగినది. ఈ తెలుఁగుశబ్దము 16 వ శతాబ్దవాసియగు అల్లసాని పెద్దన కవీంద్రుఁడు,

"దేశభాషలందు తెలుఁగు లెస్స" అనియు, 13 వ శతాబ్దమునఁగల కేతనకవి "ఆంధ్రభాషాభూషణము"ను తెనుఁగు వ్యాకరణములో

"మున్ను తెలుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వండుఁ జెప్పరేఁ జెప్పెద వి
ద్వన్నికరము మెచ్చఁగ
నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్ ॥ అనియు,

"సంస్కృతప్రాకృతాది లక్షణముఁ జెప్పి తె
లుఁగునకు లక్షణముమున్నుఁ దెలుపకు
నికి కవిజనంబులు నేరమికాదు సన్ను
పన్యుఁగావింపఁ దలచిన తలఁపుగాని" అనిన్ని

వ్రాసెను. ఇతఁడు తిక్కన సమకాలికుఁడు. కాని పై పద్యములనుఁబట్టి చూడ, కేతన "అథర్వణ" వ్యాకరణమును చూడనట్లు తోచుచున్నది. అథర్వణాచార్యుఁడు తన వ్యాకరణములో,

"ఇతిచతుష్షష్టికళాధుర్యాదర్వణాచార్య విరచితె
త్రిలిఙ్గశబ్దానుశాసనె" అని ప్రతి కాండమునందును వ్రాసుకొనియున్నాడు. వెల్లంకి తాతంభట్టు "కవిచింతామణి" యను లక్షణగ్రంథమునఁగూడ నీయథర్వణాచార్యపద్యమును నుదహరించియున్నాడు. ఈ అథర్వణాచార్యుఁడు ప్రాచీన ఆంధ్రలక్షణవేత్తలుగా బృహస్పతి, కణ్వ, హేమచంద్రులను పేర్కొనెను—

ఇట్లె "తెనుఁగు" శబ్దమునుఁగూర్చికూడ పలు వాదములుఁ గలవు. తెనుఁగు శబ్దము "త్రినగ" శబ్దభవమని త్రిలింగవాదులమతము. త్రినగములనగా పై త్రిలింగములేనని వారి అభిప్రాయము. వీరు త్రిలింగములలో "కాళహస్తి"ని నొక లింగముగా పరిగణించిరి. కాని కాళేశ్వరమనునది నైజాము రాజ్యములో ఆదిలాబాదు జిల్లాలో మంతెన గ్రామసమీపమునఁ గలదు. అందువలన

దీనిని " మంతెనకాళేశ్వర " మందురు. ఇందు కాళేశ్వరుఁ డను దేవుఁడు కలడు. కాని భాషావాదులు "తెన్+అగు తెనఁగు" అని నిర్వచించిరి. అనగా దక్షిణాపథమున సంచరించువారి భాష కనుక తెనుగైనదనిరి. తెనుఁగు ద్రావిడ భాషా కుటుంబములోనిదని " Reverend Bishop Card well " (రివరెండు బిషప్పు కార్డువెల్) దొరగారు వ్రాసిరి. ఈ వాదమునే తిరుపతి శ్రీవెంకటేశ్వర ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరుగారగు శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామివారును, శ్రీయుతులు కోరాడ రామకృష్ణయ్యగారును, గంటి జోగిసోమయాజులుగారును బలపర్చిరి. పెక్కురు సంగీతలాక్షణికులు, యిది సహజ మదురమైన భాష. సంగీతమున కనుకూలమై అమృతకర్ణ రసాయన మైనది. కనుక దీనికి తేనె+అలుగు " అని వ్యుత్పత్తిని సమర్థించిరి. అనగా తేనె ప్రవాహమువంటిదని యర్థముఁ జెప్పిరి. "తెనుఁగు" అమృతంపు సొన యనియు, ప్రాచ్య దేశపు యిటాలియన్‌భాష " The Italian of the East " అని పాశ్చాత్యపండితులు నిష్పాక్షికముగఁ జెప్పిరి. నన్నయభట్టుకూడ తన భారత మును తెనిగించు సందర్భమున,

" జననుతకృష్ణద్వైపా
యనముని వృషభాభిహితమహాభారత బ
ద్ధనిరూపితార్థమేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్ ॥"

అని "తెలుఁగు" శబ్దముతోపాటు "తెనుఁగు" శబ్ద మునుఁ గూడ ప్రయోగించియుండెను—

## అంధము - ఆంధ్రము

"అంధము" ప్రాకృతభాషారూపమనియు, "ఆంధ్రము" దానికి సంస్కృతరూపమనియు పైన విమర్శించియుంటిని. ఇది సంగీతమున కనువగు భాషయగుటచేతనే కొందరు వ్యాకరణసంగ్రహకారులు " అంధయతి - గీతేన-మృగాన్. అంధవత్కరోతీత్యాంధ్రః" అనికూడ నిర్వచించిరి. అనగా మృగములను సహితము, గానముచే ముగ్ధులనుఁ జేయఁ దగిన దేశమగుటచే 'అంధ' దేశమనిరి. పల్లవప్రభువైన శివస్కందవర్మ మైదవోలు శాసనమున, ఆంధ్రదేశమును గురించి "అంధపథ" మని యుపహరించిరి. ఇట్లు "అంధ" పదమునకు యనేక అర్థములుఁ గలవు. "అంధస" మన సంస్కృతమున అన్నమని యర్థము. ఈదేశమున, కృష్ణా, గోదావరి, తుంగభద్ర, ఋషికుల్యా, పెన్న మున్నగు తరంగిణులు పూర్ణజలపూరితములై సర్వసస్య సమృద్ధమొనర్చుచు, యన్నమునకు కొరతలేని దేశమగుటవలన దీనికి "అంధదేశమ"ను నామముకూడ సార్థకమైనదని నా అభిప్రాయము. ఇందువలన తెలుఁగు, తెనుఁగు, త్రిలింగ, కళింగ, వేంగి, ములక, కన్నడ, మున్నగు దేశములన్నియు నాంధ్రదేశములోని కొన్నిభాగ ముల పేరులని స్పష్టపడుచున్నది. మరియు దీనికి "హిరణ్యరాష్ట్రమ"ని, "అజనాభదేశ" మని "బ్రహ్మా వర్తమ"ని కూడ సార్థకనామములు కలవు.

ఇట్టి ఆంధ్రదేశమున అహోబిలము, శ్రీశైలము, తిరుపతి, కాళహస్తి, నెల్లూరు, పొన్నూరు, మంగళగిరి, అవనిగడ్డ, హంసలదీవి, గణపేశ్వరము, మోపిదేవి, అంత ర్వేది, ఆకిరిపల్లి, వేదాద్రి, భద్రగిరి, ద్వారకాతిరుమల, సింహాచలము, శ్రీకూర్మము మున్నగు పెక్కు దివ్యక్షేత్ర ములును, ఉభయ రామేశ్వర, ఉభయ సోమేశ్వర, ఉభయ ముక్తేశ్వర, ఉభయ నాగేశ్వర ఉభయ నారాయణాది క్షేత్రములును, దాక్షారామ, కుమారారామ, క్షీరారామ, భీమా రామ, అమరారామములను, పంచారామ క్షేత్రములును, ఘంటసాల, గుడివాడ, భట్టిప్రోలు, చందవోలు మున్నగు బౌద్ధకేంద్రములునుఁ గలిగి పుణ్యభూమియై యలరారు చున్నది. ఇందు శ్రీకాకుళమొకటి. ఇది ఆంధ్రదేశమునకు నడిబొడ్డునఁ గలదు. మచిలీపట్టణమునకు పశ్చిమమున, అవనిగడ్డ తాలూకాలో చేరిన చల్లపల్లి జమీనులో కృష్ణా నదీ తూర్పుతీరమున నున్నది. ఇచ్చట వెలసియున్న విష్ణువుకు ఆంధ్రవిష్ణువని, ఆంధ్రవల్లభుఁడని, ఆంధ్ర నాయకుఁడని, తెలుఁగువల్లభుఁడని, తెలుఁగురాయఁడని, శ్రీవల్లభుఁడని, కాకుళేశ్వరుఁడని, సిరికాకొలని నాథుఁ డని పేర్లు.

## ఆంధ్రనాయకుఁడు - తెలుగువల్లభుఁడు

ఈ దేవుఁడు విష్ణువగుటచే, నాంధ్రవిష్ణువనికూడ పిలువ బడును. శ్రీకాకుళము ఆంధ్ర రాజులకు తొలి రాజధాని యనియు, మౌర్యవంశానంతరము శ్రీకాకుళమును పాలిం చిన ప్రభువులలో శాతవాహనవంశములో నొకనిపేర వెల సిన దైవమైయుండవచ్చునని పలువురు విమర్శకులు అభి ప్రాయపడుచున్నారు. శాతవాహనులు ఆంధ్రులు. వీరు అమరావతి, ధాన్యకటకము, ప్రతిష్ఠానపురము, రాజ మహేంద్రవరము, పెదవేగి, దెందులూరు పట్టణములను రాజధానులుగాఁ జేసుకొని పాలించిరి. హాలసాతవాహనుఁడు సంధానించిన సాతవాహన సప్తశతిలో తెలుఁగుదేశమునకుఁ జెల్లతగిన వర్ణనలు పెక్కులు కలవు. అమరావతీ స్థూప మున "గౌతమీపుత్రశాతకర్ణి" శాసన మొకటి కలదు. కృష్ణా ముఖద్వారమున "యజ్ఞశ్రీశాతకర్ణి" శాసనము కలదు. అందు శ్రీకాకుళ ప్రశంసయు, ఆంధ్రవిష్ణు ప్రశం సయు కలవు. ఆంధ్ర చక్రవర్తుల వంశమునకు శాతవాహన

వంశమని పేరెట్లు కలిగెననగా, దీపకర్ణియను మహారాజు భార్య పాము కఱచి చనిపోయినది. అతఁ డామె విచార మున, మఱల పెండ్లియాడలేదు. ఒకనాఁడు దుఃఖించు చుండ రాజునకు స్వప్నమున కులదేవత, యతనిని మఱు నాడు వేటకు వెళ్ళుమనియు నచట సింహముమీద నొక బాలుఁడు కనపడుననియు వానినిఁ దెచ్చి పెంచుకొనుమని చెప్పెనట. అట్లె రాజు వెళ్లగా, సింహము, దానిపై స్వారి చేయు నొక బాలుఁడు కనపడిరి. సింహము బాలుని దింపి నీరు త్రాగుటకు వెళ్లగా, రాజు దానినిఁ జంపుటకు బాణము విడిచెనట. ఆ సింహము గంధర్వుఁడై యీ కథ చెప్పెనట.

"నీవాంధ్రేశ్వరుఁడౌదు, శాపవిఘమం । తే "శాతుడన్" నేను నీ
కైవీనింకని పెద్దఁజేసితిని రా । జా! వీడు కోదండ బా
హా విధ్వస్త దిగంతరాహితదరా । ప్రాణేశ చూడామణి
గ్రీవా! మంజుల హారరత్నరుచిర। శ్రీపాదకంజుండగున్॥

"కనుగొనలందు బాష్పములు । గ్రమ్మఁగకంఠము రుద్ధమౌచు నా
యన ! చనుదెమ్ము నీచిఱుత । లైనకరమ్ములు నాగళంబునం
యున బిగియింపు శక్తిపతి । తొంగలిఱెప్పలఁ బొలియున్న నీ
కనులకు నాంధ్రదేశపుడ । కైవసమయ్యెను రాకుమారకా ॥

"తెనుగున్ఱేండ్లకునాడి పూరుషు డుదై । తే యాంతకు డాంధ్ర వి
ష్ణుని లక్ష్మీకుచకుంకుమారుణ కర। స్తోమంబు నీవిచ్చు త
ర్పణముల్ గైకొనఁ జాపగాఁ బడును! రా । రా కుఱ్ఱ! నీ మందహా
స నవ జ్యోత్స్నలు చూడ శక్తిమతినో। చన్లేదురా పుత్రకా ॥

ఇవి కవిసామ్రాట్టు విశ్వనాథునిసత్యనారాయణగారి "ఆంధ్రప్రశస్తి" నుండి మరియు, "వాసిష్ఠీ పుత్రపులు మావి" నాసిక శాసనమున సాతవాహనులు బ్రాహ్మణులని ప్రస్తుతులైరి. శ్రీకాకుళస్థల మాహాత్మ్యమునఁ గూడ నీ యంధ్ర నాయకస్వామి "నాగదేవభట్టారకు" నింటఁ బుట్టిన బ్రాహ్మణుఁడని కలదు. ఈ కథ "శ్రీముఖ శాత కర్ణిది కాఁదగునని, శ్రీనాథుని పూర్వకాలమునుండియు "సిరికాకొల్నినాథుఁడని," "సిరికకొలన"ను, పేర్లు పెక్కు చోట్ల ప్రయోగములు కన్పడుచున్నవని "సిరికకొలను" అనునది యా గ్రామమునకు తొలినామమైయుండవచ్చును. "కొలనే" వైష్ణవమొచ్చి, దివ్యస్థలమై "కొళ"మైనదని, అక్కడ గొప్ప చెఱువుండినట్లును, (ఇది నేటికిని కలదు) "సిరిక" పదము శ్రీముఖపదమునకు తెలుఁగు వికృతి కాఁగునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "తెలుఁగు మెఱుఁగుల"లో వ్రాసియుండిరి. కాని పూర్వులు "కైః-ఆకులం=కాకులం" అని రూపనిష్పత్తినిఁజేసి "కైః-బ్రహ్మభిః (నవబ్రహ్మలచేతను) ఆకులం=పర్యాప్తం (కూడు కొనినది) కనుక శ్రీకాకుళ"మని అన్వయించిరి.

## బ్రహ్మాండ పురాణము - స్కాంద పురాణము

పై రెండు పురాణములందును నీక్షేత్ర మహాత్మ్యము వర్ణింపఁబడి యున్నది: "ఆంధ్రనాదో మహావిష్ణుర్నిశంభు దనుజాపహః । స్వాయంభువ మనోః కాలేపురాకలియుగె హరిః। కాకుళె రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః। అభవ త్సర్వ దేవైశ్చవేష్టితో లోకపూజితః॥" అను ఆంధ్రకౌముది వచనముచే మహావిష్ణువు కలియుగమున స్వాయంభువ మనువు కాలమున శ్రీకాకుళ ప్రభువైన సుచంద్ర మహా రాజునకు కొమరుఁడై పుట్టి, నిశంభుడను రక్కసుని జయించి సర్వదేవపూజితుఁడైనట్లు కనిపించుచున్నది.

"శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారంతు మహత్కృత్వాత్రీణి ద్వారాణిచాకరోత్
త్రిలోచనో మహేశస్తు త్రిశూలంచకరెవహన్
త్రిలింగరూపి స్వపసత్రిద్వారేషు గణైర్వృతః"

అనుటచే నీతఁడు శ్రీశైల భీమకాళేశ్వరములను మూడు ప్రసిద్ధ లింగములను మహేంద్రగిరితో కలిపి ప్రాకారమునుఁ గట్టించి దానికి మూడు ద్వారములను పెట్టి, యీశ్వరుని యా ద్వారములయొద్ద కాపుండవలసినదిగా కోరుటచే, యీశ్వరుఁడు త్రిశూల పాణియై ప్రమథ గణములతో నహా నా ద్వారములందు కాపుండెనని తెలియుచున్నది—

శ్రీ మహావిష్ణువునుఁ గురించి బ్రహ్మతపస్సుచేయగా, వారి పూజాసౌలభ్యము కొరకు విష్ణువు అర్చారూపుఁడై శ్రీ వైఖానస మహర్షులచే ప్రతిష్ఠింపఁబడి పూజింపబడు చున్నట్లును, "శశిబిందు" మహారాజు ఆలయ గోపురా దులు కట్టించినట్లును పురాణ ప్రసిద్ధి కలదు. సుచంద్రు నకు కూడ "ఆంధ్ర విష్ణువు" వంశమున పుత్రుడు జనిం చుటయు నా పిల్లవానికి, శ్రీ స్వామిపేరునే "ఆంధ్ర విష్ణువ"ని తల్లి తండ్రులు పెట్టియుండవచ్చును. అతను ప్రతాప శాలియై రాజపర్యులఁగెల్చి రాజ్యస్థాపనచేసి యుండ వచ్చును. కాని, బ్రహ్మాండ పురాణములోనే,

"ఆంధ్రవిష్ణుస్సురయుతో, దనుజేన నిశంభునా
యుద్ధ్వాత్రయోదశయుగాన్హత్వాతం రాక్షసోత్తమం
అవసత్తత్ర ఋషిభిర్యుతో కృష్ణానదీ తటె"

అనుటచే, నిశంభునితో పదమూడు యుగములు యుద్ధము

సేయుటయు, బ్రహ్మాదులచే స్తుతింపఁబడి పూజింపఁబడుటయు మానవశక్తి కతీతములైన విషయము లగుట చేతను, యిట్టి రాక్షస సంహారము విష్ణువున కవశ్యము కర్తవ్యమగుట చేతను నీ "ఆంధ్రవిష్ణువు" ను, ఆదివిష్ణువు గనే భావింపవలెను. శ్రీమన్నారాయణుఁడు శ్రీ వైకుంఠ నికేతనమునుండి భక్తుల ననుగ్రహించుటకు అర్చారూప మున నాంధ్ర విష్ణువను పేర వెలసినట్లు క్షేత్ర మాహాత్మ్య మున నిరూపింపఁ బడినది. శ్రీమద్బ్రహ్మాండ పురాణము ఉత్తర ఖండములో నారద సంహిత యందు 93 యధ్యాయములో,

"శ్రీకాకుళ మితిఖ్యాతం క్షేత్రమద్భుతదర్శనం
పృష్ట్వాప్రీతేన మనసాస్నాత్వాకృష్ణాజలేఽమలే ॥ 3
జప్త్వామంత్రమయం సర్వంతత ఆయతనం గతః
తత్రాపశ్యమహం పుణ్యే విమానే భద్రకోటికే ॥ ౪
నానారత్నమయేదివ్యే కాంచనే బ్రహ్మనిర్మితే
సింహాసనే స్థితందేవం శతకోటి శశిప్రభం ॥ ౫
నిర్మలేందు ప్రతీకాశం ముఖపంకజ మంజుళం
తరుణాదిత్యవర్ణేన కిరీటేన విరాజితం ॥ ౬
రత్నకుండల సంశోభి కపోలద్వయసుందరం
నానాలంకార సంయుక్తం వైజయంతీ విరాజితం ॥ ౭
శ్రీవత్సకౌస్తుభోరస్కం ప్రబుద్ధాంబుజలోచనం
చతుర్భుజ ముదారాంగం శంఖ చక్రగదాధరం ॥ ౮
సుభ్రువం సుస్మితం చారుబింబాధరసమన్వితం
బ్రహ్మేశానాదిభిర్దివ్యైః పూజ్యమానాంఘ్రి పంకజం॥ ౯
కేశవాఖ్యం శ్రియాజుష్టం దివ్యమంగళ విగ్రహం
అస్తువం పుండరీకాక్ష మతసీకుసుమప్రభం ॥ ౧౦
నమశ్శ్రీకాకుళేశాయ పరంధామ నివాసినే."

అనియు, 94 అధ్యాయములో చతుర్ముఖబ్రహ్మ విష్ణునుఁ గూర్చి తపస్సుచేసినట్లును, నా విష్ణువు ప్రత్యక్షమై కల్పాం తమున, నీ యభీష్టము నెరవేర్తునని,

"సహ్యజాయాస్తు కృష్ణాయా స్తటేత్వన్నామపావనే
ఇహైవకాకుళక్షేత్రే నివసిష్యామి నిత్యదా" అని భగవాను లానతిచ్చినట్లు కలదు. 96 అధ్యాయమున,

"పూజితే పుండరీకాక్షే కశ్చిత్క్షత్రియమండనః
ఆంధ్రేషుజాతస్సంపూర్ణో భక్త్యాలక్ష్మీ పతిర్వశీ
భారతస్యైవ వర్షస్య చక్రవర్తీ మహాద్యుతిః
శశిబిందు రితిఖ్యాతోపుత్ర శ్చిత్రరథస్యచ
చంద్రవంశసముద్భూతో సర్వభూతహితేరతః"

అని యిట్లు శశిబిందు మహారాజు జన్మకథనమునుం జెప్పెను. తరువాత శశిబిందు మహారాజు స్వామి దర్శన మునకు వచ్చుటయు అప్పుడు ఋషులు ప్రభువుతో స్వామి యవతార కారణమును,

"సమయాచంత భోరాజన్నేష బ్రహ్మతపః ఫలమ్
సాక్షాల్లక్ష్మీపతిశ్శ్రీశః కాకుళేత్వాంధ్ర నాయకః
శ్రీవైకుంఠాత్సమాయాతో లోకానుగ్రహ కారణాత్"

అని చెప్పి స్వామికి ఆలయగోపురాదులను కట్టింపుడని వేడగా నాశశిబిందు మహారాజు, తన సర్వస్వమును, శ్రీకాకుళేశ్వరునికే వినియోగింతునని,

"మదీయమూర్జితం రాజ్యం భాగ్యమాయుర్య శోభనం
సర్వం శ్రీకాకుళేశస్య కైంకర్యే వినియుజ్యతే"

అని పలికి, అట్లు దేవాయతనమును నిర్మించి, అందు శ్రీ వైఖానస మహాఋషులగు, భృగువు, అత్రి, మరీచ్యాదు లచే స్వామి ప్రతిష్ఠాది మహోత్సవములంగా వించినట్లు 97 అధ్యాయమున ప్రతిపాదింపఁబడినది. శ్రీస్వామివారి నిత్యోత్సవ బ్రహ్మోత్సవాది కైంకర్యములకును, స్వస్తి వాచకపరిచారకాది కైంకర్యపరులకును అనేక అగ్రహార ములును, స్వామివారికి అమూల్యములైన రత్నాభరణము లును దుకూలములును యివ్వఁబడినట్లు తరువాతి అధ్యా యములందుఁ గలదు. ఇంక స్కాందపురాణము సహ్యాద్రి ఖండలో,

"తత్ర శ్రీకాకుళం నామపురం ముక్తి ప్రదంమహత్
తత్రస్నాత్వా మహాపుణ్యాం లభంతి గతిమీప్సితామ్
అగస్త్యోనామ దేవర్షిః కృష్ణాయాం తత్రతత్రతు
స్నాత్వాతీర్థేషు సర్వేషు శ్రీకాకుళ మథాగమత్
చతుర్భుజ శ్శంఖచక్ర భూనీళాసహితో హరిః
వసతింతత్ర వైచక్రే కలౌకాకుళ నాయకః
కృష్ణాయాంనలి లేస్నాత్వా మల్లేశంకాకుళేశ్వరం
పృష్ట్వాముక్తిం ప్రయాంత్యేవసత్యం మునివచోదితం
యంయంచకామయేన్మర్త్యః తంతమాప్నోతి నిశ్చయం
తత్రతీర్థాని శతశః తేషాం నామానిమేశృణు
దేవహ్రదం రుద్రహ్రదం చక్రతీర్థంతు వైధనం
విష్ణుతీర్థం సూర్యతీర్థం సోమతీర్థం మునీశ్వరాః
పాపనాశన తీర్థంతు తత్రస్నానం మహాఫలం
తత్క్షేత్రం ముక్తిదం ప్రాహుస్సత్యంస్కందేన భాషితం
బ్రహ్మహా స్వర్ణహారీచసురాపీ గురుతల్పగః
సకృత్తత్స్నాన మాత్రేణ ముచ్యతే సర్వపాతకైః"

అని క్షేత్ర మాహాత్మ్యము వర్ణింపఁబడినది. ఈ శ్రీకాకుళము 108 దివ్య క్షేత్రములలో 55 వ క్షేత్రముగా గణింపఁబడి నది. ఇందు చేఁగూడనిది దేశమున మధ్యనున్నట్లు పరి ష్కరించిరి.

## వల్లభాభ్యుదయము - క్రీడాభిరామము

శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యమము సంస్కృత గ్రంథము బ్రహ్మాండ పురాణాంతర్గతమనియే కలదు. ఇప్పటికి 150

సంవత్సరములకు పూర్వము "వల్లభాభ్యుదయము"ను పేర శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యము ప్రబంధరూపమునఁ వెలిగింపఁ బడినది. అది యిటీవల ముద్రితమైనట్లు తెలియుచున్నది. కాని దాని ప్రతి నాకు లభింపలేదు. ఇది శ్రీనాథుఁడు వ్రాసి శ్రీకాకుళముసంధలి యాంధ్రవల్లభునకు 'కృతి' యిచ్చెననియు నందు తిరునాళ్లలో జరుగు ననభ్యములు క్రీడాభిరామముకంటెఁ బచ్చిగనున్న దనియు శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారు క్రీడాభిరామము పీఠికలో వ్రాయుచున్నారు. ఈ ప్రబంధకర్త తనకు దొరికిన సంస్కృత గ్రంథము తారుమారుగా నున్న దని చెప్పుకొన్నాడు. సంస్కృత మాహాత్మ్యమునకును నీ తెలుఁగు గ్రంథమున కును బహుబేదము లున్నవని వినికి. ఇంక శ్రీనాథుని కృతియేయని పలువురు నమ్ముచున్న "క్రీడాభిరామ"మను వీధినాటకమున శ్రీకాకుళ తిరునాళ్ళు, క్షేత్రవర్ణన సందర్భ మునఁగల పురాణగాథ మరియొక విధముగా నున్నది. అందలి పద్యములివి; ఇది వినుకొండ వల్లభరాయకృతమని ప్రతీతి,

గీ॥ కారవేల్లమ తల్లికా కల్పవల్లి
కడుపునిండారఁ గాంచిన కొడుకుఁ గుఱ్ఱ
జారచోర మహాధూర్త చక్రవర్తి
దేవవేశ్యాభుజంగుండు తెలుఁగు భర్త॥

గీ॥ వసిఁడి కోర వేఁడిపాలారగించినఁ
బుల్లసిలిన యధరపల్లవమున
విప్రకన్యవసువు వెలయించుచున్నాఁడు
విశ్వమునకుఁ గాకుళేశ్వరుఁడు॥

ఉ॥ ఈ రసమెత్తు వేదములు।
హ్రీవహియించు పురాణజాలముల్
సౌరభహీనమౌ, నుపని
షత్తులు వెంబడు నాగమావళుల్
గారవముల్లసిల్ల సిరి
కాకులనాథుఁడు "నాగదేవ భ
ట్టారకు" నింటఁబుట్టి ప్రకటంబగు వేడుక నాదరింపఁగన్॥

ఇట్టి కథాఘట్టములు మిది గ్రంథములలోఁ గానరావు. కాని యక్కడి గ్రామవృద్ధుల యైతిహ్యములలో నున్నవి. స్వామి కాకరపాడులో వెలసినాడట. అత్తకుఁ దెలియకుండ కోడలు ప్రత్యహము స్వామికి పాలారగింపఁ బెట్టుచుండెడిదట. ఇట్లే 207, 208, 209, 210, 211, 212 పద్యములలోఁ దిరునాళ్లలోని యనభ్యవిషయములుఁ గూడ వర్ణించియుండెను. ఇందు మేషయుద్ధము, కోడి పందెములు, బక్కులవురంధ్రి, రంకుల రాట్నము, పూటకూళ్ల యిండ్లు మున్నగునవి తిరునాళ్లలో సామాన్య విషయములేగాని, "కోడెపడుచు, నునరబెత్తు, ముకుందదీక్ష" మున్నగు విశేష రహస్య విషయములిందు వర్ణింపఁబడినవి. ఇందుచే ప్రాచీన కాలమున నీక్షేత్రము మహావైభవము ననుభవించినటుల తెలియుచున్నది. 14వ శతాబ్దము నుండి 16 వ శతాబ్దములోకూడ నీ యాంధ్రనాయకుఁడు మిక్కిలి శ్రద్ధతో పూజలనందుచున్నట్లును, నుత్సవములు వైభవముగా జరుగుచున్నటుల వృత్తాంతములుఁ గలవు. శాలివాహనశకము 1440 (క్రీ॥ శ॥ 1520)లో, శ్రీ కృష్ణదేవరాయలు, యీ మాఱుమూలనున్న శ్రీకాకుళమునకు వచ్చి ఈ దేవుని కైమోడ్పు నొసఁగుటవలన, నీ తెలుఁగు నాయకుని ప్రఖ్యాతి యెంత దిగంత విశ్రాంతముగానుండెడిదో యూహింపతగినది. శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశ విజిగీషను దండు వెడలి విజయవాడలోఁ గొంతకాల ముండెను. అప్పుడు శ్రీకాకుళ క్షేత్రమునకు వచ్చి శాసనమును వ్రాయించెను. ఆ యేకాదశి తిథియే "ఆముక్తమాల్యద" రచియింప నాంధ్ర నాయకస్వామి కృష్ణదేవరాయులవారి స్వప్నమున గన్పడి ప్రబోధించిన యేకాదశి దినమని మన మూహింపజాలును. తరువాత గ్రామ సన్నివేశము కొంత కృష్ణానదీప్రాంతమైనది. ప్రాచీన దేవాలయముఁగూడ కృష్ణాప్రవాహపతితము కాఁగా, తరువాత నిప్పటి దేవాలయ మంటపాదులు కట్టబడినట్లు గోచరించుచున్నది. విలసనగా 12-13 శతాబ్దములనాటి శాసనశిలలు కొన్ని యిప్పటి దేవాలయపు గోడలలో పెట్టి కట్టబడియున్నవి. ఇప్పుడు యిక్కడున్న శిలాశాసనము లన్నియు మదరాసు గవర్నమెంటువారిచే "సౌతు ఇండియన్ ఇన్స్క్రిప్షన్సు 4 వ వాల్యూం (South Indian inscriptions Vol. 4)లో ముద్రితములైనవి.—

13-14 శతాబ్దములలో నీ స్వామిపేరు పెట్టుకొన్న ప్రఖ్యాత రాజపురుషులు కొందరు కలరు. శ్రీనాథునికి కస్తూరి యొసగుచున్న "తెలుఁగురాయుఁడు"ను రాజ గిరిరాజగు తెలుఁగురాయుఁడును మొదలగువారు.

## శిలాశాసనములు - తామ్రశాసనములు

శ్రీ కృష్ణదేవరాయల శాసనములోని విషయ మిది. శా॥ శ॥ 1440 అగు బహుధాన్య సంవత్సరము ఫాల్గుణ శుద్ధ ౧౧ శుక్రవారము శ్రీకాకుళపు తెలుఁగురాయనికి నిత్య నైవేద్యములు అంగరంగ వైభవములు, జరుగుటకై శ్రీ కృష్ణదేవరాయలు కొండపల్లిసీమ, దేవరకోటలోని యెర్లగడ్డ మేడూరి స్థలములోని లంకపల్లి, 3 కంభాల దొడ్డి, కొండవీటి సీమలోని మెదగాడిపట్టు వినుకొండ సీమలోని కాదు మంచి యీ యైదుగ్రామములను సమర్పించిరి. ఇది పై శాసనసంపుటిలో No. 981 (AR No. 157 of 1893) గా ప్రకటింపఁబడినది. శాసనప్రతిబింబ మిది.

1. శుభమస్తు ॥ హరేలీలాపరాహస్యసంస్థాపసంతస్సు పాతుపః హేమాద్రి కలశా యత్రధాత్రీషుత్రశ్రియంపదే ॥ స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశక శషలంబులు ౧౪౪౦ అగు నేంటి బహుధాన్యసంవత్సర ఫాల్గుణ శు ౧౧.

2. శ్రీకాకుళపు తెలుంగురాయలకు శ్రీమ(ం)న్మహారాజాధి రాజ రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ కృష్ణదెవరాయలుం గారు చండ్రుంసమర్పించి యిచ్చిన ధ(ం)ర్మశాసనము—

3. స్వామిని కుంభసంక్రమణపు (ం) ణ్యకాలమందును సమర్పించ్చి స్వామికి కొండపల్లి శీమకుం జెల్లివచ్చి దెవర వుంగోటస్థలం లోపలి యలకగడ్డ గ్రామం ౧న్ని మేడూరి స్థలం లోపలి దేవరలంక్క పల్లి గ్రామం ౧న్ని దేవరపల్లి గ్రామం ౧న్ని

4. శ్రీకాకుళాసను స్వామికి ప్రతిగ్రహలబ్ధమైన దశక దొడ్డిన్ని, క్రయలబ్ధమైన సత్రాలభూమి తొంటలు నిత్య వనరాలు । శ్రీరామానుజకూటము । ద్వారసులు సహితమైన భూమి (ం) న్ని । క్రొత్తలంక । చింతల్లంక్క । పుంగ్రేగులంక రాట్లపురుగుడు లంక్క.

5. క్రోసూరుసుం జెల్లివచ్చే కంబ్బాల దొడ్డిన్ని । కొండ వీటి శీమలోని పెదగాడి పట్టుంన్ను, వినికొండ శీమలోని మధుమంచ్చిన్ని స్వామి సన్నిధిని ధారాపూర్వకంగాను స్వామి నిత్య నైవేద్యాలకున్ను అంగరంగ వైభవాలకున్ను

6. యీ ధమర్మం........౦గారివశాసను తెలుంగువల్ల భునికి సమర్పించ్చాస్తిమి గనక ఆ చంద్రార్క్క స్థాయి గాను అపభరించ్చేది। స్వదత్తాద్విగుణం పుణ్యం పర దత్తాను పాలనం। పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥ ఈ ధర్మానకు యవ్వరు తప్పినాను గంగలోను గోవు బ్రాహ్మణ వధ చేసిన పాపానంబో ఉవారు॥

7. ఈ అయిదు గ్రామాలున్ను శ్రీవల్లభునికి సమ ర్పించి ఈ అయిదు గ్రామాల ఆయంవల్లాను శేసిన నిత్య నైవేద్య కట్టెడ దధ్యోదనం పళ్లాలు (౪), అకాళ ప్రసాదం పళ్లాలు ౪, అప్పాలు ౨౬కి పళ్ళెం ౧, అతి రసాల పళ్ళెం ౧, వడలి పళ్ళెం ౧, యిడసకుడుముల ప్లళ్ళెం ౧ పప్పుకూర, కూరలు.

8. నెయి, పెర్గు, పచ్చళ్లు, ఊరుంగాయెలతోడను, ఆర గించి పళ్ళెలు ౬న్ని అనవాల ప్రసాదం పళ్ళెలు ౨ వెరశి ఆరగించె పళ్యాలు ౭౪ డెబ్బ ఇనాలిగింట్టికి పళ్ళెం ౧ కి అమృతుపడిన (లెఖను) కస్తూరి కప్పూర పరిమళ సహిత గద్దం పళ్యాలు ౩॥- అని కలదు.

## నె. 975 రు శాసనములో

1. శాకాబ్దెబాణ భూభృన్నయన శశిమితె పుణ్యవైశాఖ మాసె శుక్లెపక్షె తృతీయె గణపతిదివసె భానువారంవరాఢ్యె

2. పూజాం పుత్రార్థం కతుకా కామాప్రకటితమ కరో దుత్తమైరకస్తు జాలై ॥ స్వస్తి శ్రీ శకవరుషంబులు. ౧౭౭౫ అగునేంటి.

3. వై వీరనరసింహదేవని దేవులైన గంగామహా దేవులు శ్రీకాకొలని శ్రీ వల్లభరాయునికి సమర్పించిన సువస్తువులు (వైహి)

4. రు ౧౦౮ తోను సన్నం పూసపేఋ ౧ మంటలు ౩ తోను పిన్నవి ౧, ఒత్తులు ౨, పద్మ తడుకులు ౨, ముత్యాల తిరుణామము ౧.

5. పహిండికాయలతోడి పింజాపురలు ౨, పహిణి కాపు అలపటం ౧, పూంతక లేంత్తలు ౪, వెండి దివ్వ కోలలు ౨.

6. వెండినిడ్డె జప్పడి ౨ పట్లు పచ్చపట్లు ౨, చంద్వా లు ౨, పట్టుగొడుగులు ౨, మణియూర వెల్లలు ౬, వన్నె చీరెలు ౧౨, బ్రిందావ.

7. ఈ వస్తువులు జప్పించినవారు కాళిదాస సేనాపతి గోపాలజియ్యగోవింద సేనాపతి, మంగళం మహా - శ్రీ శ్రీ శ్రీ॥

ఇట్లు అనేక రత్నాభరణములు ప్రభువులవల్లను సమర్పింపఁబడినవి. వెండియునఖండ దీపారాధనకు పాడి మొదవులను భూములను బోయలకిచ్చినట్లు ముప్పది శాసనములుఁగలవు. ఇవిఁగాక మఱియొక తామ్ర శాస నము రాగిరథోత్సవ విగ్రహముమీద నున్నది. ఇది ముద్రి తము కాలేదు. ఆ శాసన మిది.

"స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౭౦౫ అగు నేటి స్వభాను సంవత్సర ఫాల్గుణ బహుళ ౨ సోమవారం శ్రీకా కుళపు తెనుఁగు వల్లభుఁడు ఉత్సవ విగ్రహ కైంకర్యము "మురుపళ్ల అనంతభోగయ్యగార్లు తమ తండ్రి రామ వయ్యగారికిని తమ తల్లి నాంచారమ్మగారికిని సుకృతమౌ నట్టుగా ఆ చంద్రార్క్కముగా చేయించెను. "మంగళం" అని కలదు. (సశేషము)

# స మీ క్ష

(సంపాదకుడు)

దర్శన ఖండము - ప్రథమభాగము

1. సర్వసిద్ధాంత సౌరభము.—కర్త :—పరమహంస పరివ్రాజకాచార్య, అనుభవానంద స్వాములవారు; భీముని పట్టణం, విశాఖపట్టణము జిల్లా; క్రవును ⅛ సైజు పేజీలు 300 - వెల మూడురూపాయల నాల్గణాలు.

సాంఖ్యయోగ దర్శనముల విపుల విమర్శన మీగ్రంథము. ఇది శ్రీస్వాములవారు సంకల్పించిన 'సర్వసిద్ధాంత సౌరభము' న నొక తరంగము. హైందవ సాంప్రదాయిక సిద్ధాంతములన్నింటి సారమును స్వాములవా రీగ్రంథమునందు వెలువరించ సంకల్పించి ఈ ప్రథమభాగమున సాంఖ్యయోగ దర్శనములఁ బరామర్శించియున్నారు.

శ్రీ అనుభవానందస్వాములవా రాంధ్రదేశమున సుప్రసిద్ధ వ్యక్తి. బాల్యమున విరాగము వారికి లబ్ధ మగుట పితృపైతామహప్రసాద మని వారే చెప్పియున్నారు. శ్రీరామకృష్ణపరమహంసనే గురుదేవునిగఁ గొని బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి బాపట్ల, భీమునిపట్టణములలో నాశ్రమముల స్థాపించి 'అనుభవానంద గ్రంథమాల' నేర్పఱచి తమ సాధనానుభవముల నెల్లరకు పంచియిచ్చుటకుపన్యాసముల గ్రంథముల నాధారముగ గొని వారు చేయుచున్న అనుగ్రహ ప్రసరణము ఎల్లరకు సువిదితమే. కాని శ్రీవా రింత పండితు లని పాశ్చాత్యప్రాచ్య దర్శనములందు వారి పాండితి తలస్పర్శ మని వారిశోధన మద్భుత మని వారి విచక్షణా మేధా విమర్శనశక్తు లనుపమము లని విషయనివేదన కౌశల్య మప్రతిమాన మని ఈ గ్రంథమును జూచినదనుక చిరపరిచయు లగువారికిని తెలిసియుండదు. సర్వసిద్ధాంత సంగ్రహ, లేశాది గ్రంథముల మాధవ, అప్పయ్యదీక్షితాదులు రచించియున్నారుగాని అవి సంస్కృతమున రచితములు; గాన, తెనుగువారి కందుబాటులో లేవు. మఱియు అవి కేవలవిషయ నివేదనమాత్రములు. ఈ గ్రంథమున నన్నో ప్రాచ్యపాశ్చాత్య విమర్శకాగ్రణుల యభిప్రాయములతోగూడ దర్శనకర్తలు, వ్యాఖ్యాతలు, వారి జీవితవిశేషములు విషయప్రమాణములగు గ్రంథములు అయాదర్శనసారము తద్విమర్శనలు, వేయేల సర్వవిషయము లిందు సంగ్రహింపబడియున్నవి. కాన నీగ్రంథము అయాదర్శనవిషయము నెఱుంగ గోరువారికి రసగుళికయని చెప్పవచ్చును.

సాంఖ్యదర్శనకారుఁ డెవఁ డనుటలో వీరు ఇరువురు కపిలు లని సిద్ధాంతము చెప్పియున్నారు. ఒకరు బ్రహ్మపుత్రులు ఒకరు కర్దమదేవహూతుల తనూజులు. వీ రిరువురి కన్న సగరపుత్రులసంహర్త భిన్నుఁ డని ఆయనయు ఋషిసత్తముఁ డని భారత ముద్యోగపర్వమున నుడువుచున్నది. చక్రధనుఁడను ఋషి సూర్యునివలనఁ గలిగినవాఁడని ఆయన సగరపుత్రుల సంహరించె నని భారతవాక్కు.

పతంజలికాల నిర్ణయమునను 'యవనుడు సాకేతమును ముట్టడించుచున్నాడు.' అను భాష్యవచనమునుబట్టి యోగదర్శనకర్త యవన దండయాత్రల కాలమున క్రీస్తుశకమునకు పూర్వము పతంజలి యుండెనేమో యని తోచుచున్నది; గాని యవన దండయాత్ర కాలముమాత్రము నిర్ణయమైయున్నగదా.

షడ్దర్శనముల ప్రాధాన్యము వేఱుగ వివరింప నక్కరలేదు. జడజగత్తును నిర్ణయించు తర్కవైశేషికములును క్రియాకర్తృవివేచనాధ్యములగు మీమాంసాద్వయమును విషయ విషయ సంబంధ - జ్ఞానకరణ - ఇంద్రియ విమర్శాత్మకములగు సాంఖ్యయోగములు మూడుజంటలు. సాంఖ్యము దర్శనములందు ప్రాచీన మని ముఖ్యమని యెల్లరంగీకరించినదే. సాంఖ్యజ్ఞానము కొంతయైన లేక ప్రాచ్యాస్తిక దర్శనములుగాని పురాణాదికములుకాని యర్థము గావు. సాంఖ్యము సిద్ధాంతమున ప్రథమశరణ్య మయినట్లే ఉపాసనమున యోగము నట్లే.

శ్రీ అనుభవానందస్వాములవా రీగ్రంథపరంపరను బ్రకటించి ముముక్షు జనోపకారము నిట్లే ఒనర్చుచుందురు గాక యని మానమస్కారపూర్వ కాభ్యర్థనము.

సుందర భారతయాత్ర :—రెండు భాగములు. రచయిత—విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రి, ప్రకాశకులు, సాధన గ్రంథమండలి, తెనాలి; వెల-భాగము ఒక్కొక్కటి రు. 2 అ. 8. క్రవున్ ⅛ సైజు, పే. 748 లు.

"భువి పురుపుణ్యతీర్థసదనా స్యృషయో విమదా స్త
ఉ త భవత్పదాంబుజహృ దోఘభిదంఘ్రిజలాః
దధతి సకృ స్మన స్త్వయి య ఆత్మని నత్యసుఖే
న పున రుపాసతే పురుషసారహరావసథాన్" శ్రు. గీతలు- —భాగవతము

తామే పావనులైన ఋషులుకూడ భూమి నెన్నోతీర్థములను క్షేత్రముల నుపాసించుచున్నారని భాగవతము చెప్పుచున్నది. శరీరము ఒక్కటే అయినను జ్ఞానతేజస్సు శీర్షమునందు హృదయమునందు మూలాధారాదిషట్చక్రములందు వివిధ తేజస్సులతో ప్రకాశించునట్లు భారతభూమియం దొక్కొక క్షేత్రమున తీర్థముస భగవత్కళ వివిధముగ ప్రకాశించుచున్నది. ఉపాసన కట్టి కళాస్థానము లెంతో ముఖ్యములు. కావున యాత్ర మన ఆధ్యాత్మికోపాసనమున మొదటి యడుగుగ నందఱు నంగీకరించియున్నారు.

యాత్రకు నానాదేశ జనుల యభిజ్ఞానము, వారి వారి యాచార మతసంప్రదాయాదికముల నెఱుంగుటచే మార్గము లెంత భిన్నము లైనను గమ్య మొక్కటియే యని—"పయసా మర్ణవ ఇవ" యన్నట్లు—యెఱుంగుటయు, శరీరమునకు శీతాదిద్వంద్వజయము, సహిష్ణుత, ఇత్యాది గుణసంపత్తి కల్గుటయు ఐహికఫలములు. ఆముష్మికఫలములు అఘక్షయము సత్వేవచేత కలుగు పుణ్యసంపత్తి.

భారతజనుల దేశాటనము ఐహికకృత్యమాత్రము గాదు. ఆధ్యాత్మికోపాసనల నొక్కటి-వారి దైనందినక్రియ యొక్కొక్కటియు ఆ బుద్ధితోనే పెద్దలేర్పరచియున్నారు గద.

ఐహికబుద్ధిచేతనైననగుగాక; మన ప్రభుత్వమువారు మనదేశము చూడవచ్చు. పాశ్చాత్యజనములకు భారత యాత్రను సుఖముగ నెరవేర్చుకొనుటకు ఏయే విషయములు తెలియనగునో వానిని తెలుపుటకు టూరిస్టు ఏజన్సీల నేర్ప ఱచియున్నారు. అవి ఆ యాత్రికు లెక్కడ ఆగవలయునో ఏవి చూడవలెనో ఏవి ఎందున్నవో తెల్పు గ్రంథముల ప్రచు రించుటమూలమున వారి కాయా యాత్రలకు సదుపాయముల నేర్పరచుట మూలమున సహాయము చేయుచున్నది. కాని మన క్షేత్రముల ప్రశస్తి, అవి యెందున్నవి? ఆయా క్షేత్రముల విశేష మేమి? వానిని చూచుట కెట్లు పోవలెను? ఇట్టి విషయముల దెల్పు గ్రంథములు మన భాషయందు లేవు. ఎవరును ఇంతవరకు ప్రచురింపలేదు. కావున నేతద్విషయక మైన గ్రంథమును ప్రచురింపఁబూని సాధనగ్రంథమండలివారు 'సుందర భారత యాత్ర' యను నీగ్రంథమును వెలువరచినారు.

సాధన గ్రంథమండలివారు సనాతన ధర్మగ్రంథ ప్రకటనమున కెంత సేవ చేయుచున్నది లోకమునకు విదితమే. ఈ గ్రంథప్రచురణముచేత ఆంధ్రజనము వారల కితోధికముగ ఋణపడియున్నదనుటకు సందేహము లేదు. ఈ గ్రంథ మండలికిఁ బ్రాణము ఈ గ్రంథమును రచించిన శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు-ధన్యజీవులు.

భరతదేశము నిది ఖండములుగ విభాగించి ఒక్కొక్క ఖండమున నేయే క్షేత్రముల చూడవలెనో తెల్పుచున్నది. ద్వారకాఖండము కాశీఖండము జగన్నాథఖండము మధ్యభారతఖండము రామేశ్వరఖండము పరిశిష్టఖండము ఇట్లు విషయవిభాగ మున్నది.

యాత్రికులకు తమ యాత్రను సుఖముగఁ జేసికొనుటకేసలహాలు కావలెనో అన్నియు నీయఁబడియున్నవి గ్రంథకర్త స్వానుభవము నాధారముచేసికొనియున్నారు. కనుక వారి సలహా లన్నియు చాటింపదగియున్నవి.

వారి పాండిత్యము నసాధారణమైనదని మన ధర్మవాఙ్మయమునుండి వా రిచ్చిన యుద్ధారములచేతనే తెలియ గలదు. వారు చెప్పిన మాట లన్నింటికి ప్రమాణములు చూపించబడియున్నవి. మన పురాణ వాఙ్మయ మంతయు వారికిఁ గరతలామలకము.

శాస్త్రిగారికి ఆస్తికజను లెల్లరు కృతజ్ఞులుగ నుండవలసినది యని వేరుగా హెచ్చరింపవలసినది లేదు.

**1. శ్రీవాసుదేవనామ శతకము:—కవి శ్రీగురుజాడ రాఘవశర్మగారు, బందరు. క్రౌన్ సైజున ముప్పదిపేజీలు** వెల రు. **0-8-0.** ప్రాప్తిస్థానము గురుజాడ రాఘవశర్మ, బృందావన ప్రచురణాలయము, బందరు.

యథావిధిగ పురశ్చరణముజేసెను. భగవానుడు ప్రసన్నుడై వరప్రదుడు కాగా గాలవుడు బ్రహ్మానందముజెంది భగవానుని స్తుతించుచు తనయందు భగవద్భక్తి యెన్నటికిని కొఱతపడకుండున ట్లనుగ్రహింపుమని వేడెను. ప్రీతుడగు నారసింహదేవు డాతని యాశకు మెచ్చి అట్లే వరమిచ్చుచు ఆ తీర్థమునకు గాలవతీర్థమని యా మహర్షిపేరిట ప్రసిద్ధి కలుగునట్లును అనుగ్రహించెను. మరియు గాలవతీర్థ మందు స్నానముచేసెడివారలకు ముక్తి కలుగునట్లును వర మిచ్చెను. కార్తికమాసమునందీ తీర్థమందలి స్నానము చేయుట ప్రశస్తమనియు చెప్పి భగవాను డంతర్హితు డాయెను.

రామలక్ష్మణ తీర్థములు :—(రామకుండము, లక్ష్మణ కుండము) రామచంద్రుడు సీతాలక్ష్మణులతో వనవాసమునకు వేంచేయునపుడు ఈ తీర్థతీరమున కొంచెము కాలము విశ్రమించిరి. దాసనీవ్యవహార మీ చోటునకు కలిగెను. నియతులై మార్గశీర్ష పుష్యమాసములందు ఈ తీర్థమున స్నానము దానము చేయువారలకు సకల సిద్ధులు కలుగును.

భీమతీర్థము :—పరమశివు డిచ్చట పర్వతమును భేదించి ఈ తీర్థమును సృజించెను. ఇయ్యది భయంకర మగు శబ్దముతోడను వేగముతోడను ప్రవహించుటవలన దేవతలు దీనికి అన్వర్థముగ భీమతీర్థమని పేరిడిరి. మాఘ మాసమునరుణోదయ కాలమున నిందు స్నానదానాదుల నొనరించెడివారలు అఖండితమగు నైశ్వర్యమును పొందెదరు. మాఘమాసమున నీ తీర్థమధ్యమునుండి సహస్ర గాయత్రీ మహామంత్రమును జపించువారలకు ఇంద్ర లోకము లభించును. మాఘవ్రతము నొక మాసకాలము నియమముతొ ననుష్ఠించెడివారలకు బ్రహ్మలోకప్రాప్తి కలుగును.

శంఖతీర్థము :—తపస్సంపన్నులగు శంఖుడు లిఖితుడు నను సోదరమహర్షులు నష్టములగు వేదముల నుద్ధరించి ఈ తీర్థతీరమున భగవానుని స్తుతించిరి. భగవానుడు సంతుష్టుడై ఈ తీర్థమునకు వారలపేరిట శంఖతీర్థ మని వ్యవహారము కల్గునట్లనుగ్రహించెను. ఆరు సంవత్సరముల కాలము నిరంతరముగ నీ తీర్థమందు స్నానము చేయువారలకు పూర్వజన్మ స్మృతి కల్గును. ఫాల్గున మాసమందు తీర్థస్నానముచేయుట పితృశ్రాద్ధముచేయుట ప్రశస్తము.

వారాహ తీర్థము :—పూర్వకాలమున పాతాలమందు మునిగిపోయిన భూమిదేవినుద్ధరించుటకై మహావిష్ణువు వరాహరూపమెత్తి ఆ భూమిని పైకితెచ్చెను. అప్పుడు భగవానుని శరీరమందుండి జారిన స్వేదబిందువులచే యేర్పడిన ఈ తీర్థము వారాహ తీర్థమని పిలువబడెను. ఈ తీర్థ తీరమునసే ధరణీదేవికి భగవానుడు వారాహ మంత్రము నుపదేశించెను. ఈ తీర్థమందు మూడు దినములు స్నానము జేసి యుపవాసము చేయువారలకు త్రిలోకైశ్వర్యము లభించును. గరికె వ్రేళ్లు గోధుమలతో కలసిన తెల్లని బియ్యమును భగవానునకు అర్పించుట సిద్ధిప్రదము. చైత్రశుక్ల ద్వాదశియందుగాని పూర్ణిమనాడుగాని ఈ ప్రదేశమున నన్న దానముచేయుట యక్షయ ఫలప్రదము. దరిద్రునకు వస్త్ర దానముచేయుట విశేషఫలప్రదము.

చక్రతీర్థము:—ఈ తీర్థమందు స్నానము చేయువారలకు జన్మ జరామరణములు కలుగవు. ఈ తీర్థమందు అంబరీష చక్రవర్తి సుదర్శన మహామంత్రమును పునశ్చరణము జేసెను. దాసనీ తీర్థమాతని పేరిట ప్రసిద్ధి జెందినది. వైశాఖ మాసమందలి విశాఖా నక్షత్రము కూడిన శుభదిన మందు బ్రాహ్మణులకు పథ్యాన్నము నొసగువారలకు దారిద్ర్యము కలుగదు.

చూతతీర్థము :—ఒకానొకప్పుడు స్వర్గమర్త్యపాతాలము లను మూడులోకములందును ద్వాదశాబ్ద క్షామము కలిగెను. శ్రీ మహావిష్ణువు ఈ తీర్థతీరమందు కుబ్జామ్రరూపయై అష్టాశీతి సహస్ర సంఖ్యగల మహర్షులను క్షుద్బాధకు గురికాకుండ రక్షించెను. దాననీతీర్థము చూతతీర్థమని పిలువబడెను. జ్యేష్ఠమాసమున జ్యేష్ఠా నక్షత్రము కూడిన శుభదినమున ఈ తీర్థమున స్నానదానాదుల నాచరించుట ఫలప్రదము. ఈ తీర్థతీరమున కన్యకాదానము చేయుట వలన బ్రహ్మలోక ప్రాప్తియు భూదానము చేయుటవలన సామ్రాజ్యలాభము హిరణ్యదానము చేయుటవలన కుబేర లోక ప్రాప్తియు కలుగును.

ధారాతీర్థము:—భగవదారాధనమున కుపయుక్తములగు యుదకములనీ తీర్థమందుండి సంగ్రహింప బడుటచే దీనిని ధారాతీర్థమని యందురు. ఆషాఢమాస ద్వాదశి యందీ తీర్థమున స్నానముచేయుట ఫలప్రదము. నాడు గోదాన మాచరించుట విష్ణులోకప్రదము. సాలగ్రామదానమనంత ఫలదము.

గజకుండము :— ఈ తీర్థము భగవదాలయమునకు ముందుభాగమున నున్నది. సింహమును చూచిన గజ బృందము పరుగెత్తునట్లు ఈ కుండమున స్నానమాచరించెడి మానవుల పాపములు పలాయితములగుటచే దీనికీ పేరుకలిగినది. గజేంద్రమోక్షణ కథయు ఈ సరోవరమునకు సంబంధించినదని చెప్పుదురు. శ్రావణమాసమున నిచ్చట స్నానముచేసి ధాన్యదానముచేయుట అక్షయఫల ప్రదము.

వినాయకతీర్థము :— విఘ్నవినాశకుడగు గజాననుడీ తీర్థతీరమున తపమాచరించుటచే నియ్యది వినాయక

తీర్థమని పిలువబడుచున్నది. భాద్రపదమాసమున నీ తీర్థమందు స్నానముజేసి పితరుల నుద్దేశించి యన్నదానము చెయుట ప్రశస్తము.

భైరవ తీర్థము :—తలలేని మొండెముగనై ఈ తీర్థ తీరమందు భైరవుడు నిలచియుండుటచే దీనికి భైరవ తీర్థ మని వ్యవహారము కలిగినది. ఆశ్వయుజమాసమందీ తీర్థ మున స్నానము జేసి స్వర్ణదానము చేయువారలకు వంశ వృద్ధి కలుగును.

రక్తకుండము:-దీనినిగురించి ముందుప్రశంసింపబడినది.

## నాల్గవ అధ్యాయము

నవనారసింహ చరిత్రము—సంహారావసరము.

గజతీర్థ తీరమున చక్రాసనాసీనుడై చక్రాద్యాయుధ ములు సేవించగా నారసింహుడు ముందు భాగమున ప్రాంజలియై కూరుచునియుండెడి ప్రహ్లాద కుమారుని నను గ్రహ దృష్టితో చూచుచున్నాడు. ఈ ప్రదేశమె నారసిం హునకు ముఖ్యస్థానము. నారసింహుని సాన్నిధ్యము లేని చోటు లేదు. అతడు జగద్వ్యాపి.

వారాహ నారసింహుడు—గరుడాచలమందు వేదాద్రి యను భాగమున వెనుక ప్రదేశములో దక్షిణ ముఖముగా ధరణీదేవితో కూడి వరాహ నరసింహుడు కలడు. ఇచ్చట 'కనక' యను నది ప్రవహించుచున్నది. పూర్వమందు సోమకాసురుడు వేదముల నపహరింపగా వేదములు లేని లోకమును రక్షించుటకై భగవానుడు వరాహావతారమెత్తి సోమకుని సంహరించి వేదముల దెచ్చెను. అప్పుడు వేద ములు ఉపకారస్మృతిని తలచి వేద రక్షణమందు చతు రాస్యుడు సమర్థుడు కాజాలడని నిశ్చయించి తమకు శాశ్వతముగ నిట్టి పరాభవము సంభవింపకుండు రక్షణము జెందుటకై ఈ పర్వతమునకు వచ్చి నారసింహునుద్దేశించి తపమాచరించెను. ప్రసన్నుడగు భగవానుడు వేదములకు అవద్యము రాకుండ శాశ్వతరక్షణ మిచ్చునట్లు వరమిచ్చి అట్లు వేదముల తపస్సుకు తన వరప్రదానమునకు జ్ఞాపక ముగ పర్వతమునకు వేదాద్రి యను వ్యవహారము కలుగు నట్లును వరమిచ్చెను.

యోగానంద నరసింహుడు :—వేదాద్రికి దక్షిణ దిశను ప్రహ్లాదునకు యోగము నభ్యసింపజేసిన యవసరమున నీమూర్తి కలదు.

యోగానంద నరసింహుడు (2) :—ఈ ప్రదేశమునకు వాయవ్య భాగమున నింకొక మూర్తి ఇట్లే కలదు.

నారసింహ మూర్తి :—గరుడాద్రికి దక్షిణమున పావన తీర్థ తీరమున నీమూర్తి కలదు.

కరంజక నరసింహుడు :—గరుడాద్రికి పశ్చిమమున గల కరంజవృక్ష మూలమున నీమూర్తి కలదు.

ఛత్రవట నరసింహుడు :—ఆ ప్రదేశమునకే నైర్ ఋతి భాగమున క్రోశార్ధ దూరమున ఛత్రవట ఛాయ నాశ్రయించి ఈ మూర్తి కలదు.

భార్గవతీర్థ మూర్తి :—పై ఛత్రవటమున కుత్తరమున భార్గవతీర్థ తీరమున నీమూర్తి కలదు.

అచలఛాయమేరుమూర్తి : — అచలఛాయమేరువునకు మధ్యభాగమున నీ జ్వాలా నరసింహమూర్తి కలదు.

ఇంచలి విశేషములు :—వారాహ నరసింహుడుండునది వారాహ క్షేత్రము. ఐదు దినములుగాని యేడు దినములు గాని నారసింహ మంత్రమును నియమముతో ఇచ్చట జపించు వారలు సిద్ధి బొందుదురు. ధరణీదేవిచే జేయ బడిన స్తోత్రమును ఆరుమాసముల కాలము జపించు వారల కిష్టార్థ సిద్ధి కలుగును.

లక్ష్మీనరసింహుని సన్నిధానమున అష్టాక్షర లక్ష్మీనృసింహ మంత్రమును ఆరుమాసముల కాలము హవిష్యాశియై జపించు వారలకు సకలైశ్వర్యములు కలుగును.

యోగానందుని సన్నిధానమందు యోగాభ్యాసము నాచ రించెడి వారలకు క్షిప్రముగ యోగసిద్ధి కలుగును. పూర్వ కాలమందొకప్పుడు చతుర్ముఖుడు చిత్త చాంచల్యము కలిగి ఈ ప్రదేశమందు తపముజేసి స్వస్థుడాయెను. అట్లే భరద్వాజుడు బ్రహ్మహత్యా పాపమునుండి ముక్తుడాయెను. ఈ ప్రదేశము మహాపాతకమోచనము.

కరంజకమూల నారసింహుని సన్నిధానము సకల పాప హరము. పూర్వము దుర్వాసునిచే శపించబడిన గోభిలుడు ఇచ్చట తపమాచరించి భగవదనుగ్రహముచే సకల శాస్త్ర జ్ఞానమును మోక్షమును పొందెను. ఆ గోభిలునకే గాక క్షేత్రమునకును ఇచ్చట తపముచేయు వారల కట్టి సిద్ధిని కలుగజేయగల శక్తి ననుగ్రహించెను.

ఛత్రవటమను చోటున నింద్రాదులు వసియింతురు. హాహాహూహూ అను గంధర్వులు ఇచ్చట దివ్యగానముచే భగవానుని కృపకు పాత్రులై లోకోత్తర గౌరవమునందిరి.

అక్షయతీర్థ సమీపమున భార్గవ నారసింహుని సన్నిధాన మున భార్గవ రాముడు తపముజేసెను.

జ్వాలా నరసింహుని సన్నిధానమున మహమునులు తప మాచరింతురు. కార్తిక మాసమందిచట దీపారోపణము ఫలప్రదము.

## పంచమాధ్యాయము

సనకాదులు వైకుంఠమున కేగుట, జయవిజయులు భగవన్మందిర ద్వారమున వారలను వారించుట, సనకా దులు శపించుట, భగవానుని అనునయము, జయవిజ యులు శాపదగ్ధులై భూమియందు హిరణ్యాక్ష హిరణ్యకశి పులై పుట్టుట, వారలు చేసిన లోకోపద్రవము, రక్షకో

పాయమునకై దేవతలు బృహస్పతిని ప్రార్థించుట. బృహస్పతి జెప్పిన హరిశరణము, దేవతల క్షీరాబ్ధిగమనము, స్తోత్రము, భగవాను డాశ్వాసపరచి వారలను పంపుట, దేవతలు కాలమును ప్రతీక్షించుట.

## షష్ఠాధ్యాయము

హిరణ్యకశిపునకు పుత్రలాభము, ప్రహ్లాదుని శైశవము, ప్రహ్లాదుని వైష్ణవ భక్తి, హిరణ్యకశిపుడు వానిని నిరసించుట, హిరణ్యకశిపుని దారుణచర్యలు, ప్రహ్లాదుని శపథము.

## సప్తమాధ్యాయము

ప్రహ్లాదుని యమోఘశక్తికి తండ్రి ఆశ్చర్యపడి అనునయించుట, ప్రహ్లాదుని భక్తిపారవశ్యము, హిరణ్యకశిపుడు స్తంభములో హరిని జూపుమనుట, నృసింహావతారము, హిరణ్యకశిపు సంహారము, దేవతలు స్తుతించుట, ప్రహ్లాదునకు వరదానము, అహోబలశబ్ద నిరుక్తి.

## అష్టమాధ్యాయము

శంఖనిష్పత్తి :—దేవతలు కోపము నుపసంహరింపుమని నృసింహుని వేడుట. కోపోపసంహారము కాకుండి నుండుట. దేవతలు చతుర్ముఖుని కడకేగుట. త్రిపురాసుర సంహారము భంజనాసురసంహారము జేసిన శంకరుడు ఘటికుడని యెంచి నృసింహుని జయించుటకై శంకరుని కడకేగి సహాయమును కోరుట; శంకరుని శరభావతారము. యుద్ధము, శరభసంహారము. ఈ కారణమున నిచ్చటి శిలలకు లింగరూపము కలుగుట. ఇచ్చట ఆరుమాసముల కాలము శివసూక్తములను జపించు వారలకు శివసాయుజ్యప్రాప్తి కలుగుట.

## నవమాధ్యాయము

భవనాశిని నది మూడులోకములను ముంచివేయుగల వేగముతో ప్రవహించుట. ఇంద్రాదు లా వేగమును సంహరింపుమని నదిని ప్రార్థించుట. ఆ ప్రార్థనము ఫలించక పోవుట. ఇంద్రునకు ఆకాశవాణి భైరవవృత్తాంతమును చెప్పుట ఇంద్రాదులు భైరవుని ప్రార్థించుట. భైరవుడు నదిని స్తుతించుట. నదియొక్క అనాదరము. భైరవుడు హతాశుడై తన శిరమును ఖండించి ప్రవాహమున కడ్డముగ బడవేయుట. నదిభయమునంది పాతాళమున కేగి శేషుని జూచుట. శేషుడు నది ననునయించి పాతాలమున కామెకు రక్షణములేమి మఱల భూమికేగుమని చెప్పుట, తింత్రిణీ తరుమూలమున భైరవుని శిరమును ప్రతిష్ఠించుట (ఇచ్చటనే భవనాశిని యవతరించినది) ఈ చరిత్రము కలదు. భైరవుని శిరమును దర్శించుట. ఇచ్చట యాత్రాక్రమమున నొక యంశమైయున్నది. ఈ నది కృష్ణవేణీ సాగర సంగమమునకు సమీపమున రెండు యోజనముల దూరమున సముద్రమున కలియుచున్నది. భైరవునకు ఇంకొక తల భగవత్ప్రసాదము వలన లభించెను. అవెనుక భైరవుడు భగవానుని స్తుతించి 'ముండభైరవుడ'ని తనకు లోకమందియుపదానజ్ఞాపకమగు వ్యవహారము కల్గునట్లను గ్రహింపుమని ప్రార్థించెను. భగవానుడు ప్రీతుడై ఈ క్షేత్ర దర్శనము చేయునప్పుడు క్షేత్రపాలుని దర్శనముచేయుని వారలను శిక్షింతునని చెప్పెను. భైరవున కుత్తరముగ శ్రీశైలపర్వతమునకుచేరి పర్వతగుహయని పేరనొప్పెడి గుహయొక్కటి కలదు. ఆ గుహయందు నృసింహుని మూర్తియొండు కలదు. అనేకులగు మహాత్ములి పర్వత గుహయందు వసియింతురు. ఇచ్చటి సాధుజను లీమూర్తిని పంచరాత్ర రీతిగనారాధించెదరు.

## దశమాధ్యాయము

సాంఖ్యయోగాది సాధనములందు అధికారములేని సాధారణ మానవులకు మోక్షోపాయము నుపదేశింపుమని ఋషులు ప్రశ్నించుట. క్రియాయోగము లేక విగ్రహారాధన మొక్కటి మాత్రమే అందరకు మోక్షసాధనమని చెప్పుట. తన సుఖైశ్వర్యమునకు హేతువెయ్యదియని మాంధాత చక్రవర్తి చింతించుచు కారణము నరయుగోరి వసిష్ఠుని ప్రశ్నించుట. మాంధాతయొక్క పూర్వజన్మ వృత్తాంతమును జ్ఞానదృష్టిచే యెరిగిన వసిష్ఠుడు పూర్వ జన్మమందు మాంధాతయు ఆతనిభార్యయు శూద్ర దంపతులైయుండి నిరంతరము భగవన్మందిరమున సమ్మార్జనోప లేపనాదుల జేయుచు దేహయాత్ర గడపిరనియు ఆ పుణ్యఫలముచే ఈ జన్మమందు అఖండభూమండలమున కేక ఛత్రాధిపతియై పూర్వపు భార్య తనకు రాణి కాగా ఐశ్వర్యానుభవము ననుభవించు చుండెననియు జెప్పెను.

---

# శ్రీకాకుళము - ఆంధ్రవిష్ణువు

శ్రీమాన్ కవిరాజ శిరోమణి, పండిత, దివి నరసింహాచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.

(గతసంచిక తరువాయి)

## పండితులు - ప్రశంసలు

సర్వతంత్ర స్వతంత్రులును, కవితార్కిక సింహులు నగు శ్రీమద్వేదాంత దేశికులవారి కుమారులును, నిఖిల కవితార్కిక చూడామణులునగు వరదగురువులీ క్షేత్రమునకు వచ్చి శ్రీస్వామిని సేవించి "భగవద్ధ్యానముక్తావళి" యను స్తోత్రమును రచించి పాడిరి. మచ్చునకు రెండు శ్లోకములిట నుదహరింతును. మిగిలినవి తరువాత ప్రకటింతును.

శ్లో॥ "భావస్సాక్షాజ్జలధిదుహితు ర్భావనా యోగభాజాం
కల్యాణా నామహమహమికా కాంక్షితం వేదవాచామ్
సౌభాగ్యస్య ప్రథమగణనా సన్నివేశః కృపాయాః
పారేకృష్ణం వసతిభగవాన్ పావనః కాకుళేశః".

శ్లో॥ మూర్ధాన్యాధార్యం శ్రుతిపరిషదాం ముక్తిభాజాంచపుంసాం
దత్తామోదం నిఖిల జగతాం దర్శితం వేదవాదైః
పద్మాలీలా కమలమపరం కాకుళేశస్యపాదం-
ప్రత్యాసీదన్మధు కరతుమే ప్రత్యహం భావబంధః"

శ్రీకృష్ణరాయల యాస్థాన విద్వాంసుఁడు, "లొల్ల లక్ష్మీధర పండితులు" యొక శాసనమునని యాంధ్రనాయక స్వామిని స్తుతించినాడు.

శ్లో॥ ఉరసినిహిత లక్ష్మీ బాహువల్లీ యుగేన
స్వకరయుగళ మేకీకృత్య కేళీవినోదే
కువలయదళ దామానద్ధ మందారమాలాం
దదదివ వితనోతు శ్రీకళాం కాకుళేశః" అని.

శ్రీపరస్తు గోవిందరామానుజ దేశికులవారి శిష్యుఁడును, ముక్తపరాన్వయమువాడును, ముక్తామణీనాథ పుత్రుండును నగు పరవస్తు కవి తన "ఉత్తారక పంచకాభ్యుదయ" మను గ్రంథమున

ఉ॥ వచ్చి సదాంధ్రనాయకుని - వాసమునైన
శ్రీకాకుళంబునన్
మచ్చిక వైష్ణవోత్తముల-మానిత వైభవమొప్పనన్నుతుల్
మెచ్చుగ సేయ నాహరిని - మేల్మిఁ బ్రదక్షిణ
పూర్వకంబుగా
హెచ్చిన భక్తి మ్రొక్కిమది - కింపగు వేడ్కల
నుండి వెండియున్॥

అని వ్రాసుకొనియున్నాడు. "అసంతామాత్యుఁడు" తన భోజరాజీయము "నందు, తన తండ్రియైన తిక్కన ఈ దేవుని సేవించినట్లు,

సీ॥ విలసితంబగు కృష్ణ - వేణీ మలాపహా
రిణియేమ రదినాథ - రీతియందు
దనరునదీత్రయాంతర్వేదియగు పాద
న క్షేత్రమున శోభ - నములకెల్ల
దరనివాసంబగు - పెదపుగూరిపురంబు
నందు విద్వజ్జనానందమైన
జీవనస్థితిచేతఁ జెన్నొంది వంశక
ర్తృత్వసంపత్తి ప్ర - భుత్వమొంది
గీ॥ నెమ్మిఁ బ్రత్యక్ష పరమప ద - దమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున - కొడయఁడైన
యాంధ్ర వల్లభహరి సేవ - సలుపుచుండుఁ
బెక్కు భంగుల ముమ్మడి - తిక్కవిభుఁడు॥

## శిరోజము - శిఖాదర్శనము

ఈ స్వామి లీలలు పెక్కుఁ గలవు. అందొకటి శ్రీ స్వామివారికి ప్రభువు నిత్యము పూలమాలను పంపుచుండుటయు, దానిని స్వామి కర్పించి మరుదినమున స్వామి నిర్మాల్యమును ప్రసాదమును అర్చకులు ప్రభువుల కొసంగుచుండుటయు సర్వాచీనమైన యాచారము. కాని అర్చకుఁడు ప్రతినిత్యము స్వామివారికి సమర్పించిన తరువాత నా మాలను తీసుకొనిపోయి తన కసుంగు ప్రేయసి కిచ్చుటయు నామె ధరించి, మరునాటి యుదయమున నా దండనే యిచ్చుచుండెడిదట. ఒకనా డందు ప్రమాదవశమున నొక శిరోజము చిక్కువడినట్లును, దానిం గాంచి ప్రభువు కోపోద్దీపితుఁడై, యర్చకుని రావించి, యడుగ నాతఁడు భయపడి, శ్రీ స్వామివారికే శిరోజములున్నవని చెప్పినట్లును నంత నట్లుఁ జూపకున్న శిక్షింతునని రాజు పలికినట్లును, నప్పుడు ప్రభువు పరివార పండిత సమేతముగా స్వామిని సేవించి పరీక్ష సేయ, భక్తజన పారిజాతుఁ డగు యాంధ్రనాయకుఁడు తన భక్తుడైన అర్చకుని మాటను సత్యముఁ జేయుటకై "శిరోజముల"నుఁ రాజుకుఁ జూపినట్లును, ప్రభువు యిది తాంత్రికమని యూహించి నొకటి రెండు వెంట్రుకలను లాగఁగా నంత

వరకు శిరము కంపించి, రక్తము స్రవించినట్లును, సంత నా మహాభాగుఁడు, ద్విపపరీక్ష యొనర్చుట మహాపాతక మను విశ్వాసముతో తన్ను క్షమింపుడని వేడుకొని, అప రాధము క్రింద ననేక యగ్రహారములను, రత్నాభరణ ముల నొసంగినట్లు యొక యైతిహ్యముఁ గలదు. ఈ కథ చల్లపల్లి సంస్థానాధీశు స్వాధీనములో నుండుటచేత "అంకినీడు"గారి పాలన కాలమున జరిగినట్లు చెప్పు దురు. ఇది "సుమంతు" డను ప్రభువుకు సంబం ధించినది. గాని చల్లపల్లి ప్రభువులకు సంబంధించినది కాదు. ఇది క్షేత్ర మహాత్మ్యము 98 వ అధ్యాయములో "ఇతి శ్రీమద్బ్రహ్మాండ పురాణే - ఉత్తరఖండే - నారద సంహితాయాం శిఖాదర్శన వర్ణనంనామ" అని గద్యలోఁ గలదు. గనుకనే, కాసుల పురుషోత్తమ కవి,

"వైఖానసోక్తికి వంచనరాకుండ
కాకుళంబున నెరుల్ - కాంచినావు"

అని వర్ణించిరి. మఱియొక తఱి శ్రీ స్వామివారికి ప్రభు వులు ఉత్సవములు చేయక నిర్లక్ష్యముగ నుండుటచే శ్రీస్వామివారు కోపించి భూమిలో నంతర్హితులైరట. ప్రభువు లెన్నివిధముల స్తుతించినను రాలేదట. అప్పుడు శ్రీకాసుల పురుషోత్తమ కవి, కృష్ణలో కృతస్నాతుఁడై భగ వత్సాన్నిధ్యమున నిలిచి 108 సీసపద్యములు "ఆంధ్ర నాయక శతకమును" చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్యభావ.

హతవిమతజీవ శ్రీకాకు - ళాంధ్రదేవ॥ అను మకుటముతో భక్తిమై పఠింప నాదేవదేవుఁడు యతని భక్తిని మెచ్చి పద్యమున కొక యంగుళము చొప్పున పైకి తేలివచ్చెనను నొక యైతిహ్య మివైపున ప్రతీతి కలదు.

## ఆంధ్రనాయక శతకము శ్రీకాకుళ శ్రీహరిశతకము

ఆంధ్రనాయక శతకమును కాసుల పురుషోత్తమ కవి వ్రాసెను. ఈకవి చల్లపల్లి జమీనులోని పెద్ద ప్రోలుగ్రామ వాసి. ఇది చల్లపల్లి సంస్థానమునకును, ప్రసిద్ధ సుబ్ర హ్మణ్య క్షేత్రమగు మోపిదేవికిని మధ్యకలదు. కవి తన కులమును భట్రాజునని గ్రంథమధ్యమున

"ఇట్టి సంప్రదాయుంబు - గుట్టుఁబెట్టి
రట్టుసేయుదుఁగనుమునా - భట్టుతనము"

అని వివరించి యున్నాడు. ఇతఁడు 180 సంవత్సరముల కవలివాఁడు. తండ్రి అప్పలరాజు, తల్లి రమణమ్మ, గురువు అద్దంకి తిరుమలాచార్యులు. ఈకవి వంశము వారిప్పటికిని యా గ్రామమునఁ గలరు. ఇదియొక అద్భుత శతక రాజము.

"చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ!
హతవిమత జీవ! శ్రీకాకుళాంధ్రదేవ!"

అని దీని మకుటము. ఆనాటికి స్వామి ఆలయాదులు శిథిలములై ఉత్సవాదులు వైభవముగ జరుగుట లేదని 10 పద్యము నుండి 16 పద్యము వరకు వర్ణించెను. కాని దైవమును

"నేటి దానీప్రతిష్ఠ వర్ణించిచూడ"

అని ప్రశంసించుటచే "శ్రీ కాకుళము ఆంధ్రవిష్ణువు" ప్రాచీనత తెలియుచున్నది. ఇందు మొదటి 9 పద్యములు కేవలము స్తుతిమాత్రములు. 17 పద్యమునుండి నిందా స్తుతి ప్రారంభము. నిందాస్తుతికింతటి యద్భుతరచ నమునుఁ జూడఁబోము. తిట్టులాగున కనబడి తిట్టుకాక పోవుటలోను, అవతారచర్యలు భూషింపఁ దగినవి, దూషించి నట్లుకనబడుటఁ జేయుటలోను, యీ కవి నేర్పు మిక్కలి మెచ్చఁ దగియున్నది. మరియు నితని కవిత్వము ద్రాక్షగుళుచ్ఛముల వలె నంటిన వెంటనే రసమునుఁ జిమ్మి అనుభవింపఁ జేయతగినదై, పండిత పామర జన రంజకమైన, భట్టు కవిత్వమున కుండ వలసిన ప్రత్యేకత సుస్పష్టముగఁ గని పించుచున్నది.

"మ్రొక్కంగఁతగునె ముం - దెక్క పువ్వునకుఁదాఁ
గక్కసించిన యాలి - కక్కజముగ॥
నాటింపఁగలవౌన - న్నక నన్న నెవనంబు
పెట్టుమ్రాన్వె కలించి - పెరటిలోన"

ఈ పద్యమున, పారిజాతా పహరణకథను, కృష్ణలీలను వర్ణించి గెలిచేసెను. జాతీయోక్తులతో నిండి, పద్యము, ధార, వాక్యక్రమము, భావము, తెలుఁగు నోటికి మృదు మధురముగ నుండి "ఆంధ్రనాయక శతకమ"ను పేరు సార్థకమగు చున్నది.

"ఉచ్చనీచంబు లెఱుఁగక - నిచ్చఁజేయు
చేష్టలివి భక్తహితమతిఁ - జేసితండ్రు"

పద్యము-ఇది యెంత తిట్టువలెఁగనఁ బడుచున్నది?

"అలు బిడ్డలుఁదెచ్చుప్ర - ఖ్యాతిఁగాని
మొదటి నుండియు నీవుదా - మోదరుఁడవె"

పద్యము-ఇది యెంత మనోహరముగఁ నున్నది?

"తెలియ నవ్యక్తుడవుఁగావు - తెలిసి కొన్న
నిట్టివాఁడని తెలియలే - దెవ్వరికిని"

ఇది యెంత సత్యమైన వేదాంతప్రవచనము.

"ఒకరి కంటె గుణాధికు లొకరుమీరు
ఇంత చక్కనఁ దెలసె మీ - యింటివరుస"

ఇది చక్కని హాస్యభావము కాదా?

సీ॥ సకలంబు నీవయై - యొకమఱ్ఱి యాకుపై
నిచ్చవరుండునా - డెంతఁ గలవొ

* * *

గీ॥ పరువు గలవాడవేమి? ప్రా - బల్కులందుఁ
దెలియవరి ముక్కు ముల్లంతఁ - గలదొ? లేదొ?"

ఇట్టి హృదయ ముప్పొంగఁ జేయుపద్యములు, గుణమునే దోషముగాఁ జేసిచూపు వాక్యములు, పరమవేదాంత రహస్యములఁ బరిహాస మొనరించు పలుకు మాటలు, పెక్కులుండి కవిధన్యుఁడను సంగతినిఁ దెల్పుచున్నవి.

"కీర్తినిందగ వర్ణించి - గోలిపరుతు"

అని 16 పద్యములో పలికిన తన ప్రతిజ్ఞను కవి అతినిపుణముగ నెగ్గించు కొనెను. 26 పద్యము పోతననారాయణ శతకము నందలి "ధరసింహాసనమై" అను పద్యచ్ఛాయ కలదు. 37 పద్యము మానసబోధ శతక పద్యమున కనుకరణము. 38 దశావతార వర్ణనము. 65 పద్యము మొదలు 87 పద్యము వరకు, రామావతార కథనమును, తక్కినవి కృష్ణావతార పరముగను వ్రాసిరి. 83 పద్యము బలరామావతారము, 84 పద్యము త్రిపురసంహారము, 85 కల్క్యవతారము వర్ణింపఁబడినవి 91 పద్యములో కొన్ని యవతారములును, 93 కృష్ణపరముగ నాతనిబంధుగులను మిత్రులను దూషించి, శ్రీకాకుళమున తన మందిరముననే యుండుమని మందలించెను. 96 పద్యము నుండి స్తుతి తిరిగి యారంభించెను. 99 పద్యము "అలవైకుంఠపురంబులో నగరిలో" అను పోతనగారి పద్యమున కనుకరణము.

సీ॥ కోరికలీను వై - కుంఠంబులోని, లో
నగరిలోనా మూల - నవ్యదివ్య
సౌధంబుదాపలి - సరసమందారవ
నాంతరామృత సరః - ప్రాంతచంద్ర
కాంతోప లోత్పల - కల్పిత పర్యంత
సకలసౌభాగ్యల - క్షణనివాస"

అనివ్రాసిరి, 107 పద్యము "అరయన్ శంతను పుత్రుపై" అను పద్యము వంటిది. 108 పద్యములో కవితన యితర కృతులను పేర్కొనినాడు. అందులో హంసల దీవి గోపాల శతకమొకటి; దీనిమకుటము.

"లలిత కృష్ణాబ్ధిసంగమ స్థలవిహార
పరమకరుణా స్వభావగొ - పాలదేవ"

అని ఇందులో శ్రీకాకుళస్వామి శిఖాసందర్శనగాథను 53 పద్యమున

"కాకుళనగరిపై - ఖానసో క్తినిజంబు
దోప, శిరోజముక్ - జూపినావు" అని చెప్పెను.

ఈగాథనే "కాకుళేశ శతకము"న,

"వైఖానసో క్తికి - వంచసరాకుండ.
నెపులఁ జూపినమాట - నిజమయేని"

అని వ్రాసిరి. ఇంక "శ్రీకాకుళ శ్రీహరిశతక" కర్తపేరు తెలియరాదు, కాని యాతఁడు వైష్ణవుఁడని స్వామి పరిచారకుడయి యుండ వచ్చునని పద్యములఁ బట్టి గుర్తింప నగు చున్నది. పద్యములు ప్రాఢప ప్రయోగముఁ గలిగి భావపూరితములై విలసిల్లు చున్నవి. చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తకభాండా గారమునుండి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సేకరించి పీఠికను వ్రాసియొసంగిరి; భక్తాగ్రగణ్యులు శ్రీ ప్రోలేపెద్ది వెంకటరామశర్మగారు 1923 వత్సరమున నచ్చొత్తించిరి, మచ్చునకు రెండు పద్యము లుదహరించెదను-

శా॥ శ్రీ రామాహరి! వాసుదేవ! పరమా! శ్రీ నాథ
నారాయణా!
కారుణ్యార్ణవ! పుండరీక వరదా! కంజాక్ష! దుర్దోషకాం
తారక్రూరకుఠార! దానజనసంత్రాణైకసౌశీల్య! దై
త్యారీ! పాండవదూత! కృష్ణ! రఘువర్యా! కాకుళ
శ్రీ హరీ॥

శా॥ నీవంధ్రావని నాయకుండ వని నిర్ణిద్రాను రాగాప్తినా
భావంబంధ్ర కవిత్వరీతిని భవత్పావార విందస్తుతి
ప్రావీణ్యంబున నుండె బాలకృత దూరస్ఫార
శీతాంశువిం
బావా ప్తర్థకర వ్రసారగతిఁదోఁపఁగా గాకుళ శ్రీహరీ॥

## నమ్రవరద శతకము - శ్రీకాకుళస్వామి శతకము

తొలిశతకమును శ్రీకాకుళ వాస్తవ్యులును పండిత ప్రకాండులునగు శ్రీమాన్, విద్వాన్, శృంగారం అయ్యమాచార్యుల వారును రెండవ శతకమును ముక్తిపల్లి అగ్రహారవాస్తవ్యులు కవిరత్న, బాలకవి శ్రీమాన్ గుడిమెళ్ల రామానుజాచార్యుల వారును రచించిరి. ఈ రెండును మృదు మధురములై ద్రాక్షక దలీపాక నమన్వితములై భక్తి రసపూరితములుగ నున్నవి. వీరిద్దరును అధునిక కవిశేఖరులే.

"నమ్ర వరద" శతకము ముద్రిత ప్రతినాకు లభ్యము కాలేదు. అముద్రిత ప్రతిని కవిగారే నాకుచదివి వినిపించిరి. ఇందలి పదలాలిత్యము, అలంకారములు, వర్ణనలు ప్రబంధ శైలికి మించి యున్నది. కవిత్వము సరసము, ధారసరళము.

## హనుమంత శతకము - నిజామల్లీనవాబు

ఈ హనుమంతుని ప్రభావము అనిర్వచనీయ మైనది. అమూల్యమైనది. ఈ విగ్రహము, పాచీనాలయము నదీ పాతమగునపు డొక యిసుక తిన్నెలో నుండిపోయి కొన్ని దినములకు జాలరులకుం దొరికెనట. దానందెచ్చి ప్రతిష్ఠింప నూహింప నందు కొన్ని యంగములు శిధిలములైన వని పండితు లంగీరింప నందున దానినిప్పుడు అలయ ప్రాకారములో నిమిడ్చి కట్టియుండిరి. వీరు యిప్పుడు పశ్చిమప్రాకారమున ప్రాఙ్ముఖముగ, మట్టుపళి (వంటశాల)

కెదురుగ స్థాపింపబడి యుండెరి. నేడు శ్రీస్వామివారికి పూజాదులు లేవు. పూర్వ మిదేవును పాసించువారు, దుష్ట గ్రహ బాధల నుండు వ్యాధుల నుండి విముక్తులగుటయే గాక అవా ప్తకాములగు చుండెడివారట. ఈ శతకమును రచించినది పెదముత్తేవి గ్రామవాసులగు "ముత్తేవి పెరు మాళ్లయ్యగారు" వీరు శ్రీ వైష్ణవులు, క్రీ॥ శ॥ 1760 సం॥ ప్రాంత మందుండిన వారు. అప్పటి విక్రమ సత్సరాషాఢ మాసమున నైజాము నుండి "నిజామల్లి" యను నవాబు తన యాధిపత్యమున మరాటీ గుఱ్ఱముల దండుతో వెడలి చేపరకోట (చల్లపల్లి) సంస్థానమునయున్న పసమును కొల్ల గొనిపాపుద్దేశించి బెజవాడ వరకు వచ్చిరట. ఆ వార్తవిని అప్పటికి సంస్థానాధిపతియగు శ్రీ యార్లగడ్డ కోదండరామన్న దేశాహిగారు ఆ వెంటనే కవితల్లజులగు పెరుమాళ్లయ్యగారికీ వృత్తాంతమంతయుఁ జెప్పి, యాపదను రాకుండఁ జేయుమని వేడుకొనెనట. అంత నామహాభాగుఁడు శ్రీకాకుళ క్షేత్రమేతెంచి, కాకుళస్వామి వారి సన్నిధిని నెల కొని యున్న శ్రీ ఆంజనేయస్వామివారి నుపాసించి, అప్పటికి బెజవాడవద్దకు వచ్చియున్న యా గుఱ్ఱముల దండు జెండాలపై పిడుగులుపడ ఛితిల్లి మరలిపొవుసటుల యీ శతకపద్యములచే స్తోత్రముసేయు, నా యాంజనేయస్వామి వారి మహాత్మ్యమువలస నా శత్రుసేనలపై పిడుగులు పడి, కొంత నమసి శేషించిన సైన్యము తిరిగి నైజాము చేరె నట. ఈ విషయము లీ క్రింది పద్యములవలన తెలియు చున్నవి. ఈ సిద్ధకవి. ప్రసిద్ధ కవి.

కం॥ వడిగల దేవుఁడ వనుచును
నుడిగారవు శతకమందు - నుతిఁజేసెదనే
కడువడి గుఱ్ఱపుదళములఁ
జెడఁదోలుము శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ ఇత్తఱిని, నిజామల్లీ
హత్తీలు గుఱాలు పటుత - రాహవబలముల్
మొత్తమయి వచ్చె మలుపు, వి
చ్చిత్తుపడ శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ లక్షలతరబడి యావల
పక్షంబున గుఱ్ఱములును - బలములు వచ్చెన్
ఈ క్షణమున నీవేచని
శిక్షింపుము శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ భానునిమ్రింగిన పగిదిని
సేనాధిపు నాక్రమించి - చీకాకుపడం
గా నొనరిచి రానివ్వకు
సేనలనో శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ వచ్చిరని జనులుఁ బలికిరి
రచ్చల బెజవాడకడకు - రాతిరి విని నే
త్వచ్చరణంబులుఁ గొలిచితిఁ
జెచ్చెరనో శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ గజములు తురగంబు బలములు
కుజనంబీ దేశమునకుఁ - గొంపఱు జని యా
బెజవాడయొద్ద నుండిరి
త్రిజగన్నుత శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ కాకుళరాయునిఁ బొడఁగని
తేకువ యా ముచ్చటంతఁ - దెల్పియు హితవున్
గైకొని హయములఁ గొట్టవె
చీకాకుగ శత్రుహంత - శ్రీ హనుమంతా

కం॥ రక్షకదేవరకోటకు
నీక్షణమున వచ్చి మముల - నీ వెలు జగ
ద్రక్షక! యక్షకుమారుని
శిక్షించిన శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ ఆషాఢ బహుళ చవితికి
దోషాత్ము నవాబు, బలముఁ - దోలుము మరలన్
శేషించకుండరిపులన
శేషముగా శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

ఈ కవి, యుపాసకుడును, వాక్శుద్ధి కలవాడు యగుటచేత, వెంటనే భక్తుని యభీష్టంబు నెరవేర్చెనట. అంత తిరునాళ్ల సందర్భమున కాకుళేశునికిఁ బ్రీతిగ దేశాహిప్రభువు అన్న దానంబులఁ జేసిరని యీ క్రింది పద్యములవలన బోధ పడుచున్నది.

కం॥ విక్రమవత్సరమున న
వక్రపరాక్రమమునన బాబిబు వచ్చెన్
విక్రమముఁ జూపి ప్రజలకు
చిక్కులుడుపె శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ వాసిమహారాజశ్రీ
దేశాహిగారి కార్య - తేజం బివుడున్
భాసిల్ల శత్రు లణఁగఁగ
జేసితివో శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ తిరునాళ్ల యుత్సవంబున
ధరాసురుల కెల్ల నన్న - దానములును మా
దొరగారిడి కాకుళమున
సిరివరునకుఁ బ్రీతిఁజేసె శ్రీ హనుమంతా ॥

ఇట్లు పలికి స్వామిని కాకుళంబున విజయముఁజేసి యుండుమనియు తనది పెదముత్తేవి యనియు మరి మూడు పద్యముల వ్రాసికొనెను.

కం॥ లోకములోనఁ బ్రసిద్ధిగ
నా కోరికలొసఁగి కృతికి - నాథుడవై శ్రీ
కాకుళ నిలయుని సన్నిధిఁ
జేకొంటివి శత్రుహంత - శ్రీ హనుమంతా ॥



చోళరాజులనాటి శిల్పసంపద—శ్రీ కాళహస్తీశ్వరాలయము

కం॥ భద్రాద్రి విజయరాముల
తద్రూపమె కాకుళేశ - తథ్యము కనుకే
భద్రముగఁ గొలిచితొ! భళి
చిద్రూపా శత్రుహంత - శ్రీ హనుమంతా ॥

కం॥ ఆపద్బాంధవ! సదయా
టోపమె నామీదఁ జూపు - టొప్పగదీకే
ప్రాపగు ముత్తేవి ల
క్ష్మీపతి పాదాబ్జ భృంగ - శ్రీ హనుమంతా ॥

## వాడవల్లిగౌరి రాజకవి - ముత్తేవిసుందరరామదాసు

వాడవల్లి గౌరి రాజనుకవి, యీ ఆంజనేయునిమీద
" అంజనేయులవారె - భువినవతరించినారె॥ అం॥
భానుమీద ప్రీతి చిన్న - పాలపండు రీతి
దానవసురులకును జూడగ - తానే పెద్దకోతి ॥ అం॥
కరుణా సాగరుడెగౌరి - కాంత దాస పోషకుఁ డె॥
పరరామస్మరణ నిముషము-వదలక యున్నవాడె॥ అం"
అను కీర్తనయు;
" శ్రీమన్మహాయంజనీ గర్భసం భూత! సద్బ్రహ్మ
చారీ! కపీంద్రాది వంద్యా! .... నమోభద్ర శైలాధి
వాసా! నమోకాకుళేశా! నమస్తే"
అని సంస్కృతపద భూయిష్టమగు దండకమును వ్రాసిరి. ఇంక పెదము క్తేవి వాసియగు సుందర రామదాసు "శ్రీరామ దూతం శిరసానమామి" అను పల్లవితో ప్రారంభించి నూరు చరణములు గల కీర్తనను వ్రాసిరి. ఇందు కొన్ని పాద ములుదహరించెదను.
" అరుణోదయ రుచి - రానన కమలం ॥ శ్రీరామ ॥
రామరావణ యుద్ధ - రామాతురంగం ॥ శ్రీరామ ॥
రాఘవపాద - రాజీవమధుపం ॥ శ్రీరామ ॥
అక్షయ కుమార దక్షవిశిక్షం ॥ శ్రీరామ ॥
దానవకాలం దైవాలలామం ॥ శ్రీరామ ॥
శ్రీకాకుళేశాశ్రిత మందారం ॥ శ్రీరామ ॥
వేడుకతో పెద్ద - ముక్తే వివాసం ॥ శ్రీరామ ॥
ధరసుందరరాము దాసానుదాసం ॥ శ్రీరా ॥"
ఇంక ఆంధ్రనాయకునిమీద ప్రభాతసేవ, యేకాంత సేవ లను ప్రత్యేకగేయ ప్రబంధములుఁ గలవు.

## దవనపున్నమ - అంకినీడ్ప్రభువు

శ్రీ స్వామివారి బ్రహ్మోత్సవము, యిప్పుడు వైశాఖ శుద్ధ ౧౫ లకు జరుగు చున్నది. పూర్వము దవన పున్నమకు జరుగుచున్నట్లు శ్రీనాథుఁడు క్రీడాభిరామములో వర్ణించి యున్నాడు.

గీ॥ దవనపున్నమఁ గాకుళాధ్యక్షుఁడైన
తెలుఁగు రాయుఁడు దేవతా - ధీశ్వరుండు
భువనహితముగ నుత్సవం - బవధరింప
సందుఁబోయి తిమీపోయి నట్టి యేడు ॥

" దవన పున్నమ " అనగా వైశాఖ పూర్ణిమేమొ? దవనోత్స వములనీ వైశాఖ మాసమున చేయు యాచారము నేటికిని దక్షిణ దేశమునఁ గలదు. దేవరకోట సంస్థానము తురకల బారి నుండి కాపాడినది మొదలు యీ దేవస్థానము చల్ల పల్లి ప్రభువుల పాలనములోఁ జేరినది. అప్పటి ప్రభువు అంకి నీడుగారు శ్రీస్వామి వారి యాలయమును గోపుర మంట పాదులనుఁ గట్టించి జీర్ణోద్ధణముఁ గావించిరి. అప్పటి నుండియు తిరిగి యుత్సవాదులు మహావైభవ ముగా జరుగు చున్నవి. ఒక పూర్వకవి, అంకి నీడ్ప్రభుని గూర్చి యిట్లు వర్ణించెను.
"కలలోఁ గన్పడి కృష్ణరాయ విభుచేఁ - గబ్బంబుఁ జెప్పించె బే
ర్వెలయన్ మున్నొకనాటిసేవఁ గొనియా - శ్రీకాకుళాంధ్రే శ్వరుం
'డలరంగా నిపుడంకి నీణ్ణృపతిసే-యంబూను నిత్యోత్సవా
కలనన్ దానిఁక నెన్ని నన్నుత కృతుల్ కావింపఁగాజేయునో"
ఇట్టి పుణ్యక్షేత్రమున పూర్వమునుండియు, మహావిద్వాంసు లును కవులును, గాయకులును, భక్తులును జన్మించు చుండిరి. శ్రీ బిల్వమంగళ మూర్తి (లీలాశుకమహాకవి) వీరు "కృష్ణకర్ణామృత"ము రచించిరి. నారాయణ తీర్థులు. వీరి తలి తండ్రులు లీలాశివగురులు. వీరును "శ్రీకృష్ణలీలా తరంగిణి" యను సంస్కృతగేయ ప్రబంధమును రచించిరి. ఇందులో శ్రీ కాకుళ నగర ప్రశంసయుఁగలదు. భక్తచింతామణియగు చింతామణియు ముద్దు పళనికూడ యిచ్చటనే జన్మించిరి. వీరు వేశ్యలు; చింతామణి భక్తురాలెఁగాక మహరాజన ర్తకి. తౌర్యత్రిక విదుషమణి. ముద్దు పళని మధురకవయిత్రి. ఈమె భక్తి భావమున "ఆండాల్" చేసాయింప బడిన "తిరువాయి మొషి" యను ద్రవిడప్రబంధమునకు తెనుగు సేతయు, మధుర భావమున "రాధికాసాంత్వనమ" ను రసవత్ప్ర బంధమును రచించెను. సిద్ధేంద్రయోగి శ్రీ నారాయణ తీర్థులవారి శిష్యుడు - వీరును, మొవ్వ గోపాలపదములను రచించిన "క్షేత్రజ్ఞులు" ను, "అధ్యాత్మరామాయణ" కర్తయైన శేషగిరి సుబ్రహ్మణ్య కవియు నీ శ్రీకాకుళమునకు పాదగ్రామములగు కూచిపూడి, మొవ్వ, పెదము క్తేవి గ్రామ ములందు జన్మించిరి. కీ॥ శే॥ గాయకసార్వభౌమ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు కూడ యిక్కడనే జనించిరి. వీరి చరిత్రలు నాచేకూర్పఁబడిన "గాయక జీవితముల"ను పుస్తకములో వివరింపఁబడినవి. దీనివలన నీ క్షేత్రమహాత్మ్యము స్పష్టముగ తెలియుచున్నది.

# భగవదుపచారములు – తత్ప్రయోజనము

పండిత, వేదాంతం విప్రనారాయణాచార్యులు
కృష్ణాజిల్లా రెలిజియస్ ఇన్స్పెక్టర్, నిజాంపేట, మచిలీపట్టణము.

పదునాల్గవ పదునేనవ యుపచారములు వస్త్రదానము (ఖం) తేజోవత్సవః, విష్ణోర్నుకం, సోమస్యతనూరసీతి శ్వేత పీత రక్త చిత్ర శ్యామవస్త్రైరలంకరోతి (మం) తేజోవత్సవ స్సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం॥ విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాగ్ంసి యో అస్కభా యదుత్తరగ్ం సధస్థం విచక్ర మాణ స్త్రేధోరుగాయో విష్ణో రరాటమసి విష్ణోః పృష్ఠమసి విష్ణోశ్శ్నప్త్రేస్థో విష్ణోస్స్యూరసి విష్ణోర్ధ్రువమసి వైష్ణవమసి విష్ణవే త్వా॥ సోమస్య తనూరసి తనువం మే పాహి స్వా మా తనూ రావిశ॥ (ప॥) తేజోవత్ నవః సవితుః ప్రసవే అశ్వినోః బాహుభ్యాం పూష్ణః హస్తాభ్యాం విష్ణోః నుకం, వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి యః అస్కభాయత్ ఉత్తరం సధస్థం విచక్రమాణః త్రేధా ఉరుగాయః విష్ణోః రరాటం అసి విష్ణోః పృష్ఠం అసి విష్ణోః శ్నప్త్రే స్థః విష్ణోః స్యూః అసి విష్ణోః ధ్రువం అసి వైష్ణవం అసి విష్ణవే త్వా సోమస్య తనూః అసి తనువం మే పాహి స్వా మా తనూః ఆవిశ॥ హేవాసః త్వం సోమస్య తనూరసి। సౌమ్యం వై వాసః। ఇతి శ్రుతేః। ఏవంభూతం త్వం మే మమ తనువం తనూం పాహి, నకేవలం సోమస్య తనుః, మమాపి స్వాతనూః, శరీరస్య తుల్యత్వా దేవము చ్యతే; ఆత్మా పితు స్తనూ ర్వాసః। ఇతిశ్రుతేః; ఏవంభూత త్వం మామావిశ। త్వం కింకరోషితి పృచ్ఛసిచేత్, నవః న త్త మ్యర్థే ప్రదమా, అస్మిన్ విగ్రహారాధనే యజ్ఞే సవితుః ప్రసవే సవితురనుజ్ఞాయాం సత్యాం, పూష్ణో హస్తాభ్యాం, శోషితమితి శేషః। అశ్వినో ర్బాహుభ్యా మానీత మితి శేషః। తేజోవత్ తేజోయుక్తం త్వాం విష్ణవే దదావే త్యుత్తరేణా న్వయః; విష్ణుం ప్రశంసతి, ఉరుభిః మహాత్మభి ర్గీయ మానః యో విష్ణుః త్రేధా త్రిప్రకారైః విచక్రమాణః విక్రమ మాణః ఉత్తరం సధస్థం ఊర్ధ్వలోకమంతరిక్షమితి యావత్, అస్కభాయత్ అధారయత్, యో విష్ణుః పార్థి వాని పృథివ్యంతరిక్షద్యులోకభవాని రజాంసి అగ్నివిద్యు త్సూర్యాత్మకాని జ్యోతీంషి విమమే వినిర్మితవాన్, తస్య విష్ణో ర్వీర్యాణి నుకమితి కర్మవాచక మవ్యయమ్, కర్మాణి ప్రవోచం బ్రవీమి; హేవాసః ఏతాదృశస్య మహామహిమానస్య విష్ణోః రరాటం శిరోలంకరణ మసి, తస్యైవ విష్ణోః పృష్ఠం పృష్ఠాలంకరణమసి; ఉభయవాససీ సంబుధ్యేతే, విష్ణోః శ్నప్త్రే ఉభయాఽలంకరణే స్థః ధ్రువం నిశ్చయేన విష్ణోరసి విష్ణో స్సేవస్యసి అతః వైష్ణవం విష్ణుసంబంధ్యసి తస్మాద్విష్ణవే త్వా త్వాం దదామీతి పూర్వేణాన్వయః॥ ఓ వస్త్రమా, వస్త్ర ద్వయసంబోధనము, కర్మప్రేరకుడైన సూర్యభగవానుని యనుజ్ఞ పొందిన పిమ్మట సూర్యకిరణములచే పవిత్రీక రింపబడి సోమసంబంధముకలిగియున్నట్టియు సూర్య పుత్రులైన అశ్వినీదేవతలచే గొనిరాబడిన నిన్ను సకలచరా చరనియంతయు పరాక్రమశాలియు నైన శ్రీ మహావిష్ణు వునకు సమర్పించుచున్నాను. అట్టి మహావిష్ణువునకు ఉభయాలంకరణరూపమై విష్ణుసేవనము చేయుచున్న నీవు నిశ్చయముగా వైష్ణవత్వము కల్గినదాన వగుచున్నావు. ఓ భగవానుడా, మాచే సమర్పింపబడిన వస్త్రయుగ్మమును స్వీకరించి (శ్లో) వస్త్రం దదాతి యో మర్త్యో పరలోకే మహ త్సుఖం॥ అను ఆగమశాస్త్రవిహిత ఫలమును మాకనుగ్ర హింపుమనియు భావము. ఉపవీతదానము పదునారవ ఉపచారము ॥ఖం॥ అగ్నిం దూత మిత్యుపవీతం దద్యాత్ ॥మం॥ అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వ వేదసం। అస్య యజ్ఞస్య సుక్రతుమ్ ॥ప॥ అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వవేదసం అస్య యజ్ఞస్య సుక్ర తుమ్॥ అగ్నిర్దేవానాం దూత ఆసీదితి తైత్తిరీయ మామ్నా యతే। అస్య విగ్రహారాధన యజ్ఞస్య సుక్రతుమ్ సుష్ఠు నిష్పాదయితారం విశ్వం వేత్తీతి విశ్వవేదాస్తం హోతారం దేవానా మాహ్వాతారం దూతం దేవదూత మగ్ని మస్మిన్ కర్మణి వృణీమహే ॥తా॥ ఈ విగ్రహారాధన యజ్ఞమందు విశ్వవేత్తయు దేవదూతయు నగు అగ్నిహోత్రుని సహాయ మును పొంది దేవదేవుడైన శ్రియఃపతికి యజ్ఞసూత్రము సమర్పించుచున్నాను. పదునేడవ ఉపచారము పాద్య దానము (ఖం) త్రీణి పదేంద్రోఽభిమంతేతి పాదయో ర్జలం సంస్రావయే త్పావ్యం (మం) త్రీణి పదా విచక్రమే ఇంద్రోభిమంతా ఈ మంత్రములకు వివృతియు తాత్పర్య మును వ్రాయబడినవి. ఇట్లే (18) ఆచమన (19) పుష్ప (20) గంధ (21) ధూప (22) దీప (23) ఆచమనోపచార ములు పూర్వముపలెనే మంత్రార్థము తెలియదగి యున్నది. ఇరువదినాల్గవ యుపచారము హవిర్దా నము (ఖం) తదస్య ప్రియం సుభూః స్వయంభూ రితి విష్ణవే సర్వం హవి ర్నివేదయత్ (మం) తదస్య ప్రియ మభిపాథో అశ్యాం నరో యత్ర దేవయవో మదన్తి। ఉరుక్రమస్య సహి బంధురిత్థా విష్ణోః పదే పరమే మధ్వ

ఉధ్యః। సుభూః స్వయంభూః ప్రథమం మహత్యర్ణవే దధెహ గర్భ మృత్వియం। యతో జాతః ప్రజాపతిః (ప) తత్ అస్య ప్రియం అభి పాథః అశ్యాం నరః యత్ర దేవ యవః మద న్తి ఉరుక్రమస్య సః హి బన్ధుః ఇత్థా విష్ణోః పదే పరమే మధ్వః ఉధ్యః సుభూః స్వయంభూః ప్రథమం మహతి అర్ణవే దధే హ గర్భకాం ఋత్వియం యతః జాతః ప్రజాపతిః॥ దేవయవః దేవానిచ్ఛంతః నరః మనుష్యాః యత్ర భాగీరథీజలే మదంతి హృష్యంతి తత్పాథః తద్భాగి రథీజలం అస్య సర్వలోకప్రసిద్ధస్య విష్ణోః ప్రియం హి, ఉరుక్రమస్య వి స్తీర్ణపాదస్య విష్ణోః పరమే పదే ఉత్కృష్ట స్థానే బంధుః సంబద్ధః మధ్వః మధురః ఉధ్యః భాగీరథీ ప్రవాహః ఇత్థా ఏవంవిధః అభ్యశ్యామ్ అభితోవ్యాప్తవాన్, కించ సుభూః స్వయంభవతీతి స్వయంభూః ఏష భాగీరథీ ప్రవాహః మహత్యర్ణవే ప్రథమం ఋత్వియం గర్భకాందధేహ, యతః యస్మాద్గర్భాత్ ప్రజాపతి శ్చతుర్ముఖో జాతః, తత్పాథః భాగీరథీజలం అస్య విష్ణోః ప్రియమితి పూర్వేణాఽ న్వయః। భాగీరథీజలేన పాచితం శాల్యాది హవిరప్యస్య ప్రియమితి భావః ॥తా॥ సర్వలోక ప్రసిద్ధుడైన శ్రీ మహా విష్ణువు యొక్క పాదాంగుష్ఠమునందుండి చక్కగా ప్రవ హించి సకలలోకప్రసిద్ధమై సర్వమానవ సంతోషకారకమై మధురమై సర్వలోకవ్యాప్తమై యున్న గంగాజలము శ్రీమహావిష్ణువున కత్యంతప్రియమైనట్లు గంగాజల పాచిత మైన హవిస్సుకూడ మిక్కిలి ప్రియమైనదని భావము.

ఇరువదియైదవ యుపచారము – పానీయదానము (ఖం) ఇదం విష్ణు రితిస్వాదు శీతలం పానీయం దద్యాత్ ॥ (మం) ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదం। సమూఢ మస్య పాంసురే (ప) ఇదం విష్ణుః విచక్రమే త్రేధా నిదధే పదం సమూఢం అస్య పాంసురే॥ విష్ణు స్త్రివిక్రమావతారీ ఇదం ప్రతీయమానం జగ దుద్దిశ్య విక్రమే విశేషేణ క్రమణం కృతవాన్। తదా త్రిః ప్రకారైః స్వకీయం పాదం నిదధే నిక్షిప్తవాన్। అస్య విష్ణోః పాంసురె ధూళియుక్తే పాదస్థానే జగత్సర్వం సమూఢం సమ్య గంతర్భూతం ॥తా॥ త్రివిక్రమావతారియైన శ్రీమహావిష్ణువు పరిదృశ్యమానమగు చున్న జగత్తును మూడడుగులతో నాక్రమించు సమయ మందు చెలరేగిన ధూళిచే కప్పిపుచ్చబడిన ఈ జగత్తు నుండి దేవతలు మమ్ము రక్షించెదరుగాక:—

పునరాచమనోపచారము ఇరువదిఆరవది (ఖం) యోగె యోగే శంనోదేవీ రిత్యాచమనం దద్యాత్ (మం) యోగె యోగే తవ స్తరం వాజేవాజే హవామహే। సఖాయ ఇంద్ర మూతయే ((ప) యోగే యోగే తవ స్తరం వాజేవాజే హవా మహే సఖాయః ఇంద్రం ఊతయే॥ వజతి గచ్ఛతీతి వాజః తస్మిన్ వాజేవాజే, యుజ్యతే అనుష్ఠీయత ఇతి యోగః కర్మ తస్మిన్ యోగేయోగే, ప్రవర్తమానే కర్మణి కర్మణీ త్యర్థః, తవ స్తరం బలవత్తరం ఇందతి ఐశ్వర్యం ప్రాప్నోతీ తీంద్రః తం తస్య సఖాయః వయం హవామహే ఆహ్వా యామః (తా) జరుపబడు ప్రతి వైదికకర్మయును ఐశ్వర్య వంతుల సహాయము లేక నడచుట దుర్ఘటము కనుక త్రిలోకాధిపతియు ఐశ్వర్యవంతుడును మహాబలవంతుడును అగు దేవేంద్రుని సహాయము కోరి చెలికాండ్లమైన మె మాయన నాహ్వానించుచున్నాము. (మం) శంనో దేవీ రభిష్టయ ఆపోభవంతు పీతయే। శంయో రభిస్రవంతునః (ప॥) శం, నః దేవీః అభిష్టయే ఆపః భవంతు పీతయే శం యోః అభిస్రవంతు నః॥ ఆపోదేవ్యః నః అస్మాకం అభిష్టయే పీతయే అభీష్టాయ పానాయ శం సుఖహేతవో భవంతు; నః అస్మాకం శం సుఖం యథా భవతి తథా యోః దుఃఖ వియోగో యథా భవతి తథా అభిస్రవంతు, అర్చావతార రూపిణః భగవతః శరీరాంతర్భాగే సర్వతః ప్రవహంతు; (తా) ఆప్యాయనకరమైన జలము యథేచ్ఛగా త్రాగుట కొరకు ఉపయుక్తమై మాకు సుఖకర మగునట్లు భగ వానుని దివ్యమంగళ విగ్రహమందు ప్రవహించుగాక॥

# పరిచయము

(సంపాదకుడు)

1. సాధనరహస్యము :—కర్త—శ్రీ అనుభవానందస్వాములవారు. ప్రకాశకులు—శ్రీ అనుభవానంద గ్రంథ మాల. క్రవున్ ⅛ సైజున పు 290 లు. వెల రెండు రూపాయలు.

తీవ్ర ముముక్షుత్వంతొ తంటాలు పడుతుండే సర్వసాధకలోకానికి-అనగా-అతి సామాన్యులకును అర్థమయ్యేలాగ ఆత్మతత్త్వవిషయాలను సిద్ధాంతము, సాధన అనే రెండు విషయాలను అందులోను రెండవవిషయమే ప్రధానంగ వ్యావహారికభాషలో శ్రీ మాతాజీకి వ్రాసిన లేఖారూపములో అందిచ్చినారు. ఆత్మవిషయాలు గహనములు. సాధన విషయములు మరింత; కొంతఅయినా తత్వశాస్త్రపరిభాష అర్థమయి యుండాలి. వీటి నన్నిటిని అలోచించి సాధకుని కవసరములయిన సర్వవిషయాలు పండొలచి చేతిలో పెట్టినట్లు స్వాములవారు మన కిచ్చియున్నా రీ గ్రంథములో. అన్ని యోగమార్గములు సాధనచతుష్టయము ఇందులో చాల వివరంగా వున్నవి. కాబట్టి సిద్ధాంతాలు తర్కభూయిష్టములు కాబట్టి విసిగిపోయేవారంతా యీ గ్రందం చదివి సనాతనధర్మప్రకారం సాధనలో సోపానపరంపరను తెలిసికోవచ్చును; ఈ గ్రంథములో పరిభాషలో 'సుహృత్సమ్మితం'గా రచన ఉన్నది.

ఈ భూమిలో పుట్టి ఇంతమాత్రమన్నా తెలిసికొని కొంతయినా అచరణలోనికి తెచ్చుకోకపోతే మన జన్మెందుకు ?

శ్రీ అనుభవానందస్వాములవారికి భక్తిపూర్వక నమస్కృతి శతాలు.

2. **Bhagvat Gita Rahasyam**:—Late Sri Vidyasankara Padamavesa Prakasita Jagadguru Sri Kalyanananda Bharathi Mantacharya Swamy Maharaju—Demy ⅛th size—Pages 76—Cost Rs. Four :—

This is an elucidation of selected Slokas from the Bhagvat Gita by the late revered Peetthadhipati of Sringeri Sri Virupaksha Sri Peetam of Guntur. The Sankara Bhashya is given for each Moola Sloka to which the gloss of the present commentator is added. The Slokas themselves are culled from different chapters in the Gita and rearranged so as to give a continuous and coherent doctrine as per the tenets held by the late Swamiji. All these Slokas, Bhashya of Sankara, and Gloss are in Sanskrit language in Telugu Script. A lengthy introduction in English by the author gives the essential teachings of the Gita explained in his own light.

No body could ever dispute the learning of the Swamiji but we doubt whether many will accept many of his doctrines for instance that the Lord intended his teaching only for the orthodox Hindu who accept Varnasrama Dharma. The learned author is rather hot on the 'new' interpretations given by persons not following the Sanathana Vaidika Dharma. Still a perusal of this book may reveal to them how near or far they are in their interpretation of Gita from the accepted Sampradaya exposition.

We really wish the printing were better, with fewer typographical mistakes and on better paper. We would appeal to the readers to go to the root of the subject so ably dealt with by the author and benefit by it.

---

## NEWS

READERS would share our delight for having obtained the learned services of

SRI D. SURYANARAYANASWAMY, B.A.B.L.,

*Deputy Secretary & Draftsman, Law Dept., Andhra Govt.*

who has kindly consented to guide us with his valuable suggestions joining our Editorial Board.

# A PAGEANT OF INDIAN PHILOSOPHY

*By*

SRI N. RAMESAN, M.A., I A.S.,

*Deputy Secretary to Government, Home Department, Kurnool*

## CHAPTER X.

### THE PHILOSOPHY OF JAINISM.

Jainism is a very ancient religion of non-Vedic origin. Though popularly Jainism is derived from Mahavira, still it has got an ancient and hoary tradition behind it. Vardhamana Mahavira is said to be only the last of the *Thīrthankaras* or Path-finders. He was said to be the 24th in the line and derived succession from his predecessor '*Parswanatha*' who is said to have died in 776 B.C.. Jain tradition ascribes the origin of the religion to '*Rishabha Dēva*' the first of the '*Thirthhankaras*.' In the Yajur Veda we find mention made of the names of the three *Thirthankaras*, *Rishabha*, *Ajitanatha*, and *Arishtanemi*. Bhāgavata purāna is also of the view that *Rishabha* was the founder of Jainism.

On account of the close relation between the lives of Mahavira and Goutama Buddha, some scholars have held that both the systems are the same and have confused Jainism and Buddhism as two different sects of an original heteredox religion. Not only western scholars but also some oriental scholars have committed this mistake. The points of similarity are said to be the following. Both Vardhamana and Goutama were royal kings and their period of existence was also round about the same time. The *Nirvana* of Vardhamana took place in 526 B C. while that of Buddha in 543 B.C. In the traditions of the religions also there are many points of coincidence. A land which is holy for one is holy for the others. All these correspondences in doctrine, the order of Monkhood, traditions, etc. have led some scholars to think that both the systems are more or less identical. However, the modern view and an established view is that Vardhamana and Jainism are definitely distinct from Budha and Buddhism, on various grounds. The similarities, if any, are all due to historical accidents in as much as both the systems were conceived in a spirit of reform against Brāhmānism.

Mahavira was a Kshatriya and a native of *Vaisali* which is the same as modern Besarh which is 27 miles north of Patna. He was the second son of his father, Siddhartha and mother, Thrisala, and his brother was Nandivardhana. He led a normal householder's life till his 30th year. He was married to Yasoda and had a daughter by her. In his 30th year, both his parents died and with the permission of his brother, Nandivardhana, he became a monk and took to severe austerities. His '*Sādhanā*' lasted 12 years and in his 43rd year he attained self-realisation and illumination which freed him from all bondage. He then became a "*Jina*" or a 'spiritual conqueror', from which the word, 'Jainism', as the religion of the followers of '*Jina*' is derived. For 30 years after his self-realisation, i. e., till the ripe old age of 72, he assiduously preached his doctrine and died in 526 B.C. Some scholars place his death in 468 B.C. and the correct year is still a matter of doubt.

Jainism unlike Buddhism did not have any international vogue and was mainly confined to India. Quite early in its evolution Jainism broke into two great

Schisms, called the '*Digambaras*' and the '*Swētāmbaras.*' Both these schools are generally agreed on the main fundamental principles of Jainism and their differences are only minor. The *Digambaras* believe that a man to attain '*jnana*' must give up every possession including those of clothes. Hence, the *Digambaras* go afoot naked, or as '*Avadhūtas*'. The *Swētāmbaras* wear a piece of white cloth. Thus, the difference between the *Digambaras* and the *Swetambaras* can be described as the difference between the '*no-cloth*' sect and the 'white-cloth' sect. There are certain minor details of doctrinal differences also For example, the *Digambaras* believe that Mahavira was not conceived in the womb of Thrisala, but that the embryo was first conceived in the womb of Devananda from which it was later transferred to that of Thrisala. The other sect does not believe this. Similarly, the *Digambaras* believe that no woman can reach '*Moksha*' and that the *Thirthankaras* can live without food. The *Digambaras* also deny the authenticity of the canonical works of the *Swetambaras*. Apart from these minor details of differences, the two sects believe in the main fundamental principles of Jaina logic and philosophy.

Eighty-four works are generally recognised as constituting the canonical literature of jainism and these were formulated at a Council at Pataliputra which met in the 4th century B.C., though the final redaction is attributed to the Valabhi Council of 454 A. D., presided over by *Devarddhi*. The sacred books are of two kinds, namely, the *Pūrvas* and the *Angas*. The *Angas* which are eleven in number are the oldest of Jaina canonical literature. In addition to these 11 *Angas*, we have 12 *Upangas*, the five *Chedas*, the 5 *Mulas* and 8 miscellaneous works, constituting the 41 *Sutras*. These 41 *Sutras* along with a number of *Prakirnakas* and 12 *Niruktis* or commentaries and one *Mahabhashya*, constitute the entire Jaina religious literature. The names of 11 *Angas* are: आचार, सूत्रकृत, स्थान, समवाय, भगवती, ज्ञातधर्मकथा उपासकदशा, अन्तकृतदशा, अनुत्तरौपपातिकदशा, प्रश्नव्याकरण, and विपाक.

The *Digambaras* however assert that all these original works have been lost after the death of Mahavira and the extant literature is spurious. The language of jaina literature is *Ardhamagadhi*.

Jainism is in its philosophy a daring innovation on the previous thought prevailing in the country. To jainism also we owe the doctrine of *Relativity* or the '*Saptabhangi*', as it is called. The contribution of Jainism to the field of logic and theory of knowledge is very great. The main tenets of Jain philosophy can be studied under the following heads:

(1) The doctrine of Ontology
(2) The doctrine of Relativity
(3) The doctrine of Nayas
(4) The doctrine of Knowledge & Perception
(5) The doctrine of Spirit & Non-Spirit, Jiva and Ajiva

*and*

(6) The doctrine of Karma.

The fundamental idea of Jain Ontology is, that there is nothing which is absolutely unchangeable and that there is also nothing which is absolutely changing. In other words, Jaina philosophy strikes a *via media* between the conceptions of *Vedanta* and *Buddhism*. According to *Vedanta*, the ultimate *Reality* is unchangeable, and is behind all changes in name and form. For example, if we take the case of a clay pot, though the pot, as it is presented to us, has a shape, a name, and a form, still if it is broken and re-made into a different type of vessel, though it

may present a different appearance, still there is one unchangeable substance, viz., clay, which is behind the back of all these varying changes in the structure and shape of the pot. In other words, according to Vedanta, clay, or the sub-stratum, is the sole *Reality* in as much as, it alone does not change, while the various modifications like pot, jar, vessel etc. to which the clay could be transformed, are changeable. The latter, i.e., the changing forms are mere illusions of the senses and are mere objects of name or '*Namarupa.*' What we call tangibility, viability, or colour etc. etc., are all mere modifications of the one unchangeable substance, viz, clay. So, according to *Vedanta*, the unchangeable clay is the sole *Reality*. Taking the same example above, the Buddhists would declare that nobody can see pristine and pure clay as such, but what is presented to us is only the changing qualities. Apart from these qualities, there is no such thing as a permanet substance behind it. Eeven clay is presented to our senses only as possessing certain attributes or characters and not as mere abstract clay, which can only be an abstracted and unreal mental idea, out of the reality of changing qualities. Therefore, the Buddhists would declare, in the same example that what is changing is alone real, in as much as, an abstract real is never perceived by us. This is in direct contradiction to the Vedantic theory which conceives of the sub-stratum alone as the Reality, while the change of qualities is merely due to sense objects. The Jains accept both the above and strike out a *via media*. They say that both the view points contain same elements of truth. The Jains hold that in all changes some qualities remain permanent and unchanged, some old qualities are destroyed, and some new ones are generated. Thus, when a jug is made, it means that the particles of clay remain permanent, but the clay-lump has been destroyed, while the jug has been created anew. In other words, the clay, while in its atomic structure remained permanent, has become lost in the form of a clay-lump, and has generated itself in another, viz., the jug. The ultimate nature of any substance is therefore, neither absolutely unchangeable as the *Vedantins* hold, nor absolutely changeable as the Buddhists hold; but a *via media* in which there is some permanence and some change.

The above conception takes us to the doctrine of '*Anēkānta vādā*,' which has been translated as the Doctrine of Relative pluralism. All things have an infinite number of qualities which can only be affirmed in a relative or particular sense. Thus, a jug, for instance, has an infinite number of qualities which can be affirmed in an infinite number of ways, all of which are true in certain restricted and relative senses. A pot, for instance, is a substance in the sense that it is a conglomeration of clay atoms, but it is not a substance from the stand-point, say, of space and time. Again, it is atomic from the standpoint of earth atoms, but is not atomic, from the standpoint of water atoms. Thus the Reality is wholly a matter of relative standpoints. In other words, Reality does not exclude contradictory features, but can said to be indeterminate in its nature.

This takes us to the doctrine of '*Nayas*' or the 'doctrine of the standpoints' which is a very peculiar feature of Jaina logic. A '*Naya*' means a standpoint or a position of Relativity, from which a statement is made. Thus, when we say that an animal is a cow, there are two characteristics involved. One is the characteristic of cowness which is the same for

all the cows, and the other is some particular characteristic of the particular cow, like its colour, length, fatness etc. If we take the first view, viz. if we view a cow as a generic term which includes all the characteristics of a cow in general, the standpoint is called the "*DRAVYA NAYA*". In the second case, if we notice the particular qualities of the cow as its colour etc. and hold that these qualities are alone visible, and a generic cow apart these cannot be found, we have the point of view called "*PARYAYA NAYA*". These main divisions are divided in Jaina logic into some further systems of *Nayas*.

The above doctrine of *Nayas* takes us to the famous Jaina system of '*Saptabhangi*' or what is called the '*SYĀD VĀDA*.' It is so called because the whole system proceeds on the basis of a standpoint which is purely relative or '*Syād*' (may be). This *Saptabhangi* posits seven different standpoints as follows of speaking of a thing and its attributes.

(1) 'स्याद् अस्ति': '*May be, it is.*' For example, a cow from the standpoint of itself exists,

(2) 'स्याद् नास्ति': '*May be, is not.*' From the standpoint of another thing, say, a horse, a cow does not exist. In other words, a cow exists from the standpoint of a cow, and does not exist from the standpoint of a horse.

(3) 'स्याद् अस्ति नास्ति': '*May be is* and *is not.*' In a certain sense, the cow may be, and also, may not be. From the standpoint of a cow, it is; and from the standpoint of a general category, say, four-footed animals, a cow both *is* and *is not.*

(4) 'स्याद् अवक्तव्य': '*May be is unpredicable.*' Since in (3) above, we have stated that a particular thing *is* and *is not*, its own real nature is unpredicable.

(5) 'स्याद् अस्ति अवक्तव्य': '*May be is* and *is unpredicable.*'

(6) 'स्याद् नास्ति अवक्तव्य': '*May be is not* and *is unpredicable.*'

(7) 'स्याद् अस्ति नास्ति अवक्तव्य': '*May be is* and *is not* and *is unpredicable.*'

The last three things are arrived at by combining the 4th step with the three earlier steps. All the seven steps, therefore combine to give us a new logic, of relative standpoints which is a complete innovation from all preceding thought in the country.

This theory of *Relativity of Knowledge*, is the main original contribution of Jainism to Indian thought and philosophy. It has of course been remorselessly attacked by certain later *Vedantic* thinkers. *Sankara*, for example, criticised it with irrefutable logic and says that if all our knowledge is only relative, then the very Jaina theory that knowledge is relative, should itself be a relative one. If this is admitted, then the Jaina theory being a relative one, there must necessarily be an absolute standpoint. If the above is denied, it means we deny that Jaina theory is relative, leading to the same conclusion that we have to posit an absolute truth. Thus, this theory of *Relativity* is hoist by its own petard. Whatever be the later criticisms, we cannot deny that the doctrine of "*Saptabhangi*" has led to a remarkable development in the field of logic in Indian thinking.

As regards the ultimate Reality, the Jains admit the absolute existence of both '*Jiva*' and '*Ajiva*,' i.e., *Spirit* and *Matter*. By '*Jiva*' or the *Spirit*, the Jains mean the individual soul, or the ego, and not the transcendental and immanent *Reality* of the *Upanishads*. The '*Jiva*' is conceived of as an eternal substance, *Dravya*, but of variable magnitude and dimensions. The '*Jiva*' is said to assume the dimensions of the person whose body it inhabits. The example of a lamp filling com-

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. Prolaya Vema | From | 1325 | A.D. | to | 1353 | A.D. |
| 2. Anavota Reddi | ,, | 1353 | ,, | ,, | 1364 | ,, |
| 3. Anavema Reddı | ,, | 1364 | ,, | ,, | 1386 | ,, |
| 4. Kumāragırı | ,, | 1386 | ,, | ,, | 1402 | ,, |
| 5. Peda Komatıvema | ,, | 1402 | ,, | ,, | 1420 | ,, |
| 6. Rāca vema | ,, | 1420 | ,, | ,, | 1424 | ,, |

These Reddis had a lot of administrative experience and even under the Kakathiyas, they were appointed as chiefs of some 'niyōgas.' They were loyal and hard working and won the favour of their masters and came to have much influence in the state. There are inscriptional records to prove that Reddy chieftains like Cheṛaku Jagadāla Bollaya Reddi and others flourished as, 'mahā sāmantās,' or as governors over large areas of the country. After the fall of the Kakathiya power, they held their own and improved their kingdom by their valour and prowess. The Tangeda inscriptions tell us a silent story of this political history of the tract.

The earliest of these inscriptions is contained in a slab lying in the temple of Gantala Ramalingaswamy. It is in the cyclic year Kīlaka, corresponding to Śaka 1230 or 1308 A.D. It states that while King Pratapa Rudra was reigning over the earth and when Dōvari Nāyaka was his local governor at Tangeda, the assembles or samaya, which were eighteen in number, and the merchants of Tangeda, assigned to the temple of Ramanatha, a duty on all the sales in the town at the rate of a visam per māda of sale price.

This inscription is of vital importance to us to know something of the fiscal policy of Kakathiyas. It is evident that the power to raise taxes was decentralised and given to the local people as we find the assemblies raising the tax. Moreover the power of expenditure was also given to the local people. In other words people enjoyed complete self-government in fiscal matter, both in taxation and in expenditure. It is curious to note that a sales tax, which was said once to be the Kamadhenu of the modern state, is after all not such a modern tax at all, and is well known in Kakathiya times. One important point in the inscription deserves notice. The merchants are also associated with the tax. The main difficulty of modern centralised administration is the lack of this occupational touch with administration leading to all sorts of anomalies. In modern sales tax, for e.g., the merchants have no voice in the making of policy, or in its execution. The result is that the merchant class do not feel a direct and close personal touch with the administration of the tax and aftertimes it becomes a battle of rit between the merchants and sales tax officers, leading to endless litigation. This is one aspect of the technique of British administration, which we have still to shed. By contrast, the administration of sales tax by the Kakathiyas, stands out in bold relief. The tax is imposed with the consent, and the fact at a joint assembly, of the popular assemblies and the merchants. Moreover the proceeds of the tax were not taken away to a distant capital but spent in their own temples. Thus the merchant class, which had to pay the tax, had full part in the raising of the tax and its administration. They were in duty bound therefore to keep it up. This completely eliminates any possibility of hostility to the tax by the class which had to pay it. This technique of fiscal administration, with decentralised budget and taxation, and decentralised administration was one of the characteristic features of Kakathiya administration, and has a valuable lesson for us in our modern democracy. This inscription is of 17 lines and is as follows.

1. స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౨౩౦ అగు నేంటి కీ
2. లకసంవత్సర చైత్రశుద్ధ ౧౦ సో। స్వస్తి శ్రీ -
3. మన్మహామండ్డలేశ్వర కాకతియ్య ప్ర -
4. తాపరుద్రదేవ మహారాజులు
5. ప్రిథివి రాజ్యము సేయుచుండంగా -

6. న మాచయనాయునింగారి కొ -
7. డుకు దేవరినాయునింగారి సన్నిధిని త -
8.ంగెడ స్తలము పదునెనిమిది నమయాల -
9. వారూమా ఉభయనానాదేశి పెక్కండ్రూ -
10. ను తంగెడ గంటలరామనాథదేవరకు
11. రంగ భోగానకు అమ్మబడి విలువలకు
12. మాడకు మాడబడి వీసాము దేవరి నా -
13. యునింగారికిం బుణ్యముగాను ఆచం -
14. ద్రాకస్థాయిగాను ఇస్తిమి మంగళమ
15. హా శ్రీశ్రీశ్రీ ॥ స్వదత్తం ద్విగు -
16. ణం పుణ్యం పరదత్తాను పాలనం । పరదత్తా
17. పహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

The next important inscription of Tangeda is on a slab, in the temple of Venugopalaswamy. It is in cyclic year Parīdhāvi of saka 1295 or 1372-73 A.D. Accordingly this falls in the regime of Anavēma Reddy as per chronology adopted above and this is corroberated by the text of the inscription. It states that Avabhalanathuni Dēvu Lenka, put up during the reign of Anavēma Reddi, a stone "tirumuttamu", to the temple of Gopinathadeva and also consecrated the images of the twelve ālwars and made grants of land. The inscription also mentions the gifts of land made by other persons to the temple. This inscription is 65 years older than the previous one and we find that by this time, the Kondaveedu Reddis had consolidated their power and extended it firmly to the Palnad area. The year and date of the grant are saka 1295, Parīdhāvi, Mārgasira, ba. 7, Friday. Astronomically this can be worked out to be Dec. 17, Friday of 1372. The inscription is of 46 lines and gives us some details of Kondaveedu Reddies.

1. స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౨౯౫ అగు'నేం - -
2. టి పరీధావి సంవత్సర మార్గశిర బ ౭ శు। స్వ
3. స్తి శ్రీమత్ మనుమకులవార్ధి చంద్ర జగనే -
4. బ్బగండ కేళాదిరాయ అనియమండలి కరగం -
5. డ రూపనారాయణ కలియుగ బేతాళ జగరక్షపా -
6. లకుం డగుచుంన అనవేమరెడ్డింగారు ప్రిథివిరా -
7. జ్యము సేయుచుండగాను తంగెడ శ్రీ గోపినాంధ దేవ -
8. రసంనిధిని మాచెమరెడ్డింగారికిం బుణ్యముగాను అ -
9. వుభళ్నాదుని దేవులెంకంగారు కలుతిరు ముట్టము గట్టి ఆ -
10. డు వారలం బంన్నిద్దఱను ఆచంద్రార్కస్థాయిగాను ప్రితి -
11. ష్ఠ సేసెను। ఆ యముతు పడ్లకు సారంగపలి చెఱువు వెన -
12. కను। నీరునేల అద్దాను తంగెడ పొలాన పింగలి సందు కట్న -
13. ను వెలిచేను పుట్టెండుంను యిస్తిమి। శ్రీ గోపినాంథ దేవర -
14. కు వాహనశాల గట్టించి అక్కడనే బ్రిందా వనముతోంటాను
15. పెట్టింస్తిమి। ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాదనం పరం -
16. తస్మాత్పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప॥ యితీదం
17. వచనం శృత్వా భారతే పరమాదరాత్। శ్రీ తంగెడ పురే దేవు -
18. లెంకో గోపాళసంనిదౌ। అకరో దాడువారి ప్రతిష్ఠా
19. మాచంద్రతారకం॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం పరద -
20. త్తానుపాలనం। పరదత్తా పహారేణ స్వదత్తం ని -
21. ష్ఫలం భవేత్॥ మంగళ మహా శ్రీశ్రీశ్రీ బ్రము -
22, చుంగారి వాసుంగారు వెలుమపల్లి నిచ్చిన వెలిచేను (ప) ౫
23. తంగ్గెడ శ్రీ గోపీనాథదేవరకు అవుభళ్నాథని దే -
24. వులెంకంగారు వెలుమపల్లి పొలానను వాంగు
25. దక్షిణాసను కుదుళు రెంట్టికి పుట్టెండు చే -
26. ను ఖం అముతుపళకు సమర్పణ -
27. చేస్తిమి। ఆకరాజుపల్లిని వచ్చు పచే -
28. తినేనింగారు యేందుము చేను। యే ౫॥
29. గ్రాములపాటను గంగ్గవరపు చెంనమనేనింగారు దొడ్డినాయి -
30. నింగారున్ను యించ్చింద్ధి యేందుముచేను న ౫ కొండాయరెడ్డింగా -
31. రు యిచ్చిన చేను న గార్లపాటను న ౫ కామెపల్లిని కొంత్తం -

32. రెడ్డి యిచ్చిన చేను యేందుము నౖ౫ రేంకుల
గడ్డ పాలాస కందులవే
33. యిచ్చిన చేను పనిద్దుమున ౧౨॥ మాదారెడ్డి
గోపారెడ్డి పెద -
34. గార్లపాట....మీంది చేనివల్ను పూరి దక్షిణాన
35. చేను యిచ్చింద్ది యేందుము స ౫ కాచవరాన కు-
36. మ్మఱ పాళం సెట్టి గార్లపాటి తెరువుస పాటిమిం -
37. దిచేను యేందుం న ౫౦ భావసంవ్వత్సర భాద్ర-
38. పప శు ౧౦ మ। కొమరిగిరి రెడ్డింగారు ప్రిధివి
రాజ్యము సేయు -
39. చుండంగాను చొక్కన సింగ్గనంగారు తంగ్గెడ
యేలుచుం -
40. డ్డంగాను పొడపల్లి (డొ)యుం యెక్కడిలున్ను
తంగ్గెడ యె -
41. క్కడిలున్ను శ్రీ గోపీనాధనికి అముదుపళకు
యిచ్చి -
42. న విశాఖలు ౧౨ పంద్రెడ్డు పుట్లు ఆంచంద్రార్కర్క
స్థా -
43. యిగాను యిస్తిమి॥ భా(వ)సంవత్సర వైశాఖ శు
౧౫ సో
44. తంగెడ శ్రీ గోపీనాధదేవర....పరివారము సంధ్య
అవన -
45. రానకు పలకి అంగరంగ్గ భోగానకు....డపు....
46. ....ఆచంద్రార్కర్కస్థా యిగాను యిస్తిమి (॥)

The next inscription is on slab in the reserve forest to the west of the village. It is in cyclic year Prajōtpatti, Saka 1313, Margasira ba. 10, Monday. Astronomically this corresponds to 21st Dec. 1391 A.D. This states that Chokkana Singana, governor of Tangeda, under Komaragiri Reddi. son of Anavotayya Reddi, established temples af Narasimha, Lakshmi and alwars on the Anantagiri hill and endowed it with lands and proceeds of the customs duties, mentioned. This inscription is also of importance to us, because we learn that by 1391A.D., the Kondaveedu principality had to become an empire, necessitating the employment of governors. The customs duties about which details are given are also very important to us, giving us an insight into the financial and economic life of the people. The main interest of this inscription lies in the fact, that the assignment here is done by the governor, whereas the earlier Kakatiya inscription, mentioned above, imposes a fresh tax by the people themselves. This shows that sales tax though well recognised as a source of income, was not a normally imposed tax to swell the public exchequer. It was conceived more in the nature of a voluntary levy. The inscription is of 41 lines and is as follows.

1. స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౩౧౩ అగు నేంటి
ప్రజోత్పత్తి సంవత్సర మార్గశిర బ ౧౦ సో
2. స్వస్తి శ్రీ మనుమకుల వార్ధిచంద్ర జగరక్షపాలక
సంగ్రామ దనంజయ వీరనారా -
3. యణ సంగడి రక్షపాల। రూపనారాయణ
హేమాద్రి దానచింతామణి వసంత -
4. రాయండైన అనవొతాయరెడ్డింగ్గారి కుమారుండు
కొమరిగిరి రెడ్డింగారు ప్రిధివి
5. రాజ్యము సేయుచుంను చొక్కన సింగ్గనంగారిని
తంగ్గెడ యేలంబెట్టినను తంగ్గెడ వు -
6- త్తరాన శ్రీ కృష్ణవేణ్య దక్షిణాసను వరాహ
గుండ్డము భవనాసి కూడలిని శ్రీ అనంత్తగిరిని
7. శ్రీ నరసింహ్యాండు చొక్కన సింగనంగారికి
సంనిధైతేను శ్రీ నరసింహ్యునికింని అం -
8. మవియ్యాలకుంను ఆడువార్లకుంను గరుడాడు
వారికింని పచుమంత్రా
9. డువారికింని కలుతిరుముట్టలు గట్టించ్చి ఆగ
మోక్తప్రకారాన ప్రతిష్టలు సేయించ్చి అ -
10. ముతు పళ్ళకును చొక్కనసింగ్గనంగారు తమ
గొంగులపాట నిచ్చిన వెలిపొలము మూ -
11. డుపుట్లు ఖ 3 దానపల్లిం దమకుం గల నీరు నేల
వల్లను అర్ధనీరు నేలాను....దేవళ్లసా -
12. తుపళ్ళకు దాదవారిన వుత్తరాన నూంతితోష్ఠి
పుష్పాలతోంటను అనంత్తగిరి ఒద్ద నొ -
13. క పుష్పాలతోంటను తిరుపళికచమురుకు గోవులా
నిచ్చినను అంగ్గరంగ్గ భోగాలు జ -
14. రగుచుండంగాను తంగ్గెడ రాచగాడెను తంగ్గెడ
దేవస్థానాలతోడి మరియాదను
15. నిత్యపళ్లు వడ్లు యిరుసానున పెనలు మానెండును
చమురు సొలెండున నై [మి] -

16. త్రిక పపణమహాత్స్యవాల పశ్లంపు జరుగు
చుండ్ఞంగాను అనంతగిరి శ్రీ నరసింహు -
17. నికి అముతుపళ్లకు నిచ్చిన చేలు తంగెడపాలాన
ముప్పందుము ఖ ౧ స ౧౦ పినగా -
18. జపాటను ఆ వెరరెడ్డి పుట్టెండు ఖ ౧ కట్లపాటను
అవెరలు జయన పాటి నెం.
19. డు యెందుము స ౨ మంద్దడిరెడ్డి పదెండుము
న ౧౨ ఆకరాజు పల్లిని ఆవెర అ -
20. స సింగ్గమనేంతుపుట్టెండు ఖ ౧ క్రొత్తపల్లిని
ఆదెర దొడ్డాయిని మాదినేండు పు -
21. ట్టెండు ఖ ౧ కాచవరానను ఆదెర కుంమరపోడు
పందుము న ౧౦ కక్కెళ్లపాటను
22. అదెర పాలవాయసోమాయరెడ్డి పందుము స ౧౦
చింతపల్లిని గొపులెంక
23. తెలుంగరి పుట్టెండు ఖ ౧ తుమ్మలచెఱువున
లోకసానితిప్పాయ -
24. రెడ్డి పుట్టెండు ఖ ౧ వెనగి సింగాయరెడ్డి పుట్టెండు
ఖ ౧ గోపాయరెడ్డి తనజీత -
25. ము మీంది చేనివల్ల గాట్లపాటం బెట్టిన చేను
యేందుము న ౨ వుచ్చెపల్లి -
26. ని పుట్టెండు ఖ ౧ దాసిపల్లిని పుట్టెండు ఖ ౧
అగ్రహారము బూదవాడను
27. మహాజనాలు వెట్టిన చేను పుట్టెండు ఖ ౧ అగ్ర
హారము అనుంగుంబల్లి -
28. ని మహాజనాలు వెట్టిన చేను పుట్టండు ఖ ౧
తంగ్గెడ యెక్కడిలు తమజీతా -
29. లవల్న దేవర అముతుపళ్లకు నిచ్చిన విశాఖలు
పంద్రెండ్డువుట్లు యెం -
30. టను ఖ ౧౨ నానాదేశాలు పెక్కంండ్రుంను
యిచ్చిన పుడీగమూల వీసాలుంను
31. సుంఖగుత్తకాంండ్రు యిచ్చిన మరియాద యేటి
తేవునను అనంత్తగిరి శ్రీ
32. నరశింహ్యుని దశఱ నిప్పును అంనిపహన్‌లాను
వచ్చివారికి ప్పటికూలి గొనకు -
33. ండానుంను దేవరసీమకుం గల పసురము వెయ్యా
గొఱ్ఱె మేంకకొలు -
34. చులు యిటువంటివి అంమినం గొంనను
సుంఖాలు లేకుంట్టా నిచ్చిరి
35. యిశాసనస్తమైన యంత్తవట్టు అచంద్రాక్కఱ
స్థాయిగా నిచ్చిరి మంగ్గళమహా -
36. శ్రీశ్రీం జేయున్। శాకాబ్దే రామచంద్ర జ్వలన శశి
మితే షూగఱకాష్ఠాఱం
37. దసిపూ్యం చంద్రద్యుః కృష్ణవేణ్యాతట కిటీ నరసి
పాంత్తగే సంత్తశైలే
38. సంస్థాప్య శ్రీ నృశింహం శుభకలశజలైమఱంత్ర
వద్భిస్సతూయ్యఱం చొక్క శ్రీ
39. సింగశౌరిస్తదు దవసిత స్వద్భృత్యతాత త్వరో
జూత్ ౧। స్వదత్తా ద్విగు -
40. ణం పుణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారేణ
స్వదత్తం ని -
41. ష్ఫలం భవేత్ ॥

There is another inscription of 51 lines in a slab in the temple of Venugopalaswami of the same village. This inscription is much damaged and the year is also lost. It states that during the rule of Komaragiri Reddi, when Chokkana Singa was the governor, the governor and other persons made gifts of land and duties to Gopinātha Ishwara. The importance and purport of this inscription is the same as above. The inscription runs as follows.

1. శ్రీ శక వరుషంబులు [౧3]....
2. ....సంవత్సర ఆశీజశు....శ్రీ సక....చ
3. జవినుత విఖ్యాత పంచ....విస్తీ....శా
4. ... లబ్ధానేకయుగానలం....సమస్తి
5. చారు చారిత్ర నయ వినయ....గళరున్
6. గ వీరబళాహ్వయ ధమ్మఱప్రతిష్ఠాపకః....శ్వద్ధా
7. గరుడధ్వజ విరాజితో....
8. లలక్ష్మి వక్షస్థల త్రిభువన....క్రమాభ....
9. భిక....రుం। శ్రీ నా....ండ మూలా....
10. వరుం। అహిశ్ఛత్ర పింగ్గవి....వజ్ర -
11. వంజరరున్। యకరవికర....
12. కదనప్రచండరున్। రిపు....మణ్ణ
13. ఒకకారురున్। మయజి....మణ్ణన్
14. ణాభరణరున్। మ్రాంకాపట్నబద్ధ....బలా....ని
15. సిర : కందు క్రీడావినోదపరాయ (ణు) లున్।
అయ్యా
16. వళిపురవరాధీశ్వరులున్....రీ....దేవరదివ్య శ్రీ
17. పాదపద్మా రాధకులైన చాలుమూల వుభయనా -
18. నాదేశాల పెక్కండ్రున్। స్వస్తి శ్రీ (మతుమ)
నుమకు
19. లవార్ధిఱ చంద్ర జగనోబ్బగండ కేళాదిరా -
20. య అనియమండలీ కరగండ రూప -

21. నారాయణ కలియుగబేతాళ జగరక్ష -
22. పాలకుం డగుచుంన అనవోతాయరెడ్డిగారి కు -
23. మారుండు కొమరగిరిరెడ్డింగారు ప్రిథివిరా -
24. జ్యము సేయుచుండంగాను చొక్కన సిం -
25. గనంగారు తంగెడ యేలుచు....న్నుకొ -
26. మరగిరి రెడ్డింగారికిం బుణ్యా -
27. ముగాను చాలుమూల....
28. ....తాను తంగ్గె....శ్రీ గోపీనాథదేవ -
29. రకు యిప్పించిన అది....గ్గాన్లమల....
30. ....స....కముంన్నుగా....ను అ
31. ....థిక ముబు....రితానిల....లవల్నపె....
32. ....ంను నూనె....గ్గడిం దవ్వెండుంను తల మో-
33. పుసిద్దెను సోలెండును తములపాకుల పెఱుకను
34. ఆకుంగట్టాను తలమోపున యేంభై ఆకులు -
35. న్ను యిచ్చిరి అముతపళకు చొక్కన సింగ్గ -
36. నంగారు గోంగులపాటను పెట్నిచేను ప....డి....
37. సాతుపళ్లను తంగ్గెడను తమనివేశనములోను
38. ఉత్తరానం బెట్టించ్చి యిచ్చిన పూవుందోంట ఒక-
39. టింని। దారి ఉత్తరముతోంటలోను యిచ్చి....
40. తూపుఽనూంతితోట ఒకటింని। స....
41. శ్రీ గోపీనాథదేవరకు గోపినేనింగారు పింగ -
42. లి తంగెడ సందకట్టున చేను న ౨। యిచ్చిరి।
ఆరా -
43. ధనానాం సవేఽషాం విష్ణోరారాధనం పరం। త-
44. స్మాత్పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప
45. యితీపం వచసం శృత్వా భారతే పరమాదరాత్॥
46. స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తానుపాల -
47. నం పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥
48. స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసు -
49. ంధరాం। షష్టివ్రుఽ షఽసహస్రాణి విష్టాయా -
50. ం జాయతె క్రిమిః॥ మంగళమహ
51. శ్రీ శ్రీ శ్రీ

There is another short inscription of 22 lines in the Garuda stambha of the same temples and this is in Bhava year of Saka 1316 or 1394 A.D. The inscription purports to be an assignment of land for the merit of the king Komaragiri Reddi.

1. స్వస్తి శ్రీ శకవరుషంబు -
2. లు ౧౩౧౬ అగు నేంటి భావసం -
3. వత్సర ఆదిక శ్రా [వ] ణ శు ౧౧ శు॥
4. [స్వస్తి] శ్రీమతు మనుమకుల -
5. వాద్ధిఽ చంద్ర....జగ ప్పుఽగంఢ కేళా -
6. చిరాయ అనియ మండలి కరగ -
7. ండ్ర రూపనారాయణ కలియు -
8. గబేతాళ జనరక్షపాలక రాయగా -
9. యిగొవాళరాయ వేశ్యాభుజ్జంగ్గ గుమ -
10. స్న కొమరిగిరిరెడ్డింగారు ప్రిథివి రా -
11. జ్యము సేయు చుండ్డంగాను కొమ -
12. రగిరి రెడ్డింగారికి బుణ్య (౦] గాను (వెల్సవ]-
13. ల్లి బంట్లపడాలు [కూ] నా [వ] ం గారి అ....
14. న జీతము తోను తంగెడ అ....
15. శ్రీ గోపినాథదేవరకు అముతుపళకు
16. తంగెడ నంద్దు కట్ను పింగలిపాలాన యిచ్చి-
17. నచేను పంద్దుము న ౧౦ అచంద్రస్థా -
18. [యి] గాను ఇత్తిమి మంగళ మహ శ్రీశ్రీ
19. భవనాసి - ట్టి తోం....బారాయ అ -
20. నవోతు శ్రీ గోపినాథని చాతు -
21. పడికి సమప్పిఽంచ్చెను....
22. [కుంట] దక్షిణాన వుత్తరపుంగొమ్మున....

There is another inscription of 12 lines on a slab out side the temple of Venugopalaswami. This is most unfortunately heavily mutilated and the lines except for some words are undecipharable and the year is also lost. This refers to a gift of a pandumu of land to Lord by a certain Reddi.

There is a last inscription in the fort of Tangeda. This is also very much damaged and refers to some Khan and states that Pratapa Rudra Gajapathi was ruling. The year is Saka 1431 or 1509 A.D. and is a 16th century grant. Except that the Gajapathi empire extended to this tract, this has no other importance. The inscription refers to Pratapa Rudradeva Gajapathi, as "Mahārājādhirāja, Rājaparamēswara, Vira, Sri Virapratāpa" etc. This inscription is also much mutilated and I give below the first eight lines only.

1. స్వస్తి శ్రీ జయాభ్యుదయ శక -
2. వషఽంబులు ౧ ౪ (3) ౧ అగు నేం -
3. టి శుక్ల సంవత్సర మాగఽశిర -
4. శు ౭ సో॥ శ్రీమన్మహారాజా -

5. ఓరుగ రాజపరమేశ్వర పర-
6. [శ్రీ] వీరప్రతాపరుద్ర దేవు గజ-
7. (ప) తిమహారాజులు పృథివి.
8. (రా) జ్యంశేయు (చు) గాను గజపతి.

Tangedu. which is an out of the way, and unknown place now, contains these valuable inscriptions. It is a great pity that several have already been mutilated beyond redemption. The other surviving ones too are not well preserved and they deserve attention at the hands of the authorities.

---

## DEPARTMENTAL NOTES:

# GOVERNMENT OF ANDHRA, EDUCATION AND ENDOWMENTS

Memorandum No. 1310/F/55 10. dated 20. 10. 55.

*Sub:—Hindu Religious and Charitable Endowments—Diversion of surplus funds—Instruction—issued.*

It has been observed that, of late, the trustees of temples are applying for sanction of donations from the surplus funds, of the institutions towards the maintenance *of schools* and colleges imparting English *education* and for some other purpose which are distantly connected with Hindu Religion, culture etc. Such diversions are permissible under sections 31 (1) and 59 (1) of the Hindu Religious and Charitable Endowments Act only if the institutions concerned have made adequate provision for the purposes referred to in section 70 (2) and also for the arrangements and the training referred to in section 39 (1) of the Madras Hindu Religious and Charitable Endowments Act. The Government consider that temple funds should, as far as posible, be appropriated for purposes which are intimately connected with objects of religious institutions concerned such as the development of *bhakti* cult, renovation of temples, promo. tion of Sanskrit and other Indian languages etc.,

With this object in view, the Government desire that any surplus in the incomes of the institutions may be appropriated as far as possible for any of the following purposes in the following order of priority.

*a.* The propagation of the religious tenets of the insitutions;

*b.* the grant of aid to any other religious institutions which are poor or in needy circumstances or which require renovation.

*c.* the establishment and maintenance of educational institutions where instruction in the Hindu religion is imparted to Hindu students there of—

*d.* promotion of the study of Indian languages including Sanskrit;

*e.* Promotion of the cultivation of Indian arts and architecure,

*f.* the establisment and maintenance of a University or college or other institution in which special provisions are made for the study of Hindu religion, philosophy of sastras or for imparting instructions in hindu temple architectūre,

*g.* the establishment and mainteance of orpganages for Hindu children

*h.* the establishment and maintenance of asylums for Hindus suffering from leprosy;

*i.* the establishment and maintenance of poor homes for destitute Hindus who are physically disabled and helpless; and

*j.* the establishment and maintenance of hospitals and dispensaries for the benefit of Hindus.

The Commissioner is requested to issue suitable instructions to Departmental Officers and temple authorities.

K. SAMBASIVARAO NAIDU,
*Deputy Seeretary to Government.*

---

## RENOWNED TEMPLES IN KURNOOL DISTRICT

| S.No. | Name of temple. | Shivaite or Vaishnavaite. | Village & Taluk. | Importance of Antiquity or Sanctity. | Important festival day of the temple. |
|---|---|---|---|---|---|
| 1. | Sri Mallikarjuna. | Shivaite. | Sri Sailam Nandikotkur Tq. | One of the Antiquated temples One of the Jyothirlingams. | Shivarathri. |
| 2. | Sri Mahanandee-swara. | do | Mahanandi, Nandyal *Tq.* | Antiquated. | Shivarathri. |
| 3. | Sri Laxminarasimha | Vaishnavaite. | Ahobilam, Sirvel *Tq.* | Important Vaishnavaite temple. | Brahmotsavam during Phalguna month. |
| 4. | Sri Laxmi Chenna-kesava. | do | Markapur, Markapur *Tq.* | do | Brahmotsavam during Vyshakha month. |
| 5. | Sri Onkara Sidde-swara. | Shivaite. | Onkaram, Nandyal *Tq.* | Important Forest temple, | Shivarathri. |
| 6. | Sri Bhogeswara-swami. | do | Gadigarevula Nandyal *Tq.* | do | do |
| 7. | Sri Bugga Rame-swara. | do | Kalvabugga, Kurnool *Tq.* | do | do |
| 8. | Sri Umamaheswara-swami. | do | Yaganti, Banaganapalli *Tq.* | do | do |

Sd. G. V. KRISHNAMURTHY,
*Assistant Commissioner.*

## RENOWNED TEMPLES IN VISAKHAPATNAM & SRIKAKULAM DISTRICTS

| S. No. Name of the temple. | Saivaite or Vykshnavati. | Village taluk. | Importance of antiquity or sanctity to be noted. | Festivals days of the temple. |
|---|---|---|---|---|
| 1. Sri Varahalaxminarasimha swamy temple. | Vaishnavaite. | Simhachalam Visakhapatnam Tq. | Architecturally the temple deserves very high praise. There is a perennial spring locally called "Gangadhara on the uphill which provides the numerous pilgrims that flock at the temple with source of water for bathing and fertilizes the fruit gardens belonging to the temple. There is a belief that all those that bathe in this holy water would attain "Moksha or Mukti". 2. The diety is covered with sandal paste throughout the year and only on the third day in the month of Vysakha the sandal paste which covers is removed and nijaswarupa is shown to | Kalyanam festival will be celebrated in the month of April, Chandanayatra will be celebrated on 3rd day, Vysakhamasam of every year. |

| S. No. Name of the tempe. | Saivaite or Vykshnavati. | Village taluk. | Importance of antiquity or sancity to be noted. | Festivals days of the temple. |
|---|---|---|---|---|
| | | | devotees. That day is called "chandanayatra". 3. This is only the temple in Andhra state where the devotees are allowed to garbhalayam. | |
| 2. Ramaswamy temple. | Vaishnavaite. | Ramathirtham. Vizianagram Tq. | The peculiarity of the temple is that a big festival on Sivarathri day will be celebrated even though it is Vaishnavaite temple. | Sivarathri festival will be conducted in the month of February of every year. 2) Kalyanam festival will be celebrated in the month of February of every year. |
| 3. Brahmalingeswaraswamy temple. | Siva. | Baligattam, Golugonda taluk. | —— | Sivarathri festival. |
| 4. Jagannadhaswamy. | Vaishnavaite. | Visakhapatnam. | —— | Car festival will be conducted in the month of July. |
| 5. Yendalamallikarjunaswamy. | Siva. | Ravivalasa, Tekkali taluk. | —— | Karthigam festival will be conducted in November, sivaratri festival fall in February. |
| 6. Someswáraswamy. | do. | Devunigumpa, Parvatipur taluk. | This is an ancient temple and it is situated at the place where the two rivers Nagavali and Vamsadara meet. | Karthigam and sivaratri. |
| 7. Kasiviswesw ara. | do. | Addapusela, Parvatipur. | —— | Karthigam. |
| 8. Pothangeswara. | do. | Pothangi, Sompeta taluk. | —— | Karthigam and Sivaratri. |
| 9. Satyanarayana. | Vaishnavaite. | Parvatipuram. | —— | Karthigam Ekadasi in November-Maghasuddhaekadasi in February. |
| 10. Nandikeswara. | Siva. | Bendi, Tekkali Tq. | | Sivaratri. |
| 11. Sangameswara. | Siva. | Sangam, Palakonda taluk. | This is an ancient temple. | Sivaratri. |
| 12. Mukhalingam. | Siva. | Mukhalingam Pathapatnam. | Mukhalingam is a sacred place situated on the bank of the lovely Vamsadhara river. According to stalapuranam it is said that this temple was installed by eastern Ganga king of Kalinga. A study of the architecture of the temple reveals the interesting story of Ramayana and Mahabharatha. | Sivaratri. |

G. KRISHNAREDDY, *Assistant Commissioner.*

# ĀRĀDHANA

(A RELIGIOUS MONTHLY MAGAZINE)

**MAY 1956**

*Anent* THE TEMPLES
FOR THE TEMPLES
BY THE TEMPLES

*(in Andhra State)*

*" Go deep inside the temple and you will find me there "*—MOTHER



---

PUBLICATION OFFICE:

" ĀRĀDHANA "

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department*
*(Andhra)*

MASULIPATAM.

ANNUAL SUBSCRIPTION Rs. 12/-

PER SINGLE COPY Rs. 1/-

# ఆరాధన

**దుర్ముఖి** — **మాసపత్రిక** — **వైశాఖము**

విషయసూచిక — పుట

### తెనుగు



---

## CONTENTS

### ENGLISH

PAGE



---



గౌతమబుద్ధుడు తన పుత్రుడు రాహులునకు పిత్ర్యాంశముగా జ్ఞానభిక్షాపాత్ర సనుగ్రహించుట

" ఆనందరూప మమృతం య ద్విభాతి "




సకృ దేవ ప్రపన్నాయ 'త వాస్మీ'తి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥

సంపుటము ౨ | దుర్ముఖి - వైశాఖము | సంచిక ౫

# చిత్ర వివరణము

ఈ వైశాఖము పరమోత్కృష్టమగు మాసము. మహనీయులగు మతప్రవక్తలు ఈ మాసమునం దావిర్భ వించిరి. అట్టి మహనీయుల జయంత్యుత్సవములు భారతదేశమునందెల్లెడలను జరుపబడెను. ఆరాధన కూడ ఆ మహనీయుల నారాధించుట కర్తవ్యమును నిర్వహించుటయే యగును. అట్టిమహనీయులగు గౌతమబుద్ధుడు, ఆదిశంకరులు - వీరిని సంస్మరించి కృతకృత్యయగుటయే ఆరాధన యుద్దేశ్యము.

తత్సూచకముగ ముఖచిత్రముగ " గౌతమబుద్ధుడు కుమారుడగు రాహులునకు పిత్ర్యాంశముగ జ్ఞాన భిక్షాపాత్ర ననుగ్రహించుట " ను సూచించు రేఖాచిత్ర మిందు పొందుపరుపబడినది. వెనువెంటనే " బుద్ధుని యుపదేశములు " అను రాధాకృష్ణ పండితుల వ్యాసము ప్రకటితమైనది.

శ్రీ రామేశన్‌గారిచే రచితమై ఆరాధనపత్రికయందు అనుస్యూతముగా ప్రకటింపబడు " భారతీయ తత్త్వ విద్యాప్రకాశిక (A Pageant of Indian Philosophy) అను వ్యాసకిరణావళియందు ఏకాదశ కిరణముగా "ప్రాచీన బౌద్ధమతము " (Early Buddhism) అను వ్యాసము యాదృచ్ఛికముగా **2500** వ బుద్ధ మహాపరినిర్వాణ జయంతి సూచకముగా ప్రకటితమగుట ప్రశంసనీయము.

ఈమాసమునందే శ్రీమదాది శంకరుల జయంత్యుత్సవము భారతదేశమున జరుపబడెను. తత్సూచకముగనే ఈసంచికయందు " శిష్య చతుష్టయ సహిత శ్రీ శంకరభగవత్పాదుల చిత్రము " ప్రకటింపబడినది. మచిలీపట్టణ స్థిత గాయత్రీ పీఠాధిపతులగు శ్రీ విద్యాశంకర భారతీ స్వాములవారిచే రచితమగు శ్రీ శంకరాచార్యులవారి జీవితచరిత్ర సంగ్రహము, శ్లోకములు ప్రకటింపబడినవి.

ఇట్లే వైశాఖమాసమునందు శ్రీ నృసింహజయంతి సందర్భమున మంగళగిరి శ్రీ లక్ష్మీ నృసింహస్వామివారి ఆలయము, స్తంభోద్భవ నరసింహస్వామివారి చిత్రములుకూడ ప్రకటింపబడినవి. మంగళగిరి క్షేత్రమును గురించిన వివరణ " ఆరాధన పత్రిక - మన్మథ - పౌషమాస సంచికయందు ప్రకటింపబడుటచే తిరిగి ప్రకటింపబడుట పునరుక్తము.

---

# బుద్ధ భగవానుని సందేశం

డా. ఎస్. రాధాకృష్ణన్

ప్రపంచంలో యథార్థమైన హేతువాది అంటూ ఎవరైనా ఉంటే, అయన బుద్ధ భగవానుడే తప్ప మరొకరు కాదు. పరొక్ష ప్రమాణాన్ని పురస్కరించుకొని ఏదీ సమ్మరాదని అయన వాదం. "పరీక్షాం వీక్ష్య గ్రాహ్యంమద్వచో నతు గౌరవాత్" అని అయన అన్నారు. "నా ప్రవచనాలను పరీక్షించండి; నాయెడ గౌరవాన్ని బట్టి ఏదీ సమ్మకండి; తర్కపరీక్షకు, అనుభవ పరీక్షకు నిలిచేదే స్వీకరణయోగ్యం. ఆ పరీక్షకు నిలవని దానిని తిరస్కరించడమే కర్తవ్యం" అని దీని అర్థం.

ప్రతి వ్యక్తిలోనూ అంతర్నిహితమై ఉన్న బుద్ధి అంతఃకరణలే సత్యాసత్య నిర్ణయానికి సమర్థమైన సాధనాలు. అందుచేత అయన బుద్ధినే ప్రమాణంగా స్వీకరించారు. బుద్ధితో వివేచించి చూడగా, యీ జగత్తులోని సర్వమూ క్షణభంగురమైనదనీ, అన్ని వస్తువులూ నశ్వరమైనవేననీ, అయనకు గోచరించింది. తొలిసారి రుగ్ణుణ్ణి, వృద్ధుణ్ణి, మృతుణ్ణి చూచి నప్పుడు, అయన యీ విధంగా ఆక్రోశం వెలిబుచ్చారు:— "జరామరణ వ్యాధుల నుండి తరించే మార్గం మానవ జాతికి లేదా? ఇవేనా మానవులకు గమ్యస్థానం? జన్మ మృత్యువులను అతిక్రమించిన ఉన్నత పథం మరేదైనా ఉందా? పునరపి జననం, పునరపి మరణం, యింతేనా జీవిత సత్యం? మానవ జీవితానికి పరమార్థం ఏమిటి?" దీనికి అయన జవాబిది- జన్మ మృత్యువులే జీవితపరమార్థ మయేట్టయితే, శోకమే మానవ జాతికి భాగధేయం. ఇది ఇలా కాకపోబట్టే, జగత్తు పరిణామ శీలమైంది కాబట్టే, విశ్వానికి దుఃఖాన్ని గమ్యస్థానంగా భావించకూడదు. మానవుడు ప్రపంచపు హద్దులనే కాక కాలాన్నికూడా అతిక్రమించ గలడు. ఇందు వల్లనే మానవ జాతికి ప్రస్తుత స్థితి నుండి తరణోపాయం అనేది ఒకటి ఉంది. ఈ ప్రపంచం అడుగడుగునా శోక భయాలకు అలవాలమైనదిగా భావించ కూడదు. అంతిమ విజయసిద్ధికి తప్పక అవకాశం ఉంది. బుద్ధుడు అంటే ప్రబోధంపొందిన వాడు; ప్రపంచం యొక్క బంధనాల నుండి, సంసార చక్రం నుండి విముక్తుడై నిర్వాణం పొందిన వాడు.

ఇతరులపై కేవలం గౌరవం వల్ల, లేదా విశ్వాసం వల్ల ఏ విషయాన్ని సత్యంగా స్వీకరించకూడదని అయన బోధించడంలో ఉద్దేశ్యం ఏమిటంటే, క్షణభంగురమైన యీ జగత్తు యొక్క అంతరాంతరాలలోకి ప్రతి వ్యక్తి స్వయంగా దృష్టి సారించాలని, మార్పులేని అనంత సత్యాన్ని స్వానుభూతితో గ్రహించాలని. ఈ పరమార్థం "అజాతమైనది; అసంస్కృతమైనది". అది అట్టిది కావడం వల్లనే, మానవులు పరిణామ శీలమైన యీ ప్రపంచం నుండి విముక్తి పొంది దేశకాలాతీతమైన అనంత సత్యాన్ని చూరగొనడానికి అవకాశం ఉంది.

ఈ మతంలో మూఢంగా విశ్వసించవలసిన సూత్రాలు గాని సిద్ధాంతాలుగాని ఏమీ లేవు. ప్రపంచ గతిని జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, ఈ గమనంలో, ఈ ఘటనాపరంపరలో ఒక నియమం ఉన్నదనీ, కార్యకారణ సంబంధం, లేదా "ప్రతీత్య సముత్పాదం" ఉన్నదనీ, తెలుతుంది. దీనిని బట్టి యీ విశ్వమంతా కేవలం అయోమయమై అర్థరహితమైన కాకతాళీయ సృష్టికాదనీ, అంతా విశృంఖలత, అంతా స్వైర విహారమూ కాదనీ, ప్రపంచాన్ని పర్యవేక్షిస్తూ నిర్దిష్ట మార్గాన నడిపించే అతీతమైన శక్తి ఏదో ఉందనీ స్పష్టపడుతుంది.

ప్రపంచంలో ధర్మం అనేది ఒకటి ఉంది. ఈ ధర్మపథాన్ని అవలంబించడం వల్లనే మానవుని చైతన్యం ప్రబుద్ధమౌతుంది. 'అసత్' నుంచి 'సత్యాన్ని' 'మృత్యువు' నుంచి 'అమృతత్వాన్ని' చేరుకోవాలని చెప్పు ఉన్నాం. అయితే దీనికి మార్గమేమిటి? ధర్మాన్ని అనుసరించడం, కృపాపూరితమైన జీవిత-విధానాన్ని అవలంబించడం.

దయా, దమ, దానాలను మానవులు అవలబించాలని బోధించడానికా అన్నట్లు ఉరుములు ద ద ద అనే ధ్వనులతో ఉరుముతాయని ఉపనిషత్తులలో చెప్పబడి ఉంది.

బుద్ధుని అష్టనీతి సూత్రాలలో కూడా ఇవే సూత్రాలు నిర్వచించబడ్డాయి. ధర్మానుసరణమే జీవిత సార్థక్యం, అశ్వఘోషుడు యీ విధముగా ఉద్బోధించాడు:— "ప్రసారయ ధర్మధ్వజం; ప్రతూర్య ధర్మశంఖం; ప్రతోదయ

ధర్మ దుందుభిం; ధర్మంకురు, ధర్మంకురు, ధర్మంకురు'' అంటే "ధర్మదుందుభిని మ్రోగించు, ధర్మధ్వజాన్ని ఆరోహించు, ధర్మశంఖాన్ని పూరించు, ధర్మాన్ని ఆచరించు" అని అర్థం.

బుద్ధుడు కేవల సిద్ధాంత ప్రచారకుడు కాదు; ఆయనకు సిద్ధాంతాలలో లేశమూ సమ్మకంలేదు. సత్యం అనుభవైక వేద్యం; కేవల తార్కిక పరిశ్రమ ద్వారా సిద్ధించేదికాదు. ఆధ్యాత్మికమైన అంతర్దృష్టివల్ల మాత్రమే దానిని పొంద వచ్చును. "వాక్యార్థజ్ఞానం" వల్ల, నిరంతర ప్రసంగంవల్ల కాక, ప్రత్యక్షజ్ఞానం ద్వారా దానిని సాధించాలి. అందువల్ల "నిర్వాణం" యొక్క స్వరూప స్వభావాలేమి? అని ఆయన నిర్వచించడానికి నిరాకరించాడు. తాను బద్ధముష్టని కానని స్పష్టంచేశాడు. తాను ఎరిగిన ప్రతిదానినీ తేటతెల్లంగా తెలియ జెప్పడానికి ఆయనకేమీ అభ్యంతరంలేదు. కాని యీ అంతిమ సత్యాన్నికూడా తాను వివరించిచెప్పినట్లయితే, మనం దానిని కేవలం ఆయనమీది గౌరవంతో మక్కికి మక్కిగా అనుభవజ్ఞానం లేకుండానే స్వీకరించే ప్రమాదం ఉంది. ఈ మహాయాత్రను ఎవరికి వారే సాగించి, కష్టపడి గమ్యస్థానానికి చేరుకోవాలి. బుద్ధులు మార్గ నిర్దేశకులు మాత్రమే; వారిలో మనం పడవలసిన శ్రమ మనం పడక తప్పదు. కాబట్టి యీ అంతిమ సత్యం యొక్క అనుభూతి వ్యక్తిగతమైన సాధన ద్వారానే లభిస్తుంది. ఇది ఇతరులు మనకు అరచేతి వైకుంఠంగా సంపాదించిపెట్టేది కాదు. మానవులు ధర్మచ్యుతి లేకుండా నిరంతర నైతిక మార్గావలంబులై నిర్వాణాన్ని సాధించాలని ఆయన మతం. కాని ఆ నిర్వాణం ఎట్టిదో మాత్రం ఆయన వెల్లడించడానికి నిరాకరించాడు; పరోక్ష ప్రమాణంవల్ల మనం ఏదైనా ఒక విషయం విశ్వసించినప్పుడు అన్ని యితర విషయాలూ కూడా అదేవిధంగా విశ్వసించి మూఢసమ్మకాలకు బలి కావచ్చును. అందువల్ల సిద్ధాంతాలు, విశ్వాసాలు, పరోక్ష ప్రమాణాలు అంటే ఆయనకు సుతరామూ గిట్టదు.

## మధ్యమ మార్గం

కాబట్టి, సహేతుకమైన పృక్పథం అవలంబించి, వ్యక్తిగతానుభవం ద్వారా పరమార్థాన్ని సాధించాలని బుద్ధుని మతం. పరిణామశీలమైన యీ జగత్తు అంతరాంతరాలలో మార్పులేని ఒక పరమ సత్యం ఇమిడి ఉందని, ఆయన కనుగొన్నారు. ఈ అనుభూతిని కరతలామలకం చేసుకోడానికి ప్రతీ వ్యక్తి 'మధ్యమ మార్గా'న్ని అనుసరించాలని ఆయన బోధించారు. పరమ సత్యమైన యీ ప్రాతిపదిక సూత్రాలను ఎవరూ కాదనడానికి వీలులేదు. కాని అన్ని ఇతర మతాల సిద్ధాంతాల విషయంలో జరిగినట్టే యీ మహనీయమైన బౌద్ధమతం విషయంలో కూడా అభిప్రాయ భేదాలు, పూర్వోత్తర పక్షాలూ బయలుదేరి, విద్వేషం, వైమనస్యం వ్యాప్తి చెందాయి. బౌద్ధమతం భ్రష్టమై, బుద్ధ భగవానుని ప్రతిభావంతమైన ఉపదేశాలు వివాదాల పాలయాయి.

ఓం

అసతో మా సద్గమయ ।
తమసో మా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మాఽమృతం గమయ ॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

# అన్నవరములో పండిత పరిషత్ప్రారంభోపన్యాసము

సచివ శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు,

రెవిన్యూ - దేవాదాయధర్మాదాయ మంత్రిగారు.

భారతరాజ్యము ఆంధ్ర రాష్ట్రము వచ్చిన తరువాత విజ్ఞానమునకు ప్రాముఖ్యం భావిస్తున్నారు. విజ్ఞానుల విజ్ఞానవిశేషమును బట్టి చాలా విభాగములు వచ్చినవి. పండిత సభలు ప్రాచీన కాలానగూడా ఉండేవి. ఆయా శాఖలలో కృషి చేసిన అభిజ్ఞుల ప్రజ్ఞప్రకటించుట అవసరం. ఒకప్పుడు ఋషులు నిర్ణయావసరంలో నిర్ణయించేవారు. ఇప్పుడు ఋషుల స్థానంలో పండితులుండాలి. నిర్ణయాలు చేయాలి. అందరకూసామరస్యం కూర్చాలి. మన భారత దేశవాసులు కౌపీనధారులకు నిరాడంబరులకు ఋషులకు ప్రాముఖ్యం ఇచ్చారు. ఇతర దేశాలలో దారి దొంగలకు ప్రాముఖ్యం వచ్చింది. తపస్త్యాగ తపోవనముల కిక్కడ ప్రాధాన్యం ఉంది. ఈ విశేషాలకు మనం వైదొలగరాదు. పాశ్చాత్యులు ఖితిల్లి వైదొలగవచ్చు. పాశ్చాత్యులు భౌతిక శోధనానికై పరిషత్తులు చేస్తున్నారు. వారిలోవారు నిశ్చయించిన తత్వమును నచ్చచెప్పి యితరులకు అందిస్తున్నారు. ఇది యితరులను అవమానించడంకాదు. అట్లే మనంకూడా మనపాండిత్య నిర్ణయాలను లోకానికి అందించాలి. ఏకధారగా మననిర్ణయం సాగించాలి. ప్రజలకుద్బోధించాలి. రాజాధికారం ఉందని దుర్వినియోగం చేయరాదు. ప్రాచీనకాలంలో మనమంత్రులకు ఋషులు బలం ఇచ్చేవారు. ధనబలము అధికార బలము దుర్వినియోగం కాకుండా సన్యాసి, ఋషి, పండితుడు జాగ్రత్తపడాలి. నేటి దినాలలో నాస్తిక్యం వ్యాపిస్తున్నది. బోధకులు సమీక్షించాలి. రామకృష్ణ వివేకానంద ప్రబోధములు విశ్వమునకుపకారకములయినవి. ఆ శక్తి వారి కేవిధంగా లభించింది? సర్వమూలము బ్రహ్మచర్యము. బ్రహ్మచర్యము కలవాని వాక్కునకు బలంఉంటుంది. దైవస్వరూపశక్తి ఉంటుంది. ఈ విషయంలో పాశ్చాత్యులు బాల్యావస్థలో ఉన్నారు. భౌతికంగా బ్రహ్మచర్యబలం గుర్తిస్తున్నారు.

మన విజ్ఞానవినాశమునకు హ్రాసమునకు పాశ్చాత్యులు కారణమని అనవలసిన అవసరంలేదు. మనమే కారణము. నాకు వివేకానందబోధ కన్ను తెరిచింది. నేను వైష్ణవుడను; నాబొట్టు చూస్తేనే తెలుస్తుంది; నన్ను అపార్థం చేసికొనవద్దు. నాకు ఏ వర్గముపై కూడా విద్వేషం లేదు. మన విజ్ఞానహ్రాసమును గుర్తించుకొని వికాసమునకై మనం యేకముఖంగా యత్నించేయాలి. నా అదృష్టంగా దేవాదాయ మంత్రిత్వం వచ్చింది. సేవచేస్తాను; పండిత సభలు ఏర్పఱచాలని సంకల్పం ఉంది. కట్టుబాటుతో నియమముతో నిర్ణయముతో యత్నించాలి. ఈ పండితైకమత్యము లేకపోతే మన భావి బాగుపడదు. పరిషత్తు ఏర్పఱచి సమైక్యం సాధించండి. నేను సత్యమని విశ్వసించిన దానిని విశదం చేస్తాను. దాపరికం లేదు. పొరపాటు ఉంటే సవరించండి. పరమార్థమునకు విజ్ఞానమునకు యత్నించడానికి నా సాధన నా కున్నది. సత్యమును మరుగుపరచే వారిని చూస్తే నాకు నమ్మకం లేదు. నా భావాలివి. ఎన్నోభేదాలు లోకాన ఉన్నవి. వైష్ణవులు, శైవులు, స్మార్తులు ఇంకా భేదాలతో ఉన్నారు. ఉదారంగా విమర్శించి నిర్ణయాలను సౌశీల్యానికి దోహదమిచ్చే రీతిగా మీరు చూపించాలి.

1. వేదమనగా ఏమి? సముచితంగా నిర్ణయం చేయండి. అనేకులనేకవిధాలుగా వ్యాఖ్య చెప్పతున్నారు.
2. నాకు వేదము కావలెనని వేదమును అభిలషించే వానికి వేదాధ్యయనం చెప్పాలి; బోధించాలి.
3. గోత్ర నిర్ణయము చేయడమెట్లు?

ఈ విషయాలను విమర్శించండి. పండితులు పరస్పర నిందావచనాలను సభలో పలుకవలదని మనవి. 'మా ప్రాచీనులకు అగౌరవం రాకుండా యత్నిస్తాస'ని యీ ధర్మకర్తలన్నారు. అది గొప్పమాట. పండితులందరూ లోపాలు రచ్చకు రాకుండా సరిచేయడానికి యత్నించండి. మన పండితులను సత్కరించడం నాకు సమ్మతం, అది నా నిశ్చయం. **అది నా భారతీయత !!!**

---

# దేవాలయములద్వారా ప్రాచీన సంస్కృతి పునఃప్రవర్తనము

శ్రీ ఆర్. వెంకటరెడ్డి, బి.ఏ., బి.ఎల్., కమిషనర్
హిందూమత దేవాదాయ ధర్మాదాయ పరిపాలనా శాఖ, గుంటూరు. (రేడియో ప్రసంగము)

చారిత్రాత్మకముగా విమర్శించినచో ప్రపంచము నందెల్లెడల మానవసంఘము, సృష్టిలోని వైచిత్ర్యముల ఆరాధనతో మొదలిడి, నియమబద్ధమైన యీ బాహ్యసృష్టికి కారణ భూతమైన ఒక అంతశ్శక్తి, లేదా సృష్టికర్త యుండి తీర వలెననే నిర్ణయమునకు వచ్చినట్లు యేర్పడు చున్నది. ఇది కేవలము తార్కికముగా ఇంద్రియ జ్ఞానము వల్లగాక మహాత్ములు కొందరు నిరంతరోపాసనాతపస్సులచే బాహ్యేంద్రియాతీతమైన తమ స్వానుభవ జ్ఞానము ద్వారా సృష్టికర్త రూపమును ప్రపంచమునకు చాటగలిగిరి. ఆత్మతత్త్వపరిశోధనలు భారత దేశములోనే సర్వతోముఖముగా అతి ప్రాచీన కాలమందే జరపినట్లు ఇప్పుడిప్పుడు ఖండాంతర వాసులందరు గుర్తెరుగు చున్నారు. రామాయణాది మహాగ్రంథములు 5,000 సంవత్సరములకు పూర్వమే ఉండినవని నవీనపరిశోధకులు అంగీకరించుచున్నారు. మన ఉపనిషద్వాఙ్మయముయొక్క కాలనిర్ణయము చేయజాలకున్నారు. అపౌరుషేయములైన వేదములకాలము యెవ్వరు నిర్ణయించ గలరు? ఇంతకును, ఇంద్రియాతీతమైన ఆధ్యాత్మిక జ్ఞానము మానవజాతికి భారతీయమైన వేదములు, ఉపనిషత్తులు, పురాణేతిహాసములలో విశదపర్చినట్లు ప్రపంచమునందెయితరవాఙ్మయమునను కానరాదు. ఇంతియే కాదు; మన ప్రాచీన సంస్కృతిని ఆధ్యాత్మికమునే గాక ప్రాపంచికాభ్యుదయమునకు కావలసిన సర్వవిజ్ఞాన శాస్త్రములను కూడ సమాన ప్రతిపత్తిలో నిర్వచించిరి. వేదాంగములైన షట్ఛాస్త్రములు గూడ తదాదిగా యీ దేశమునందు వర్ధిల్లినవి.

అయితే ఈ వాఙ్మయమంతయును ఆదినుండి దేవభాషయైన సంస్కృత భాషయందే మన పెద్దలు ప్రచురించిరి. వారు భాషనుగూడ ఆదినుండి అతి జాగ్రత్తతో కట్టుదిట్టము చేసి భావౌన్నత్యమునకు తగినస్థాయిలో వేద భాషను కూడ పోషించిరి. అంతయేల? భాషకు మూలమైన వ్యాకరణ, శిక్షా, చంధస్సులను వేదాంగములుగా పరిగణించి ఆది నుండి అభివృద్ధి పరచిరి.

భారతీయసంస్కృతి వేదకాలము నాటిది మాత్రము గాదు. ఆ పునాదులపైననే కాలానుగుణ్యముగ విస్తరించబడి సర్వతోముఖముగ వృద్ధి చెందుచూ వచ్చినది. చారిత్రిక కాలము నాటికి కూడ కాళిదాసాది మహాకవులును కౌటిల్య, నాగార్జునాది శాస్త్రవేత్తలును, యాజ్ఞవల్క్యాది ధర్మశాస్త్రనియంతలును, శంకరాది మతకర్తలును ఆర్షసాంప్రదాయముల ననుసరించి సనాతన సంస్కృతి యొక్క ఔన్నత్యమును హెచ్చింపజేసిరి. ఈ మహామహుల యొక్క శక్తిసామర్థ్యములను, అధునికప్రపంచమునందలి విజ్ఞానులందరు నేడు ఆశ్చర్య చకితులై వేనోళ్లనుగ్గడించుచున్నారు. ఇట్లు చిరకాలార్జితమైన మనసంస్కృతి యంతయూ నేడు సంస్కృత వాఙ్మయబద్ధమై యున్నది. ఇంత విస్తృతమైన జ్ఞాన, విజ్ఞానాభి వృద్ధి మనదేశము పరాధీనము కాబడిన సుమారు వేయి సంవత్సరముల కాలములో అరి కట్టబడడమే కాక దేశప్రజలలో కాలక్రమముగా పరివ్యాప్తము గాక పోయినది. భారత దేశమునకు పునః స్వాతంత్ర్యము లభించిన తర్వాత బహుకాల సముపార్జితమైన యీ ప్రాచీనసంస్కృతి పునరుద్ధరణకు అవశ్యకత, అవకాశము, ఆకాంక్ష, సర్వత్ర కనిపించుచున్నవి. ఇందులో కృత కృత్యులగుటకు మార్గము లేవి? అనేక విధములున్నవి. కూలంకషములైన ప్రయత్నములు యేక ముఖమున జరిపిన గాని పల్వురు ఆశించు సాఫల్యత కనపడదు. అయినను సులభముగ అందుబాటులో నున్నవి - ప్రప్రథమముగా నిరాటంకముగా ఆచరణయోగ్యమైనవి - ఆసేతుహిమాచల పర్యంతము దేశవ్యాప్తముగా ప్రాచీన సంస్కృతికి చిహ్నములుగా ఆది నుండి యిప్పటి వరకు నిలిచి యుండినవి - మనదేవాలయములు మఠములు - వీటిద్వారానని నా నమ్మకము.

ప్రస్తుతము దేవాలయములలోనే సంస్కృత భాష వినవచ్చుచున్నది. వాటిలో కొలదిచోట్లనైన వేదపారాయణము, వేదపఠనము, మంత్రోచ్చారణ నిరవధికముగా జరుగుచున్నది. ఆగమజ్యోతిశ్శాస్త్రముల పరామర్శ తప్పనిసరిగా జరుగుచున్నది. అనాదిగా వంశపరంపరగా వీటిని ఆశ్రయించుకొనియున్న అర్చక వేదపారాయణపఠిత్రాది కుటుంబములు కొలదిగనో గొప్పగనో సంస్కృత భాషలో వాఙ్మయమునందును పరిచయము నిలుపుకొన గలిగియున్నారు. కాలపురుషుడు భారతీయులను యితర విషయములలో తమ ప్రాచీన సంస్కృతికి యెంత దూరము చేయగల్గినను, దేవాలయములకు సంబంధించిన కొలదిమందినైనను పూర్వభక్తి విశ్వాసములతోనే విడచియున్నాడు. సామాన్యప్రజలలో సహితము అనేకమంది భక్తులు పూర్వసాంప్రదాయ బద్ధులై, వేదవేదాంగ ధర్మశాస్త్రములం దభి

పచి గౌరవములను నిలుపుకొని యున్నారు. ఇప్పటికిని గొప్ప దేవాలయములందు వేదాగమసంస్కృత పాఠశాలలు నిర్వహింపబడుచునే యున్నవి. కాబట్టి మన ప్రాచీన సంస్కృతి పునరుద్ధరణము ప్రారంభమునకు ఇవియే అర్హమైన స్థానములు. ఇందు కనుగుణముగ యెక్కువ ఆదాయములు రాగల భూస్థితులు, యినాములు, అనేక దేవాలయములకు యిప్పటికి వున్నవి. ఇట్టి సదవకాశములను ఉపయోగించుకొనుట యెట్లనునదియే ముఖ్యప్రశ్న.

సంస్కృతి యన ఒకజాతి, లేక సంఘము యొక్క సమిష్టి జీవితములో బహుకాలము ఆచరణలోనున్న పద్ధతుల విశిష్టత. అట్టి విశిష్టపద్ధతులు ఆ సమూహములోని వ్యక్తి జీవితములను ఉత్సాహ తేజఃపూరితములజేసి ఔన్నత్యమునకు తీసుకుపోగలవు. (దీర్ఘ కాలపు అనుసరణమున, సంఘపు పద్ధతులు, చర్యలు అనుభవమూలమున క్రమముగా సంస్కరింపబడి విలక్షణత నొందిన వాటిని ఆ సంఘపు సంస్కృతి యనదగును). మానవ జీవిత పరమావధి సృష్టికర్తయైన పరమేశ్వరుని గుర్తెరుగుటయే యని ప్రపంచములోని అన్నిమతముల ఆదేశము. కాని భారతదేశములో ఆదినుండి సంఘముయొక్క అన్ని చర్యలనున్ను, ఈశ్వర పరముగా నుండునట్లే నుద్దేశింపబడి శాస్త్రబద్ధము కాబడి యున్నవి. ఒక వాఙ్మయమునేగాక సర్వకళలు, శాస్త్రములు, వ్యక్తి దైనందిన జీవితముకూడ పరమేశ్వర ప్రాప్తిలక్ష్యముతోనే నిర్దేశింప బడియున్నవి. అందు మూలముననే పరమేశ్వరారాధనకై యేర్పాటైన దేవాలయములందే ప్రజాహిత నిర్మాణ కార్యక్రమములును కేంద్రీకరించబడినవి. ముఖ్యముగా ఉన్నత సోపానములో జీవాత్మైక్యతకు దారి తీయగల సంగీతము, శిల్పము, నృత్యము, చిత్రలేఖనము మొదలైన లలితకళలకు దేవాలయములందగ్రస్థానమొసగబడినది.

తన్మయత్వము కలుగజేయు త్యాగరాజ రామదాసాది భక్తుల సంగీత ప్రభావమేమనవచ్చు! పరదేశీయులను సహితము ముగ్ధులను చేయగల శిల్పులయొక్కయు, చిత్రలేఖకులయొక్కయు అద్వితీయ నైపుణ్యము, మనదేవాలయములందే కాననగునుకదా! ఈ కళలన్నియు సంస్కృత భాషలో శాస్త్రబద్ధములై ఇప్పటికిని వున్నవి. ఇవియే గాక సామాన్య మానవజీవితమునకు చైతన్య మొసగి నుత్తేజపరచగల అనేక యితర ఆచార వ్యవహారములుకూడ దేవాలయములలో జరుపు నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, వార్షికోత్సవ కార్యక్రమములలో నిమిడ్చియున్నారు. ఇవియే గదా మనదేశీయ విశిష్ట సంస్కృతులు! కాబట్టి భారతీయ సంస్కృతి పునరుద్ధరణమునకు ప్రస్తుతము నామమాత్రావశేషములైయున్న దేవాలయములను పూర్వస్థితికి తీసికొని వచ్చుటయే సులభసాధ్యమైన కార్యమని నా నమ్మకము.

భారతీయ సంస్కృతి చెందుచున్న అధోగతిని గ్రహించియే అవతారమూర్తులైన శ్రీ రామకృష్ణ వివేకానందుల వారు పునరుద్ధరణకు అపార ప్రయత్న మొనరించిరి. వారి తత్త్వమును పూర్ణముగా అవగాహనము చేసుకొనిన గాంధీ మహాత్ముడు, 'మతమువేరు, రాజకీయమువేరు' అను సూత్రము ననుసరించి ప్రపంచమును యుద్ధరంగముగా మార్చుటకు సన్నద్ధులైయున్న పాశ్చాత్యుల ప్రమాదము నుండి మన సంస్కృతికి మూలాధారములైన శాంతి, సత్యాహింస సూత్రముల సమలులోబెట్టి మన కనులయెదుటనే ప్రపంచమునకు చాటగలిగినాడు. అందువల్లనే మహాత్ముని కార్యక్రమమును త్రికరణశుద్ధిగా నెదిరించి పోరాడిన యూరపు రాజకీయవేత్తలే ఆ కార్యక్రమమునకు ప్రాతిపదికమైన మన సంస్కృతి లోతుపాతులు తెలిసికొనుటకు మన దేశమునకు స్వయముగా యాత్రలు జరుపుకొనుట చూచుచున్నాము. ఆ కారణము చేతనైన అడుగున బడియున్న మన సంస్కృతిని పూర్వరూపముతో శీఘ్రగతిని బహిర్గతముజేయుట భారతీయులమైన మనయొక్క కనీసమగు కర్తవ్యము. పూజనీయులైన రాష్ట్రపతి మొదలు రాష్ట్రామాత్యశేఖరు లనేకులు ఇందులో తమ కర్తవ్యమును నిర్వర్తించుచున్నారు. ఆంధ్రరాష్ట్రములో యీ ప్రయత్నమునకు ప్రాతిపదికముగనే జీర్ణదేవాలయ పునరుద్ధరణకు నిధి నేర్పరచియు, అర్చకులకు దేవాదాయ భూములలో కొంతభాగము స్వాధీనపరచియు, సంస్కృతబోధనాక్రమములో కాలానుగుణ్యమగు మార్పులు చేసియు, దేవాలయ ఆదాయముల వెచ్చించి సంస్కృత పాఠశాలలు, వేదాగమ పఠనాలయములు నెలకొల్పుటయు జరుగుచున్నది మరియు అందులో యెక్కువమందికి ఆ అవకాశము కల్పించు ఉద్దేశముతో ఉచితముగా భోజనవసతులుసహా కల్పించబడియున్నవి. అతిదూర దృష్టితో కూడుకున్న ఈ ప్రయత్నముల అంతరోద్దేశములను సానుభూతితో గ్రహించి దేవాలయములకు సంబంధించిన ధర్మకర్తలు అర్చకమహాశయులేగాక భక్తజనసామాన్యముకూడ ఇందులో తమ కర్తవ్యములను సక్రమముగా నిర్వర్తించి నచో దేశకీర్తిని యినుమడింపజేసి ప్రపంచ శాంతిస్థాపనలో భాగస్వాములు కాగలరని యాశించు చున్నాను.

ఓం తత్ సత్

(రేడియోవారి సౌజన్యముతో)

# జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులు

*శ్రీ విద్యాశంకర భారతీస్వామి*

## 1. జనన కాలము

సృష్టి పుట్టిన దాదిగ నింతటి తెలివిగల వ్యక్తి పుట్టలేదని ప్రపంచములోని బుద్ధిమంతులందరిచేతను కీర్తింపబడి నట్టిన్ని 'జగద్గురు' అనుసార్థక బిరుద విరాజమానులై నట్టిన్ని 'అద్వైతము' అనుఉపనిషన్మతమును ఉద్ధరించి స్థిరముగ ప్రపంచమున స్థాపించి నట్టిన్ని సాక్షాత్ పరమేశ్వర అవతార మైనట్టిన్ని శంకర భగవత్పాదులవారు వైశాఖ శు॥ పంచమి పుణ్యదివసంబున అవతరించి యుండుటచేత అట్టి మహాపురుషుని ఈ వైశాఖ మాసములో స్మరించుట అందరి కర్తవ్యమై యున్నది.

వీరి జననము 509 బి.సి. మొదలు 788 ఎ.డి. వరకు అనగా 1297 సం॥ల మధ్య కాలములో వ్రేలాడునట్లు వివిధ విమర్శకులు వ్యక్తపరిచినారు. ఈ విమర్శకుల సిద్ధాంతములు చాలా వరకు ఊహాగానములే. శంకర చరిత్రను ప్రకటించు గ్రంథము లన్నింటిలోను ప్రాచీన తమమగు (1) బృహచ్ఛంకర విజయము (2) ప్రాచీన శంకర విజయము అను రెండు గ్రంథములలోను కూడ శంకర జననము కల్యాదినుంచి 2593 సం॥లు అయిన తరువాత అనియు, యుధిష్ఠిరశకము 2631 సంవత్సరములో అనియు నందన సంవత్సర వైశాఖ శుక్లపంచమీ భానువారమున పునర్వసు నక్షత్రమున కర్కాటక లగ్నమున అభిజిన్ముహూర్తమున 5 గ్రహములు ఉచ్చలో నుండగా జన్మించిరనియు స్పష్టపడుచున్నది. ఈ కాల నిర్ణయమునకు సరియైనది 509 బి. సి. అయ్యున్నది. వారి నిర్యాణముకూడ ఆ గ్రంథములలో 477 బి. సి. కి సరిఅయిన వత్సరములో వైశాఖశుక్ల ఏకాదశినాడు అని కూడ స్పష్టపడుచున్నది. ఇంకను శ్రీ కామకోటి పీఠపరంపర, పూరిపీఠపరంపర, ద్వారకాపీఠ పరంపర మున్నగునవి కూడ 509 బి.సి. అనియే స్పష్టపరుచుచున్నవి. 788 ఏ.డి. అను కాలమునకు అభినవ శంకరులు అను 36 వ పీఠాధిపతి కామకోటివారి పరంపరలో పరిపాలనచేసి ఆదిశంకరుల వలె దేశమంతటను తిరిగి దిగ్విజయముచేసి అట్టి ప్రతిభను కనుపరిచి యుండుటచేత కొంతమంది వీరే ఆదిశంకరులు అని పొరబడుటకు అవకాశము కలిగి యుండవచ్చు.

## 2. శంకరుల బాల్యము, భాష్యరచనము

శ్రీ శంకరులు కేరళదేశములో ప్రఖ్యాత విద్వద్వంశంబున శివగురు ఆర్యాంబల తపఃఫలంబుగ జన్మించి 2 సంవత్సరముల ప్రాయముననే దేశభాషాజ్ఞానమును పొంది 5 వ సంవత్సరమునకు సంస్కృత భాషాపాండిత్యమును గ్రహించి, 5 వ యేట ఉపనీతుడై 7 సం॥లు నిండగానే వేదము లన్నింటిని అధ్యయన మొనర్చి సర్వజ్ఞుడన నొప్పె. విద్యాభ్యాస కాలములో మధుకరముచేయుచూ ఒక కడుబీద స్త్రీ తనకు మధుకరము ఇచ్చుటకుకూడ తగిన స్థితి లేనందుకు దుఃఖించి ఒక ఉసిరికాయను ఒసంగగా, లక్ష్మీదేవిని ప్రార్థించి శంకరులు ఆమెకు కనకామలకధారల వర్షమును ఆమె ఇంటిమీద గురిపించి ఆమెను కాపాడెను. ఇంకను తాను జన్మించిన కాలటీ అగ్రహారములో తమ గృహమునకు పూర్ణానది దూరములో నుండుటచేత, తన తల్లి అక్కడికి వెళ్లలేకపోగా, ఆమెయందుండు భక్తిచే ఆ నదిని తమ గృహము ప్రక్కకు పారునట్లుచేసినారు. తన 8 వ ఏట ఆయువు పరిసమాప్తి అగునని తెలిసి తురీయాశ్రమస్వీకారముచేత ఆ దేహప్రారబ్ధము తొలగునను నిశ్చయముతో సన్యసింపదలపగా తల్లి అందుకు అనుజ్ఞ నివ్వనందున, ఒక నాడు ఆ నదిలో స్నానము చేయుచుండగా వారిపాదమును ఒక మొసలిపట్టుకొని ఈడ్చుకొనిపోవు సమయమున తల్లి ఒడ్డుననుండి ఏడ్చుచుండగా సన్యాసమునకు అనుజ్ఞ నొసగిన, సన్యసించి, బ్రతుకుదునని చెప్పిరి. ఆ విధముగా తల్లిగారి అనుజ్ఞను గ్రహించి ఆతుర సన్యాసమును 8 వ ఏట గ్రహించి అచోటినుండి నర్మదా తీరమున గుహలో నున్న శ్రీ గోవింద భగవత్పాదులవారి సన్నిధికి జని అచట 2 సం॥లు ఉండి క్రమసన్యాసమును, జగద్గురు పీఠ పరంపరను స్వీకరించి వారియొద్ద శుశ్రూషచే బ్రహ్మవిద్యా రహస్యముల గ్రహించినారు. అక్కడ ఉన్నకాలములో ఒక నాడు నర్మదానది పొంగి వరదవచ్చి గ్రామస్థులకు అపాయము కలుగగా వారి ప్రార్థన ననుసరించి ఆవరదను అంతను ఆపివేసి వారలను రక్షించినారు. ఆక్కడినుంచి క్రమేణ ఆ గురువుల ఆదేశానుసారముగ కాశీకి జనిఅక్కడ 12 వ సం॥ ము వరకు ఉండిరి. అక్కడ ఉన్నకాలములో కాశీ విశ్వేశ్వరుడు ఒక అంత్యజుని వేషముతో వీరిని సమీపించగా వారి సంభాషణనుబట్టి వారు విశ్వేశ్వరులని గ్రహించి వారిమీద మనీషాపంచక స్తోత్రమును రచించి వారి అనుగ్రహమునకు పాత్రులయిరి. తరువాత వారి ఆదేశానుసారముగ బదరికి జని అచట నరనారాయణుల దర్శించి 4 సం॥లలో అచట భాష్యములను ఇతర గ్రంథములను అన్నింటిని రచించి తిరిగి కాశీకివచ్చి పద్మపాదాది

ష్యులకు భాష్యములను ప్రవచనము చేయుచుండగా బ్రహ్మసూత్రకర్తయగు శ్రీ వ్యాసులవారు వృద్ధబ్రాహ్మణ రూపముతోవచ్చి శంకరులు రచించిన సూత్రభాష్యముమీద 8 రోజులు వాక్యార్థము గావించి శంకరుల ప్రావీణ్యము నకు అమితానందమును బొంది తాము రచించిన సూత్ర ముల భావము యథార్థముగా భాష్యములో వ్యక్తపరచ బడినదని ప్రశంసించి, అప్పటికి 16 సం॥లు నిండి ఆయు ర్దాయము ముగియనుండగా, అద్వైతమత ప్రచారార్థమై తిరిగి 16 సం॥ ల ఆయుర్దాయమును వ్యాసులవారు అను గ్రహించి అంతర్ధానమైరి.

అప్పటికి వారు రచించినవి, భాష్యత్రయముకాక, 40 ప్రకరణ గ్రంథములు, 74 ఇతర గ్రంథములు, అన్నియు కలసి సుమారు 132 గ్రంథములు ఉన్నవి.

### 3. దిగ్విజయ యాత్ర, జగద్గురుత్వము

అంతట శ్రీ శంకరులు దుర్మతఖండన మొనర్చుటకును, ఉపనిషన్మతమగు అద్వైతమును స్థాపించుటకును దిగ్వి జయయాత్ర సాగించిరి. ప్రథమంలో పూర్వమీమాంసా మత ప్రవర్తకులగు కుమారిలభట్టు ప్రయాగలో నున్నారని తెలిసి ఆచోటకి జనగా వారు తుషాగ్ని ప్రవేశోన్ముఖులై యుండి, వారి శిష్యులగు మండన మిశ్రులవద్దకు వెళ్లమని చెప్పగా మాహిష్మతీపట్టణమునకు జని మండన మిశ్రునితో 14 దినములు వాక్యార్థము చేసి వారిని జయించిరి. కాని మండన మిశ్రుల భార్య ఉభయభారతి కేవలము సరస్వతీ అవతారమగుటచే, ఆమె తనను గూడ నోడించిన గాని తన భర్తయొక్క పరాజయము పూర్తికాదని చెప్పగా, ఆమెతో వాక్యార్థము 17 దినములు చేసి ఓడించగా, ఆమె చివరకు కామశాస్త్రములో ప్రశ్నలనడుగ, శంకరులు సర్వజ్ఞులగుటచే ఆ ప్రశ్నలకు జవాబు చెప్పగలిగియు, బ్రహ్మచర్యములో నుండి సన్యసించి యుండుటచే లోకాపవాదకు అవకాశము లేకుండుటకుగాను కొంత కాలము వ్యవధిని ఆమె యొద్ద స్వీకరించి అమరక మహారాజ కళేబరములో పరకాయ ప్రవేశము చేసి, కామశాస్త్ర రహస్యముల గ్రహించి తిరిగి వచ్చి ఉభయభారతికి ప్రత్యుత్తర మిచ్చి ఆమెను గూడ జయించెను. అంతట మండనుడు సన్యసించి సురేశ్వరా చార్యుడు అయెను. అచట నుండి మహారాష్ట్రము జని అచట దుర్మతముల ఖండించి, ఒక మృత బాలుని బ్రతి కించి ఒక మూగ వానిని హస్తమస్తక సంయోగముచే ఆ జన్మసిద్ధునిగ చేసి శిష్యునిగ (హస్తామలకుడు) గ్రహించి, శృంగేరికి జని శుశ్రూషచే శంకరుల సేవించుచున్న ఆనంద గిరి అను మూఢ భక్తుని సంకల్ప దీక్షచేత పండితోత్త మునిగ (తోటకాచార్యుడు) అను గ్రహించి, అట నుండి రామేశ్వరాది క్షేత్రముల దర్శించి దక్షిణ దేశములో నున్న దుర్మతముల ఖండించి ఆంధ్రదేశములో శ్రీశైలము తిరుపతి, ద్రాక్షారామము మున్నగు క్షేత్రముల దర్శించి కాపాలిక వీరశైవ బౌద్ధాది మతముల ఖండించి, ఓఢ్ర దేశము, వంగదేశము, విదర్భదేశములకు వెళ్లి అచటి శాక్తేయాది దుర్మతముల రూపుమాపి, ఇట్లు భరత ఖండ మంతటను పర్యటించి దుర్మతములను ఖండించి చివరకు సర్వజ్ఞ పీఠాధిరోహణముచేసి సర్వజ్ఞుడను సార్థక బిరుద మును స్వీకరించి యావద్భారత దేశములో నలుదిశలను నాల్గుపీఠములను ఏర్పరిచి నలుగురు శిష్యులను పీఠాధి పతులుగ చేసి అద్వైత మతమును స్థాపించి తమ అవ తారమును చాలించిరి.

శ్రీ శంకరులు ఇతర మతములను ఖండించి అద్వైత మును స్థాపించి నప్పటికి, అద్వైత సిద్ధాంతము ఉత్తమాధి కారులకు గాని ఇతరులకు దుర్గ్రాహ్యమై నందున అధికారి తారతమ్యము ననుసరించి ఖండింపబడిన మతములలోని విరుద్ధభాగములను తొలగించి షణ్మతములను గూడ మంద మధ్యమాధికారుల నిమిత్తమై స్థాపనచేసినారు. న్యాయ సాంఖ్యాది మతములు గాని, క్రీస్తు మునల్మానాది మతములు గాని అన్నియు ద్వైతమతములే. మోక్షము నిచ్చు చరమ సిద్ధాంతము అద్వైతమే అయినను, మిగతా ద్వైతమతము లన్నియు ఆయా మతములను స్థిరబుద్ధితో ననుసరించు వారిని క్రమముగా సద్వైతమునకు చేర్చును గనుక ఆయా మతములన్నింటిని సంస్కరించి నిలప బెట్టుటలో శంకరుల హృదయ వైశాల్యము ఔత్కృష్ట్యము ప్రకటిత మైనవి. శంకర సిద్ధాంతానుయాయులకు ఏ మతమునందును ద్వేషముండదు. ఇతర మతస్థు లందరు తమ మతము ననుసరించు వారికే మోక్షమనియు ఇతరులకు మోక్షము లేదనియు చెప్పుదురు. అందు చేతనే వారందరు ఇతరులను తమ మతములోనికి కలుపుకొనుటకు ప్రయత్నించెదరు. ఒక్క శంకరులు మాత్రమే ఏ మతములో బుట్టినవారు ఆ మతమునే శ్రద్ధాభక్తులతో అనుసరించ వలసిన దనిన్ని అట్లు చేసినయెడలనే ఉత్తమ గతి కలిగి మోక్షమును పొందుదు రనియు వాక్రుచ్చిన మహా పురుషులు; అందు కనే శంకరులు మాత్రమే జగద్గురువులు కాగలిగినారు. అందరికి మోక్షమున్నదని అందరిని అనుగ్రహించి లోక కల్యాణమునకు ఉత్తమమార్గమును నెల కొల్పినారు. వారి ఆదేశాను సారముగ శృంగేరీ పీఠ స్వాములగు నృసింహ భారతీయతీంద్రులు, చంద్రశేఖర భారతీయతీంద్రులు, కామకోటి పీఠాధిపతులగు చంద్రశేఖరేంద్ర సరస్వతీ యతీంద్రులు, వైష్ణవులను, శైవులను, శాక్తేయులను, క్రిస్తియనులను, మునల్మానులను, పారసీకులను మున్నగు అన్ని ఇతర మతముల వారికి వారివారి స్వధర్మామ స్థాన

మునే బోధించి, జగద్గురువులను బిరుదమును సార్థకము చేసికొని లోకకల్యాణమునకు దోడ్పడినారు.

పరమేశ్వరుని ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమగు వేదములు సృష్టికి బూర్వమే ఉండుట వలన, అట్టి వేదమతము వల్లనే లోకకల్యాణము జరుగ వలెను గనుక అట్టి వేద మతమును ఆ పరమేశ్వరుడే శంకరులుగ అవతరించి అమానుష ప్రజ్ఞను బాల్యము నుంచియు కనపరచి 32 సం॥లలో మహాద్భుతమగు చర్యలను గావించి లోక శంకరులయిన (శం = సుఖమును, కర = చేయువాడు) సార్థకనామములగు శంకరులను స్మరించి వారు చూపిన మార్గము ననుసరించుట కంటె లోకకల్యాణ మార్గము ఇంకొకటి లేదు.

సర్వే జనా స్సుఖినో భవంతు.

---

# శ్రీ శంకర జగద్గురు జయన్తి మహోత్సవః (ది 15-5-56) శ్రీ గాయత్రీ పీఠాధిపతిభిః శ్రీ విద్యాశంకర భారతీ స్వామిభిః రచితాః శ్లోకాః

1. ఆర్యాంబాగర్భ సంభూతం సుతం శివగురోశ్శివం ।
   పూర్ణ తీరేకాలటీ స్థంతం వందే శంకరం గురుం ॥
2. సర్వవిద్యాసు నిష్ణాతం బాల్యే సప్తమహాయనే ।
   సన్యాసిన మష్టమాబ్దే తం వందే శంకరం గురుం ॥
3. అద్వాదశాబ్ధియా భక్త్యా గోవిందగురుసేవినం ।
   విశ్వేశాను గృహీతం తం వందేహం శంకరం గురుం ॥
4. భాష్యాది గ్రంథకర్తారం శ్రీ బదర్యాం స్వమేధయా ।
   ఊన షోడశవర్షం తం వందేహం శంకరం గురుం ॥
5. వ్యాసాను గ్రహపాత్రంచ వాక్యార్థేన చప్రజ్ఞయా ।
   షోడశాబ్ద వయస్కం తం వందేహం శంకరం గురుం ॥
6. వ్యాసదత్తా యుషం బాలం పునష్షోడశమానతః ।
   సేవితం పద్మపాదాద్యైః తం వందే శంకరం గురుం ॥
7. గత్వా చాసేతు శీతాద్రిం కృత్వాదుర్మత ఖండనం ।
   అద్వైతస్థాపకం ధీరం తం వందే శంకరం గురుం ॥
8. సర్వజ్ఞపీఠ మారూఢం సర్వజ్ఞ ఇతి విశ్రుతం ।
   షణ్మత స్థాపనాచార్యం తం వందే శంకరం గురుం ॥
9. వేదధర్మ ప్రబోధార్థం చతుర్దిక్షుచ భారతే ।
   పీఠ స్థాపన కర్తారం తం వందే శంకరం గురుం ॥
10. వాదిమత్తేభ పంచాస్యం భక్తిసాధ్యం ఘృణాకరం ।
    జ్ఞానవైరాగ్య మూర్తించ తం వందే శంకరం గురుం ॥
11. సర్వజ్ఞం శంకరం సాక్షాచ్ఛంకరం లోకశంకరం ।
    జగత్ప్రఖ్యాత ధీమంతం తం వందే దేశికోత్తమం ॥
12. యస్యాను గ్రహమాత్రేణ మూలాఽవిద్యావినశ్యతి ।
    జగద్గురుంతం వందేహం శంకరాచార్యం సద్గురుం ॥

యాఁకలిం బాపుకొందును. నన్నింత బాధించిన నిన్ను ముక్కలు ముక్కలుగా కోసి చంపినఁగాని నా కసి తీరదని గట్టిగా నఱుచుచు, కత్తిని, రక్తము పట్టుటకుఁ బాత్రమును దెమ్మని యాడుపిశాచముల కాజ్ఞయిచ్చెను.

అంత దాసరి కొంచెమైనను విచారమును వెల్లడింపక యిట్లని పల్కెను—"ఓ రాత్రించరా! తొందరపాటుమాని నా మాట వినుము. నేను నీకు భాజనగతాన్నమును; తప్పించుకొని పోఁజాలను. నాకుఁ బ్రాణములపై కోరికయు లేదు. వీలగునంతవఱకును ప్రాణములను రక్షించుకొనుటకు బ్రయత్నింపవలెను. అట్లు యత్నింపక వెంటనే లొంగినచో ఆత్మహత్యాపాతకము సంభవించును. అందువలననే నీతోఁ బోరితిని. నీ కాహారముగా నగుటవలన నాకు ముప్విధముల మేలు కలుగును. ఎట్లన:—నా హీనజన్మము నశించును, నీ కాఁకలి తీర్చినట్లగును; దీనివలన ముక్తియు లభించును. నశ్వరమగు దేహమిమ్మి పరముఁగొనుట మేలేకదా! తొల్లి శిబిచక్రవర్తి యిట్లొనరింపలేదా? ఏ రోగమువల్లనైనను, అగ్ని విషాదులవలననైనను ప్రాణమును విడిచి, తనువును వ్యర్థపుచ్చుటకంటె, కోరి యొకరి కాహారమయి యాతనిని తృప్తిపొందించుట మంచిదికాదా? నే నెట్లును చావ సిద్ధముగ నున్నాను. అది యట్లుండనీ యొక్కమాట వినుము. మాకంటె మీకుఁ గరణ, కళేబరాది పాటవ మెక్కువ; విజ్ఞాన మధికము. ఇట్టియెడల నీకు పథ్యాపథ్య భక్ష్యాభక్ష్య పేయాపేయ వివేక ముండ వలదా? ఇతరులను హింసించి, తన్మూలమున లభించు నాహారము మేలైనదా? హింసించినందులకు ప్రతిఫలమును మరణానంతరమైన ననుభవించి తీరవలెనుగదా! దయ యుంచి నామాట విని యికనైన జీవహింసకుఁ బాల్పడకుము. నాకు 'మంచి'దని తోఁచినదానిని చెప్పితిని. నీ వాలోచించి, తోఁచినట్లు ప్రవర్తింపుము"

విష్ణుభక్తుఁ డిట్లు పల్కఁగా కహకహనవ్వి యా రక్కసి యిట్లనెను—

'ఓ దాసరీ! నీ చదువులన్నియు నేకరువుపెట్టి మమ్ము విసిగించి చంపకుము. శ్రుతులను, శాస్త్రములను మేమును జదివితిమి. మీరు దైవముగాఁ దలఁచు నగ్ని సర్వభక్షకుఁడు కాఁడా? హరికి సఖుఁడును, వాహనమునగు గరుడుఁడు తనచేఁ జిక్కిన యమృతమును దేవతలకే యిచ్చివేసి, పాములను దన కాహారముగాఁ గోరుకొనలేదా? అందువలన నమృతమైనను జాత్యన్నముతో సరికాదని తెలియుచున్నది కదా! నీ చదువుల నిఁక కట్టిపెట్టుము. నీ వెంత ప్రాథేయపడినను నిన్ను విడుచువాఁడను కాను.'

ఇట్లు పలికిన కుంభజానుని మాటలు విని దాసరి "ఓయీ! నిన్ను మోసగించి, తప్పించుకొను నూహ నాకు లేదు; నే సజ్జనుఁడను; నరుఁడను; అందును దాసకులుఁడను; చాపల్యమున నేఁ బల్కిన మాటల మన్నించి, నా ప్రార్థనము నొక్కదానిని మాత్రము వినుము. 'సఖ్యము సాప్తపదీన' మను నానుడి ననుసరించి మన యిద్దరికిని మైత్రి యేర్పడినదికదా! దయయుంచి నీ మిత్రుని చిన్న కోరిక నొకదానిని చెల్లింపుము. ప్రతిదినము నేనీ సమీపమునఁ గల కుడుగుడికిఁ బోయి, యచటి విష్ణుదేవునిపై కీర్తనలుపాడి, స్తుతించి వచ్చుచుందును; ఇది నా నియమము. దీని నీదినమునఁగూడ జరుగనిమ్ము. నాయీ తుది కోర్కెను నెఱవేర్పుము. శీఘ్రముగ నేఁబోయి హరిని కీర్తించి వచ్చెదను; నా మాట నమ్మి నన్ను విడువుము" అని పలికెను.

కుంభజానుఁ డంత దాసరి చెక్కిలిపయి మెల్లఁగా కొట్టి 'చక్కని మాట పలికినావోయి! అడవిలోఁ దెరవాట్లు కొట్టి కొట్టి నిన్న మొన్ననేగదా హరిభక్తుండవైనావు! మాకు నచ్చఁజెప్పి కట్టుత్రాడు కొఱకి పాఱిపోఁజూచుచున్నావా! భేష్! నీతెలివి మెచ్చుకోఁదగినదే! కాని యొక్కటి వినుము. ఏ ప్రాణి నీమాటలు విని నోటిలోఁబడిన యాహారమును విడుచును? తప్పించుకొని పోయిన యే ప్రాణి తిరిగి శత్రువునోటఁ గోరి పడును? ఈ లేనిపోని మాటల నిఁక కట్టిపెట్టుము" అని యనెను.

దాసరి యెన్ని శపథములు చేసినను రక్కసి వినక పోయెను. కాని తుదకు దాసరి "ఓ నక్తంచరా! జగదుత్పత్తి స్థితిలయములకుఁ బరాత్పరుఁడగు మహావిష్ణువే కారణము కదా! నీచే విడువఁబడిన నేను తిరిగి నీవద్దకు రానియెడల—ఆ మహావిష్ణువుకంటె గొప్ప దేవుఁ డున్నాఁ డను పాతకి నగుదు" నని పల్కఁగా నమ్మిక కల్గి రక్కసి యాతని పంపెను.

హరిభక్తుఁడును మిక్కిలి యానందముతో వేగముగా కుడుగుడికిఁబోయి తనివితీఱ దేవదేవునిపైఁ గీర్తనలు పాడి, జన్మము తరించినదని తలఁచి యథారీతిని తీర్థప్రసాదములను స్వీకరించి కుంభజానునివద్దకు వచ్చెను. 'దాసరి తిరిగి వచ్చునో? రాఁడో?' యను సందేహమునఁ గొట్టుమిట్టాడుచుఁ దన్ను తాను నిందించుకొనుచున్న రక్కసి కీతని రాక మిక్కిలి యచ్చెరువును కల్గించెను. ఆడిన మాట తప్పనివారు లోకమున నెవ్వరును లేరనియు, సత్య వాక్య పాలనమున దాసరికి దాసరియే సాటియనియుఁ గుంభజానుఁడు దాసరిని వేనోళ్లఁ బొగడెను. కుంభజానుని గొప్ప కృపా కటాక్షమునవే తాను ధన్యతఁ గాంచినట్లును, నిరాటంకముగ వ్రతము నెఱవేఱినట్లును పల్కి దాసరి రక్కసిని గొనియాడసాగెను.

ఇట్లు పరస్పరస్తుతులు కొంతసేపు కొనసాగినపిమ్మట దాసరి "ఓ రక్షోనాథా! ఎక్కువ యాఁకలిచే నీకడుపు నక నకలాడుచున్నను, దయతలఁచి నన్ను బంపితివి. నే నిచటనుండి వెళ్లినప్పటివలె నా యవయవము లన్నియు నున్నవో లేవో చూచికొనుము. దయయుంచి నన్ను భక్షించి నీకడుపు చిచ్చు తీర్చుకొనుము" అని రక్కసిని మిక్కిలి సమీపింపఁగా నతఁడు దూరదూరముగా తొలఁగెనేగాని తాకఁడాయెను. కుంభజానుఁడు 'ఓభక్తావతంసమా! నే నెంతకాలమునుండియో నరమాంసమును భక్షించి శరీరమును పోషించుకొనుచు పాపముల నార్జించుచుంటిని. ఎవ్వఁడైన నొక మునిగాని, వ్రతిగాని వచ్చి నన్నుద్ధరింపఁడా ?-యని యెదురుచూచుచుండఁగా, నా భాగ్యము వలన నేఁడు నీవు వచ్చితివి. అట్టి నీవు నన్నుద్ధరింపక యిట్లు పల్కుట భావ్యమా? మీవంటి భాగవతులు మా వంటి పాపాత్ములను బవిత్రులను చేయుటయేకదా ధర్మము? ఇదివఱకు జరిగినదానిని మనస్సులో నుంచుకొనక నన్ను దయతోఁ జూడుము; నీవు దయఁజూచినచో నా పాపపంకిలము నశించును. మునులను జంపిన ఘంటాకర్ణుకంటె నే నెక్కుడు పాపము చేయలేదు. అట్టి ఘంటాకర్ణు ననుగ్రహించి భగవంతుఁడున్నతపదవి నొసఁగెను గదా! అంతకంటె నెక్కుడుగా భాగవతులును పశ్చాత్తప్తులగు పాపాత్ముల నుద్ధరించినారుకదా! నీవు నట్లె నన్నుద్ధరింపుము' అనెను.

అంత 'నీ రాక్షసత్వ మెట్లు నివృత్తమగునో తెల్పు'మని దాసరి యడుగఁగా కుంభజానుఁ డిట్లనెను—

'నా వృత్తాంతమును వినుము. గత జన్మమున నేను సోమశర్మయను బ్రాహ్మణుఁడను. చోళదేశ నివాసిని; పదునాల్గు విద్యలు నేర్చియుఁ బెద్దలను ధిక్కరించుచుంటిని. ఓడియు జయించితినని గర్వించి పల్కుచుండితిని. మధురకుఁబోయి ధనాశచేఁ బాపహేతువులును, నింద్యములునగు కర్మల నాచరించి సంపాదించిన ధనమును వడ్డికిచ్చుచు నెక్కువగాఁ గూడఁబెట్టి, యింటికి మఱలి వచ్చుచుండఁగా, నా ప్రయాణమును గనిపెట్టి యొక దొంగ తోడిప్రయాణికునివలె వెంటనంటి, తప్పు దారిని బట్టించి యొక యడవిలోనికిఁ దీసికొనిపోయెను. అచటఁ గిరాతులును, కొందఱు చండాలురును వాఁడితూపులేయుచు నాతోఁ బాటున్న ప్రయాణికులను, నన్ను దోచుకొనిరి. వారిలో కాకశ్మశ్రుఁ డనువాఁడు నాకుఁ బరిచితుఁ డొకఁడుండఁగా 'నిన్ను నే నెఱుఁగకపోలేదు; నీ పని పట్టించెదను లెమ్ము' అని పలికితిని. అతఁడు నన్ను చావఁగొట్టి పోయెను. నాకుఁ బ్రాణావసానసమయమున వాని వికారపురూపే కన్నులఁ గట్టుటవలన—నా పాపఫలితము తోడుగా—ఈ రాక్షస జన్మ కలిగినది. నాకుఁ బూర్వజన్మ జ్ఞానముమాత్రము కలదు.

నేను తరించుట కొక్కటే మార్గము; నీవీ దినమున భగవంతునిఁ గీర్తించిన గానముయొక్క ఫలము నాకిమ్ము! దానివలన నాయీ వికృతరూపము పోవును'

ఆ మాట విని దాసరి యిట్లనెను—'ఓయీ! మన మెన్నో జన్మము లెత్తుచున్నాము. వేలకొలఁదియున్న నా శరీరములలో నిది యొక్కటి! దీనికయి నా గానఫలము నీయఁజాలను. నీవిఁక బేతాళప్రశ్నలు వేయక నన్నారగింపుము.'

పిదప రక్కసి సగము ఫలమైనను, లేదా నాల్గవవంతు ఫలమునైనను ఈయవలెనని ప్రార్థించెను. దాసరి దానికి నంగీకరించలేదు. తుదకుఁ గడపటి పాట ఫలమునైన నిచ్చినఁ జాలుననియు, దాని నిచ్చువఱకును కాళ్లు విడువననియుఁ గుంభజానుఁడు పట్టుపట్టఁగా దాసరి కరుణించి



చివఱిపాట యొక్క ఫలమును మాత్ర మిచ్చుటకు సమ్మతించెను. ఆమాత్రపు ఫలముననే కుంభజానుని వికారరూపము నశించినది. అతని పాపసంచయము పటాపంచలైనది. గొప్ప తేజస్సుగల దేహముతో నాతఁడు పరమ పవిత్రుఁడగు విష్ణుభక్తుఁడై నంబాదువానను పేరుగల దాసరిని మిగుల స్తుతించెను. పిదప భగవంతుని స్తుతించి,

సంసారమున విరక్తుండై తీర్థయాత్రలను సేవించి పరమ నిర్వృతిని బొందెను.

ఒక్క పాటయొక్క ఫలమువలననే కుంభజాముని రాక్ష సత్వము నశించునప్పుడు—సదా భగవంతుని సంకీర్తనము చేయుచుండు దాసరికి గల పుణ్య మెంతయో గణనా తీతము కదా! కావున, నిశ్చలమైన మనస్సుతో భగవత్సం కీర్తన మొనర్చిన అమేయమగు ఫలము కలుగుననుటలో వింత యేమున్నది!

(ఆముక్తమాల్యద ననుసరించి)

"కలౌ సంకీర్తనా న్ముక్తిః" అను సూక్తి కుదాహరణ ముగ నీ యుపాఖ్యాన మిందు పొందుపరుపబడినది.



# ఉపాసనారహస్యము

జ్యోతిష విద్వాన్, ఆగమవిశారద, తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి

(మన్మథ - ఫాల్గుణ మాస సంచిక తరువాయి)

## 7

సమయమత ప్రతిపాదక శివశక్తి సంపుటాత్మక షడ్వింశ తత్వరూప నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారమును బొంది ముక్తి గాంచుటకు ముందు సగుణ రూపమగు మూర్తులయందు మంత్రశక్తిని సమీకరించి ఆ మూర్తులను ఆగమశాస్త్రోక్త రీత్యా మంత్ర యంత్ర జప పూజాదులతో అర్చించి సాధ కుడు తనకును మూర్తియందు సన్నిహితమైన దేవునకును అవినాభావమును సాధించుకొనుటకు సగుణోపాసనము విధింపబడియున్నది. సగుణోపాసనమందు దేవతలు వేరు వేరుగా ఆయుధవర్ణ విశేషములతో అనేకములుగా శాస్త్ర ములయందు వర్ణింపబడి యున్నారు. ఇట్లు వర్ణింపబడిన దేవతా పూజవలన శాన్తి సుఖ శరీర తేజోబలములు అభి వృద్ధియగుటయేగాక నిర్గుణ బ్రహ్మతత్వము తెలియుటయు ఏకత్వమును పొందుటయును ముఖ్యప్రయోజనములు.

వస్తుతః బ్రహ్మ సర్వగతుడు సర్వజ్ఞుడు అశరీరి; అట్టి బ్రహ్మయే సర్వబ్రహ్మాండములకు అధిష్ఠాత అయినప్పటికిని అశరీరియు సర్వజ్ఞుడు అగు బ్రహ్మసర్వదా సంసార రూప మగు బాధలకు సుఖదుఃఖములకు అతీతుడు, అట్టి పరమాత్మను సామాన్యులగు మానవులు యెట్లు చూడ గలరు? తెలుసుకొనగలరు? కావున అట్టి జీవులయందు కరుణించి శివుడు సగుణరూపమును కల్పించి ఆగమశాస్త్ర ములద్వారా సాధకుడు నిర్గుణ బ్రహ్మమును పొందుటకు అనుగ్రహించి యున్నాడు—

చిన్మయస్యాఽప్రమేయస్య నిష్కలస్యా శరీరిణః
సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా ॥

ఇట్లు కల్పింపబడిన దేవతలు అసంఖ్యాకములుగా నున్నారు. వారిని గురించి విచారింతము. అద్వైత మత మందు దేవుడు ఒక్కడు (బ్రహ్మ) తంత్రములయందు-శివుడు శక్తియని యిద్దరుగా చెప్పబడినది. పురాణములయందు బ్రహ్మ-విష్ణు-రుద్రుడు సృష్టి-స్థితి-సంహారములకు కారకు లుగా ముగ్గురని చెప్పబడినది. ఋగ్వేదమందు-ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని యని దేవతలు నలుగురుగా చెప్పబడియున్నారు. (ఇంద్రంమిత్రం వరుణ మగ్ని మాహుః. (చూ-ఋగ్వేదం-) స్మృతికర్తలగు ఋషులు తమ ఆహ్నికములయందు శివుడు - విష్ణువు - గణపతి - శక్తి - సూర్యుడు అని అయిదుగురుగా చెప్పియున్నారు. శతపథ

బ్రాహ్మణానుసారము వసువులు 8 రుద్రులు 11 ఆదిత్యులు 12 ఇంద్రుడు ప్రజాపతి అని దేవతలు 33 గ్గురుగా వర్ణింప బడెను. వైదికయజ్ఞానుష్ఠానములయందు ఇంద్రాగ్నులు, మిత్రావరుణులు, సోముడు, ద్యావాపృథివి, అశ్వినులు, ఉషస్సులు, బృహస్పతి, ప్రజాపతి మొదలగు 11 గురు దేవతలు ప్రధానముగా చెప్పబడియున్నారు. మరియొకచో ద్యులోకమందు 11 గురున్ను అంతరిక్షమందు 11 గురున్ను భూమియందు 11 గురున్ను మొత్తము 33 గ్గురుగా దేవతలు వర్ణింపబడియున్నారు. ఐతరేయ బ్రాహ్మణమందు సోమపులు 33 గ్గురు అసోమపులు 33 గ్గురు మొత్తము 66 గురుగా వర్ణింపబడినారు; వీరిలో సోమపులు- అనగా వసువులు 8 రుద్రులు 11 ఆదిత్యులు 12 ఇంద్రుడు ప్రజాపతి 33 గ్గురు. అసోమపులు అనగా ప్రయాజదేవతలు 11 గురు అనూయాజ దేవతలు 11 గురు ఉపయాజ దేవతలు 11 గురు మొత్తము 33 గ్గురు. మరియొకచోట దేవతలు మూడువేల మూడువందల ముప్పది తొమ్మిదిగా చెప్పబడియున్నది. (ఋక్:-త్రీణిసహస్రాణి త్రీణిశతాత్రింశచ్చదేవానవచానపర్యన్ 3-1-9-9) మరియు భారతీయ తత్త్వమున దేవతలు ముప్పదిమూడుకోట్లుగా వర్ణింపబడి యున్నారు:

నవారా విబుధాః సర్వేస్వానాం స్వానాంగణైస్సహ।
త్రైలోక్యేతె త్రయస్త్రింశత్కోటి సంఖ్యాతయాభవన్ ॥

(పద్మపురా- ఉత్తరఖం.) ఇట్లు వర్ణించుటలో ముఖ్యాభిప్రాయము బ్రహ్మాండమందుగల సమస్త చరాచరములున్ను దేవతారూపములుగా తెలియుటయు యీ సమస్తమునకు అధిష్ఠానమగు బ్రహ్మము ఒక్కటి అనియును అభేదమును గుర్తింపుటకేగాని వేరుగాదు.

దీవ్యంతఇతిదేవాః :—అను వ్యుత్పత్తివలన ప్రకాశమానముగలవారు దేవతలు; ఇట్టి అనంతమగు దేవతలలో ముఖ్యముగా పురాణకర్తయగు వ్యాసునివలనను ఆద్యాచార్యులగు శ్రీ శంకరులవలననూ పంచదేవతా ఉపాసనము ప్రాధాన్యముగా చెప్పబడియున్నది; పంచదేవతలనగా- శివ, విష్ణు, శక్తి, గణపతి, సూర్యులు. బ్రహ్మాండమందు అనేక దేవతలుండగా యీ పంచదేవతోపాసనము మాత్రమే ఏల చెప్పబడినది అని సందేహము కలుగకపోదు. అట్టి సంశయమునకు సమాధానము యిట్టిది:- ఉపనిషత్తులయందు ఉపక్రమమున అనగా సృష్టిలో "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః। ఆకాశాద్వాయుః" ఇట్లు చెప్పుటవలన బ్రహ్మమునుండి పంచభూతములు ఉత్పన్నమైనవి, పంచభూతములతో నిర్మితమైనది బ్రహ్మాండము; మూర్త అమూర్త రూపములగు పంచభూతములయొక్క స్వరూపములే సర్వదేవతలు; అశరీర బ్రహ్మయొక్క రూపములే పంచభూతములు; సమూర్తములగు పంచభూతములను ఉపాసించుట వలన బ్రహ్మము తెలుసుకొనుటకు అవకాశము గల్గును. కనుకనే పంచభూతములకు అధిపతులగు పంచదేవతలను ఉపాసించుట ముఖ్యమని శాస్త్రములు వచించియున్నవి.

ఆకాశస్యాధిపోవిష్ణుః అగ్నైశ్చైవమహేశ్వరీ।
వాయోస్సూర్యఃక్షితేరీశః జీవనస్యగణాధిపః ॥

ఇట్లు ఆకాశభూతమునకు అధిపతి విష్ణువు, వాయుభూతమునకు సూర్యుడు, అగ్నిభూతమునకు శక్తి, జలభూతమునకు గణపతి, పృథివీ భూతమునకు ఈశ్వరుడు అధిదేవతలు. ఇట్లు యీ దేవతలు భూతాత్మకులై నిర్గుణ బ్రహ్మమును బోధింపుచున్నారు. ఈ నామములద్వారాగూడ నిర్గుణ బ్రహ్మమే గోచరింపుచున్నది. ఎట్లనగా:- విష్ణుః (విశ్వం వ్యాప్నోతి ఇతి విష్ణుః; సర్వత్ర వ్యాపించినవాడుగాన విష్ణు. శివః-(శాన్తత్వాచ్ఛివః, శాన్తుడుగనుక-కళ్యాణమును యిచ్చువాడుగాన శివుడు) గణేశః- (గణానాంప్రాణినాం ఈశః గణేశః- సర్వప్రాణిగణములకు అధిపతి) సూర్యః- (సువతి ప్రేరయతివ్యాపారేషు ఇతిసూర్యః- సమస్త భూతములను ప్రేరేపించువాడుగాన సూర్యుడు) శక్తి- (సామర్థ్యాచ్ఛక్తిః సామర్థ్యముగలది గనుక శక్తి) ఇట్లు పైధాతువులనుబట్టి గూడ యీ నామములు బ్రహ్మమందే నిరూపితములై యున్నవి. అందువలన యితర దేవతలకంటె యీ పంచదేవతోపాసనము ముఖ్యమని తెలియుచున్నది. ఈ పంచ దేవతలు ప్రధానమగు శక్తియందు - అనగా శ్రీ చక్రమందు అంతర్భావము కలవియై యున్నవి. ఈ దేవతలే శరీరమందు చక్రాధిష్ఠానము గలిగియున్నారు. మూలాధారమందు గణపతియును స్వాధిష్ఠానమందు శివుడును మణిపూరమందు విష్ణువును అనాహతమందు సూర్యుడును విశుద్ధియందు శక్తియును అధిష్ఠానములై యున్నారు; వీరే ఆజ్ఞా చక్రమందు శివశక్త్యాత్మకులైయును సమిష్టి బ్రహ్మరూపముగా సహస్రార మందును ఉండుట వలన యీ పంచదేవతార్చనము సమష్టి బ్రహ్మయొక్క ఉపాసనమే అగుచున్నది. ఈ పంచ దేవతలె ప్రణవమందుగల భాగములగు అ. ఉ. మ. అర్ధమాత్ర బిందు రూపములై (అనగా అ. బ్రహ్మరూపుడగు గణపతియు, ఉ. విష్ణువును మ. రుద్రుడును అర్ధమాత్ర సూర్యరూపమును బిందు శక్తిరూపమును అయి సద్యోజాతాది పంచ బ్రహ్మరూపులై సృష్టి, స్థితి, సంహార, తిరోధాన అనుగ్రహములను పంచకృత్యములకు అధిపతులై సమిష్టి బ్రహ్మాంత ప్రణవరూపులై యున్నారు. కావున యీ పంచదేవతోపాసనము ప్రణవోపాసనమై నిర్గుణ బ్రహ్మమును పొందించునదై యున్నది. ఈ పంచదేవతలె గాయత్రికి ముఖరూపములై అవయవరూపులై గూడ నున్నారు

ప్రణవరూపమగు గాయత్రి అగ్నిదేవతాత్మకమై ముఖమందు అగ్నియు శిరోభాగమందు బ్రహ్మయు హృదయమందు విష్ణువు శిఖయందు శివుడు నేత్రములయందు సూర్యుడును గలిగి పంచభూత స్వరూపమై త్రిసంధ్యల యందును వేదత్రయమంత్రములచే స్తుతింపబడుచు పరబ్రహ్మరూపమై యలరారుచున్నది; గాన పంచదేవతోపాసనముపలన వేదమాతయగు గాయత్రిని ఉపాసించి సల్లగును. గాయత్రి అనగా "గాయన్తంత్రాయతే యస్మాత్ గాయత్రీత్యభిధీయతే" ఉపాసించిన వారిని రక్షించును (తనలో చేర్చుకొనును) గనుక గాయత్రియని చెప్పబడుచున్నది.

సకలుడగు సదాశివునియొక్క తత్త్వమునుండి అభివ్యక్తములై శివశక్త్యాత్మకములైన యిరువదినాల్గు తత్త్వములు యిరువదినాల్గు అక్షరములై అగ్ని, సూర్య, సోమ, అధిష్ఠానములగు మూడుపాదములు ఋగ్యజుస్సామ వేదరూపములై గాయత్రీ ఛందస్సుచే అచ్ఛాదింపబడి తురీయాఖ్యమగు చంద్రకళాఖండరూప శ్రీ విద్యాత్మకమగు శిరోమంత్రముతోగూడి గాయత్రీ ఉపాసనము సాధయిక ప్రతిపాదకమైననిర్గుణబ్రహ్మయొక్క సగుణోపాసనముగాని వేరుగాదు.

ఇట్లు నిర్గుణబ్రహ్మ ప్రతిపాదకమైన సగుణ బ్రహ్మోపాసనము ఐహిక సౌఖ్య ప్రతిపాదకమును నిర్గుణ బ్రహ్మను పొందించునదియును గాన సగుణోపాసనము ముఖ్యమైయున్నది. సగుణ బ్రహ్మోపాసనమును గురించి బృహన్నారదీయ పురాణమున నిట్లు చెప్పబడి యున్నది—

శివపూజాపరోవాపి విష్ణుపూజాపరోపివా ।
యత్రతిష్ఠతి తత్రైవ లక్ష్మీః సర్వాశ్చ దేవతాః ॥
మనోహరైశ్చ గంధైశ్చ పుష్పైశ్చ సుమనోహరైః
అభ్యర్చ్య విష్ణుమీశంవా తత్తత్సారూప్య తాంవ్రజేత్॥

అనుటవలన సగుణార్చనమువలన తత్తద్దేవతారూపమును తాను పొంది అభేదజ్ఞానము గలుగును; గనుక సగుణపూజ అవసరమైయున్నది. సగుణపూజయందు మూర్తికల్పనా దేవతాన్యాస జప పూజాదులు ముఖ్యములు; ఈ మూర్తికల్పనాదులు విగ్రహము, యంత్రము, కలశము, స్థండిలము, హృదయము, అగ్ని, ఉదకము, సూర్యమండలము—వీనియందు అన్నిటియందునుగూడ మంత్రశక్తివలన సంస్కరించి పూజించవచ్చును. విశేషించి నేత్రపర్వమునకై విగ్రహపూజ ముఖ్యము.

"వివిధ దేవతార్థత్వేన యేనగృహ్యతె తద్విగ్రహం" అనుటవలన సర్వదేవతలకొరకు దేనిని గ్రహింతుమో అది విగ్రహము. అట్టి విగ్రహములను నిర్మాణముచేయుటకు ముఖ్య ధాతువులు తంత్రములయందు యిట్లు చెప్పబడి యున్నవి—

శైలజా లోహజావాపి రత్నజావాఽపివాపుజా ।
మృణ్మయీచేతి పంచైతాః ప్రతిమాః పరికీర్తితాః ॥

రాయి, లోహము, రత్నము, కొయ్య, మట్టి—యీ ఐదు రకముల ధాతువులతో విగ్రహములను నిర్మించుట ముఖ్యము; వీనిలో శిలామూర్తి సర్వకోరికలను, దారుమూర్తి సర్వసుఖములను, స్వర్ణమూర్తి ముక్తిముక్తులను, రజతమూర్తి స్వర్గసుఖమును, తామ్రమూర్తి ఆయువును, కంచుమూర్తి ఆపత్తుల పోగొట్టునదియు, స్ఫటికాది రత్నమూర్తులు సర్వసుఖములను, మృణ్మయమూర్తి సర్వభోగములను యిచ్చునని తంత్రములయందు విదింపబడి యున్నది. ఇట్టి మూర్తులు శిల్పశాస్త్ర ప్రమాణమును అనుసరించి మనోహరముగా చేయబడినవై ఆచార్యప్రయుక్త మంత్రశక్తివలన చైతన్యమునుపొంది సాధకునిచే అర్చింపబడి సర్వ మనోరథములు యిచ్చునవి అయియున్నవి.

ఇట్టి మూర్తులయందు మంత్రశక్తిని సమీకరించుట శక్తిపాత మనబడును; శక్తిపాతమనగా ఆధారకుండమందు కుండలినీశక్తి కలదని పూర్వము చెప్పబడినది. ఆ కుండలినీశక్తిని ప్రాణాయామాదులద్వారా ఉత్థాపనము చేయుటయే శక్తిచాలనము. ఈ శక్తిచాలన మగునప్పుడు ఆధారాదిషట్చక్రముల నుండి వాయువుచే ప్రేరేపింప బడి ప్రాణాగ్ని సంయోగము వలన శబ్దమును పుట్టించి అక్షరాత్మకమై నాభిహృదయ కంఠ ముఖముల నుండి మాత్ర రూపమై వెలువడు చున్నది. ఇట్లు మహావేధవల్ల బయలు వెడలిన చైతన్యాత్మక శబ్దశక్తిని అచేతనమగు మూర్తులలో గల అధిష్ఠాన చైతన్యమున ప్రవేశపెట్టుటయే శక్తిపాత మనబడును. దీనిని ప్రాణప్రతిష్ఠయని చెప్పుదురు. ఆచార్యుడు మంత్రమును ఉచ్చరించుచు దక్షిణహస్తము యొక్క అంగుళ్యగ్రములచే (కుండలినీ శక్తిని చాలనము చేసి మనస్సును మంత్రమును ఏకముచేసి) మూర్తిని తాకుటయే శక్తిపాతము. ఇట్టి శక్తిసంపాతము ద్వారా మూర్తులు చేతనమును బొంది అర్చనా యోగ్యములగును. మంత్ర మనగా -

మకారం మననం చైవ త్రకారం త్రాణముచ్యతె ।
మననత్రాణధర్మత్వాన్మంత్ర మిత్యభిధీయతె ॥

ఈ మంత్రముల యొక్క పుట్టుకను గురించి శ్రుతి యీ క్రమముగా వర్ణించి యున్నది.

మం ॥ వాగ్వైపరాచ్య వ్యాకృతావదత్తె దేవా ఇంద్రమ బ్రువన్నిమాన్నోవాచం వ్యాకుర్వితి....తస్మాది యంవ్యాకృతా వాగుద్యతె ॥ యజు-కాం - 6

పూర్వము యీ వాఙ్మయ రూపమగు వేదశాస్త్రాది సకల మంత్ర సముదాయము అవ్యక్తమై పరారూపమగు శబ్దమై యుండగా దేవతలు యీ శబ్దమును వేరువేరుగా వ్యాక

రించుము అనినపుడు యింద్రుని యొద్దకు పోయి పరా రూపమగు వాక్కును వ్యాకరించుమని కోరగా యింద్రుడు దేవతలను వరమడిగెను. 'వాయువునకు నాకు కలిసి సోమ పానమును యజ్ఞముల యందు యిచ్చిన యెడల మేమిద్ద రము గూడి వాక్కులను వ్యాకరింప జేయుదు, మనిచెప్పగా అట్లెయగుగాక యని దేవతలు సమ్మతించి ఐంద్ర వాయవ పాత్రతో సోమపానమును కల్పించగా యింద్రవాయు వులు ఉభయులు యీ వాక్కులను విస్తరింపజేసిరి. (యూ.వి॥భా)

ప్రాణాది రూపమగు ఇంద్రుడు కుండలినీ రూపముతో ఆధారమందు గల అగ్నిలో ప్రవేశించి వాయువుచేత ప్రేరే పింపబడినవాడై ఆధారాదిషట్చక్రములలో సంచారము చేయుచు వర్ణాకృతిని బొంది క్రమముగా వైఖరీ రూప మగు మంత్ర జాతమును వెలువరించెను; కావున ఇంద్రవాయువులె మనన త్రాణరూపమగు మంత్రములై యున్నారు. ఈ మనన త్రాణరూపువె శివశక్తులై వాగర్థ ములై అవినాభావము గలవారై యున్నారు. ఇట్టి శివ శక్త్యాత్మక మంత్రములతో శిలాది మూర్తుల యందు శక్తి పాతము చేయగా మంత్రము మంత్రశక్తి మూర్తుల యందు సన్నిహితమై శివశక్త్యాత్మకమై అర్చనా యోగ్యమగు దేవతలై యలరారు చున్నారు. ఇట్లుప్రాణ ప్రతిష్ఠాది సంస్కారము లచే సంస్కరించి న్యాసవిశేష ములచే దేవతా రూపములను అవయవములను కల్పించి సర్వాంగ శోభితములగు మూర్తులను అర్చావిశేషములచే అర్చించ వలయును. శివార్చన యందు శ్రీ కంఠాది మాతృకన్యాసమును, విష్ణ్వర్చనయందు కేశవాదిన్యాసమును గణేశపూజ యందు శక్తిగణేశన్యాసమును సూర్యపూజయందు హంసన్యాసమును శక్తి పూజయందు మహాషోఢాన్యాస మును సామాన్యముగా సర్వదేవతా పూజలయందు అంత ర్మాతృక బహిర్మాతృక ప్రణవకళామాతృక న్యాసము లును, మరియు మూర్తి పంజరన్యాసాది న్యాసములతో దేవత్వము స్థిరముగావింప వలయును. ఇట్లు న్యాసముల ద్వారా అవయవకల్పనమును సర్వత్ర బ్రహ్మ భావనయు కలిగి సాధకునకు తనకునుమూర్తికిని అవినాభావము గలుగునని భావము. ఈ న్యాసభేదములు అర్చనా సందర్భ మున వివరింపబడును.

శివశక్త్యాత్మకమగు మాతృకలు (మంత్రములకు ప్రకృతి భూతములగు) అకారాదిహకారాంతము పంచాశద్వర్ణము లును పంచాశత్ శక్తి శివులుగా పంచాశత్ అవయవముల యందు భావనముచేయుచు స్పృశించుటయే న్యాసమన బడును. ఈ న్యాసములవలన సర్వత్ర శివశక్తులయొక్క సంయోగమగు భగవత్తత్త్వము గోచరమగుచు అవినా భావమును తెలియపరచును. మొదటి మాతృక "అ", చివరమాతృక "హ"; ఈ రెండు శివశక్తులు కలసి"అహ" బిందుయుక్తమై "అహం" అని "అహమనగా నేనని" నేనే పరిపూర్ణమగు లక్ష్య బ్రహ్మకు వాచ్యమగు అక్షర బ్రహ్మ మనియు తెలియుటకుగాను యీ సగుణోపాసనమందు న్యాసాదులు చెప్పబడియున్నవి. ఈ విధముగా న్యాసాదుల వలన సంస్కరింపబడిన దేవతకును తనకును అభేదము కలుగుటకై ఆ దేవతా మంత్రములను జపింప వల యును; అనగా ఆ కల్పితమూర్తిని తన హృదయమున భావించుచు ఎల్లప్పుడు తద్రూపమునే చింతనచేయుచు మంత్రమును ఉచ్చరించుటయే జపమనబడును—

జన్మాంతర సహస్రేషు కృతపాపప్రణాశనాత్
పరదేవ ప్రకాశాచ్చజపఇత్యభిధీయతే॥ అనేక జన్మ ములయందు తాను చేసిన పాపమును పోగొట్టి (పాపమనగా అభేదజ్ఞానము లేకపోవుట) దేవతా ప్రకాశనము కలిగించు నది (అభేదమును గుర్తించునది) గాన జపమనిగూడ చెప్పబడుచున్నది.

ఇట్లు సాధకుడు ఇష్టదేవతయొక్క మంత్రమును జపించుటకు ముందు యోగ్యుడగు గురువును విచారించి వారి సన్నిధికిచేరి క్రమముగా దీక్షనుబొంది జపించవల యును; గురువులేక పుస్తకములయందు లిఖితాదిమంత్ర ములను జపించిన సాధకుడు సత్ఫలమును పొందలేక పోవుటయేగాక దుష్ఫలితములనుగూడ పొందును—

పుస్తకాల్లిఖితో మంత్రో యేన సుందరి జప్యతె
న తస్య జాయతె సిద్ధిఃహానిరేవ పదేపదే॥ ఇతి శివోక్తిః. "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అనుటవలన సాధకుడు మంత్రదీక్షను పొందు టకు వేదవేదాంగములను తెలసి దీక్షితుడై బ్రహ్మనిష్ఠ గలిగి ఋణత్రయముక్తుడగు గురువును సమీపించి ప్రార్థించ వలయును.

(సశేషము)

# భగవదుపచారములు – తత్ప్రయోజనము

పండిత, వేదాంతం విప్రనారాయణాచార్యులు
కృష్ణాజిల్లా రెలిజియస్ ఇన్‌స్పెక్టర్, నిజాంపేట, మచిలీపట్టణము.

తాంబూలదానము యిరువదియేడవది. (ఖం॥) ఘృతాత్పరి విచక్రమ ఇతి పాండరపిప్పరీపత్రం వ్రజమస సారాంబు శుక్తిక్షారయుతం ముఖవాసం దద్యాత్. (మం॥) ఘృతాత్పరి మండఇవాప్సు స్నేహ స్సర్వాధికస్సర్వధర్తేమ శర్వః। సచేతనశ్చేతయతే స్వశక్త్యా ఏకోలోకాన్ గర్భవత్పాతుసర్వాన్। (పదం) ఘృతాత్, పరి, మండః, ఇవ, అప్సు, స్నేహః, సర్వాధికః, సర్వధర్తేము, శర్వః, సః, చేతనః, చేతయతే, స్వశక్త్యా, ఏకః, లోకాన్, గర్భవత్, పాతు, సర్వాన్, (సమన్వయము) సర్వాదికః = సర్వేభ్యో లోకధారకేభ్యో అదికతమః, శర్వః = స్థాణుః, అచలస్వభావ ఇత్యర్థః। సర్వధర్తేమ = సర్వధారేషు, లింగవ్యత్యయశ్ఛాందసః, అప్సు, ఇమాన్‌లోకాన్, చతుర్దశాత్మకాని, భువనాని, చేతనః = చైతన్యయుక్తః, స్వశక్త్యా = స్వీయబలేన, ఏకవత్ = ఏకఏవ, చేతయతే, సః = పరమాత్మానారాయణః ఘృతాత్పరి, ఘృతోర్ధ్వభాగే, నిష్పన్నః, స్నేహః = స్నిగ్ధః, మండః = రసః, గర్భః, ద్వితీయార్థే ప్రదమా. గర్భమివ, పాతు – రక్షతు, (మం॥) విచక్రమే పృధివీ మేష ఏతామ్ క్షేత్రాయ విష్ణుర్మనుషేదశస్యన్। ధృవాసో అస్యకీరయో జనాస ఉరుక్షితిగ్ం సుజనిమాచకార ॥ (పదం) విచక్రమే, పృథివీం, ఏషః, ఏతామ్, క్షేత్రాయ, విష్ణుః, మనుషే, దశస్యన్, ధృవాసః, అస్య, కీరయః, జనాసః, ఉరుక్షితిం, సుజనిం, ఆచకార, (సమస్వయము) ఏషః విష్ణుః ఏతామ్ పృధివీమ్ = పృదివ్యుపలక్షితమిదం లోకత్రయమ్, విచక్రమే = విశేషేణ పాదైరాక్రాంతవాన్, కింకుర్వన్, మనుషే = మనుష్యాణామ్, క్షేత్రాయ = నివాసార్థమ్, దశస్యన్ = ప్రదాతుమిచ్ఛన్॥ అస్యవిష్ణోః, కీరయోజనాసః = కీర్తిపరాజనాః, ధృవాసః = స్థిరాభవంతి, సవిష్ణుః పునః, సుజనిమా = శోభనేన వామనరూపేణజన్మనా యుక్తః ఉరుక్షితిమ్ = విస్తీర్ణం స్థానమ్, ప్రాణినాం నివాసాయచకార.

తాత్పర్యము : స్వేతర సమస్త వస్తువిలక్షణానంత జ్ఞానానందైక స్వరూపియైన ఏ దేవదేవు డీ సాగరజలమం దఖిల లోకములను నిలిపినవాడై చైతన్యవంతముగా చేయుచున్నాడో ఆ రమాకాంతుడే నేతిపై తేరిన రసపదార్థము అకాల గర్భరక్షణము చేయునట్లీ లోకమును రక్షించుగాక! బలి బంధనార్థమై విక్రమించిన వామనుడు లోకముల నన్నిటిని మూడడుగులలో నాక్రమించి స్వపదభక్తుల నివాసముకొరకై విస్తీర్ణమైన వానినిగాజేసెనో, అట్టి మహామహిమ వంతునకు తాంబూల దానముచేయుచున్నాము. మాచే సమర్పింపబడిన తాంబూలమును స్వీకరించి (శ్లో॥) భక్ష్య పానీయ భోజ్యానామన్యేషామపిదానతః। శ్వేతద్వీపే తత్సమీపే వసంతి సుఖినస్సదా। బహునాత్రకిముక్తేన వాసుదేవార్థ మాదరాత్। దదాతి వస్తువాసం యస్త్వాసం ప్రాప్నోతిచేప్సితమ్। కర్మణాం మార్జనాదీనాం ఫలభోగా దనంతరమ్। కర్మశేషైః పునర్జన్మ కర్మానుగుణయోనిషు। ఉత్కృష్టాస్వేవ భోక్తారోలభంతే సుఖినస్సదా॥ అనుసట్టి ఆగమశాస్త్రోదితఫలమును మా కనుగ్రహింపు మనియు భావము.

బల్యుపచారము యిరువది ఎనిమిదవది. ద్వావింశద్యజ్ఞముల కంటెను విగ్రహారాధన యజ్ఞము మానవునకు సులభతరణోపాయమని ఆగమశాస్త్ర సంహితాకారుల నిశ్చితాభిప్రాయము. కనుకనే, మరీచిమహర్షి “సమారాధనం చతుర్విధం. జపహుతార్చన ధ్యానాది భేదేన; తేష్వర్చసంసర్వార్థ సాధనం; అర్చనంనామ గృహేదేవాయతనేవా వైఖానస మార్గేణ ప్రతిమాదిషుపూజనం; తదారాధనేన సంసారార్ణవనిమగ్నోజీవాత్మా పరమాత్మానం నారాయణం పశ్యతి; సోప్యపునరావృత్తికం శాశ్వతం దివ్యలోకం ప్రాపయతి; పశ్చాత్కృతకృత్యోభవతి.” అనిచెప్పిరి. అదియును అర్చనమనియు, పూజనమనియు, శాంతికమనియు, పౌష్టికమనియు, నాల్గువిధములుగానున్నది. వీనియందు పౌష్టికార్చనము ముఖ్యమనిచెప్పిరి. బల్యంతముగా చేయబడు అర్చనమునకు పౌష్టికార్చన మనిపేరు. (శ్లో॥) నివేద్యాంతేతు దేవస్య తత్ప్రియాణాం బలించరేత్॥ ఆలయగత ప్రధాన దేవతకు హవిర్నివేదనము చేసినప్పుడు, పరిషద్దేవతలలో బలి కాంక్షులగువారికి బలి ప్రదానము చేయుట బల్యుపచారమని చెప్పబడుచున్నది. దీనినే బలిహరణమనియు, బలిప్రదానమనియు వ్యవహరించుచున్నారు. (శ్లో॥) బలం ప్రవర్ధతే యస్మాత్తస్మాద్బ లిరితిస్మృత। దేవానాంచ నృణాంచైవబలం యస్మాత్ప్ర వర్ధతే। తస్మాద్బలిప్రదానంతు సర్వలోక శుభావహమ్॥ బలిదానము బలిప్రదాతకును, బలిస్వీకారము చేసిన దేవతకునుకూడ శారీరిక, మానసిక బలముల నభివృద్ధి జెందించునని తెలియుచున్నది. (శ్లో॥) దేవానిసర్గరిపవో మనుష్యేము భవన్త్యపి। ఆరాధనేన దేవస్య చోపకుర్వన్తి మానవాన్। దేవాన్ భావయతానేనతేదేవా భావయన్తువః। పరస్పరం భావయతః శ్రేయః పరమవాప్స్యథ। ఇష్టాన్ భోగాన్ హితేదేవాదాస్యంతే

యజ్ఞభావితాః। తైర్దత్తానప్రదాయైభ్యోయోభుంక్తేస్తేనఏవ సః॥ మనుజులు దేవతాను గ్రహమును పొందుటకు దేవతారాధించవలెననియు, దేవదత్తమైన ఐశ్వర్య మనుభవించుచు, దేవతలకు భాగస్వామ్యమీయనివారు దస్యు ప్రాయులనియు, దేవతారాధనము చేయుటచే కామితార్థము లన్నియు సిద్ధించుననియు పై శ్లోకములకు తాత్పర్యము. బల్యవసానముగా చేయబడు అర్చనమునకు "పౌష్టికార్చన" మని చెప్పియుంటిమి. ఇయ్యది కాలభేదము చేతను, ప్రమాణ భేదముచేతను, మూడువిధములుగా నున్నది. (శ్లో॥) ఉత్తమంతు త్రిసంధ్యాయాం మధ్యమంతు ద్విసంధ్యకమ్। అధమంత్వేక సంధ్యాయాం బలికాలవిధిః స్మృతః॥ ఉత్తమపక్షమందు ప్రాతర్మధ్యాహ్న సాయం కాలములందును, మధ్యమ పక్షమందు ప్రాతర్మధ్యాహ్న కాలములందును, అధమపక్షమందు మధ్యాహ్న కాలమందు మాత్రమే బలిదానము చేయుట కాలభేదముచే కల్గిన పక్ష త్రయ భేదము. ఇక ప్రమాణభేదముచే కల్గిన పక్షత్రయ మెట్లన (శ్లో॥) ఉత్తమం కబళంప్రోక్తం మధ్యమం ముష్టి మాత్రకం। అధమం చాహుతిః ప్రోక్తం త్రివిధంబలి లక్షణమ్॥ ఈ పౌష్టికార్చనము చేయించుటకు ఆర్థికస్తోమతయు, అధికాధిక పూజక ప్రతినిధుల సంఖ్యయు, ఆవశ్యకములు. కాలత్రయమందును, పౌష్టికార్చనము జరిపించుటకు ఒక్కొక్క వేళయందు యిరువురు పూజక ప్రతినిధులును ఒక్కొక పూజకప్రతినిధికి హీనముగా ఒక పరిచారకుడును, ఒక పాచకుడును, నియమింపబడవలసి యుండును.

బలిద్రవ్యము 'పరివారాణాం ద్విప్రస్థైః తండులైశ్చరుం పాచయేత్' అనుటచే ప్రస్థద్వయ పరిమితమైన తండుల పాకము బలిద్రవ్యముగా నిర్ణయింపబడు చున్నది. ప్రస్థ మన అర్ధశేరనియు, సోలయనియు వ్యవహారము. బలి కాంక్షులగు పరిషద్దేవతలు షట్త్రింశత్సంఖ్యాకులుగా నున్నారు. వీరికందఱకు మధ్యమపక్షాశ్రయణము చేసి బలిదానము చేయవలెనన్న ప్రస్థద్వయ పరిమిత తండుల పాకమావశ్యకము. బల్యంతముగా నిత్యార్చనము జరుపు చున్న కొన్నిస్థానములందు ప్రస్థపరిమిత మైన ద్రవ్యమిచ్చి బాలభోగముతో కూడ సరిపెట్ట వలసినదనియు భోజ్యాసన మందలి హోమకార్య మందు పూటకు నూట ముప్పది నాలుగాహుతులు వేయవలసియుండ ఒక తులము నేతితో ఈ ఆహుతులన్నియు సరిపెట్టవలసినదనియు దేవస్థానపాలకులు చెప్పుచున్నట్లు తెలియుచున్నది. 'విత్తశాఠ్యం నకారయేత్.' విత్తానుసరణముగా వైభవము జరుపుట శాస్త్రకారుల మతము. దేవస్థానపు నికరాదాయము పదివేలకు పైబడి యున్నచో బల్యంతముగాగల పౌష్టికార్చనము జరుపుట సుశకమగును. పై నుదహరించిన లోపము లను దేవస్థానపాలకులు సుహృద్భావముతో సరిదిద్ది సర్వ లోక శుభావహమైన విగ్రహారాధనయజ్ఞమును సక్రమముగా నెరవేర్పించుటకు ఇందు మూలముగా కోరబడు చున్నారు. ఈ బలిదానము యాత్రాసనమందు చేయబడు చున్నది.

యాత్రాసనం సంకల్ప్య ధ్వజపతాకాది పరిచ్ఛదైః పరివృతం బలిబేరమగ్రే కృత్వా ప్రదక్షిణ పురస్సరం మణికాది ద్వారపాలేభ్యః శ్రీ భూతాద్యన పాయిభ్యో, దిగ్దేవతాభ్యో, విమానపాలేభ్యో, మహాభూతాంతం ప్రణవాది నమోన్తేన తత్తన్నామ్నా పూర్వముదకం, పుష్పం, బలిముదకంచ దద్యాత్। బలికాలే చత్వారఉపచారా విహితాః। తోయం పుష్పం బలిరాధాపశ్చేతి। యేభూతా ఇతి బలిపీఠస్య దక్షిణ భాగే భూతయక్ష పిశాచనాగేభ్యోబలి శేషం నిర్వపతి॥

తా॥ ధ్వజపతాకాదిపరిచ్ఛదములతో, బలిబేరమును ముందిడుకొని ప్రదక్షిణ పురస్సరముగా ప్రధానద్వార పాలకుడైన మణికుడు మొదలు ముప్పది యార్గురుదేవ తలకు వారివారి నామము ప్రణవపురస్సరము నమోంతము నగు నట్లుచ్చరించుచు, తొయము, (నిర్మ) పుష్పము, బలి, తోయము అను నాలుగు ఉపచారములతో ఉపచరించ వలసి యున్నది. బలిశేషమును, భూత, యక్ష, రాక్షస, పిశాచ నాగులను వారలకు 'యే భూతా' అను మంత్ర ముచ్చరించుచు బలిపీఠము వద్ద నుంచ వలెనని శాస్త్రాను శాసనము. (మం) యే భూతాః ప్రచరంతి దివానక్తం బలి మిచ్ఛంతో వితుదస్యప్రేష్యాః। తేభ్యోబలిం పుష్టికామోహ రామి మయి పుష్టింపుష్టిపతిర్దధాతు, (ప) యే, భూతాః, ప్రచరంతి, దివా, నక్తం, బలిం। ఇచ్ఛంతః। వితుదస్య। ప్రేష్యాః। తేభ్యః। బలిం। పుష్టికామః। హరామి। మయి। పుష్టిం। పుష్టిపతిః। దధాతు। (సమన్వయము) వితుదస్య= విశేషేణ తుదతి పాపనః ప్రాణినః పీడయతీతి వితుదః, శ్మశానవాసీ భగవాన్కాలాగ్నిరుద్రః। తస్యప్రేష్యాః=ప్రేష ణీయాః భృత్యా ఇతియావత్। యేభూతాః=గ్రహవిశేషాః। బలిం=ఆహార మిచ్ఛంతస్సంతోదివానక్తం ప్రచరంతి। తేభ్యః పుష్టికా మోహం। బలిందదామి। పుష్టిపతిః=ధన ధాన్యాది పోషకః మయి పుష్టిం=ధనధాన్యాది పోషం దధాతు=స్థాపయతు (తా) శ్మశాన వాసియైన కాలాగ్నిరుద్రు నిచే బంపబడి ఆహారార్థులై రాత్రింబవలును తిరుగాడు చున్న గ్రహవిశేషములకు పుష్టికాముడనైన నేను ఆహార మిచ్చు చున్నాను. ధనధాన్యాధి పతియైన భగవంతుడు నాయందనుగ్రహచిత్తుడై ధనధాన్యాభి వృద్ధినిచ్చుగాక! ప్రణామోపచారము ఇరువది తొమ్మిదవది. ప్రకర్షేణ నమనము (మిక్కిలి లొంగుబాటు) ప్రణామమనబడుచున్నది

(శ్లో) భగవాన్మే పరోనిత్యో మహం(ప్రత్యో వరన్సదా। ఇతి భావేనయః ప్రోక్తః నమనః కారణం హినః (తా) షడ్గుణై శ్వర్యసంపన్నుడైన సర్వేశ్వరుడు నా కన్న గొప్పవాడను భావముతో జీవి తత్పాదపంకేరుహమందు మ్రోలుట ప్రణామము. ఈ నమనము వాఙ్మనః కాయకృతమైనచో పరిపూర్ణము. పరిపూర్ణనమస్కృతితో శరణాగతుడైన జీవిని భక్తవత్సలుడైన భగవానుడు భక్తానుకంపాజనితవాత్సల్యాతి రేకముతో గభీరసంసార సాగరమునుండి దరిచేర్చి అపునరావృత్తిక శాశ్వత దివ్యలోకమును బొందించుచున్నాడు. (శ్లో) మామేవ యే(ప్రపద్యంతే మాయామేతాంతరంతితే। మత్పాదస్పర్శమాత్రైకం ప్రపద్యంతే పరాయణాః। ఉద్ధరిష్యామ్యహం దేవి సంసారా త్స్వయమేవతాన్॥ ఇత్యాది భగవద్వాక్యములలోని పరమార్థమును ఇయ్యదియే. ఈ ప్రణామము మస్తిష్కమనియు, సంపుటమనియు, ప్రహ్వాంగమనియు, పంచాంగమనియు, దండాంగమనియు ఐదు విధములుగా నున్నది. పూజావసానమందీ పంచప్రణామములను విష్ణుసూక్తముతో చేయవలసినదని శాస్త్రకారులమతము. వీని వివరము రాబోవు వ్యాసములో వివరింతుము.

---

# భారతీయ ధర్మము

"కాశ్యప"

ధర్మాయ ధర్మేశ్వరాయ ధర్మపతయే
ధర్మ సంభవాయ గోవిందాయ నమోనమః॥

ధర్మసంస్థాపన మొనరించి లోకకల్యాణము గూర్చువాడు గోవిందుడు. యుక్తాయుక్త విచారణ మొనరించి పరమార్థము సాధించువాడు మానవుడు. ఉన్నదానిని పోగొట్టుకొనక కాపాడుకొని పూర్ణప్రయోజనమందు వాడు వివేకి. క్షణభంగురమయిన పాంచభౌతికశరీరములో నిలిచియున్న జీవుడు సచ్చిదానందుడు. కూపమున బడిన పాత్రను బైకిలాగునది రజ్జుఖండము. దేహాత్మభ్రాంతిచే సంసారసాగరమున మునిగిన జీవుని ఉద్ధరించునది ధర్మము. ధర్మావతారునివలె ధర్మము అనంతము, సర్వతోముఖము, సాధనసాధ్య రూపము, అభ్యుదయ నిశ్శ్రేయసకరము, ఏకైకశరణ్యము.

ధర్మోవిశ్వస్య జగతః ప్రతిష్ఠా :—

అఖిలాండకోటి బ్రహ్మాండము లన్నియు ధర్మనిబద్ధములై సృష్టిస్థితిలయముల నందుచున్నవి. సూర్యచంద్రాదులేమి, భూరాదిలోకములేమి, కృతాది యుగములేమి, దృశ్యాదృశ్య జ్ఞాతాజ్ఞాతశక్తి సంతతులేమి—ధర్మభీతిచేతనే, స్వస్వనియత మార్గంబుల నతిక్రమింపక, పరమార్గంబుల ప్రవేశింపక, అనంతకాలమున నిరవధిక యాత్రసాగించుచున్నవి. దేశకాలాద్యన వచ్ఛిన్నమై సర్వమునకు ధారకము, పోషకమునై, సత్యమై, స్వతంత్రమై విభాసించునదియే ధర్మము.

ధారణాత్ ధర్మమిత్యాహుః ధర్మోధారయతే ప్రజాః :—

కార్యకారణ సంబంధమును సంరక్షించుచు నియతకాలమున కార్యమును కారణముతో జేర్పగలశక్తి ధర్మమునకు గల అనంతశక్తులలో నత్యుత్తమము. భ్రాంతివశమున దేహమే తానని సంసార విషచక్రమున జిక్కుకొన్న జీవుని యజ్ఞానము దొలగించి స్వస్వరూపసాక్షాత్కార పూర్వకమైన పూర్ణపురుషత్వమననగు మోక్షమును సమకూర్చునది ఆద్య పురుషార్థము.

యద్వైకించ మనురవదత్ తద్భేషజమ్ :—

ఆప్తవాక్యము ప్రమాణము. శ్రుతిస్మృతుల కన్న జీవకోటికాప్తతమములు మృగ్యములు. తనసంతతి పరిపూర్ణాభ్యుదయము నాశించి రాజర్షివరేణ్యుడయిన మనువు దివ్యతపస్సునూతగా గొని, ఆచరణయోగ్యము లయిన పెక్కు ధర్మముల నిర్దేశించెను. శ్రుతి సమ్మతమయిన మనుస్మృతి మనుజులకెల్లఱకు శిరోధార్యము, పరమలక్ష్యము.

అహింసా సత్యమస్తేయంశౌచమిన్ద్రి యనిగ్రహః
ఏతత్సామాసికం ధర్మమ్ :—

దేశకాల జాతిమతాది భేదము లెన్నియున్నను మానవమాత్రులెల్లఱు తమమానవత్వము నిలుపుకొనుటకు అలవఱచుకొనవలసిన లక్షణములు—అహింస, సత్యము, అస్తేయము, బాహ్యాభ్యంతర శౌచము, ఇన్ద్రియనిగ్రహము. ఇవియే మానవ మతములోని ప్రధానసూత్రములు, సర్వ మతసాధారణ లక్షణములు. వీని యునికి లోకములకు శ్రీ

రాహుపక్ష; వీనియభావము భూతకోటికి అకాలప్రళయము. ఇవి యెంత అపెక్షణీయములో అంత దుర్లభములు; వ్రాత కోతలలో ఎంత ధారాళముగ దొఱలునో ఆచారానుష్ఠానము లలో అంత అగోచరములగును.

అహింసాపరమో ధర్మః :—

ధర్మలక్షణము అహింస: అధర్మలక్షణము హింస: మనో వాక్కాయములలో నేయొక్కదానిచేనైన ఏభూతమునకైన హానికలిగించుట హింస. హింస కూడదని యెలుగెత్తి చాటుట సులభము. త్రికరణ శుద్ధిగ అహింసనుపాటించుట ఊహాతీతమని విషయము. తానువేరు, లోకమువేరు, తనసుఖోప భోగముల కొఱకే సృష్టియంతయు నేర్పడి యున్నదని నిశ్చయించు కొన్న ఆత్మద్రోహికి అహింసాప్రసంగము కర్ణ కఠోరము, ఉన్మత్తప్రలాపము, అగ్రాహ్యము.

సర్వంఖల్విదంబ్రహ్మ - బ్రహ్మాహమస్మి :—

పరిదృశ్యమానమైన సకలప్రపంచమునకు నధిష్ఠానమగు బ్రహ్మమునేనే. నా అంతర్భాగములే ఈ చరాచర భూత రాసులు:-అని నిస్సందేహముగ ముక్తకంఠముతో ఘోషింప జాలినవాడు భారతీయ విజ్ఞానియొక్కడే. తత్వరహస్యము లను జీర్ణించుకొన్న తపస్విద్ధునకు అహింస అక్షరశః ఆచరణసాధ్యమే యగును. కాని ఆ యసిధారావ్రతము నాచరింపగలిగిన సమర్థులేరీ! నక్షత్రములను గుఱిగా బెట్టుకొన్న విలుకాడు వానిని గొట్టలేక పోయినను, బహు దూరస్థలక్ష్యములను సాధింపగలడు. సర్వాత్మత్వమును సిద్ధాంతరీతిగనైన అవగాహనము చేసికొని పరహింసా పరాయణమయిన ఆధునిక నిరంకుశ వీరలోకమునకు హితోపదేశము చేయగలవారు భారతీయులొక్కరే.

స్వయంతీర్ణః పరాన్ తారయేత్ :—

ఉపదేశ గ్రహణమునకు యోగ్యతగలవారు బాలికా బాలకులు మాత్రమే. ప్రౌఢవయస్కుల పట్ల నీయోగ్యత సందేహాస్పదము. నిష్కలంక హృదయులగు భారతీయ బాలికా బాలకులకీ దివ్యసందేశము నందజేయ వలసిన బాధ్యత ప్రస్తుతము ప్రభుత్వము మీదను విజ్ఞలోకము పైనను గలదనుట సాహసముగా నేరదు. అణుశస్త్రాస్త్ర మారణ హోమము నాపగల సమర్థుడు తపోనిష్ఠాగరిష్ఠుడైన తత్త్వవేత్తయొకడే.

ధిగ్బలం క్షత్రియ బలమ్!

ఏకేనబ్రహ్మదండేన సర్వాస్త్రాణిహతానివై :—

భౌతిక బలములనుకొండలను పిండి గొట్టగల శక్తి తపో బలమను వజ్రాయుధమునకు మాత్రమేగలదు. స్వార్థము కొఱకుగాక లోకసంగ్రహము కొఱకు జీవితక్లేశము సహించు తపోధనుల యుపదేశములను త్రోసిరాజనిననాడు సంభ వించు ఫలములు కరతలామలకములు.

అద్రోహేణైవ భూతానాం - అల్పద్రోహేణవాపునః
యావృత్తిః తాంసమాస్థాయ విప్రోజీవేదనాపది ॥

యథార్థదర్శనులు కరుణాసముద్రులునగు మహర్షులు కలియుగ ప్రభావమును, మానవుల దౌర్బల్యమును గమ నించి సులభతరమార్గమును నిరూపించిరి, భూతములయెడ నెట్టిద్రోహమును తలపెట్టకుండుట సర్వోత్తమము. అది సాధ్యముగానినాడు అల్పతమమగు హింసను మాత్రమే యాశించు వృత్తి నవలంబించుట మధ్యమము. ఆపద్ధర్మ ములు ఆపత్కాలమునకు మాత్రమె పరిమితములు. హింసకొఱకు హింసగావించుట అధమాధమము - అసుర లక్షణము. తన్నుదాను హింసించుకొను వెఱ్ఱివాడులేడు. సర్వాత్మత్వము నంగీకరించిన ప్రాజ్ఞుడు కేవల వినోదము కొఱకు హింసకు బూనుకొనడు.

ఆత్మవత్సర్వ భూతాని :—

తన ప్రతిరూపములగు జీవములను హింసింప కుండుటయే గాక, వానినన్నిటిని బరమాదరముతో జూడ గలిగిననాడే మానవుని అహింసావ్రతము పరిపూర్ణము కాగలదు. క్రూరా క్రూర సత్వసంకులముగదా జంతు సంతానము! గోవ్యా ఘ్రాదులపట్ల సమవృత్తియెట్లు పొసగునని సందియము గలుగుట సహజము.

అహింసాప్రతిష్ఠాయాం వైరత్యాగః :—

అహింసా పరాయణులయిన మునివరేణ్యుల తపోవనముల బ్రవేశించినంతమాత్రమున సింహాది హింస్రజంతువులు తమతమ నైసర్గిక క్రూర స్వభావములు విడనాడి సాధు త్వమవలంబించుట పూర్వయుగము లందేకాక వర్తమాన కాలమునగూడ గనివిని యానందింప దగిన పరమాశ్చ ర్యము. సూర్యోదయమయిన తమః ప్రచారమడగును అహింస రూఢమైన వైరమంతరించును. జ్యోతిస్తమస్సులకు వలె అహింసావైరములకు ఏకస్థితి ఘటింపదు. ఈ నాడు వక్తల జిహ్వాగ్రములను లేఖకుల లేఖినీ ముఖములను విశృంఖల విహారమొనరించుచు ఎల్లదిశల మాఱు మ్రోగు అహింసారావములు శబ్దఘోషామాత్రములే యగునా? 'ఫలాను మేయాః ప్రారంభాః'—ఫలముల ననుసరించిగదా ప్రయత్నసాధన సామర్థ్యము గుర్తింప వలసినది. ఆదిత్య ప్రకాశమఖిల లోకముల నుద్దీపింప జేయును. గృహదీప కళిక గృహాంతర్భాగమును బ్రకాశింప జేయును. ఆదిత్యాభావమున దీపకళికయే ఆశాలేశము. అఖండా హింస అఖండ శాంతిని నెలకొల్పును. ఖండాహింసయు ఖండ శాంతిని చేకూర్చకపోదు. ఉన్నదాని నుపయోగించుకొని లేనిదానికై ప్రయత్నించుట వివేకి లక్షణము.

కాయిక వాచికహింస వలన ప్రమాదము శీఘ్రముగ సంభవించును. మానసిక హింసవలన నపకారము వెను

వెంటనే సంభవింపదు. అముష్మిక సుఖము కొఱకే అహింస నిర్దేశింపబడినదనువారు సత్యేతరమునే ప్రకటించుచున్నారు. హింసాపరుల ఐహిక సుఖాభ్యున్నతులు బుద్బుదప్రాయములు, అనిశ్చితములు, భయాక్రాంతములు. సాంఘిక దైనందిన సుఖ జీవిత వ్యవహారములకు హింస ప్రతిబంధకము, అహింస సాధకము. తోడివారియెడ ద్రోహము తలపెట్టు వాని మానవుడనుటకన్న దానవుడనుట సమంజసము- దానవ మానవుల వ్యత్యాసము నిరూపించునవి హింసాహింసలు; దానవులు మానవుల యెడల నెటుల ప్రవర్తించినను, తోడిదానవులపట్ల మైత్రినే పాటింతురు. మానవధర్మములలో అహింస అగ్రగణ్యము. అన్యధర్మము లన్నియు తదాశ్రితములే.

బ్రాహ్మణస్యతు దేహోయం క్షుద్రకామాయ నేష్యతే।
ఇహ కృచ్ఛ్రాయతపసే ప్రేత్యానంత సుఖాయచ ॥

ధర్మాచరణము కడుక్లేశావహము. అనంత పుణ్యపణ్యము వెచ్చించి చేకొన్న ఉత్తమ మానవ శరీరమును క్షుద్ర కామోపభోగములకొఱకే వ్యయము గావించుట సకలాశా పరిపూర్తి గావింపగల కల్పవృక్షమును బొగ్గుల కొఱకు దగులబెట్టుట వంటిదియేయగును. ధర్మానుష్ఠాన కాలమున సహించు క్లేశము తపస్సు. పరోపకారము నెంచి స్వార్థమును కొంతకుగాను కొంత త్యాగమొనరించి దానగలుగు మనః శరీరాయాసమును సహించుట తపమే యగును. అట్టి తపము గావించుటకే ఈ తనువేర్పడినది. పరోపకారము చేయుపట్ల బాహ్యధనసౌఖ్యాదులు కొంత తఱిగిపోయి నటులగుపడినను, అనివార్యముగ లభించు మనస్సంతృప్తి, సాత్వికానందము, మానవ జీవితమునకే చరితార్థత కూర్పగలవు. అహింసాతపశ్చర్యలు పరస్పరాశ్రితములు, ఏకాత్మత్వనిరూపకములు, శాశ్వత బ్రహ్మ నిర్వాణసంధాయకములు.

యోవైస ధర్మః సత్యంవై। తస్మాత్ సత్యంవద న్తమాహుః
ధర్మంవదతి ఇతి। ధర్మంవావద న్తం సత్యంవదతి ఇతి।
ఏతద్ధ్యేవైతదుభయం భవతి ॥

ధర్మమే సత్యము. సత్యమే ధర్మము. సత్యము విశ్వాసమును గూర్చును. అసత్యము అవిశ్వాసమును బుట్టించును. పరస్పర విశ్వాసము లేనినాడు లోక వ్యవహారము స్తంభించి పోవును. లోక వ్యవహారమునకు సత్యము మూలాధారము. సత్యప్రవచనము సచ్చిదానందమూర్తికి ప్రతీకమయిన మానవునకు భూషణము. సత్యము వ్రతముగ స్వీకరించినచో మానవుడెన్ని యిక్కట్టులకు లోనుగావలెనో హరిశ్చంద్రుని చరిత్ర యుగయుగములకు చాటుచునే యున్నది. సత్యవాక్పరిపాలనము వలన పెక్కు కష్టములు గలిగినను ఆ కష్టముల నన్నిటిని సహింపగల శాశ్వత సుఖము లభించితీరును.

సత్యంబ్రూయాత్ ప్రియం బ్రూయాత్। నబ్రూయాత్ సత్యమప్రియమ్।
ప్రియంచనానృతం బ్రూయాత్—ఏష ధర్మః సనాతనః॥

సత్యము చెప్పవలయును. ప్రియము చెప్పవలెను. అప్రియమైన సత్యము చెప్పరాదు. అసత్యమయిన ప్రియమును దెలుపరాదు. ఇది సనాతన ధర్మము. దేశకాలాదులచే మార్పు చెందని ధర్మము సనాతన ధర్మము.

సత్యంతపః :—

అనుద్వేగకరంవాక్యం సత్యం ప్రియహితంచయత్।
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయంతప ఉచ్యతే॥

సత్యాహింసలకవినాభావము పొడగట్టుచున్నది. సత్యము తపస్సు, అహింసతపస్సు. సత్యాహింసలయొక్క సంయోగము భాగ్యరాజ్యాధి పతుల సమావేశమువలె అఖండ రాజయోగమును ఘటించును. ఐహిక భోగమేకాదు; తపోయోగముచే సచ్చిదానందము సమకూరును. నామరూపగుణాత్మకమగు ఈ దృశ్యప్రపంచము సమస్తము, అస్థిరమగుటచే అసత్యము, అనిత్యము.

అపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానంద తత్పరః
సమాధిం సర్వదాకుర్యాత్ :—

అసత్యములైన నామరూపముల కతీతమై సచ్చిదానంద ఘనమై యున్న వస్తువే ముముక్షువులకుపాస్యము. దేహాది భౌతిక వికృతులన్నియు అనిత్యములు. ఆత్మయొక్కటియే నిత్యము.

నిత్యానిత్య వివేకము సర్వథా సంపాద్యము.

ఆత్మావా అరే! ద్రష్టవ్యః శ్రోతవ్యోమన్తవ్యో నిదిధ్యాసితవ్యః

శ్రవణమనన నిదిధ్యాసలకు, దర్శనానుభవములకు లక్ష్యముగాదగినది ఆత్మ. సత్యాన్వేషణమే ఆత్మాన్వేషణము. 'శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్' ధర్మసాధనములలో మనోవాక్కాయ రూపమయిన శరీర ముత్తమము. ధర్మమే సత్యము. సత్యమే ఆత్మ. ఆత్మాన్వేషణమునకు, ఆత్మానుభూతికి మనోవాక్కాయములు వినియోగింపదగినవి. ఈ శరీరమును ప్రసాదించిన పరమేశ్వరుని యుద్దేశమదియే. తన్ను దానెఱిగినవాడు దైవమేకదా!

ఓం తత్సత్.

(సశేషము)

# భ్రమర సంగ్రహము

'ఫణీంద్ర'

[తల్లి తొట్టి ఊచుచు జోల పాడుచుండును.]

తల్లి: జో! సచ్చిదానంద, జో, జో, ముకుంద!
లాలి, పరమానంద, రామగోవిందా! జో! జో!

కుమారి:-అమ్మా చూడు! వీడు.

తల్లి:-భగవంతుడా! ఒక్క క్షణమైనా ఈ ప్రాణికి విశ్రాంతి లేదు గదా! ఈ దేవుడు సరిగా కన్నుమూశాడోలేడో, ఆదేవత గీత గోవిందం మొదలుపెట్టింది. ఇంతకీ పిల్లలులేనివాళ్లే అదృష్టవంతులేమో!

కుమారి:- అమ్మా! నేను తాతయ్యదగ్గిరనుంచి తెచ్చు కున్న బొమ్మల పుస్తకం లాక్కున్నాడే. ఇప్పించవూ:

తల్లి:-అరే! నాయనా! దానిపుస్తకము ఎందుకు లాక్కున్నావురా! అది దానికిచ్చేయి.

కుమారుడు:- (పుస్తకము ఇటుఅటు తిరుగవైచి) ఛీ! ఏమి బాగుండలేదు. ఒక్క కథైనాలేదు. ఒక్క సినిమా బొమ్మైనాలేదు. నాకక్కరల్లేదు లే (పుస్తకము విసరి పాఱవైచును.)

కుమారి:- (పుస్తకము తెచ్చికొని) అమ్మా! చూశావా! నా పుస్తకం ఎట్లా నలిపి పారేశాడే.

తల్లి:- ఏ పుస్తకం తల్లి!

కుమారి:- ఏమో నాకేం తెలుసు. బొమ్మలుంటే చూస్తున్నా.

తల్లి:-మొదటిపెజీమీద పేరుంటుంది. చదువు చూద్దాం.

కుమారి:-ఓ బొమ్మ ఉంది. పైన ఏవో అక్షరాలు ఉన్నాయి. మఱి అవి నాకు తెలియవుగా.

తల్లి:-తరువాత పేజీల్లో చూడు తల్లి!

కుమారి:- రెండోపేజీలో, మూడోపేజీలో, ఏవో పిచ్చి గీతలులాగున్నాయి. నాలుగో పెజీలో కొన్ని తెలుగు అక్షరాలు ఉన్నాయి.

తల్లి:-అక్షరాలు నీకు వచ్చుగా. చదువు వింటాను నా చిట్టి తల్లీ!

కుమారి:-అ-రా-ధ-న అరాధన అంటే ఏమిటే అమ్మా!

తల్లి:-ఆ పుస్తకం ఇట్లాతే చూసిచెప్తాను (పుస్తకము తీసికొని తిరుగవైచి) ఆరాధన అంటేనా-పూజ, తల్లీ! నాయనా! ఇలారా ఈ పుస్తకమిట్లా నలిపి పారేశావే, తప్పుకదూ!

కుమారి:-అమ్మా! తప్పుచేస్తే దేవుడు ముక్కుకోశేయట్టే.

కుమారుడు:-దేవుడూ లేడు గీవుడూ లేడు.

తల్లి:-బాబూ! అట్లా అనకురా. పాపం వస్తుంది, చెంపలు వేసుకో.

కుమారి:-అమ్మా! దేవుడు ఎక్కడ ఉంటాడే!

తల్లి:-దేవాలయంలో ఉంటాడు తల్లీ!

కుమారుడు: వట్టి అబద్ధం. చెల్లాయి! అమ్మ మాట నమ్మొద్దు. మా బళ్లోకి వెళ్లే దోవలో ఓ దేవాలయం ఉంది. రోజూ నే అట్టా వెళ్తూ ఉంటానా, ఉంటే ఒక్కనాడైనా కనపడ్డూ?

తల్లి:-అరే అబ్బాయియా! దేవుడు దేవాలయంలో ఉంటాడు గాని, బయట ఉంటాడురా.

కుమారుడు:- అమ్మా! లోపల ఎవరైనా ఉంటే వాకిలి తలుపు తాళం పెడ్తారా! కుక్కలూ గాడిదలు పడుకొని యుంటాయా!

తల్లి:-పూజారి మఠో ఊరినుంచి రావాలిరా! కొంచెము పొద్దెక్కివచ్చి పూజా అదీచేసి మళ్లీ తలుపువేసి వెడతాడు.

కుమారి:-దేవుడికి అమ్మా నాన్నా ఉన్నారుటే! ఎక్కడ ఉన్నారే అమ్మా!

తల్లి:-అందఱికీ తల్లీ దండ్రీ అయనే. ఆయనికి మాత్రం తల్లీ దండ్రీ లేరు.

కుమారి:-అయితే దేవుడికి అన్నము ఎవరు పెడతారే!

తల్లి:-మన అందఱికీ అన్నము దేవుడు పెడతాడు, కాని ఆయనకు అన్నం అక్కర్లేదు.

కుమారి:-అయితే దేవుడికి ఆకలేస్తోందేమో! పాపం మనయింటికి తీసికొచ్చి అన్నం పెడదామా?

కుమారుడు:- చెల్లాయీ! అమ్మచెప్పేదంతా అబద్ధం. నేను చెప్పిందే నిజం. అసలు దేవుడంటూలేడు. ఎందుకంటావా? మనకు అమ్మఉందా, నాన్నఉన్నాడా, అట్టాగే, దేవుడుంటే దేవుడికీ అమ్మా నాన్నా ఉండొద్దూ? పొద్దున్నే చద్దన్నము తిని బళ్లోకి వెళ్తానా, మళ్లీ వచ్చేటప్పటికి, ఆకలి మండిపోతూంటుంది గదా నాకు, మఱి ఆ దేవుడు అసలు అన్నం తినకుండా ఉంటే ఆకలివేయదటే? చెల్లాయీ నువ్వుచెప్పు. కాబట్టి దేవుడు ఎక్కడాలేడు అంటాను.

కుమారి: అవును అన్నయ్యా! నువ్వు చెప్పేదే నిజంలా కనబడుతోంది. అమ్మా! అన్నయ్య చెప్పింది నిజంకాదూ!

తల్లి:-(తనలో పిచ్చిపిల్లలు. ఎవరేదిచెప్తే అది నమ్ముతారు. చిన్ననాడు ఏర్పడ్డ భావాలు పెద్దవాళ్లైన తర్వాత కూడా పాదుకొనిపోయి వెఱ్ఱితలలు వేస్తాయి. మొక్కై వంగనిది మానై వంగుతుందా! (కోపమునభినయించుచు) ఛీ! పశువా! బళ్లోకివెళ్లి నేర్చుకు వచ్చేది ఇదేనా? ఇదంత రాక్షస సంప్రదాయంగా ఉంది. మళ్లా అల్లా 'దేవుడు లేడ

అన్నావా' అంటే చూడు ఏంచేస్తానో! వీపు విమానం మోతెత్తిస్తా.

కుమారుడు :-కొడితే నెప్పెక్కి ఏడిస్తే ఏడుస్తానేమోకాని లేనిదేవుడు ఉన్నాడని చచ్చినా అనను.

తల్లి :-వట్టి మొండివాడవై పోతున్నావురా. ఉండు నీ పెళ్లిచేస్తా (కొట్టబోవును.)

కుమారి :- అమ్మా! అన్నయ్యను కొట్టకే. కొడితే ఏడ వట్టే. అన్నయ్య ఏడిస్తే నాకూ ఏడుపువస్తుందే.

కుమారుడు :-నాన్నా! చూడు అమ్మ నన్ను చంపేస్తోంది.

(తండ్రి ప్రవేశించును)

తండ్రి :-ఏమిటీ గందఱగోళం అంతా. కాళరాత్రివి అయి పోయినావేం!

తల్లి:-గందఱగోళం ఏమిటి! చచ్చిపోతూంటే! కాళరాత్రిని కానూ? నేను కనుకనే సరిపోతుంది. జానెడు లేడు ఈ కుఱ్ఱ కుంక. చిన్నాపెద్దాలేదు, మాటకుమాట ఎదిరిస్తాడు, దేవుడు లేడంటాడు. అ పాడు బళ్లోకి వద్దంటే పంపిస్తారు. అభం శుభం తెలియని పసివాణ్ణి అంటే లాభం ఏమిటి?

తండ్రి :-అయితే ఎవరిని అనాలంటావు? నాయనా! ఏమిటిరా! ఈ అల్లరి.

కుమారుడు :- ఏంలేదు నాన్నా! అమ్మేమో, గుళ్లో దేవుడున్నాడంది. నేనేమో, నా కెప్పుడూ కనపడలేదు-అందుచేత లేడన్నా. అంటె కొడుతోంది చూడు.

తండ్రి :-అయితే మి బళ్లో దేవుడు లేడని చెప్పలేదన్న మాట.

కుమారుడు :- మరే! మా మాస్టారు, జేపటికి దేవుడు పాఠం ఇంటిదగ్గిఱ చదువుకురమ్మన్నారు. ఆ పాఠంలో—

తండ్రి :-ఆ పాఠంలో ఏముందిరా చదువు.

కుమారుడు :—(తడువుకుంటూ పాఠం చదివి) దేవుడు ఎక్కడా లేడు. (అని పూర్తిచేయును).

తండ్రి :- (పుస్తకముతీసి చూచి) కడపటి వాక్యము చూపిస్తూ - కుమారీ నీవు ఇది చదువమ్మా!

కుమారి :- (కూడబలుకుకుంటూ) దే-వు-డు - దేవుడు - ఎ-క్క-డ - ఎక్కడ లె-ఏ-డు - లేడు (అని చదువును.)

తండ్రి :-అబ్బాయీ! నీవు చదవరా.

కుమారుడు :-దేవుడు ఎక్కడా లేడు (అని తొందఱగా ధీమాతో చదువును.)

తండ్రి :- అరే! మూర్ఖుడా. 'ఎక్కడ' అన్నమాటలో-'డ' మీద దీర్ఘం ఉందిరా! వొళ్లు దగ్గిఱపెట్టుకొని చూచి చదువు.

కుమారుడు :- (మఱలచూచి) భయముతో, లేదు అని చెప్పును.)

కుమారి:-నేను చదివింది రైటుగాదు నాన్నా? అన్నయ్య చదివింది తప్పుగాదూ? అన్నయ్య వట్టి మొద్దు.

తండ్రి :-వట్టిమొద్దు కాదు. మట్టిముద్ద.

తల్లి :-మట్టిముద్దగాదు. మొండిఘటం. అయితే చూడండీ! పసిబిడ్డల పుస్తకాల్లో, ఈ అపార్థాలు వచ్చే వాక్యాలు ఎందు కండీ! అ వ్రాసేదేమో సరిగా తేలికగా అర్థమయేటట్లు వ్రాయరాదండీ?

(కుమారుడు ముఖము చిన్నబుచ్చుకొనును. కుమారి అన్నను జూచి జాలి గొని)

కుమారి :- రారా అన్నయ్యా! మన కెందుకీ గొడవ. మనం పోయి ఆడుకుందాంరా! (అని లాక్కొనిపోవును)

తండ్రి :-వ్రాయకేం సరిగానే వ్రాశారు. మన ప్రబుద్ధుడు హ్రస్వాన్ని సాగదీసి దీర్ఘంచేశాడు.

తల్లి :-దీర్ఘంచేస్తే? (ప్రశ్నార్థకంగా చూచును.)

తండ్రి:-సాగతీసి, 'ఎక్కడాలేడు,' అని చదివితే. అసలు లేనేలేడని అర్థంవస్తుంది. 'ఎక్కడలేడు' అని ప్రశ్నార్థకంగా చదివితే అన్నిచోట్లా ఉన్నాడని అర్థం వస్తుంది. అతి తెలి వికిపోయి స్వంతంగా చదవటం మొదలు పెడితే, ఇలాగే అపశబ్దాలు, అపార్థాలు, అపస్వరాలు, అనర్థాలు కలుగు తాయి.

తల్లి :- సమర్థుడయిన గురువువద్ద నేర్చుకొన్న విద్య ఫలించినట్లు గురువులేని విద్యఫలించదండీ! చూడండీ, పాఠ శాలల్లో, మనమతం, మనధర్మం, మన సంప్రదాయాలు, మంచిచెడ్డలు గురించి బోధించటం మంచిదికాదండీ?

తండ్రి :-కాదని ఎవరంటారు? కాలం దానికి అనుకూ లంగా ఉన్నట్టే కనపడుతోంది. ప్రయత్నాలుకూడా జరుగు తున్నాయి. త్వరలో అలాటి ఏర్పాట్లు జరిగితే జరగవచ్చు.

తల్లి :-రాజు తలచుకొంటే దెబ్బలకు కొదవా! అట్లే జరిగితే, పిల్లలైనా బాగుపడతారు: సరేగానీండీ మన గుళ్లో ఉత్సవాలు ఎప్పటినుంచీ మొదలండీ?

తండ్రి : జేపు దశమినుంచి ప్రారంభమట.

తల్లి : పిల్లలని తీసుకొని మనం ఉత్సవం నాడైనా గుళ్లోకి వెళ్లాలండి.

తండ్రి :-అట్టాగే వెళ్లాలంటే వెళ్లవచ్చు; (అని వెడలి పోవును.)

తల్లి : అరేయి పిల్లల్లారా! అన్నానికి రండిరా!

కుమారి :-(పరుగెత్తుకొని వచ్చి) అమ్మా! ఆకలివేస్తోంది అన్నం పెట్టవే.

తల్లి :- చిట్టితల్లీ! అన్నయ్యఏడే! అరేయి అబ్బాయీ! అన్నానికి రారా, త్వరగా, రా, నీకో మంచిమాట చెప్తాగా!

కుమారుడు :- ఊఁ, నేను రాను. నన్ను అందఱూ కొడ్తారు. తిడ్తారు గా!

తల్లి : నాన్నా! నిన్ను ఎవరు కొడతారు? ఎవరు తిడ తారు? నీ తెలివితక్కువ తన్నాని నీ మొండి తనాన్ని తిడ తారుగానీ. అవసరమయితే కొట్టనుగూడా కొడతారు.

కుమారుడు: అయితే నన్ను గాదన్నమాట తిట్టింది. నిజంగా!

తల్లి :-నిజంగా నిన్నుగాదురా! నా తండ్రివిగాదురా! నీవు.

కుమారి :-అమ్మా! అన్నయ్యెకో మంచిమాట చెప్తా నన్నావుగా! అది నాకుకూడా చెప్పవా!

తల్లి :-చెప్దామనే ఎలిచా. రేపు మనగుళ్లో ఉత్సవం జరుగుతుందట. నువ్వు, అన్నయ్యా, నాన్న, నేను—మన మంతా వెళదాం.

కుమారి :—మరీ మన తమ్ముడో!

తల్లి :-తమ్ముడు గూడాను.

కుమారుడు :- దే వా ల యం అంతా అ స హ్యం గా ఉంటుంది. నేను రాను.

కుమారి :-ఉత్సవం అంటే ఏంచేస్తారే అమ్మా!

తల్లి :-ఏంచేస్తారా? దేవాలయం అంతా—ముందూ, వెనకా, అటూ, ఇటూ, లోపలా, బైటా, బాగుచేస్తారు. పందిళ్లువేస్తారు, తోరణాలు కడ్తారు. సున్నాలు కొడ్తారు జేగుర్లుపెడ్తారు, పసుపుకుంకాలు, ముగ్గులూ దిద్దుతారు. అలంకారాలుచేస్తారు. ఊళ్లోజనం అంతా పోగవుతారు. బాజాలు వాయిస్తూ దేవుణ్ణి ఊరేగిస్తారు. పాటలు పాడ తారు. హరికథలు చెప్తారు. తియ్యగా కమ్మగా ఉండే ప్రసాదాలుగూడా పెడ్తారు.

కుమారి :-అమ్మయ్యో : చాలా హడావిడి జరుగుతుం దన్నమాట. అమ్మా! నాకేం బాజాలు వాయిస్తూ ఉంటే, పాటలు పాడుతూఉంటే, బలే సర్దాగా, సంతోసంగా ఉంటుందే! తప్పకుండా వెళ్దామే!

కుమారుడు :-అంత గందరగోళం జరుగుతూంటే, ప్రసా దాలు పెడుతూంటే మాబళ్లో పిల్లలందరూ అక్కడికే చేరు తారు. ప్రసాదాలు తింటూ వాళ్లతొ చక్కగా ఆడుకోవచ్చు. అమ్మా! అయితే నేనుగూడా వస్తానే.

తల్లి :-ఎందుకో అందుకు అందరూ చేరితేనే ఉత్సవం. దేవుడి పెళ్లికి అందరూ పెద్దలేగా; రండి, తమ్ముడు నిద్ర లేవకముందు అ న్నం పె డ్తా ను తినండి. (గోవిందా! సుందరా, మోహనా, దీనమందారా, గరుడవాహనా!) అని పాడుకొంటూ తల్లి లోపలికిపోవును. పిల్లలు తల్లివెంట బోవుదురు.)

---

# దర్శన వీధి

జమ్ములమడక మాధవరామశర్మ.

అధ్యాత్మవిద్య, బ్రహ్మవిద్య, వేదాంతము, తత్వశాస్త్రము, దర్శనము మొదలగు వానిని సమానార్థములుగనే భావించి భారతీయులు బాగుగా పరిశీలనము చేసినారు. వీనిని మీమాంసాపదమున వ్యవహరింప వచ్చుననియు పెద్దలనిరి. ధర్మ బ్రహ్మవాదములను వెలయింప జేసిన భారతీయుల వేదరాశి మనకొక నిశ్చయమిచ్చు చున్నది. వేదము కర్మ జ్ఞానముల బోధించునని ప్రవృత్తి నివృత్తిమార్గముల సూచించునని ప్రేయశ్శ్రేయస్సుల నిచ్చునని చిరకాలము నుండి మనము సంభావించుచునె యున్నాము. పేర్లు పెట్టుటలో వైచిత్ర్యముండుగావుత! అందలి విషయము సామాన్యముగా నొకవిధముననె యుండును. నిరూపణ విధానము మాత్రము వేరువేరుగా నుండును.

నేటి భారతలోకము జ్ఞానమార్గమున సంచరింప వలెనని యజ్ఞాతముగ నాసక్తమగు చున్నది. తదుపాయముల నన్వేషించు చున్నది. అన్వేషించుటలో నవకాలమున నొకక్రొత్తరీతియు నున్నది. నేడుగోచరమగు నీ ప్రపంచ మున రూపభేదములతో నున్నను దాదాపు రెండు వందల దర్శన వాదములున్నవి. వీనిలో నింకనవాంతరసంప్రదా యములనేకము లున్నవి. ఈ దర్శనవాదు లందరు తత్వా న్వేషణమె ముఖ్యమని భావింతురు. సకలవాదముల సమన్వయముతో నొకవిశిష్ట సంప్రదాయము నా విష్కరింప జేయుటకు తత్వచింతకు లాలోచించు చున్నారు. వారి యాలోచన మింకను ప్రథమావస్థలో నున్నది. చిరకాలము క్రిందటనె దర్శన వాదములను క్రోడీకరించుటకు యత్నించిన భారతదేశమిక జాగ్రుతి వహింపవలెను. ఇది సమయము. దేశవిదేశములకు ఖండఖండాంతరములకు దర్శన భిక్ష ప్రసాదించిన భారతదేశమున నున్న బహు దర్శన వాదములలో శాస్త్రీయ మార్గమున నున్న దర్శనము లను ప్రపంచచింతకులందరును గౌరవభావమున పరి శీలించు చున్నారు. సంస్కృత విరాగములేని మేధావులు మరల దర్శనములను సమీక్షింప వలసియున్నది. మనము దర్శనములను చక్కగ గుర్తించి ప్రసరింప చేయవలెను.

నవమానవత్వము నిర్మింప వలెను. కేవలమైహికము, కేవల శూన్య విరాగము లోకమును బాగుపఱుచ దని యందఱు గుర్తించుచున్నారు. ప్రేయస్సు ఇహలోకమునకు సంబంధించినది. శ్రేయస్సు పారమార్థికము భారతీయులు ప్రేయస్సును శ్రేయస్సును సమ్యక్ ఆరాధించిన యాదర్శ జీవులు. నవభారతదేశము నవమానవతాసిద్ధికి దర్శనసిద్ధిని కాంక్షించుగావుత! భారతీయులు ముందుగ భారతీయ దర్శనములను బాగుగ గుర్తించిన భారతీయుల భారతీయతను రక్షింప గలరు. మానవత్వమును సఫలము చేయ గలరు.

“దృశ్యతే అనేన ఇతి దర్శనం” దీనిచే దర్శింపబడును గావున దర్శనమగునని దర్శనపదవ్యుత్పత్తి. దీనిచే సత్యతత్త్వమును మనము దర్శింతుము. మనమెవరము? ఎచట నుండి వచ్చితిమి? ఎట్లువచ్చితిమి? ఈ కన్పడు జగమేమి? ఎట్లుత్పన్నమయినది? దీని సృజించినది యెవరు? సృష్టికారణము చేతనమా? అచేతనమా? మన సాధనమేమి? సాధ్యమేమి? మొదలగు ప్రశ్నల కన్నిటికి చక్కని సమాధానముల నిచ్చి దర్శనము సార్థకమగును. దర్శనమును శాస్త్రమన వచ్చును. శాస్త్రమెట్టిది? శాసనము చేయునది శాస్త్రము. ఇట్టిది మనయాచారవ్యవహారములను శాసనము చేయును. ధర్మశాస్త్ర మిట్టి శాస్త్రము. శంసనము చేయునదియు శాస్త్రము. ఇట్టిది మనకు వస్తుసత్య స్వభావమును చెప్పును. దర్శన మిట్టి శాస్త్రము. శంసక శాస్త్రము జ్ఞానపరము.

“శంసనం భూతవస్త్వేకవిషయం”

సిద్ధవస్తు తంత్రముగా నుండు శాస్త్రము దర్శనము. దర్శన మెన్నడు మానవ పరతంత్రముకాదు. సిద్ధవస్తువు నాలోచింతుము. విచారణ సల్పుదుము. అందుననె దర్శనమును “మీమాంస” యని భారతీయులు భావించుచున్నారు. పాశ్చాత్యపరిశీలకులు “ఫిలాసఫీ” పదమును వ్యవహరించు చున్నారు. “ఫిలాస-సోఫియా” పదముల మిశ్రణమున “ఫిలాసఫీ” పదమేర్పడినది. ప్రేమానురాగములు “ఫిలాస” పదమున కర్థము. “సోఫియా” పదార్థము విద్య కాగా విద్యాప్రేమ, విద్యానురాగము “ఫిలాసఫీ” పదార్థము. గ్రీసు దేశములోని ఏథెన్సు వాసులు విద్యారాగము కలవారని ప్రసిద్ధి. సోక్రటీసు తాను “ఫిలాసఫరు” అయినాడు. అతని శిష్యుడు ‘ప్లేటో’ కాని యాతని శిష్యుడు “అరిస్తాతిలు” కాని యీ పదముల ప్రచారము చేయలేదు. విద్యానురాగము కలవారు వివిధ విభాగములందొనర్పగల వ్యాసంగ మొనర్చిరి. వారు “ఫిలాసఫీ” పదవ్యుత్పత్తి వలన లభించు విద్యాను రాగమున ప్రవర్తించిరి. “ఫిలాసఫీ” పదమునకు మొదటి దినములందు విశాలమయిన యర్థమున్నది. అది యనంతరకాలమున కేవలము “జ్ఞానానురాగము” అను నర్థమున సంక్రమించినది. వివిధములయిన విజ్ఞానములకు లక్ష్యములుగానున్న విషయముల నన్నిటిని క్రోడీకరించి యేకపఱచుటను “ఫిలాసఫీ” యనియు వ్యవహరింతురు. నేడు భారతీయులు కొందరు “ఫిలాసఫీ” పదమును “దర్శన” మని యనుచున్నారు. కొందరు “మీమాంస” యనుచున్నారు. కాని వారి “ఫిలాసఫీ” వేరు. మన “దర్శన-మీమాంసలు” వేరు. కల్పన చేయగల పండితుల మనోవినోదమునకు “ఫిలాసఫీ” సాధన మాత్రమె. విచార సాగరములో “ఫిలాసఫీ” నౌకనధిరోహించి “ఫిలాసఫరులు” ప్రయాణము చేయుదురు. ఆ పడవ చేరిన స్థలము వారి గమ్యము. అన్నిపడవ లొకచోట చేరవు. వారి గమ్యము వారికి మొదట తెలియదు. భారతీయుల దర్శన రీతివేరు. దుఃఖత్రయమును పోగొట్టుకొని నిర్దిష్టమయిన గమ్యముచేరుటకు భారతీయులు దర్శనమువలంబించిరి. వీరి గమ్యమును వీరిదర్శనము నిశ్చయించి చెప్పినది. తత్త్వమీమాంస, ప్రమాణ మీమాంస, ఆచార మీమాంస, సౌందర్య మీమాంస, తర్క శాస్త్రము, మనోవిజ్ఞానము, మొదలగు రీతుల ననుసరించి పాశ్చాత్యులు తమ జ్ఞానానురాగమును “ఫిలాసఫీ” రూపముగా ప్రకటించు చున్నారు.

భారతీయుల దర్శనములలో కొన్ని విశేషములు కలవు. భారత మానవు లైహికజీవన సామగ్రిని పరిపూర్ణముగ నిర్వహించుకొని కేవలమైహికచింతాసక్తులు కాకుండుటకై పరమార్థ చింతనము చేసినారు. భారతదేశము మొదటి నుండియు పరమార్థము విచారించుటకై తగిన స్వతంత్ర సన్నివేశము కూర్చిపెట్టినది. అందు వలననే మన దర్శన శాస్త్రము స్వతంత్ర స్థితికలదై స్వయంప్రతిష్ఠమై యితర విద్యల యభ్యుదయమునకును సహాయమొనర్చు చున్నది" “దర్శనము ధర్మ ముభయము మన దర్శనములందు గణింపదగిన యొక ప్రత్యేకత.” చతుర్విధ పురుషార్థములను నిరూపించు ఏ గ్రంథముకాని విషయముల నన్నిటిని చెప్పును. ధర్మ శాస్త్రమునందును మోక్షసామగ్రి యున్నది; కామశాస్త్రము నందును ధర్మమోక్ష సాధనము లున్నవి; అర్థశాస్త్రమునందునితరములున్నవి. మోక్షశాస్త్రము నందు ధర్మాదులున్నవి. ఇట్లిహపరముల యుభయ ముండుటచే మనదర్శనము సర్వలోక ప్రియమయినది. త్రివిధ తాపసంతప్తులను శాంతపఱచి యాత్యంతిక దుఃఖ నివృత్తి సంపాదించుటకు భారతదేశమున దర్శన ముదయించినది. ఇది కేవలము పండితుల కల్పనా విజృంభణము కాదు. “అవిచ్ఛిన్న సంప్రదాయము.” మూడవ

గృక్కుకొనుచు 'తండ్రీ! నే సత్యమునే పల్కుచున్నాను. నిజముగా శివుఁడే ప్రతిదినము పా లారగించుచున్నాఁడు. మొదటిదినమునఁ బాలు త్రాగకపోఁగా, నే నెంతయో వేఁడితిని. ఆ దేవదేవుఁడు వాత్సల్యముచూపి వెంటనే క్షీరముఁ గ్రోలెను. నాటినుండి ప్రతిదినము నట్లే జరుగు చున్నది. వలయునన్నచో మీరు రేపు పరీక్షింపవచ్చును' అనెను. శివదేవుఁడు కొంత తిరస్కారభావముతో "సరియే! అదియుఁ జూచెదఁ గాక! ఏమైన విపరీతముగ జరిగినచో అప్పుడే నీ పని పట్టించెదను లెమ్ము" అని పల్కెను.

మఱునాఁ డుదయముననే శివదేవుఁడు కాలకృత్యములఁ దీర్చుకొని పరమేశ్వరుని యాలయమునకుఁ బోవుటకు సిద్ధముగ నుండెను. గొడగూచియు వాడుక ననుసరించి పాలుపితికి, కుంచెఁడు కొలిచి, పాత్రలోఁబోసి దేవదేవునికి నివేదింప బయలుదేరెను. ఆమె తండ్రియు గొడగూచి వెనుకనే గుడికిఁ బోయెను. ఆమె యథాప్రకారము గోక్షీరములను దేవదేవునియెదుట నుంచి, ఆరగింపవలెనని ప్రార్థించెను. అదేమి చిత్రమో కాని, ఆనాఁడు దేవుఁడు పాలు త్రాగఁడాయెను. గొడగూచి మిగుల చిగులుపడి వెలవెల పోయెను. తండ్రి కోపముతోఁ గన్ను లెఱ్ఱచేయుచు "ఓసీ! నేఁడు పరమశివుఁడు పాలేల త్రాగలేదు? త్రాగుట మానె; ముట్టనైనను లేదే! మూర్కొననైన లేదే! పాపాత్మురాలా! నీవు ద్రోహబుద్ధితో నిత్యము పాలు నీతోడి బాలికలకుఁ బోయుచు, పొట్టయుబ్బునట్లు త్రాగుచు 'దేవుఁడే త్రాగుచుండె' నని కల్లలాడెదవా? చూడుము! నీపొట్ట చీల్చెదను." అని యామెపైకి వచ్చెను. గొడగూచి గడగడ వణఁకుచు శివలింగమువద్దకుఁ బరుగిడిపోయి "ఓ లింగా! శివలింగా! పరమేశా! నాతండ్రి నాపై అసత్యదోషము నారోపించి, నీయెదుటనే నా పొట్టచీల్చి చంపనున్నాఁడు. రక్షింపుము. నీవు తక్క నాకు వేఱొక దిక్కులేదు" అని దేవునిఁ బ్రార్థించెను. పరమశివుఁడు వెంటనే తనపొట్టవిచ్చి వారిచేసి, యామెను తన గర్భమున నిముడ్చుకొనెను. వెంటనే విగ్రహము యథారీతి నయ్యెను. శివదేవుఁ డీ సంఘటనకు మిగుల నాశ్చర్యపడుచుఁ బరుగిడి ముందునకుఁబోయి తనయిష్ట దేవుని విగ్రహమునఁ జొరకుండఁ బట్టుకొనఁబోయెను. గొడగూచి కేశములుమాత్రము శివదేవుని చేతిలోఁ జిక్కినవి. గొడగూచి శరీరము శివునిలో లీనమయినది. కేశములు విగ్రహముపొట్టపై వ్రేలాడి యుండినవి.

ఇప్పటికి నాఱునెలల కొకసారి శివలింగము పొట్టపై నిడుపలగు కేశములు పెరుగుచుండును. అప్పుడు వానిని కత్తిరింతురు. నాఁడు గొడగూచిముగ్ధ భక్తిసూచకముగ గొప్ప పండుగు జరుగుచుండును. మఱల నాఱునెలల కిదే పద్ధతి.

శివదేవుఁడు తన యవివేకమునకుఁ బశ్చాత్తప్తుఁడై విచారముతో నింటికిఁ బోయెను. భక్తురాలును, నిర్మలహృదయయు నగు గొడగూచికి శివైక్యము సిద్ధించెను.

భగవంతునకు పసివారిపయి వాత్సల్యా మధికము. పెద్దవారి హృదయములకన్న పిన్నల యమాయిక హృదయములు సులభముగా దేవదేవుని స్వాధీనము చేసికొనగలవు.

[బసవ పురాణము ననుసరించి]

---

# దానశాసనములందలి రెండు చక్కని శ్లోకములు

*పండిత పార్థసారధి భట్టాచార్య*

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోఽనుపాలనమ్।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదమ్॥

సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామభద్రః।
సామాన్యోఽయం ధర్మసేతుర్నృపాణాం
కాలే కాలే పాలనీయో భవద్భిః॥

పై రెండు శ్లోకములు తరుచుగ ప్రాచీనములగు దానశాసనములందు కానవచ్చుచున్నవి. ఈ శ్లోకముల తాత్పర్యము మిక్కిలి గహనమైనది. ఈ వ్యాసమందీ శ్లోకముల తాత్పర్యమును సంగ్రహముగ పరిశీలించెదము.

దాన మనగా ఇచ్చుట; పాలన మనగా ఇచ్చినదానిని సంరక్షించుట. దానము ఏకైక పురుషసాధ్యము కూడ కానవచ్చును. సముదాయ నిష్ఠముకూడ కానవచ్చును. పాలనము మాత్రము సర్వవిధముల స్త్రీ బాలవృద్ధ నిర్విశేషముగ సకలసామాజిక నిష్ఠము. సమాజమందే ఒక్క వ్యక్తియైనను దానమునకు ప్రతిబంధము కల్పించవచ్చును,

దాతయే కాలాంతరమునఁనో సంపత్తు విశేషము వలననో తన దానమునకు అంతరాయమును కల్పించుట కవకాశము లేకపోలేదు. కాగా పాలనము కష్టతరమైనది. కావున దానమునకును పాలనమునకును కల అంతరమును వాని యొక్క ఫలశ్రుతిని చెప్పుట మూలముగ పెద్దలు నిష్కర్షించుచున్నారు. దానమునకు ఫలము స్వర్గమనియు పాలనమునకు ఫలము శ్రీ వైకుంఠ మనియు వారల నిర్ణయము. స్వర్గమనగా 'తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అని గీతోపనిషత్తునందు చెప్పబడినట్లు ఫలాభిసంధియుతమై జ్యోతిష్టోమాది యజ్ఞాది సాధ్యమును సాపాయమును నశ్వరమునగు సుఖస్థానము. అచ్యుతపదమనగా 'యద్గత్వానని వర్తన్తే తద్ధామ పరమం మమ' అని చెప్పబడిన శ్రీ వైకుంఠలోకము. ఈ స్థానమును పొందిన పుణ్యపురుషులకు మరల మరల జన్మ జరామరణ దుఃఖాభిభూతమగు సంసారము కలుగదు. వారికి శాశ్వతముగ సంసార బంధమునుండి మోక్షము కలుగగలదు. వారికి సంతతముగ నిరతిశయమగు బ్రహ్మానందానుభవము కలుగుటచే నిత్యసుఖము ననుభవింతురు. ఆ స్థానమును పొందినవారికి స్వర్గాది సుఖములు బంధములుగను మహాఘోరములు నరకములుగను తోచునని 'ఏతే వై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః' అను మొదలగు ప్రసంగమున మైత్రేయునకు శ్రీ పరాశరపరమర్షి యుపదేశించినట్లు శ్రీ విష్ణుపురాణమునందు తెలియుచున్నది. మరియు 'కారాగృహే కనకశృంఖలయాఽపి బంధః' అనునట్లు స్వర్గసుఖములుకూడ నిస్సమాభ్యధికమగు నానందము ననుభవించుట కనువగునవి కావని అభియుక్తుల సాక్ష్యము చెప్పుచున్నది. కర్మములచే బద్ధులగు వారి కీ లోకము, అపరాధము జేసినవాడు ఇనుప సంకెళ్లతో బంధింపబడి కారాగృహమందు నివసించుట వంటిదనియు, సత్కర్మములు జేసినవారలు స్వర్గమందు వసియించుట పాపకర్మములజేసినవాడు బంగారు సంకెళ్లతో బంధింపబడి కారాగృహమున వసియించుట వంటి దనియు పై అభియుక్తోక్తికి సంగ్రహమగు తాత్పర్యము. కారాగృహమందు స్వాతంత్ర్యము లేక నివసించుటయను పరాధీనత సిద్ధమైనంతట బంధన సామగ్రియగు సంకెలలు అయస్మయములై నంతట న్యూనతగాని హిరణ్మయములైనంతట గౌరవముగాని యెట్లు వ్యావర్తకము కాదో అట్లే స్వర్గలోకవాసముకూడ శాశ్వతానందము నీయజాల కుండుటచే ప్రపన్నులకది అపేక్షణీయముకాదు.

ఈ నిర్ణయము కేవల మర్థవాదము మాత్రము కాజాలదు. దానపాలనములమధ్య ఇంతటి గొప్పదగు అంతరము సిద్ధమైనప్పుడు నశ్వరఫలమగునట్టియు కష్టసాధ్యమగునట్టియు దానము నాచరించుటకు అధికారులు లభింపరను సందియ మక్కరలేదు. దానము పాలనమున కుపజీవ్యము. ఒకానొకదాత ఒకప్పుడొక దానమును చేసిన వెనుకగాని ఆదానమునకు పాలనమునకు ప్రసక్తి లేదు. అనగా దానమే లేనప్పుడు పాలనము లేదని చెప్పవచ్చును. దాత యేర్పడిన తరువాతనే పాలకునకు కార్యము. దాత లేక పాలకునకు పనిలేదు. దాతయు దాతగ మాత్రమే పరిమిత స్వర్గఫలభోక్తయై మాత్రమే ఉండనక్కరలేదు. దాతయగువాడు పాలకుడుగగూడ నుండి స్వర్గాపవర్గ ఫలముల నవారితముగ ననుభవింపగలడు. 'స్వయం తీర్ణః పరాంస్తారయతి' అనునట్లు తాను తరించి తన తరువాతి వారిని తరింపజేయగోరి తాను దానముజేసి పరిపాలించి ఆ దానమును పరిపాలించుట కితరుల కవకాశము కల్పించును. ఇది సాధుజనుల సమయము.

మరియు ప్రతిపురుషునకు తనకు కలదానిలో యథాశక్తిగ కొంతభాగమును దానము చేయవలయు ననుట విధివిహితమగుటయు ధనమునకు వినియోగము దానమగుటయుకూడ దానము తప్పనిసరియగు కార్యముగ తెలియవచ్చుచున్నది.

'అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనంతథా
దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామకల్పయత్'

అని బ్రాహ్మణునకు విధింపబడిన యజనయాజన అధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహములను నారుకర్మలలో దానమొక విహితకర్మయని మనువుచెప్పుచున్నాడు. 'దానం యజ్ఞానాం వరూథం దక్షిణా లోకె దాతారం సర్వభూతాన్యుపజీవన్తి దానేనారాతీరపానుదన్త దానేన ద్విషన్తోమిత్రా భవన్తి దానే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్దానం పరమంవదన్తి' అని తైత్తిరీయమందు దానముచేయువాని ననుసరించి సకలభూతములు జీవించుననియు దానముచే శత్రువులు సంహరింపబడుదురనియు దానముచే శత్రువులు మిత్రులగుదురనియు జగమంతయు దానమునం దాధారపడి యుండుననియు దానప్రశంస చెప్పబడుచున్నది. 'బ్రాహ్మణా వివిదిషన్తి, యజ్ఞేన దానేన తపసానాశనేన' యని బ్రహ్మజ్ఞాన సాధనములలో నొక్కటిగ దానము ప్రశంసింపబడినది. విశేషించి కలియుగమందు దానమే శ్రేష్ఠమైనదనియు 'తపఃపరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే। ద్వాపరేయజ్ఞమేవాహుః దానమేవ కలౌయుగే॥' అని మానవ ధర్మమందు చెప్పబడుచున్నది.

ఈ దానము ప్రకారభేదముచే మూడు విధములుగ నగుచున్నదని గీతాచార్యుని నిర్ణయము. 'అభయం సత్త్వసంశుద్ధిః' అని యారంభించిన దైవసంపల్లక్షణమునందు 'దానందమశ్చ యజ్ఞశ్చ' అని దానము దైవసంపత్తుకు

వ్యాప్తకముగ పేర్కొనబడినవి. అవల 'దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే। దేశేకాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్.' (దానము చేయుట స్వరూపధర్మము, ఇది విదివిహితము అను విశ్వాసముచేత తనకు పూర్వోప కారి కానట్టి సత్పాత్రమగు బ్రాహ్మణునకు తన శక్తి నను సరించి సోమసూర్యోపరాగాది పుణ్యకాలములందును కురు క్షేత్రాది పుణ్యక్షేత్రములందును చేసెడి దానము సాత్త్విక దాన మనబడును.) దేశకాలము పాత్రమునను సవి సము చ్చితములుగనే ఉండనక్కరలేదు. పాత్రము సత్పాత్ర మైనప్పుడు దేశకాలములు విశిష్టములుగ నుండియే తీర వలయునని నిర్బంధములేదు. దేశకాల సంబంధము గుణా ధిక్యమును కల్పించును. 'గత్వా యద్దీయతే దానం తద నన్తఫలం స్మృతమ్। సహస్రగుణమాహూయ యాచితేతు తదర్ధకమ్' (తానే స్వయముగ ప్రతిగ్రహీతయగు నాతని యొద్దకుపోయి తాను చేయదగిన దానమును చేయుట అనన్తఫలము నిచ్చును. తనయొద్ద కా ప్రతిగృహీతను రావించి యిచ్చుట సహస్రగుణిత ఫలమునిచ్చును. ప్రతి గృహీతచే యాచింపబడి యిచ్చిన దానము దానిలో సగము ఫలమును మాత్రమే యిచ్చును) అను మొదలగు ప్రమా ణము లీయెడ ననుసంధించు కొనదగును,

'యత్తుప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్యవాపునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసంస్మృతమ్'

(తన కొకప్పుడు ఉపకారము చేసినవానికి ప్రత్యుపకార ముగ చేయగోరి అట్టి పూర్వోపకారికి దానము చేయుటగాని అట్లు కాక ఇప్పుడు చేసిన దానమునకు భవిష్యత్తున ప్రతి ఫలమును కోరిగాని చేయబడియెడిదియు ఈ దానమువలన మరియొక విధమగు ఫలము నుద్దేశించి చేయబడెడిదియు ఈ దానమువలన యెట్టి ప్రయోజనమైనను కలుగపోవునా యను సందిగ్ధ సాధ్యక్లేశముచే చేయబడియెడిదియు నగు దానము రాజసదాన మనబడును.)

'అదేశ కాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం తత్తామసముదాహృతమ్'

(దేశకాల పాత్రముల తత్త్వమును లేశమైన పరిశీలింపక దేశకాలములను తెలియక ప్రతిగృహీతయందు గౌరవ బుద్ధి లేక కేవల దంభాహంకారములకు లోనై చేయువాని దానము తామసదానమని యనబడుచున్నది.

సాత్త్వికదానమందును దేశకాల పాత్రములందలి వైవి ధ్యముచేత ఫలభేదము సిద్ధమై యుండుటను వేరుగ చెప్ప నక్కరలేదు. ఈ వ్యాసమందుద్దిష్టమైనట్టి ఈ విచారము ముందు నిరూపింపబడును.

దానమునకు వినియోగపడని ధనము వ్యర్థమై నశించి పోవుటచే కూడ దానము చేయుట అవసరమగునని వ్యతి రేకముఖముగ నీతిశాస్త్రపరులు చెప్పుటను సంగ్రహముగ నీ రెండు పద్యములలో చూడవగును. 'దానం భోగోనాశ స్తిస్రో గతయోభవన్తి విత్తస్య' (ద్రవ్యము వినియోగింప బడుటకు కలవి మూడే మార్గములు. అందు మొదటిది దానము. రెండవది భోగము. మూడవది నాశనము.) ద్రవ్యము కలిగినందులకు ఫలము ద్రవ్యవంతునకు తన చేతిమీదుగా దానముచేసికొనుటలో ప్రధానమైనది. దానశిష్ట మగుదానిని తన యైహికభోగములకు సాధనముగ విని యోగించుకొనదగును. ఈ రెండు కార్యములు చేయనినాడు ఆ ద్రవ్యము పరిపరివిధముల నశించిపోవును; అని పై పద్య మునకు తాత్పర్యము చెప్పవచ్చును. ఆ నాశమునకు త్రోవ లనుకూడ ఈ క్రింది శ్లోకము స్పష్టపరచినది.

'చత్వారోధనదాయాదాః ధర్మాగ్ని నృపతస్కరాః।
తేషాం జ్యేష్ఠావమానేన త్రయః కుప్యన్తి సోదరాః॥'

(ధనమునకు దాయాదులు నలువురు. మొదటిది ధర్మ ము, రెండవది అగ్ని, మూడవది రాజు, నాల్గవది తస్క రులు) అనగా ధనవంతుడు తన యైశ్వర్యమును ధర్మ కార్యములకు- అనగా పూర్వోక్తములగు దాన భోగములకు వినియోగించ నంతట ఆ ధనమును అగ్నిరాజులు తస్క రులు హరించెదరు. ధనమునకు దాయాదులనగా హక్కు దారులు నలుగురు సోదరులగుట విధివిహితమగుటచే ఆ సోదరులందరును సొత్తును తమలో తాము విభజించి కొనుట న్యాయసమ్మతమగును. ధర్మమనువాడు అగ్ర జుడు. వానియందు అనుజులు గౌరవముగలిగియుందురు; ఎవ్వడు తనకుగలదానిని ధర్మమునకు వినియోగించవల సిన భాగమును ధర్మముక్రింద వినియోగించక ఆ ధర్మ మును తిరస్కరించి అవమానపరచుచున్నాడో వానియెడల కోపించి (జ్యేష్ఠునియందుగల గౌరవముచే) ఆ ద్రవ్యమును తమకు వశపరచికొందురు. అనగా ధర్మమునకుపయోగ పడనట్టి యవివేకుని ధనము అగ్నిచే దహింపబడియు రాజపురుషులచే బలాత్కారముగ స్వాధీనపరచికొన బడియు దొంగలచే అపహరింపవడియు నశించునని ఈ పద్యముయొక్క తాత్పర్యము.

దానమునకు అంగములగు దేశకాలపాత్రములు మూ డంశములలో దేశకాలములను గురించిన వివరములీ వ్యాస మునకు ప్రధానోద్దేశములు కానందున మూడవదగు పాత్ర విశేషములను గురించి కొంచెము పరామర్శించెదము.

యాజ్ఞవల్క్యుని మతము ననుసరించి

'తపస్తప్త్వాఽసృజద్బ్రహ్మా బ్రాహ్మణా న్వేదగుప్తయే।
తృప్త్యర్థం పితృదేవానాం ధర్మసంరక్షణాయచ'

(చతుర్ముఖుడు సృష్ట్యాదియందు తపమాచరించి వేద ములను సంరక్షించుటకును. దేవతలను పితరులను తృప్తి

పరచుటకును వివిధములగు ధర్మములను అనుష్ఠించి లోకములకు మార్గదర్శకులై ధర్మమును సంరక్షించుట కును బ్రాహ్మణులను ఆదియందు సృజియించెను.

'సర్వస్య ప్రభవో విప్రాః శ్రుతాధ్యయన శాలినః ।
తేభ్యః క్రియాపరాః శ్రేష్ఠాః తేభ్యోఽప్యధ్యాత్మ విత్తమాః ॥'

(ఇతరవర్ణములవార లందరలోను జన్మచేతను కర్మ చేతను బ్రాహ్మణులు శ్రేష్ఠులు. బ్రాహ్మణులందును శ్రుతా ధ్యయన సంపన్ను లుత్తములు. వారలందును విహిత ముల ననుష్ఠానముచే నాచరించెడివారు శ్రేష్ఠులు. వార లందును శమదమాద్యాత్మ గుణములుగలిగి తత్త్వత్రయ జ్ఞానముకలిగిన ప్రపన్ను లుత్తమోత్తములు)

'నవిద్యయా కేవలయా తపసావాఽపి పాత్రతా ।
యత్ర వృత్త మిమేచోభే తద్ధి పాత్రం ప్రకీర్తితమ్,'

(కేవల శ్రుతాధ్యయన సంపత్తిచేతగాని కేవల శమద మాదులచేతగాని కేవలానుష్ఠానముచేతగాని కేవలము పుట్టు కచేతగాని ఔత్కృష్ట్యము సిద్ధించదు. ఎవ్వనియందు అనుష్ఠానసంపత్తియు విద్యయు తపస్సును బ్రాహ్మణ్య మును సముచ్చితములై యుండునో అట్టివానియందే గొప్ప తనముకల్గి అతడే సత్పాత్ర మనబడును.) ఇట్టివానిని దానమునకు పాత్రముగ మహర్షులు కీర్తించుచున్నారు. ఇచ్చట పేర్కొనబడిన జాతి విద్యానుష్ఠాన తపస్సముచ్చ యములం దుత్తరోత్తరములకు ప్రాశస్త్యము చెప్పబడు టచే ఫలతారతమ్యముకూడ సిద్ధమగుచున్నది. ఐనను

'ప్రతిగ్రహ సమర్థోఽపి నాదత్తే యః ప్రతిగ్రహమ్ ।
యే లోకా దానశీలానాం సతానాప్నోతి పుష్కలాన్ ॥'

(ప్రతి గ్రహము చేయుటకు బ్రాహ్మణునకు అర్హత విహితమైయుండినను అట్టి ప్రతిగ్రహమును చేయకుం డుట యుక్తము. అట్లు ప్రతిగ్రహము చేయవలసిన కష్ట స్థితియందుండియు ప్రతిగ్రహము చేయకుండువాడు ఉత్తమమైన దానము చేయువానికి లభియించెడి పుణ్య లోకములను పొందగలడు.) అని ప్రతి గ్రహము బ్రాహ్మ ణునకు విహితమైనను చేతనై నంతవరకు దానిని చేయ కుండుట మంచిదని తెలియుచున్నది. దాననే 'త్రీణి కర్మాణి జీవికా' యని బ్రాహ్మణునకు యాజనాధ్యాపన ప్రతిగ్రహములను మూడుకర్మలు అపద్ధర్మములుగ నాచ రింపదగినవని చెప్పుదురు. ఈ విషమదశయందు భగవ చ్ఛాస్త్ర సంహితాకారులు మనోహరమగు పరిహారమును నిరూపించియున్నారు. ఈ నిరూపణమును క్రమముగ నితి హాసములు పురాణములు బలపరచినవి.

'ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్'

(చరాచరాత్మకమగు నీ యఖండ బ్రహ్మాండము సర్వే శ్వరుడగు పరమాత్మచే వ్యాప్తమైయున్నది. ఈ జగమం తయు అతనికే చెందియున్నది.) అనునట్లు ఆతని యను గ్రహ లేశముచే జగత్తునందలి ఆయా పదార్థము లాయా చేతనులకు భోగ్యములుగను భోగోపకరణములుగను భోగ స్థానములుగను వారలవారల కర్మాధీనముగ ననుభవము నం దుపయోగపడుచున్నవి. వాని యనుగ్రహముచే లభిం చిన పదార్థములను వానికై తిరిగి సమర్పించుట ప్రతి చేతనునకు ప్రధమకర్తవ్యము. 'కృతేచ ప్రతికర్తవ్యమేష ధర్మః సనాతనః' ఉపకారము చేసినవానికి చేతనైన ప్ర త్యుపకారము చేయుట అవసరమని సుందరకాండయందు సముద్రరాజుని హితవాక్యము. ఇతర పదార్థముల విషయ మటుంచి,

'విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుమ్ ।
పూర్వమేవ కృతాబ్రహ్మన్ హస్తపాదాది సంయుతా ॥'

(ఈ చేతనునికి భగవత్కైంకర్యము చేసి తరించుట కనువగునట్లు కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములాదిగా గల తత్త్వములు సృష్టికర్తయగు భగవానునిచే విచిత్ర మగు రీతిని అనుగ్రహింపబడియున్నవి. ఈ యమూల్య మగు శరీర సంపత్తిని వాని కైంకర్యమునకే ఉపయోగ పరుపవలయును) అనునట్లు ఈ దేహమే భగవానున కర్పింపదగిన దనుట శాస్త్రసిద్ధము. ఇట్లె దేహమును దేహ ధారియగు నాత్మనుకూడ భగవానున కర్పించుటను శాస్త్ర ములు చెప్పచున్నవి. వ్యతిరేకముఖమునగూడ,

'యోఽన్యథాసన్తమాత్మాన మన్యథా ప్రతిపద్యతే ।
కిం తేన నకృతం పాపం చోరేణాత్మాప హారిణా ॥'

యని భగవానున కాత్మార్పణము చేయనివానిని శాస్త్ర ములు నిందించుచున్నవి.

ఈ రహస్యమును తెలిసినవాడు తన యాత్మను శరీర మును ధనమును భగవానున కర్పించుట ముఖ్యము. పూర్వము చెప్పబడినట్లు సత్పాత్రములుగ నిరూపింప బడిన 'త్రిశుక్లాః కృశవృత్తయో బ్రాహ్మణాః పాత్రం' ఇత్యాద్యుక్త లక్షణసంపన్నులగు బ్రాహ్మణులై నను 'స్వాం తఃస్థేన గదాభృతా' అనునట్లు తమ హృదయములందు సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుని ధ్యానించుచుండెడి ప్రభావముచేతనే పాత్రతను పొందుటచేతను మానవులలో పాత్రాపాత్ర నిర్ణయము ప్రతి గ్రహమందలి గుణదోష వివే చనము మొదలగునవి దుఃసాధము లగుటచేతను పరమ పురుషుడగు నీశ్వరున కీ దానము నొసంగుట ఉచితమను టయే వారలు చెప్పెడి పరిహారము.

భగవానుడు దాన ప్రతిగృహీతగా నుండుటకు అభ్యం తరము లేదు.

'పత్రం పుష్పం ఫలంతోయం
యోమే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతం
అశ్నామి ప్రయతాత్మనః॥'

అను గీతా శ్లోకమందు భక్తులచే ప్రీతితో సమర్పింపబడిన పత్రపుష్ప ఫలతోయాద్యల్ప ద్రవ్యమునైనను తాను ఆదరముతో స్వీకరించుటను భగవానుడు స్వయముగ చెప్పుచున్నాడు. ఇంతియేగాక యెవ్వడుగాని తాను చేసెడి దానమును సాక్షాత్తుగ భగవానునుద్దేశించి చేయకపోయినను 'యోయోయాం యాంతనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి। తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ సతయాశ్రద్ధయాయుక్తః తస్యారాధన మీహతే। లభతేచతతః కామాన్ మయైవ విహితాన్హితాన్॥' అనునట్లు పరంపరాసంబంధముచే ఆ దానము భగవానునకు చెంది భగవానుడు ఫలప్రదాత యగుచున్నాడనియు గీత చెప్పుచున్నది.

సర్వవ్యాపియు సర్వాంతర్యామియు సర్వనియంతయగు సర్వేశ్వరునకు సమర్పింపదగినది అప్రాకృతమగు నాత్మవస్తువేయైనను,

'అర్చ్యః సర్వ సహిష్ణురర్చక పరాధీనాఖిలాత్మస్థితిః'

అనునట్లు జగద్ధిత కాంక్షచే శిలాలోహమృదాది కల్పిత దివ్యమంగళ విగ్రహ విశిష్టుడై అర్చా సమాధియందు సాన్నిధ్యము జెందిన పరమపురుషునకు సమర్పించదగిన ప్రాకృత పదార్థములు లెక్కకు మిక్కిలిగ కలవు.

ఆత్మార్పణ ప్రకరణమున పూర్వాచార్యు లనుసంధించునప్పుడు,

'వపురాదిషు యోఽపి కోఽపివా గుణతోఽసాని యథా తథావిధః
తదహం తవపాదపద్మయో రహమద్యైవ మయా సమర్పితః'

అని చెప్పి ఆత్మసమర్పణము చేయుచు తనదికాని వస్తువును తానెట్లు సమర్పించుట యని శంకించుకుని,

'మమనాథయదస్మి యోఽస్మ్యహం సకలంతద్ధిత వైవ మాధవ
నియతస్వమితి ప్రబుద్ధధీ రధవా కింను సమర్పయామితే॥'

అను నుత్తర శ్లోకముచేత తన యాత్మను నేటివరకు తనదిగా భావించి నేడు సర్వేశ్వరునిదని తెలిసికొని వానిది వానికిచ్చుటయే తాను సమర్పించుట యనుటను విశదపరచుచుండుట ఈయెడ గమనింపదగినది.

'క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్త చేతసామ్'

అనునట్లు అవ్యక్తోపాసనము క్లేశసాధ్యమగుటచే పరమదయాళురగు మహర్షులు అర్చావతార సౌలభ్యము తెలిసి అర్చాబింబములందు సర్వేశ్వరుని నుపాసించుటను భగవచ్ఛాస్త్ర నిర్మాతలు సంగ్రహవిస్తరరూపముగ తమ రచనలందు నిరూపించిన విధముగ ప్రతిచేతనుడు బహుప్రకారములుగ యథాశక్తిగ తమకు కలిగిన ధనమును భగవద్బింబములకును భగవదాలయములకును సమర్పించుటకవకాశ మేర్పడుచున్నది. ద్రవ్యము సర్వార్థసాధకమనుట నిర్వివాదము. ద్రవ్యముకలవాడు తన ద్రవ్యమును వినియోగించి యథాశక్తిగ భగవదాలయములను నిర్మించుట భగవద్బింబములను నిర్మించుట, మహాప్రతిష్ఠను చేయుట నిత్యార్చనము అవిచ్ఛిన్నముగ జరుగుటకై ఆయా కైంకర్యపరులకు కైంకర్యములకు స్థిరమగు వృత్తులను కల్పించుట జీర్ణోద్ధారాది విశేష కార్యములకు వలయు వసతులను కల్పించుట నిత్యోత్సవ విశేషోత్సవాదులను జరుపుటకు వలయు శాశ్వతనిధిని కల్పించుట నెన్నియో కైంకర్యములు చేయించవచ్చును. ద్రవ్యమును స్వయముగ నిచ్చుటకు శక్తిలేని నిరుపేదలు తమ సామర్థ్యమును దేహబలమును వినియోగించి భగవత్కైంకర్య మహిమను లోకులలో విరివిగా ప్రచారముచేయుటధనసేకరణమునకు గాని ఇతర సామగ్రి సేకరణమునకుగాని తోడ్పడవచ్చును. దీనిని నేటి సామాజికుల మతము ననుసరించి బుద్ధిదానమని గాని శ్రమదానమనిగాని యనగూడును. ఇట్లు మొదటిదగు 'దానపాలన' శ్లోకము వ్యాఖ్యానింపవచ్చును.

'క్షాన్త్యాశుద్ధ్యన్తి విద్వాంసః దానేనా కార్యకారిణః।
ప్రచ్ఛన్న పాపా జప్యేన తపసా వేదవిత్తమాః॥'

అను మానవ వచనము ననుసరించి ప్రాయశ్చిత్తముగ గూడ దానము విహితమై యుండుటను జ్ఞాపక ముంచు కొనవలెను.

ఇక రెండవదగు 'సర్వానేతాన్' శ్లోకమును గురించి విచారించెదము. ఈ శ్లోకము అవతారమూర్తియగు శ్రీరామచంద్ర మహాప్రభునిదని శ్లోకమని చెప్పవచ్చును. లేదా ఆపేరుగల తరువాత ప్రభునిది కావచ్చును. చారిత్రికముగ ఆ విషయమునందలి తత్త్వమును పరిశీలనకు విడచి శ్లోకార్థమును గురించినంతవరకు మన మీయెడ పరిశీలించుట మనపనికి చాలును. 'భావికాలమం దవతరించబోయెడి ఓ రాజులారా! సంసారసాగరమును తరించుటకు ధర్మము సేతువుగ సహాయపడుచున్నది. ఈ సేతువు తెగిపోకుండ కాపాడు చుండెడి భారము మీయందున్నది. ఈ ధర్మసేతువు చెడిపోకుండ కాపాడుట మీ ధర్మము. అట్లు ధర్మసేతువును సర్వకాల సర్వావస్థలయందును భద్రపరచు చుందురని మిమ్ముల నందరను నేను ప్రార్థించెదము'అని రామభద్రుడు

పాల్గొనులకు కొరకు ఈ శ్లోకమునందు చెప్పబడినది. ఈ శ్లోకమందు దానధర్మము ప్రకృతమైనను ధర్మసామాన్యము నందు పాలనమును ప్రార్థించుటయు ఉచితమేయగును.

ధర్మము బహుప్రకారమైనదని మహర్షులు వ్యాఖ్యానింతురు. ధర్మము నారువిధములైనట్లు విజ్ఞానేశ్వరుడు నిర్వచించి అంపలి విభేదమును స్వరూపమును అతడు వ్యాఖ్యానించి యున్నాడు. 'విద్వద్భిః సేవితః సద్భిర్నిత్య మద్వేషరాగిభిః। హృదయేనా భ్యనుజ్ఞాతః' అని సర్వారంభమున మనువు ధర్మలక్షణమును విశాలార్థకముగ చెప్పి యున్నాడు 'ధర్మస్యతత్త్వం నిహితం గుహాయాం' అను మొదలగు నిర్ణయముకూడ పై మను శ్లోకమునకే వ్యాఖ్యానమై ధర్మస్వరూపము నతిగహనమైన దానినిగ చేయు చున్నది. ధర్మమేమాత్రము హానముచెందినను ప్రపంచ యాత్రకు అవరోధమును సంక్షోభమును కలుగుటచే ధర్మ హానము కాగూడదని మహర్షు లాశించెదరు.

'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మనం సృజామ్యహమ్ ॥

అను సర్వేశ్వరుని శపథము ధర్మహానము అసహ్యమైనదను టను నిరూపించుచున్నది. భగవాను డవతార మెత్తుట యనునది అంత సులభమైన కార్యము కాదు. అవతార క్లేశము దుర్భరమైనది.

'తావృగ్విధామపి కథాం కథయన్ స్వవాచా
వల్మీక జన్మమునిరేవ కఠోరచేతాః'

అని యా క్లేశములను వర్ణించుటకో వినుటకో కూడ శక్యము కాదని కవులు వర్ణించెదరు. అట్టి క్లేశములను సహించి సర్వేశ్వరుడు అవతరించుట యనునది ధర్మహానము వలన కల్పించబడును.

ధర్మమాచరించుట తప్పనిసరియనుటను మనువు చెప్పెడిరీతి ఈ క్రింద నుదహరింపబడుచున్నది.

'ధర్మంశనైః సంచినుయాన్నిత్యం వల్మీకమివపుత్తికా।
పరలోకే సహాయార్థం సర్వభూతాన్యపీడయన్' ४-२३८

చెదలపురుగు పుట్టనుకట్టిన విధముగ కొంచెము కొంచెముగ ధర్మము నార్జించుచుండవలెను. ఏ భూతములకుగాని హాని కలిగించకూడదు.

'నాముత్రహి సహాయార్థం పితామాతా చతిష్ఠతః।
న పుత్రదారం న జ్ఞాతిః ధర్మస్తిష్ఠతి కేవలః ॥'-२३९

పరలోకమందు సహాయముగ తలిదండ్రులు దారపుత్రాదులు వెంటరారు తానాచరించిన ధర్మముమాత్రమే వెంట వచ్చును.

'ఏకః ప్రజాయతేజన్తు రేక ఏవ ప్రలీయతే
ఏకోఽనుభుంక్తే సుకృత మేకఏవచదుష్కృతమ్'-२४०

జన్మించునపుడును మరణించినప్పుడును ఏకాకియై నిలచు చున్నాడు. అట్లే వానివాని సుకృతదుష్కృతమును ఒక్కడే అనుభవించును.

'మృతం శరీరముత్సృజ్య కాష్ఠ లోష్టసమం క్షితౌ।
విముఖా బాంధవా యాన్తి ధర్మస్తమనుగచ్ఛతి'-२४१

కాష్ఠమువలెను లోష్టమువలెను ఉండెడి మృతశరీరమును శ్మశానమందు పారవైచి బాంధవులు ఇండ్లకు మరలి పోయి నప్పడు తానాచరించిన ధర్మము తనవెంట వచ్చుచున్నది.

'తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః।
ధర్మేణహి సహాయేన తమస్తరతి దుస్తరమ్ '—२४२

ధర్మమునందుగల పై విశేషమహిమను తలచి యథాశక్తిగ ప్రతి మానవుడును యెల్లప్పుడును ధర్మము నార్జించవలెను. ధర్మమను సహాయముచేత దుస్తరమగు నంధకారమును దాటగలడు.

అధర్మాచారము నింద్యమను నంశమునుకూడ చెప్పెడి మానవ వచనములు ఈ దిగువున వ్రాయబడుచున్నవి.

'అధార్మికో నరోయోహియస్య చాప్యనృతంధనమ్
హింసారతశ్చయో నిత్యం నేహాఽసౌసుఖమేధతే'४-१७०

అధార్మికుడగు వాడును అన్యాయముగ ద్రవ్యము నార్జించినవాడును హింసచేయువాడును ఇహపరసౌఖ్యములకు దూరులగుదురు.

'నసీదన్నపిధర్మేణ మనోఽధర్మే నివేశయేత్।
అధార్మికాణాం పాపానామాశుపశ్యన్ విపర్యయమ్'१७१

అత్యంతమగు క్లిష్టకాలములందుకూడ ధర్మమునందు అసూయుడై అధర్మమందు ప్రవర్తింపరాదు. అధర్మపరులు అనుభవించెడి దుఃఖములు ప్రత్యక్షముగ కనుబడు చుండగా ఆయవస్థ ననుభవించుట కెవ్వడు సాహసించును?

'నాధర్మశ్చరితో లోకే సద్యఃఫలతి గౌరివ।
శనైరావర్తమానస్తు కర్తుర్మూలాని కృన్తతి' १७२

అధర్మమనునది మేతతినిన ఆవు వెంటనే పాలనిచ్చునట్లు తన దుష్ఫలితమును చేసిన వెంటనే అనుభవింపజేయదు. క్రమముగా పెరుగుచు అధార్మికుని మూలచ్ఛేదముగ నశింపజేయును.

'యది నాత్మని పుత్రేషు నచేత్పౌత్రేషు నప్తృషు।
నత్వేవతు కృతోఽధర్మః కర్తుర్భవతి నిష్ఫలమ్॥'-१७३

ఒకానొకడు చేసిన పాపము యేకారణము చేతగాని వానికి దుష్ఫలితము నీయక విడచినదో అయ్యెది అతని పుత్రుని యందోలేక పౌత్రునియందో తప్పక తన ప్రభావమును చూపి బాధించును కాని అధర్మమనునది ఫలము నీయక విడువ జాలదు.

కావున ధర్మము నాచరించవలయుననుటయు అధర్మము నాచరించగూడదనుటయు శాస్త్రసిద్ధమైయుండుటచే ధర్మము అతిక్రమము జెందకుండ పాలించుట సర్వసాధారణమగు కార్యమనియు ప్రభువుల నుద్దేశించి రామభద్రుని ప్రార్థనము అర్థవంతమగుచున్నది. 'రాజాకాలస్యకారణం' అను మతము ననుసరించి ప్రపంచధర్మ నిర్వాహమునకు రాజులు కర్తలగుటచే రాజుల నుద్దేశించి పలుమారు రాముడు ప్రార్థించినట్లీ శ్లోకము చెప్పుచున్నది.

ఈ శ్లోకమునందలి 'పాలన' శబ్దముచే ధర్మసామాన్య నిర్వాహముతోపాటు ప్రథమశ్లోకోక్త దానపాలనములుకూడ సంగ్రహింపబడుచున్నవని చెప్పుటలో విరోధము లేదు. ఇందలి పాలన శబ్దము 'దానపాలన' శ్లోకమందలి పాలన శబ్ద ప్రత్యభి జ్ఞాపకమనిగూడ చెప్పవచ్చును. ఈ శ్లోకములు రెండును ఏకత్ర పఠింపబడి నప్పుడు పైయర్థము చెప్పుట యందౌచిత్యము కలదు.

'ధర్మఏవహతోహన్తి ధర్మోరక్షతి రక్షితః'

దత్తాపహారమును నిషేధించుచు ప్రవర్తించిన ఈ క్రింది శ్లోకముగూడ దానశాసనములందు తరుచుగ లిఖింపబడుచున్నది.

'స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరామ్'
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే కృమిః'

అర్థము సుగమముగనే యున్నది.

భగవదాలయములకును ఆలయ కైంకర్యపరులకును కైంకర్యములకును చేయబడెడి వివిధములగు సమర్పణములు లేక దానములకు ప్రత్యేకప్రత్యేకములగు ఫలముల వివరణము భగవచ్ఛాస్త్ర సంహితలందును ఇతర గ్రంథములందును చెప్పబడిన ప్రకారము మరియొక వ్యాసమందు సంగ్రహింపబడును.

---

# భారతీయ ధర్మము - II

"కా శ్య ప"

సత్యమును మఱుగుపఱచి హింసించిన అసత్యమగును. పరదారధనాదుల నపేక్షించి తదధిపతుల వంచించిన స్తేయమగును. అన్యుల ధనధాన్యాదుల నపహరింప దలచినవారుగూడ తమ ధనంబుల నితరులపహరింప నెంచినచో వారిని దొంగలనియు దుర్మార్గులనియు దూషింతురు. చౌర్యంబున తరతమభావంబులెన్నియో గలవు. దరిద్రుడు, దుర్బలుడు కడుపుకక్కుఱితికై ఏయల్పమో సంగ్రహించినవానిని పచ్చిదొంగ యందురు. వెంటనే వానికి ప్రభుత్వమో, ప్రజలో కఠినశిక్ష విధింతురు. అధికారులో, బలవంతులో, ఐశ్వర్యవంతులో అట్టి పనిచేసిన, దాని నెట్టైన సమర్థింప విశ్వప్రయత్న మొనరింతురు. వారికి శిక్షగూడ శీఘ్రముగ ముట్టదు. సీత నపహరించిన దశకంఠుడు, పినతండ్రిబిడ్డల రాజ్యము నాక్రమించుకొన్న దుర్యోధనుడు, సహోదరుని దారధనంబులచే జిక్కించుకొన్న ఇంద్రనందనుడు ఘరానా దొంగలు. వారిని శిక్షించుటకు రామాయణ, మహాభారత యుద్ధములు జరుగవలసి వచ్చినవి.

ప్రత్యక్ష ప్రబల హింసా విధానములలో చౌర్యమగ్రగణ్యము. న్యాయముగ నొక రనుభవింపవలసిన ధన సుఖశాంతి వివేకాధికారములు తొలగించినను దొంగతనమే యగును. స్తేయమునకు తల్లి దురాశ, తండ్రి లోభము అనాత్మజ్ఞానము జన్మస్థానము, హింసాస్వార్థపరత్వానత్యాదులు సహోదరులు. పరులకు గలుగు నపకారము గణింపక, చిన్నినాపొట్టకు శ్రీరామరక్షయని - తన సుఖము మాత్రమే అపేక్షించినచో నిట్టి యకార్యకరణమున కొడిగట్టవలసివచ్చును. దాన తనకు గలుగు లాభముకంటె పరులకు చేకూరుహాని మిక్కుటము. ఇహలోకంబున సంపాదించుకొన్న అపకీర్తి అనే కటికచీకటి పరలోక మార్గమును గనుపడనీయదు. చౌర్యము అసత్యము మఱుగున కొంతకాలము తప్పించుకొని తిరుగును. అది సాయపడలేనిచో దౌర్జన్యమునకు దిగును. మీదికివచ్చుచో హత్యగావించుటకైన వెనుదీయదు. పక్షబలంబు సమృద్ధంబుగనున్నచో యుద్ధజ్వాలలు రగుల్కొల్పును. దాన శాంతి భద్రతలు నమసిపోవును. సుఖసంతోషంబులు దూరంబులగును. సుఖసాంఘికజీవనమునకు చౌర్యము వేఱుపురుగు. నాగరకతా సంరక్షణమను పేరిడి దుర్బల రాజ్యముల నాక్రమించి అందలి ప్రజల స్వాతంత్ర్య మపహరించి వారిని శాశ్వతదాస్యమున నిలుపనెంచుట వింతయైన చౌర్యము. తమ మతమే దైవప్రసాదితమనియు నితరమతములన్నియు దైవదూరములనియు, అసత్య

ప్రచారంబు గావించి, మూఢవి వ్యామోహము కల్పించి, అధికారము దుర్వినియోగముచేసి, దౌర్జన్యము ప్రయోగించి, అమాయికత్వాసహాయత్వంబులంతగా గొని అజ్ఞులయిన ప్రజలను తమ మతములో గలుపుకొనువారు, భగవంతుని సర్వసమత్వమునె కొల్లగొట్టు దారిదోపిడు కాండ్రు, తమవారుకారను నెపంబున యోగ్యులను త్రోసి రాజని, ఆత్మీయులను దురభిమానంబున నయోగ్యులకు నున్నతాధికారాదులు కల్పించువారు, కనులుమూసికొని పాలుత్రాగు పిల్లి పంటి అవివేక చోరశిఖామణులు. పాపము - సకలలోక వ్యవహారంబులను నిర్నిమేషస యనంబుల జూచు సర్వేశ్వరుండు గలడనికూడ తెలియ నేరని మసలాగ్ర బుద్ధులువారు!

ఎవరిసొత్తు వారి కప్పగింపకపోవుట, ఒకరి సొత్తు వేరొకరికి సంక్రమింపజేయుట ఉత్కటస్తేయ విభాగంబుల పరిగణింపవగినది. దాతల సంకల్పానుసారమే దాన ద్రవ్యములు వినియోగింపవగినవి, కాని ప్రతిగ్రహీతల స్వేచ్ఛానుసారము దుర్వ్యయముగావింప దగినవికావు. యాత్రాక్రమంబున సందందు నాగవలసియున్నను, గమ్యస్థలము విస్మరించి మధ్యేమార్గంబుననే నిలిచిపోవుట మందబుద్ధుల స్వభావము. జీవయాత్రా రోధనాదులు సాధనములుగాని సాధ్యములుగావు. ధర్మసాధనమునకు ప్రధానమయిన శరీరమును పోషించుటకును, సర్వాత్మత్వము నిరూపించు పరోపకారము కొఱకు మాత్రమే ధనమపేక్షింపవగినది. ''తేత్వఘం భుంజతే పాపాః యేపచన్త్యాత్మకారణాత్'' తమకొఱకే కల ధనమంతయు వినియోగించు కొనువారు మొదటి తరగతి దొంగలని భగవత్సూక్తి.

తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్.

ఈ బ్రహ్మాండములన్నియు సంకల్పమాత్రంబున సృజించి, వాని యందంతటను పరమాత్మ తానై యుండును. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను, మనస్సును పరికరంబులుగా నొసగి మానవుని తన ప్రతినిధిగా నిలిపి అతని దేహంబున జీవరూపంబున నా పరమాత్మయే భాసించుచుండును. అనితర సామాన్యమయిన బుద్ధీంద్రియ సంపత్తిచే సాధింపవగిన లక్ష్యము ఈశ్వరుని సర్వవ్యాపకత్వ పరిజ్ఞానము. ''ఈశావాస్యమిదగ్ం సర్వమ్.'' విషయోపభోగంబుల కభిముఖంబుగ ప్రవర్తించుట బుద్ధీంద్రియములకు సుకరము. విషయాభిలాష విడనాడి అంతర్ముఖంబులై సర్వాంతర్యామి నన్వేషించుట వానికి గడుంగడు దుష్కరము. ప్రమాదాజ్ఞానంబులచే నవశంబుగ విషయంబుల ప్రవేశించినను కూర్మమువలె, ఆపద గోచరించినంతనే ఇంద్రియముల నంతర్ముఖంబుగ నుపసంహరింప నేర్చిన వాడే తత్త్వవేత్త.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ'

విభిన్న నామరూప గుణములుగల యుపాధులలో సభిన్నముగ భాసించు తన్ను గుర్తించి శరణమందుటయే మానవధర్మములలోకెల్ల సర్వోత్తమ ధర్మమని కృష్ణపరమాత్మ గీతోపనిషత్తులో సిద్ధాంతీకరించెను. అట్లే యగునేని ప్రత్యక్షముగ గోచరించు లోక వ్యవహారమునకు వినియోగమే లేదా? భోగంబులు సర్వథా పరిత్యాజ్యంబులే యగునా? అయినచో నవి యేల సృజింపబడినవి? విషయసుఖంబులవంక కన్నెత్తియైన జూడకుండుట సంసార ప్రవిష్టులకు సాధ్యమగునా? ఇత్యాది ప్రశ్నపరంపరలు సహజముగా నుత్పన్నమగును.

(సశేషము)

---

# ఉపాసనా రహస్యము

(వెనుకటి తరువాయి)

జ్యోతిష విద్వాన్, ఆగమవిశారద, తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి

## 8

దీక్షయనగా—దివ్యభావప్రదానాచ్చ క్షాలనాత్కల్మషస్యచ।
దీక్షేతి కథితా సద్భిః భవబంధ విమోచనాత్॥

దివ్యభావమును యిచ్చునదియు పాపమును పోగొట్టునదియు సంసారబంధమునుండి విముక్తి చేయునదియును గనుక దీక్షయని చెప్పబడుచున్నది. ఇట్టి దీక్షలు తంత్రములయందు అనేక విధములుగా నున్నవి. వీనిలో ముఖ్యముగా శాంభవీదీక్ష, శక్తిదీక్ష, మంత్రదీక్షయని మూడు రకములు.

శాంభవీ చైవ శాక్తీ చ మంత్రీచైవ శివాగమె
దీక్షోపదిశ్యతె త్రేధా శివెన పరమాత్మనా ॥ఇత్యాది॥ వీనిలో

1. **శాంభవీ దీక్ష**—యనగా ఉత్తముడగు గురువు శిష్యుని చూచుట వల్లను తాకుట వల్లను సంభాషించుట వల్లను

శిష్యునకు జ్ఞానము కలుగుటచే యీ దీక్ష శాంభవీదీక్ష యన బడును—2. శాక్త దీక్ష—యనగా గురువు జ్ఞానదృష్టిచే యోగమార్గమున శిష్యుని దేహమందు ప్రవేశించి జ్ఞానమును కలిగించునుగాన శాక్తదీక్ష యనబడును. ఇదియే శక్తి పాతదీక్ష— 3. మంత్ర దీక్ష—యనగా కేవల మంత్ర మును గురువువల్ల పొంది మండలచక్రమూర్తులయందు దేవుని పూజించుటయే మంత్రదీక్ష. ఈ దీక్షనే క్రియాదీక్ష యందురు. ఈ మంత్రదీక్షలో శైవమంత్రదీక్ష, శాక్తమంత్ర దీక్ష, వైష్ణవమంత్రదీక్ష, సామాన్య మంత్రదీక్ష యనియు భేదములుగలవు. సామాన్య మంత్రదీక్షలలో పంచాయతన దీక్ష ముఖ్యము. ఈ మూడు రకముల దీక్షలలో అవాం తర భేదములు కొన్ని గలవు. అవి వర్ణదీక్షా, కళాదీక్షా, స్పర్శదీక్షా, వాగ్దీక్షా, దృక్దీక్షా, వేధాదీక్షా, యామళదీక్షా అనునవి.

1. వర్ణదీక్షా— వర్ణములనగా అకారాది హకారాం తము పంచాశన్మాతృకలు; ఈ మాతృకలు సూర్యచంద్ర అగ్న్యాత్మకములు అని వెనుకనే చెప్పబడినది. దేహము సూర్యచంద్ర అగ్న్యాత్మక త్రిఖండము (పాదములనుండి నాభివరకూ అగ్నిఖండము, నాభినుండి కంఠమువరకూ సూర్యఖండము, కంఠమునుండి పై భాగము చంద్ర ఖండము). ఈ మాతృకలే నవవర్గాత్మకములై యున్నవి. శరీరము నవధాతువులతో నిర్మితమైనది (త్వగసృఙ్మాం సమజ్జా అస్థిచర్మ మేద శ్శుక్ల జీవ). మాతృకలకు పంచభూతా త్మకత్వముగలదు; దేహము పంచభూతాత్మకత్వము గలది. పంచాశన్మాతృకలు దేహమందు పంచాశదవయవ రూప ములై యున్నవి. శివశక్త్యాత్మకములగు మాతృకలను శివ శక్త్యాత్మకమగు దేహమునందు ఐక్యముచేసి గురువు శిష్యు నకు ఏకత్వము గలిగించు దీక్షయే వర్ణదీక్ష యనబడును; ఈ దీక్షయే న్యాసదీక్ష; త్రిఖండమగు దేహమునకు త్రిఖండ మగు మాతృకలకు పంచభూత రూపములగు మాతృకలకు పంచభూత వికారమగు దేహమునకు నవధాతు నిర్మిత దేహమునకు నవవర్గాత్మక మాతృకలకు పంచాశన్మాతృ కలకు దేహమందుగల పంచాశదవయవములకు ఐక్యమును బోధించునదిగాన వర్ణ దీక్ష యనబడుచున్నది.

2. కళాదీక్ష—సకలుడగు పరమేశ్వరునుండి పంచ కళలు పుట్టినవి అని పూర్వమే చెప్పబడినది. అట్టి పంచ కళలయొక్క రూపమే దేహము; కళలకు దేహమునకు ఐక్యమును బోధించుటయే కళాదీక్ష—సకలుడగు పర మేశ్వరునివలన ప్రకాశాఖ్యబిందువునుండి కళలు, కళల నుండి తత్త్వములు, తత్త్వములనుండి భువనములును, తచ్ఛక్తియగు విమర్శాత్మకబిందువునుండి వర్ణములు, వర్ణములనుండి పదములు, పదములనుండి మంత్రము లును యిట్లు శివశక్త్యాత్మకములై షడధ్వములు పుట్టినవి. వీనిలో ప్రకాశబిందువునుండి ప్రణవము, విమర్శ బిందువు నుండి దేహమునుపుట్టి షడధ్వరూపములై యున్నవి. కావున ప్రణవరూపమే దేహము. దేహమునందు పాదములనుండి జానువుల వరకును (మోకాళ్లు) నివృత్తి కళాస్థానము; జానువులనుండి నాభివరకును ప్రతిష్ఠాకళాస్థానము; నాభి నుండి కంఠపర్యంతము విద్యాకళాస్థానము; కంఠము నుండి లలాటమువరకును శాన్తికళాస్థానము; లలాటము నుండి బ్రహ్మరంధ్రమువరకును శాన్త్యతీతకళాస్థానము. ఇట్లు వ్యాపించియున్న కళలనుండి ముప్పదియారు తత్త్వ ములు, తత్త్వములనుండి రెండువందల యిరువదినాల్గు భువనములు, వీనినుండి పంచాశద్వర్ణములు, వర్ణముల నుండి యెనుబదియొక్క పదములు, పదములనుండి పదునొకండు మంత్రములును, యిట్లు షడధ్వములును ఉద్భవించినవి. ఈ కళలకు అధిదేవతలగు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు, అకార, ఉకార, మకార, అర్ధమాత్ర, బిందురూపులై సమష్టిప్రణవరూపులై శివశక్త్యాత్మకదేహరూపముతో నున్నారు. గురువు శిష్యునకు యీ దేహప్రణవములకు అభేదమును తెలియజేసి సృష్టి క్రమముగానున్న కళలను, వరుసగా నివృత్తికళను ప్రతిష్ఠా కళయందు, ప్రతిష్ఠాకళను విద్యాకళయందు, విద్యాకళను శాన్తికళయందు, శాన్తికళను శాన్త్యతీతకళయందు సంయో గముచేసి - అనగా దేహమందు - మూలాధారమందు గల విమర్శాత్మకశక్తిని క్రమముగా ప్రకాశాత్మకకళలతో ఏకీ భావముచేసి బ్రహ్మరంధ్రమందు గల శివునితో చేర్చుటచే అభేదజ్ఞానము గలిగించుటయే కళాదీక్ష—

3. స్పర్శదీక్ష—శిష్యుని యొక్క శిరమునందు గురువు హస్తమునుంచి సర్వమంత్రములను ఉపదేశిం చుటయే స్పర్శదీక్ష—

4. వాగ్దీక్ష—గురువు శిష్యునకు యే మంత్రమును ఉపాసించుట యిష్టమో ఆ మంత్రదేవతను హృదయము నందు నిల్పి మంత్రమును ఉపదేశించుటయే వాగ్దీక్ష— మంత్రోపదేశమునందు స్త్రీ శూద్రులకు వాగ్దీక్ష యందు మాత్రమే అధికారము; ఇతరదీక్షల యందు అధికారము లేదు—

5. దృగ్దీక్ష—గురువు నేత్రములు మూసి మంత్ర దేవతను చక్కగా హృదయమునందు ధ్యానముచేసి దేవతాభావమును పొంది నేత్రములు తెరచి ప్రసన్నచిత్త ముతో శిష్యుని చూచి మంత్రోపదేశము చేయుట దృగ్దీక్ష—

6. వేధాదీక్ష—బ్రహ్మనిష్ఠుడగు గురువు శిష్యునకు రేచకపూరక కుంభకములచే ప్రాణాయామమును బోధించి ఇడాపింగళా సుషుమ్నా మార్గములలో ఇడాపింగళా

నాడుల ద్వారా ప్రయాణముచేయు (21600 పర్యాయములు ప్రతి దినములో) హంస రూపమగు వాయువును నిరోధించి ఆధార చక్రమున గల నాలుగు దళములలోని వ, శ, ష, స లను అక్షరములను చక్రమందు గల త్రికోణ కర్ణికలో సోమసూర్యాగ్న్యాత్మకమై కోటి విద్యుత్ప్రభమగు కుండలినీశక్తిలో సంయోగముచేసి సూక్ష్మరూపమగు కుండలినీ శక్తిని సుషుమ్నామధ్య మార్గమున ప్రవేశింపచేసి చక్రాధిష్ఠాతయగు బ్రహ్మను వేధించి అచ్చట నుండి స్వాధిష్ఠాన చక్రమునుచేరి ఆరుదళములలో గల బ, భ, మ, య, ర, ల అను అక్షరములతో సంయోగము పొంది చక్రాధిదేవత విష్ణుని వేధించి మణిపూరక చక్రమునుచేరి అచ్చట పదిదళములలోని డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, అను అక్షరములను లీనము చేసుకొని చక్రాధిదేవత రుద్రుని వేధించి తిరిగి అనాహత చక్రములనుచేరి అచ్చట గల పన్నెండు దళములలోని క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ యను అక్షరములతో గూడి చక్రాధిదేవత ఈశ్వరుని వేధించి అచ్చటనుండి విశుద్ధ చక్రమును ప్రవేశించి అందుగల పదునారు దళములలోని అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః అను అక్షరములతో సంయోగము పొంది చక్రాదిదేవత సదాశివుని వేధించి తిరిగి ఆజ్ఞాచక్రమును ప్రవేశించి అచ్చట గల రెండు దళములలోని హ, క్ష, యను వర్ణములను లీన మొనర్చుకొని చక్రాది దేవతయగు బిందువుతో సంయోగమై తద్బిందు రూపమగు చిచ్ఛక్తి తదూర్ధ్వమున గల సహస్రారమందు ప్రవేశించి తన్మధ్యస్థమగు పరమశివునితో ఐక్యమును పొంది అఖండాత్మకమై నాదబిందుకళాతీతమైన అభేదజ్ఞానమును కలిగించి తిరిగి సృష్టి క్రమముగా హృదయమందు జీవుని మూలాధారమందు కుండలినీ శక్తిని నిల్పి మంత్రోపదేశము చేయుటయే వేధాదీక్ష— ఇట్లు గురువువలన జ్ఞానమును పొంది శిష్యుడు సర్వ సంశయములు పోగొట్టుకొని సర్వాత్మభావము పొంది కృతకృత్యుడగును; ఇట్లు వేధాస్వరూపము తెలియజేసి సాంగమంత్ర రహస్యమును ఉపదేశించి దేహచక్రమంత్రములకు అవినాభావము బోధించుట వలన యీ వేధాదీక్ష ముఖ్యమై యున్నది. ఈ దీక్షకు యోగ్యుడగు గురువు వలన తెలుసుకొని అభ్యసించ వలయునే గాని మరియొక విధముగా తెలియుటకు వీలులేదు—

**7. యామళదీక్ష**—గురువు పైన చెప్పబడిన దీక్షాదులద్వారా అభేదజ్ఞానము గలిగించి జపాదులద్వారా కృతకృత్యుడగు శిష్యుని అత్మాష్టాక్షరీ మంత్రముచే సంస్కరించి దక్షిణ కర్ణమున మహావాక్యోపదేశము చేయగా శిష్యుడు గురు చరణములు గ్రహించి తన సర్వస్వమును గురువునకు అర్పించి సర్వాత్మభావముతో నుండు దీక్షయే యామళ దీక్ష—

**8. క్రియాదీక్ష**—పూజోపకరణములను సంపాదించి పూర్వాంగోత్తరాంగములతో గురువునొద్ద అభిషేకమును పొంది మంత్రోపదేశమగుటయే క్రియాదీక్ష యనబడును. ఈ క్రియాదీక్షకు పూర్వాంగములు - మంత్రమైత్రీ దర్శనము, యోనిముద్రాశోధనము, దశసంస్కారములు, వాస్తుయాగము, మండప రచన, కుండకల్పనము, వేదీకరణము, మండపాలంకరణము, అంకురార్పణము, దీక్షారంభము; ఇట్టి పూర్వాంగములతో గూడినది క్రియాదీక్ష యనబడును. వీనిని గురించి విచారింతము—

### మంత్రమైత్రీ దర్శనము

సాధకుడు మంత్రదీక్షను పొందుటకు ముందు తనకును మంత్రదేవతకును అర్ణవణము చూచుకొనవలయును (అర్ణవణమనగా శతృమిత్రత్వములను తెలుపునది)

అర్ణవ చక్రలేఖనవిధి—

కోష్ఠాకాషోడశా భూపంతేషు వర్ణాంకలేఖనం
వామభాగె సమారభ్య దక్షిణాంతం పునఃపునః
ఏకంద్వౌత్రీణిచేత్యాది సంఖ్యాషోడశనంలిఖేత్
చంద్రాకిరసబాణాశ్చత్రిచతుర్వసు పర్వతాః
రుద్రాదిత్య కళాఃపక్షాఃనవదిఙ్మను విశ్వకాః
ఏతదంక క్రమాత్కోష్ఠాఃచక్రైకశ్చ చతుశ్చతుః
సిద్ధసాధ్యసుసిద్ధారి చక్రాణాంస్యాచ్చతుష్టయం
వీక్షతేర్వణచక్రంతు మంత్రమౌషధ దైవతం
స్వనామాద్యక్షరాద్యావన్మంత్రాద్యక్షరదర్శనం
సిద్ధాదీన్కల్పయేన్మంత్రీ కుర్యాత్సాధ్యాదిభిఃపునః
చతుశ్చతుర్విభాగెన సిద్ధాదీన్గణయెత్పునః
సిద్ధసిద్ధోజపాత్సిద్ధఃద్విగుణాత్సిద్ధసాధ్యకః
సిద్ధస్సుసిద్ధోఽర్ధజపాత్సిద్ధారిర్హంతిబాంధవాన్
సాధ్యసిద్ధోఽతి సంక్లేశాత్సాధ్యసాధ్యోనిరర్ధకః
సాధ్యసుసిద్ధోభజనాత్సాధ్యారిర్హంతిగోత్రజాన్
సుసిద్ధసిద్ధోఽర్ధజపాత్తత్సాధ్యస్తుయథోక్తతః
స్మరణాత్తత్సుసిద్ధస్తుతదరిర్హంతిసేవకాన్
అరిసిద్ధస్సుతంహన్యాదరిసాధ్యస్తుయోషితః
తత్సుసిద్ధః కులంహంతి స్వాత్మానంహంతిత ద్రిపుః
సిద్ధార్ణాబాంధవాః ప్రోక్తాః సాధ్యాస్తే సేవకాఃస్మృతాః
సుసిద్ధాః పోషకా జ్ఞేయాః శాత్రవోఘాతకాః స్మృతాః॥

సాధకుడు నిలువుగా అయిదు గీతలు అడ్డముగా అయిదు గీతలు గీసి షోడశకోష్ఠములు గల చక్రమును వ్రాసి ఎడమ నుండి కుడికి క్రమముగా 1-2-6-5 గడులు సిద్ధచక్రముగాను 3-4-8-7 గడులు సాధ్యచక్రముగాను

11-12-16-15 గడులు సుసిద్ధచక్రముగాను 9-10-14-13 గడులు అరిచక్రముగాను నిర్ణయించి తన నామము యొక్క ప్రథమాక్షరము మొదలు కొని మంత్రము యొక్క మొదటి అక్షరమువరకు వరుసగా నాలుగు చక్రముల యందు మొదటి చక్రము యొక్క మొదటి గడిలో మొదటి అక్షరము రెండవ చక్రము యొక్క మొదటి గడిలో రెండవ అక్షరము మూడవ చక్రము యొక్క మొదటి గడిలో మూడవ అక్షరము నాల్గవ చక్రము యొక్క మొదటి గడిలో నాల్గవ అక్షరము తిరిగి మొదటి చక్రము యొక్క రెండవ గడిలో అయిదవ అక్షరము యిట్లు లిఖించి ఫలమును ఊహించ వలయును; మొదటి చక్రములో మొదటిగడి సిద్ధసిద్ధము, రెండవగడి సిద్ధసాధ్యము, మూడవగడి సిద్ధసుసిద్ధము, నాల్గవగడి సిద్ధారి, రెండవ చక్రములోని మొదటిగడి సాధ్యసిద్ధము, రెండవగడి సాధ్య సాధ్యము, మూడవగడి సాధ్యసుసిద్ధము, నాల్గవగడి సాధ్య అరి; మూడవ చక్రములోని మొగటిగడి సుసిద్ధసిద్ధము, రెండవగడి సుసిద్ధసాధ్యము, మూడవగడి సుసిద్ధసుసిద్ధము, నాల్గవగడి సుసిద్ధారి, నాల్గవ చక్రములోని మొదటిగడి అరి సిద్ధము, రెండవగడి అరిసాధ్యము, మూడవగడి అరి సుసిద్ధము నాల్గవగడి అరిఅరి. ఇట్లు నిర్ణయించు కొని పైనచెప్పిన ఫలమును ఊహించు కొనవలయును. సిద్ధ సిద్ధములోని మంత్రము జపమువల్ల సిద్ధియు, సిద్ధసాధ్యము ద్విగుణ జపమువల్ల సిద్ధియు, సిద్ధసుసిద్ధము ఉపదేశము వల్ల సిద్ధియు, సిద్ధారిబంధు నాశమును కలుగజేయును. సాధ్యసిద్ధము చాల ప్రయాసమువల్ల సిద్ధియు, సాధ్య సాధ్యము ప్రయోజనశూన్యమును, సాధ్యసుసిద్ధము జపము చేత సిద్ధియు, సాధ్యారి గోత్రనాశమును కలుగ జేయును. సుసిద్ధసిద్ధము స్మరణమాత్రముచేత సిద్ధియు, సుసిద్ధ సాధ్యము ఉపదేశ మాత్రమున సిద్ధియు, సుసిద్ధ సుసిద్ధము స్మరణము వల్లనే సిద్ధియు, సుసిద్ధారి సేవకుల నాశమును కలుగ జేయును. అరిసిద్ధము సుతనాశమును, అరి సాధ్యము భార్యావియోగమును అరిసుసిద్ధము కులనాశ మును, అరిఅరి స్వనాశమును కలుగజేయును. సిద్ధ చక్రములోని మంత్రములు బంధువుల వలెను, సాధ్యము లోని మంత్రములు సేవకుల వలెను, సుసిద్ధములోని మంత్రములు పోషకుల వలెను అరిలోని మంత్రములు శతృవులవలె హాని జేయునవియు అగును. కావున సాధ కుడు విచారించి అనుకూలమగు మంత్రములను దీక్ష పొంది జపించ వలెను—మంత్ర దీక్ష యందు అర్వణము చూడ వలశిన అవసరములేని మంత్రములు యీ క్రింద వ్రాయబడు చున్నవి.—

స్వప్నలబ్ధం దైవదత్తం స్త్రీదత్తం గురుదత్తకం
పితృదత్తం మాతృదత్తం సిద్ధాదీనినశోధయేత్
పీఠత్రయాణిమంత్రాణి పంచప్రణవబీజకం
సపిండ్యాక్షరమంత్రాణిసిద్ధాదీనినశోధయేత్
నృసింహంచవరాహంచవాసుదేవంచ వైష్ణవం
ఏకాక్షరింత్ర్యక్షరించ సిద్ధాదీనినశోధయేత్
బాలాంపంచ దశీంచైవషోడశింశివతారకమ్
నారాయణంచ పంచైతాన్ సిద్ధాదీనినశోధయేత్
గోపాలంవామనం రామం భాస్కరంచసుదర్శనం
నామత్రయం కార్యవతీం సిద్ధాదీనినశోధయేత్
అంజనేయంహయగ్రీవం దక్షిణామూర్తి మంత్రకం
చింతామణింగణేశంచ సిద్ధాదీనినశోధయేత్
సార్పంచగారుడంచైవభాషామంత్రంచశాబరం
పంజరం కవచం మాలాంసిద్ధాదీనినశోధయేత్
అర్వణార్థంతుమంత్రాణాం ప్రణవస్తుప్రయుజ్యతే
తస్మాత్ప్రణవయుక్తాని సిద్ధాదీనినశోధయేత్ ॥

ఇట్లు పైనచెప్పిన మంత్రములను దీక్షపొందుటకు సిద్ధారి శోధ నము అవసరములేదు—

(సశేషము)

---

యఉదగాన్మహతోఽర్ణవాత్
విభ్రాజమానస్సరిరస్య మధ్యాత్ ।
సమావృషభో లోహితాక్షః
సూర్యో విపశ్చిన్మనసా పునాతు ॥

# దర్శన వీధి - II

జమ్ములమడక మాధవరామశర్మ.

పరమ పురుషార్థ మంపరకు సమ్మతము. కాని దాని
నిర్ణయించుటలో భావభేదము లున్నవి. అందుననే దర్శన
భేదములు వచ్చినవి. భారతీయుల దర్శన కథ సుదీర్ఘ కాల
మును వ్యాపించియున్నది. ఋగథర్వసంహితలలో సంకేత
రూపములుగానున్న తత్వములు, బ్రాహ్మణారణ్యకోపనిషత్తు
లలో విశదములయినవి. ఉపనిషద్వాదములె దర్శన వాద
ములుగ ప్రసిద్ధి పొందినవి. ఉపనిషద్గూఢమయిన యర్థ
మును విశదము చేయుటకై యత్నించిన పెద్దలు దర్శించిన
విధమున దర్శనములు వచ్చినవి. "ఉపనిషద్వాదములలో
వైరుధ్యములేకుండు గావుత!" అని వాని సమన్వయము
నకై బ్రహ్మసూత్రములుదయించినవి. బ్రహ్మసూత్రనిశ్చిత
మార్గమున నుపనిషద్భావములను గుర్తించి దర్శన నిర్ణ
యము చేసికొనుట సముచితము. దర్శనప్రియులట్లె
దర్శన మాత్మదర్శనముగ చేసికొనిరి. బ్రహ్మసూత్రముల
యర్థము విశదముగా తెలిసిన సమయమున నిశ్చిత దర్శన
మును నిర్ణయించుకొనిరి. బ్రహ్మసూత్రార్థము నిశ్చితము
కాని, స్పష్టముకాని, సమయమేతెంచినది. సూత్రశబ్దములు
స్వల్పములై, నిగూఢములై యున్నందున భావము దుర్బోధ
మయినది. దాని సుబోధము చేయుటకై ఆచార్య పాదు
లనేకులు యత్నించిరి. వారి యత్నములన్నియు దర్శనము
లయినవి. ఉపనిషద్దర్శనము వేదాంత దర్శనము; వేదాంత
దర్శనమె బ్రహ్మసూత్రములోని బాదరాయణ దర్శనము;
బాదరాయణ బ్రహ్మసూత్రార్థము భారత పురాణ సంహిత
లలో రూపాంతరమున వ్యాఖ్యాతమై నిరూపిత మయినది.
కావుననే పురాణ దర్శనము కాని, భారతదర్శనము కాని
వేదాంతదర్శనమనియే భారతీయుల భావనము. భారత
సంహితలోని భగవద్గీత వేదాంత దర్శనము. ఉపనిష
త్సూత్రగీతాదర్శనమున నేకదర్శనముచే భావించిన
పెద్దలు వీనికి ప్రస్థాన త్రయమని పేరుపెట్టిరి. ఉపనిషద్గ
తమె సూత్రసమ్మతము. అదియే గీతాసిద్ధాంతము. ఇట్టి
నిశ్చయముతో దర్శనములు వెలసినవి. భాష్యభాషణము
చేసినవారి భావములు ప్రత్యేకతలు కలవై వేరువేరు దర్శన
ములకు నిదానములయినవి; వానికి వారి వారి నామ సంకే
తములతో వ్యవహారములు కలిగినను అవి వారలకన్న చాల
ప్రాచీన వాదములు. బ్రహ్మసూత్రార్థము వివరించుటకై
శంకరుడు, రామానుజుడు, మధ్వరాయుడు, శ్రీకరుడు,
శ్రీకంఠుడు, నింబార్కుడు, వల్లభుడు, చైతన్యుడు, బల
దేవుడు, మొదలగువారు వాదబలముల చూపి "యిదియే
తత్త్వము" అని నిర్ణయించిరి. ఇవి యన్నియు వేదాంత
దర్శనములు. బ్రహ్మసూత్రమునందు కొన్ని వాదములు
నిరస్తములయినవి. సాంఖ్యయోగములు, న్యాయ వైశే
షికములు, జైన బౌద్ధములు, పాశుపత పాంచరాత్ర
ములు, ఈ యెనిమిది వాదములు కాదని వ్యాసుడుపనిష
ద్వాదము చెప్పెను. భాష్యకర్తల బలప్రభావములు "ఉప
నిషద్వాద మిదియా? అదియా? ఏది?" అను సందేహ
మున కవకాశమిచ్చినది. ఈ వైదిక దర్శన ప్రస్థాన మంగీక
రింపని బౌద్ధప్రౌఢులు కొందరు "ఔపనిషద మతమును
శంకరుడు ప్రకాశింప జేసె"నని యనుచున్నారు. శంకరే
తర దర్శనములను ఔపనిషదములని బౌద్ధులనుట లేదు.
యోగవాశిష్ఠ గ్రంథము మోక్షసంహిత. దానిలోని వాదము
దర్శనవాద మయినది. ఉపనిషత్పురాణ సంహితలలో
నిరూపితములు కాని కొన్ని గూఢార్థములు తంత్రగ్రంథము
లలో గుప్తము లయినవి. తాంత్రిక దర్శనములు కొన్ని
రూప వైభవముతో ప్రకాశించినవి. తంత్రోక్తముకూడ
వేదాన్త సంవాదముతో నున్నదని దర్శనకారులే కొందరు
నిరూపించిరి. ఉపనిషత్తులలో పురాణములలో తంత్రము
లలో నేకార్థ నిశ్చయమును సంపాదించిన దర్శనవేత్తలు
సామరస్యమును చూపిరి. మరికొందరు ఉపనిషదాత్మకు,
పురాణ బ్రహ్మకు, తంత్రసంవిత్తికి రూపసంవాదమును
చెప్పరు. వేరుపాటును నిర్ణయింతురు. అపుడు పురాణ
దర్శనము, తంత్రదర్శనము వేరుకాక తప్పుటలేదు.
పురాణము లెన్నియున్నవి. దర్శనము లన్నియగునేమో!
తంత్రము లెన్నియో కలవు. తంత్రదర్శనము లన్నియగు
నేమో! ఉపనిషద్దర్శన మొక్కటేయనుటకు బ్రహ్మ
సూత్ర ముదయించి సమన్వయము జూపినది. అట్లే పురాణ
దర్శనైకత్వమునకు పురాణ సూత్రముదయించునా?
తంత్రదర్శనైక్యమునకు తంత్రసూత్ర మావిర్భవించునా?
వేదాంత పురాణ తంత్ర దర్శన సమైక్యమునకు మహార్థ
సూత్రముదయించునా? దర్శనలోకము దారి తెన్నులు
చూచుచున్నది.

శ్రుతి బలమునే బలముగ జేసికొని దర్శనము వెలువడి
నది. శ్రుత్యర్థమును యుక్తిబలమున నిర్ణయించిన
కొందరు, యుక్తివాదమునకు బలమిచ్చి, శ్రుతిబలమును
సహకరింప జేసుకొనిరి. వారు వేదమును కాదనరు,
ఔననరు. వారు యుక్తి దర్శన ప్రియులు. వారిదర్శనము
లకును రూపవైభవము, వాదవైభవము కలిగినది. తత్త్వ

ములనే సంఖ్యానించి బ్రహ్మాండ భాండమును విశకలితముగ పర్యాలోచనముచేసి "వేదము దీనినే చెప్పును" అనెడివారును దర్శనమార్గ ద్రష్టలయినారు. ఈ వైదికములను కాదని తమ ప్రవర్తకాచార్యుల బలమునుబట్టి బయలుదేరిన జైన, బౌద్ధ, దర్శనములును కాయశరీరములను పెంచుకొనినవి. బేదప్రబేదములు కూడను యవియు దర్శనప్రఖ్యాతిని సంపాదించినవి. వీరందరు ఈ లోకమును కాక వేరొక లోకము భావించు దర్శన ప్రియులు. వేరొక లోకమునే కాదని, యీ లోకమే ఔనని దర్శనమును వెలయించుటకు తెన్నులుజూపి కన్నులు తెఱచిన వారున్నారు. వీరందరిలో బేదములున్నవి, ప్రభేదములున్నవి. ఇది యంతయు భారతీయ దర్శన వ్యూహము.

వైదేశికులీ దేశము ప్రవేశించిరి. వారును తత్త్వచింతకులై దర్శనములు వెలయించిరి. తురుష్క దేశీయ దర్శనములు, యూరపు దేశీయ దర్శనములు నేడీదేశమున గొన్ని యున్నవి. వానిని చదివి భారతీయ దర్శనహృదయులయిన కొందరు నవదర్శనములు ప్రదర్శించిరి. అటువంటి దర్శనమిట్టిది. నేడు దేశములలో ఎల్లలు మాయుచున్నవి. నదులు, గిరులు, సాగరము లడ్డముగ లేవు. నానా దర్శనములు ప్రవేశించు చున్నవి. ఇట్టి వన్నియు నేడు దాదాపు శతద్వయ దర్శనము లున్నవి. నవలోక మీనాడు దర్శనములను కలయ జూచి విశ్వదర్శనమును కాంక్షించు చున్నది. దానికై దర్శన మీమాంస యపేక్షితము. దర్శనవీధి దర్శన మీమాంసాభవనమును చేర్పగలదు.

భారతీయ విద్వాంసులు చిరకాలముగా సత్యాన్వేషణ మొనర్చు చున్నారు. భారతీయుల విచారధార రెండు విధములుగ ప్రవహించినది. ప్రతిభామూలక మొకటి. తర్కమూలకము రెండవది. తత్త్వసమీక్ష కొఱకై ప్రయత్నించిన వారు తత్త్వలాభ పర్యంతము ప్రయత్నింతురు. ప్రతిభాజ్ఞాన ప్రకాశమున్నవారు మూల తత్త్వములను పరిగణింప గలరు. తర్కమూలమున ప్రవర్తించువారు వివేచకుల నందరిని కూడ గట్టుకొని నిర్ణయమొనరింతురు. వేదరాశి యందు నీ రెండు విధములగు ప్రవృత్తులును గోచరించుచున్నవి. వీరిలక్ష్యము రెండు విధముల ప్రసరించినది. ధర్మోపార్జనము కొందరి లక్ష్యము. బ్రహ్మసాక్షాత్కారము మఱియొకరి లక్ష్యము. కర్మ వివేచనమునకై తర్కమూలక ప్రవృత్తి యుపయోగించినది. ఉపనిషత్తులలో తర్క ప్రతిభా మూలకమయిన వివేచనము గోచరించును. ఆత్మ పరమాత్మలకైక్యము సిద్ధపఱచుట, యుపనిషత్తుల తత్త్వ జ్ఞానము. కేవల తర్క మూలముగ కేవల ప్రతిభా మూలముగ దర్శనములు వెలువడినవి. ఇట్లు గోచరించు దర్శన నానాత్వమును భావించుట సముచితము. ఏప్పుడెప్పుడేమే దర్శన సంప్రదాయము లావిర్భవించెనో చెప్పుట శక్యముకాదు. చిరకాలముగా వ్యాపించి వచ్చిన వానివాని భావములను కొందరు క్రోడీకరించి యుందురు. అట్టి గ్రంథములలో స్వమతము ప్రతిపాదించు కొనుట యొకటి. పరమతము ఖండనము చేయుట యొకటి. గ్రంథకారులయిన దర్శనకర్త లందరును తమవఱకు వచ్చిన ఆయా సిద్ధాంతములను నిబంధించినారే కాని వారే ప్రవర్తకులుకారు. దర్శన గ్రంథములకు పూర్వమే దర్శన సిద్ధాంతము లుదయించును.

దర్శన కర్తలను కొన్ని ప్రశ్నలు పట్టినవి. వారివారి మనోబలమున సమాధానించుకొని తత్త్వనిర్ణయ మొనరించిరి. ప్రమాణము లెన్ని విధములు? తత్త్వాన్వేషణము నకేవేవి సమర్థములు? ప్రమాణములలోనేవి ప్రబలములు? ఏవి దుర్బలములు? అవి స్వతః ప్రమాణములా? పరతః ప్రమాణములా? వేదము పౌరుషేయమా? అపౌరుషేయమా? శబ్దము నిత్యమా? అనిత్యమా? ప్రమాణసిద్ధమగునది చేతన మొకటియేనా? జీవేశ్వర భేదమున ననేకమగునా? పరమేశ్వరుడు నిర్గుణుడా? సగుణుడా? జీవుడెట్టివాడు? అచేతనమగు జగమునకు మూలకారణమేమి? అచేతన మూలతత్త్వము లెన్నియున్నవి? జ్ఞానస్వరూపమెట్టిది? అది గుణమా? ద్రవ్యమా? సాకారమా? నిరాకారమా? తత్త్వజ్ఞానమున గలుగు మోక్షమెట్టిది? మోక్షమిచ్చువాడెవ్వడు? ఇట్లు సంఖ్యాకములయిన ప్రశ్నలు దర్శనములందు నమాహితములయినవి. వేదములు గూఢార్థములుగా నున్నవి. మతిభేదమున వానికర్థభేదమును వచ్చినది. ఇట్లు దర్శన మతిగంభీరమయినది. సాధారణజనులు దాని దర్శింప లేకున్నారు. కాని దర్శనమును గుర్తింప వలెనని యాసక్తి కలుగు చున్నది. దర్శనమను నది జ్ఞానసామాన్యము నిరూపించును. ఈ ప్రపంచము నందు రెండు విధములగు పదార్థములు గోచరించు చున్నవి. కొన్ని చేతనములు, మఱికొన్ని యచేతనములు. ఈ చేతనాచేతనముల మూలతత్త్వ మన్వేషించుటయే దర్శనము. అది మోక్షసాధనము మూలతత్త్వములను ప్రమాణములచే తెలియ వలయును. ప్రమాణములును ప్రత్యక్షానుమానశబ్దాదు లెన్నియో కలవు. ప్రమాణ భేదమునుబట్టి దర్శన భేదము కలుగు చున్నది. ప్రమాణము లెన్ని యున్నను దర్శనకర్తలకు కొన్నిటి యందాదరమధికము. కొన్నిటి యందాదరము మందము. కొందరు వేదమునే విశ్వసింతురు. మఱికొందరు విశ్వసించరు. విశ్వసించెడి వారిలోకూడ దృఢ విశ్వాసము మంద విశ్వాసముండును. మూలతత్త్వానుసంధానములో ప్రత్యక్షమొక్కటియే ప్రమాణమా? అది యొక్కటియె ప్రమాణ

మని కొందరందురు. మఱికొందరు అనుమానమె ప్రమాణ మని యభిమానింతురు. వేదమే ప్రమాణమని కొందరి విశ్వాసము. ఇట్లు ప్రమాణములు కేవల ప్రత్యక్షరూపములు, యుక్తిరూపములు, శ్రుతిస్వరూపములుగా నున్నవి. ప్రమాణభేదమున దర్శనములు నానా యయినవి. వారు దర్శించిన తత్త్వభేదమున కూడ దర్శనము లనేకము లయినవి. నాస్తికులాస్తికులని దర్శనకారులు రెండువిధ ముల నందురు. నాస్తికులును ప్రత్యక్షవాదులు కొందరు, తర్కయుక్తులనుసరించు వారుకొందరు. కేవల ప్రత్యక్ష వాదులు చార్వాకులు. చార్వాకుల దర్శనము చార్వాక దర్శనము. నాస్తిక తార్కికులలో రెండు రకములవా రున్నారు. కొందరుక్షణిక వాదులు కొందరు స్యాద్వాదులు. క్షణికవాదులు బౌద్ధులని, స్యాద్వాదులు జైనులని వ్యవ హార మున్నది. ఆస్తిక దర్శన వాదులును రెండు విధముల నున్నారు. కొందరు సగుణాత్మవాదము జేయుదురు. మఱి కొందరు నిర్గుణాత్మ వాదులు. సగుణ వాదులలో గూడ తార్కికులున్నారు; వేదవాదు లున్నారు. వీరిలో తార్కి కులు, స్పష్టతార్కికులు, ప్రచ్ఛన్న తార్కికులు కలరు. ప్రచ్ఛన్న తార్కికులలో స్పష్టముగ ద్వైతము పలుకని వారు కలరు. వారె విశిష్టాద్వైత వాదులు రామానుజీయులు; ద్వైతము స్పష్టముగ జెప్పువారు మాధ్వులు; స్పష్టతార్కిక లలో కర్మాపేక్షలేని ఈశ్వర వాదము సల్పువారును, కర్మ సాపేక్షమయిన ఈశ్వర వాదము చేయువారును గలరు. వీరే పాశుపత దర్శన, శైవదర్శన వాదులు; ఇంకను ఆత్మైక్యము చెప్పువారు, జీవన్ముక్తి నిరూపించువారు కొందరున్నారు. స్పష్టతార్కికులలో నదృష్ట వాదమొన రించు వారు కొందరు శబ్దమును ప్రమాణాంతరముగ నంగీకరింతురు. వారు నైయాయికులు; శబ్దము ప్రమాణాం తరమని యననివారు వైశేషిక దర్శనమువారు. వేదవాదులు రెండు విధముల నున్నారు. వాక్యార్థవిదులు, పదార్థవిదులు నని; వాక్యార్థవిదులు మీమాంసకులు, పదార్థవిదులు వైయాకరణులు. నిర్గుణాత్మవాదులలో తార్కికులుగా నుండువారు నిరీశ్వరవాదులై సాంఖ్యులయినారు; సేశ్వర వాదులై యోగులైనారు. వేదవాదులు అద్వైతవాదులు శాంకర దర్శన ప్రియులు. ఇట్లు దర్శన సంగ్రహమును సర్వదర్శన సంగ్రహము నందు శ్రీ సాయణ మాధవులు చెప్పిరి. ఇందు ఒక్కొక్క దర్శనమును స్వరూప మాత్రముగ గుర్తించుటకు దర్శనవీథి యుపకరించును. కొన్ని కొన్ని దర్శనముల గురించి స్పష్టముగ తెలియుటకు నాకరగ్రంథములు లేవు. కాని వానిని ఖండించు నెపమున దర్శనకారులు కొంత కొంతగా వాని ననువదించినారు. అట్లె వానిని తెలియ వలసి యున్నది. కొన్నిటికి మూల గ్రంథము లున్నవి. వానివాని సంకేత నిర్దేశపురస్సరముగ పాఠకులారాధన మనస్కులు కావచ్చును.

---

# తంత్రాలోకము

(7 వ వ్యాసము:—పూర్వపు సంచికల తరువాయి)

జమ్ములమడక మాధవరామశర్మ

ఇప్పటి కారువర్ణముల యావిర్భావము చెప్పినట్లయినది. అ, ఇ, ఉ మొదటి పరామర్శ త్రయము ప్రకాశభాగసార మయినందున సూర్యాత్మకమని, ఆ, ఈ, ఊ చరమ పరామర్శత్రయము విశ్రాంతి స్వాభావకమయిన యాహ్లాద ప్రాధాన్యమున సోమాత్మకమనియు గ్రాహ్యము. ఇంతవఱ కిందు కర్మాంశానుప్రవేశములేదు. ఇక కర్మానుప్రవేశ మున నితరవర్ణములావిర్భవించును. ఇచ్ఛయందు కర్మ ప్రవేశింప ఇష్యమాణమగుటయు, ఈశనమున కర్మప్రవే శింప ఈశ్యమానమగుటయు స్వాభావికము. అప్పుడు రెండు భేదములు కలుగును. ప్రకాశమాత్రమున 'ర' గోచరిం చును. విశ్రాంతిచే 'ల' భాసించును. రలలు రెండును ప్రకాశస్తంభ స్వభావములు. ఇందలి యిష్యమాణము స్ఫుటముకాదు. స్ఫుటమయిన ఇచ్ఛ ఈశనములుండవు. అస్ఫుటమయినందున రలలకిందు శ్రుతిమాత్రమె యుండును. వ్యంజనములవలె సుస్థితములు కావు. ఇవి బీజయోన్యాత్మకములు కావున, "ఋ, ౠ, ఌ, ౡ" యని నాలుగు వర్ణములగును. ఇవి యుభయచ్ఛాయా ధారులగుట నపుంసకములు.

అనుత్తరము ఆనందము (అ ఆ) ఇచ్ఛాదులలో ప్రవస రింప ఏ, ఓ వర్ణద్వయము; అందు అనుత్తరానంద సంఘ

ట్టమున ఐ, ఔ వర్ణద్వయము కలుగును. ఏ, ఐ, ఓ, ఔ వర్ణచతుష్టయము క్రియాశక్తి సారము. మఱల క్రియా శక్త్యంతమున సర్వకార్యమనుత్తరమున ప్రవేశించునేని మొదటి సంవేదనసారముగ నుండును. ప్రకాశమాత్రముగ నుండును. బిందుస్వభావమున నుండును. ఇదియె 'అం' అనునది. అంతట నందే యనుత్తరమున విసర్గము కలుగుట 'అః' అనునది. ఇప్పటికీ పరామర్శషోడశకము (పదునారు) బీజస్వరూపమందుము. ఇప్పటికిది సారము. దీని ప్రసారమిక భావింపుడు.

శ్లో॥ ఇచ్ఛా శక్తిర్ద్వి రూపోక్తా క్షుభితాక్షుభితా చయా
ఇష్యమాణం హిసావస్తు ద్వైరూప్యేణాత్మని శ్రయేత్ ॥

క్షుభితము అక్షుభితమునని రెండు విధములయిన యిచ్ఛా శక్తితన యందిష్య మాణమును రెండు విధములజేయును; ప్రకాశమాత్రాత్మకము మొదటిది. విశ్రాంత్యాత్మకము రెండవది. కావున నిందు ర-ల రెండును కేవలము సూక్ష్మముగా శ్రవణ సారములుగా నుండును. ప్రకాశదేవుని శక్తులె సర్వజగముకదా! జ్వలనరూపశక్తి యొకటియు ధరాత్మకమయిన శక్తి వేరొకటియునని శక్తి రెండు విధములు. ఇది యిష్యమాణా రూషణమున నాల్గువిధములగును. ద్వివిధేచ్ఛా శక్తి కిష్యమాణముతో సమాపత్తి కలుగును. సమాపత్తి యన్నది వేరుగా నుండకుండుట అపృథగ్భావమున భాసించుటయని గుర్తించునది. ఆ సమాపత్తి వలన నాల్గురూపము లేర్పడును; అవియే ఋ, ౠ, ఌ, ౡ. ఇచ్ఛా శక్తి కిచట గలుగు నిష్యమాణ సమాపత్తి స్థిరముగా నుండును. ఇచ్ఛా శక్తికి మొదట గలుగు సమాపత్తి స్థైర్యముతో నుండదు. ఇచట కొంత స్థైర్యమున నుండును. అయిన నిచటి యిష్యమాణము బాహ్యములో వలె స్థైర్యమున నుండదు. అందుననె యిచట రలలకు శ్రుతి మాత్రమంటిమి. సాక్షాద్వ్యంజనములకు వలె స్థితి యుండదు. క్షణికమగుట మెఱుపు దీర్ఘమవ భాసింపదు. అట్లె యిందు నిష్యమాణము ఛాయా మాత్రమున భాసించును. కావుననె వర్ణశ్రుతి మాత్రముండును, సాక్షాద్వర్ణముండదు. వర్ణశ్రుతియె వర్ణముకాదు కదా! కావుననె యీ వర్ణములు నరసింహవర్ణములని శ్రీ మహాభాష్యకారులనిరి. ఈ వర్ణచతుష్టయ ముభయచ్ఛాయల ధరించుటచే నపుంసకములని వ్యపదేశించిరి; కాగా విద్యుదుద్భాసిని జ్వలనశక్తికూడిన యక్షుబ్ధమగు ఇచ్ఛ 'ఋ' వర్ణమని, క్షుబ్ధమగు ఇచ్ఛ 'ౠ' వర్ణమని తేలినది. ఇట్లే ధరాశక్తి కూడిన అక్షుబ్ధమగు ఇచ్ఛ 'ఌ' వర్ణమని, క్షుబ్ధమగు ఇచ్ఛ 'ౡ' వర్ణమని పరిగ్రాహ్యము. ఇట్లిచ్ఛాశక్తి కిష్యమాణ సమాపత్తిచే పరామర్శాంతరములుదయించినవి. కాని జ్ఞానశక్తికి జ్ఞేయసమాపత్తిచే పరామర్శాంతరము లుదయింపవు. జ్ఞానశక్తియందు జ్ఞేయమధికముగనే యున్నది. కాని జ్ఞానశక్తి జ్ఞేయవిభవస్థానమె కాని జన్మస్థానముకాదు. ఇచ్ఛాశక్తివలె నిది యుత్పత్తి స్థానము. ఇష్యమాణాత్మకముగా గలిగిన భావజాతమంతయు జ్ఞానశక్తిలో సబివ్యక్తమగును. క్రియాశక్తిలో బాహరముగా స్ఫురించును. కాన జ్ఞానశక్తిలో జ్ఞేయము క్రొత్తగా కలుగదు అందుననే జ్ఞేయసమాపత్తితో పరామర్శాంతర ముదయింపదంటిమి. ఇచ్ఛాశక్తియందే యిష్యమాణ మపూర్వముగా గలుగును. అదియే యీ చాతురూప్యము. పర సంవేదనము సర్వభావ నిర్భరమగుట సర్వభావములందే నుభవించును. కాని యవి యన్నియు నందు సంవిన్మాత్రముగా నుండుననియె తెలియవలసి యున్నది.

ఇచ్ఛాశక్తివలన గలిగిన యీ చతుష్టయము పరామృత మందురు. స్వాత్మమాత్ర విశ్రాంతిచే నీనాల్గును పరచమత్కారాత్మకముగ నుండును. స్వరములందివి యుండుటచే బీజములనుటగాని యిందు బీజత్వములేదు. బీజత్వమను నది ప్రక్షోభకత్వము. స్వాత్మస్వరూపమున విశ్రమించునట్టి దానికి ప్రక్షోభకత్వముండదు. క్షోభాంతరమిది యుల్లసింప జేయదు. ఇది దగ్ధప్రాయము. సర్వంసర్వికముగా బీజ బీజరూపత్వమిందులేదు. శివశక్త్యాత్మక బీజయోన్యతిరిక్తము లేదు. శివశక్తులె సర్వంసర్వికముగా బీజయోనులనుట మున్ముందు విశదమగును.

శ్లో॥ ప్రక్షోభకత్వం బీజత్వం క్షోభాధారశ్చ యోనితా
క్షోభకం సంవిదో రూపం క్షుభ్యతి క్షోభయత్యపి ॥

పై నాలుగు వర్ణములు ప్రక్షోభకములు కానందున బీజములు కావని సందున యోనిత్వము పారిశేష్యముననుండవచ్చునను కొందురు. అదియు కుదురదు. తత్పరిహార మొనరించుట యుక్తము. బీజమెట్టిది? యోనియేమి? వీని వైలక్షణ్యము ప్రతిపాదింపవలెను. ఈ కారిక బీజయోని స్వరూపము నిరూపింపగలదు. ప్రక్షోభకము బీజము. క్షోభాధారము యోని. కారణమయిన బీజము జడము కదా! అది యితరాపేక్ష మేమియులేక రూపాంతరమా విర్భవింప జేయుటకు సమర్థమగునా? అని సందేహము కలుగును. ఇది వినుడు! వాస్తవముగా సంవిద్రూపమె క్షోభకము. సంవిత్తొక్కటియె క్షోభము పొందును. సంవిత్తునకె క్షోభక రూపమున్నది. మయూరాండరస న్యాయమున లోనా సూత్రితప్రాయముగా నున్న బహిర్భావోన్ముఖముగానున్న జ్ఞేయజాతము ధరించుచున్నది. మయూరపింఛములోని చంద్రకములనున్న వివిధ వర్ణములు విశేషములు విలాసములు నెమలి గ్రుడ్డులోని రసమునందే యున్నవి. అవి సూక్ష్మాకారముగనున్నవి. మయూరాండరస మంతరా

సూత్రితప్రాయము బహిర్భావోన్ముఖమయి ప్రపంచము ధరించును. అట్లే ప్రకృతమును సంవిత్తుజ్ఞేయజాతము ధరించును. బహిరూపమున నవభాసింపజేయును. క్షోభ పడును. క్షోభింపజేయును. జ్ఞేయధర్మము క్షోభమని క్షోభ్య ప్రేరణము క్షోభణమని యిందు నిర్దిష్టమయినది. ఈ యంశ మంతయు తంత్రరహస్య ప్రక్రియా గర్భము.

శ్లో॥ అస్తస్థవిశ్వావిభైక బీజాంశవిసిసృక్షతా
క్షోభోఽతదిచ్ఛే తత్వేచ్ఛాభాసనం క్షోభణాం విదుః ॥

ఈ సంకేతమున నిది నిగ్రాహ్యము కావచ్చును. ఏకమద్వి తీయమగు సంవిద్రూపమె సర్వభావ నిర్భరము విశ్వావిర్భా వకమును. అదియె బీజాంశము. భావజాత మంతయు సంవిద్రూపమునసనె ప్రథమముండును. కావుననే విశేష మచట నుదయింపదు. సంవిత్తు అంతస్థ విశ్వాభిన్నమని యేకమని నిశ్చయింపవచ్చును. అదియె బీజాంశము కారణ విశేషము. ఆ సంవిద్బీజాంశమున పరానపేక్షముగా విశిష్టమగు స్రష్టృత్వేచ్ఛ యున్నది. గ్రాహ్యగ్రాహక రూప మయిన విశ్వమును భిన్నకల్పముగ నవభాసింపజేయు కోరికయే స్రష్టృత్వేచ్ఛ. ఈ యిచ్ఛతోగల సంవిత్సంబంధమె క్షోభము. భావజాతము బహిర్భావోన్ముఖము కాకున్నను నాయొదాసీన్యము పోగొట్టి బహిర్భావోన్ముఖ్యమున నవ భాసింపజేయుటను క్షోభణమందుము. ఈ యంశమే ''అతదిచ్ఛే తత్వేచ్ఛాభాసనం'' యని సూత్రితము. ఇప్పటి కిది బీజస్వరూపము. అస్యరూపమిదిగో !

క్షోభాధారము యోని. పరప్రమాతకు సంబంధించిన యిచ్ఛ యీ యోని నమైక్యము పొంది కృతిని యగును. ఆ స్రష్టృత్వేచ్ఛ స్వాత్మవిశ్రాంతిచే కృతార్థము పూర్ణము నగును. సంవిత్స్వాతంత్ర్యమున విషయమగునది క్షోభాధార మని భావము. ఈషణాది సంవిత్తులన్నియు విశేషోచ్ఛేదర హితములై జ్ఞేయమాత్ర సారములై యున్నప్పుడు పార మేశ్వర రూపము బీజమనుట స్పష్టము. సర్వభావనిర్భర మయిన చిదాత్మ యంతస్థ విశ్వమును బహిరావిర్భవింప జేయుటచే బీజమయినది. అట్లే స్వరములును వర్ణా విర్భా వకములగుట బీజములగును. సంవిత్స్వాతంత్ర్యము లేక దేనికిని రూపాంతరావిర్భావమున సామర్థ్యముండదు. స్వరములును సంవిదనుప్రాణనముండుటచే బీజము లయినవి. భావజాతమంతయు చిదాత్మకన్న వేరుగా కున్నను, వేరుగా భాసించునదగుట క్షోభమని తేలినది. ప్రకృతమనుసంధింపుడు. ఈ వర్ణచతుష్టయము క్షోభాంతర మేమియులేనందున బీజము కాదని, యేతదైక్యము పొంది దేనియిచ్ఛయు కృతార్థము కానందున క్షోభాధారము కాకుండుట నిది యోనియు కాదని పరతాత్పర్యము తేలినది.

ఆత్మమాత్ర విశ్రాంతిచే నిది పరచమత్కార మయమగుట అమృతాత్మకమని యభిజ్ఞులనిరి.

శ్లో॥ ఇత్థం ప్రాగుదితంయత్త త్పంచకంత త్పరస్పరం
ఉచ్ఛల ద్వివిధా కారమన్యోన్య వ్యతిమిశ్రణాత్ ॥

అనుత్తరము - ఇచ్ఛ - ఈశనము - ఉన్మేషము - ఊనతా రూపమున నిరూపించిన పంచకము (అ ఇ ఈ ఉ ఊ) పరస్పరము వ్యతిమిశ్రణమున వివిధాకృతి ధరించును. ఆనందశక్తి (ఆ) చిదవ్యతిరిక్తమే "ఆనందో బ్రహ్మణో రూపం" యని వచనమున్నది కదా! ఈ పంచకము స్వాత్మమాత్రావస్థానమున కాక పరస్పరము సంఘట్ట మున్నని నానావర్ణరూపమగునని వ్యతిమిశ్రణము సూచించును. "అ-ఆ" లు "ఇ-ఈ" లతో వ్యతి మిశ్ర ణము పొంది నప్పుడు 'ఏ' రూపము కలుగును. "అ-ఆ"లు "ఉ-ఊ" లతో వ్యతిమిశ్రణము పొందగా 'ఓ' రూపము కలుగును. ఇకారమకారముతో గలియగా "య", ఉకార మకారముతో గలియగా 'వ' యుదయించును. ఈ పంచ కాతిరిక్త పరామర్శాంతరమున వ్యతిమిశ్రణ ముండనే యుండదు.

శ్లో॥ యోఽనుత్తరః పరఃస్పందో యశ్చానందః సముచ్ఛలఞ్ తావిచ్ఛోన్మేష సంఘట్టాద్గచ్ఛ తోఽతివిచి త్రతాం ॥

అనుత్తరమని ఆనందమని శబ్దముల వ్యపదేశింప దగిన అకారాకారములు, ఇచ్ఛోన్మేషములనదగు ఇకారోకారము లతో సంఘట్టము పొందగా నందీయమాన వర్ణద్వయము కన్న విలక్షణముగా నొకవైచిత్రిని పొందును. ఆ విచిత్ర తయే ఏకారము ఓకారము రూపమున నుండును. ఏకారము నకు త్రికోణమని సంజ్ఞ కలదు. ఇచ్ఛాజ్ఞాన క్రియలనెడు కోణత్రయ మిచట సుగ్రహము. దీనినే వహ్నిగేహమని శృంగాట మని యోగినీ వక్త్రమనియు తాంత్రిక భాష. అనుత్తరానందముల కిచ్ఛాయోగమున నీ పరామర్శముద యించుటయేకాదు. అనుత్తరానందములీ త్రికోణమున ప్రరోహము కలవై షట్కోణస్థితిని పొందగలవు. అనుత్త రము రౌద్ర్యాది శక్తి త్రయమయము. ఆనందమును రౌద్ర్యాదుల స్ఫారమాత్ర సారమగుట నీ రెండును త్రికోణ రూపములె. అకారమొక త్రికోణము, ఏకారమొక త్రికోణము. ఈ త్రికోణ ద్విత్వయోగమున షట్కోణస్థితి యనగా 'ఐ' కార రూపము కలుగును. ఇట్లే అకార త్రికోణము ఏకార త్రికోణ యోగము పొందగా 'ఐ' కార ముదయించుననుట సుగమము. అనుత్తరానందములకే కారమున సంఘట్టము కలుగగా పరామర్శాంతర ముద యించినట్లు ఓకార సంఘట్టమున గూడ పరామర్శాంతర ముదయించును. అనుత్తరానంద శక్తు లున్మేషయోగము

పొందగా ఓకారము దయించును గదా! ఆ శక్తులు రెండును తన్మయత్వమును ఓకారాత్మతను పొంది తదేకీ భావము కలవయినచో ఔకారముగా సంభవించి క్రియా శక్తి స్ఫుట రూపమును వ్యక్తము చేయును. క్రియా శక్తి సంధ్యక్షర ములందస్ఫుట - స్ఫుట - స్ఫుటతర - స్ఫుటతమ రూపమున నుండుననుట యిచట విశదమయినది. అనుత్తరానందము లకు ఇచ్ఛోన్మేషములతో సంఘట్టము కలుగగా పరామర్శములుదయించినవిగదా! అట్లే ఇచ్ఛోన్మేష క్షోభరూపము లయిన ఈశనోనత్వములతో సంఘట్టము కలిగినప్పుడు పరామర్శాంతరములుదయింపవా? అని ప్రశ్న. అకారాకారము లికారోకారములతో సంబందింప వర్ణము లుదయించినట్లు ఈ కారముతోనూకారముతో సంఘట్టింప వర్ణము లుదయింపవా? యని ప్రశ్న భావము. ఇచ్ఛోన్మేషముల క్షోభాత్మకములయిన ఏ ఓలతో సంఘట్టము కలుగగా ననుత్తరానందములు తాద్రూప్యమునే పొందును. వేరు పరామర్శమురాదు. పూర్వము నిరూపించిన విధమున ఐ కా రౌ కార లక్షణ రూపమవశ్యము పొందును.

అనుత్తర ప్రకాశమొకటియె ప్రకాశించును. తద్భిన్నమేదియు సంభవింపదు. అనుత్తరమనునది యతిరేకానతిరేకవికల్పము లేవియు లేనిది కదా! ఇట్లే క్రియాశక్తి పర్యంతమివైచిత్ర్యమున స్ఫురించు టేమి? అనుత్తరానందములు భేదరహితములు. తమలో నిట్టి యీవైచిత్రి నాశ్రయించిన వేమి? ఇది సమాధేయము.

సంవిన్నాథునకు పరిమితిలేదు. అనుత్తరానందాత్మకుడయిన సంవిన్నాథుడనంతశక్తివైచిత్ర్యలయోదయ కలేశ్వరుడు. నానాశక్తుల లయోదయములనెడు నిమేషోన్మేషముల కలనమున స్వతంత్రుడు. కలనమన్నది స్వాత్మాభేదమున క్షేపము. తనకన్న వేరుగా ప్రకాశింపజేయుట. ఇందు సంవిన్నాథుడే స్వతంత్రుడగుట నియతమగు రూపోపగ్రహము లేనందున అనవచ్ఛిన్న స్వభావుడు. సంవిన్నాథుడు నియతరూపమున నేల పరిస్ఫురింపడు? అట్లు పరిస్ఫురింపడు. ఆ సంవిన్మహేశ్వరు డొక ప్రతినియత రూపమున నుండునేని యాతని మాహేశ్వర్యమే పోవును. సంవిద్రూపత్వమె యుండదు. అనియతవాచ్య వాచకాకృతి పరిస్ఫురించుటయె యాతని మాహేశ్వర్యము, సంవిద్రూపత్వమును. "ఇదిగో! సంవిద్రూప మొకటియె. అది హర్ష విషాదాద్యనేక ప్రకారమున వివర్తము పొందినట్లు మేము వర్ణింతుము. మీరు మీ యిష్టముబట్టి యెట్టి పేరులనయిన పెట్టుడు!" అని స్వాత్మసంవేదు లనిరి. సంవిత్తు అనేకాకారమున పరిస్ఫురించును. ఇందు వాదవివాదము లేదు. ఇది యనంతాకారమున స్ఫురించుటలో నవిద్యాది నిమిత్తము లేవియు లేవు. స్వభావమె హేతువు. స్వాతంత్ర్యమె హేతువు. మాహేశ్వరమె హేతువు. ప్రతినియతముగా స్వరూపము ప్రకాశించునేని జడమయె పట్టును. ఘటాదు లట్టివేకదా! ఘటము జడము. "ఇది యిచట నిట్లున్నది" యని యాత్మనియతావభాసమె కాని పరప్రకాశము లేదు. సంవిన్నాథునకు జడత్వము లేదు. స్వాతంత్ర్య మున్నది. మాహేశ్వరత యున్నది. పరిచ్ఛిన్న ప్రకాశ మెంతయు జడ లక్షణము. ఇతరమున ప్రమేయమాణమగునప్పు డట్లె యగును. స్వప్రకాశ సంవిన్నాథు డన్య ప్రమేయమాణుడు కాడు.

శ్లో॥ అస్థాస్యదేకరూపేణ వపుషా చే న్మహేశ్వరః
　　మహేశ్వరత్వం సంవిత్త్వం తదత్యక్ష్య ద్ఘటాదివత్॥

మహేశ్వరు డేకరూపముననె యుండునేని ఘటాదుల వలె మహేశ్వరత్వమును సంవిత్త్వమును త్యజించెడివాడె. దీని భావార్థము నిరుక్తప్రాయము బోధము. జడవిలక్షణము. కావుననె యింతటి విశ్వప్రసరము వచ్చినది.

శ్లో॥ తేన బోధమహాసింధో రుల్లాసిన్యః స్వశక్తయః
　　ఆశ్రయం త్యూర్మయ ఇవ స్వాత్మ సంఘట్టచిత్రతాం॥

శ్లో॥ స్వాత్మసంఘట్ట వైచిత్ర్యం శక్తీనాం య త్పరస్పరం
　　ఏతదేవ పరం ప్రాహుః క్రియాశక్తేః పరం వపుః॥

ఈ చెప్పనవిధమున పరిస్ఫురించుటచే నిక నిది నిశ్చయము. సాగరమునుండి తరంగములవలె బోధమునుండి స్వశక్తు లుల్లసిల్లును. మహాసాగరమున వెలువడిన తరంగములు పరస్పర లోలీభావమున స్వాత్మఘట్టమున చిత్రవిచిత్రములుగా నుండును. అట్లే బోధమహాసింధువునుండి వెలువడు స్వాత్మరూపములయిన యిచ్ఛాది శక్తులు స్వాత్మసంఘట్టమున పరస్పరము లోలీభావము కలవై యాయా గ్రాహ్య గ్రాహకరూపమున నాయా పరామర్శరూపమున పరిస్ఫురించును. ఇట్టి పరిస్ఫురణమె క్రియాశక్తి పరరూపము. స్వాత్మశక్తుల పరస్పరము స్వాత్మసంఘట్ట వైచిత్ర్యమును క్రియాశక్తి స్ఫుటతమ రూపమని సంవిత్సాగరులు సెలవిచ్చిరి. క్రియాశక్తులు భేదప్రధానములు. అశుద్ధాధ్వ మధిష్ఠించియుండు ఘోరతర్యాది శక్తులకు నివియె నిమిత్తములు. ఈ ఘోరతర్యాది శక్తులు విషయాసక్తులై యితరముల విస్మరించిన జీవుల నధోధోదేశమున పడునట్లు చేయును.

'ఔ'కారము చతుర్దశధామము. ఇందు క్రియాశక్తి స్పష్టస్ఫుటమయినది. అందుననె యిచ్ఛాజ్ఞాన క్రియా శక్తులు మూడును ప్రస్ఫుటములయినవనవలయును. ఇది స్ఫుటీభూత త్రిశక్తికమయినందున త్రిశూలమనియు దీనిని శ్రీపూర్వశాసనము నిర్దేశించినది. తత్వదర్శులగువారిది నిరంజనమనియు ననిరి. ఆలోకమున దీపము గోచ

రించునట్లు కిరణములచే భాస్కరుడు భాసించునట్లు శక్తిచే శివుడు సుజ్ఞాతుడగును.

శ్లో॥ అత్రానుత్తరశక్తిః సా స్వంవపుః ప్రకటస్థితం
కుర్వంత్యపజ్ఞేయ కలాకాలుష్యా ద్బిందురూపిణీ॥

పరసంవిత్తు క్రియాశక్తి పర్యంతము విచిత్రముగా పరిస్ఫురించినను స్వరూప విప్రలోపము రాలేదు. ఈ యంశమును బిందుస్వరూపము తెల్పును. అనుత్తరశక్తిజ్ఞేయకలాకాలుష్యమున స్వప్రకాశమును సర్వసంవేద్య మొనర్చియు బిందురూపమున నుండును. బిందువనగా వేదనమున స్వతంత్రప్రమాత. బిందురూపమనునది విభాగరహితమైన పరప్రకాశము. ఇంకను బిందుతత్త్వము గుర్తింపవలెను.

శ్లో॥ ఉదితాయాం క్రియాశక్తౌ సోమసూర్యాగ్నిధామని
అవిభాగః ప్రకాశో యః స బిందుః పరమోహినః ॥

సోమసూర్యాదులు హ్లాదతీక్ష్ణతాదులు కలవారగుట నియతస్వరూపులు. ఆ సోమసూర్యాదులకు క్రియాశక్తి యాశ్రయము ఇట్టి క్రియాశక్తి యాయా విచిత్రస్వరూప గోచరించినను హ్లాదతైక్ష్ణ్యాద్యుపాధిశూన్యమై పూర్ణపరప్రకాశమై యప్రచ్యుత స్వరూపమగుటచే సత్యుత్కృష్టమై స్వతంత్రమైయుండు శివస్వరూపమె బిందువని యీ దర్శన సంకేతము. బిందువు శివబిందువు. బిందువు తన స్వాతంత్ర్యమున విశ్వము భాసింపజేయును. హృత్పద్మ మండ లాంతస్థమని పరశక్తి శివాత్మకమని బిందువును కీర్తించిరి. ఖేచరభూమియగు హృదయమున ప్రరోహముపొందినను బిందువు స్వరూపమునుండి ప్రచ్యుతము కాదు. ఆయా విచిత్రతాసముల్లాసమున్నను సంవిన్మాత్రమగుట శుద్ధము. విమలము. తారకము.

శ్లో॥ యోఽసౌ నాదాత్మకః శబ్దః సర్వప్రాణిష్వవస్థితః
అధ ఊర్ధ్వ విభాగేన నిష్క్రియేణావతిష్ఠతే॥

సర్వప్రాణులందును నాదాత్మకశబ్ద మున్నది. బిందువె యట్టిశబ్దముగా స్ఫురించును. బిందువు పరామర్శస్వరూపముల్లసింపజేయుటకు నాదాత్మకశబ్దమగును. శబ్దమనగా- "శబ్దయతి - స్వాభేదేన విశ్వం పరామృశతీతి - శబ్దః" స్వాభేదమున విశ్వమును పరామర్శించునది యని భావము. అది పరావాగ్రూపమయిన విమర్శము శబ్ద మదినాదాత్మకమనుట—"నదతి - సర్వేషామేవ జీవకలాత్వేన పరిస్ఫురతీతినాదః" సర్వములకు జీవకంగా స్ఫురించునదియని తాత్పర్యము. నాదమంతట అస్వరమునసె యుండునని వ్యపదేశము.

"అకారః సర్వవర్ణానాం అన్తర్యామతయా స్థితః"

అకారము సర్వవర్ణములం దంతర్యామిగా నుండునని యనిరి. అనుత్తరమునుండి శూలబీజ పర్యంతము హకార పర్యంతమును అకారమె యంతట ప్రాణసరూపముగా నుండును. పరామర్శ రాశియంతయు అకారస్ఫారసారమె. ఆ అకారమె సర్వప్రాణులందు ఊర్ధ్వ విభాగమున సూర్యచంద్రాత్మక ప్రాణాపాన ప్రవాహరూపముగానున్నది. అదియె "పరాజీవకలా". అయిన నది నిష్క్రియరూపముననె యుండును. క్రియాశక్తిపర్యంత మాయావైచిత్ర్యమున పరిస్ఫురణ మున్నను అకారమునకు స్వస్వరూప ప్రభావము లేదు.

ఇది యిచట సంవేద్యము. క్రియాశక్తి యుత్పన్నము కాగా హ్లాదము తైక్ష్ణ్యముకల సోమసూర్యాది ప్రకాశము ప్రతినియతముగనె ప్రకాశించును. అప్రకాశమె స్వప్రకాశము నిఖిలప్రకాశము నగుచున్నది. అవిభాగ పరప్రకాశము చెప్పితిరె! అది యీ ప్రకాశ ప్రకాశ్యమా? ఏతదన్యమా?

ఈ యాశంకమున కిది సమాధానము. హ్లాదము చంద్రునం దున్నది. తైక్ష్ణ్యము సూర్యునందున్నది. సితవైచిత్ర్యము చంద్రునిది. రక్తవైచిత్ర్యము సూర్యునిది. వీని యందు నియతరూపత్వము లేదు. కావున అవిభాగ పర ప్రకాశము సోమసూర్యాత్మకము కాదు. సోమసూర్య ప్రకాశ్యమును గాదు. సూర్యాదిధామత్రయమున కది యను ప్రాణకము పరప్రమాత్రేకరూపము. ఈ యర్థమును గీతా గురువు వాసుదేవుడె చెప్పినాడు.

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥

సూర్యుడు చంద్రు డగ్ని దాని భాసింపజేయజాలరు. ఆ ధామము పొందిన పునరావర్తము లేదు. అది పరంధామము. అది నాది. అనిగీత. అర్కసోమవహ్నులకు దాని ప్రకాశము వినా ప్రకాశములేదు. సూర్యాదులు తత్ప్రకాశ్యులు. పరప్రకాశమె సూర్యాద్యాత్మకమున ప్రస్ఫురించును. సూర్యాది ప్రకాశ ముపహిత స్వరూపమగుట స్వప్రకాశమున సంవిత్ప్రకాశ మపేక్షించును. వీరుగో సూర్యసోమాదులు.

శ్లో॥ ప్రకాశమాత్రంసు వ్యక్తం సూర్య ఇత్యుచ్యతే స్ఫుటం
ప్రకాశ్యవస్తు సారాంశవర్షి తత్సోమ ఉచ్యతే
సూర్యం ప్రమాణ మిత్యాహుః సోమం మేయం ప్రచక్షతే
అన్యోన్య మవియుక్తౌ తౌస్వతంత్రావ వ్యుభౌ స్థితౌ
భోక్తృభోగ్యోభయాత్మైక తదన్యోన్యోన్ముఖతాం గతం
తతో జ్వలనచిద్రూపం చిత్రభానుః ప్రకీర్తితః ॥

సువ్యక్తము స్ఫుటమునయిన ప్రకాశమాత్రమును సూర్యుడందురు. సూర్యునకు ప్రకాశమాత్రమె శుద్ధరూపము. జ్ఞానమాత్రమె వివక్షిత రూపము. సర్వజన సాక్షికము. ప్రకాశ్య వస్తుసారాంశము వర్షించువాడు సోముడు. ప్రకాశ్య

వస్తువులు సుఖదుఃఖ మోహమయములు కదా! అందు సారము సుఖకార్యాహ్లాదాది రూపాంశము. "సోమోవర్షతి చామృతం" అనినట్లాసారాంశమును వర్షించువాడు సోముడు. సర్వభావజాతము నాతడు సేచనముచేయును. సర్వమాహ్లాదమయము చేయును. ఆదిత్య విగ్రహము శివుని జ్ఞానశక్తి రూపమని, చంద్రరూపము శివుని క్రియా శక్తిరూపమని యభిజ్ఞులనిరి. సూర్యుడు ప్రమాణము. సోముడు మేయము. ఈ సూర్యచంద్రులు స్వతంత్రులు. పరస్పర నిరపేక్షముగా ప్రమాణప్రమేయ రూపముగా వేరువేరుగా వ్యవహార్యులయినను పరస్పర మవియుక్తముగనున్నారు. జ్ఞానము జ్ఞేయమును జ్ఞేయము జ్ఞానమును సంబంధించియే యుండును. ఈ సూర్య చంద్రద్వయము పరస్పరమున్ముఖత్వమును పొంది భోక్తృభోగ్యైభయలోలీ భావమును సంఘట్ట స్వభావము పొందును. ఆ సంఘట్టమున అగ్ని యుదయించును. "శుచిర్నామాగ్నిరుద్భూతః సంఘట్టాత్సోమసూర్యయోః" ఈ యగ్ని చిత్రభానుడు. ఈతని కిరణములు సోమసూర్యసంఘట్టమున నానాకారములు మానమేయాదిరూపములు. ఈ యగ్ని ప్రమాణ ప్రమేయ విభాగముకల భేదమును దహించును. అందుచే జ్వలన ప్రధాన చిద్రూపుడు. పరిమితప్రమాతృస్వరూపుడు. ప్రమాణ ప్రమేయముల సమ్మేలనమె పరిమిత ప్రమాతృత. అగ్నియు నట్టివాడు. సంవిన్మూర్తియె స్వస్వాతంత్ర్యమున వహ్నితాదాత్మ్యము పొంది 'ప్రమాత' యగును వహ్నిరూపముపొందినను సంవిన్మూర్తి స్వరూప ప్రచ్యావము పొందదు. ప్రమాత జ్ఞేయభేదమున విచిత్రముగా నుండును.

శ్లో॥ ఏషాం యత్ప్రథమం రూపంహ్రస్వంతత్సూర్య ఉచ్యతే
క్షోభానందవశాద్దీర్ఘ విశ్రాంత్యా సోమ ఉచ్యతే
యత్తత్పరంప్లుతం నామ సోమానందాత్పరంస్థితం
ప్రకాశరూపం తత్ప్రాహుః అగ్నేయం శాస్త్రకోవిదాః ॥

బీజవర్ణములలో మొదటి యక్షుబ్ధరూపమేకమాత్రాత్మకము హ్రస్వము. ప్రకాశమాత్ర ప్రాధాన్యమున నది సూర్యుడు. క్షోభానందవశమున బాహిరవిశ్రాంతి పొందిన క్షుబ్ధమగు స్థూలద్విమాత్ర స్వరూపమాహ్లాదకారియగుట సోముడు ఈ హ్రస్వదీర్ఘములకన్న వేరగు త్రిమాత్రప్లుత మాగ్నేయ ప్రామాత్రరూపము. మానాత్మక సూర్యునందు ప్రరోహము పొంది మేయాత్మక సోమానందావలంబనమున మాతృ (ప్రమాత) రూపముగానది ప్రస్ఫురించును. హ్రస్వము సూర్యుడు దీర్ఘము సోముడు ప్లుతమగ్నియని ధామత్రయము నిరూపితము.

శ్లో॥ అత్రప్రకాశమాత్రం యత్స్థితే ధామత్రయే సతి
ఉక్తం బిందుతయా శాస్త్రే శివబిందురసౌ మతః ॥

ధామత్రయ మున్నను పరప్రకాశమునకు స్వరూప హాని లేదు. అది బిందువని శివబిందువని శాస్త్రము సంకేతమొనర్చినది. మకారముకన్న బిందువువేరు. దాని ఛాయయే యిందు గోచరించును. ఋ ౠ విసర్గములలో విసపథు 'ర ల హ' లు రేఫలకారములకన్న భిన్నములె. బిందువును మకారముకన్న భిన్నము. వర్ణ్రశ్రుతి వర్ణము కాదని చెప్పనే చెప్పితిమి. ఇకారము రేఫాంశచ్ఛాయదాను సార మున "ఋ" యయినది. అన్యస్వరమయినది. అట్లే "మహ" లేశము తిని ఆదివర్ణము బిందు వినర్గలుగా వెలువడును. కావున "మకారాదన్య ఏవాయం".

శ్లో॥ అస్యాంతర్విసిసృక్షా సా యా ప్రోక్తా కౌలికీ పరా
సైవ క్షోభవశాదేతి విసర్గాత్మకతాంధ్రువం ॥

ఇట్టి యారూపణమున అనుత్తరమె యేల విసర్గరూపమగునో యిందున్నది. అనుత్తర ప్రకాశాత్మకమయిన యాదివర్ణమునకు విమర్శాత్మకమగు విసిసృక్షయున్నది. అది "కౌలికి"యని "పర" యని నిరూపితము. ఆ విసిసృక్షయె బహిరౌన్ముఖ్యరూపమగు క్షోభవశమున విసర్గమగును. ఆనందోదయ క్రమమున క్రియాశక్తి పర్యంతము విభాసించు స్థితి నవభాసింపజేయును. విసర్గప్రాంత దేశమున పరాకుండలిని యున్నది. శివవ్యోమయని బ్రహ్మస్థానమని యందురు. "విసర్గమాత్రం నాథస్యసృష్టి సంహార విభ్రమాః" సంవిన్నాథునకు విశ్వసృష్టి సంహార విలాసమంతయు విసర్గమె. అఖండ సంవిత్తి యొక్క టియేగదా! తపతిరిక్తమేమియులేదే! సృష్టి దేనికి? సంహారము దేనికి?

శ్లో॥ "స్వాత్మనః స్వాత్మని స్వాత్మక్షేపో వైసర్గికీస్థితిః"

ఇది యీ వైసర్గికస్థితి. ఇది యీ సృష్టసంహారలీల. స్వాత్మకు స్వాత్మయందే స్వాత్మక్షేపము. ఇదియె విసర్గస్థితి. అందుచే ననన్యాపేక్షముగా పూర్ణపరాసంవిత్తియె స్ఫురించుననుట అనుత్తరాకార ప్రసారము. ఇకనిది పరామర్శ సూత్రము.

| | | | |
|---|---|---|---|
| ౭. | ఇచ్ఛయందు కర్మప్రవేశము | — | ఋకారము — ప్రకాశసారము |
| ౮. | ఈశనమందు | ,, — | ౠకారము — ప్రకాశసారము |
| ౯. | ఇచ్ఛలో | ,, — | ఌకారము — విశ్రాంతి |
| ౧౦. | ఈశనములో అనుత్తరానందముల | ,, — | ౡకారము — విశ్రాంతి |
| ౧౧. | ఇచ్ఛేశనములతో వ్యతిమిశ్రణము — అనుత్తరానందముల | | ఏకారము |
| ౧౨. | ఉన్మేషోనతలతో వ్యతిమిశ్రణము | — | ఓకారము |

౧౩. అనంపమున కిచ్ఛాక్షోభసంఘట్టము – ఐకారము
౧౪. అసంపమున కున్మేషక్షోభ సంఘట్టము – ఔకారము
౧౫. అనుత్తరశక్తి సంవేదనమున ప్రమాత – అం (బిందువు)
౧౬. అనుత్తర విసిసృష్టి – అః (విసర్గము)

(క్రమశః)

ఇటుపై కాది పరామర్శ ప్రాదుర్భావము.

---

# మనవి

భారతదేశమందలి దేవాలయములు అనాదికాలముగ దూరప్రాంత్యములనుండి చూపఱు (భక్తు) ల నాకర్షించుచున్నవి. అందునను దక్షిణ దేశమునందలి దేవాలయములు వాటి పవిత్రతకే కాక ఇంపు సొంపులు తేరిన కట్టడములకు, దేవాలయముల చుట్టుప్రక్కలనుండు సన్నివేశములకు ప్రత్యేకముగ వాసికెక్కినవి. ఆ దేవాలయములు మతసంబంధములయిన ప్రార్థనా నిలయములేకాక హిందూధర్మ ప్రచారమునకు ముఖ్యస్థానములు; సంస్కృతభాషా ప్రోత్సాహకములు; వేదశాస్త్రములను జదువుటకు పురాణములను బోధించుటకు పట్టుగొమ్మలు; లలిత కళలను బెంపొందించు నిలయములు; ఇంతయేల—భారతీయ సంస్కృతిని వెదజల్లు మూలకందములు. ఈ దేవాలయములు చారిత్రికమగు గొప్పదనముగలవి; శిల్పము, చిత్రలేఖనము, కట్టడము మొదలగు లలితకళలకు బెన్నిధులు. ఆంధ్రదేశములో నాలువేల దేవాలయములు గలవు. ఈ దేవాలయముల కన్నింటికి ప్రతిసంవత్సరము కోటిరూపాయలకు మించిన ఆదాయము గలదు. ఈ దేవాలయములకు గల యాస్తులవిలువ ఇంచుమించుగ నలువదికోట్లరూపాయ లుండును.

ఈ దేవాలయములలో అనేక దేవాలయము లనేకకారణములచే జిరకాలముగ నుపేక్షచేయబడినవి. ఆంగ్లేయుల ప్రభుత్వములో ఈ దేవాలయముల ఆదాయములను సక్రమమగు పద్ధతులలో వినియోగపఱచు బాధ్యత నంగీకరింపని కాలమునయితము గలదు. కాని, ప్రజాప్రభుత్వము లంకురించినదాది దేవాలయములను సక్రమముగ బాలింప జేపట్టి దేవాలయముల ధర్మాదాయములను సద్వినియోగము గావింపవగిన యేర్పాటులను జేయ మొదలిడినవి. ఈ దేవాలయముల స్థితిగతులను చక్కబఱచు సదుపాయములను శాసనసభలమూలమున గావించినవి. అయ్యును శిథిల దేవాలయముల పునరుద్ధారణమేకాక మతసిద్ధాంతముల ప్రచారము, శాస్త్రములను వేదాంతములను హిందూమతమును బోధించు పాఠశాలలను నెలకొల్పుట, సంస్కృతభాషాపోషణము, ఆలయనిర్మాణము, శిల్పము మొదలగు లలితకళలను తగు రీతి బెంపొందించుట మున్నగు చేయదగిన పనులెన్నేని గలవు. శ్రీశైలమునందలి భ్రమరాంబా మల్లికార్జునస్వామియాలయము, అంతర్వేదియందలి దేవాలయములు మొదలగు కొన్ని ముఖ్య దేవాలయముల పునర్నిర్మాణమునకై కొన్ని ప్రత్యేకసంఘము లేర్పాటు కాబడినవి. శ్రీకూర్మమందలి కూర్మదేవస్వామి ఆలయము, ముఖలింగ మందలి ముఖలింగేశ్వరస్వామి ఆలయము మొదలగు కొన్ని దేవాలయములు నిర్మాణవైభవమునకు చారిత్రికమగు గొప్పదనమునకు ముఖ్యములు. బ్రహ్మ పురాణమునందు నయితము దెలుపబడిన కదిరియందలి లక్ష్మీ నరసింహస్వామి ఆలయము మిక్కిలి విలువగల అనేక శాసనములను గలిగియున్నది. కావున నిది కేంద్ర ప్రభుత్వమువారి శిలా - శిల్పపరిశోధన శాఖకు మిక్కిలి ముఖ్యమయినది. లేపాక్షిలోనుండు శ్రీ వీరభద్రస్వామి ఆలయము అపురూపమగు నాట్యకళలతో నిండిన శిల్పకళాచాతుర్యమునకు, చిత్రకళానైపుణికి పుట్టినిల్లు. అళహమన్నారు కృష్ణస్వామి దేవాలయము అత్యద్భుతమగు గరుడవిగ్రహమునకు మిక్కిలి ప్రసిద్ధిజెందినది. ఈ గరుడుని కనుకొనలనుండి ఆనందబాష్పములు సంతతధారలుగ గాఱుచుండును. ఈ దేవాలయమునందుండు సౌందర్యవల్లీ అళహకృష్ణస్వాముల విగ్రహములు లలితకళాసౌందర్యమునకు తుదిమెట్టు. ఇపు డిదియంతయు శిథిలము గాబోవుచున్నది మఱియు తాడిపత్రిలోనుండు బుగ్గరామలింగేశ్వర చింతలవెంకటరమణ మొదలగు ద్వంద్వ ఆలయములు గలవు. ఈ ఆలయములలో చక్కని శిల్పకళానైపుణ్యముతో జెక్కబడిన విద్యాధరులు అప్సరసలు దేవతలు అవతారముల విగ్రహములు గలవు. పై దేవాలయము లన్నియు నిపుడు కడుశోచనీయమగు పరిస్థితులలో నున్నవి. అందులో గొన్ని ప్రభుత్వమువా రొసగు 'మోహిని' యను రాబడిపై నాధారపడి యున్నవి. వైష్ణవమతములలో ప్రధానమతమునకు నెలవైయున్న అహోబిలమందు ముఖ్యమగు శ్రీ నరసింహస్వామి ఆలయమునయితము నేడు మఱల నిర్మింపబడవలసియున్నది. ఒంటిమిట్టలోనుండు కోదండరామస్వామి ఆలయమునయిత మిట్టి పరిస్థితియందేకలదు

వెంటనే మఱల నిర్మింప వలసిన పరిస్థితిలో మఱియు గొన్ని ఆలయములు కలవు. భారతీయ సంస్కృతికి కళలకు చరిత్రకు బెన్నిధు లనదగు వీటి పునర్నిర్మాణమునకు అతిమానుషములగు ప్రయత్నము లవసరములు. ప్రభుత్వము (H. R. & C. E. Common good fund) సకల సామాన్యము శ్రేయోరూపమునగు హిందూమత ధర్మాదాయనిధి నొక దాని నేర్పాటుగావించి ఆ నిదిని వినియోగ పఱచుటకొక (Committee) సంఘమునేర్పాటు గావించినది. ఇతర దేవాలయముల మిగులుఆదాయమునుండి తగినంత ద్రవ్యమును సేకరింపదగిన యేర్పాటులను జేయుచున్నది. కాని యీ ఘనకార్యమును కొనసాగింప దగిన ధనము ప్రజల పరిమితిలేని సాహాయ్యములేక సమకూరదు. పైగా ఇట్టి దేవాలయములను పరిపాలించు రాజులు జమీందారులు గనబడని నేటి ప్రజాప్రభుత్వములో నీ బాధ్యత ప్రజలపై నుండును. దాతలు తమ విరాళముల నా యా ప్రత్యేక కార్యములకును బేరుబెట్టి యొసగ నగును. ఉదార విరాళముల నిచ్చునట్టి దాతల పవిత్రనామధేయములను ఆ యా ప్రత్యేకకార్యములగు కట్టడములపై జెక్కించబడును. మన పూర్వపు ఔన్నత్యమును దెలుపు సంస్కృతిని పునరుద్ధరించుటకు దానిని శాశ్వతముగ నిలబెట్టుటకు భూరి విరాళముల నొసగి తోడ్పడు నుదారులగు దాతల కెల్లరకు బై సంఘమెల్లపుడు గృతజ్ఞత గలిగియుండును.

దాతలు తమ విరాళములను దిగువ యడ్రస్సునకు మనిఆర్డరు ద్వారా గాని, చెక్కుద్వారా గాని బంప వలయును :—

కమీషనరు,
హెచ్. ఆర్. & సి. ఇ.
( హిందూ దేవాదాయ ధర్మాదాయ కామన్ గుడ్ ఫండ్ సంఘము. )
గుంటూరు.

---

# వార్తలు

## శ్రీ వరాహ లక్ష్మీ నరసింహాగమ పాఠశాల - సింహాచలం, ద్వితీయ వార్షికోత్సవము.

తే. **13-7-56** దీన శ్రీ జి. యస్. యన్, రామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్. డిప్యూటీ కమిషనరువారు, హిందూ దేవాదాయ ధర్మాదాయ పరిపాలనా శాఖ – వారి యధ్యక్షతను పాఠశాలా వార్షికోత్సవము జరుపబడెను. పాఠశాల **10** మంది పండితులతో అయా శాఖలందు క్రింది విద్యార్థులకు శిక్షణ నొసగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| (1) | పాంచరాత్రాగమము | 8 | (5) | యజుర్వేదము | 12 |
| (2) | శైవాగమము | 26 | (6) | సామవేదము | 1 |
| (3) | వైఖానసాగమము | 8 | (7) | ద్రావిడవేదము | 2 |
| (4) | ఋగ్వేదము | 2 | | | |

పై విద్యార్థు లందరికిని సంస్కృతముకూడ నేర్పబడుచున్నది. పాఠశాలా వార్షిక నివేదిక అనంతరము అధ్యక్షుల వారు పాఠశాలాభివృద్ధి కనువగు మార్గములను సూచింపుచు విద్యార్థులు, అర్చకులు, ఉపాధ్యాయులు ఐకమత్యము. సామరస్యముగలిగి, శీలసంపదను పెంపొందించుకొని పాఠశాలకు పేరువచ్చునట్లు పాఠశాలాభివృద్ధికి తోడ్పడవలెనని నుడిపిరి. ప్రధానోపాధ్యాయుల కృతజ్ఞతాభివందనములతో సభ సమాప్తమయ్యెను.

---

# BRAHMA'S PRAISE OF SRI KRISHNA

(From Srimad - Bhagavatam)

*First Published in token of humble offering of 'ARADHANA' on Sri Jayanti*

"Lord, thou art formless, infinite, blissful existence;
Yet thou hast assumed this form
To gladden the hearts of thy devotees
And so shower thy mercy upon them.
Thy form is indeed pure Sattva.

"Blessed indeed are those
Who art not concerned about philosophy, or doctrines,
But who live and follow thy life-giving words;
For such pure ones alone find thee,
Who art beyond thought,

"O thou infinite,
Thou art both personal and impersonal.
Incomprehensible is thy true being—
Yet, again, comprehended and realized art thou
By those who control their outgoing senses
And become absorbed in deepest contemplation of thee.

"Thou art blissful, unfading, eternal.
Thou art the light of all lights,
Pure, absolute.
Those whose divine sight is clear
Find thee within themselves:
Loosed are they from the wheel of birth and death.

"As in darkness we fancy a rope to be a snake,
So in ignorance, do we mistake the all-pervading Brahman for the world we see;
But as light dispels the darkness
And the rope is seen as a rope,
So with the rising of the sun of knowledge
The phantasmal world vanishes,
And thou art revealed—the true Brahman.

"Thou art the Ātman, the divine Self;
Not without do the wise seek thee, but within,
For thou art present in the hearts of all.

"Knowledge brings freedom,
But the mere intellect gives no knowledge of thee.
Those who devote themselves to thy service
Come to know thee through thy grace.
May I be even the least of thy devotees,
And may I devote my life to thy service alone!

"Blessed indeed are the shepherd boys and girls,
For they love thee as their very own,
Thee, the eternal, infinite Brahman,
They that serve thee with whole-souled devotion
Enjoy thy bliss with their whole being
The Vedas only tell of thee;
Thy devotees behold thee.

"O Krishṇa, thou art the friend of the destitute.
Thou art unborn, eternal;
Yet thou hast assumed this human form
For the good of all,
That all may taste of thy heavenly bliss.

"Attachment and delusion bind a man only so long
As he fails to take shelter at thy Lotus Feet."

*(With kind Courtesy of Sri Ramakrishna Math)*

# ANDHRA ARCHITECTURE

*By*

V. V. TONPE

### III—FOREIGN INFLUENCE ON HINDU ARCHITECTURE.

In the previous chapter we had a general idea of Hindu architecture and some glimpses of its various styles. Our endeavour in this chapter will be to know something of the foreign influences on Hindu architecture, what lasting effects they have had on it and how they have helped Indian culture to achieve its present comprehensiveness. Incidentally, we shall deal with Andhra architecture, as it is Hindu architecture itself, and study the foreign influences on it that have affected it almost parallelly with the other branches of Indian architecture.

There are few countries in the world like China and India that can be proud of their culture. From the very early days of civilization, these two countries built cultures which were not sectarian in their outlook. In India, the basic ideals and the governing concepts of literature, philo sophy, art and religion were universal. Yet it is wrong to assume that India was above exclusiveness. Fashioned to suit the conditions of life of a particular day, caste-system, built round itself, high-walled exclusiveness, which in the long run instead of giving strength and equilibrium to society, dug at its very roots. But on closer study, we find, that inspite of such narrowing tendencies, the original impetus for advancement in all directions, seems to be the vital strength of Indian culture. Professor Macdonell, in his *History of Sanskrit Literature* points out that "when the Greeks towards the end of the fourth century B. C., invaded the northwest, the Indians had already worked out a national culture of their own, unaffected by foreign influences. And in spite of successive waves of invasion and conquest by Persians, Greeks, Scythians, Muhammadanas, the national development of the life and literature of the Indo-Aryan race remained practically, unchecked and unmodified from without down to the era of British occupation." Like Tennyson's Brook, Indian culture seemed to say, "Men may come and men may go, But I go on for ever."

*Foreign Influences on Hindu Architecture.*

Outstanding foreign influences of Hindu architecture are :- 1. Persian and Greek, 2. Muslim, and 3. English. These three "styles" of architecture have enriched Hindu architecture to a large extent. A cultured nation like India cannot come in contact with another cultured nation, without deriving immense advantages in arts and civilization. The Greeks were doubtless the most gifted nation in the world in the fourth and third centuries before Christ. With the conquest of Alexander, the Greeks spread their wonderful civilization over all his territory. The whole of Western Asia from Antioch to Bactria represented the Greek civilization, arts and manners. The Hindus were greatly indebted to the Greeks for their arts, astronomy and such sciences. And this misled many historians and art-critics to generalize and say that India of fourth and third centuries before Christ was indebted to Greece for her architecture also. Facts were really wanting and it was unfortunate that some should have hastened to draw such conclusions.

Critics like Dr. Fergusson and E. B. Havell strove to prove that the archi-

tecture of the Hindus was not indebted to the Greeks. The Vedic Hindus had no architecture as they were not idolaters. Even Hinayana Buddhism followed Truth in its growth by the three elements it brought into prominence as the Buddha, the Dharma and the Sangha.[1] It was only in the later Buddhism that idol worship became a part of the religious paraphernalia and a device of mob-attraction. The Buddhist Hindus developed their school of architecture themselves. They borrowed from no foreign school any "style" of building. In Gandhara and in the Punjab columns had been discovered which distinctly bore a Greek character. That was because, those places were the gate-ways of ancient India and the influence of the Greeks and the Persians was inevitable. But in the vast continent of India, the architecture round about the beginnings of the Christian era, was purely Indian in character.

Regarding Muslim influence on Hindu architecture, certain pioneer European critics, who were biased in favour of the styles of the buildings erected under the Caliphate, in Egypt, Mesopotamia, Iran and Central Asia ignored the basic fact that in India architecture was always Hindu in spirit, though it adopted Muslim "styles" externally, while certain others over-emphasised the continuity of tradition.

It is perhaps, too early for us to form any definite impression of the English influence on Hindu architecture. If we have respect for our Culture it goes without saying, that as in the past, we should strive to bring about a happy consolidation of the English influence with Hindu architecture. In the past we have seen that in the wake of a new influence, the general trend had been to over-estimate the influence and could the unbroken tradition. But this made critics realise their blunder after some time and they allowed the pendulum to swing to the other extremity; they took to criticising the foreign styles and upholding the greatness of their traditional architecture. Finally Time had to play its cards and show that both the views were erroneous. Architecture in India, received fresh inspiration from each wave of thought that swept over the country. Like a rock in the sea, for the moment, it seemed to have been submerged by the wave; but no sooner the waters broke and gave way than the glittering rock appeared in its renovated resplendence.

It is not long since the British left us. The aftermath of a foreign rule for over four centuries is there. The divide and rule policy of the English proved fatal to themselves in the long run and made them unwillingly part with their Granary in the East. It is natural that many of us, who till yesterday had all appreciation for anything English, should continue to esteem them. After sometime this may make us detest the English way of life. We already find such trends in our appreciation of the West. And as usual, Time will have to prove that both cultures have been benefitted by their protracted contacts.

*Iranian or Persian Influence on Indian Culture*

Among the many peoples that have come in contact with the Indians, the oldest and most persistent have been the Iranians. There seems to be much in common between these two nations. Racially the Iranians and the Indo-Aryans descended from one and the same stock from Central Asia or from Western Asia as some critics hold. That is why, perhaps, their langu-

1. बुद्धं शरणं गच्छामि, धर्मं शरणं गच्छामि, संघं शरणं गच्छामि.

ages and their religions have much in common. Vedic Sanskrit and the old *Pahlavi*, the language of the *Avesta* bear a very close resemblance to each other. India is mentioned in the *Avesta* and there is a description in it which scholars have identified to be that of North India; and in the *Rig Veda* there are references made to Persia. The Persians are referred to as 'Parshavas' and later 'Parasikas.' The Parthians are referred to as 'Parthavas.'

The influence of Iran on India was a continuous process. During the Afghan and Moghul rule, Persian was the court language in India and till the British stepped on Indian soil it continued to enjoy the privileges of a *Darbari Zuban*. All the modern Indian languages had been influenced by Persian. Even the languages of the South, which in those days was cut off from the North by impenetrable forests, have imbibed many Persian words into their vocabulary. It may be mentioned here that words like సిస్తు, శిరస్తదారు, దస్తావేజు, వకీలు, ఖైదు, కిస్తీ, కొత్వాలు, దివాను, జమీన్దారు, అర్జీ, etc., in Telugu are from Persian stock. Many Indians in the past as well as in the present have been fine scholars of Persian.

*The Persian Invasion.*

The Persians entered Indus Valley as early as the sixth century B.C.. Herodotus referred to a provincial governor's district known as satrapy, which paid a large tribute. The indian province of Darius was again the richest in his empire. Herodotus described its prosperity as follows: "The population of the Indians is by far the greatest of all the people that we know; and they paid tribute proportionately larger than all the rest—(the sum of) three hundred and sixty talents of gold dust," The contacts between the Persians and the Indians were so cordial that many Indian troops actually joined the army of Xerxes, the son of Darius, against the Greeks. But at the time of Alexander's invasion, the Persian rule in India was on the decline and the ambitious Greek conqueror had the least difficulty in overcoming the enemy.

In the North, the contacts with the Persians was mainly through invasion and trade. South Indian trade was sea-borne and comparatively less easily accessible to the foreigners. Yet we find that the Persians had crossed the seas and reached South India. There is a record of an exchange of ambassadors between a Southern kingdom and the Persia of the Sassanids.

In later days, the Turkish, Afghan and Moghul conquest of India brought the country still closer to Iran. Babar, himself a prince of the Timurid line, established a kingdom in India and occupied the throne of Delhi. It was the time when under the Safavis, Iran was said to have had an excellent revival of art. It was in the early sixth century and the period was known as the golden age of Persian art. Persian influence on Indian art was the strongest during this period. Thus the ingress of Persian culture into Indian was a continuous one from the hoary past. Writing about the Iranians and the Indians Mr. Jawaharlal Nehru says in his *Discovery of India* that "few people have been more closely related in origin and throughout history than the people of India and the people of Iran." "Unfortunately the last memory we have of this long, intimate, and honourable association is that of Nadir Shah's invasion, a brief but terrible visitation two hundred years ago."

"Then came the British and they barred all the doors and stopped all the routes that connect us with our neighbours in Asia. New routes were opened across the seas which brought us nearer to Europe, and more particularly England,

but there were to be no further contacts over land between India and Iran and Central Asia and China till, in the present age, the development of the airways made us renew the old companionship. This sudden isolation from the rest of Asia has been one of the most remarkable and unfortunate consequences of British rule in India." (1)

*Iranian or Persian Influence on Indian Art and Architecture.*

There is much in common between the decorative art of India and Persia. No doubt, decorative art existed in India from a very ancient time. But it got enriched by the influence of Persian art. It assimilated the Persian style so much as to make it impossible now to differentiate it from its foreign influence. The decorative designs masterfully executed in Ajanta paintings bear evidence to the Persians, visit to India at the time of the excavations of the caves or earlier to that period. Griffiths, who copied the designs, gives us an interesting account of his originals: "The smaller panels are ornamented with designs as varied and graceful as they are fanciful. Some with grotesque little figures, rich in humour and quaintly dressed in Persian turbans coats, and striped stockings; gambolling amid fruits and flowers; dancing, drinking, or playing upon instruments;..." Fergusson describes a scene in Cave I as the record of an embassy from Khusru Parviz, king of Persia, to Pulakesin II, King of the Deccan about A.D. 626. From such evidences, it is clear that the contacts between India and Persia in those days were direct.

Though there is some evidence of Persian influence on Indian art espicially on the decorative art there is very little evidence of Persain influence on Indian or Hindu architecture. The history of Indian painting is so fragmentary that it is impossible to trace the origin of the highly advanced art of Ajanta and Sigiriya. There is a hypothesis that the Ajanta paintings are of Persian genesis. And to substantiate it, critics sight the Persian scenes, to which we have referred above. We have also noticed above that there was a close contact between India and Persia in the fifth and sixth centuries. Ajanta occures in a region known to have been in communication with Persia. But proof that Persia of the early years of Christian era was in a position to teach art to India is wanting. Some try to find a key to the origin of both Persian and Indian painting, in Turkistan. But again, the truth may be that the Indian schools of painting are only a return wave of a very old and widely diffused Asiatic school. So without any definite knowledge it is not advisable to formulate any theory. No connection seems to be traceable between the Indian and Persian schools of paintings of the early days. The Ajanta paintings are far superior to any work from Turkistan. They have a pre-eminently high standard in delineation of plant and animal life.

But we might say with certainity, that the principal forms of architecture in India were developed in India itself. Yet she was always ready to assimilate foreign material by freely borrowing from Persia in ancient times and again after the Muslim conquest. We shall here mention some of the typical Persian materials which India assimilated and made her own. We shall deal with the Persian influence again along with the Greek and Muslim influence on Indian culture and architecture in the subseqent chapters.

*Borrowings from Persia in Ancient Times*

In the time of Asoka, the dominant foreign influence was Persian. The mono-

1. Signet Press Ed. 1945. p. 115.

lithic columns, the pillars of structural buildings and the architectural decorations bear testimony to the vitalizing influence of Persian art on the Hindu art. The *recumbent* bulls and other animals found at Bharhut, Sanchi and other places in Gandhara and at Eran in Central India, bear witness to the influence of Persia as late as the fifth century of the Christian era. All these Indian styles of Persian art are not blind imitations of their models. They differ widely from their originals and are artistically far superior to them. The imposing capital of inscribed Asoka pillar at Sarnath (Fig. 1.) is the best extant specimen of Indian assimilation of Persian art. It was discovered by F.O. Oertel in 1905 and his account of the excavations has been reprinted in a separate volume entitled *Buddhist Ruins of Sarnath near Benares*. According to him the pillar was executed late in the reign of Asoka between 242 and 232 B. C.

The Perso-Ionic capital (Fig. 2.) and the classical head (Fig. 3.) of Maurya period found at Sarnath are typical examples of Persian art in ancient India.

When the Persian influence on Indian art and architecture of ancient India is compared with that of Babar's India, it goes without saying that before the time of Babar, the Iranian influence on Indian art and espicially on Indian architecture was not appreciably very great.

*Borrowing from Persia after the Muslim Conquest.*

Few of the rulers of India before Babar had direct relations with Persia. But during and after Babar's reign in India, the Musulman courts had many close domestic contacts with Persia and in the seventeenth century Persian fashions dominated the courts of Mogul aristocracy.

Babar inherited the nature-loving traditions of his race. He had no respect for anything Indian. He was strongly imbued with Persian culture of his days though he could not realize that it was after all the cultures of China and India and the West that had gone in the making of his native culture.

The Muslim rulers of India were good builders and horticulturists. They loved beautifully laid-out gardens with fountains and gurgling waters and marble platforms and pavilions in the style of Kabul gardens. We have a typical example of such a garden in the garden of the Taj. (Fig. 4.) The illustration referred to here



Fig. 1,



Fig. 2

is the garden plan of the Taj in which we find the artistic taste of the Persians revealed.

Like Akbar, Babar was not a philosopher. India's religion of the forest had no attraction to the pomp—and pleasure-loving prince of Persia. In his memoirs he expressed his contempt for all things Indian. He believed that the garden-mansions which he constructed were unknown to the dreamers of India. But history tells us that such gardens were not new to our ancient land. The Buddhists in India had planned miniature Indian villages which had their "four-fold field plots" as the Moguls had. But the Moguls converted gardening into a fine art. Paved walls, sculptured stone, water-channels, fountains before the beautiful buildings, became a part of the artistic unity of the building scheme of the Moguls.

Indian poetry and painting for ages before India fell into the hands of the Muslim invaders, showed a love of flowers and a longing for trees and birds. Sanskrit works such as *Mrit-Shakatika, Shakuntala, Uttara-Ramacharita* and *Kumara Sambhava* are wonderful records of India's love of Nature.

There is a fundamental difference between the tastes of a Hindu of old and the Muslim of Babar's time. To the foreigner the love of nature or of art was only the doctrine of art for art's sake. But to the Hindu it had become the religion of the forests. The forest was the retreat where all creatures found their protection of love—"sharanyam sarva bhutanam." And Kalidasa brings out this idea splendidly in his *Shakuntala* which is worth mentioning here: when Dushyanta in the famous hunting scene pursues an antilope and is about to kill the animal, the forest-

dwellers plead with the king to spare the helpless, innocent, animal, "Never, oh, never is the arrow meant to pierce the tender body of a deer, even as the fire is not for the burning of flowers."[1]

In the *Ramayana,* Rama is described as "giri-vana-priya" (lover of the mountain and the forest). Having lived on the Chitrakuta peak for a long time, Rama says to Sita, "When I look upon the beauties of this hill, the loss of my kingdom troubles me no longer, nor does the separation from my friends cause me any pang."

Thus gardens and forests are to the Hindu resorts of purification and sources of spiritual inspiration. That is why, we find many of the Hindu temples like Tirupati, Srisailam, Amarnath and Badrinath are situated on hill-tops and in the heart of forests. Pilgrimage to these holy places was a physical purgation, an intellectual deliverance and a spiritual elivation. Unfortunately, the influence of the West is reducing these kshethras into money-minting tourist centres and romance-rollicking holiday resorts. Rivers like Ganges and Yamuna, lakes like Manasa and confluences like Triveni were not dead geographical factors that could be easily converted into utility projects and economic aids, but were sources of spiritual inspiration. They brought into the mind of the Hindu the idea that such "manifold beings are produced from the Imperishable, and they go back to It again."[2]

But to the Mogul kings of India, gardens with fountains and gurgling water-courses, marble platforms and pavilions with plane-trees and cypresses brought into their minds such thoughts as those of Omar Khayyam:

A Book of Verses underneath the Bough,
A Jug of Wine, a Loaf of Bread—and Thou
Beside me singing in the Wilderness—
Oh, Wilderness were Paradise enow ! (3).

Thus we find well-planned gardens and fountain-heads were sources of mundane bliss to the Moguls in India.



Fig 3

1. न खलु न खलु बाणः सन्निपात्योऽयमस्मिन् । मृदुनि मृगशरीरे पुष्पराशाविवाग्निः ॥ —"*Abhijnana Sakuntala*" *1: 10.*
2. तथाक्षराद् विविधाः सोम्य भावाः । प्रजायन्ते तत्र चैवापि यन्ति ॥ —*Mundakopanisad 11: 1.*
3. Vide "Rubaiyat of Omar Khayyam". Collins london and glasgow Ed. 1947. P. 158. R. 1 .

*Indian Influence on Persian Art and Architecture.*

The student that tries to estimate the influence of Persian architecture on Hindu architecture inevitably comes to the conclusion that it was Persia that was indebted to India for her art and architecture and not *vice-versa*.

Buddhism spread from India to Ceylon, Tibet, Burma, China and the Far East. It is strange that it should have found nurishment in these foreign countries while in its land of birth it kissed the dust. We know that in the time of Asoka, he had sent ambassadors of "the law of Piety" to the countries round about India. The influence of Buddhism on the foreign countries is recorded in the XIII Edict of Asoka. It is plain from it that the Greeks and the Persians had accepted the Law of Piety, at least they had on enmity against it and therefore they tolerated it.

There are further evidences to show that Indian models were closely followed by artists during the seventh and eighth centuries in Turkistan. Numerous fresco paintings on wood and plaster were discovered by Dr. Stein at a place called Dandan-Uiliq. These may be confidently dated to the eighth century. They afford evidence of a sufficiently advanced stage in the evolution of Indian painting. There is a striking picture of a fourarmed Buddhist saint, perhaps, Bodhisattva in the guise of a Persian with black beard and whiskers, holding a *vajra* or a thunderbold in his left hand, on the reverse of the panel D. vii 6. (Fig, 5.) The four arms are a distinctly Indian feature. The existence of this peculiar picture may help us in some measure to understand the introduction of Persian figures into the Buddhist pictures of Ajanta. It may be guessed correctly that it might be an Indian development of Central Asiatic Buddhistic art. But again as we lack historical evidence, we cannot accept this hypothesis.

Coming to Muslim India, we again, notice that Muslim architecture in India was essentially Indian though other foreign influences are traceable. The Taj, for example, in the words of M Grousset is "the soul of Iran incarnate in the body of India." The large centre dome with four smaller ones at the corners, and four towering minarets is after the Persian style. The decorative designs and motifs inside the Mahal are Persian in origin.[1]




Fig. 4.

1. Vide: "Aradhana" Vol II. No 5. May 1956. p. 138.

Yet we call the Taj as a work of Indian architecture. E. B. Havell, in his *Indian Architecture*, has described the Taj as "India's Venus do Milo; the apotheosis of Indian womanhood. It may be that this personal or human quality is some thing too vague and intangible to analyse architecturally, though it has been felt by every European who has entered into the spirit of the Taj. One feels instinctively that the builders tried to rise above the ordinary canons of architectural law: the Taj is a great ideal conception which belongs more to sculpture than to architecture; and in this respect certainly it is more closely related to Hindu than to Saracenic art, for such an idea is altogether repugnant to the puritan sense of Islam. It is true that the Shia sects did not observe the strict letter of the Quran, which forbids the representation of animate nature in art, but anything which suggested idolatry in a building of a religious character would not be tolerated by any true believer. We find it in the Taj just because its builders were inspired by Hindu rather than by Saracenic masonic traditions and symbolism. The Hindu master-builder was both a sculptor and a mason; his aesthetic vision was more intense, more sensitive and wider than that of the Musulman brought up in the dry geometric tradition which kept anthropomorphic idealism beyond the range of artistic expression. The religious prejudices of Islam prevented the Hindu master-builders from exercising their skill in the usual form of sculpture; but this tomb of Mumtaz Mahall, whose personal qualities had endeared her to Hindu and Muslim alike, gave them an unique opportunity. If they could not carve her statue, they could satisfy Shah Jahan's desire for a monument which should be one of the world's wonders by creating an unique architectonic symbol of her loveliness."[1] Further Havell tells us in the same Chapter that the Taj, "though related in some ways to Humayun's mausoleum, was even more closely connected with its Pindu prototype the Chandi Sewa at Prambanam, and with the latter's Buddhist prototypes. In architecture it is unique, but neither Arabs, Persians, nor Moguls can claim it as their own, for it is Iudian in body and in soul."[2]

*(to be continued)*

---

# TEMPLES XVI

*By*

YATHARTHAWADI

RAMAYANA AND THE DWAYA MANTHRA

In the previous article, it was shown that the Dwaya Mantra was the essential basis of Ramanuja's philosophy and that Ramanuja's works were directed towards correlating this mantra, the Alwars' Divya Prabandham and other Sanskrit epics. That the Thiravoymoli of Namalwar has for its emperical formula the Dwaya-mantra, is an established fact in the great works called 'Bhagavadvishayam'. It will be beyond our scope to deal with

1. Ed. 1913 Pp. 28-29.
2. Ibid P. 31.

48. తలు కలిగి సర్వకర పరిహారంగా
49. అనుభవిస్తూ సకల సేవలుంచేను
50. కొని సుఖస్థితిని బ్రతుకువారు -

ఈ శాసనము 30 పంక్తివరకు సంస్కృత శ్లోకములును, 31 మొదలు 50 పంక్తి వరకు తెలుగుఁలో పై శ్లోకములకు వివరణమును చెక్కించిరి. శాసన ప్రభువులు చోడులైనను, ఆదినివరాహ మూర్తి ధ్యానమును, తమకు "లక్ష్మీ లక్షిత పక్షః" అను విశేషణమునుఁ జెక్కించు కొనుటచే వీరు విష్ణు భక్తులనియు అందును లక్ష్మీపతి వారి అభిమాన దైవమనియు స్పష్టముగ తెలియు చున్నది. ఇందలి విషయము శ్రీ గొంకనరేంద్రుని ప్రియ సతీమణి చెల్వాంబిక శకవర్షములు ౧౦౫౯ లో శ్రీ చోడనారాయణ దేవరకు నిత్యనైవేద్య దీపారాధనలు శాశ్వితముగా జరుపుటకు, స్వామికి సమస్తసేవలు చేయుటకును, అర్చకులును, గౌతమ గోత్రపవిత్రులునగు దీవి లక్ష్మీపతికి కేసరపాటిని ౧౬ కుచ్చెళ్లు (12 కత్తులు లేక 192 యకరములు) భూమిని, అర్చకవంశ పరంపరా, అష్టభోగ తేజస్వామ్య తలతో (సర్వహక్కులతో) సర్వకర పరిహారంగా (యేవిధ మైన శిస్తులు లేకుండా) ఆచంద్రార్కము అనుభవించుటకు దానమిచ్చి నట్లు కన్పట్టు చున్నది. తరువాత నీసీమను కొంతకాలము పశ్చిమ చాళుక్యులును 908 హిజరీలో అబ్దుర్‌హసన లీఫాదుపాయు, నూజివీటి ప్రభువులగు ధర్మ అప్పారాయణింగారును తరువాత పరగణా జాయంటు రెంటర్సు (Joint Renters) వకాల్తరావు మద్దాలిరెడ్డి నాయుఁడు బోడపాటి గుర్రాజుగార్లును పరిపాలించిరి. వారును కొన్ని వృత్తులను భూదానముల నొసంగి ధర్మశాసన పత్రికలు, ఫర్మానాలు, సనదులు వ్రాయించి యిచ్చి వుండిరి—

## ఆలయనిర్మాణము - శిల్పసౌందర్యము

ఈ ఆలయము పుష్పకవిమానము. ఇదియు నాస్థాన మంటప పర్యంతము నదీపాత మైనది. ఇప్పుడు ద్వాత్రింశతి (32) స్తంభములు కల ముఖమంటపము మాత్రము మిగిలి యున్నది. అన్ని స్తంభములమీదను రామాయణము భాగవతము చిత్రరూపమున చెక్కఁబడి యున్నవి. దక్షిణ మంటప పై భాగమున శ్రీ రామపట్టాభిషేకము రెండు వరుసలలో చెక్కఁబడి యున్నది. దీని క్రింద సుందరమైన గజలక్ష్మీ విగ్రహము కలదు. ఈ రామ పట్టాభిషేకమునే లతలతోఁ గూడ యా శిల్పి రెండంగుళముల కొబ్బరికాయ పై చెక్కెను. ఇది యిప్పటికినిఁ గలదు. మంటపములోని యుత్తర స్తంభముపై నాలుగు వైపులను గ్రామాభ్యు దయము కొరకు, లక్ష్మీహయగ్రీవాది మహాయంత్రములు దేవనాగరి భాషలోను, వేంగి లిపిలోను, హళకన్నడములోను చెక్కింపఁబడినవి. విమానమునకు ముందు రెండు వరుసలలో, అశ్వములను, దక్షిణోత్తర పార్శ్వముల నేసు గులనుసమర్చి చక్రములలోని యిరుసులు గిరగిర తిరుగు నట్లు నిర్మించెను. ఇట్టి శిల్పము సింహాచలములో మంట పమునకు మాత్రమమర్పఁబడి కలదు. ఆలయమున కాగ్నేయ భాగమున పై కప్పు (Roofing) లో, శిల్పి తననైపుణ్యమును చూపు కొరకు నెకరాతి గొలుసును నేకరాతిలోఁ జెక్కెను. గోష్ఠిమంటపమున "డోలోత్సవము" కొరకు నాలుగు స్తంభములపైన 4 సింహము లమర్పఁబడి యున్నవి. ఇవి సజీవములవలె కన్పించును. ఆలయము ముందు 99 అడుగుల యెత్తుఁ గల గొప్ప గాలిగోపుర మొకటి కలదు. [చూ. కవరు చివర పేజీ. చిత్రము.] ఇది ఆంధ్రదేశమున యెత్తైన గోపురములలో రెండవది. దీని క్రింద సింహస్తంభము లమర్పఁబడి యున్నవి. దీని పైన, లక్ష్మీనృసింహ, గరుడ, పంచముఖి, మున్నగు చక్కని విగ్రహకట్టుకలదు. దీనిపై శిల్పము "ఎల్లోరా" "అజంతా" శిల్పములఁ బోలి యున్నది. దీనిని పెదమహానంది, చినమహానందియును యిరువురు విశ్వకర్మ శిల్ప సోదరులు కట్టిరనిప్రతీతి. వీరు బహుశః మహానంది నివాసులేమో?. వారలో కొందఱ గ్రామమున ప్రముస్థానములలో యుండి నట్లును వారు "కాశీ" పని యందు నేర్పరులగుటచే, వారికి "కాశీవార" ను పొరుపనామమే గృహనామమై



రామాయణము - శిల్పముగా చెక్కబడిన కొబ్బరికాయ

నట్లు యీ గ్రామ విశ్వబ్రాహ్మణ వృద్ధులు చెప్పెదరు. ఈ ఆలయమునకు వెనుక కృష్ణా ప్రవాహము ప్రవహించి నప్పుడు. "నారాయణపట్టము" ని పిలిచెడివారు. దానికే శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వాములవారు "నారాయణ సరస్స" ని పేరిడిరి. పుష్ప కొనేరని వాడుకపేరు.

## రాజముఖీహనుమంతము స్థలప్రభావము

ఈ గోపురమునకు ఉత్తరపు వైపు ముందు భాగమున "రాజముఖీహనుమంత" మను సుందర తరవీరాంజనేయ విగ్రహమొకటి కలదు. ఈ స్థలప్రభావము వలన, గోదావరీ, కావేరీ తీరస్థులవలె సమస్త కళల యందును, ఉద్దండ పండితులుండిన కారణముచేత, పండిత పరిషత్తులు, వేద పరీక్ష, కవితా గోష్ఠులు, సంగీతసభలు, నాటక ప్రదర్శనములు, యీ గోపురము ముందు యీ స్వామిసన్నిధిని జరుపుట ప్రాచీనాచారము. అట్లు వచ్చినవారు శ్రీ స్వామిని దర్శనముఁజేసి నమస్కరింపని పండితులకు పరాభవము కలుగునని వచంతి కలదు. ఒక సారిమందిన ఘనపాఠీ యగు శ్రీ స్వయంపాకుల సీతారామావధానులవారు ఆలయము ముందు విద్వత్పరిషత్తులో వేదాష్టావధానము చేయుచుండగా, అకుంఠితమైన వారి వాక్కులనో మొక్క వోయి స్ఫురింపక మిన్న కుండిరట. భీతులై తన్నొక్క కోతి వెక్కిరించుచు, బెదరించుచున్నదనియు, పై వాక్యమును తప్పించుచున్నదనియు చెప్పిరట. అంత



గోపుర ద్వారము - శిల్పచాతురి



శ్రీ రాజముఖీ అంజనేయస్వామి

సభ్యులలో వయోవృద్ధులగు వేమూరి సూర్యనారాయణ సోమయాజులుగారు, పోతుకూచి అప్పావధానులుగారు లేచి, 'నాయనా! నీవు గోపురము మిదనున్న రాజముఖీ హనుమంత దేవునికి నమస్కరించి వచ్చితివా? అట్లు చేయనివారి కిట్టిపరాభవమును నాస్వామి చేయు'నని పలికిరట. అంత ఘనపాఠీగారు వెంటనే స్వామి యెదుటకుం జని అపరాధమును విన్నవించి సమస్కరించి వచ్చిరట. అంత వారికి వాక్కుస్ఫురించి వారి యవధానసరణి చివర వరకు నమోఘముగ జరిగెనట. విద్యాభిలాషులు నేటికిని వారికి మ్రొక్కిపరీక్షల యందుత్తీర్ణులగు చున్నారు. శ్రీ జయంతి రామయ్య పంతులుగారు శాసనపద్య మంజరి పీఠిక రెండవ పేజిలో పద్యశాసనములు 8 జిల్లాలలోను నైజాముతో సహాకలిపి 88 శాసనములు దొరికిన వనిన్నీ అందు కృష్ణా, గుంటూరు మండలములలో 69 అనిన్నీ, మొత్తము పద్యములలో ముప్పాతికకు మించి కృష్ణా తీర మందు దొరికిన వనిన్నీ వ్రాసెరి. పూర్వకాలమందు కూడ కృష్ణా తీరమందుఁ గవులెక్కుడుగా నున్నట్లు దీనివలనఁ దెలియు చున్నద" ని కూడ వ్రాసిరి.

## రాజశేఖరస్వామి - అంజనేయస్వామి

శ్రీ రాజశేఖరుఁడు క్షేత్రపాలకుఁడు. శ్రీ రాజరాజేశ్వరి చక్కనిచుక్క. ఈ యాలయమును చోడరాజ ప్రతిష్ఠితమే.

దీని గోపురవిమానములు నదీపాతములైనవి. ఇప్పుడున్న విమానము 150 సంవత్సరముల క్రిందట శ్రీ (జాల్నా) పోతరాజు సుబ్బయ్యగారు కట్టించిరి. శ్రీ ఆంజనేయాలయము 400 సంవత్సరముల క్రిందట మా ప్రపితామహుఁడు దీవి వెంకటనరసింహాచార్య్యల వారికి సంతానము లేనందున అగినపర్రులో శ్రీ వేమూరి అనంతరామ శాస్త్రి గారి యింటి దొడ్డిలో నీ విగ్రహము దొరకగా, వారినడిగి తెచ్చుకుని ప్రతిష్ఠించుకొనిరి. వీరత్యంత లావణ్య మూర్తులు. మరియు ప్రత్యక్షదైవము. పిశాచగ్రస్తులును సంతానకాములును పెక్కండ్రు హరిస్థిర వాసరముల వీరిం గొలిచి యవాప్తకాములగు చున్నారు. వీరి ఉత్సవమూర్తి సువర్చలాసహితమైనది. ఇందు వలన ఖగేంద్రసంహిత పంచాశీతిపటల ప్రమాణము ననుసరించి ప్రతివత్సరమును పుష్యశుద్ధచతుర్దశికి సువర్చలాకల్యాణము చేయబడును. ఇంక స్వామి సన్నిధిని శ్రీ విష్వక్సేనాళ్వారు, పన్నిద్దరాళ్వార్లు, భూదేవి శిలావిగ్రహములును, చూడకుడుతై నాచ్చియారు తామ్రవిగ్రహమున్నూ కలవు. సువర్ణ లక్ష్మీ విగ్రహమును, నవరత్నఖచితమైన రజత లక్ష్మీనారాయణ విగ్రహమున్నూ జమీందారులు యిచ్చిన, వెండి సర్వాంగ కవచమున్నూ, సూర్యచంద్ర ముక్తాహారములున్నూ చోరులపహరించిరి. ఈ విగ్రహములన్నియు ధ్రువోత్సవబేరముల వలెనే అత్యంతసౌందర్య వంతములైనవి.

## నదులు - ప్రకృతిశోభ

ఈ అవనిగడ్డ దివితాలూకాకు ముఖ్యపట్టణము. ఇది (Iland) ద్వీపమగుటచే దీనికి "దివి" యని పేరిడిరి. దీనికి నుత్తరమున "కృష్ణా తరంగిణి" యు, పశ్చిమమున "వేణి" యనునదియు ప్రవహించి ప్రాగ్దక్షిణముల తూర్పు సముద్రమునఁ గలియుచున్నవి. పాగ్భాగమున కలసిన స్థలమునకు "కృష్ణాసాగర సంగమ" మని పేరు. ఇచట "హంసలదీవి" యను గొప్ప గోపాలక్షేత్ర మొండుకలదు. ఇది స్వయంవ్యక్తమని కృష్ణా మాహాత్మ్యమున పేర్కొనఁబడినది. ఇంక, వేణి తొలుతసంగమించిన స్థలమునకు "సంగమేశ్వర" మనిపేరు. ఇచట సంగమేశ్వరుఁడను దేవుఁడు కలడు. మరియు నీవేణి దక్షిణముగ యేటిమొగ వరకు ప్రవహించి, యచటనుండి మూడు పాయలై, మొదటి పాయతిరిగి తూర్పుగా నడిచి "గుల్లల మొద" వద్ద "Kistna Havelock point" అను స్థలమున కల దీపగృహము (Light house) వద్ద కలియుచున్నది. దీనికి "గోలు ముట్టుపాయ, లేక, బల్లలేరు" అనిపేరు. రెండవపాయయు, "నాచుగుంట, ఈలచెట్ల దిబ్బ" లను గ్రామముల మధ్యగా, ఆగ్నేయ దిక్కుగా ప్రవహించి సముద్రమునఁ గలియుచున్నది. దీనిని "నడిమే" రందురు. ఇంక మూడవపాయ "లంకవేణి దిబ్బ మీదుగా ప్రవహించి "చాపల మంచ" అను తావున "Beacon" వద్ద కలిసినది. ఇందుచే నివి "త్రివేణీసాగర సంగమము" లని ప్రసిద్ధి కెక్కినవి. ఈ నది చివరభాగమున మూడు పాయలై "జడ కుచ్చుల" వలె నుండుటచే దీనికి "వేణి" యను పేరు వ్యవహరించిరి. మరియు నీగ్రామమునకు నుత్తర దక్షిణముల "సుపర్ణముఖి గోపీగుండము" లను రెండుపనదులునుఁ గలవు. ఇవి యిప్పుడు పంటకాలువలుగ నుపయోగపడు చున్నవి.

## అర్చనావిధానము - ఉత్సవములు

ఈ లక్ష్మీనారాయణాలయము, ఆంజనేయాలయములు "వడఘల" సాంప్రదాయమునకు చెందినవై శ్రీవైఖానస సూత్రప్రకారము ప్రతిష్ఠింపఁబడి వైఖానసభగవచ్ఛాస్త్ర ప్రకారమే అర్చనోత్సవాదులు జరుపఁబడుచున్నవి. ఇచ్చట ధృవమూర్తికేఁగాక ఉత్సవవరులకు ఆళ్వారాదులకు సహితము వడవులోర్ధ్వపుండ్రమే చిహ్నితమైయున్నది. పూర్వమిది దివ్యదేశమగుటచే ఆళ్వారాదులు వేంచేసియుండిరి కాని అప్పుడు సన్నిధిని ఉభయవేదపారాయణముండెడిది. దీని బ్రహ్మాచార్యులు స్థానాచార్యులుగను, తచ్చూరి శింగరాచార్యులు అధ్యాపకులుగను నుండెడివారు. వేమూరి సూర్యనారాయణ సోమయాజులు విష్ణుభట్ల సుబ్రహ్మణ్య



సువర్చలా సహిత శ్రీ ఆంజనేయస్వామి

సోమయాజులు, వేమూరి రామకృష్ణ దీక్షితులు. తంగిరాల సర్వతోముఖయాజులు యేలేశ్వరపు సీతారామావధానులు, పోతుకూచి అప్పావధానులు, సంస్కృతవేదమునకు స్వస్తి వాచకులుగనుండెడివారు. వీరి తరువాత లక్కావఝుల రాజాఘనపాఠీ, పోతుకూచి లక్ష్మీనారాయణావధానులు (సలక్షణఘనపాఠీ) తాడేపల్లి సుబ్బావధానులు, చిట్టి సుబ్రహ్మణ్య సోమయాజులు మున్నగువారు 52 స్వస్తి వాచకులు యేకకాలముననుండెడివారు. వీరిలో 15 గురు సోమయాజులుఁ గలరు. సంగీతమునకు తాడేపల్లి రత్తయ్యా అదిరాజు రామన్నగార్లున్నూ కుంభహారతికి నాట్యమునకు అంబుల పాపసాని, పేరసాని యనువారలుండెడివారు. ఇప్పుడీ కైంకర్యము లేమియు జరుగుటలేదు. ఇంక నీ దేవాలయములో సంవత్సరాదికి పంచాంగశ్రవణము, శ్రీరామజయంతి, నృసింహజయంతి, శ్రావణశుద్ధపౌర్ణమికి విఖనసాచార్య తిరునక్షత్రము, కృష్ణాష్టమి, ఆశ్వీయుజ మాసములో విజయదశమికి పారు వేటోత్సవము, మకర సంక్రమణమునకు తిరువీధులు వేంచేయుట, అను ఉత్స వములు జరుగుట ఆచారము. నిత్యము రాత్రిపూటయు, జయంతులు పర్వదినములలోను ధనుర్మాసములోను, ఉదయము రాత్రియు సహస్రనామార్చనములు జరుగు చుండును. బ్రహ్మోత్సవము వైశాఖ శు ౧౧ ప్రభృతి పంచాహ్నిక దీక్షగా జరుగు ఆచారము కలదు.

## యు. ఆర్. భాష్యం అయ్యంగారు - టౌను హాల్

ఈ దేవాలయముల ముందుగా యేటికట్ట పోయించు టకు ప్రభుత్వమువారు నిర్ణయించిరి. అట్లు పోసినచో యీ మహాసౌందర్య శిల్పములతో కూడిన దేవాలయము లన్నియు కృష్ణప్రవాహములోనుండి శిదిలములగునని, అప్పుడు పులిగడ్డ ప్రాజిక్టు కట్టించుటకు సూపరువైజరుగ వచ్చిన ఉత్తరమల్లూరు కాపస్తులు యు. ఆర్. భాష్యం అయ్యంగారు యీ దేవాలయముల స్థితిచూచి వీటి నెట్లై నను, సంరక్షింపవలెనని సంకల్పించుకొని, చక్కని యుపా యమును పన్నిరి. వెంటనే వారీ దేవాలయముల నాను కొనియున్న ఖాళీస్థలమును కొని అందులో "ఏడ్వర్డు హాల్" అనుపేరుపెట్టి అప్పటికి ఎగ్జిక్యూటివ్ యింజి నీరుగానున్న "పి. డబ్లియు - వాల్షు" (P. W. Walsh) దొరగారిచేత శంఖుస్థాపన చేయించిరి. అతిత్వరితముగ తాను భవననిర్మాణమును పూర్తిఁ గావించి, సూపరెంటెం డెంటు యింజినీరు "జె. హెచ్. మెడ్లికాట్" J. H. Medlicott) దొరవారిని మదరాసునుంచి పిలిపించి, వారిచే నీ (Edward Town Hall) ప్రారంభోత్సవ మునుఁ జేయించిరి. ప్రారంభోత్సవము జరిగిన తరువాత, వారితో తమబోటివారు శంఖుస్థాపన ప్రారంభోత్సవములు జరిగించి మన ప్రభువు పేరుతోకట్టిన కట్టడము, కృష్ణానదీ ప్రవాహమువచ్చినపుడు, నదీపాతమగునని భయముగా నున్నదనిరి. అందుకేమైన యుపాయము కలదా? అని వారడుగ యీ హాలుకుచుట్టూ వుంగరపుకట్ట (Ring Bund) పోయించిన బాగుండునని చెప్పిరి. వారట్లేచేయు మనిరి. వెంటనే వారిచేత నంగీకార పత్రమును తీసుకొని, యీ దేవాలయములన్నియు కట్ట లోపలనుండునట్లుగా చుట్టు కట్టపోయించి, యీ కట్టడములు శాశ్వితముగా నుండునట్లుచేసి, ధర్మశాస్త్రములలో చెప్పఁబడినట్లు "దాన పాలన యోర్మధ్యేదానా చ్ఛ్రేయోను పాలనం" అను సూక్తికి గురియై యశఃకాయులైరి. వారిని నేటికి యీ గ్రామములో నా బాలగోపాలము నిత్యము స్మరించు చుందురు—గోపురము ఆలయముకూడ చాలా మరమ్మ తును కోరుచున్నవి. ప్రభుత్వమువారును ఉదారపురుషు లును జీర్ణోద్ధరణకు సహాయపడి స్వామి యనుగ్రహము నకు పాత్రులగుదురు గాక.

---

నారాయణాయ విద్మహే
వాసుదేవాయ ధీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥
మహాలక్ష్మీ చ విద్మహే
విష్ణుపత్నీ చ ధీమహి ।
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

# ఉత్సవములు

**8-9-56** భాద్రపదశుక్ల చతుర్థీ శనివారము- వినాయక **చతుర్థి.**

ఈ వ్రతము ఇష్టసిద్ధికి, అనిష్ట పరిహారమునకును. చాతుర్వర్ణ్యము నందలి స్త్రీబాల వృద్ధాదులచే చేయదగును. వత్సరము నందలి విశేషోత్సవ దినములలో మొదటిది. "ఆదౌ పూజ్యో గణాధిపః" అను సూక్తిచే ఈ వ్రతము భారతదేశము నందు అంతటను యధావిభవముగా చేయ బడును.

పరమేశ్వరుడు తనయంశలు రెంటిని స్కందుడు, గణపతినిగా కల్పించెను. లౌకికమగు కార్యములను శరీర బలముచే సాధించుట కని దేవతలసేనానిగా స్కందుని, పారమార్థిక జ్ఞానసముపార్జనకు సాధనమగు జ్ఞానాంశచే గణపతిని కల్పించెను. అందు వలననే గణపతిని పూజించిన విద్యావిజ్ఞానములు చే కూరునని ప్రతీతి. మానవ ప్రవృత్తి అనిష్టపరిహారము ద్వారా ఇష్టప్రాప్తి నభిలషించు నని తలంచి శ్రీ పార్వతీదేవి కుమారుడగు గణపతిని పూజించిన కార్యసాఫల్యమున అంతరాయములు నశించు నని యాదేశించినది. గనుకనే ప్రతి మానవుడును ప్రారీప్సిత కార్యమున ముందుగా గణపతిని పూజించి కార్యము నుపక్రమించు యాచారము భారతదేశమున సర్వత్రగలదు. కార్యసిద్ధి నొసగును గనుక యీ దైవమునకు సిద్ధిగణపతి యని సిద్ధివినాయకుడని వ్యవహారము.

ఈ వ్రతము **21** దివసములు, **9** దినములు, **3** దిన ములు, **1** దినము, కనీసము చతుర్థీ దివసమునందు ఒక పూట యందును జరుపబడును. ఈతడు గజశిరస్సు కలిగి యుండుట ఉత్కృష్ట జ్ఞానవత్త్వమును సూచించును. నాగయజ్ఞోపవీతము, మూషకవాహనము, - ప్రకృతి ఈ కాలమున సమృద్ధముగా నుండి సస్యశ్యామల మగుటచే సస్యోపద్రవమును పరిహరించుట - విరుద్ధజంతువులను కూడ నొకచోట సమకూర్చుట - యితని శక్తులను సూచించును. ఏకవింశతి పత్రములు, దూర్వాయుగ్మము లచే పూజింపుట - ప్రకృతి సంపదను సూచింపును.

కేవలము ఇష్టప్రాప్తి కలుగు నన్నంత మాత్రమున మానవ ప్రవృత్తి కలుగదని యెంచి గణపతిని పూజింపక వ్రత కథ నాలింపక ఈ నాడు చంద్రుని చూచిన నీలాప నింద నొందుదురను శాపము ఇతిహ్యమున గలదు. వ్రతమును యథావిధిగ నొనర్చి తనకు కలిగిన యప వాదును పోగొట్టు కొనెనని శ్రీకృష్ణుడు - స్యమంత కోపా ఖ్యానము - తార్కాణముగా వచించెదరు. వ్రతము నాచరించుటకు అశక్తులగు వారు ఈ క్రింది శ్లోకము నైన పఠించిన ఈ నాడు చంద్ర దర్శనము వలన గలుగు నీలాప నిందలను పొందరని ప్రతీతి

"సింహః ప్రసేనమవధీత్ సింహోజాంబవతా హతః।
సుకుమారక మారోదీః తవహ్యేష స్యమంతకః॥

ఆంధ్రదేశమున గణపతి దేవాలయములు విరళములు - గుంటూరు జిల్లా భట్టిప్రోలు వద్ద వెల్లటూరు నందు ప్రత్యేకముగ గణపతి దేవాలయము గలదు. ఈ దేవాలయ మును గురించి యీ సందర్భమున యిందు వ్యాసము ప్రకటితమైనది. పాఠకులు గమనింతురు గాక.

**9-9-56** భాద్రపద శుక్లపంచమీ ఆదివారము - ఋషి **పంచ మీవ్రతము.**

ఈ వ్రతము స్త్రీల కొరకుద్దిష్టము. సౌభాగ్యము కొరకు పతివ్రతయగు నరుంధతిని, సప్తర్షులను యథావిధిగ పూజించి యీ వ్రతమాచరించిన స్త్రీలకు రజోదోషము వలన గలుగు పాప పరిహారము గల్గి అనంతమగు సౌభాగ్యము గల్గునని వ్రతమాహాత్మ్యమున చెప్పబడినది. యథాశక్తి నీ వ్రతమును స్త్రీలు ఆచరింతురు.

**18-9-56** భాద్రపద శుక్లచతుర్దశీ మంగళవారము - **అనంతవ్రతము.**

ఈ వ్రతము అనంతకాల రూపియగు శ్రీ మహావిష్ణువు నుద్దేశించి యాచరింపనగును. ఈ వ్రతమును కల్పో క్తముగ నాచరించి **14** గ్రంథులుగల దోరమును వ్రతాం తమున ధరింతురు. ఈ వ్రతమే అనంత పద్మనాభ వ్రత మని కూడ చెప్పబడును. సుశీలా కౌండిన్యులను దంప తులు ఈ వ్రతము నాచరించి ధనధాన్యాది సమస్తసంప దలను పొంది శ్రీ మహావిష్ణువు యనుగ్రహమును బడసి రని వ్రతమాహాత్మ్యమున నుడువ బడినది. ఆంధ్రదేశమున నీవ్రతము క్వాచిత్కముగా నాచరింపబడును.

**20-9-56** భాద్రపద బహుళ పాడ్యమీ గురువారం మొదలు **4-10-1956** భాద్రపద బహుళ అమావాస్యా గురువారం వరకును మహాలయ పక్షము. ఈ పక్షమున పితృ దేవతల నుద్దేశించి తర్పణము, మహాలయ శ్రాద్ధము జరుపుట యాచారము.

# భక్తి పరిశీలన

(బులుసు - వేంకటరమణయ్య)

భగవంతునికి పక్షపాతమనేది లేదు; తనకు మిక్కిలి భక్తులైనవారియెడల అపారమైన అనుగ్రహాన్ని చూపుటయు, పతితులయెడల కాఠిన్యం వహించుటయు అతనికి కిట్టని పనులు! విశేషం ఏమిటంటే-తనయందు అపారమైన భక్తి కలవారని తెలిసివుండికూడా, అలాటి భక్తులను కఠినములైన పరీక్షలకు గురిచేసి, ఆ మీదనే అనుగ్రహించడమూ-ఎంతో పతితులైన వ్యక్తులు తన ఆవాసం పొలిమేరలో అడుగు పెట్టినంతమాత్రాన-వారియెడల అపారమైన వాత్సల్యం చూపి వెంటనే ఉత్తమగతినొసగడమూ జరుగుతూ ఉంటుంది. ఇవి లీలామానుష విగ్రహుడైన పరాత్పరుని చిద్విలాసాలలో కొన్ని అంటూ అభిజ్ఞులు చెప్పుదురు. ఇట్టి సంఘటనలు ఎన్నో జరిగి ఉన్నవి. వానిలో భగవంతుడు తన భక్తురాల నొకతెను పరీక్షచేసిన విషయం ఇచ్చట వివరింపబడుతున్నది.

పూర్వ మొకప్పుడు ఒక కార్తిక పౌర్ణమినాటి రాత్రి చంద్రుడు షోడశ కళా పరిపూర్ణుడై వెన్నెలలు కురియుచుండగా శ్రీ కృష్ణుఁడు భీమరథీ నదీ తీరమునందు అతి మనోహరముగా వేణునాదము చేసెను. ఆ సమీపములో నున్న ధేనువొకటి ఆ వేణునాదాన్ని విని పరవశమై, దేహము మరచి పాలను కురిసెను. ఆ పాలలోని బిందువు ఒకటి గాలి కెగిరి శ్రీ కృష్ణుని మౌళిపై పడినది. అందువల్ల-ఆ గోవునకు భగవంతునికి క్షీరాభిషేకము చేసిన పుణ్యము లభించినది. దానికి ఫలంగా ఆ గోవు మరుజన్మంలో ఒక విష్ణుభక్తుడికి కుమార్తెగా పుట్టి మిక్కిలి శాంతచిత్తం కలిగి వుండినది. ఆమెపేరు సుశీల. యుక్త వయస్సు వచ్చిన తర్వాత సుశీలకు వివాహం జరిగింది. జన్మాంతర కర్మ పరిపాకం వల్లనో, మరేకారణం వల్లనో యేమో-ఆమెకు అనుకూలుడైన భర్త మాత్రం లభించడం లేదు. అతడు మహాలోభి; క్రోధి; వికారస్వరూపం కలవాడు; చపల చిత్తుడు; మూర్ఖుడు; బంధుజన విరోధి; కలహప్రియుడు; దుర్గర్వం కలవాడు; పరాన్నప్రియుడు. ఏదో విశేషం అని చెప్పి అందర్నీ యాచించి పదార్థాలు సంపాదించును. పండిన ధాన్యాలను పాతరల్లో పూడ్చి పెట్టి, యాచించి తెచ్చిన వాటితోనే కాలం గడుపును. ఎవరైనా ధనంగాని, వస్తువులుగాని యిస్తామని మాట యిస్తే-అవి యిచ్చేవరకు వారిని వదలడు. బంధువులు చుట్టం చూపుగా యింటికి వస్తే మృతాశౌచాన్ని తెల్పి, వారికి యింట్లో తిండి పెట్టకుండా తరిమివేయును. ఏమాత్రం లభించే సూచన వున్నా 'శాకాయవా స్యాల్లవణాయవా స్యాత్' అనే అభిప్రాయంతో గ్రహించి 'ధూళిః పరగృహే దప' అనే సూక్తిని సార్థకం చేసేవాడు.

భర్త యిలా ఉన్నా కూడా, సుశీల మంగళసూత్రం ధరించిన నాటినుంచీ పతినే దైవంగా తలుస్తూ, అతడు కొట్టినా, తిట్టినా సహిస్తూ, మారు మాటాడక-అతని అభిప్రాయానికి వ్యతిరేకంగా ప్రవర్తింపక ఉండేది. భర్త కొలబత్తెంగా యిచ్చిన ముక్క బియ్యాన్నే వండి, అతడు భుజింపగా మిగిలిన కొద్దిపాటి అన్నంతోనే తృప్తిపొందేది.

సుశీలభర్త ధనవంతుడు; అయినా ఎక్కువ ధనం కూడబెట్టాలనే ఆశ అతనిని విడవలేదు. అందుకని-అతడు మిక్కిలి విలువైన వస్తువులను కుదువపెట్టించుకొని, ఎక్కువ వడ్డీకి, తక్కువగా సొమ్ము అప్పయిచ్చేవాడు. అట్టి అప్పులయినా సంపాదించడానికి కొందరు ఇతనిని ఆశ్రయించి, రుచికరములైన కజ్జాయములను బహుమానంగా యిచ్చేవారు. ఇతడు వాటిని, రెండోకంటికి తెలియకుండా అటుకమీద భద్రంగా ఉంచుకుని భక్షించేవాడు.

ఒకనా డతడు తెల్లవారు జామునసే లేచి, కాల్యకృత్యాలు నిర్వర్తించుకుని, సుశీల యిచ్చిన పర్యుషితాన్నమును పాథేయముగా తీసికొని గ్రామాంతరమునకు పోయెను. అట్టి సమయములోనే ఒక పొట్టి వటువు-వామనమూర్తి అపరావతారంవలె ఉన్నవాడు అతిథిగా వచ్చి ఆమెతో ఇట్లనెను—

"అమ్మా! నాకు అయిదు రోజులనుంచీ ఆహారము లేదు. ఆకలిచేత ప్రాణములు కొట్టుకొనుచున్నవి. దయయుంచి, నీ యింటిలో పాడియన్న మున్నను సరే; పులిసిన యన్నమున్నను సరే;-పెట్టి నా ప్రాణములను నిలుపుము తల్లీ!"

ఈ మాటలు విని సుశీల చేతులు జోడించి "స్వామీ! మీరు తపశ్శాలులవలె ఉన్నారు. అట్టి మీకు పులిసిన యన్నము పెట్టిన నాకు పాపము కాదా! దయచేసి మొగసాలలో కొంచెము సేపు విశ్రమించండి. అవలీలగా వంట చేసి పెట్టెదను. ఇంటి యజమాని ఊరిలో లేరు. అందువల్లనే యింతవరకూ వంట ప్రయత్నం చెయ్యలేదు" అన్నది.

ఇంటిలో చద్దియన్నము ఉన్న సంగతి తెలిసినందున బ్రహ్మచారి ఊరుకోక "అమ్మా! నీవు వంటచేసి పెట్టే

వరకూ నా ప్రాణాలు నిలువవు. చలిది తిన్న పాపాన్ని నేను నా తపశ్శక్తివల్ల పోగొట్టుకోగలను. మరొక సంగతి. మేము కొంచరం పాండురంగ విఠల స్వామి దర్శనం కోసం పంఢరిపురానికి బయలుదేరి, దారిలో వచ్చే క్షేత్రాలను చూచుకుంటూ ప్రయాణం సాగిస్తున్నాము. తిండి దొరక్కపోయినా, నాతోటి మిత్రులు ముందుకు సాగిపోయారు. 'కూటి మీద తోడు తప్పు'నని సామెత ఉండనే వున్నది. అందువల్ల నేను వెనుక పడ్డాను. నా కోరిక చెల్లించి పోకంత అన్నమూ, కాసిన్ని నీళ్లు యిచ్చితివట్టాయినా, నా ప్రాణాలు నిలిపినదానవు కాగలవు; చలిది అయినా తప్పులేదు. "అభ్యాగతః స్వయం విష్ణుః" అనే మాట నీకు తెలియనిది కాదు. అతిధి తృప్తి పొందితే చాలు; ఉత్తమగతి కలుగుతుంది. మరేమీ అడ్డుమాటలు చెప్పక పర్యుషితాన్ని పెట్ట ప్రాణాలు నిలబెట్టు" అన్నాడు.

సుశీల ఆలోచనలో పడినది. ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు. "చద్దన్నం పెట్టి, పాతకం కట్టుకోడానికి సిద్ధపడినా—ఆ చద్దన్నమయినా—తన భర్తకు దారిబత్తెంగా కట్టి యివ్వగా మిగిలినది కొంచెమే వున్నది. "కొంచెం వున్నా చాలు"నని అతిథి యిప్పుడు చెప్పినా-తీరా-వడ్డించిన తర్వాత–యింకా కావాలంటే ఎక్కడనుంచి తెచ్చి పెట్టగలను? యాత్రికులు చాలా మొరటు స్వభావం కలవారు కదా! వాళ్లకు యితరుల కష్ట సుఖాలతో పని వుండదు. అయితే మాత్రం ఇప్పుడు ఏమి చేయుగలను? జరగవలసినది ఎలాగూ జరగక మానదు." అని అరటాకులో మిల మిల మల్లెపూవులా మెరుస్తున్న చద్ది అన్నాన్ని నీరోడ్చి పెట్టి, నంజుకొనుటకు ఊరగాయ వేసి, గడ్డపెరుగు వడ్డించి, ఆ అతిథిని భుజించమని కోరినది. అతడు ఎంతో ఆప్యాయంతో ఆ చద్దిని భుజించి, సంతృప్తి కలగకపోగా ముఖం వంచి యిట్లు పలికెను—

"అమ్మా! నీవు పెట్టిన పర్యుషితం చాలా రుచ్యంగా ఉన్నది. కాని, ఇది చాలలేదు. అయిదు రోజులనుంచీ అణగివున్న ఆకలిని యిది రేకెత్తించినది! అయిదు రోజుల నుంచీ, నాకు నిద్ర వచ్చునపుడు కూటికలలే వచ్చుచున్నవి. ఇట్టి నాకీ కొంచెపు అన్నము ఎట్లు సరిపోవును? నీవు వంటింటికి పోయి మరియొకసారి చలిదికుండ దేవి చూడుము. ఏమాత్రము మెతుకులు దొరికినను—మాడిన అన్న మున్నను తెచ్చి పెట్టుము."

పొట్టి వడుగు ఇట్లు పల్క సుశీల తెల్లబోయి చేతులు నులుపుకొనుచు "స్వామీ! చలిదికుండలో ఒక్క మెతుకైనా మిగల్చకుండా మీకు తెచ్చి పెట్టినాను. ఇక, ఆ అన్నంలేదు. యజమాని ప్రయాణంవల్ల మొదట్లో చెప్ప మరచాను. చద్ది తినే అలవాటు నాకులేదు. రాత్రి వంటలో మిగిలిన పొడి అన్నం కొంత–నాకై ఉంచుకొన్నది వున్నది సమ్మతమైతే దాన్ని తెచ్చి వడ్డిస్తాను." అన్నది.

ఆ వటువు ఆనందంతో "ఇక నేం? పొడి అన్నం మాకు మరీ యిష్టం! నిరభ్యంతరంగా వడ్డించవచ్చు" అన్నాడు. ఆమె వెంటనే పొడి అన్నం వడ్డించి, అప్పుడు కాచిన ఆవు పాలను తెచ్చి పోయగా, వటువు–అవతలవారి చేతికి అందిచ్చినట్టు - అవలీలగా, ఆ అన్నాన్నికూడా తినివేసి, "యింకా యేమైనా అన్నం వుంటే పెట్టా" లని అడిగెను.

ఇంత తినినా, ఆ వటుని పొట్ట నిండనందుకు ఆమె మనస్సులోనే విచారించి, యింతలో తన భర్త అటకమీద దాచివుంచిన కజ్జాయాలు జ్ఞప్తికి రాగా, అవి తెచ్చియిచ్చి అతని ఆకలిని తీర్చాలని తలచినది. గ్రామాంతరం నుంచి భర్త వచ్చి, కజ్జాయాలు కానరానందుకు తన్నెంత శిక్షించినా–ఆ శిక్షను అనుభవించడానికి సిద్ధపడినది.

తర్వాత ఆమె "స్వామీ! ఇక అన్నం కొంచెమైనా లేదు. నా భర్త అటకమీద భద్రంగా దాచి వుంచిన కజ్జాయాలు చాలా ఉన్నవి. అవి తెమ్మంటే తెస్తాను" అన్నది. అనగానే వటువు "కజ్జాయాలుంటే యిక నేం కావాలి? వెంటనే తెచ్చి పెట్టు; వాటితో ఎలాగో పొట్ట నింపుకొంటాను." అన్నాడు. సుశీల వెంటనే వాటిని తెచ్చి వడ్డించగా–అవలీలగా తిని వేసి, తన ఆకలికి తానే సిగ్గుపడుతున్నట్టుగా తల వంచుకొని "అమ్మా! నీ ఆదరణ వలన నా ఆకలి కొంత తగ్గినది; నువ్వు వంటచేసేదాకా కొంతసేపు ఆగి వుండగలను. మీ యింటి మొగసాలలో కాస్త విశ్రమిస్తాను. వీలైనంత త్వరగా వంటచేసిపెట్టు" అన్నాడు. ఆ మాటలు విని సుశీల ఆశ్చర్యపోయింది. "వటువు చూస్తే యినుమంత ఉన్నాడు. గరిటెకుడకెడు అన్నం తినేవాడుగా కనబడుతున్నాడు. కాని, ఎంత పెట్టినా తృప్తిలేక—గుళ్లూ, గోపురాలూ మింగేవాడుగా ఉన్నాడు. ఇందులో ఏదో తంత్రం ఉన్నది. ఈ వటువు మానవమాత్రుడు కాడు. నన్ను పరీక్ష చెయ్యడానికి వచ్చిన యింద్రుడో, బ్రహ్మదేవుడో, నా భవబంధాలను విప్పడానికి వచ్చిన విష్ణువో అయివుంటాడు, ఏమైనా సరే, యితని పరీక్షకు లొంగిపోకూడదు." అని ఆమె మనస్సులో అనుకొని, 'అలాగే త్వరగానే వంటచేసి పెడతా'నని ఆ అతిథిని సమాధానపరచి వంటయింట్లో ప్రవేశించినది. కాని యేముంది? వంటిల్లు సర్వశూన్యం! భర్త కొలబత్తెం యిస్తున్న యింట్లో అతిథులకు పెట్టడానికి యేమి వుంటుంది గనుక? అందువల్ల ఆమె అగ్నిభట్టారకుని మనస్సులో ధ్యానించి అతిథికి కావలసిన సమస్త పదార్థాలూ సిద్ధపరచి వుంచాలని ప్రార్థించినది. ఆ ప్రార్థనకు అగ్నిదేవుడు తృప్తి

పొంది, అన్నీ సిద్ధంచేశాడు. ఆ పదార్థాలను ఆరగించడానికి రావలెనని ఆమె వటువును ప్రార్థించే సమయంలోనే, అతడు శ్రీ కృష్ణుడుగా మారిపోయి, ప్రత్యక్షమయ్యాడు. ఆమె ఎంతో భక్తితో అతనిని స్తుతించినది.

శ్రీ కృష్ణుడు ఆమెయెడల వాత్సల్యం కలవాడై "ఓ సాధ్వీమణీ! నీ మనస్సును పరీక్షించడానికే యిట్లు వటు రూపంతో వచ్చి నీ చేతి చలిదికూడు తిని, ఎంతో తృప్తిచెందినాను. ఈ నీ విందు పూర్వం శబరి చేసిన విందు కంటెను, ద్రౌపది చేసిన విందుకంటెను కూడా చాలా గొప్పది. నీవు నా పరీక్షకు నిలిచి, ముందుముందు నీ భర్తపెట్టే హింసలు తలపులో తేస్తూవున్నా-వాటిని లక్ష్యం చెయ్యక, అతిథిపూజయే ముఖ్యంగా గ్రహించావు, నీవు చాలా ధన్యురాలవు. కిందటి జన్మలో నీవొక ధేనువువై ఉన్నప్పుడు, నీ క్షీరబిందు వొకటి నా తలపై- గాలికి వచ్చి పడి క్షీరాభిషేక ఫలాన్ని నీకు చేకూర్చినది. అందువల్ల నీవీ జన్మలో ఉత్తమ యువతివై పుట్టావు. నిన్ను పరీక్షించడం కోసమే నీ భర్తను కొంత కఠిన హృదయునిగా సృజించాను. అతడు వెనకటి జన్మలో అకృతసత్క్రియుడనేవాడు, పరమలోభి; ధనాశాపరుడు. ఒకప్పుడు నా నైవేద్యాన్ని ఆప్యాయంతో చూచినందువల్ల ఈ ఉత్తమ జన్మ అతనికి కలిగింది. నేటినుంచీ అతని బుద్ధి మారి, గొప్ప ఉదారుడుగా మారిపోగలడు; నీమీద ఎక్కువ ప్రేమా, గౌరవమూ కలుగుతుంది; ఇకమీద నీమాట జవదాటడు. మీకు రత్నాల వంటి అయిదుగురు కుమాళ్లు కలుగుతారు. వాళ్లతో మీరు సుఖంగా-వినోదంగా కాలం గడపుతారు. మీ దంపతు లిద్దరూ మనమలనూ, మునిమనమలనూ ఎత్తి, తుదిని నా సాయుజ్యం పొందగలరు" అని చెప్పి అంతర్ధానం పొందాడు.

సుశీల ఆనందానికి హద్దులేదు. ఆ మర్నాడు ఆమెభర్త గ్రామాంతరంనుంచి వచ్చాడు. అతని మనస్సు పూర్తిగా మారిపోయింది. అతి లోభి వదాన్యుడుగా పేరుపొందాడు. పరోపకారానికి ముందడుగు వేశేవాడు.

భగవంతుడు వరం యిచ్చినట్లుగానే ఆ దంపతులకు అయిదుగురు మణిపూసలలాంటి పుత్రులు కలిగారు. వారున్నూ దైవభక్తులై, వినయవిధేయతలు కలిగి, తలిదండ్రుల అదుపాజ్ఞలలో మెలగి వుండేవారు. కొంతకాలానికి ప్రాజ్ఞులైన ఆ పుత్రులపైని సంసారభారం నిలిపి, సుశీలా, ఆమెభర్తా విష్ణుసాయుజ్యాన్ని పొందారు.

భగవంతుడు, తన పరీక్షకు నిలిచినవారియందు అమిత వాత్సల్యం కలిగి, వారి కోరికలను ఈడేర్చగలడని మనం నిశ్చయించడానికి ఈ సుశీలాదేవి చరిత్ర ఒక్కటి చాలును.

[పాండురంగ మాహాత్మ్యాన్ని అనుసరించి]

---

# భారతీయ ధర్మము - III

"కా శ్య ప"

పారమార్థికదృష్టి లోకవ్యవహారమునకు ప్రతిబంధక మనుమాట సర్వత్రప్రబలముగ నున్నది. ఇహలోక సుఖమును అర్థకామములు మాత్రమే సంపాదింప గలవనియు, ధర్మమోక్షములు దానికడ్డు తగులుననియు వాదింతురు. ధర్మార్థకామమోక్షములు నాల్గును పురుషార్థములే. ధర్మమునకు విరుద్ధముకాని, మోక్షమునకు ప్రతిబంధకముకాని, అర్థకామంబుల పేక్షణీయంబులేయగును. ధర్మ విరుద్ధములైన అర్థకామంబులు నేడుగాకున్న రేపైన తప్పక ముప్పు తెచ్చిపెట్టును. ధర్మసమ్మతములయిన సుఖభోగములు మాత్రమే, చిరకాలము నిశ్చింతగ, నిర్భయముగనను భవించుటకు వీలుకలుగును. ఉభయలోకతారక మయిన ప్రవృత్తినే భారతీయ ధర్మము నిర్దేశించు చున్నది.

## సర్వం విష్ణుమయంజగత్

పరిదృశ్యమాన సమస్తజగత్తులోగల ప్రతి పరమాణువు సర్వవ్యాపకుడైన విష్ణువుచే నావరింపబడి యున్నది. తదధిపతియు శ్రీ మహావిష్ణువే. ధనధాన్యాది సకలభోగ్య జాతము ఆయాభోగ్యపదార్థముల ననుభవింప నువ్విళ్లూరు చున్న ఇంద్రియాదులు భగవత్సంబంధములే. సర్వాధికారి యైన పరమేశ్వరుని యనుగ్రహము, అనుమతి పొందకుండ ఏ పదార్థము చేపట్టినను అది చౌర్యముగాక మఱేమియగును.

## తేనత్యక్తేన భుంజీథాః

అనుభవ యోగ్యములయిన పదార్థములు మునుముందు తదధిపతియైన పరమాత్మకు నివేదన మొనర్చి తదుపరి

యనుభవింప వచ్చునని శ్రుతిమాత యాదేశించు చున్నది. "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే"—శ్రుతిస్మృతులు భగవదా జ్ఞారూపములు. "యజ్ఞోవైవిష్ణుః" యజ్ఞము అనగా యజ్ఞపురుషుడే శ్రీ మహావిష్ణువు; దేవాదిదేవుని యుద్దేశించి చేయు ద్రవ్యత్యాగమే యాగమని మీమాంసక సిద్ధాంతము. సమస్తభూతములు, సర్వజీవరాసులు భగవత్స్వరూపములే. సర్వాన్తర్యామి నుపలక్షించి తత్తద్భూతములకు, ఆయా జీవులకు చేయు పదార్థనివేదనము యజ్ఞేశ్వరప్రీత్యర్థము చేయు యాగమే యగును. మానవసేవయే మాధవసేవయని అందందు వినవచ్చు వాక్యము యజ్ఞస్వరూపమును ఈషణ్మాత్రముగ సూచించును.

జిహ్వే! కీర్తయ కేశవం, మురరిపుం చేతో భజ, శ్రీధరం!
పాణిద్వంద్వ! సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ! త్వంశృణు!
కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛాంఘ్రియుగ్మా లయం!
జిఘ్ర! ఘ్రాణ ముకుందపాదతులసీం, మూర్ధన్, నమాధోక్షజమ్ ॥

విషయ వ్యసనాభిముఖులైన ఇంద్రియచోరులకు ఆళ్వారు చక్రవర్తి పైవిధముగ చక్కని శిక్ష విధించినాడు.

'కేశవకీర్తనాదుల వలన, వ్యక్తిగతముగ తరించిన తరింప వచ్చును; గాని అటులొనర్చుటచే లోకమునకు-అనగా తోడిజీవుల కేమిసేవ చేకూరును. ఆది "చిన్న నా పొట్టకు శ్రీ రామరక్ష" యను ధోరణిగాని వేరొండుగాదని ఆధునికులు కొందఱాక్షేపింతురు. వ్యక్తిగత భక్తి ప్రపత్తులుగాని, ధ్యానధారణాదితపోవిశేషములుగాని, సాంఘిక యజ్ఞాచరణాదులుగాని, 'గోష్ఠీ సంకీర్త' నాదులు గాని, సకలజీవలోక కల్యాణము నపేక్షించి ప్రవృత్తము లయిననాడే కృతార్థములగును. నిర్జనారణ్యముల, పర్వత గుహల పర్ణపవనాంబు మాత్రాహారులై దేహాభిమానము వీడి నిరతిశయతపము లాచరించు మహర్షుల లక్ష్యము సకల జీవకల్యాణముగాని స్వశరీరసౌఖ్యసాధక మాత్రము కాదు. "స్వస్తిప్రజాభ్యః" - "లోకాః సమస్తాః సుఖినోభవంతు" "శంనోఅస్తు ద్విపదే - శంచతుష్పదే" - ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అని భారతీయ ధర్మలక్ష్యము శ్రుతి స్మృతులు వేనోళ్ల పోషించు చున్నవి. తపోమహిమను, తపః ఫలప్రదాతయగు పరమేశ్వరుని శక్తిసామర్థ్య స్వరూపమును గమనింప యత్నింపని పండితమ్మన్యులు తమ యిచ్ఛకు వచ్చినరీతి యాక్షేపించి యానందింతురుగాక. "మార్గదర్శీమహర్షిః" అంతర్ముఖులై నివృత్తి మార్గగాములైన మహర్షుల ధోరణి ప్రవృత్తి మార్గస్థులకు రుచింపక పోవుటలో నాశ్చర్యములేదు.

బహిర్ముఖములయిన యింద్రియములకు ఈశ్వర సేవయే కర్తవ్యము— "ప్రతిమాస్వల్పబుద్ధీనామ్"— అఖిల ప్రపంచము పరమాత్మ స్వరూపమని వ్యవహరింప లేనివారికి ఆలయములలోని శిలాప్రతిమాదులు దేవప్రతి రూపములుగ బూజింప దగినవి. అటుల చేయుట సాధన మాత్రమేయగును. దృశ్యజగత్తునంతను భగవత్స్వరూపముగ సేవింపగలుగుట పరమ పురుషార్థము. అదియే భగవత్సాక్షాత్కారము, తురీయ పురుషార్థము జీవన్ముక్తియు నదియే.

## కృష్ణంలోకయలోచన ద్వయ!

జననమరణాది వికారములకు లోనుగాక సత్యశివ సుందరాత్మకమై సర్వత్రస్వయం ప్రకాశమానమై యొప్పు సకలలోకాకర్షక దివ్యచైతన్యము నవలోకించు లోచనమే దివ్యచక్షువు. "గుణదోషౌ బుధో గృహ్ణన్ ఇందుక్ష్వేళా వివేశ్వరః। శిరసాశ్లాఘతే పూర్వంపరం కంఠే నియచ్ఛతి" క్షరమయిన జడప్రకృతి అక్షరచైతన్య సాహచర్యమున ప్రపంచరూపమున భాసించును. దాన లోకమున జడ దోషములు చైతన్యగుణములు కుప్పతిప్పలుగ గాన వచ్చును.

క్షీరనీరములు గలిసి యున్నను, రాజహంసము క్షీరమును మాత్రమే గ్రహించి నీరమును పరిత్యజించును. విబుధుండును కల్యాణకరములైన గుణరత్నములను ద్రవ్విపైకెత్తి ప్రదర్శించును. అరిష్టదాయకములైనదోష సంతానమును అరికట్టి యణచివైచును. అదియే సమ్యగ్దర్శనము. అదియే సర్వోత్కృష్టమగు కృష్ణావలోకనము.

## "అచ్యుతకథాః శ్రోత్రద్వయ! త్వంశృణు"

"వినదగు నెవ్వరు చెప్పిన వినినంతనె వేగపడక వివరింప దగున్; కనికల్ల నిజమెఱింగిన మనుజుడె పోనీతి పరుడు." పుణ్యశ్లోకకథామృతాస్వాదనముచే నచ్యుతానందమేకాక, విశ్వశ్రేయస్సు, సర్వభూత సామరస్యము, తద్ద్వారా జగత్కల్యాణము సమకూరును. వినుట యన శబ్దశ్రవణము మాత్రమేకాదు. విన్నవిషయము పరిశీలించి, కర్తవ్యాంశము నిరూపించి, తదనుష్ఠానము చేయుటయే శ్రవణమగును. ఆచరణమున వ్యక్తముగాని శ్రవణము నిరర్థకము. అచ్యుతుడు సచ్చిదానంద ఘనుడు. సత్యమును వినవలయును. సత్యమునే పలుక వలయును. జ్ఞానమును సంపాదింపవలయును. జ్ఞానులమార్గమునే యనుసరింప వలయును. స్వపరానంద సంధాయకములగు ప్రసంగముల నాలింప వలయును. సర్వానంద ప్రదములయిన కృత్యముల నాచరింపవలయును.

### "ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యః"

సర్వభూతాంతరస్థుడు పరమాత్మ; ఎల్లరును పరమాత్మ స్వరూపులే కనుక ఏయొక్క ప్రాణికిగాని, భూతమునకు గాని అపకారము చేసిన తనకు తానపకారము చేసికొనుటయే యగును. లోకోపకారకములైన వ్యవహారము లందే కాలము గడుప వలయును. ప్రమాదవశముననైన నేరికిని అప కారము దలపెట్టదగదు. "పరోపకారః పుణ్యాయ-పాపాయ పరపీడనమ్" ఇదియె శ్రవణయోగ్యమయిన శ్రుతిస్మృతి పురాణాద్యఖిల గ్రంథసారము.

### "జిహ్వే! కీర్తయకేశవమ్"

"విద్యావినయ సంపన్నే - గవి - హస్తిని - శునిచైవ - శ్వపాకేచ - సమదర్శనము సంపాదింప జేయు శక్తినల వఱచుకొన్న జిహ్వేంద్రియము కేశవ సంకీర్తనము చేయు నదియేయగును. సకల జీవులలోను సర్వభూతములలోను గల దివ్యత్వమును గని పెట్టి దానిని బహిర్గతము చేయు నపుడే వక్తృత్వపాటవము, పాండిత్యవిశేషము చరితార్థము లగును. భూతములలో గల అసాధారణ శక్తులను వెలువ రించు ఆధునిక విజ్ఞానశాస్త్ర వేత్తలు స్వార్థమునేగాక పర మార్థమయిన లోకకల్యాణమును సమకూర్చుచు కేశవాను గ్రహపాత్రులగుట అనుభవసిద్ధము.

### "శ్రీ ధరంపాణిద్వంద్వ! సమర్చయ, హరేర్గచ్ఛాం ఘ్రియుగ్మాలయమ్"

జ్ఞానేంద్రియములచే సర్వవ్యాపకుడయిన శ్రీ మన్నా రాయణుని తత్స్వరూపములను గ్రహించి కరచరణాది కర్మేంద్రియములచే ఈశావాస్యమయిన లోకమును సేవించుటకు బూనుకొనవలయును. ఈ ధోరణియంతయు లోకవ్యవహారమునకు - అన - అర్థకామములకు దూర మయినట్లు కనుపట్టును. కాని అట్టిప్రమాదమించుకయు లేదు. ధర్మ్యములయిన మార్గముల నర్థమార్జింప వచ్చును. నిషిద్ధముకాని పద్ధతుల కామోపభోగముల ననుభవింప వచ్చును. కాని వానివలన గలుగు తృప్తిసంతోషములు పరిమితములు, క్షణభంగురములు. ధర్మ జన్యమయిన ఆనందము స్థిరము, సమగ్రము. "పానీయంబులు ద్రావు చున్...." సంతత శ్రీ నారాయణ పాదపద్మయుగళీచింతా మృతా స్వాదనంధానుండయి ప్రవర్తించిన ప్రహ్లాదుని దృష్టాంతము భగవన్నిష్ఠా పరులకు మార్గదర్శకముకాగలదు. "Hands to work and Heart to God" "యద్య త్కర్మకరోమితత్త దఖిలంశంబో! తవారాధనమ్." సంకల్ప బలమున్న సాధనపరంపర స్వయముగ సాక్షాత్క రించును.

### "మురరిపుంచేతో, భజ"

దశేంద్రియములలో - పూనలలో దారమ్మువాడిక్క, సూత్రధారిత్వము వహించునది చిత్తము. చిత్తపీఠమున నిలచియున్నవాడు చిత్స్వరూపుడు. నీచవ్యాస నాభి ముఖ్యముగల ఇంద్రియములు బహిర్గతములయి అనాత్మ పదార్థముల యందు జిక్కికొని, వచ్చినమార్గంబు విస్మ రించి, పరిభ్రమించి, అయానక్లేశమనుభవించి, ఇతికర్త వ్యతావిమూఢమ్ములై మధ్యేమార్గమున నకృతార్థములయి మృత్యుముఖదంష్ట్రలలో బడినలిగి పోవును. అటులుగాక అంతర్ముఖములయిన ఇంద్రియములు, తమకు ప్రేరకము, ధారకము, పోషకమునగు చిత్ప్రకాశమును లకించుచు అజ్ఞానాంధకారమును ధరించును - "శ్రోత్రస్యశ్రోత్రం-మన సోమనః-వాచోహవాచం-ప్రాణస్యప్రాణః-చక్షుషః చక్షుః"

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి"

"అణోరణీయాన్ మహతో మహీయాన్ - ఆత్మాస్యజం తోర్నిహితో గుహాయామ్" హృదయాకాశమున సర్వనియా మకుడగు పరమాత్మ గలడు. హృదయస్థదేవ నియుక్తాంతః కరణ ప్రబోధము ననుసరించు వారికి సర్వసందేహములు దొలగి, సర్వత్రవిజయమే గలుగును. విషయమేఘమాలా వృతమయిన చిత్తాకాశమున తత్రస్థ చైతన్య సూర్యుని దర్శించుట దుష్కరమేయగును.

"తన్మే మనః శివసంకల్పమస్తు" శివసంకల్పములు మాత్రమే చేయుచు, అశివసంకల్పములు దలపెట్టని వాని మనోరంగమున రమారమణుడానంద తాండవము చేయుచు సర్వాభీష్ట సంధాయకుడగును.

భగవద్దత్తములగు నింద్రియములను భగవదాదేశాను సారము ప్రవర్తింప జేయుట చక్కని రాజమార్గమున నడి పించుటయే యగును. ఇంద్రియాశ్వముల శాస్త్రేతర మార్గంబుల నడిపించుట అరిష్టదాయకమే యగును.

"విచిత్రా లోకసంపత్తిః ఈశ్వరాయనివేదితమ్."

విచిత్ర భోగ్యపదార్థ సమృద్ధి ఈశ్వరార్థముని వేదించుటకే యుద్దిష్టమయినది. మునుముందు, భగవత్సృష్టము లయిన భోగ్యవస్తు జాతమును త్యాగపూర్వకముగ విశ్వా త్మకునకునివేదించి, నివేదించిన ప్రసాదమును ఇతరుల కొసంగి ప్రసాదశేషమును తమభాగముగ స్వీకరించుట శిష్టాచారము. తత్తత్పదార్థములను ఈశ్వరార్పణ బుద్ధితో అతిథులకు అభ్యాగతులకు పాత్రులగు తదితరులకు పంచి పెట్టక తనకు దానై అనుభవించువాడు దొంగతనము చేసి పాపము నార్జించుకొనువాడే యగును.

### "తేత్వఘం భుంజతే పాపాః యేపచన్త్యాత్మ కారణాత్"

(సశేషము)

# దర్శన వీధి - III

జమ్ములమడక మాధవరామశర్మ.

## చార్వాక దర్శనము

ఒకప్పుడు ప్రజాపతి యిట్లనినాడు. "ఆత్మ విజరము, విశోకము, ఆ ఆత్మ నన్వేషింప వలెను. దానిని తెలియ వలెను." ఇది విని న దేవాసురులకు ఆత్మ తెలియ వలెనని కోరిక కలిగినది. దేవతలకుగా నింద్రుడు, అసురులకై విరోచనుడు, ప్రతినిధులైనారు. ప్రజాపతి కడకేగి నిల బడిరి. అచట పరస్పరాసూయ మరచి ముప్పదిరెండు వత్సరములు బ్రహ్మచర్య ముండి ప్రతీక్ష చేసిరి. బ్రహ్మ యనెను- "కిమిచ్ఛన్తా వవాస్తం" ఏ కోరికతో నున్నారు. భగవన్! మీ రనిన యాత్మ మాకు కావలయును. "అక్షి పురుష డాత్మ" అని ప్రజాపతి యనినను వారు గుర్తింప లేక కంటిలో ప్రతిబింబించు రూపమాత్మ యనుకొనిరి. వారిబుద్ధి వారికప్పు డట్టి నిశ్చయమునే ఇచ్చినది. ఈ నిశ్చ యమునే దృఢపరచు కొనవలయు నని బ్రహ్మ నడిగిరి. జలములో ప్రతిబింబ మున్నది. అద్దములో నున్నది." ఇది యేమి? అని బ్రహ్మ ఇట్లనినాడు. "ఉదకశరావమున చూడుడు. మీ కాత్మ తెలియును. మీ రేమి తెలిసి కొనిరో చెప్పుడు! వా రుదకశరావమున జూచుకొనిరి. "కింప శ్యథ" మీ రేమి చూచితిరి?" ఆత్మానం పశ్యావః" "ఆలోమభ్యః, ఆనఖేభ్యః," నఖశిఖము మా యాత్మ జూచి తిమి. వారు సమాధానించిరి. ప్రజాపతి యూరు కొనలేదు. "సాలంకృతులై, సువసనులై, పరిష్కృతులై, దర్శింపుడు" వా రట్లే చూచిరి. వారి కాత్మ యట్లే కనపడినది. అది బ్రహ్మ. అది యాత్మ. ఇంద్రవిరోచనులు శాంతహృదయులై బయలు దేరిరి. అసుర ప్రభువునకు సందేహ మేమియు కలుగలేదు. తన దేశ మేగి తనవారలకు తన నిశ్చయము బోధించెను. ఆ యాత్మను పరిచరించి పోషించి, అలంక రించి, సంస్కరించి, సర్వము మనము పొందగలమని వారందరు నిశ్చయించిరి. ఇట్టి ఈ వాదము గీతలో కొంత సంకేతిత మయినది. "కామహేతుకము, కామోపభోగపర మము," ఇట్టి మాటలను గీత గీసినది. ఇదియే విస్తృతము సువిస్తృతమునై చార్వాకదర్శన మని పేరు పొందినది.

ఈ లోక మాత్మక్రీడాస్థలము. ఇంతకన్న పరలోక మొక్కటి లేదు. ఈ శరీర మాత్మ, మరణము ముక్తి, దేహమున ప్రాణ మున్నంతవరకు సుఖప్రాప్తికి యత్నింప వలెను. ధర్మ మన్న దొక పురుషార్థము కాదు. జీవన సౌఖ్యమున కైన కామమే పురుషార్థము. ఇది చార్వాక సిద్ధాంతసారము. మరణానంతర మాత్మ లేదని యొక వాదము కఠోపనిషత్తులో సూచిత మయినది" న ప్రేత్య సంజ్ఞాస్తి" చావగా నుండునది లేదు. బౌద్ధగ్రంథములందును ఈ సిద్ధాంతనిర్దేశము బహుస్థలములందు గోచరించు చున్నది. చార్వాక వాదమునకు "లోకాయతిక" వాద మని పేరు. బౌద్ధులలో "అజితకేశకంబలుడు" లోకా యతికుడు. చార్వాకసిద్ధాంత మొకవిధముగ జడవాద సిద్ధాంతము. ఈశ్వరుడు లేడు. ఆత్మ లేదు. పునర్జన్మ లేదు. పరలోకము లేదు. జీవనభోగమును విడువరాదు. వైదికము లయిన యాగానుష్ఠానాదుల నిది సహింపదు. ఇంద్రియగమ్యము జగద్వస్తు వొక్కటియె సద్వస్తువు. ఈ లోకాయతము కేవలము బుద్ధివాదము. పరపక్షఖండన ములో నిందు శ్రద్ధ యధికము. స్వపక్షస్థానములో నంత పట్టుదల లేదు. వైదికమార్గ మనుసరించు వారి భావము లను శుష్కతర్కములతో నిది ఖండించినది. ఒకప్పు డిట్టి లోకాయతికులను వైతండికు లనినారు.

> న హి లోకాయతే కిం చిత్కర్తవ్యముపదిశ్యతే
> వైతండికకథైవాసౌ న పునః కశ్చిదాగమః—

చార్వాకుల కొక శాస్త్రము ప్రమాణముగలేదు. వారు ముఖ్యముగ వేదవిదూషకులు. ఒకప్పుడు జైన బౌద్ధాగమ ములగూడ నిందించిరి. "భరతా! లోకాయతికులను నీవు సేవించుట లేదుకదా!" అని రామాయణములో రాముడని నాడు. బుద్ధుడును లోకాయతశాస్త్రము తెలియుట నిషే ధించినాడు. బోధిసత్త్వులు చార్వాకశాస్త్రము పఠింపరాదట. జైనులు చార్వాకులను మిథ్యాదృష్టులని నిందించిరి.

బృహస్పతి శిష్యుడు చార్వాకుడు. దీని ప్రచారము లోనికి తెచ్చినాడట. చార్వాకపదము భోజనము, పానము చెప్పును. కాన నిది చార్వాకము. పుణ్యాపాపాది పరోక్ష విషయముల నిది మ్రింగివేయును గావున చార్వాక మని యనిరి. లోకసుఖోపదేశ మందర కభీష్టము. దాని నిది మంచిగా చెప్పినది. చారు వాక్కులు కలదిది చార్వాక మయినది. బార్హస్పత్య దర్శన మనియు దీనికి పేరు. నాస్తికమత సంస్థాపకుడు బృహస్పతి యొకడుండెను కాబోలు! బృహస్పతిసూత్రములను కొందరు కొన్నిటిని పలికిరి. దాని దాని బ్రోగుచేయగా నీ యెనిమిది సూత్ర ములు లభించుచున్నవి.

1. పృథివ్యప్తేజోవాయురితి తత్త్వాని।
2. తత్సముదాయే శరీరేంద్రియవిషయసంజ్ఞా।
3. తేభ్యశ్చైతన్యమ్।

4. కిణ్వాదిభ్యో మదశక్తివత్ విజ్ఞానమ్
5. మదశక్తివత్ విజ్ఞానమ్।
6. చైతన్యవిశిష్టః కాయః పురుషః।
7. కామ ఏవైకః పురుషార్థః।—
8. మరణమేవాపవర్గః—

బృహస్పతి పేరుతో దార్శనికు డొక డున్నా డనుటకు నీ సూత్రాష్టకము సాక్ష్యము. రాజనీతిశాస్త్రము, అర్థశాస్త్రము, దండనీతి, బృహస్పతి పేరుతో నట నట సంస్కృతము లయినవి. ఈ బృహస్పతు లం ద రె వ్వ రో తెలియజెప్పుటకు నవబృహస్పతి యొకడు కావలయును.

బార్హస్పత్యసూత్రము చార్వాక దర్శన సర్వస్వము. ప్రాక్కాలమున చార్వాకదర్శన మూలగ్రంధము లుండి యుండవలయును. ఈ సిద్ధాంతమవహేళనా విషయమై గ్రంథములు లోపించినవి. భాగురిపేర లోకాయత దర్శన వ్యాఖ్య యుండెడిదట. చార్వాకమును ఖండించిన గ్రంధములు కొంతగా దాని రూపమును జెప్పినవి. వాని సారమంతయు నిట్లుండును.

ప్రత్యక్ష మొక్కటియె ప్రమాణము. అనుమానము, శబ్దము, ప్రమాణ మనుటలో నాధారము లేదు. చక్షురాదీంద్రియముల ద్వారా ప్రత్యక్ష మయిన జగమే నత్యము. అప్రత్యక్ష మంతయు కాల్పనికము గాని వాస్తవికము గాదు. ఆయి దింద్రియముల కైదు విజ్ఞానము లున్నవి. తదను భూతములెప్రమాణములు. అస్పృష్టము, అనాస్వాదితము, అనాఘ్రాతము, అదృష్టము, అశ్రుతము, ఏ మాత్రము స్వీకార్యము కాదు. అనుమానము ప్రమాణము కాదు. లోకవ్యవహారమున కనుమానము సాధక మన నక్కర లేదు. సంభావనా మాత్రము లోకవ్యవహారము మాత్రము సాగించును. దూరమున బంధువున్నాడన్న సంస్మరణము చాలును. వ్యవహారము సిద్ధము కాగలదు. ఈ జగములో కార్యకారణభావ నియమము ననుసరించి సర్వముండు నన నక్కరలేదు. స్వభావసిద్ధముగ నన్నియు నట్లగును. జగదుత్పత్తి వినాశములకు దానిస్వభావమె కారణము. స్వభావమె జగమును విచిత్రము చేయును. విలయము చేయును. అనేక దర్శనములు శబ్దము ప్రమాణ మనినవి. జైనబౌద్ధములు వేదము ప్రమాణము కాదన్నను శబ్ద ప్రామాణ్యము నిరాకరింపవు. చార్వాకము శబ్దము ప్రమాణ మనదు. ఒకడొకమాట పలికిన దాని యర్థము మనకు తెలియగా నది ప్రత్యక్షమున సిద్ధమగును. ప్రత్యక్షసిద్ధమునకు ప్రమాణమేల? మానవుల మాటలను సత్యములని విశ్వసించుట వ్యర్థము. వారు ప్రత్యక్షమే వర్ణింతురేని విశ్వసింప వచ్చును. అదృష్టాశ్రుతములను వారెంతగా చెప్పినను సత్యము లనరాదు. కావుననే వేదములు ప్రమాణములు కావు. వేదము విరుద్ధముల చెప్పును. దాని శబ్దముల కర్థము లుండవు. కానరాని వాని నది కల్పించును. వేదము ప్రమాణము కాదు.

ఈ చెప్పినది చార్వాకుల పరిజ్ఞానము. ఇక చెప్పబోవునది చార్వాకుల తత్త్వము. ఈ జగములో నాలుగే తత్త్వములు. పృథివీజలాగ్ని వాయువులు. ఆకాశ మన్నది శూన్యము. అది సత్త కల పదార్థము కాదు. పృథివ్యాదులు నాలుగు అణువులుగా నుండి జగమునకు మూలకారణ మయినవి. మన ఇంద్రియములు, శరీరము, ఈ నాలుగు భూతముల వలననె కలిగినవి. ఎట్లు కలిగినవని చార్వాకుని ప్రశ్నింపరాదు. చార్వాకు లట్టి ప్రశ్న వినరు. వారిట్టి విషయమున మౌనులు. అదృష్టకారణము వారొల్లరు. జగమున చేతనాంతర్యామిని వా రంగీకరింపరు. ఆకస్మాత్సంమిలితము భూతచతుష్టయము సర్వ మయినది. వారి మతములో జగమిట్టిది.

పృధివ్యాదుల సమ్మిశ్రణమున శరిరసృష్టి కలిగినది. ఈ శరీరమున కన్న నతిరిక్తముగా నాత్మ యనెడి పదార్థము లేదు. చైతన్య మాత్మదర్శనము. శరీరమునకు చైతన్యసంబంధ మున్నది కావున శరీరమె ఆత్మ. శరీర మున్ననే చైతన్య మావిర్భవించును. శరీరము లేకున్న చైతన్యము తిరోహిత మగును. అన్నపానము లనుభవింపగా శరీరమున చేతన ముదయించును. అన్నపాస భోగ మనుకూలముగ లేకున్న చేతన హ్రాసము పొందును. కావున చైతన్యము శరీరముననే సిద్ధము. "స్థూలోహం కృశోహం శ్రాన్తోహం ప్రసన్నోహం" ఇట్టి యనుభవజ్ఞానము మనకు క్షణక్షణము కలుగును. ఈ స్థూల కృశ స్వభావములు శరీరమునందే కలుగును. భౌతిక పదార్థముల వలననే చైతన్యములో విశేష మున్నది. "బ్రాహ్మీఘృత ముపయోగింపగా ప్రజ్ఞాపటుత్వము కలుగును. వర్షాకాలములో దధి శ్రేయము కాదు." ఇట్టి వైద్యవిధానము శరీరమున చైతన్యసత్తను స్పష్టము చేసినది. కావున "చైతన్య విశిష్టః కాయః పురుషః" అను బృహస్పతి సూత్రము చాల యుక్తియుక్తము. ఇది చార్వాకుల భూతములం దీ చైతన్య మెట్లుత్పన్న మయినదో చార్వాకులు లోకాధారమున చెప్పుదురు. మద్యమును నిష్పాదించు ద్రవ్యములలో మాదకశక్తి లేదు. మద్యమునందే మాదకత యున్నది. కాగా నా యా పదార్థములు సంబంధ విశేషమున నవస్థా విశేషమున పూర్వమయిన విశేషము పొందును. నాల్గు భూతముల విశిష్టసంబంధములో చైతన్య మిట్లే యుదయించు చున్నది. ఆకు వక్క సున్నములలో నే యొక దాని యందును ఎఱ్ఱని దనము లేదు. ముచ్చటగా మూడును మిశ్రితము లయినపుడే రక్తిమ కలుగుచున్నది.

అట్లే చైతన్యమును విశిష్ట సంమిశ్రణములో కలుగును. చైతన్య మావిర్భవించుట తిరోభవించుటలలో శరీరమే కారణము. కావున శరీరమె ఆత్మ. చార్వాకులలో కొందరు ఇంద్రియము లాత్మయనిరి. ప్రాణములు ఆత్మ యని కొందరనిరి. మన మాత్మయని కొంద రనిరి.

ఈశ్వరు డీశ్వరు డనుట శబ్దానుమాన ప్రమాణముల వలన కలిగినదే. వేదము ప్రమాణమని అనని చార్వాకుడు శబ్దప్రమాణ మొప్పని చార్వాకుడు శబ్దానుమానములచే నీశ్వరు సాధింప నొల్లడు. చార్వాకున కనుమానము లేదు. ఈశ్వరుడు లేడు. ఈ జగము స్వభావముననే కలిగినదని చార్వాకు డనును. చార్వాకున కీశ్వరుడక్కరలేదు.

ఈ కన్పడు జగము కన్న వేరొక దాని చార్వాకు డంగీకరింపడు. ఈ జగమునే చూచి కర్తవ్యాకర్తవ్యము లను సమీక్షించును. ఇతర దార్శనికులు పురుషార్థములు నాలుగు కావలెననిరి. చార్వాక దార్శనికుడు ధర్మ మోక్షములు పురుషార్థము లనుటను విశ్వసింపడు. ఈ లోకమునే చూచు చార్వాకుడు స్వర్గకల్పన మొప్పడు. స్వర్గ మను సుఖభూమి లేనే లేదు. దానికై శరీరమును క్లేశపెట్టి తప మొనరించుట, ద్రవ్యము వ్యయించుట, వ్యర్థము. యాగసిద్ధికై పశువు పట్టుట నొల్లడు. వారు దానిని వెక్కిరింతురు. మోక్ష మన్నది కూడ చార్వాకుల దృష్టిలో విలక్షణము. చార్వాకులకును మోక్ష మున్నది. అత్యంత దుఃఖనివృత్తి చార్వాకముక్తి. ఈ శరీరము భోగాయతనమే గాని క్లేశనికేతనమును. శరీర మున్నంత వఱకు సంకటము లున్నవి. శరీరము పడి పోగానే క్లేశములు పోవును. దుఃఖములు నశించును. ఆత్యంతిక దుఃఖనివృత్తి కలుగును. అదియే మోక్షము. అదియే అపవర్గము. కావుననే "మరణమేవాపవర్గః" మోక్షావస్థలో నాత్మ యేమగును ? చార్వాకుడేమియు ననడు. మరణము కలుగగానే ఆత్మయు పోయినది. దేహపాతానంతరము నిత్యపదార్థ మేదియు లేదు. కాన చార్వాకముక్తి ఆకాశపుష్పము.

చార్వాకుల జీవన లక్ష్యము అర్థము కామము. కామమే ప్రధానపురుషార్థము. అర్థము దాని సహకారి. ప్రతిప్రాణికిని సుఖము పొంద వలెనని కోరిక యున్నది. లౌకికసుఖమె పరమలక్ష్యము. ఈ సుఖ మర్థద్వారమున కలుగును. అందుచే నర్థకామములే పురుషార్థము లయినవి. "యావజ్జీవేత్ సుఖం జీవేత్" బ్రతికి యున్నంత వఱకు సుఖముగా బ్రతుకవలయును. ఋణము చేసి నేయి త్రాగవలెనని చార్వాకుడు చెప్పును. దుఃఖ మున్నంత మాత్రమున సుఖమును విడువరాదు. దుఃఖములేని సుఖము జగములో నుండదు. మిశ్రితసుఖమునే పొందవలసి యున్నది. భిక్షుకు లున్నారని వంట మానుదుమా ! మృగము లున్న వని పైరు వేయరా! దుఃఖమున్నదని సుఖము విడుతుమా! దుఃఖభయమున సుఖత్యాగము మూర్ఖత కావలయును. సుఖ మంగనాదికము స్వీకరింపుడు! అని చార్వాకుని యుపదేశము. స్వర్గము నరకము ఈ జగముననే కలవు. సుఖప్రాప్తి స్వర్గము, దుఃఖప్రాప్తి నరకము.

ప్రపంచములో ప్రకృతివాద సిద్ధాంతము ప్రాచీనకాలము నుండియు కలదు. బృహస్పతి చార్వాకులు భౌతిక వాదమును సమర్థించిరి. గ్రీసుదేశము నందును భౌతిక వాదమును ప్రచారము చేసిన వారున్నారు. హస్తపాదాదుల వలె నాత్మయు మానవశరీరమున నొక యంశము మాత్రము. ఆత్మ చతుర్విధ పరమాణు సమాహారఫలము శరీరము పోగా నాత్మయు నశించును. ఆత్మ కమరత్వ మన్నది అసిద్ధము. ఈ జగద్రచనములో నొక యుద్దేశము లేదు. దీని నిర్మించిన వాడును లేడు. దేవత లున్నారనుకొనుట నిస్సార సిద్ధాంతము. అనంత పరమాణువులలో కొన్ని పరమాణువుల యాదృచ్ఛిక సమావేశమె జగమని పేరు వహించినది. జగత్ స్రష్టయే లేనందున వాని ధర్మవ్రతో పాసనముల విధించు ధర్మ మసిద్ధము. జీవనోద్దేశ మానంద మని యొక డనెను. ఆ యానంద మెట్లు లభించును? కేవలము ఇంద్రియ సుఖమె ఆనందము కాదు. సమానాచార విచారములు గల సహృదయుల సమూహములో గలుగు చిత్తానందమె ఆనందము. ఇట్లు దూర విదూర దేశముల గూడ చార్వాక మతభావ ప్రసారము జరిగినది. యయాతి తనకు నవయౌవన మీయ నిష్టపడని తన పుత్రులను దూరదేశములకు పంపెను. వారప్పటిలో యూరపె పోయి యుందురు. వారల పేరిట కొన్ని దేశ నగరము లటనట యున్నవి. విరోచనమతమెప్పుడో విశ్వ వ్యాప్త మయినది.

ఇతరదర్శన వాదు లందరు లోకాయత ఖండనమునకై నిరంతరము నిశితఖడ్గము పట్టిరి. ప్రత్యక్షమాత్రాంగీకార మున సర్వము సిద్ధము కాదు. అనుమాన మావశ్యకము. చార్వాకుల యాచారవ్యవహారములు సమాజమును తల క్రిందులే చేయును. బృహస్పతి సూత్రములలో విశృంఖల జీవనము లేదు. విశ్వారంభములోని వైజ్ఞానికరీతిని బృహస్పతి నిరూపించెను. అనంతరము కేవలము భౌతికసుఖ వాదులు బలిసి, బలిసి, యుచ్ఛృంఖలత నాపాదించిరి. సర్వదర్శనకారులు చార్వాకులను శతముఖముగా నిందించిరి. చార్వాకుల యాచారము వారిచే నట్లు చేయించినది. ఒక విషయమున కుపితులై లోకాయతసర్వవిషయములను సర్వకారులు నాశము చేసిరి. మణులు పగిలినవి. సూత్రము మిగిలినది. ఇది శుష్కసూత్రభావము.

౧. పృథివ్యప్తేజోవాయువులు తత్త్వములు నాలుగు.

౨. వాని సముదాయమున శరీరేంద్రియ విషయసంజ్ఞ కలుగును.

౩. వానివలననే చైతన్యమున్నది.

౪. కిణ్వాదుల వలన మదశక్తివలె విజ్ఞాన ముప యించును.

౫. విజ్ఞానము మదశక్తి వంటిది.

౬. చైతన్యవిశిష్టశరీరమె పురుషుడు.

౭. కామ మొక్కటియె పురుషార్థము.

౮. మరణమే యపవర్గము.

ప్రబోధచంద్రోదయ మను నాటకములో కృష్ణపండితు డిట్లనినాడు.

శ్లో॥ తుల్యత్వే వపుషాం ముఖాద్యవయవైః వర్ణక్రమః కీదృశః
స్త్రీ చేయం వసు వా పరస్య యదముం భేదం న విద్మోవయమ్
హింసాయామథవా యథేష్టగమనే స్త్రీణాం పరస్య గ్రహే
కార్యాకార్యకథాః తథాపి యదమీ నిష్పౌరుషాః కుర్వతే॥

ముఖాద్యవయవములతో దేహములు సమములుగా నుండగా బ్రాహ్మణుడని, క్షత్రియుడని, వైశ్యుడని, శూద్రుడని వర్ణక్రమ మెచ్చటిది? ఈమె పరస్త్రీ. ఇది పరద్రవ్యము. ఇట్టి భేద మేల వచ్చెనో తెలియదు. యాగీయ హింస చేయుటలో, యథేష్టము స్త్రీలను పొందుటలో, పరధనగ్రహణములో నిది కార్య మిది యకార్య మని పౌరుషము లేని పురుషులు పల్కుదురు. అని చార్వాకభావమును చెప్పినాడు.

చార్వాక మతమున నీశ్వరుడు లేడు. ఈశ్వరు డున్నచో కన్పడపలెను. కన్పడనందున లేడు. ఈ జగమంతయు స్వభావముననే యేర్పడినది. కర్త యున్నచో లభించెడి వాడే! కర్త యొక డొకప్పుడేని యభ్యూహితుడు కాడు కాన లేడు. లోకప్రసిద్ధుడు ప్రత్యక్షముగ కన్పడునట్టి పాలకుడే పరమేశ్వరుడు. ప్రాణు లొనరించు పుణ్యాపాపకర్మల ఫల మెవ డిచ్చు నన్నచో వా రిట్లందురు. లౌకికకర్మ ఫలమును నిగ్రహానుగ్రహ సమర్థుడయిన ప్రభువే ప్రసాదించును. సేవకుల మనోరథమును ద్రవ్య మిచ్చి ప్రభువు పూరించుచున్నాడు. సుఖ పెట్టుచున్నాడు దొంగలను దండించు చున్నాడు. యజ్ఞ దాన తపః ప్రభృతి కర్మలు లౌకిక కర్మలు కావు. అవి భోగసాధనములు కావు: అట్టి వానికి ఫలప్రదాతగా నీశ్వరుడేల? ధూర్తులు లోకుల కీశ్వరుని చెప్పి వంచన మొనరించిరి. కర్మజడులు భ్రాంతులై కర్మప్రవృత్తు లయినారు. ప్రాణి పుట్టగనే సుఖ దుఃఖానుభవము యాదృచ్ఛికముగ కాకతాళీయ న్యాయమున కలుగును. అందు కారణ పర్యాలోచన మనావశ్యకము. చార్వాకమతమున చైతన్య విశిష్ట మయిన దేహమే జీవాత్మ. అదియే కర్త. అదియే భోక్త. భూత చతుష్టయ పరమాణువులు దేహమూలములు. భూతములు దేహముగా పరిణమింపగా నా పరిణామవిశేషమున చైతన్యము కలుగును. ఆ చైతన్య విశిష్ట దేహమే జీవసంజ్ఞ పొందుచున్నది. చైతన్య విశిష్టదేహమున చైతన్యాంశము బోధ రూపముగా నుండును. దేహాంశము జడరూపముగా నుండును. కాగా జీవుడు జడబోధోభయరూపుడు. దేహములు నానావిధములు. కాన జీవులును నానా కలరు. జీవు డనిత్యుఁడు.

చార్వాకదర్శనము నాస్తికదర్శనాంతర్గతము. బృహస్పతి సూత్రము రచించినాడని ప్రసిద్ధి కాదా! కొంద రిట్లందురు. "ఈ దర్శనము బృహస్పతి కభిమతము కాదు. అయిన దీని రచించెను. ఆ దేవగురు భావమిది. దేవతలు తన శిష్యులు. వారల కసురుల వలన బాధలు వచ్చిపడినవి. ఆ పీడ పోగొట్టవలయును. అసురులు యజ్ఞాదు లొనరించి తత్సామర్థ్యమున నుత్సాహులై దేవతల జయింప నుత్సుకపడిరి. అట్టివారలకు యజ్ఞాదికర్మలలో శ్రద్ధలేకుండ చేయుటకై బృహస్పతి లోకాయత సూత్రము రచించెను. అసురు లం దా దర్శన ప్రచారము సాగినది. వారు శ్రద్ధ లేక కర్మభ్రష్టులై స్వర్గాది సుఖభోగానర్హు లయిరి. విష్ణు పురాణములో నొక కథ కలదు. నర్మదా తీరమున నొకప్పుడు దైత్యులు కూడి వేదమార్గ మవలంబించి యేకాగ్రమనస్కులై తపమొనరించిరి. దేవత లప్పుడు భయపడి నారాయణుని శరణువేడిరి. నారాయణు డప్పుడు తన శరీరమునుండి మహామోహుడను వాని సృజించి దేవతల కర్పించెను. మాయామోహుడు మాయచేదైత్యుల వంచించి సన్మార్గభ్రష్టుల జేసెను. బృహస్పతి సూత్ర మనుసరించి మాయా మోహోపదేశము విని విని దైత్యులు వంచితులై తపముల మానిరి. దేవతలు స్వర్గసుఖ మనుభవించిరి.

ఇది చార్వాకతాపన బోధ. ఇది చార్వాకదర్శనము. నాస్తికదర్శనషట్కములో నిది మొదటిది. యోగాచారబౌద్ధము, మాధ్యమికబౌద్ధము, సౌత్రాంతికబౌద్ధము, వైభాషికబౌద్ధమునను నాలుగు విధముల బౌద్ధములును నాస్తికములు. అర్హతమతము నాస్తికము. నాస్తిక షట్కమొకదర్శన కూటము. ఆస్తికషట్కము మరి యొకటి. నాస్తికాస్తిక సకలదర్శన సాధారణధర్మ మొకటియున్నది. చేతనాచేతనమూల స్వరూపమును గుర్తింపవలెను. తత్సంబంధము తెలియ వలెను. బంధము తెలియవలెను. అప్పుడు తత్వజ్ఞానమున మోక్షము కలుగును. ఇది తత్త్వము. ఇది దర్శనారాధనము !!

---

# SUKA'S PRAYER TO THE LORD

(From Srimad Bhagavata)

O thou Lord supreme, I bow down to thee!
For thy sole pleasure and play didst thou bring forth this Universe.
Thou art the highest in the highest! Who can sing thine infinite glory?
Thou art the innermost ruler of every heart;
Thy paths are mysterious;
Thy ways are blessed.

Thou dost wipe away all the tears of thy devotees;
Thou dost destroy the wickedness of the wicked.
Thy form is purity itself, and thou dost give purity and Self-knowledge to those who seek thee.
Salutations to thee again and again, O Lord of hosts!

I praise thee, O Lord!
Thou art the strength and support of all thy worshippers;
Thou art manifest in the hearts of all true Yogis;
The evildoer findeth not.
Thou art One without a second.
Thou dost shine in thine own glory, in thy resplendent, blissful Self.
What sweetness is in thy name,
What joy is in thy remembrance!
Those who chant thy holy name and meditate on thee, become for ever free from all evils;
The wise, worshipping thy Feet, conquer all fear of life and death:
Thus do they realize thee, thou supreme goal of all true seekers.

Before thee there is no barrier of caste, or race, or creed:
All thy children attain purity through thy holy name.
Calm souls worship thee, knowing that they are one with thee.
Thou art the Lord supreme,
Thou art indeed the Vedas,
Thou art the Truth,
Thou art the goal of all discipline;
Thy lovers meditate on thy blissful form, and become lost in the joy thereof.
Shower thy grace upon me, O Lord, and in thy mercy look upon me!

(*By kind courtesy of Ramakrishna Mutt.*)

# ANDHRA ARCHITECTURE

*By*

V. V. TONPE

## III—FOREIGN INFLUENCES ON HINDU ARCHITECTURE.

### 1. *Persian and Greek.* (*continued*)

In the previous article, we dealt with the Persian influence on Hindu architecture. In this we shall know something of the Greek influence, which is as ancient as the Persian though not as persistent as it has been.

### *The Greeks*

It is universally accepted fact that the Greeks belonged to the ancient world. They were the fountain-head of European civilization and much had been written about them. It shall not be our endeavour, at present, to trace the history of Greek civilization, as it is a long and complicated one; we shall only record some outstanding developments which relate to the growth and influence of the arts.

The Greeks were the most glorious and the most fascinating people the world had ever produced. Their glory did not lie in their philosophy or science, or even in their literature, certainly not in their political history. The glory of the Greeks was the glory of their fine arts. Whatever they did or owned, they did not allow their souls to be victims of indolence and luxury; and they were as sensitive as they were rational. They were far from sentimentality and cheapness, from ostentatiousness and from Bazar art. They rarely produced things unworthy of their skill. Their mastery in architecture and sculpture, their temples and their carvings pointed to their glorification of fine arts. They were one of the most artistic races that history had ever produced.

The ancient Greeks were several distinct peoples with several ideals to their credit, who intermingled and colonized together in places far away. They were naturally inclined to wage wars when they differed over points of controversy and could not see eye to eye with one another. They were a busy lot, trading and selling, but little inclined to hoard money and never prepared to yield their independence. They were ever ready to argue freedom and fight it out, at the slightest provocation. Strangely, out of these warring people who had no respect for humanity, emerged a civilization that added to the glory of mankind. That was because, the average Greek had more art in his soul than any good citizen of any country has during these subsequent times.

### *India and Greece*

Even during the very early stages of civilization, the Greeks appear to have had some knowledge about India. The contacts between India and the Greco-Roman world then was to a great extent through trade. The earliest trace of commercial intercourse between Indus valley and Euphrates is probably to be seen in the cuneiform inscriptions of the Hittite kings of Mitanni in Kappadokia, during fourteenth or fifteenth century before Christ. The rulers bore Aryan names and worshipped the Vedic gods. It is said that the word *Sindhu* is used in Assurbanipal for "Indian cotton". It is believed that this word belonged to the Akkadian language, where it is expressed by ideographs as the meaning "vegetable cloth." Assurbanipal was a great horticulturalist and it is said that he sent for

# శ్రీ కనకదుర్గా క్షేత్రము - విజయవాడ

*కవిరాజశిరోమణి, పండిత, దీవినరసింహాచార్యులు - అష్టావధాని - అవనిగడ్డ.*

### క్షేత్రములకు ప్రభావము **వేనివలన** కలుగును?

ప్రతి క్షేత్రమునకు పవిత్రములైన నదులవలనను, పర్వతములవలనను, మాహాత్మ్యము కలుగును. ఏలననగా యేస్థలమును మహాత్ములైన ఋష్యాదులుగాని, సిద్ధులుగాని, అవతారపురుషులైన యార్యులుగాని త్రొక్కుదురో, సంచరింతురో, లేక నివసింతురో, యాప్రదేశమునకు వారి సంసర్గమువలన ప్రభావ మతిశయించుచుండును. వారు నిర్మలోదకసేవనమున, యంతర్బహిర్మాలిన్యములను క్షాళనమొనర్చుకొని శాంతి దాంతులనుఁ జేకూర్చుకొనుచుందురు. అట్లు చిత్తశాంతినిఁబొంది సిద్ధులగుటకు నిర్మలోదకములును, నిర్జనప్రదేశములు నావశ్యకములు. ఇవియే వారి తపోనిష్టలకుఁగాని యోగాభ్యాసములకుఁగాని ప్రధాన సాధనములు. కనుకనే యిట్టి తపోధనులకు శీతాతపాది బాధలులేకుండునట్లు భగవంతుఁడు పర్వతములందు నివసించుటకు సానువుల (గుహల)ను, స్నానపానాదులకు సెలయేటి బుగ్గలను సృష్టించెను ఇందువలన వారిట్టి క్షేత్రములందు నివసింతురు. వారి సన్నిహితమువలన క్షేత్రములత్యంతప్రభావాన్వితములై, తత్పరిసరప్రాంతములన్నియు సత్యాహింసాది సద్గుణముల కాలవాలములై, దుర్భిక్ష రహితములై శాంతిభద్రతలు కలిగియుండును. ఈ క్షేత్రమున నదీపర్వతములు రెండును కలవు.

### కృష్ణానది - ఇంద్రకీలాద్రి

ఇవి రెండు నత్యంత ప్రభావవంతములైనవగుటచే, నీ క్షేత్రమును నధిక ప్రభావవంతమైనది. కృష్ణానది సహ్యగిరియందుద్భవించినట్లు స్కాందపురాణమునఁ గలదు. మరియు నిది సాక్షాద్విష్ణు శరీరమేయైనందున గంగా గోదావరీ నదులకంటె నుత్కృష్టమైనది కనుకనే, యిది విష్ణువు

ఇంద్రకీలాద్రి నుండి - కృష్ణానదీ దృశ్యము





శ్రీ కనకదుర్గాలయము

పేరుతోనే విలసిల్లుచున్నది. మరియు నిది పూర్వవాహినిగా ప్రవహించి, యుభయనాగేశ్వరక్షేత్రమగు కదళీపురము (పెదకళ్లేపల్లి) నుండి, యుత్తరవాహినిగా ప్రవహించి సాగరసంగమొనర్చుటచే, దీని శక్తిప్రభావము లసమానములైనవి. అనగా యే నది ప్రవాహమున కెదురు నడచునో దాని శక్తి యధికము. అట్లు అన్ని నదులును ప్రవహించనేరవు. విష్ణుపాదోద్భవియగుటచే గంగానదియు, "కృష్ణావిష్ణు తనుస్సాక్షాత్" అను ప్రమాణమువలన, కేవలము విష్ణుతనువైన కృష్ణయుఁ దప్ప మిగిలిన యే నదులకు నిట్టి శక్తిప్రభావములులేవు. స్కాందము సహ్యాద్రి ఖండము అష్టాదశాధ్యాయమున కృష్ణామాహాత్మ్యమును గూర్చి ఋష్యాదులు "కృష్ణామాహాత్మ్యమతులం శ్రోతుమిచ్ఛామహెవయం" అని నారదమహర్షిని యడిగినట్లును, "శృణ్వంతుమునయస్సర్వె కృష్ణామాహాత్మ్యముత్తమం" అని ప్రారంభించి "స్నానందానంజపోహెామస్స్వాధ్యాయం పితృతర్పణం। యవమాత్రంతు యఃకుర్యాదనంతం ఫలమశ్నుతె" అని నారదు డుపదేశించినట్లును కలదు. మహాభారతములోకూడ కృష్ణానదినిఁ గూర్చి "సదా నిరామయాం కృష్ణాం మందగాం మందగామినీం" అని వ్యాసులు ప్రశంసించిరి. ఇంక నా ఖండమునందే "యింద్రకీలాద్రి"ని గురించి "తతః కీలగిరిం దేవీ గచ్ఛతీ విస్మయంగతా। తంకీలాద్రిం స్వర్ణమయం – సర్వదేవమయోగిరిః" నృసింహావాసపర్యంతం కీలరూపేణవర్తతే। స్థితోద్దైర్ఘ్యేణ కీలాద్రిః కీలావద్వర్తతె తథా" అనికూడ వర్ణింపఁబడినది. ఈ పర్వతము కేవలము నొక మహాభక్తుఁడును, శాక్తేయుఁడైన "ఇంద్రకీలుఁడ"ను యక్షుఁడు, యీశ్వరినిగురించి తపం బొనరించినట్లును నాదేవి యాతనిఁ గటాక్షించి నీకేమి వరము కావలయునని కోరుమనగా, నతఁడు నీవు యెల్లప్పుడు నాపై నధిష్టించుటయే నా యభీష్టమని పలికినట్లును, యంత నాదేవి నీవు శైలరూపమునందుము - నేను నీ గర్భమున వసింతును, యీ పర్వతమును నీపేరుతోనే విలసిల్లకలదని వరమొసంగినట్లును కలదు. అప్పుడా యక్షుఁడు గిరి రూపమును ధరించెను. ఇదియే యింద్రకీలాద్రి. ఇది నృసింహక్షేత్రమైన "మంగళగిరి" వరకు వ్యాపించి యుండెను.

## కనకదుర్గ - బ్రహ్మచారిణి

ఇది దుర్గా ప్రధానమైన క్షేత్రము. దుర్గ అనగా పార్వతియే. ఈమెయే యీశ్వరుని యిచ్ఛాశక్తి. ఈమెనే మహా

మాయ యనికూడ యందురు. ఈమె దేశమున కొక పేరుతో పూజింపఁబడుచున్నది. మొత్తముమీద యీ శక్తి పూజను హిమవత్పర్వతములోని కైలాసనాథమునుండి కన్యాకుమారి యగ్రమువరకు అన్ని మతములవా రంగీక రించి కొలుచుచునేయున్నారు. ఎవరేపేరుతోఁ బిలిచినను "శాంకరి"కి "దుర్గా" శబ్దమన్వర్థమైనదనిన్నీ "దుర్గ" యనగా "దుర్గము" (కోట)వలె భక్తులను రక్షించుట కన పాయినియై కాచియుండు శక్తికలదగుటచేత నీమె కీ పేరు ప్రియమైనదనియు, ఇట్లు "స్థలదుర్గ, వనదుర్గ, నదీదుర్గ, పర్వతదుర్గ, సాగరదుర్గ, గ్రామదుర్గ, పట్టణదుర్గ, చండీ దుర్గ (రణదుర్గ) శూలినీదుర్గ" అని యెచ్చట రక్షణ వ్యాపారము జరుపుశక్తియో, అది యంతయు "దుర్గా" స్వరూపమేననియు, యిందువలన నీమె జగద్రక్షకత్వము, జగద్వ్యాపకత్వము, జగన్మాతృత్వము ప్రకటనమగుచున్న దనియు, కాని దేవీ భాగవతము, దుర్గాసప్తశతీస్తోత్రముల వలన దుర్గా ప్రధాన క్షేత్రములు నూటయెనిమిదియున్న ట్లును మన్మిత్రులు శ్రీసోరి నరిసింహశాస్త్రిగారు "ఆరాధన పత్రిక" మన్మథ అశ్వీయుజ మాస సంచికలో, "దుర్గో పాసనాతిశయమను వ్యాసమున వ్రాసిరి. కాని "అష్టాదశ దుర్గ"లని కీ॥ శే॥ శ్రీ కళ్యాణానందభారతి స్వాములవారు పేర్కొనిరి. అనగా నివి ప్రధానములని యర్థము. "దుర్గ"



శ్రీ నటరాజ ధ్రువమూర్తి

అనుపేరు పార్వతీపరమైనను "ఉమా"ది మూర్తులలో అమ్మవారి వయశ్చర్యాభేదముల ననుసరించి ఋష్యాదు లును, యుపాసకులును, పలునామముల స్తుతించి యుండిరి. అందు రౌద్రాంశమున విలసిల్లుమూర్తికే "దుర్గ" యనిపేరు. ఈమెను హిమాచలప్రదేశమున "హైమవతి" యనియు, కాశ్మీరదేశమున "శైలపుత్రి" యనియు, వంగదేశమున "కాళి" యనియు, గయా క్షేత్రమున "గౌరి" యనియు, హరిద్వారమున "మహా మాయ" యనియు, ఉజ్జయినిలో "వారాహి" యనియు, మహారాష్ట్రదేశమున "వింధ్యవాసిని" యనియు, కర్ణాట దేశమున "చాముండి" యనియు ఇంకనుత్కళులు "ఓంకారి" అనియు, వ్యవహరించుచున్నారు. మళయా ళులు "భగవతి" యని, దాక్షిణాత్యులు "కౌమారి" యని పలునామములతో పిలుచుచుండిరి. ఇందు సుందర (శాంత) మూర్తిని "విశాలాక్షి (కాశీ) కామాక్షి (కాంజీవరము) మీనాక్షి (మధుర) బాలా త్రిపురసుందరి, త్రైలోక్యసుందరి, భ్రమరాంబ, జ్ఞానప్రసూనాంబ మున్నగు లలితనామములతో నుపాసకులు యుపాసించుచున్నారు. "లలితా" యనునది కూడ యీమె కొకపేరు. కాని శాక్తేయతంత్రములందు

"ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ
తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకం
పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతిచ
సప్తమం కాళరాత్రిశ్చ మహాగౌరీతి చాష్టమం
నవమం సిద్ధిదాప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః"

అని నవదుర్గలను పేర్కొనిరి. ఇందీమె రెండవది. ఈమె పేరు "బ్రహ్మచారిణీ దుర్గ". "దుర్గ" అనగా "దుఃఖేనాపి-అవగంతుం-అశక్యా-దుర్గా" అనివ్యుత్పత్తి; అనగా అతి కష్టముచేత కూడా స్వాధీనము కాని దేవత యని అర్థము. దుర్గమారణ్యముల మధ్యనుండుటచే కూడ నీమె కీపేరు కలిగి యుండవచ్చునని కొందరను చున్నారు. కాని స్కాందమున, సహ్యాద్రిఖండములో దుర్గాక్షేత్ర మాహాత్మ్యమున

"దుర్గమోనామదనుజో ఆసీత్త్రైలోక కంటకః
దేవప్రార్థనయాదేవీదుర్గమం నిజఘానహ
తదాత్తే జసావ్యాప్తం దదృశుః కనకప్రభం
దేవాస్సర్వేస్తుతిం చక్రుస్సర్వోప నిషదాంగతైః॥
దేవీం కనకదుర్గేతి ముదాతుష్టువు రాదరాత్॥

అని వర్ణించిరి. ఇందువలన లోకకంటకుడైన దుర్గ మాసురుని దేవతల ప్రార్థనచే, దేవిసంహరించినట్లును, అప్పడామె తేజస్సు బంగారమువలె వ్యాప్తము కాగా దేవతలందరు యుపనిషత్తులతో "కనకదుర్గా" యని స్తుతించినట్లును తెలియుచున్నది. ఈమెను కృతయుగమున

ఇంద్రకీలుఁడును, త్రేతాయుగమున నింద్రుఁడును, ద్వాపరమున, అర్జునుఁడును కొలిచినట్లు భవిష్యోత్తరాది పురాణముల యందును మేరుధరతంత్రాది శాక్తేయాగమము లందును వివరింపబడి యున్నది. మరియు నీమెమహిషాసురుఁడను మరియొక రాక్షసుని సంహరించి అరూపుతోనే నీయింద్ర కీలాద్రిపై వెలసియున్నదని కూడ కలదు. అందుచే నీమెకు "మహిషాసురమర్దని" యని మరియొక పేరు.

## విగ్రహసౌందర్యము అధిదేవతలు

ధృవభేరము స్వయంభవ మగుటచే శిల్పసౌందర్య మంతగా కానరాదు. కాని అతిభీషణమైన విగ్రహము, అష్ట భుజములు కలది. అష్టభుజములందును, అరి, (చక్రము) శంఖ, ఖేట, శూల, పాశ, అంకుశ, మౌర్వి, సాయకము లను ధరించి యుండెను. సింహవాహనారూఢయై మహిషాసురుని తలపై శూలముతో పొడుచు వైఖరి తోచుఁచుండెను. ఈమెకు అమూల్యములైన కనక కవచమును రత్నాభరణములునుఁ గలవు. వీటిచే నలంకరింపఁబడి నపుడు కేవలము త్రైలోక్య సుందరి వలెనే కాన్పించును. ఈ సర్వాంగ స్వర్ణకవచాలంకృత దుర్గావిగ్రహము ఈ సంచిక యందు ముఖచిత్రముగ ప్రకటింపబడినది. ఈమె ఆభరణ సంపద సుమారొక లక్ష రూప్యములకు మించినది. కాని యీ దేశాచారము ననుసరించి ఆగమశాస్త్రములకు విరోధముగా అమ్మవారి ముఖమండలమున "హరిద్రము" పసుపు కోటా వేయుచున్నారు. ఇట్లు వేయక బింబమును యథాతథముగా నుంచినచో కాళహస్తిలోని "సత్యజ్ఞాన ప్రసూనాంబ" వలె మరింత బాగుండును. ఇట్లు శిలా విగ్రహములకు రంగులు వేయుట శాస్త్ర సమ్మతము కాదు. సదాచారమును కాదు.

ఈ ఇంద్రకీలాద్రి స్వర్ణగర్భ అనియు, దానినధిష్ఠించి యుండుటచే నాదుర్గ కూడ స్వర్ణమయియైనట్లు

"తంకీలాద్రిం స్వర్ణమయం తద్రూపాం జగదంబికాం
ఇంద్రాది దేవసంసేవ్యాం తదగ్రే దివ్యరూపిణీం"

అను ప్రయోగమువల్ల యీామె "కనక దుర్గ" యైనట్లు కన్పట్టు చున్నది. తరువాత రాఘవవర్మ యను రాజు రాజ్యము సేయునప్పుడు తనకుమారుడొక తెలుకుల బాలకునిఁ జంపినట్లును, ప్రభువు తన కుమారుడొనర్చిన హత్యానేరమునకు మరణ దండనము విధించినట్లును, అందుకా దుర్గాదేవి యాతని ధర్మ నిరతికి మెచ్చి చినుకుకు చిన్నము వంతున కనకవర్షమును నాబాలకుల మీద కురిపించినట్లును, నంత నాబాలకు లిరువురు సజీవులైరని, తత్ప్రభృతి నీదేవికి "కనక దుర్గా"బి ధానము కలిగెననియు, నామెకు నివాసమగుకతన నీ పురమునకును, "కనకపురి" "కనకవాడ" లను పేరులు కూడ కలిగినట్లొక శాసనముఁగలదు. అమ్మవారికి వామపార్శ్వమున నొక చిన్న వినాయక విగ్రహము కలదు. ఈయన లక్ష్మీ గణపతియని వాడుక. అతి సౌంద్యమూర్తి. ఆలయమునకు దక్షిణభాగమునఁగలగుహలో, "చింతామణిదుర్గ" విగ్రహ మొండు కలదు. అమ్మవారి కభిముఖముగ చిన్న ఆంజనేయాలయమును, ఉత్తరపు వైపున నూతనముగ ప్రతిష్ట నొనర్పఁబడిన నటరాజాలయమునుఁ గలవు. ఈ నటరాజాలయమున నటరాజునకు దక్షిణభాగమున "సిద్ధి గణపతి, సుబ్రహ్మణ్య విగ్రహములును, యుత్తరభాగమున ' కామేశ్వరి " దేవి విగ్రహమును ప్రతిష్టింపఁబడినవి. ఇవి యన్నియు అత్యంత శిల్పలావణ్యముతో నొప్పారు చున్నవి. నటరాజు నటరాజుగనే కన్పించును.

## విజయుఁడు - విజయేశ్వరుఁడు

ద్వాపర యుగమున యర్జునుఁడు పాశుపతముకొరకు యీశ్వరుని గురించి తపంబొనర్చిన దీనగము మీదనే; నేటికిని దక్షిణ శిఖరాగ్రమున మంటపము కలదు. అదియే



శ్రీ శివకామసుందరి - ధ్రువమూర్తి

కిరీటి తప మాచరించిన స్థలమని ప్రతీతి. అతని తపశ్శక్తికి మెచ్చి వరమును ప్రసాదింప, యీశ్వరుఁడు కిరాతవేషమున రాగా వానితో నర్జునుఁడు పోరి, గెలిచి పాశుపతాస్త్రమును సంపాదించెను. అందుకు పరమేశ్వరుఁడు మెచ్చి నీ విజయ చిహ్నముగా నీ నగరమునకు "విజయ పురి" యను పేరు వెలయుఁగాక యని వరమిచ్చి పోయెను. అంత నా అర్జునుఁడు విజయమును సాదించుటచే "విజయుఁడ" ను పేరు సార్థకపర్చుకొనుటయేఁగాక నా పరమేశ్వరుని వాత్సల్యమున కచ్చెరువంది తచ్చిహ్నముగ, అమ్మవారి గుడికి దక్షిణభాగమున (యిప్పుడు కొండకు చివర) నొక శివాలయమును కట్టించి ప్రతిష్ఠించెను. వానికి "విజయే శ్వరుఁడని"యే పేరిడెను. మరియు దేవేరి కటాక్షముననే పాశుపతాస్త్రము లభ్యమైనదని తలచి, యమ్మవారికి "బ్రహ్మాస్త్రేశ్వరి" యని పేరుఁబెట్టుకొనెను. ఈ దేవాల యము కొండలో పూడిపోయి, యిటీవల, పర్వతమును ప్రభుత్వమువారు పగులకొట్టుచుండగా కనిపించినది. దాని నిప్పుడువారపురుములు జీర్ణోద్ధరణ కావించిరి. ఇప్పుడీ కథను బోధించు కిరాతార్జునీయ విగ్రహమును, దుర్గా అమ్మవారి ఆలయమునకును - నటరాజాలయమునకును మధ్య - నూతనముగా కట్టించుచున్నారు.

## ఆది శంకరులు - శ్రీ మేరు చక్రము

ఈమె బ్రహ్మచారిణి యగుటచే, భక్తులకు చూచుట కతి భయంకరముగ నుండెడిదట. ఆమె దృష్టి కెదురుగ నెవ్వరైనను వెళ్లినచో వారు మరణించెడివారట. అప్పు డాది శంకరస్వాములవా రీ క్షేత్రదర్శనమునకు వచ్చి, చూచి, ఆమె యెల్లప్పు డిటులనే యున్నచో, కలియుగ మున నల్పమనస్కులైన మానవులు పూజాదు లొనర్చుటకు వీలు యుండనేరదనియు, నామె దర్శన లాలసుల కట్టి భాగ్యము లభింపదనియు, నామె తీక్ష్ణదృష్టిని తగ్గింపనెంచి,



శ్రీ మల్లేశ్వరాలయము

శాంతియంత్రములఁ జెక్కించి వానిని అమ్మవారికి వామ పార్శ్వమున ప్రతిష్టించిరి. అప్పటినుండియు, భక్తులక దుర్నిరీక్ష్యగా నుండు యామె తీక్షత తగ్గి భక్తులకు వికస న్ముఖోల్లాసియై, మందస్మిత సుందరవదనారవిందయై కన్పట్టుచున్నది. ఆ యంత్రములకు శ్రీ చక్రము, మేరు చక్రము లని పేర్లు. మరియునా శంకరభకత్పాదులవారు అమ్మవా రొంటరిగ నుండుట యీ దేశమునకు క్షేమదాయ కముఁ గాదని నిరూపించి ఉత్తరపు ప్రక్క మల్లేశ్వరాల యమును నిర్మించి ప్రతిష్ఠించిరి. ఇటీవల యీ ఆలయ మునకు మంటప ప్రాకారాదులు కొండపైకి మెట్లు కట్టించి జీర్ణోద్ధరణముఁ గావింపఁబడినది. మరియు దీనికి దక్షిణపు వైపు నొక శంకర మఠమునుఁ గట్టించిరి. ఇందు శంకరా చార్యులవారి పాలరాతి విగ్రహము ప్రతిష్టింపఁబడినది. ఈ క్షేత్రపాలకు డీ మల్లేశ్వరుఁడే.

ఈ మల్లేశ్వరునిఁగూర్చి స్కాందమున, బ్రహ్మ యీశ్వ రునిగూర్చి తపంబొనర్చుటయేఁ గాక యీశ్వరునికి ప్రీతిగ శతాశ్వమేధములను సేయగా నా పరమశివుఁడు జ్యోతిర్లింగ రూపమున బ్రహ్మకు దర్శనమిచ్చి బ్రహ్మలోకము నిచ్చె ననియు, నంత నావిధాత యా లింగమును మల్లి, కదంబక పుష్పములచే నర్చించుటచేత తదాది మల్లికేశుడని చెప్పు చున్నారని

"జ్యోతిర్లింగ స్వరూపేణ బభౌ సర్వేశ్వర శ్శివః
తదాతం పూజయామాస సదేవం మల్లీకదంబకైః
దర్శనం బ్రహ్మణేదత్వా బ్రహలోకం దదౌశివః
తదాప్రభృతి దేవేశం మల్లికేశం వదంతిహి"

అని కలదు. ఇందువలన నిక్కడ అనాదిగనే బ్రహ్మచే ప్రతిష్ఠితమగు "మల్లికేశలింగ" మున్నట్లును, అది కాల వశమున జీర్ణము కాగా శ్రీ శంకరులు పునరుద్ధరణ కావించి నట్లు తెలుచున్నది. (చూ॥ కవరుపేజీ తుదిన)

## విజయవాడ - బెజవాడ

తొలుత దుర్గమాసురుని యీ దేవి జయించిన కార ణముచేతను, కిరాతవేషమున నున్న యీశ్వరుని అర్జు నుఁడు జయించిన కారణముచేతను, కృష్ణాతరంగిణి పర్వతునితో పోట్లాడి విజయము చేకొనుటచేతను దీనికి "విజయవాటిక" యను పేరు కలిగెను. ఈ విషయమే, స్కాందమున

"తచ్చుంభాది జయాత్సా వై జయా నామ పురీహ్యభూత్
తత్రత్యామున యస్సర్వే దేవం లోకైకమాతరం
పరమాం ప్రస్తుతించక్రుర్జయ దేవీతి సూక్తతః"

అనియు అర్జునుని గురించి,

"తత్పశ్చా దర్జునశ్చాపి తప స్తప్త్వాతు ఫల్గునః
మల్లికేశ్వర దేవాచ్చ లబ్ధ్వా పాశుపతం ధనుః
స్తుతిం చక్రే తతః పశ్చాద్విజయాహి పురీహ్యభూత్"
అని నిర్వచింపఁబడినది. "బెజవాడ" యను పేరు కూడ అనాదియే. శాస్త్రసిద్ధమైనదే. "వ-బయోరభేదః"
అను వ్యాకరణ సూత్రముచేత "విజయవాటిక,"కు
"బిజయవాటిక" యను పేరుకూడ సాధువగును.
కాని దీనికా పురాణముననే "కృష్ణా కృష్ణాంగ సంభూతా" అని ప్రారంభించి, "బీజానాం వాపనం త్వాసీ త్తదాబీజ పురీహ్యభూత్త"ని వ్రాసిరి. అనగా కృష్ణాస్రవంతి తాను వచ్చు మార్గమధ్యమునఁ గల మహాయోషధి బీజములను కొనివచ్చి యీ పురమున నాటుటచే యీ పట్టణమునకు "బీజపురి" యైనట్లుకూడ కలదు. ఈ "బీజపురి"యే నేడు బెజవాడ యైనది. నేటి చరిత్రకారులు యీ పట్టణము బిజ్జలదేవుని రాజదాని "యగుటచే (తొలిరూపము) బిజ్జలవాడ" అనియు, రానురాను నేడిది "బెజవాడ"అని మారినట్లు చెప్పుచున్నారు. ఈ క్షేత్ర మాహాత్మ్య మద్భుతమైనది. ఏలనన
"సర్వదేవ మయోహ్యద్రిః - సర్వదేవాత్మక శ్శివః
సర్వతీర్థ మయీకృష్ణా త్రితయం సుగమం త్విహ"
అను ప్రమాణవచనముచే, సర్వదేవతలును, సర్వతీర్థములును సన్నిహితములై యుండి జగన్మాతా పితలగు
"దుర్గామల్లికేశు" లిట వసించి యుండుటచే
"ఏతత్క్షేత్రేణ సదృశం నభూతో నభవిష్యతి.
ఏతచ్ఛ్రవణ మాత్రేణ పలాయంతేహిపాతకాః"
అనియు "భక్త్యాస్నాత్వాఽత్ర మల్లీశం దుర్గాందుర్గార్తి నాశినీం। దృష్ట్వా పాపాత్ప్రముచ్యేత దేవి లోకేవసేత్సదా" అను ఫలశ్రుతి వల్లను యిది ధర్మార్థ కామ మోక్షముల నొసంగు సర్వార్థదాయిని యని పురాణ ప్రసిద్ధము.

## సంప్రదాయము - అర్చనాపద్ధతి

ఈ క్షేత్రమునందు సనాతనమునుండియు వెలనాటి అర్చకులు అర్చనచేయుదురు. ప్రతిదినము ఉదయమున శ్రీసూక్త విధానమున లలితా సహస్రనామార్చన చేయబడును.

ప్రతి శుక్రవారమునందును, పూర్ణిమలయందును, శరన్నవరాత్రులందును, వసంత నవరాత్రులందును విశేషపూజలు, భోగములు జరుపబడును. చైత్రశుద్ధ పౌర్ణమికి కళ్యాణోత్సవము జరుపబడును. ఆశ్వయుజమాసమున పాడ్యమిమొదలు విజయదశమివరకును, ప్రతిరోజు శ్రీ అమ్మవారుకు వేర్వేరు అలంకారములు చేయుట, మహావిద్యా పారాయణ, లక్ష కుంకుమపూజ మొదలగు విశేషములు జరుపబడును.

కార్తీకమాసమునందు నిత్యము అభిషేకము చేయబడును. మాఘమాసమునందు మహా శివరాత్రికి బ్రహ్మోత్సవము, రథోత్సవములు జరుపబడును.

ఈ క్షేత్రమందలి విశేషము:-దుర్గా ప్రధానమగుటచే ముందుగ అమ్మవారిని సేవించి భక్తులు తరువాతను మల్లేశ్వరస్వామి దర్శనమునకు పోవలయునను యాచారము కలదు.

---

# ఉత్సవములు (ఆశ్వయుజ మాసమునందలివి)

**5-10-56** తేది ఆశ్వయుజ శుక్ల పాడ్యమి శుక్రవారం మొదలు **14-10-56** తేది ఆశ్వయుజ శుక్ల దశమి ఆదివారం వరకును శరన్నవరాత్రులు (దేవీ నవరాత్రులు).

ఈ నవరాత్రులందు కలశస్థాపనము, దేవీ ప్రతిమారోపణము మొదలగునవి పాడ్యమి దినమునందే సంకల్పముతో నాచరించి తొమ్మిదిరోజులు సహస్రనామ పూజ లొనర్చి పదియవ దినమునందు ద్వాపన చేయబడును. ఈ నవరాత్రులందు కేవలము దేవీ పూజలుమాత్రమే చేయబడవు. వైష్ణవాలయములలోకూడ ఈ నవరాత్రులందు విశేషించి విష్ణుసహస్రనామ పూజలు చేయబడును. దేవీ పూజ చేయువారు, దేవీ భాగవతము, దుర్గా సప్తశతీ, లలితా సహస్రనామములు, లలితోపాఖ్యానము, మున్నగు దేవీ మాహాత్మ్య గ్రంథములను పఠింతురు. మరికొంతమంది శ్రీమద్రామాయణమును పఠింతురు. తొమ్మిదిరోజులు పూజలుచేయుట కశక్తులగువారు, పంచమినా డారంభించి అయిదు రోజులును, అందుకు నసమర్థులగువారు సప్తమినాడారంభించి త్రిరాత్ర వ్రతముగనైనను, అందుకుకూడ నసమర్థులగువారు మహానవమియం దొకదినమునందైన దేవీపూజ చేయు నాచారము గలదు.

ఈ నవరాత్రులు దేవీ నవరాత్రులుగా ప్రసిద్ధిజెంది దేవీ పూజలు సల్పుటకు ఈ క్రింది యాచారములు తెలియ నగును.

పార్వతీదేవి తొమ్మిది అవతారములను ధరించి రాక్షస సంహార మొనర్చినట్లు పురాణములందు గలదు. మహా మాయ (మహా కాళి) మధుకైటభులను సంహరించినది. మాయాదేవి రెండవ యవతారమున మహిషాసురుని వధించినది. మూడవ యవతారమునందు శుంభ నిశుంభులు నిహతులైరి. రక్తబీజుడను రాక్షసునికూడ ఈ మూడవ యవతారమగు రక్తబీజుని హంత్రియగు కాళికాదేవియే వధించెను. నాల్గవయవతారము నందునిపుత్రికగా జన్మించి కంసునిచే యవధ్యురాలై కంసుని చంపునట్టి కృష్ణుడు క్షేమముగా నున్నాడనిచెప్పి యదృశ్యయయ్యెను. అయిదవ యవతారమున రక్తదంతి యనుపేరున రాక్షసుని దంతములతో చీల్చెను. ఆరవ యవతారము శాఖాంబరి. ప్రజలు క్షామముచే బాధపడుచుండగా క్షామమునుండి నివారణ మొనర్చెను. ఏడవ యవతారము దుర్గ; దుర్గుడను రాక్షసుని సంహరించెను. ఎనిమిదవ యవతారము మాతంగి (శ్యామల). తొమ్మిదవ యవతారము భ్రమరాంబ యవతారమెత్తెను. ఈ నవరాత్రులలోనే ఈ తొమ్మిది యవతారములుగ పార్వతి యావిర్భవించినందున దేవీ నవరాత్రులుగ వ్యవహారము. ఈ నవరాత్రులందు విశేష పూజలొనర్చు దేవీభక్తులు కుమారీపూజ, సువాసినీ పూజలు కూడ జరుపుదురు.

పూర్వము రాజులు దిగ్విజయ యాత్రకు బయలుదేరుటకు శరదృతువు అనుకూలమైనందున ఈ నవరాత్రులందు దేవీపూజలను సల్పి విజయదశమినాడు "అపరాజితా దేవి"ని పూజించి సాయంకాలము "సీమోల్లంఘనము" నకై పరివారముతో నేగి అచట శమీపూజ నొనర్చు యాచారము కలదు. శమిపూజచేసి ఈ క్రింది శ్లోకములను పఠింతురు.

"శమీ శమయతే పాపం శమీశత్రు వినాశినీ।
అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియవాదినీ।
శమీశమయతే పాపం శమీలోహితకంటకా।
ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియవాదినీ।
కరిష్యమాణ యాత్రాయాం యథాకాలం సుఖంమయా।
తత్ర నిర్విఘ్న కర్త్రీత్వం భవ శ్రీరామపూజితే॥"

అని పఠింతురు. పై శ్లోకములవలన ఈ శమీపూజ రామాయణ కాలమునుండియు ఆచారప్రాప్తమని తెలియగలదు. ఇట్లు రాజులు విజయయాత్రకై నవరాత్రులు పూజలొనర్చి విజయదశమినాడు బయలుదేరుచుండిరని తెలియును. ప్రకృతకాలమున నవరాత్రులలో పూజలకు అవశేషములుగనే బొమ్మల కొలువులు మిగిలినవి. విజయదశమినాడు ఆయాయివృత్తులవారు, వారివారి వృత్తికి ప్రధాన సాధనములను పూజింతురు.

**14-10-56** తేదీ ఆదివారం విజయదశమి.
ఈనవరాత్రులందు మూలానక్షత్రమున పుస్తకరూపిణి యగు సరస్వతిని ఆవాహనచేసి పూజించి శ్రవణ నక్షత్రమందు ఉద్వాసన చేయుదురు.

**10-10-56** తేదీ అశ్వయుజ శుక్ల షష్ఠి బుధవారం మూలా నక్షత్రమున సరస్వతీపూజ.

**13-10-56** తేదీ అశ్వయుజ శుక్ల నవమి శనివారం శ్రవణ నక్షత్రమున సరస్వతీ దేవ్యుద్వాసనము.

**12-10-56** అశ్వయుజ శుక్ల అష్టమీ శుక్రవారం మహాష్టమీ, మహానవమీ రెండును ఒకే రోజున సంభవించుట - శుక్రవారముతో కూడుట విశేషము.

**17-10-56** అశ్వయుజ శుక్ల త్రయోదశీ బుధవారం తులాసంక్రమణము.

**22-10-56** అశ్వయుజ బహుళ తృతీయా సోమవారం చంద్రోదయో మావ్రతం ఈ వ్రతము (అట్లతదియ) అని ఆంధ్రదేశమున వ్యవహరింపబడుచు నూతనముగ వివాహితలగు కన్యలు సౌభాగ్యము కొరకై యాచరింతురు.

**1-11-56** అశ్వయుజ బహుళ చతుర్దశీ గురువారం నరక చతుర్దశీ.

**2-11-56** అశ్వయుజ బహుళ అమావాస్య శుక్రవారం దీపావళీ అమావాస్యా.

**నరకచతుర్దశి**—ఈ దినమందు నరకాసురవధ జరిగెనని తన్నిమిత్తముగ తైలాభ్యంగాదికము లొనర్చి ఉల్కాజ్వాలలను ప్రజ్వలింపజేసి, దీపావళి నొనర్చి అలక్ష్మిని స్సరణము చేయుదురని కొందరి మతము.

ఇట్లే రామపట్టాభిషేక మీ దినమందు జరిగెను గాన తత్ప్రియుక్తముగ నీ యుత్సవములను జేయుదురని కొందరందురు.

గాని పై రెంటికిని యీ నరకచతుర్దశికిని యెట్టి సంబంధమగపడదు. మూడవదియగు బలిచక్రవర్తి వామనునకు రాజ్యదానమును చేయునపుడు మూడవయడుగుచే పాతాళమును కప్పిపుచ్చుటచే అచటి వారికి చీకటియై ఆ చీకటి పోవుటకుగాను ఇట్లు ఉల్కాజ్వాలలచే వెలుతురును చూపెదరని పురాణములందు కలదు. ఇందులకీ క్రింది శ్లోకములుపష్టంభకములు కాగలవు.

"చతుర్దశీదినే రాజ్యం బలేరస్త్వితి యాచయేత్।
పురావామనరూపేణ ప్రార్థయిత్వా ధరామిమాం।
దదావతిథిరింద్రాయ బలిం పాతాళవాసినం।

కృత్వాదైత్యపతిం దద్యాచ మహారాత్రత్రయం హరిః ।
తస్మాత్సహోత్సవం చాత్ర సర్వదైవ హి కారయేత్ ।
మహారాత్రిస్సముత్పన్నా చతుర్దశ్యాం మునీశ్వరాః ॥
..................................
దీపదానాది కార్యేషు గ్రాహ్యామధ్యాహ్నకాలికా ।
తతః ప్రదోషసమయే దీపాన్ దద్యాన్మనోరమాన్ ॥"

అని నుడువుట చేతను, నరకశబ్దమునకు యమలోకమని యర్థమగుటచే తద్విముక్తి కొరకు పితృదేవతల నుద్దేశించి యమతర్పణమును దీపదానమును చేయవలయునని యభిప్రాయము. అలక్ష్మీనిస్సరణమునకై విశేషముగ పటాకాయలు మొదలగు వాటిని అమావాస్య నాడు కాల్చు యాచారము కలదు. ఏది యెట్లున్నను మహాలయ పక్షము తరువాతను, పితృదేవతలకు స్వర్గద్వారమును చూపించెడు ఉల్కాజ్వాలలుగనే యీ దీపావళీ యని యందురు. ఈ నరకచతుర్దశికి "మహారాత్రి" యని కూడ వ్యవహారము కలదు. కృష్ణాష్టమికి మోహరాత్రియని, నరక చతుర్దశికి మహారాత్రియని శివరాత్రికి కాళరాత్రి యని అపరనామములుగలవు. ఈ మూడును దేవీపూజలు చేయువారలకు మహాపర్వములు. ఈ పర్వములందు శ్రీ చక్రార్చన చేయుదురు.

---

# పతిత జనోద్ధరణము

బులుసు - వేంకటరమణయ్య

భక్తులనే కాకుండా పతితులను కూడా ఆదుకొని, వారిపై వాత్సల్యం చూపి, ముక్తిని ప్రసాదించడంలో భగవంతుడు సర్వదా సంసిద్ధుడయి ఉండగలడు. ఎట్టి పతితుడైనా సరే, పవిత్రమైన తన క్షేత్రంలో అడుగు పెట్టినంత మాత్రాన అతని పాపాల నన్నింటినీ నశింపజేసి, మరణించిన మాత్రాన మోక్షాన్ని ప్రసాదించిన సన్నివేశాలు చాలా ఉన్నవి. అట్టివానిలో నిగమశర్మ అనే బ్రాహ్మణబ్రువునకు ముక్తిని ప్రసాదించిన గాథ ఒకటి.

పూర్వం కళింగదేశం గోదావరి వరకూ వ్యాపించి వుండేది. దానికి పీఠికాపురము తిలకాయమానమై ఉండేది. ఆ నగరంలో సభాపతి అనే పేరుగల ఉత్తమబ్రాహ్మణు డొకడు ఉండేవాడు. అతడు వేదశాస్త్రాలు తల్లక్రిందులా కూడా వల్లెవేసి, మహావిద్వాంసులని పేరు పొందిన వారి కుటుంబంలో పుట్టినవాడు. అతడు తేజశ్శాలి; అహితాగ్ని; విద్యలకు నిలయము; కళలకు పుట్టినిల్లు; అతడు అందరి చేతను 'ఔరా;' అని అనిపించుకొని ఉండేవాడు. అతని భార్య అన్నివిధాలా భర్తకు అనుకూలురాలై, అతని మనస్సును గ్రహించి పరిచర్య చేస్తూ ఉండేది.

ఆ దంపతులకు మొదట ఒక పుత్రిక కలిగినది. మగబిడ్డ కోసం తహతహ వారి కెక్కువైనది. సభాపతిభార్య నోములూ, వ్రతాలూచేస్తూ, దేవతలను నేలకు వచ్చేటట్లూ, తమ కులము ప్రతిష్ఠనింగికి ఎక్కేటట్టూచేస్తూ, దేవతలకు తృప్తిని కలిగించి, వారి అనుగ్రహం వల్ల ఒక మగబిడ్డను కనెను. అతనికి తండ్రి 'నిగమశర్మ' అని పేరు పెట్టెను. ఆ పిల్లవాడు తలి దండ్రులకు అల్లారు ముద్దుగా పెరుగుచూ, దినదిన ప్రవర్థమానుడై, విద్యను అభ్యసిస్తూ వుండెను. యుక్తవయస్సు రాగానే అతనికి అందకత్తె అగు ఒక కన్యను తెచ్చి వివాహం కూడా జరిగించారు.

యవ్వనం రాగా, నిగమశర్మ బుద్ధి పెడదారిని పట్టింది. అతని పేరు నేతిబీరకాయ వలె అర్థరహితంగా తయారైనది. తండ్రి రాజపురోహితుడు కావడంవల్ల, ఆ కుటుంబానికి డబ్బును గురించి విచారం వుండేదికాదు. దురభ్యాసాలకు అలవాటుపడడం మూలాన, అతడు తల్లికి తెలిసి కొంతా, తెలియక కొంతా సొమ్ము తీసుకునిపోతూ ఇచ్చవచ్చినట్లు ఖర్చు చేసేవాడు. వేశ్యాలోలుడై సానివాడలలో తిరుగుతూ, తన వంటివారిని కొందరిని వెంట తిప్పుకుంటూ, యింటి పట్టున ఉండక—తనకు ఆకలి అయినప్పుడు—ఏ చద్దికూడో తినడానికి—చుక్కతెగి పడిన విధంగా యింటికి ప్రత్యక్షమయేవాడు. ఇంటిలోని సొమ్ము, వస్తువాహనాలూ పూర్తిగా అయిపోగా—స్థిరాస్తుల మీదికి వురికి, బంగారు పంటలు పండే మాగాణినేలలను కుదువపెట్టి పత్రంవ్రాసి, అందువల్ల వచ్చిన సొమ్ము ఖర్చుచేసేవాడు.

నిగమశర్మ ఖులావున్నా, అతని అక్క గొప్ప తెలివి కలది; నేర్పుకలది; ఆమె నివాసం, పీఠికాపురానికి అయిదారు యోజనముల దూరంలోనే ఉన్నది. ఆమెకు తమ్ముడియొక్క ప్రవర్తన అంతా బాగా అర్థమయినది. ఖ్యాలా వరకూ ఆస్తి నశించినా, నష్టావశేషాన్నయినా భద్రంచేసి, తమ్ముడికి బుద్ధిచెప్పి, మంచి దారికి తేవాలని ఆమె

సంకల్పం. అందుకనే ఆమె భర్తతోనూ, బిడ్డలతోనూ వచ్చి తండ్రి యింటిలోనే కొన్నాళ్లు ఉండినది. ఆమె పుట్టింటికి వచ్చి, తల్లి దండ్రులనూ, మరదలినీ ఊరడించి, వారికి ధైర్యం చెప్పినది. నష్టావశిష్టాలైన భూములను తనపేర వ్రాయించుకుని, ఇంటిని మరమ్మత్తు చేయించి, మంచి మాటలాడి, పరిచారకులను తనపక్షం చేసుకున్నది. ఇలా చేసి, 'తమ్ము డెప్పుడు వస్తాడా?' అని యెదురుచూడ సాగినది. ఒకనాటి ఉదయం నిగమశర్మ - అనుకోకుండానే యింటికి వచ్చాడు. రాగానే మొదటనే ఆమె కనబడినది. చాలదినములయి, ఆమెను చూచుట తటస్థింపక పోవుట వల్ల, చూచి, వెనుకకు పోలేక నిగమశర్మ అక్కకు నమస్కరించెను. ఆమె చిరునవ్వు నవ్వుచు ఎక్కువ అభిమానమును వెల్లడించుచు 'సీమంతపు పెండ్లి కొడుకవు కమ్ము' అని దీవించినది. తర్వాత, అక్కడ వున్నయెడల ఆమె ఏమి నిందించునో యని బెదరి, పోవుటకు యత్నించుచుండగా, అక్క తన ముద్దుకుమారుని తమ్ముని చేతికి అందిచ్చుచు 'నీ ముద్దు మేనల్లుడు నీ దగ్గిరికి వస్తానంటున్నాడు; ఇంద' అనెను. ఆ బాలుడు మేనమామ చంక కెక్కెను. అందువల్ల నిగమశర్మ కదలలేక పోయెను. అప్పుడు అతని సోదరి 'ఏం అంత తొందరపడి వెళ్లిపోతున్నావు; ఉండు. ఈ పూట మీబావగారి పంక్తిని భోజనం చేద్దువుగాని; శాకపాకాలు నిమిషంలో తయారు చేస్తాను' అంటూ ప్రక్కనున్న మరదలికి కన్ను సంజ్ఞ చేసింది. ఆమె - అంటే నిగమశర్మ భార్య చెంబుతో నీళ్లు తెచ్చి భర్త కాళ్లు కడిగి, తన చీరచెరగుతోనే తడి యొత్తినది.

ఆ తర్వాత నిగమశర్మ అక్క తొందరగా పనులుచేస్తూ, తక్కినవాళ్లకు పనులు పురమాయిస్తూ, తమ్ముడికి ఇష్టమైన కూరలనూ, పచ్చళ్లనూ, పిండివంటలతోకూడా అవలీలగా తయారుచేసింది. తర్వాత అతనికి తలంటి నీళ్ళు పోసి, చలువచేసిన వస్త్రం కట్టుకోడానికి ఇచ్చి, జుట్టు తడి ఆర్చి, తలలో పువ్వులు ముడిచి, శరీరానికి గమగమలాడుతున్న మంచి గంధం పూసి, భోజనశాలకు తీసుకువచ్చింది. అక్కడ, తండ్రికీ, తల్లికీ, తనభర్తకూ, పిల్లలకూ వేసిన పంక్తిలోనే నిగమశర్మకు పీటవేసి, తండ్రి యిలవేల్పునకు నివేదించిన భోజనపదార్థాలను వడ్డించినది. ఆదినం వండి, వడ్డించిన పదార్థాలన్నీ నిగమశర్మకు ఇష్టమైనవే కావడం వల్ల అతడు ఎంతో ఆప్యాయంగా భోజనంచేసి, హస్తముఖ ప్రక్షాళనం చేసి, ఆచమనం చేసుకుని తిన్నెమీద కూర్చుని భుక్తాయాసం తీర్చుకొనసాగినాడు. ఇంతలో తన భార్య వచ్చి తమలపాకులమడుపు లందియ్యాగా, అతడు మహాశిష్టుడువలె చిరునవ్వు నవ్వుతూ ఉండెను.

ఇంతలో అతని అక్క భుజించి ఇంటిలోని పనులు చకచకా పూర్తిచేసుకుని, తమ్ముని దగ్గరకువచ్చెను. ఆమె వెంట ఇంతలూ, అంతలూ అయిన ఆమె బిడ్డలందరూ వచ్చి, ఎంతో సందడి చేయసాగినారు. అది చూడడానికి ఎంతో ముచ్చటగా ఉండినది. ఆమె త్వరగా తమ్ముని దగ్గరకువచ్చి తిన్నెకు చేరబడి నిలిచి, తమ్ముని జుట్టు ముడివిప్పి, చాలా దినాలుగా కేశసంస్కారం లేనందున బాగా పేలుపట్టిన అతని జుట్టు పాయలుపాయలుగా తీసి, వెతకివెతకి, పేలనూ, అంటుపేలను, ఈరుపేలను బొడిచి, మెడమన్ను నలిచి, తీసివేసి, తర్వాత జుట్టు ముడివేసి, పద్మాలవంటి తన చేతులను పరిశుభ్రంగా కడుగుకొన్నది. తన మరదలు తాంబూలాన్ని అందించి, విసనకర్రతో విసురుతూ సేవచేస్తూవుండగా, దాసీతెచ్చిన ముక్కాలిపీట మీద ఠీవిగా కూర్చుని, పద్మకర్ణికమీద ఆసీనురాలైన లక్ష్మీదేవిని తలపిస్తూ ఉన్నది.

ఇంతవరకూ సేవచేస్తూ, మాటలాడక ఉన్న ఆమె తన చంటిబిడ్డకు పాలుఇస్తూ తమ్ముడితో ఇట్లు పలుకసాగినది.

'ఏంరా తమ్ముడూ! పొరుగూరిలో ఉన్న అక్కను చూడడానికే నీకు ఏళ్లతరబడి తీరికలేకపోయిందా? ప్రారంభించిన వేదాధ్యయనానికి విఘ్నం కలుగుతుందని రావడం మానివేశావా? ఇన్నాళ్లూ రాకపోవడానికి కారణం యేమిటి? నిన్ను చూడాలని కన్నులు వాచిపోయాయి గదరా! సముద్రం చంద్రోదయానికి ఎదురుచూచినట్లు మీ బావగారుకూడా నీకోసం ఎదురుచూస్తూ ఉండేవారు! అక్కమీదా, బావగారిమీదా, వారి పిల్లలమీదా నీ కెంత అభిమానంవున్నదో దీనివల్లనే తెలుస్తున్నది కదూ! తలిదండ్రులనే క్షోభపెడుతూవున్న నీకు పైవాళ్లమీద అభిమానం ఎలా వుంటుంది? ఉత్తమగుణాలూ, పరిశుద్ధికల తండ్రికి—పాలసముద్రంలో చంద్రుడువలె పుట్టిన కుమారుడు పేరుప్రతిష్ఠలు సంపాదించగలడు. కాని నీవంటి వాడివల్ల వంశగౌరవం ఎలా నిలబడుతుంది? సాలిగ్రామాలుపుట్టే గనిలో రాయిదొరికినట్లు నువ్వెలా మా వంశంలో పుట్టావురా తండ్రీ! నేనా, అత్తవారింటికి పోతిని; నీ తమ్ములా కసిగందులు. వాళ్లా, వయస్సు చెల్లినవాళ్లు. ఇట్టి స్థితిలో నీ విలాగు తయారైతే, ఆ తలిదండ్రుల దినం గడవడ మెలాగో నీవే ఆలోచించు. వంశమర్యాదను లెక్కించక, తలిదండ్రులను లక్ష్యంచెయ్యక, భార్యను గమనించక వుండడం నీకు భావ్యమేనా? నలుగురూ నవ్వేటట్లు తిరగడం మంచిదేనా? తమ్ముడూ!'

అక్క యీ విధంగా నిందించి, అతనికి మనస్సులో కలిగే కోపాన్ని పోగొడుతూ మంచిమాటలు పలుకసాగినది—'తమ్ముడూ! నీకు తెలియని సంగతిలేదు. 'కర్ణుడు

లేని భారతమా?' అన్నట్లు యీ కుటుంబాన్ని కాపాడ డానికి నీకంటె వేరే దిక్కులేదు. 'నా తమ్ముడు చాలా ఉత్తముడు. నీతితో బ్రహ్మదుల తలదన్నినవాడు; అందరూ అతన్ని మెచ్చుకుంటారు. అతడు యాగంచేసి, నన్ను గౌరవించగా నేను వేదికను అలంకరిస్తూవుంటా న'ని నేను అందరితోనూ చెప్పుకుంటూ పొంగిపోతున్నాను. నువ్విలా అగుదువని ఎన్నడూ అనుకోలేదు. నా గౌర వాన్నిక ఎలా నిలుపుకోగలనో బోధపడడంలేదు. నువ్వు బోగంవాళ్ల మాయలకు లొంగిపోయి, ఇల్లూ, వళ్లూ గుల్ల చేసుకోవడం న్యాయమేనా? వాళ్లకోసం వ్యయంచెయ్య డానికి పూనుకుని నెగ్గగలమా? రాజులూ, భూస్వాములూ కూడా తాళుకోలేరు కదా! ఇకమీదనైనా అట్టి తిరుగుడులు తిరగడం మానివెయ్యి. నీకేం కావాలో నాతో చెప్పు. విష్ణు దేవుని కౌస్తుభమును తెమ్మనిననూ తెచ్చియిస్తాను. కాని చెడుప్రవర్తనను మాత్రం ఎంతమాత్రం తలపెట్టబోకుము' అని ఆమె మెల్లగా బోధించినది.

అక్క యీ రీతిగా బోధించగా నిగమశర్మ మారు మాటాడక తలవంచుకుని ఊరుకున్నాడు. అందువల్ల, అతడు తన తప్పులను తెలుసుకున్నాడనీ, యికమీద బుద్ధిగావుంటాడనీ అతని అక్కకు నమ్మిక కలిగినది. చాలా దినాలనుంచీ సరియైన భోజనంలేక చిక్కులు పడుతూ ఉన్నందువల్ల నిగమశర్మకూడా కొంతకాలం యింటిపట్టునవుండడానికి నిశ్చయించాడు. నక్క విన యాలు చూపి, అందరికీ నమ్మకం కలిగేటట్లు ప్రవర్తించే టట్లు బయటికి నటించాడు; మనస్సులో ఏమీ మార్పు కలుగకపోయినా అందుకోసమని అతడు దివాణానికి రాక పోకలు సాగించేవాడు. పుస్తకాల చెదలుదులిపి, చదవడం ప్రారంభించాడు. భార్యను అభిమానంగా చూస్తూ, బావ గారితో హాస్యాలాడుతూ, తలిదండ్రుల సేవచేస్తూ, అక్క మాటలు జవదాటకుండా ఉండేవాడు. వెనకటి మిత్రు లెవరైనా దారిలో తారసిల్లినయెడల వాళ్లవైపయినా చూడ కుండా తలవంచుకుని వెళ్లిపోయ్యేవాడు. ఇలా, చాలా బుద్ధిమంతుడుగా నటించి, కొన్నిదినాలు గడిచాక—ఒక రాత్రి అందరూ నిద్రపోతూఉన్న సమయంలో-వారందరి నగలూ తీసుకుని, యింటిలోని డబ్బూ దస్కమూ మూట కట్టి రాత్రికిరాత్రి ఇంటినీ, ఊరినీ విడిచి అడవిదారిని పోసాగినాడు. ఆ సమయాన ఆ అడవిలో తిరుగుతూఉన్న ఒక దొంగల గుంపు అతన్ని అడ్డగించి, చావమోది, అతని దగ్గరఉన్న సొమ్మంతా తస్కరించుకొని వెళ్లిపోయింది. నిగమశర్మకు చాలా బలమైన గాయాలు తగిలి, వచ్చే ప్రాణం, పోయేప్రాణంతో స్మృతితప్పి పడిపోయాడు. తెల్ల వారిన తర్వాత ఆ దారిని వస్తున్న కర్షకుడొకడు యితని అవస్థచూచి, జాలిపడి, తన యింటికి తీసుకొనిపోయి, గాయాలకు కట్లుకట్టించి, పథ్యపానాలు సక్రమంగా జరిగే టట్టు ఏర్పాటుచేసి, మందులూ, మాకులూ యిప్పించి, కొద్దికాలంలోనే సంపూర్ణంగా ఆరోగ్యం కలిగేటట్లుచేశాడు. నిగమశర్మ అతనికి కృతజ్ఞత తెలుపుతూ, ఆ యింట్లోవుండే మనుష్యులలో తాను ఒకడుగా—భేదం ఏమాత్రంలేకుండా తిరిగేవాడు. ఇతనిమీద గృహయజమానికి చాలా నమ్మ కమూ ఏర్పడినది.

ఆకర్షకుని యింట్లో ఒక అందకత్తె అయిన పడుచు - అతని కోడలు వుండేది. నిగమశర్మ చదువుకున్న వాడూ, అందకాడూ, యువతులను సులభంగా లొంగ తీసుకునే వాడూ కావడంవల్ల - ఆమె సులభంగా యితనికి లొంగి పోయింది. ఇతని ప్రేమకోసం కొన్నాళ్ల నుంచీ ఆమె కాచు కుని వున్నది కూడా. వీరిద్దరూ తమ దుష్ప్రవర్తన బయట పడకుండా కాలం గడుపుతూ, ఎప్పుడైనా చిక్కురాక తప్ప దనీ, అది రావడానికి ముందే తప్పించుకొని పారిపోవడం సర్వవిధాలా శ్రేయస్కరమనీ, దానికి తగిన సమయం కోసం ఎదురుచూస్తూ ఉన్నారు; తగిన అదను కూడా కొద్ది కాలంలోనే చిక్కింది. ఆ వూరి గ్రామదేవత జాతర వచ్చింది. అది గ్రామస్థు లందరికీ - ఆడా, మగా భేదం లేకుండా—ఉత్సాహదినం. గొప్ప పర్వం! ఆ దినం గ్రామంలో అందరూ విందు లారగించి, ఉత్సవాలుచేసి, అలసిపోయి, తప్పత్రాగి గాఢ నిద్రలో మునిగివున్న సమయం కనిపెట్టి నిగమశర్మ, ఆకర్షకుని కోడలితో కూడ బయలుదేరి దేశాంతరం పోయి, ఒక అడవిలో నివాసం ఏర్పరచుకుని, అక్కడి బోయల్లో కలిసిపోయాడు సులభంగా మద్య మాంసాలను అలవాటు చేసుకున్నాడు మృగాలనూ, పక్షులనూ వేటాడడంలో నేర్పు సంపాదించి వేటనే తన జీవనోపాధిగా గ్రహించాడు.

కొంతకాలం గడచింది. ఇంతలో, తనతో లేచివచ్చిన యువతి మరణించింది. తర్వాత యితడు - కారు నలుపు కల్గి పగలుచూస్తే రాత్రి కలలోకి రాదగి, చాలా వికారంగా ఉన్న ఒక చండాల యువతిని పరిగ్రహించాడు. ఇతన్ని ఆశ్రయించక పూర్వం అది పడుపువృత్తిని అవలంబించి జీవించేది. అయినా—నిగమశర్మ ఏవగించుకోకుండా - ఆమె తనపాలిటి రంభ అని భావించేవాడు. ఆమెయే తన జీవిత సర్వస్వం అనేగట్టి నమ్మకం అతనికి కలిగింది. ఆమె వలన అతనికి కొందరు బిడ్డలు కూడా కలిగారు.

ఒకనాడు వాడుకప్రకారం అతడు అడవికి వేటకు వెళ్లి, లెక్కలేని మృగాలనూ, పక్షులనూ చంపి, వాని మాంసం కావడిలో ఉంచి, యింటికి మోసుకుని వచ్చేసరికి యిల్లు కాలిపోయి ఉంది; దావాగ్నివల్ల అతని యిల్లూ దెబ్బతిని

పూర్తిగా భస్మమైపోయింది. అతని యువతి యొక్కయూ, బిడ్డల యొక్కయూ మృతదేహాలు - సగంపైగా కాలి, అతనికి తీరని దుఃఖాన్ని కలిగించాయి. రాత్రింబగళ్లు నిద్రాహారాలు విడిచి, అతడు మతితప్పి దేశాలు తిరగడం ప్రారంభించాడు. ఇలా తిరుగుతూ, తిరుగుతూ అతడు కొన్నాళ్లకు పండరి పురంలోని శ్రీ నృసింహక్షేత్రంలో అడుగు పెట్టి, అక్కడి సంగమతీర్థంలో స్నానమాడి, ఆ దేవదేవుని దర్శనం చేసుకున్నాడు. తర్వాత ఆక్షేత్రపు ఆవరణలోనే ప్రాణాలు విడిచాడు.

అతడు మరణింపగానే, అతని జీవుణ్ణిబంధించి యమ భటులు చిత్రవిచిత్రంగా హింసింపసాగారు. ఆ బాధలను పడలేక నిగమశర్మ గట్టిగా ఆక్రందనం చేశాడు. అప్పుడు ఆక్షేత్రంలో రక్షార్థంగా ప్రతిష్ఠ చెయ్యబడిన సుదర్శనా యుధం వెంటనే విజృంభించి నిగమశర్మ బంధాలను ఖండించి, అతన్ని విడిపించెను. ఆ చక్రాయుధాన్ని చూచి యమభటు లంతా గడగడ లాడిపోయినారు. వెంటనే సుదర్శనాద్యాయుధాలతో పెక్కుమంది విష్ణుదూతలు వచ్చి, నిగమశర్మకు సేవచేస్తూ, అతని యమపట్నపు దారిని తప్పించి, శ్వేతద్వీప మార్గాన్ని పట్టించారు. అతడు వైకుంఠానికి వెళ్లి కుముదుడనే పేరుతో భగవంతునికి ముఖ్యాను చరుడుగా అయినాడు.

ఈ రీతిని నిగమశర్మ పెక్కు దుష్కార్యాలు చేసి, పతితుడైనా, నృసింహ స్వామిని దర్శించి, అతని క్షేత్రంలో జీవములు విడిచి వెంటనే ముక్తుడైనాడు. ఇట్లు క్షేత్రంలో అడుగు పెట్టడం గొప్పవిశేషం! ఆ క్షేత్రంలో ఉండి, దేహము చాలించడం అంతకన్నా విశేషము!

---

# దేవాలయములు - ఉత్సవములు

*పండిత పార్థసారథి భట్టాచార్య*

సహజముగ దేవాలయములలో శాస్త్రప్రకారము జరుగ వలసి నట్టియు జరుగుచున్నట్టియు ఉత్సవములను గురించి ఈ వ్యాసమునందు వివరించుటకు యత్నించెదను. ఇందలి వివరములు ఎక్కువగ వైఖాన సంహితలనుండి సంగ్రహింపబడి వైఖాన సాలయములకు సంబంధించినవై యున్నవి. ఇతర ఆలయములలోని ఉత్సవములకుకూడ ఈ విధానము చాలవరకు అనుబంధించి యుండగలదు. అట్లు అవాంతర భేదములు కల చోటులందు ఆ వివరము కూడ సాధ్యమైనంతవరకు తెలియజేయబడగలదు.

వేదములందు విధియింపబడిన యజ్ఞములు అమూర్త యజనములు సమూర్త యజనములని రెండు తరగతు లుగ విభజింప బడుచున్నవను సంశమును ముందుగా పాఠకులు జ్ఞాపకముంచుకొనవలసి యున్నది. అమూర్త యజనములనిన భగవానుని యజ్ఞపురుషునిగ భావించి మన్త్రపూర్వకముగ నాయజ్ఞపురుషు నుద్దేశించి హవిస్సమర్ప ణము జేయుట యగును.

'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాఽగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవతేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా'
' కర్తా క్రియాణాం సనఇజ్యతే క్రతుః
సఏవ యత్కర్మఫలం చయచ్ఛ
స్రుగాది యత్సాధన మప్యశేషం
హరేః నకించిద్వ్యతిరిక్తమస్తి'

అను మొదలగు ప్రమాణము లీ విషయమును చెప్పు చున్నవి.

ఇక సమూర్త యజనమనిన నిర్గుణుడును నిష్కలుడు నగు పరమ పురుషుని శిలాలోహాది నిర్మితములగు విగ్రహ ములందు ప్రతిష్ఠించి ఆ విగ్రహములను అర్ఘ్యపాద్యాదులచే పూజించుట యగును. ఈ రెండు ప్రకారములును ఒకే ఉద్దేశముతో ఒకేఫలము నుద్దేశించి ఆచరింప దగినవని ఆగమ శాస్త్రముల సారము. అమూర్త యజనానుష్ఠానము చేయువారలు తాము నిత్యము సాయంప్రాతఃకాలములందు అగ్ని పరిచర్య చేయుటతోపాటుగ ఆయా విశేష దినము లగు శుక్ల కృష్ణ పక్షములందలి పర్వకాలములందు దర్శ పూర్ణమాసాది ఇష్టులను అష్టమి మొదలగు దినములందు అష్టకాశ్రాద్ధాదులు ఆయా ఋతువులందు ఆగ్రయణాదులు సంవత్సరమున కొకసారి సోమయాగము చేయవలయు నని విధింపబడినది. ఇవన్నియు సకాలములందు యథా విహితముగ చేయబడి నప్పుడే ఉత్తమమగు అగ్నిహోత్ర కార్యము సక్రమముగా జరుపబడినదై తదుక్త ఫలము నిచ్చుచున్నది. అట్లే సమూర్త యజనమని చెప్పబడిన

విగ్రహపూజయందుకూడ నిత్యారాధనము జరుపబడుటతో పాటు అయా విహితకాలములందు అనుష్ఠింపదగిన విశేష పూజను ఉత్సవములను పేరుతో ఆగమశాస్త్రములు విదించుచున్నవి.

'ఉత్సవ' శబ్దమునకు లోకవ్యవహారమునందుకల అర్థమునకును శాస్త్రమందు కల అర్థమునకును సూక్ష్మేక్షికతో పరామర్శించి చూచినప్పుడు కొంచెము భేదము కానవచ్చుచున్నది. నిఘంటు కారుల నిర్వచనమున మనకీ భేదము తెలియదగును. అమరసింహుడు 'క్షణ ఉద్ధర్షో మహఉద్ధవ ఉత్సవః' అని సంతోష శబ్ద పర్యాయములుగ పై ఐదు శబ్దములను పఠించియున్నాడు. ప్రేరణార్థకమగు షూఙ్' ధాతువు వలన 'ఉత్' అను నుపసర్గము చేరగా ఉత్సవ శబ్దము పుట్టినది. 'ఉత్' అను నుపసర్గమునకు అధికమను నర్థము చెప్పుకొనగా 'ఉత్-అతిశయేన-సూతే-సంతోషమును కలిగింప చేయునట్టిది కాగా (అట్టి సమయము, అవసరము, నిమిత్తము) ఉత్సవమని చెప్పబడునను లోక వ్యుత్పత్తి కలదు. అట్లే శ్రీరామచంద్రుని పట్టాభిషేక శుభ సమయమును అనుభవించిన అయోధ్యానగర నివాసులలో అతిశయితమగు ఉత్సాహము కలిగిన సందర్భమును చెప్పుటలో 'ఉత్సవశ్చ మహానాసీదయోధ్యాయాం జనాకులః' అని ఉత్సవశబ్దమును సంతోషార్థకముగ వల్మీక సంభవుడు వ్యవహరించెను. ఇట్లే 'సవిస్మయోత్ఫుల్లవిలోచనోహరిం సుతం విలోక్యానకదుందుభిస్తథా। కృష్ణావతారోత్సవ సంభ్రమోఽస్పృశన్ముదా ద్విజేభ్యోఽయుతమాప్లుతోగవామ్' అని శ్రీకృష్ణావతారమును వినిన వసుదేవునకు కలిగిన సంతోషమును ఉత్సవమని శుకబ్రహ్మర్షి చెప్పుట చూడ నగును. మనలోకూడ 'ఉపనయన మహోత్సవము' 'వివాహ మహోత్సవము' అను పదములను ఉపనయనాది శుభసమయములందు బంధువుల నాహ్వానించెడి శుభ పత్రికలందు వ్రాసికొనుట ఆచారమై యొప్పినది. ఇట్లే ఉత్సవశబ్ద పర్యాయములుగ ననుశాసనమునగల క్షణ ఉద్ధర్ష మహ ఉద్ధవ శబ్దములందలి ధాత్వర్థములను పరామర్శించినప్పుడు కూడ ఉత్సవ శబ్దార్థము పైశబ్దములతో సమానార్థకమగుటకై పూర్వోక్తరీతిని వ్యాఖ్యానించుట యందౌచిత్యము కలదు.

ఇట్టియెడ వైఖానస శాస్త్రసంహితలందు 'ఉత్సవ' శబ్దమునకు పారిభాషికమగు నర్థాంతరముకూడ చెప్పబడినది. ఈ శాస్త్రమందు చేయబడిన వ్యుత్పత్తి ఇట్లున్నది. 'యజ్ఞః సవోఽధ్వరో యాగః సప్తతంతుర్మఖః క్రతుః' అను కోశము ననుసరించి యజ్ఞ శబ్ద పర్యాయముగ 'సవ'శబ్దము కలదు. సవమనగా యజ్ఞము. ఈ సవశబ్దమునకు మూలమైనది అభిషవార్థకమైన 'షుఞ్' ధాతువు; అభిషవమనగా (సోమలతను) రసము తీయుట అని యర్థము. సోమ యాగమునందు ప్రధానమైన కార్యము సోమాభిషవముతో సంబంధించియున్నది. 'సోమః' (సోమలత) 'సూయతే' (ఈ యాగమందు) పిండబడుచున్నది గనుక సోమయాగమునకు సవమనుపేరు కలిగినది. అవయవశక్తిచే సోమయాగమందు శక్తమైన ఈ 'సవ' శబ్దము సోమములేని ఇతర యాగములందుకూడ వాడబడుట కలదు. కాని అది ముఖ్యార్థము కాదు. ఇట్లు యాగార్థకమైన సవశబ్దమునకు ఉత్కృష్టార్థకమగు 'ఉత్' శబ్దముతో సమీపము యేర్పడగా 'ఉత్సవ' శబ్దము వ్యుత్పన్నమైనట్లు వైఖానస సంహితలలో కలదు. కాగా ఉత్సవ శబ్దమునకు గొప్పదగు యజ్ఞమను నర్థము సిద్ధించుచున్నది.

అమూర్తయజనమునందు సంవత్సరమున కొకసారి సోమయాగము (సవము) విధించబడినది. అట్లే సమూర్త యజనమునందును సంవత్సరమునకొకసారి 'ఉత్సవము' విధింపబడియున్నది. 'సవము'వలె 'ఉత్సవము' కూడ నిత్యము. మొదటి 'సవము' అయినప్పుడు రెండవది 'ఉత్సవము' అగుటకు కల కారణములను కొంతవఱకు విస్తరించి తెలిసికొనుట అప్రస్తుతము కాకపోవచ్చును. సోమ యాగమందు అవభృథ స్నానముచేత యజమానునకు పాప నివృత్తి చెప్పబడినది. ఆలయములందు ఉత్సవాంతమునందు చేయబడెడి అవభృథ స్నానసమయము సోమమునందువలె యజమానునకు మాత్రమే నియతముకాక సకల భక్తజన సాధారణమై ఉత్సవములను సేవించి తీర్థ స్నానముచేసెడి అందఱకును ఫలప్రదము కాగలదని చెప్పబడినది. ఈ ఉత్సవ యజ్ఞమందు పశ్వాలంభనాది కార్యములు లేవు. యజ్ఞమునందువలె కఠినములైన వ్రత నియమాదులు లేవు. అల్పమగు ప్రయత్నముచే సమూహ నిష్ఠమై గొప్పదగు ఫలము కలుగుటవలన మొదటి 'సవము' కాగా రెండవది 'ఉత్సవము' అగుటలో ఔచితి కలదు. ఇంకను సోమయాగ ప్రక్రియను అక్షరావచ్ఛేదముగ పరిశీలించినప్పుడు ప్రయోగమందు సవ-ఉత్సవ ములకు కల సామ్యము కనుగొనవచ్చును. అంతటి అవలోడనము ఈ చిన్న వ్యాసమందు అనవసరమని విడచితిని.

'సవము'నకు అవభృథము ముఖ్యమైన కార్యమైనట్లు 'ఉత్సవము'నకుకూడ అవభృథ కర్మయే ముఖ్యమైనది. 'సవము' వలెనే 'ఉత్సవము' కూడ బహుదిన నిర్వర్త్యము కూడ అగుచున్నది. 'సవము'వలె 'ఉత్సవము' అవభృథ కర్మచే సమాప్తిని చెందును. ఉత్సవమును చేయదలచిన యజమానుడు ముందుగా తాను ఎన్ని దినముల అవధితో సంకల్పించి ఉత్సవమును జరిపించుటకు శక్తి కల వాడగునో నిర్ణయించికొని ఆ దినములలో కడపటి రోజును

అవభృద దినముగా చేసికొని అవభృథమునకు పూర్వము నందు దినములను లెక్కించుకొని ఉత్సవారంభమును సంకల్పించవలెను. అవభృద దిన నిర్ణయమునకు కూడ నియమములు చెప్పబడినవి.

(ద్వాదశమాసేషు ఏకస్మిన్ మాసే అబ్దం ప్రతి తత్కాలే నిత్యం సంకల్ప్యయః క్రియతే స నిత్యోత్సవః....నవాహం సప్తాహం పంచాహం వాఽప్యుత్సవః రాజ్ఞోరాష్ట్రస్య గ్రామస్య యజమానస్య వా జన్మర్క్షే ప్రతిష్ఠాదినే విష్ణువం చదినేషు మాసనక్షత్రే విషువే అయనేవా అవభృథం సంకల్ప్య తత్పూర్వే చ ఉత్సవదినం నిశ్చిత్య (మరీచి ౫౧ పటలము.)

ఉత్సవాంత దినముగ చెప్పబడిన అవభృథ దినమును నిర్ణయించుటలో ఈ దిగువ నియమములు పాటింప దగును. ఆ దేశాధిపతియగు రాజుయొక్కగాని రాష్ట్రము యొక్కగాని దేవాలయపు యజమానునియొక్కగాని జన్మ నక్షత్రమున నవభృథము చేయవలెను. లేదా ఆ దేవుడు ఆదియందు ప్రతిష్ఠింపబడిన నక్షత్రమైనను కావచ్చును. లేదా ఆ దేవుడు స్వయం వ్యక్తమైనచో అట్లు వెలసిన నక్షత్రమైనను కావచ్చును. లేదా ఏ మాసమం దుత్సవము జరుగునో సౌరమాసరీతిని ఆమాస నక్షత్రమైనను కావచ్చును. లేక విష్ణు పంచదినములు అనగా ఆయా చాంద్రమానము లందు సంభవించెడి అమావాస్య పూర్ణిమ యనదగు రెండు పర్వములు శుక్లద్వాదశి కృష్ణద్వాదశి శ్రవణనక్షత్రము ఈ యైదు దినములలోగాని కావచ్చును. 'విషువ' మనగా సంవత్సరమున నహోరాత్రి పరిమాణము ఏకరీతిగా కలిగెడి రెండు దినములు ('సమరాత్రిందివే కాలేవిషువద్విషువం చతత్') కావచ్చును. అయనమనిన కటక సంక్రమణము మకర సంక్రమణములనాటి పుణ్యదినములు వీనియందు కావచ్చును. వీనిలో కొన్ని నిమిత్తములు నక్షత్ర ప్రధానములుగను కొన్ని తిథి ప్రధానములుగను సంభవించుచున్నవి. ఈ కారణముచేత అరవ దేశమందు అవభృథము నక్షత్ర ప్రధానముగను ఆంధ్రపరిసరములందు తిథి ప్రధానముగను అవభృథము ఆచరింపబడుచున్నది. నక్షత్రప్రధానముగ ననుష్ఠించుటలో సూక్ష్మముగ పరామర్శించదగిన విషయములు కలవు. నక్షత్రప్రధానముగ ఆచరించెడి తమిళులు మేషాది సూర్య సంక్రమణ రీతిని మాస వ్యవస్థను అనుసరింతురు. కాగా నక్షత్రములు ఇఱువదియేడు అగుటచే ఒక సౌరమానమున ఒకే నక్షత్రము రెండుసారులు వచ్చుటకు అవకాశమున్నది. (సౌరమానము అందు యిరువది యెనిమిది దినములు మొదలు ముప్పది రెండు దినములుకూడ ఆయా మాసములందు వచ్చుట కలదు) అట్లు ఒకే నక్షత్రము ఒక మాసమందు రెండు సారులు సంభవించినయెడల ఆ మాసమందు రెండవ పర్యాయము అనగా మాసాంతమునందు సంభవించెడి ఉక్త నక్షత్రమందే అవభృథము నిర్ణయించి ఉత్సవారంభము చేయునగును. ఉక్తనక్షత్రము ఖండితమై అనగా పూర్వోత్తరములందు రెండు దినములు వ్యాపించియున్నప్పుడు రెండవ దినమున అట్టి నక్షత్రము పండ్రెండు గడియలవరకు వ్యాప్తి కలిగియున్నప్పుడా రెండవనాడు ఉత్సవాంతమును నిర్ణయించవలెను. పండ్రెండు గడియలకు తక్కువ వ్యాప్తి కల్గినచో పూర్వదినమునే అవభృథ దినముగ చేయవలెను. అట్లు రెండవసారి అనగా మాసాంతమందు వచ్చెడి నక్షత్రమునకు గ్రహణసంక్రమాది దోష స్పర్శము కలిగినయెడల మొదటిసారి వచ్చెడి నక్షత్రమునే ప్రధానముగ దీసికొనవలెను. రెండింటికి దోషము కల్గినచో రెండవదానిని తీసికొనవలెను. ఇట్టి ధర్మ సూక్ష్మములు చాల కలవుగాని వాని పరామర్శము ఇచ్చట అప్రస్తుతమని తలచెదను. తిథి ప్రధానముగ ఆచరించెడి చోటులందింతటి సంకటములు లేకపోయినను ఉభయ సాధారణమగు కొన్ని చిక్కులు లేకపోలేదు. ఇట్టి ప్రధానములగు శాస్త్ర నిర్ణయములను శ్రద్ధగా పరామర్శించెడి సంప్రదాయము ఆలయములందు జరుగుచున్న అనేక అతిక్రమములతోపాటు చాలకాలము క్రిందటనే మన ఆంధ్రమండలములో విశేషించి అధికారుల దృష్టినాకర్షించుట లేదు.

ఇట్లు సంవత్సరమునకొకసారి చేయబడవలసిన ఈ యుత్సవమును 'నిత్యోత్సవము' అని శాస్త్రములు వ్యవహరించినవి. నిత్య శబ్దార్థముకూడ పారిభాషికముగ విశేషార్థము కలిగియున్నది. ఉదాహరణమునకు ద్విజులకు ప్రతిదినము త్రికాలములందు అనుష్ఠించదగిన 'సంధ్యావందనము' నిత్యమనబడినది. నిత్యమగు సంధ్యావందనము నాచరించుటవలన కలిగెడి ప్రత్యేక ఫలము ఏదియు లేదు. దాని నాచరించుట స్వయంప్రయోజనము. చేయక విడువరాదు. విడచినంతట ప్రత్యవాయము విధింపబడినది. అట్టి ప్రత్యవాయము రాకుండ రక్షించుకొనుటయే పరమప్రయోజనము. కాగా సంధ్యావందనము చేసినవానికి సంధ్యావందనము చేయనిచో కలిగెడి పాపము రాకుండుటయే ప్రయోజనమై పర్యవసించును. కాగా సంధ్యావందన మవశ్యాచరణీయమై నిత్యమైనది. ఇట్లే అమూర్త యజనముచేయు నాహితాగ్నికి సోమయాగము నిత్యము. ఇట్లే ఆలయపూజకు సంవత్సరోత్సవము నిత్యము. తప్పక ఈ సంవత్సరోత్సవము ప్రతి గుడియందును చేసితీరదగినది. చేయనియెడల దోషము సంభవించును. దీనిచే ఈ సంవత్సరోత్సవమునకు 'నిత్యోత్సవము' అని వ్యవహారము కలిగియున్నది.

ఆంధ్రభూమిలో ఈ యుత్సవముల నాచరించుటలో ఆలయాధికారులు ఇతోధికముగ శాస్త్రములందు లక్ష్యతా బుద్ధిని పెంపొందించికొనుట అత్యంత మావశ్యకమై యున్నది. కొన్ని ఆలయములందు ద్రవ్యలోపముచేతను శ్రద్ధాలోపముచేతను ఏనాడోగాని ఈ యుత్సవములు జరుపబడుటలేదు. జరిగెడి చోటులందును చాలా చోటులందును అయా సందర్భముల ననుసరించి వాతావరణముననుసరించి ఒక కాల నియతిగాని దినసంఖ్యా నియతిగాని లేక స్వైరముగ జరిపించుటయు జరుగుచుండుట తటస్థించుచున్నది. ఈ యుత్సవములను జరుపుట కేవలము ప్రత్యక్ష దృష్టములగు వేడుకల కొఱకై యేర్పడియుండలేదు. కాని దేశముల ననుసరించి ద్రవ్యసంపత్తి పరిశీలించదగిన విషయమనుటలో సందేహములేదు. ఈ యుత్సవములు జరిగెడి ప్రదేశములలో ప్రాచీనాచారము ననుసరించి జరిగెడి నియతకాలమందు నియత దినసంఖ్యా నియమముతో ఒకే పద్ధతితో వైదిక కార్యకలాపములలో విచ్ఛేదము లేకుండ ఉత్సవములు జరుగునట్లు అధికారులు విశేష శ్రద్ధను తీసికొనవలెను. ఇదివరకు జరుగకుండిన చోటులందుకూడ యథా శక్తిగ ఈ యుత్సవముల నారంభించవలెను. విభవము చాలని చోటులలో భక్తులిందుకై శ్రద్ధ తీసికొనవలెను. దైవికముగ ఈ యుత్సవములు సకాలమున జరుగుటకు ఆటంకము కలిగినప్పుడు తిరిగి ఆయాటంకము తీరినప్పుడు ఏమి చేయవలయునని ఆగమజ్ఞులను సంప్రతించి వారి సలహాప్రకారము అవకాశము కలిగినప్పుడు విడచిపోయిన ఉత్సవములను మఱల చేయవలెను. ఇందునుగుఱించి ఎట్టి ఏమరుపాటు చూపరాదు.

ఈ నిత్యోత్సవమునకే కాలోత్సవమని నామాంతరముకూడ కలదు. కాలోత్సవము అనగా సంవత్సరమున ఏదొక నియమితమగు కాలమందు నియతముగా చేయబడునదని యర్థము. ఆ ఉక్తకాలము నతిక్రమించక తప్పక జరిపి తీరవలసినట్టిదని పూర్వోక్తార్థమునే ఈ శబ్ద వ్యవహారము బలపఱచుచున్నది.

శాస్త్రములందు దీనికి 'మహోత్సవము' అనికూడ వ్యవహారము కలదు. మహచ్ఛబ్దము బ్రహ్మశబ్ద పర్యాయము కాగలదు. దీనినే బ్రహ్మోత్సవమని వ్యవహరించుటను గురించి ముందు వివరింపబడును.

కాలోత్సవము, నిత్యోత్సవము వలెనే ఈ యుత్సవమునకు ఆంధ్రదేశమున 'కల్యాణోత్సవము' అనికూడ ప్రసిద్ధి ప్రాచుర్యము కలదు. దీనినే 'బ్రహ్మోత్సవము' అని దక్షిణాపథమందు వ్యవహరింతురు. ఈ యుత్సవ దినములలో ఒక నియమిత దినమున శ్రీ స్వామి వార్లకు అమ్మవార్లతో పాణిగ్రహణము జరిగెడి లౌకిక కార్యకలాపము జరుగుచుండుటచే ఉత్సవములో ఈ వివాహ ప్రక్రియను ప్రధానముగ జేసికొని ఉత్సవమున కంతకును సమష్టిగ 'కల్యాణోత్సవము' అని పెద్దలు పేరిడి యుండవచ్చును. 'కల్యాణ' శబ్దము వివాహశబ్ద పర్యాయముగ లోకవ్యవహారముకలదు కదా! ఈ కల్యాణోత్సవ వ్యవహారము (నిత్యోత్సవమునకు) దక్షిణ దేశమందు లేదు. ఈ యుత్సవములో వివాహ ప్రక్రియకూడ ఆదేశమందలి ఉత్సవ క్రమానుసరణియందు కానరాదు.

దీనికే బ్రహ్మోత్సవమని వ్యవహారము కలదని చెప్పి యుంటిని. 'బృహి' ధాతువుపైన వ్యుత్పన్నమగు బ్రహ్మ శబ్దమునకు గొప్పయని అర్థము చెప్పవచ్చును. కాగా బ్రహ్మోత్సవమనగా గొప్ప ఉత్సవమని చెప్పదగును. కాని ఇట్లు చెప్పుటకు ఆధారము కేవల యుక్తియేగాని శాస్త్ర నిర్వచనము కనుబడదు. తిరుపతి దివ్యక్షేత్రమందు తొలుదొలుత శ్రీ శ్రీనివాస మహాప్రభువు అర్చామూర్తియై యవతరించి బ్రహ్మాదులకు ప్రత్యక్షమైనప్పుడు చతుర్ముఖుడు భగవానుని యాజ్ఞనుపొంది భగవత్సేవలభ్యమునకు ముగ్ధుడై స్వరూప ప్రాప్తమగు కైంకర్యములను యథాశక్తిగ చేయదలచి శ్రీ వైఖానసభగవచ్ఛాస్త్రరీతి ననుసరించి ఉత్సవమును స్వయముగా నిర్వర్తించెను. అందుచేత అచ్చట ప్రప్రదముగా జరుపబడిన ఈ యుత్సవమునకు బ్రహ్మపేరిట 'బ్రహ్మోత్సవము' అని నామకరణము చేయబడి నాటనుండి అవిచ్ఛిన్నముగ జరుపబడుటకు శ్రీ వెంకటాచల మాహాత్మ్య బోధక ములగు పురాణములు చెప్పుచున్నవి. ఇదియు ఉచితమే. అట్లే శ్రీ వారి అష్టోత్తర శతనామములలో 'బ్రహ్మక్లృప్తోత్సవాయ' అను నొక పేరు కూడ పఠియింప బడుచున్నది.

నిత్యోత్సవము కాక దీనితోపాటు శ్రద్ధోత్సవము, నిమిత్తోత్సవమునని రెండు తరగతులగు నుత్సవములు కూడ ఆలయములందు విహితములై యున్నవి. 'కాల శ్రద్ధా నిమిత్తాఖ్యా ఉత్సవాః త్రివిధాః' అని భృగువచన మీ విధమును చెప్పుచున్నది. శ్రద్ధోత్సవమనిన ఆయా భక్తులు ఏదైన మ్రొక్కుబడులు చెప్పుకొని వానిని తీర్చుటకై శ్రద్ధా భక్తులతో జరిపించునట్టివి. వీనికికూడ యథోచితముగ పై విధమగు శుభదినములను నిర్ణయించికొనవచ్చును నిమిత్తోత్సవమనగా గ్రహణము సంక్రమణము అనావృష్టి ఉత్పాతాదులను నిమిత్తములు కలిగినప్పు డాచరించునది దీనికి నిమిత్త దర్శనమే కాలనిర్ణయమును చేయగలదు శ్రద్ధానిమిత్తోత్సవముల ప్రక్రియలను వేఱుగ వివరించెదము

ఈ కాలోత్సవము క్రమముగా ముప్పది, ఇరువదియైదు ఇరువది యొకటి దినముల కాలము చేయబడినప్పుడ ఉత్తమోత్తమ ఉత్తమమధ్యమ ఉత్తమాధమ మ

యనబడుననియు, పదునైదు, పంద్రెండు, తొమ్మిది దిన ములు చేయబడినప్పుడు మధ్యమోత్తమము మధ్యమ మధ్యమము, మధ్యమాచమము అనబడుననియు ఏడు, ఐదు, మూడు లేక ఒక దినము చేయబడినప్పుడు అధ మోత్తమ అదమమధ్యమ అధమాధమముగ చెప్పబడు ననియు కాశ్యపునిమతము.

భృగువు ఈ యుత్సవమును విస్తరించి పదునొకండుగ విభజించి ఆ పదునొకండు విధములను శాన్తికమాదియగు ఐదు ప్రకరణములక్రింద పరిగణించియున్నాడు. ఆ పదు నొకండు విధము లెవ్వియన, ౧. మంగలము ౨. గౌణము ౩. భౌతికము ౪. ఆర్షము ౫. దైవికము ౬. పైత్రృ కము ౭. శ్రీకరము ౮. సౌమ్యకము ౯. భౌవనము ౧౦. సౌభద్రము ౧౧. సావిత్రమునని ఇందలి విభాగము. క్రమముగ నియ్యవి ౧, ౩, ౫, ౭, ౯, ౧౧, ౧౩, ౧౫, ౧౭, ౧౯, ౨౧ దినముల కాలము జరుపబడెడి ఉత్సవ ములకు సంకేతములు కాగలవు. ఇందు మొదటివగు మంగలగౌణములను విడచి క్రమముగ భౌతికార్షములు, శాన్తికములనియు దైవికపైత్రృకములు పౌష్టికములనియు శ్రీ కరసౌమ్యకములు జయదములనియు, భౌవనము అద్భుతమనియు, సౌభద్ర సావిత్రములు సార్వకామికము లనియు నొక సంకేతము చేయబడినది. ఇట్లు యిరువది యొక్క దినముల దీర్ఘకాల ముత్సవముల చేయుట శ్రమసాధ్యమని యెంచి ఈ దీర్ఘ విధానమును సంకో చించి క్రమముగ మంగలాది పంచకమునకు శాన్తికాది పంచక సంకేతమును మహర్షి వ్యవహరించియున్నాడు. ఈ యైదు విధములనుకూడ సంగ్రహపరచి శాన్తికపౌష్టిక సార్వకామికములని ఉత్సవములను మూడు తరగతుల క్రింద విభజించిన సంహితలుకూడ కలవు. శాన్తికపౌష్టి కాది సంజ్ఞలకు ప్రయోజనము ఆశబ్దార్థమువలననే గ్రహింపదగి స్పష్టముగ నుండుటచే వివరించలేదు.

ఈ యుత్సవమువలని ప్రయోజనము భగవదనుగ్రహ ముచే ప్రజలందరు సుభిక్షముకలిగి జీవించుటయే ప్రధాన మైనది - ముఖ్యమైనది కూడ కాగలదు. ఇది కాక అవాం తర ప్రయోజనములు లెక్కకు మిక్కిలిగ నున్నవి. ఈ శుభ సమయములందు దేశమందలి వివిధ భాగములం దుండి ప్రజలొక చోట చేరుటకు మంచి అవకాశము కలుగ గలదు ఆయా కలలందు నిష్ణాతులగు విద్వాంసులు భగ వానుని సన్నిధానమున చేరినప్పుడు మహాజనముల యెదుట వారివారి వైదుష్యమును ఉచిత రీతిని ప్రదర్శించు కొను టకు సన్మానములను పొందుటకును అవకాశము కలుగ గలదు. వృత్తి విద్యలచే జీవించు వారలు తమ చేతి పనులను ప్రదర్శించి తమ వ్యాపారమును ప్రచురపరచి కొని వ్యాపారమును వృద్ధి చేసికొని లాభప్రాప్తి నొందుటకు ఈ సందర్భము లెంతయో సహాయ పడగలవు. వ్యాపార స్థులు తమ సరకులను క్రయవిక్రయముల మూలమున విడుదలచేసియు సేకరించి విశేషలాభములను పొందుటకీ సన్నివేశములు తోడ్పడ గలవు. వేద పారాయణము, పురాణ పఠనము, నృత్తగీత వాద్య ప్రదర్శనము మొద లగు వాటి వలన ఆయా ప్రదర్శకులకు భృతిలాభము ఖ్యాతిలాభము కలుగు చున్నది. ఈ సమయములలో పొరుగు చోటులనుండి వచ్చి పోయెడి భక్త సమూహము యొక్క పరిచయము వలన ఆయా గ్రామము లందలి పేదసాదలకు అనేక రీతులచే జీవనోపాధికి సహాయము తాత్కాలికముగ సంభవించును. ఒకే యజమానునకు విశేషకష్టము లేకుండ గ్రామమంతయు సమష్టిగ విశేష ఫలి తమును పొందుటకీ యుత్సములు నిదానము కాగలవు.

దేవుని ఉత్సవమొక గృహస్థునికి గాని ఒక ఇంటికి గాని సంబంధించిన కార్యము కాదు. దేవాలయములవలె దేవోత్స వములు కూడ సర్వజనులకు స్వామ్యము కలవి. 'అనా హూతోఽధ్వరం గచ్ఛేత్' అను నట్లు ఉత్సవమునకై ఒకరి నొకరాహ్వానించి ప్రత్యుత్థానాదుల జేయవలయునను నట్లు లేదు. ఆగ్రామవాసులగు నొక్కొక్కరికిని ఆగ్రామోత్సవము తమ ఇంటి శుభకార్యముగ భావించి నిర్వహించ దగినది. ఇది మనకు ప్రాచీన కాలమునుండి వచ్చెడి అనుభవము కూడ.

'తద్గ్రామ వీథీశ్చ సంశోధ్య గృహద్వారాణి దీపాంకు రోదకుంభాద్యైరలంకృత్య' అనియు 'ఉత్సవేదేవేశం యే సేవన్తే తే సర్వే పదేపదే యజ్ఞఫలం లభేరన్నితి భృగ్వా దయోవదన్తి....తద్గ్రామ వాసినో జనాః యానస్థం దేవం స్వేషుగృహేషు దీపాంకురాద్యైః ప్రత్యుత్థానం కృత్వా సమస్కుర్యుః' అనియు దేవ ఉత్సవములు గ్రామవాసు లకు ముదావహములని మరీచి చెప్పుచున్నారు.

మఱియు ఉత్సవ మారంభమైన ధ్వజారోహణము మొదలుకొని అవభృథాన్తము జరిగెడి దినములలో ఆ గ్రామవాసులగు నందఱును అనన్యతత్పరులై భగవన్మం దిరమున శ్రద్ధా భక్తులతో ఉత్సవ కార్య నిర్వాహమందు నిమ గ్నులై యుండవలయుననియు ఆ గ్రామమందు ఏ ఇతర దేవతా సంబంధమైన ఉత్సవములనుగాని గృహస్థులు తమ ఇండ్లలో తమ గృహమునకు సంబంధించిన యే శుభ కార్యములనుగాని చేయరాదనియు సంహితాకారుల శాసనమై యున్నది. ఉత్సవసమయములందు భగవత్కార్యము లందుగాక ప్రజలు ఇతర విధములగు యే స్వకార్యములను చేయరాదని శాసించుటవలన ఉత్సవముల ప్రాముఖ్యత స్పష్టముగ చెప్పబడినట్లైనది. ఆ గ్రామమందలి ప్రజలు

ఈ దినములలో పొరుగు ఊళ్లకు పోరాదనియు ఏ నిర్బంధ ములచేత నైనను పోక తప్పనిసరియై అట్లుపోయినవాడు అవభృథము లోపుగ తిరిగి గ్రామమునకు చేరుకొని తీర వలయునని నియమించిన శాస్త్రము నేటికిని పల్లెటూళ్ల యందు అక్షరాల ప్రజలచే పాటింపబడు చుండుట అప రోక్షముకాదు. సంహితలలో ఇట్లు కలదు.

'ఆరోపితే ధ్వజే విష్ణోరుత్సవార్థం విశేషతః
ఉత్సవావభృథాత్పూర్వం సర్వేతద్గ్రామవాసినః
అన్యత్రయదిగచ్ఛన్తి భవన్తి వ్యాధయోధ్రువమ్'

'సర్వేషామపి దేవానాం మునీనామపి సర్వశః
పితౄణాం చగ్రహాణాం చతత్పత్నీనాంచ సర్వశః
ద్విజానామ పిశాన్త్యర్థం లోకానామపి సర్వశః
పుష్ట్యర్థం కారయేద్భక్త్యా దేవేశస్యోత్సవంక్రమాత్'

(భృగుః)

ఉత్సవములలో విప్రోత్సన్మానములను గురించినప్రస్తా వములో సమీపకాలమునుండి శ్రీ ఆంధ్ర ప్రభుత్వ దేవా లయ ధర్మాదాయ పరిపాలన శాఖామాత్యుల ప్రాపకమున సింహాచలము, అన్నవరము, తిరుమల, పొన్నూరు మొద లగు ధనికసంస్థలలో యీ సన్మానములు జరుగుట కారంభమైన విషయము పండితుల కాశాజనకమై యొప్పినది.

మఱియు ఆలయములకు పోజాలని బాలుర వృద్ధులు అతురులాదిగాగలవారలు గ్రామవీధులందు విజయము చేయు నుత్సవ మూర్తులను సేవించెడి భాగ్యముత్సవకాల మందే కలుగుచున్నది. ప్రాతఃకాలమందు దేవాలయము లకు పోగూడదని బహిష్కరింపబడిన జాతులవారుకూడ వీధులలో ఉత్సవమూర్తులను సేవించి తరింతురని శాస్త్ర ముల మతము.

(సశేషము)

---

# దర్శన వీధి - IV

జమ్ములమడక మాధవరామశర్మ.

## జైన దర్శనము :—

వర్ధమానమహావీరుడు జైనధర్మమును నిరూపించినాడు. ఇది బుద్ధధర్మము కన్నను ప్రాచీనము. ఈ ధర్మమునకు నిర్గంథమని నామాంతర మున్నది. భవబంధన గ్రంథు లను విడదీసినాడని మహావీరునకు ప్రసిద్ధి వచ్చినది. ఈ ధర్మమున సిద్ధపురుషునకు "అర్హన్" అని సంజ్ఞ కలదు. రాగాదిద్వేషములు లేనివారై త్రిలోకపూజితులై యథార్థ వాదులగు సమర్థులు సిద్ధపురుష లగుదురు. అట్టివారి ద్వారమున ప్రచారములోనికి వచ్చినందున నీ ధర్మము "అర్హతము" అని పేరు పొందినది. వర్ధమానుడు రాగ ద్వేషాది శత్రువులను జయించినాడని "జినుడు" అని ప్రఖ్యాతి వహించినాడు. అర్హతధర్మము జైనధర్మ మయి నది. జైనులు సిద్ధుల ద్వారా తమ ధర్మము ప్రచారము పొందిన దని భావింతురు. ఆ సిద్ధులే తీర్థంకరులు. మొదటి తీర్థంకరుడు ఋషభదేవుడట. పురాణములందు రాజర్షి యయిన ఋషభదేవు డొకడున్నాడు. భాగవతమున ఋషభనాథ వర్ణన మున్నది. అతని వంశము లోనివాడే భరతుడు. భరతుడే జడభరతుడు. అతని పేర నీ దేశము భారత మయినది. జైనులు ఋషభనాథుని మొదటీ తీర్థం కరుడని భావింపరు. ఈతని యనంతరము ఇరువది ముగ్గురు తీర్థంకరులు వచ్చిరి. వారిలో పార్శ్వనాథుడు మహావీరుడు, చివరివారు.

పార్శ్వనాథుడే ఈ ధర్మమున కాద్యప్రవర్తకు డని కొందరందురు. ఆ ధర్మము కాలక్రమమున శిథిలము లుప్తము కాగా మహావీరుడు పునరుజ్జీవితము చేసి నాడందురు. కాశీ పట్టణమున పార్శ్వనాథుడు వామాదేవి, అశ్వసేనులకు జన్మించినాడు. ఇప్పటికి రెండువేలయెనిమిది వందల సంవత్సరములకు పూర్వము పార్శ్వనాథుడు జన్మించి యుండును. అతడు జన్మింపక పూర్వము తల్లి కృష్ణసర్పమును చూచినది. కాన నీతడు పార్శ్వనాథు డయినాడు. ముప్పది సంవత్సరముల వఱకు గార్హస్త్య జీవనము గడపి సర్వము విడచి, భిక్షువై తప మొనరించి ధర్మవిజ్ఞానము సంపాదించినాడు. డెబ్బది సంవత్సరములు వచ్చువరకు తన యుపదేశముల ప్రచారము చేసినాడు.

పార్శ్వనాథుడు ప్రబోధించిన ఆచార విచారములకును మహావీరుడు బోధించిన వానికిని కొంత కొంత భేద మున్నది. పార్శ్వనాథుడు అహింస, సత్యము, అస్తేయము, అపరి గ్రహము నాలుగు మహావ్రతము లనినాడు. బ్రహ్మచర్య

ముపాదేయ మైనవది యని మహావీరు డనెను. పార్శ్వనాథు నకు వస్త్రధారణ మిష్టము. విరాగి మహావీరునకు యతి సాధనమున వస్త్రము విడచి నగ్నముగ నుండుట యభీష్టము. జైనులలో శ్వేతాంబర, దిగంబర సంప్రదాయము లిట్లు వ్యాపించినవి.

జైనధర్మములో వర్ధమానమహావీరుడు చివరి తీర్థంకరుడు. నేటికి ఇరువదియారు వందల సంవత్సరముల క్రిందట వర్ధమానుడు క్షత్రియవంశమున జన్మించినాడు. త్రిశలా సిద్ధార్థులు తల్లి దండ్రులు. వర్ధమానుని భార్య యశోదాదేవి. విరాగ మతిశయింపగా ముప్పది సంవత్సరముల ప్రాయమున యతిధర్మము గ్రహించి జ్ఞానవికాసము పొందెను. మొదటగా పంచమహావ్రతములను ప్రథమ శిష్యుడయిన నింద్రభూతి కుపదేశించినాడు. అనంతరము అంగ, మగధ, కౌశాంబీప్రభువుల కుపదేశించి జినధర్మదీక్ష నిచ్చినాడు. మహావీరుని యనంతరము యీ ధర్మమునకు రాజాశ్రయ మధికముగా లభించినది. నందవంశ నరేశులు, కళింగ ఖారవేలుడు, ధర్మదీక్షితులై జినధర్మము వ్యాపింప జేసిరి. మౌర్య చంద్రగుప్తుడును జైనధర్మ మవలంబించె నందురు. మగధదేశపు కల్లోలములో చంద్రగుప్తుడు మైసూరు ప్రాంతమున శ్రవణ బెళగోల ప్రాంతమున తప మొనరించెను. యతి యయిన భద్రబాహువు గతించుటచే నుత్తర దేశమున జైన యతులలో నాచార విచారములందు మార్పులు వచ్చినవి. సంఘభద్రుడు జైనసంఘ ప్రధానుడయినాడు. దిగంబర జైనులలో సాధన తీవ్రత యున్నది. శ్వేతాంబరు లంతగా కఠోరనియమములు పట్టరు. దిగంబరు లిట్లందురు. కేవలజ్ఞాని భుజింపడు. స్త్రీ మోక్షార్హ కాదు. పుంజన్మ పొందిననే మోక్షప్రాప్తి యున్నది. శ్వేతాంబరు లిట్లనరు. స్త్రీ మోక్షము పొందగలదు. కేవలజ్ఞానియు భుజించును.

జైనదర్శనములో గ్రంథము లధికముగా నున్నవి. ప్రమాణ గ్రంథముల కన్నను జైనాచారబోధకము లధికములు. "దేవర్ధిగణి" స్థూలభద్రుడు, ఉమాస్వాతి, దేవనంది, సమంతభద్రుడు, సిద్ధసేన దివాకరుడు, సిద్ధసేనగణి, కుందకుందాచార్యుడు, హరిభద్రుడు, అకలంకుడు, విద్యానందుడు, వాపెరాజసూరి, దేవసూరి, హేమచంద్రుడు, మల్లిషేణ సూరి, మొదలగువారు జైనధర్మ ప్రవర్తకాచార్యులలో ప్రముఖులు.

ద్రవ్యయజ్ఞము కన్న జ్ఞానయజ్ఞము ముఖ్య మనుట జినధర్మభావనములో ముఖ్యముగా భావింప దగినది. రాగ ద్వేషాదులపై విజయము సంపాదించుట జినశబ్దార్థము. వ్యావహారిక మార్గమునుండి జినధర్మ విచారము ప్రసరించును. ఈ జగద్గతము లయిన సర్వ వస్తువులూ జీవములజీవములని రెండు విధములుగ నున్నవి. ఇవియే చేతనములు జడములు. జీవితము నిర్వహించుకొనునవి జీవములని జీవశబ్దార్థము. కాగా జీవుడన నాత్మకాదు. -జీవనగతిప్రదాత యని ఈ ధర్మము లోని యర్థము. జీవుల సంఖ్య నియతము కాదు. కావుననే జైను లనేక వాదులు. జీవు లందరు సమానులు నిత్యులు. భోక్త లగుదురు. కర్త లగుదురు. జీవులకు నిశ్చితాకారము లేదు. పరిమాణమును లేదు. జీవుల కాకుంచన మున్నది. ప్రసారణ మున్నది. జీవుడని యనుట అది యొక సావయవ పదార్థము. జీవులలో శాంతి జ్ఞాన శక్తు లున్నవి. జైనులు జీవులకు వ్యాపకత్వము నంగీపరింపరు. జ్ఞానము చేతన మొదలగు గుణములు జీవస్థితిని సూచించును. జ్ఞాన గుణములు శరీరము విడచి యుండవు. కావుననే శరీరము విడచి జీవునకు సత్త లేదు. అజీవ పదార్థము జడవస్తువు. అది యైదు విధములు. కాలము, ఆకాశము, ధర్మ మధర్మము, పుద్గల మని. ఈ యైదింటిలో జీవనము చేతనత లేదు. ఇందు కాలాకాశము లనంతములు; ఆకాశము రెండు విధములు. లోకాకాశ మని, అలోకాకాశ మని. లోకాకాశము నందే గతి యున్నది. ధర్మ మనునది గతి సూచకము. అధర్మము స్థిరతాసూచకము. పుద్గలము నందు రూప రస గంధ స్పర్శ గుణము లున్నవి. శబ్ద మనునది పుద్గల పరిణామమే గాని గుణముకాదు. పుద్గలము నిత్యము. పరమాణు రూపము. సర్వవస్తువులు పరమాణువులచే కలుగునని జైనుల పరమాణువాదము. పరమాణువులను సర్వజ్ఞులే చూడగలరు. పరమాణువుల సమూహమునకు స్కంధ మని పేరు. ఈ జగ మంతయు నొక మహాస్కంధము. కర్మ కూడ పుద్గల సూక్ష్మస్వరూపము. అది జీవసంబంధము పొంది సంసార ముత్పాదించు చున్నది. కర్మలో ననేక భేదములు కలవు. జ్ఞానావరణ మొనర్చు కర్మ యొకటి జీవుని జ్ఞానరూపమును కప్పి పుచ్చుచున్నది. దర్శనావరణీయకర్మ సరిగా చూడ నివ్వదు. వేదనీయకర్మ జీవుని యానంద స్వరూపము నాచ్ఛాదించును. దుఃఖహేతు వగును. మోహనీయ కర్మ శ్రద్ధా విశ్వాసముల నష్టపఱచి జీవునశాంతు జేయును. జీవుని యున్నతి నడ్డువఱచు కర్మ అంతరాయకర్మ యగుచున్నది.

జ్ఞానము జీవుని స్వరూపమె. ఇంద్రియముల సహాయము లేకున్నను జీవునకు జ్ఞానము కలుగును. ఈ జ్ఞానమయిదు విధములు. మతిజ్ఞానము, శ్రుతజ్ఞానము, అవధి జ్ఞానము, మనఃపర్యాయజ్ఞానము, కేవలజ్ఞానము అని. దివ్యదృష్టి ననుసరించి కాలత్రయ పదార్థములు తెలియుట యవధిజ్ఞానము. అన్య చిత్తదశ గుర్తించుట మనఃపర్యా

యము. ముక్తజీవులకు లభించు జ్ఞానము కేవలము. మతి శ్రుతజ్ఞానములు రెండును పరోక్ష జ్ఞానములు. ఇంద్రియ మనస్సుల సహాయమున నవి కలుగును. అవధి కేవల మనోజ్ఞానము లింద్రియ మనస్సంబంధములు కలవి గావు. జీవుని యోగ్యతానుసారమున గలుగునవి. ప్రత్యక్ష పరోక్ష రూపముగా జ్ఞానము రెండు విధములని నిరూపించు జైనులరీతి ఇతరుల నిరూపణముకన్న వేరుగా నున్నది. ఆచార్య హెమచంద్రుడు ప్రత్యక్షజ్ఞానము సాం వ్యవహారిక మని, పారమార్థిక మని రెండు విధముల నంగీకరించినాడు. ఇంద్రియ మనస్సంబంధ మున్నప్పుడు సాంవ్యవహారిక ప్రత్యక్షము కలుగును. ఆవరణము పోగా చేతన జీవుని స్వరూపావిర్భావము కలుగుట పారమార్థిక ప్రత్యక్షము. జైనులు ప్రత్యక్ష మనుమానము ప్రమాణ ముల నంగీకరించిరి. ప్రత్యక్షము నంద రంగీకరింతురు. అనుమానమును చార్వాకు డొప్పలేదు. లోక వ్యవహార సిద్ధికై అనుమాన మావశ్యకమని జైనులనిరి. జైనుల అగమము లందలి విషయములు జైనదర్శనములకు మూలములు. శ్రుతి, స్మృత్యాదులను వారు ప్రమాణముగ భావింపరు.

జైనదర్శనమున ప్రధానసిద్ధాంత మొకటి యున్నది. వస్తువేదియైన నది యనంత ధర్మాత్మకము. కేవలజ్ఞాని యగు నాతడే సర్వవస్తు ధర్మముల తెలియ గలడు. మన మొక వస్తువులోని యొక ధర్మమునే గుర్తింతుము. మన జ్ఞానము కేవల మంశరూపము. అనంతధర్మములలోని యేకధర్మజ్ఞానమును "నయము" అని యందురు. సాధా రణముగా జ్ఞానము మూడు విధములు. దుర్నయము, నయము, ప్రమాణము నని. నయసిద్ధాంతము జైనదర్శన మున నొక ముఖ్యవిషయము. ఏదేని విషయమున సాపేక్ష పముగా నిరూపించుట నయవాద మన వచ్చును. నయ వాదమును జైను లనేకవిధముల విస్తరించిరి. వస్తు వనంతధర్మమయి నందున నయము కూడ నట్లే యగును. గాని సామాన్యముగా నయము రెండు విధములు. ఈనయ విచారణము నందే బహువిధముల పరాక్రమించిన జైనులు దార్శనిక విరోధములను సహించిరి. ఎంతటి దర్శనముగాని వస్తుసత్త లోని యంశమును మాత్రమే వివేచన మొనరిం చును గాని సర్వము నిరూపింప లేదు. వేరొక దర్శనము వేరొక యంశమును వివేచింప వచ్చును. మతభేద మను నది జైనుల మాటలలో రాదు. జైనదర్శనము కేవల మాచారమునకై యహింస నవలంబించుటయే కాక తాత్త్వికసమీక్షలో గూడ నహింస నవలంబించినది.

జైనదర్శనము ననుసరించి చూడగా నెట్టి పరామర్శము నకు గాని "స్యాత్" పదమును గూర్చుట యావశ్యకముగా గన్పడును. జైనులు స్యాద్వాదము నుత్పాదించిరి. "అది యట్లుండ వచ్చును. అది యట్లుకావచ్చును" అనెడు భావమును "స్యాదస్తి" మొదలగు పదముల వలన మనము సామాన్యముగా గుర్తింతుము. ఏదేని వస్తు వొకటి తత్కాలమున తద్దేశమున నుండ వచ్చును. కాని యది యబాధిత మయిన త్రికాలసత్యము కాదు. ఆ వస్తువు దేశాంతరమున కాలాంతరమున లేదు. అందుచే నది సాపేక్షసత్య మయినది. ఇట్లు సాపేక్షసత్యము లగు వానిని తెలియ జెప్పుటకు జైనులు "స్యాదస్తి" యని "స్యాత్" పదప్రయోగ మభిమానింతురు. ఈ స్యాద్వాదము ననే కాంతవాద మందురు. ఒకే వస్తువు నందు నిత్యత్వ మనిత్యత్వ ముండ వచ్చు ననుట దీని భావము. సత్య స్వరూపము నొకేవిధముగ నిశ్చయింప లేము. నానాభావ దృష్టులతో సమీక్షింప వలసి యున్నది. ఈ విధానమునకు సప్తభంగీనయ మని పేరు.

౧ "స్యాదస్తి"—ఈ నిశ్చితవిధమున నిది యున్నది.
౨ "స్యాన్నాస్తి"—ఈ నిశ్చితవిధమున నిది లేదు.
౩. "స్యాదస్తినాస్తి"—ఈ విధమున ·నున్నది. ఈ విధమున లేదు.
౪. "స్యాదవక్తవ్యం"—ఈ విధమున నిది వచనా గోచరము
౫. "స్యాదస్తిచావక్తవ్యం"—ఇట్లున్నది. ఇట్లవక్త వ్యము
౬. "స్యాన్నాస్తి చావక్తవ్యంచ"—ఇట్లు లేదు ఇట్లు వక్తవ్యము కాదు.
౭. "స్యాదస్తిచ నాస్తిచ అవక్తవ్యంచ"—ఉన్నది. లేదు. అగోచరమును.

జైనుల న్యాయసరణి ననుసరించి చూడగా నేదేని పదార్థవిషయమున నిట్లు వికల్పాత్మకములయిన జ్ఞానము లుదయించుట యున్నది. ఈ సప్తప్రకారములకు "సప్త భంగీనయము" అని సంజ్ఞ యున్నది. ద్రవ్యధర్మ స్వభావ దేశ కాలాదులను గుర్తించిననే కాని వస్తుసత్యత గోచరము కాదని వారి విశ్వాసము.

"అనంత ధర్మాత్మకమేవ తత్త్వం"

వస్తువునందనంతధర్మము లున్నవి. నిర్ణయమునకు ద్రవ్య దేశాదుల విజ్ఞాన మావశ్యకము. పదార్థము శాశ్వతమశాశ్వత మని రెండు విధములు. అశాశ్వత మనిత్యము. ఉత్పత్తి వినాశములందున్నవి. అదియే పదార్థము శాశ్వతము నిత్యము. ఒకే పదార్థమున నిత్యత్వానిత్యత్వము లెట్లుండు నని వారు సందేహింపరు. సువర్ణము హార కేయూరాంగు లీయకాదులుగా మార వచ్చును. కాని వాని యందు సువర్ణత్వము పోదు. ఎంతటి పరిణామ

ముస్సను తజ్జాతి నశింప కుండుట వారి మతమున నిత్యము. ప్రపంచమునందు నానాత్వ మున్నను తదంతర్గతముగా నేకత్వము కూడ కలదు. జగత్తులోని నానాత్వము సత్యమే. అందేకత్వము కూడ వాస్తవమె యని జైనభావము. ఏక దేశవ్యాపి యని బహుదేశవ్యాపి యని ద్రవ్యము రెండు విధములు. కాల మేకదేశవ్యాపి. ఇతరములు బహుదేశ వ్యాపనము కలవి. అంతట విస్తరించి యుండు వానిని జైనులు "అస్తికాయము" లని యందురు. సత్త కల వగుట "అస్తి". శరీరము వలె విస్తారము కల వగుట "కాయ". ఇట్టి యస్తికాయ ద్రవ్యము లయిదున్నవి. ఏకదేశవ్యాపి యగు కాల మనస్తికాయము అస్తికాయ ద్రవ్యమె జీవాజీవ భేదమున మొదట ద్వివిధము.

జీవులు ముక్తులని సంసారులని రెండు రకముల నుందురు. జీవుడు చేతనద్రవ్యము. "చైతన్యలక్షణో జీవః". జీవుడు నిత్యు డయినను పరిణామశీలి. శరీర భిన్నుడు, శరీరమున భాసించును. జీవుడణురూపుడు కాడు. విభువు కాడు.. మధ్యమ పరిమాణము కలవాడు జీవునకు రూపము లేదు. అమూర్తము. శరీర మెంతగా నున్న జీవుడంతగా నుండును. దీపము వలె సంకోచవికాసములు కలవాడు. సర్వబంధన నిర్ముక్తుడు ముక్తజీవుడు. సంసారి జీవులలో ననేకభేదము లున్నవి. ఒకస్థానము నుండి స్థానాంతరమునకు బుద్ధిపూర్వగముగ కదులు శక్తికల వారు త్రసజీవులు. ఇట్టి శక్తి లేనివారు స్థావరజీవులు. త్రస జీవులలో నారకులు మానవులు తిర్యక్కులు దేవులు నని యున్నారు. ఊర్ధ్వలోకమున నివసించువారు దేవజీవులు. ద్వీంద్రియ త్రీంద్రియ చతురింద్రియ పంచేంద్రియ జీవ భేదములు నున్నవి. ఉన్నతజీవులం దయిదింద్రియము లుండును.

అజీవస్వరూపము నాలుగు విధములు. పుద్గల మాకాశము ధర్మ మధర్మ మని. వీని భావము లిట్లు భావ్యములు. **పుద్గలము** :-దీని యర్థము విలక్షణము. భూతసామాన్య మున దీని వ్యవహరింతురు. పుద్గలాస్తికాయమని జైన శాస్త్రసంజ్ఞ. "పూరయంతి గలంతి చ" కొన్ని ద్రవ్యములు వృద్ధిక్రమములో శరీరము నుత్పాదించి వృద్ధి క్షీణింపగా భిన్నభిన్నము లగును. అవి పుద్గలములు. పుద్గలములు అణువులుగా సంఘాతములుగా నున్నవి. సూక్ష్మ నిరవ యవాంశ మణువు. వీని పరస్పర సంబంధము సంఘాతము. వీని వలననె శరీరము నందలి యంగమనఃప్రాణాదులు కలిగినవి. **ధర్మము** :-జీవ పుద్గలములకు సహకారి కారణ ములుగా నుండు ద్రవ్యములకు ధర్మమని పేరు. జలచర మయిన మత్స్యమునకు జలము సహకరించు విధమున, జీవపుద్గలగతికి ధర్మాస్తికాయ ముపకారి యగును. జలము చేపను, కదిలింపదు. కదలికలో సహకరించును. ధర్మము జీవగతిలో సమర్థము కాదు. జీవగతిలో సహకరించును. **అధర్మము**:—జీవ పుద్గలస్థితి కుపకరించు ద్రవ్యవిశేష మధర్మము. బాటసారికి వృక్షచ్ఛాయ సహాయపడునట్లు జీవపుద్గలస్థితికి అధర్మము సహాయపడును. అధర్మా స్తికాయ ముపకారి.

## ద్రవ్య విభాగము



జైనదర్శనమున మోక్షమునకు మూడు సాధనము లుపదిష్టము లయినవి. సమ్యగ్దర్శనము. సమ్యక్ జ్ఞానము, సమ్యక్చారిత్రము నని. దర్శన మనునది శ్రద్ధ. తీర్థంకరులు చెప్పిన వానిని యథాతథముగా విశ్వసించుట శ్రద్ధ. జైన శాస్త్రములందు నిరూపించిన తత్త్వములను సిద్ధాంతములను బాగుగాతెలిసి యనుభవమున గుర్తించుట సమ్యక్‌జ్ఞానము. ఈ దర్శనము జ్ఞానము చరితార్థము లగుటకు మంచి నడవడి సమ్యక్చారిత్రము. ఈ మూడింటికి రత్నత్రయ మని జైనుల పరిభాష. జీవుడు స్వభావసిద్ధముగా ముక్తుడు కాని వాని శుద్ధస్వరూపమును కర్మ యావరించినది. కర్మ యంతయు పుద్గలసంబద్ధము. జీవు నావరించి దుఃఖమయ ప్రపంచములో బంధించినది. జీవుడు బద్ధపురుషుని వలె నయినాడు. కర్మలో నెనిమిది ముఖ్యభేదము లున్నవి. జ్ఞానావరణీయము, దర్శనావరణీయము, మోహనీయము, వేదనీయము, అయుష్యము, నామగోత్రాంతరాయములు వాని పేర్లు. కర్మల సంబంధ విచ్ఛేదములను జైనదర్శనము సప్తపదార్థములుగా నిరూపించినది. మోక్షేచ్ఛకల జీవునకు సిద్ధావస్థ కలుగు పర్యంతము సోపానములుగా నుండు వానిని **గుణస్థానము** లందురు. పదునాలుగు గుణస్థానములను పరిశీలించినచో మనోవిజ్ఞాన విశేషములు చక్కగా గోచరించును. వివేకహీన మయిన దశ నుండి సదసద్వివేకము పొంది నిశ్చయానిశ్చయ స్థితి నధిగమించి సంశయముల విడనాడి శ్రద్ధ కలిగి పాపాంశముల పరిత్యజించి మోక్షావరణముల పోగొట్టుకొన గలిగిన సాధకు డీ గుణస్థానమున ననంతసుఖమున దేదీప్యమానుడు కాగలడు. అహింస సత్య మస్తేయము బ్రహ్మచర్య మపరిగ్రహము అను మహావ్రతములు. వీని యనుసరణము సాధకుని యోగ్యత. శుద్ధచరిత్ర కల గృహస్థుడును మోక్షార్హు డగును. అట్టి జీవుని "గృహ లింగ సిద్ధు" డందురు. జైనుల కీశ్వరునందు విశ్వాసము లేదు. కర్మ సర్వకారి. కాగా నీశ్వరు డేల? జీవుడె విశేషసంపూర్ణు డయిన నీశ్వరు డగును. ఈశ్వరు డనుట జీవుని రెండవ పేరు. జైనుల యీశ్వరుడు మానవుల కాదర్శప్రాయు డయిన యాదర్శమానవుడె కాని దేవుడు కాడు. కర్మకృత మయిన యావరణము పోగా సతతోర్ధ్వగమనమె మోక్ష మని యీ దర్శన నిర్ణయము. ప్రత్యక్షానుమానములు రెండె ప్రమాణములు. సర్వదర్శన సంగ్రహములో నీ విశేషము లున్నవి.

జినో దేవో గురుః సమ్యక్తత్త్వజ్ఞానో పదేశకః
జ్ఞాన దర్శన చారిత్రాణ్యపవర్గస్య వర్త నీ"

తత్త్వజ్ఞానము నుపదేశించు జినగురువె దేవుడు. మోక్షమునకు జ్ఞానము దర్శనము చారిత్ర మనునవి మూడు మార్గములు "స్యాద్వావస్య ప్రమాణే ద్వే ప్రత్యక్షమనుమాపి చ" ఈ వాదమునకు ప్రత్యక్ష మనుమాన మని రెండే ప్రమాణములు. అష్టాదశ మహాదోషములు లేక రత్నత్రయములో నుండు నాతడు మహాసాధకుడై ముక్తి భాజను డగును. జీవుడు, అజీవము, పుణ్యము, పాపము, ఆస్రవము, సంవరము, బంధము, నిర్జరణము, ముక్తి యని తత్త్వములు తొమ్మిది. వీనిలో పాపము నాస్రవము నందును, పుణ్యమును సంవరమునందు నంతర్భవింప జేసిన తత్త్వము లేదు

"చేతనాలక్షణో జీవః స్యాదజీవస్త దన్యకః
సత్కర్మపుద్గలాః పుణ్యం పాపం తస్య విపర్యయః
ఆస్రవః స్రోతసో ద్వారం సంవృణోతీతి సంవరః
ప్రవేశః కర్మణాం బంధో నిర్జర స్తద్వియోజనం
క్షీణాష్ట కర్మణో ముక్తిః నిర్వ్యావృత్త్యర్జినోదితా"

ఈ తత్త్వములను శ్రద్ధాపూర్వకముగా మోహరహిత మయిన సమ్యక్‌జ్ఞానమున గుర్తించినచో చారిత్రయోగ్యత కలుగును. చారిత్రయోగ్యత కలుగగా పాపకర్మలు వినష్టము లగును. మోక్షము లభించును. లోకాకాశ మావరింపగా జీవుడు దృఢసంబద్ధు డగును గావున జ్ఞాన-దర్శన వీర్య - సుఖములను "అనంతచతుష్కము" లభింపదు. అష్టకర్మలు నశింపగా ననంతచతుష్కము సిద్ధించును. లోకాకాశ మావరింపదు. అలోకాకాశమున స్థితి కలుగును. సంతతోర్ధ్వగమనము కలుగును. వ్యావృత్తిశూన్యత యుదయించును. అదియె ముక్తి. జైనసాధువులు

సరజోహరణా భైక్షభుజో లుంచితమూర్ధజాః
శ్వేతాంబరాః క్షమాశీలాః నిస్సంగా జైనసాధవః
లుంచితాః పిచ్ఛికాహస్తాః పాణిపాత్రా దిగంబరాః
ఊర్ధ్వాశినో గృహే దాతుర్ద్వితీయాః స్యుర్జినర్షయః
భుంక్తే న కేవలీ నస్త్రీ మోక్షమేతి దిగంబరః
ప్రాహురేషామయం భేదో మహాన్ శ్వేతాంబరైస్సహ

దుమ్ము ధూళి దులుపు చీపురు వంటి పిచ్ఛిక ధరింతురు. భిక్షాన్నము భుజింతురు. తలవెంట్రుకల నన్నిటిని పెరికి వైతురు. వీరు శ్వేతాంబరజైనులు. రక్తాంబరము ధరింపరు. దిగంబరులుగా నుండరు. క్షమాశీలురై నిస్సంగులై ప్రవర్తింతురు. దిగంబరజైనులు జుట్టు పీకికొందురు చేతితో పిచ్ఛిక పట్టుదురు. కరతలభిక్షనె స్వీకరింతురు అన్నదాత గృహమునం దూర్ధ్వభోజను లగుదురు. కేవల జ్ఞాని యగు జినఋషి భోజనరహితుడుగనె సాధన మొనరించును. దిగంబర జైన సంప్రదాయములో స్త్రీలకు మోక్షము లేదు. స్త్రీలు పుంజన్మపొందిననె మోక్షము పొందుదురు. శ్వేతాంబరులకన్న వీరిలో నిదియె భేదము

జైనదర్శనమునందు పరిభాషాభేదమున నర్థభేదము నిర్వచనభేదము కనపడుచున్నది. ఈశ్వరు నంగీకరింపక పోయినను, వేదాదులు ప్రమాణము లనక పోయినను, లోకాంతరవిషయ ముద్ఘాటింపక పోయినను, మానవుని సాధన మార్గము ననేకవిధముల పరిశోధించుట యున్నది. జైనదర్శనము తమ వాదము నంగీకరింపని వారివాదముల ఖండించుటలో బాగుగనె యత్నించినది. తమ వాదమున కనుకూలముగ లేవని పూర్వవాదములను ఖండించుటతో లోకసామాన్యము లయిన పరిహాసప్రాయము లగు వచనములు గూడ చమత్కారముగ ప్రయోగించినది. మొదట మొదట అపభ్రంశభాషలో మాగధభాషలో తనవాదములను సాధనములకు పరిహాసములను ప్రదర్శించినను ఖండన పాండిత్యమునకై సంస్కృత భాష ననుసరించినది. సంస్కృతభాషలో జైన గ్రంథము లెన్నియో కలవు. అయితే క్రొత్తపదముల నిర్మించి ప్రాతపదముల కన్యవిధ నిర్వచనములు ప్రదర్శించి సమర్థముగా పరాక్రమించిన జైనదర్శనానుయాయులు నానావిధములగు సాధనములను చారిత్రశుద్ధికై నిర్దేశించినారు. వానిని వైమత్యములేక సాధకు లనుసరించుట సముచిత మయిన యారాధన కాగలదు.

---

# వార్తలు - విశేషములు

## పొన్నూరు శ్రీ భావ నారాయణస్వామి వారి దేవస్థానం తరపున జరుపబడిన కవిపండిత సభలు

1956 సెప్టెంబరు, 15, 16, తేదీలు దుర్ముఖి భాద్రపదశుక్ల ఏకాదశీ ద్వాదశీ, శనివారం, ఆదివారములందు పైసభలు అత్యంత వైభవంగా జరుపబడెను.

మంత్రివర్యులగు శ్రీ చంద్రమౌళిగారికి స్వాగతమిచ్చుట.





స భా దృ శ్య ము.

**15** తేదీ ఉదయం **4-30** గంటలకు 'సుప్రభాత' పఠనము, ప్రభాతసేవతో కార్యక్రమము అరంభమయ్యెను. **7-30** గంటలకు దేవాలయము నందు నిర్వహింప వలసిన ప్రాతఃకాల కృత్యముల తరువాతను, గౌరవనీయులగు దేవాదాయ ధర్మాదాయ మంత్రి వర్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు సభావేదికా ప్రాంగణమునకు విచ్చేయగనే దేవాలయ ధర్మకర్తగారు, శ్రీ రాజా వాసిరెడ్డి హరిహరప్రసాద్ వారు, మేనేజరుగారగు శ్రీ పద్మనాభ చౌదరిగారు, డిప్యూటీ కమిషనరు గారగు - శ్రీ జి. యస్. యన్. రామమూర్తిగారు, శ్రీ మంత్రి వర్యులకు మంగళ వాద్యములతో స్వాగతము పలికి స్వస్తి వాచనములతోను పూర్ణకలశముతోడను శ్రీ మంత్రిగారిని దేవాలయమునకు తోడ్కొని వెళ్లిరి.

దేవదర్శనము చేసుకొని శ్రీ మంత్రి వర్యులు **8-0** గంటలకు అత్యంత రమణీయముగ నలంకరింపబడిన సభ వేదిక నలంకరించిరి. సభకు గుంటూరు మండలము నందలి శాసనసభ్యులు, ప్రసిద్ధ దేవాలయ ధర్మకర్తలు, కమిషన శ్రీ వెంకటరెడ్డిగారు, శ్రీ మాన్ సుందరాచారిగారు, (మద్రాసు) శ్రీ మాన్ యస్. టి. జి. వరదాచార్యులుగారు, మున్న ప్రముఖు లందరును విచ్చేసి సభనలంకరించిరి. విజయవాడ ఆల్ ఇండియా రేడియోవారు సభాకార్యక్రమము నంతటి రికార్డు చేసిరి. శ్రీ భావనారాయణస్వామి వారి సంస్కృత కళాశాలా ధ్యాపకులచే వేద పఠనము, కళాశాలా విద్యార్థినుల భావదేవస్తుతి, పుష్పాంజలి పూర్వకముగ ప్రస్తావన - బాలికలచే చేయబడిన పిదప కళాశాలాధ్యక్షులు శ్రీ సత్యనారాయణ యమ్. ఏ., గారు మంత్రి వర్యులను సభను ప్రారంభింప వలసినదిగను, సభకు శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారిని అధ్యక్షులు నుండుటకును కోరిరి. అనంతరము, ధర్మకర్తగారిచే మంత్రి వర్యులకు స్వాగత పత్రము సమర్పింప బడినది. సభ సుమారు **10** వేలమంది జనులు వచ్చిరి.

సభను ప్రారంభించుచు మంత్రివర్యులు దేవాలయముల ప్రాముఖ్యతను, దేవాలయములు ఎట్లు భారతీ సంస్కృతికి మూలస్తంభములో, దేవాలయముల ద్వారా భారతీయ సంస్కృతిని ప్రజాసామాన్యమున కెట్లు అందజే వలెనో విపులముగా వివరించుచు భారతీయ సంస్కృతికి మూలభూతమగు సంస్కృతభాష యావశ్యకతను గురిం మధురముగను, గంభీరముగను ఉపన్యసించిరి.

## మంత్రి శ్రీ చంద్రమౌళిగారి ప్రారంభోపన్యాసము

ప్రపంచములో పరిణామమున్నది. మార్పు ఉన్నది. కేవలము అంతమాత్రమేకాక పరిణతికూడా ఉన్నది. చైతన్యమున్నప్పుడె పరిణతి కలుగుతుంది. ప్రకృతిలోని వికారము ఆకర్షణ వికర్షణములు సంఘర్షములు ఆఘాత ప్రఘాతములు ఒడిదుడుకులు కలిగినప్పుడు మహనీయులు అవతరించుచుతూ ఉంటారు. కొందరు తమకు బలంవున్నదని భావిస్తారు. అది అల్పబలం. వారి అల్ప బలము లోకమును బాధించుతుంది. సంఘమును దూషితముచేస్తుంది. వారు స్వార్థులు. పరార్థము పరిశీలింపలేరు. విజ్ఞాన మూల్యమును సరిగా నిశ్చయించాలి. ఆర్థికమయిన ఆశ ఉంటే విజ్ఞాన వికాసంరాదు. భూతవికాసమునకు తగినట్లుగా విజ్ఞానమూల్యము గుర్తించాలి. భూతవికాసము మంచిదే అయినా అది హృదయవికాసమునకు తగినట్లు ఉండాలి. హృదయవికాసమె శ్రేయస్సును కూర్పగలదు. ఈ కాలము సంధిసమయము. అన్నిటికీ సంఘర్షణము ఉంది. విశ్వకల్యాణ రీతులను పెద్దలు ఆలోచించుతున్నారు. వారి ఉపదేశ విషయములను పరిహసించకుండా గుర్తించడం అవసరం. మానవునిలో పశుత్వం ఉంటుంది. నరునిలో వానరత్వం ఉంటుంది. మానవుడు దేవత్వమును తనలో ఆవతరింపచేసికోవాలి. ఊరకనే ఆవేశంతో మాటలు చెప్పి కర్తవ్యమును విడనాడడము యుక్తంకాదు. "న వాచి సారః కర్తవ్యః" ఋషి జీవనము చాలా అవశ్యకము. ఆర్షవిధానమె లోకానికి ఆదర్శముగా ఉంటుంది. ఈ దినాలలో గొప్ప యాంత్రిక విజ్ఞానము పాశ్చాత్య దేశాలలో ప్రసరించింది. కేవలము అది భౌతికంగానే ఉండడము అంతలోనే ఆగిపోవడము ప్రపంచానికి క్షేమంకాదు. సంపూర్ణమయిన భౌతిక విజ్ఞానములో పరిపూర్ణమయిన ఆధ్యాత్మిక విజ్ఞానము కలిసివుండాలి. కాకపోయినట్లయితే సమస్తమూ అఫలమవుతుంది. మన కృషి సాఫల్యమిచ్చేదిగా కావాలి.

విద్యాశాలల విజ్ఞానమునకు మార్పు రావాలి. విద్యార్థులుకాని ఉత్తీర్ణులుకాని ఉద్యోగులుకాని విశ్రాంతులుకాని బ్రహ్మచర్య ప్రభావమును బాగా గుర్తించినప్పడె స్త్రీ పురుషులలో యోగ్యత విశదమవుతుంది. చాలా ప్రాచీనకాల సంస్కృతికి తిరోగమించుతున్నామని ఎవరూ బెంగపడవద్దు. సర్వకాలములలో అనుష్ఠింపదగిన యోగ్యవిధానమును ఎవరూ ఏవగించుకోరాదు. అందరకు మనఃస్వాస్థ్యము సంపాదించడానికె దేవాలయ విజ్ఞానమును వ్యాపించజేయాలని మన

మంత్రివర్యులు - శ్రీ చంద్రమౌళిగారుపన్యసించుట.



ప్రభుత్వం నిశ్చయించింది. నేను దేవాదాయ ధర్మాదాయ మంత్రిగానే చెప్పుతున్నాను. దేవాలయ ద్రవ్యమును దేవాలయ విజ్ఞానమునకె వినియోగించాలని నిశ్చయించాము. నిర్ణీతమయిన ఈ విషయంలో ఎవరికి విప్రతిపత్తి ఉండరాదు. బాగా ఆలోచనముచేసి నిర్ణయించిన రీతులకు ఎవరూ ఎదురుతిరుగవద్దు. సంస్కృతభాషా వృద్ధితో మనమెంతయినా చేయుగలము. చేస్తాము. ఇంగ్లీషు హిందీ తెలుగు నాలుగు భాషలు నేర్చుకొనడము కష్టమని బెదరగొట్టవద్దు. ఇంగ్లీషు లేకపోయినా ఫ్రెంచి వారు జర్మనువారు రష్యావారు జపానువారు అందరూ అభివృద్ధిపొందుతూనే ఉన్నారు. మనము ఇంగ్లీషు లేకపోతే అభి వృద్ధి పొందలేమనడంలో అర్థంలేదు. వ్యర్థమయిన వితండవాదము ఉపకరించదు. ప్రతి జాతికీ ఒక జాతీయతా లక్షణం అవసరం. మన భారతజాతీయతారక్షణమైంది సంస్కృతం, సంస్కృతమే లేకపోతే మనకొక విశిష్ట లక్షణం మృగ్యమైపోతుంది. సంస్కృతం మన భాషలన్నిటికీ మూలము. సంస్కృతమె ముందుగా గుర్తించితె ఆంధ్రముకాని హిందికాని ఏ భారత భాషయినా మూడువంతులు వచ్చినట్లె. పశుత్వమునుండి దేవత్వమును అందింపచేసే సంస్కృత మును అభ్యసించండి. సంస్కృతము అమృత భాష. మర్త్యధర్మలమయిన మనకు మన ఉద్ధరణానికి సంస్కృతం అవసరం. మన ఆంధ్రభాషావృద్ధికి సంస్కృతం కావాలని స్పష్టమెకదా! త్యాగి యోగి అవతరించి సంఘమును భద్రంగా రక్షించాలి. ఇక్కడ సమావేశమయిన కవులు పండితులు సహృదయులు ఈ విషయాలను ప్రచారంలోకి తెచ్చి ప్రజల కుద్బోధించి మా ఉద్యమంలో సహకరించవలసినదని కోరుతున్నాను. సముచితంగా ప్రచార ప్రబోధములు చేస్తూ సహ కరించేవారికి తగిన ఆర్థిక సహకారం ఉంటుంది. ప్రజలు ప్రభుత్వము దోహదం ఇస్తారు. ఈ కవి పండిత సభలు సమర్థంగా కార్యాచరణమునకు యత్నించాలని అర్థిస్తున్నాను.

(సంగ్రాహకుడు: మాధవరామశర్మ)

పిమ్మట అధ్యక్షుల ఉపక్రమోపన్యాసమున దేవాలయముల ప్రాచీనతను, ప్రాచీనకాలమునుండెయు భారతీయ సంస్కృతి యందు దేవాలయ వైశిష్ట్యమును గురించి వివరించిరి.

శ్రీ కవిసార్వభౌమ శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పండిత కవితాగోష్ఠిని ప్రారంభించుచు వేదకాలమునుండియు వచ్చుచున్న దేవాల యౌన్నత్యమును గురించి యుపన్యసించిరి.

పిమ్మట పండిత శ్రీ పెనుమెత్స సత్యనారాయణ రాజుగారు "స్వీయ కవిత" నుండి భారతీయ దేవాలయములకును, దైవమునకును సంబంధించిన పద్యములను చదువుచు దేవాలయములు - దేవతలను గురించి మధురముగ నుపన్యసించిరి.

శ్రీ బెల్లంకొండ రాఘవరావుగారు "శ్రుతి" ని గురించి యుపన్యసించిరి. శ్రీ రాయప్రోలు లింగన సోమయాజులు గారు "భారతీయ సంస్కృతీ విశిష్టతను" గురించి గంభీరముగ నుపన్యసించిరి. అనంతరమున శ్రీ కొంపెల్ల దక్షిణామూర్తి శాస్త్రిగారు "భారతీయ సంస్కృతి"ని గురించి వ్యాసమును చదివిరి.

పిదప శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు "సంస్కృత భాషా ప్రశస్తి"ని గూర్చి తమ యనర్గళధారతో నుపన్యసించి సభను ముగ్ధపరచిరి. వీరి యుపన్యాస మీ క్రింది పొందుపరుపబడినది.

## సంస్కృత ప్రశస్తిః

*జమ్ములమడక మాధవరామశర్మ*

వేదాభిజ్ఞులు తెలుగుదేశంలో వృద్ధిపొందాలనే పరమాశయంతో ఈ గుంటూరు మండలంలోనే ప్రథమంగా వేద విద్వత్సభ పరీక్ష సమ్మానములు ఏర్పాటయినవి. భాగవత భక్తసమాజము సకల వర్గములవారికి భారతదేశీయ సంస్కృతి ప్రబోధముచేయడానికి చాలా కృషిచేస్తున్నది. ఈ మండలంలో సంస్కృత విద్యారంగములు చిరకాలముగా సారస్వతా సక్తులకందరకూ సంస్కృతము ఉపదేశిస్తున్నవి. ఈ మండలంలో పామరులనుండి అపామరులవరకూ విజ్ఞాన సేతువు నిర్మించడానికి కొందరుదారులు తగిన యత్నంచేస్తున్నారు.

వేదవాణి ఈనాడు ధర్మచక్ర పతాకపై "సత్యమేవజయతే" రూపముతో ఉన్నది. మన మా నీడలో ఉన్నాము. ధర్మచక్రచ్ఛాయా సౌభాగ్యము నందుకొనువారందరు సంస్కృతవాణీ విలాసమును వేదవాణీ విశిష్టమహా భావమును వైమత్యములేకుండా ఆరాధించవలసి ఉన్నది.

భాషాదృష్టితో నేడు వేదానుశీలనం చేయాలి. వేదపదాలలో పదింటిలో ఆరు పదాలంతర్వాణులకున్నూ అపరిచి తంగా ఉన్నవి. వాని పరిచయము బాగా సంపాదించి సమీక్షచేస్తే మనము విశ్వభాషా సామరస్యము సంపాదింపగలము. ఆసియాఖండ భాషలన్నీ సంస్కృతముతో సంబంధించి ఉన్నవని ఇప్పటికి సగము సగముగా గుర్తించిన మనము వేదాను శీలనంతో మిగతా సగముకూడా గుర్తింపగలము. యూరపు భాషాపదాలలో అంతటా సంస్కృత పదచ్ఛాయలుండడమును NIGHT లో కన్పడని కంఠ్యమును "నక్తం"లో విని చూచి అరుగుపాటు విరుగుపాటు నురుగుపాటు కరుగుపాటులతో తెలియగలము. ప్రపంచ భాషలన్నీ సంస్కృతచ్ఛాయలతో ఉండడమును వ్యక్తముచేయాలంటే వేదవాణి కావాలి. "పశ్యేమ శరదశ్శతం। జీవేమ శరదశ్శతం। ప్రబ్రవామ శరదశ్శతం। నందామ శరదశ్శతం।" ఇవి వేద సంకల్పము. భారతభారతి సంస్కృతము విశ్వభాషా గౌరవపీఠముపై పాశ్చాత్యులచేకూడా పూజలందుకుంటున్నది. సంస్కృత భావిత భాషలను భాషించేవారు నేటి ప్రపంచంలో నూటయాభైకోట్ల కధికంగా ఉన్నారు.

భారతీయ లోకభాషలలో సంస్కృత విజ్ఞానమె ఉన్నది. భాషాశాస్త్ర సమీక్షా పరీక్ష మళ్ళీ జరగాలి. మళ్లీ నవ నిఘంటువు వ్రాయాలి. నవ విజ్ఞానశాస్త్రముల పరీక్షలతో పరిభాషా పదాలను సంస్కృతంలోనే నిర్మించాలి. అది నవసృష్టి— అది నవరీతి. సంస్కృతభాషా విషయములో చాలా కాలమునుంచి చాలారకాల ప్రతిఘటనములున్నా అవన్నీ నమసి పోయినవి. సంస్కృత శత్రువులు సంస్కృత పదాలనే పట్టుకున్నారు. మొదటగా జైనులు సంస్కృతంపై అపభ్రంశ ప్రయోగంచేశారు. మాగధీప్రయోగం చేశారు. బౌద్ధులు ప్రాకృతీ ప్రయోగంచేశారు. పాలీయోగం పట్టినారు. అదంతా వారిది హీనయానం. అనంతరము వారు మారినారు. సంస్కృతం అనుసరించారు. బౌద్ధులు మహాయానులయినారు. సంస్కృతా నుసరణంతో జైన బౌద్ధులు దార్శనికులయినారు. సంస్కృత పదము శరణమయింది. పరాక్రమించారు. తమ తమ సంప్రదాయ విశేషములను తెలియజేయడానికి వికృత సంస్కృతమును వాస ఆరంభించారు. పుద్గలపారమితాది నూతన శబ్దాలు వారివి. చిరకాలంగా వస్తూవున్న సంస్కృత శబ్దాలనుకూడా అన్యథాన్యథా ఉపయోగించి నిర్వచించి సంస్కృత మును తమ ఆధీనంచేసికొనడానికి ఎంతగానో ఉద్యమించడము వారికి అవసరమయింది. జీవాజీవాది పదార్థనిర్ణయ సందర్భాలలో పూర్వమార్గమును పరిత్యజించడము, తమ ఇష్టానికి స్వాతంత్ర్యము ఇచ్చుకొనడము బాగా కనబడుతుంది. లోకమాన్యతిలకు ఒక మాట అన్నారు. "వేదామ్నాయ విరోధంతో ప్రచరించే ఏ విశేషమయినా భారతదేశంలో కొంతకాలమే ఉంటుంది." అని. ఈ రీతి భావాలన్నిటినీ బాగా పరిశీలించుకొని దోషాలను దూరీకరించుకుంటూ సంస్కృతయత్నం చేయడము చాలా అవసరంగా కనపడుతున్నది.

దేశభాషా ప్రియులయినప్పటికి మహారాజులు సంస్కృతమును ఆదరించి మహారాజు లయినారు. సంస్కృతా ధారముగానే లోకభాషావాఙ్మయం వచ్చిందికదా!. ఈ నాటికిన్నీ సంస్కృత పుష్టమయిన భాషాసాహిత్యమునె శిష్టమని అదుష్టమని అందరూ అంటున్నారు. కనుక నేటికిన్నీ అదే నీతి అదే రీతి అదే గతి అదే ప్రగతి. దేశప్రభువులయిన మునల్మానులు ఎంతచేసినా ఒకటి చేశారు. వారు సంస్కృత ముగ్ధులయినారు. మొగలాయి చక్రవర్తి షాజహాన్ మన తెలుగు జగన్నాథుని గౌరవించి విద్యాధికారి గౌరవం ఇచ్చి పండితరాయలు బిరుదంతో భూషించినాడు. షాజహాన్ కుమారుడు దారాషుకో పండిత రాయలదగ్గర వేదాంతం తెలుసుకొని విదేశాలకు అందించాడు. సంస్కృత హృదయు డయినాడు. ఇంగ్లీషువారు పాలకులుగా వచ్చి వ్యాపారంచేసి వ్యాపారానికి వచ్చి పాలకులై తంత్రయుక్తి ప్రయోగం చేశారు. గ్రంథాలు తగలబెట్టలేదు. సముద్రంలో ముంచలేదు. తమ దేశాలలో దాచి పరీక్షించారు. సమీక్షించారు. భావవిప్లవం తెచ్చారు. మానవత్వానికి దీనిలో ఏమున్నదని సమాజ రక్షణకు సంస్కృతంలో ఏమున్నదని మన చేతనే మన వాళ్ల చేతనే అనిపించారు. ఒకప్పుడు విద్యారణ్యుల మయిన మనము అరణ్య విద్యుల మయినాము. వేదవేదాంగ వేత్తలు వేదవిదులయినారు. చతుర్వేదులు త్రివేదు లయినారు. వారు ద్వివేదులు శాఖా వేదులు అయినారు. నేడు నిర్వే దుల వేదులనడము బాగుంటుందా ? ఇంకా కొంతకాలం ఉపేక్షిస్తే అ సంస్కృత హృదయుల మవుతామా ?

దేశభాషలు ఆశ్రయనాశానికి పూనుకోరాదు. అన్యదీయుల రీతి ననుసరించి ప్రక్షేపంచేయడము ధర్మచక్రం సహించదు. స్వకీయగతి ననుసరించి ప్రగతి సంపాదించడం యుక్తసముచితకార్యం. ఒక్కొక మండలంలో వావిలాల, తెల్లాకుల, పుతుంబాక మొదలగు శాసన సభ్యులనుకూర్చి అస్మాదృశుల బలంతో పరిషత్తు సిద్ధం చెయ్యవచ్చు. దేవాయ తన దేవతలు మాచేత ప్రబోధ ప్రచారములు చేయించనూ వచ్చు. ఎన్నివిధాలనయినా పాండిత్య రక్షణం చేయక తప్పదు. ఏ కొందరో మాత్రమే సంస్కృతాధ్యయనం చేస్తే అందరూ చదవకపోతే భాషా కలహం వస్తుంది. సంస్కృతజ్ఞులు దాడి చేస్తారు. విజ్ఞాన దృష్టితో అందరూ చదివితే సహృదయత్వం కలుగుతుంది. సంస్కృతంలో రచన రుద్ధమయింది. మళ్లీ

సముత్తే జనం సంపాదించకపోతే లోకక్షేమం రాదు. ఆంగ్లే సమానకక్షులై చదివే వారందరూ దీన్ని గుర్తించాలి. మూడవ భాగంగావారు చదివే గణిత విజ్ఞాన రసాయన చరిత్ర రాజనీతి తత్వసాహిత్య ఖగోళ భూగోళాదులలో అంతటా సంస్కృత భాషా గతమయిన విజ్ఞానం ఎంతగా ఉన్నదో గుర్తించకపోతె వారి పూర్వతనులవలె వారున్నూ వంచితులై లోక కంటకు లవుతారు. ప్రాచ్యపాశ్చాత్య సామరస్యంతో చక్కగా గుర్తిస్తే సంస్కృతంలో సూత్ర బద్ధంగావ్రాసి వృత్తికారికా భాష్యాలు వెలయింపవచ్చు. అప్పటి అభివృద్ధి మన కందరకూ సంభావనీయం.

చక్కగా సర్వగ్రంథాలున్న సమీక్షా సదనం ఆంధ్రులకులేదు. పాండిత్య వైదగ్ధ్యములను సమన్వయించుకుంటూ ఎంతయినా వ్రాయగలవారున్నారు. ఇన్నాళ్లూ ఉపేక్షించిన సహృదయతను అపేక్షా బుద్ధితో ఆరాధించాలి. నాట్యవేదవిద్య సమకాలాపేక్షితమయిన సహృదయత్వమును సుహృదయత్వమును సంపాదించగలదని మన ఆంధ్రంలో వ్రాస్తున్నాను. కేవలం రచయిత లయినవారుమాత్రం సంస్కృతం చదివి వారి చదువు ఫలితంగా దేశభాషలలో అనువాదం చేయడమె సంస్కృతారాధనకాదు. ప్రేయస్సును శ్రేయస్సును సమరసంగా సంస్కృతంనుంచి సర్వులూ అందుకోవాలి. సంస్కృత విద్య కామధేనువు. కామధేనువును ఆరాధించి తదనుగ్రహంగా సర్వవిశేషములను అందుకొనడానికి శ్రీ భావదేవుడను గ్రహించు గాత.

ఉదయము సభ శ్రీ సంస్కృత కళాశాలాధ్యక్షుల కృతజ్ఞతా వందనములతో **11-30** గంటలకు సమాప్తమయ్యెను.

తిరిగి మధ్యాహ్నం **2-30** గంటలకు సరిగా సభ ప్రారంభమయ్యెను. మధ్యాహ్నం సభకు కవిసార్వభౌమ శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగా రధ్యక్షత వహించిరి.

మధ్యాహ్నం గోష్ఠియందు శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, శ్రీ మదన మోహన్ విద్యాసాగర్, శ్రీమతి గుడుపూడి ఇందుమతీదేవిగారు శ్రీ కొండవీటి వెంకట కవిగారు దేవాలయములకును, భారతీయ సంస్కృతికిని విజ్ఞానమునకును సంబంధించిన విషయముల నుపన్యసించిరి. **5-30** గంటలనుండి **7** గంటల వరకును శ్రీ మాగంటి సీతారామదాసు పార్టీవారిచే శ్రావ్యముగా, సర్వజనాకర్షణీయముగా భజన చేయబడినది.

కమిషనరు, శ్రీ ఆర్. వెంకటరెడ్డిగారుపన్యసించుట.



రాత్రి 8-30 మొదలు 11-0 గంటలవరకును సంస్కృత కళాశాలా విద్యార్థులచే అభిజ్ఞాన శాకుంతలమునుండి 4, 5 అంకములు సంస్కృత నాటకము రమ్యముగ ప్రదర్శింపబడెను.

16-9-56 ఆదివారం ఉదయం 7-30 గంటలకు తిరిగి సభ ప్రారంభమయ్యెను. ఈ సభకు శ్రీమాన్ యస్. టి. జి. వరదాచార్యులు గారధ్యక్షత వహించిరి.

గోష్ఠియందు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు, శ్రీ గుర్రం మల్లయ్యాగారు, శ్రీ కావూరు గోపదేవుగారు, శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు శ్రీమాన్ వేదాంతం జగన్నాదాచార్యులుగారు, ఓరుగంటి నరసింహ యోగిగారు. ఉపన్యసించిరి. అనంతర మున శ్రీ దేవాదాయ పరిపాలనా శాఖాకమిషనరు వారగు శ్రీ వేంకట రెడ్డిగారు దేవాలయముల పరిపాలన - ప్రజాసహకార మును గురించి ఉపన్యసించుచు జీర్ణదేవాలయోద్ధరణములను గురించి ప్రభుత్వము సంకల్పించిన కామన్ గుడ్ ఫండ్ - దాని లక్ష్యములను గురించి వివరించి ప్రజాసహకారము నభ్యర్థించిరి.

పిదప శ్రీ రాజావాసిరెడ్డి హరిహర ప్రసాద్‌గారు కవిపండిత సన్మానముల నొనర్చి, కృతజ్ఞతా వందనముల సర్పించి సభను సమాప్త పరచిరి.

మధ్యాహ్నం 3-0 గంటలకు తిరిగి సభ "భువన విజయము" తో ప్రారంభమయ్యెను.

శ్రీ కృష్ణదేవరాయలుగా గౌరవనీయ మంత్రివర్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు విజయదుందుభులు మ్రోగు చుండగా వందిమాగధులు జయశబ్దములు పలుకు చుండగా "అష్టదిగ్గజముల" తో నలంకరింప బడిన యాస్థానమునకు విజయం చేసిరి. విద్యా మంత్రియగు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు, ఆయాయి కవులను ప్రస్తావించివర్ణించిరి, అలసాని పెద్దనగా తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, ముక్కుతిమ్మనగా మోచర్ల రామకృష్ణయ్యగారు, రుద్రకవిగా కన్నె గంటి వీరభద్రాచార్యులుగారు, మాదన్న గారి మల్లనగా పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు, శ్రీ రాయలవారి సింహాసనమునకు కుడి వైపున ఆసీనులైనారు. ఎడమవైపున రామరాజ భూషణుడుగా గుర్రం జాషువా కవిగారు, తెనాలి రామకృష్ణుడుగా దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు, ధూర్జటి కవిగా పెన్మెత్స సత్యానారాయణ రాజుగారు, పింగళి సూరనగా గడియారం శేషశాస్త్రి

భు వ న వి జ య ము



గారు ఉపవిష్టులైనారు. తిమ్మరసు మంత్రిగా శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు ఒక ప్రక్కను విద్యామంత్రిగా శ్రీ మాధవ రామశర్మగారొక ప్రక్కను ఉపవిష్టులైనారు - విద్యా మంత్రి యాదేశమున ఆయాయి కవులు శ్రీ రాయల వారిని ఆశీర్వచన పద్యములతో నభినందించిరి. పిమ్మట శ్రీ రాయల వారు "అష్టదిగ్గజములను" వారివారి ప్రతిభను చూపమని కోరగా 3 గంటల సేపు వారివారి కవితాధోరణితో సభను సంమోహితమునుగా నొర్చెను.

అనంతరము శ్రీ రాయల వారికి (శ్రీ చంద్ర మౌళిగారికి) శ్రీ రాజా వాసిరెడ్డి హరిహర ప్రసాద్‌గారు రజతపేటికను సమర్పించిరి. రాయలవారు "అష్టదిగ్గజములను" యథోచితముగ సమ్మానించిరి.

సభను సమాప్త పరచుచు శ్రీ మంత్రి వర్యులు యీ క్రింది విధంగా నుపన్యసించిరి.

ఈ నాడు నాటి అష్టదిగ్గజముల వంటి పండితులు వేలకొలదీ గలరు. ఈ నాడు యిచట యీ పండితులకు కవులకు చేసిన సన్మానము చాలా స్వల్పమైనదే యైనను సంపూర్ణ హృదయంతో చేయుచున్నది గాబట్టి అమూల్య మనియే గ్రహించ గోరెదను. ఇటువంటి సభలు జరుపుటలో మా ఉద్దేశ్యం పండితులు మాయుద్యమంలో సహకరించి వారి పాండిత్యమును ప్రజాసామాన్యమున కందుబాటులో నుండునట్లు వెదజల్లాలి. దేవాలయముల ద్వారా సంస్కృత భాషను అందరికని లభించేటట్లు పండితులు ప్రోత్సహించాలి. భారతీయ విజ్ఞానములో సర్వమానవ కళ్యాణము, విశ్వశాంతి యిమిడి వున్నందున - ఆ విజ్ఞానమును బోధించే సంస్కృతభాష అందరును అభ్యసించాలని నా దృఢమైన వాంఛ, అందుకై నేనెట్టి త్యాగానైనా చేస్తాను. మీరందరు కూడ యీ విషయంలో వైమత్యం విడనాడి ముందుకు వచ్చి తోడ్పడండి. అప్పుడే మనం శాంతి జ్యోతిని దేశదేశాల్లో వెలిగించగలం. అని ఉపన్యసించుచు సభలను జయప్రదంగా నిర్వహించిన శ్రీ భావనారాయణస్వామి దేవస్థానపాలకులకును, సభకు వచ్చి సభను శాంతంగా జరిపించిన సామాజికులకును ధన్యవాదములను పలికిరి.

పిమ్మట శ్రీ చంద్ర మౌళిగారు మద్రాసులో తమకు గురువు గారైన శ్రీ సుందరాచారిగారికి నూతన వస్త్రములు, రజతపాత్ర, రు. 116/- లు సమర్పించి సన్మానించిరి.

శ్రీ గుర్రం జాషువా కవిగారు తాముర చించిన "గబ్బిలము" అను కావ్యమును మంత్రి వర్యులు శ్రీ చంద్ర మౌళిగారికి కృతిసమర్పణము చేసిరి. మంత్రిగారు చందన తాంబూలాదులతో కవి వర్యుని సత్కరించి తమ కృతజ్ఞతను తెలియపరచిరి.

8-30 గంటలకు వైదిక మంగళాశాసన స్వస్తివాచనములతో సభ సమాప్తమయ్యెను.

---

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినోభవంతు ॥

ఇతి

॥ మంగళమ్ ॥

## भक्ताः - भागवताश्च

श्रवणं कीर्तनं विष्णोः स्मरणं पादसेवनम्। अर्चनं वन्दनं दास्यं सख्यमात्मनिवेदनम् ॥
इति पुंसाऽर्पिता विष्णौ भक्तिश्चेन्नवलक्षणा। क्रियते भगवत्यद्धा तन्मन्येऽधीतमुत्तमम् ॥

इति श्रीमद्भागवते व्यासेन भगवति भक्तेर्नवविधत्वं वर्णितम्। तादृशी भक्तिर्द्विविधा। भगवतः आत्मनश्चाभेदेन आत्मानं भगवते सर्वथा समर्प्य या भक्तिः प्रदर्श्यते सा प्रथमा; द्वितीया तु आत्मानं भगवतो भिन्नतया अङ्गीकृत्य या भक्तिः प्रदर्श्यते सा ॥

प्रथमां भक्तिमाश्रिताः भागवताः, द्वितीयांत्वनुसरन्तो भक्ताश्चेति निरुच्यन्ते। भागवते प्रह्लादः, बृन्दावनगोप्यश्च प्रथमकक्ष्यान्तर्गताः, महाभारते भीष्मः प्रथमः, युधिष्ठिरः, द्रौपदी च द्वितीये। रामायणे भरतः हनूमांश्च प्रथमकक्ष्यान्तर्गतौ भागवतौ।

भागवताश्च मनसा यद् ध्यायन्ति वाचा यद्वदन्ति कर्मणा यत्कुर्वन्ति तत्तत्सर्वमपि भगवतो विलासमित्येव मन्यन्ते। एवं नारदः, श्रीशुकः, जयदेवः, गोस्वामितुलसीदासः, चैतन्यप्रभुः, त्यागराजश्च केवलं भागवताः। भागवताश्च आत्मानं केवलं नोद्धरन्ति, किंच आत्मनः सङ्गेनान्यानपि तारयन्ति। तदेवोक्तम् नारदभक्तिसूत्रेषु "कस्तरति कस्तरति मायाम्? यः सङ्गं त्यजति यो महानुभावं सेवते यो निर्ममो भवति" इति। भागवतानां सङ्गेन भक्तिं उपासनां च लभन्ते नराः भक्तिभावमापन्नाः यथा स्वच्छे काचपात्रे निक्षिप्तमुदकं सूर्यकिरणैः शनैश्शनैरुष्णं भवति, किंतु तदेवोदकं यदि नीलकाच पात्रे यदि निक्षिप्यते तदा शीघ्रमेव तदुष्णं भवति सूर्यकिरणसंपर्केण, एवं ये भक्त्यावृतमनसो भवन्ति तेषां भागवतानां सङ्गः त्वरितं फलदो भवति। भागवताश्च कामक्रोधादिवर्जिताः, सर्वभूतेषु दयां कुर्वन्तः, क्षमादिगुणसंपन्नाः सर्वदात्मानं भगवते समर्प्य सर्वानपि आत्मनः सङ्गेन भक्त्या च उत्तारयितुं प्रयतन्ते।

एतदेव श्रीमद्भगवद्गीतायां भक्तियोगनिरूपणावसरे श्रीकृष्णेन निरुक्तम्।

श्रेयो हि ज्ञानमभ्यासाज्ज्ञानाद्ध्यानं विशिष्यते। ध्यानात्कर्मफलत्याग. त्यागाच्छान्तिरनन्तरम् ॥
अद्वेष्टा सर्वभूतानां मैत्रः करुण एव च। निर्ममो निरहङ्कारः समदुःखसुखः क्षमी ॥
सन्तुष्टः सततं योगी यतात्मा दृढनिश्चयः। मय्यर्पितमनोबुद्धिर्यो मद्भक्तः स मे प्रियः ॥

इति भागवतनिर्वचनमेवोक्तम्। एवं कुलशेखर नृपतिरपि "....एतत्प्रार्थ्यं मम बहुमतं जन्म जन्मान्तरेऽपि त्वत्पादाम्भोरुहयुगगता निश्चला भक्तिरस्तु ॥" इति भक्तेः संसारतारकतया वर्णितम् ॥ अतोऽस्मिन् कलौ युगे जपतपोऽनुष्ठानादि कर्तुमशक्नुवानाः भक्त्या केवलं भगवतः सारूप्यं प्राप्तुं शक्नुवन्ति ॥

इति भक्तिरेव गरीयसी मोक्षसाधनेषु ॥

---

# NABHI & THE PRIESTS SANG HIS GLORY

(From Srimad Bhagavata)

"O thou worshipful Lord,
Thou art infinite, thou lackest naught;
Yet thou dost accept the worship of thy children,
To shower thy mercy upon them.
What praise can we sing of thee?
We can only bow down at thy Lotus Feet,
Following the way of the wise.
"Thou art the Lord of the universe,
Beyond all name and form:
Who can express thee, thou who art in-expressible?
Yet they sing the glory of thy power,
For thou dost charm away all evil.
"Beyond speech and mind art thou, yet easily attainable by thy devotees;
Thou dost manifest thyself to those who worship thee in any name or form,
If only that worship is offered thee with a sincere and devoted heart.
"Thou needest not worship for thyself;
"Thou dost accept it to please thy devotees and to crown their heart's desire·
The wise who take delight in thee,
And have become one with thee,
Whose hearts are purified by non-attachment,
And touched by the fire of knowledge,
Always sing thy name and thy glory.
"If because of evil Karma we walk the path of the unrighteous,
Deluded in the mire of ignorance,
Grant us this prayer, O Lord:
That we may sing thy name,
Which charms away all sin and evil.
The veil of ignorance, difficult indeed to lift, keeps us from seeing thy divine face.
Thy grace and the service of great souls make possible the easy crossing of Māyā."

*(By kind courtesy of Ramakrishna Math)*

# ANDHRA ARCHITECTURE

*By*

V. V. Tonpe

## III—Foreign Influences on Hindu Architecture.

### 1. *Persian and Greek.* (*continued*)

Andhra art and architecture, being a part of Hindu art and architecture, could not avoid the influence of Persian and Greek styles on it. As in the case of Hindu architecture the outstanding Persian influence was on the decorative art of Andhra and the Greek influence on its sculpture and architecture. Let us know something historically about the Andhras before we try to know the foreign influences that moulded their culture.

### *The Earliest known Andhra Dynasty*

No sooner had Alexander departed from India, than Chandragupta, founded a new dynasty in Magadha uniting Northern India under his indomitable rule. His grandson, Asoka the Great, adopted Buddhism as the state religion in the third century before Christ. The famous XIII Edict of Asoka points out the kings modified theory of kingship after the conquest of Kalinga by blood shed which united not only his subject dominions but the neighbouring countries as well. "...even a hundredth or the thousandth part of all those people who were wounded, slain, or carried off captives, in Kalinga, would now be considered grievous by His Sacred Majesty. Nay, even if any one does mischief, what can be forgiven is considered as fit to be forgiven by His Sacred Majesty. Even those forest peopoles who have come under the dominions of His Sacred Majesty—even these he seeks to win over to his way of life and thought. And it is said unto them how even in his repentance is the might of His Sacred Majesty, so that they may be ashamed (of their crimes) and may not be killed. Indeed, His Sacred Majesty desires towards all living beings freedom from harm, restraint of passions, impartiality and cheerfulness.

"And what is *Dharmaivijaya,* [1] moral conquest, is considered by His Sacred Majesty the principal conquest. And this has been repeatedly won by His Sacred Majesty both here (in his dominions) and among all the frontier peoples even to the extent of six *yojanas* where (are) the Yona king, Antiochos by name, and beyond that Antiochos, the four kings Ptolemy, Antigonos, Magas and Alexander;[2]

---

1. It is interesting to note that the term *dharmavijaya* is not newly coined by Asoka, like *Pancha shila* being not Mr. Nehru's coinage, yet like Mr. Nehru, Asoka gives it his own, and new interpretation. The term has been used by Kautilya who speaks of three types of conquerors as (a) *Dharmavijayi,* who is satisfied with the mere obeisance of the conquered; (b) *Lobha-vijayi,* whose greed has to be satisfied by the surrender of kingdom and wealth; and (c) *Asura-vijayi,* who requires not only kingdom and wealth but also the heirs and the wife of the vanquished to satisfy him. It might be pointed out here that Asoka, the conqueror of innocent Kalinga was only an *Asuravijayi* but becoming Asoka, the beloved of Gods, *Devanampiya,* by taking to Buddhism, he rose to the heights of a *Dharma vijayi.*

2 The five Greek contemporaries of Asoka were 1 Antiochose II. Theos of Syria (261, 246 B.C) 2. Ptolemy II, Philadelphos of Egypt (285 247 B C.), 3. Antigonos Gonatas of Macedonia (278-239 B.C.,) 4 Magas of Cyrene (west of Egypt), (300-258 B C.), 5. Alexander of Epirus (272?-258 B C). The cultural contacts between these Greek rulers and Asoka would have been quite cordial Andhra as a dominion of Asoka might have enjoyed the benefits of such contacts with the foreigners. We, how ever do not have detailed historical evidence available on this.

below, the Cholas, Pandyas, as far as Tamraparni.

"Likewise, here in the kings dominion, among the Yonas [3] and Kambojaos, among the Nabhakas and Nabhitis, (Nabhapamtis in K.), among Pitinikas, among Hitinikas, among the Andhras and Palidas, everywhere are (people) following the religious injunction of His Sacred Majesty. Even those to whom the envoys of His Sacred Majesty do not go, [4] having heard of His Sacred Majesty's practice, ordinances, and injunctions of Dharma, themselves follow, and will follow, the Dharma. The conquest that by this is won everywhere, that conquest, again, everywhere is productive of a feeling of Love. Love is won in moral conquests. That love may be, indeed, slight, but His Sacred Majesty considers it productive of great fruit, indeed, in the world beyond"

From the above quotation it is clear that the relations between Asoka's dominions and the neighbouring kingdoms was cordial. We might compare Asoka's India with India, today. Except with Pakistan, the contacts that India has with other countries are generally cordial and her Pancha Shila, the ideal of peaceful co-existence, has drawn India closer to other nations of the world. This helps the country to exchange cultural benefactions with other countries of the world. But it is very difficult to point out the cultural contacts between Andhra State and the countries of the world as these are little or very little contacts of that kind. Yet Andhra State being an integral part of India, is definitely enjoying the benefits of India's contacts with the countries of the world. So also, Andhra of Asoka's India had perhaps not much to her credit of which she could be proud, yet History



Fig. 1.

3. These Yonas must have been the Greeks (Ionians) who had settled in the Aparanta provinces of Asoka's empire. This Greek colony was identified by Jayaswal with the city state of Nysa, where Alexander felt at home for its Hellenic ways. The immigration of the Yonas, Ionians, on Greeks must have taken place as early as the days of Cyrus, Darius and Xerzes.

4. This shows that Asoka was already in the habit of sending his envoys to the Greeks, just as they sent their envoys like Megastenes, Deimachos, etc. to the Mauryan Court. Asoka utilized his political envoys for the preaching of his Dharma in the Greek kingdoms. As art and archritecture in those days were the vehicles of religion and culture, there must have been a sympathatic understanding of them by the two peoples and we will not be far from truth if we guess that Greek art and architecture had its own influence on Indian art and architecture which is the parent of Andhra art and architecture. So Andhra culture also must have been influenced by Greek culture though historical evidence is not found to prove it.

tells us that the seed of Andhra culture had its sowing done by Asoka.

After Asoka, (232 B.C.) the Andhras assumed independence and succeeded to the imperial throne of Magadha establishing the Satavahana dynasty. The Puranas assign thirty Andhrabhrityas or Andhras for about 450 years after the fall of the Kanwas. It is not quite possible for us to assign for them a period of four centuries and a half in the history of Magadha basing our theory on chronological or other grounds. The Satavahanas were essentially a dynasty of the Deccan according to tradition. Certain authorities like Dr. Sukthankar hold that the Satavahanas were not Andhras However, it may be mentioned with the least objection that Andhra was a well-organized state which was powerful, according to the record of Megasthenes, (end of 4th C. B. C.). The earliest kings of Andhra according to inscriptional evidence were the Satavahanas, ignoring the account of the unidentified Kuberaka of Bhattiprolu. some Buddhist stories have a Naga king Kala in Majerika, some where at the mouth of the Krishna. Puranic tradition speaks of the Ikshvakus as having ruled over a great area of the Deccan. There are also other traditions of Andhra Vishnu and his father Suchandra which say that they were the earliest rulers. These conflicting evidences need not stand in our way, of accepting the Satavahanas of the Andhra lineage as the earliest rulers of the Andhra country.

*Tee Satavahanas*

The word Satavahana, in its corrupt form known as Salivahana, is mistaken for the name of an individual king. It was the name of the royal family founded by Simuka who extended the dominions along with his successors, from the onmouth of the Krishna to the whole of Deccan plateau. Pratisthana, modern Paithan or Pytoon on the Godavary, was their western capital, while Dhanyakataka, near Bezwada on the Krishna, was the eastern capital.

A large part of the Deccan was under the Satavahanas from the time they became independent of Mauryan rule to the reign of Gautamiputra Satakarani.



Fig. 2.



Fig. 3.

He was the hero of the war of independence against the aggressive foreigners like the Sakas, the Pahlavas and the Yavanas. When the invaders attacked the very *Dharma* of the country, he is said to have restored the castes. It is said that he " crushed down the pride and conceit of the Kshatriyas, furthered the interests of the twiceborn (Brahmins) as the lowest orders, and stopped the contamination of the four castes."[5] He ascended to the throne about 106 A. D. Within no time he over came the Saka chiefs of Malwa and Kathiawar and recovered his ancestral dominions in the Deccan. He added a large territories in Gujarat and Rajputana to his ancestral dominions and reigned the country for 25 years gloriously.

At the time when Gautamiputra Satakarani died the two Saka principalities of Malwa and Kathiawar were united under a valiant chieftan called Rudradaman. There was a long struggle between the two kingdoms. Rudradaman succeeded in pushing back the Andhras to the Deccan. A matrimonial alliance was established between the rival dynasties, by the marriage of Pulumayi with the daughter of Rudradaman. This marriage could not successfully arrest the continuance of the ancient grudge between the two royal households. Intermittent struggle contiunued between them till the Satavahana dynasty was blotted out about 225 A.D.

The western Satraps occupied a section of the Deccan, and ruled for over a century and odd. The rest of the Andhra empire was divided among a number of new dynasties like Abhiras, Kadambas and Ikshavakus.

*Andhra Culture*

The Andhra empire during the Sata vahana rule, was commercially forward. It had colonial contacts and many influences like those of the Greeks and the Persians over Andhra culture were great though very few records of them are available now. Buddhism achieved size

5. Sinha and Banerjee, "History of India" P. 94.

and dimensions and Andhra became the store house of Buddhist art. Nowhere can we know today such a large number of ancient Buddhist foundtations as in Andhra. They are the relics of ancient Andhra civilization. The third century A.D., was thus the culmination of one bright epoch of Deccan and the beginning of another political and cultural history of South India.

Like the Britains in Europe, the Andhras in India became a nation of navigators. Their commercial history and colonial activities are a romance of the deep. With an extensive sea-coast stretching from Kalingapatnam to Pulicat, the Andhras enjoyed the benefits of a see-faring life. Communication by sea was easier in those days than by land. The north of Godavari was impenetrable forest and heavy goods could not be easily transported by land. Whereas the Vamsadhara, the Godavari, the Krishna and the Pinakini (North Penner) were navigable up to a certain point. The Krishna and the Godavari served as thorough-fares of commercial and passenger traffic. *The Periplus of the Erythrean Sea* and the Geography of Ptolemy dating to about 80 A.D., and 140 A.D., respectively, record that ships plied from the mouths of the Krishna and the Godavari. Pliny about 80 A. D., mentions that ships assembled near the mouth of the Godavari and they sailed up to many towns and cities on the Ganges. Thus the rivers of Andhra facilitated internal as well as external commerce. They enriched the land with their deposits of alluvium. The rich soil could produce goods that attracted the foreigners.

Not only that, the land of rivers, made the men sea-minded. They ventured into the wider regions of the sea. The people living along the coast and on the banks of the rivers took to fishing and navigation. They went in search of hidden treasures of unknown lands and braved many a storm to discover them. Thus they threw the doors of their kingdom open to foreign commerce. Ports like Masulipatam and Sopatma which may be identified to have been situated somewhere near the mouth of the Swarnareka, i.e., where Pedda Ganjam stands today, are made mention of as the two Andhra ports by the *Periplus.* The commerce thus begun in the hoary antiquity was maintained till the eleventh century A.D.

Much of Andhra commerce was in textiles. Andhra was famous for its weaving according to the *Bhimasena Jataka. The Peripuls* refers to the large stores of ordinary cottons, many kinds of muslins which were exported from the Krishna and Godavari districts of to day. It is no wonder that Andhra, inspite of the onslaught of so many cultures on her, has



Fig. 4.



FIG. 5

kept up her tradition in the true spirit of Indian culture.

*Persian and Greek Influence on Andhra Art and Architecture*

It must be reiterated that as in Hindu architecture, the Persian and Greek influence on Andhra art and architecture has been superfluous. No doubt history tells us that the contacts between the Andhras and the Persians and the Greeks were many and cordial in various walks of life. But as in the case of Indian art and architecture, the influnce of Persian and Greek art and architecture on Andhra art and architecture is the return wave of Indian art and architecture itself. That is why it is rather a difficult task for us today to trace out the foreign influence on either Indian art or architecture. Though we might not place our finger on a perticular feature of Andhra art and architecture with confidence and say here lies the foreign influence, we might authentically assert that foreign influence is there on early Andhra and architecture. It may sound paradoxical but it is fact and generally facts are paradoxes.

According to some Hindu art and architecture are a "grand mosaic in which Persian, Greek and other elements shed their lustre. The so called bell-shabed capital, the honey-suckle ornament and even the use of stone for building are traced to Persia, while the winged animals, mythical plants and monsters came from Assyria. The image of the Buddha with the folds of clothing and a face like Apollo's and a halo like Athene's was first cut in the workshop in Gandhara under Graeco-Roman influences. In the classical style, the delineation of the muscles of the body and the modelling of the body are particularly note worthy. The acanthus ornaments of Amaravati are Greek according to some but it is so only in name as they possess the same vitality and beauty of form as the Indian lotus......... . . in dress, in a few motifs and scenes and in a certain polish of style, the classical influence is perceivable and it must have travelled to Andhra by land as well as by sea."[6] Almost all the features referred to above can be identified in Andhra art and architecture as well.

6. "Buddhist Remains in Andhra and the Histroy of Andhra between 225 £ 610 A. D."—K. R, Subramanian - Pp 48 - 49.

పండితులునైన, ముత్తేవి లక్ష్మపతిగారను వారి నాహ్వానించి వారిచే ప్రతిష్ఠా కార్యములఁ జేయించి అర్చనకు కూడ వారినే నియమించుకొనిరి. కాని అప్పటికి స్వామికి యేమి భూవసతి లేక పోయినప్పటికిని, వారత్యంత భక్తితో నాస్వామినే నమ్మి సేవించుచూ వచ్చిరి. శ్రీ బచ్చు పంతులు గారు తిరిగి గోలకొండకుఁ బోవుచూ శ్రీ స్వామి ధర్మకర్తృత్వమును వంశపరంపరా హక్కులతో నిర్వహించ వలసినదిగా యా లక్ష్మపతిగారికే వ్రాసి యిచ్చి వెళ్లిపోయిరి. తరువాత వారికుమారుఁడు పద్మనాభాచార్యులుగారు 50 యకరములును, వారి కుమారులు కొండమాచార్యులుగారు 350 యకరములును భూమిని సంపాదించి అందు 60 యకరములు పర్సనల్ యీనాముగా నుంచుకుని తక్కిన భూమిని స్వామి కర్పణచేసి యుండిరి. ఇప్పటికిని వారి వంశీయులే వంశపరంపరా ధర్మ కర్తలుగాను, అర్చకులు గాను కూడ నుండిరి.

## వస్తువులు, వాహనములు

స్వామివారికి రత్నములు బంగారు ఆభరణములు
రు. 1300-0-0

వెండి సర్వాంగకవచము సుమారు
ఖరీదు రు. 7500-0-0

మొత్తము విలువకలవి కలవు. రు. 8800-0-0

కళ్యాణమంటపము



వెండి శేషవాహనము, కర్ర గుర్రపువాహనము. గరుడ వాహనము, హనుమంత వాహనము మున్నగునవి కలవు.

## ఉత్సవములు, జయంతులు

శ్రీ స్వామివారికి చైత్రశుద్ధ దశమి ప్రభృతి పౌర్ణమి పర్యంతము పంచాహ్నిక దీక్షతో తిరుకళ్యాణ మహోత్సవమున్నూ, వసంత నవరాత్రులు, శ్రీరామజయంతి, నృసింహజయంతి, కృష్ణజయంతి, శ్రావణ శు ౧౫ లకు శ్రీ విఖనసాళ్వారు తిరునక్షత్రమున్నూ మహావైభవముగా జరుగును. ఆశ్వయుజమాసములో లక్ష్మీపూజయు, విజయదశమిరోజున పారువేటోత్సవమును జరుగు యాచారము కలదు. విశేషభోగములు జరుగుచుండును. శ్రీ స్వామిని ప్రతిష్ఠించుకాలమున శ్రీ శృంగేరి పీఠాధిపతులు శ్రీమదభినవోద్దండ నృసింహభారతీస్వాములవారు విజయంచేసి శ్రీ వెంకటేశ కరావలంబన స్తోత్రమును రచించి మంగళాశాసనముఁ జేసిరి. దాని నీక్రింద ప్రచురపరచితిని.

## శ్రీవెంకటేశ కరావలంబ స్తోత్రము

శ్లో. శ్రీశేషశైల సునికేతన దివ్యమూర్తె
నారాయణాచ్యుత హరే! నళినాయతాక్ష
లీలా కటాక్ష పరిరక్షిత సర్వలోక!
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్లో. బ్రహ్మాదివందిత పదాంబుజ శంఖపాణే!
శ్రీమ త్సుదర్శన సుశోభిత దివ్యహస్త
కారుణ్యసాగర శరణ్య సుపుణ్యమూర్తె
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్లో. వేదాంతవేద్య భవసాగరకర్ణధారిన్
శ్రీ పద్మనాభ కమలార్చితపాదపద్మ
లోకైకపావన పరాత్పర పాపహారిన్
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్లో. లక్ష్మీపతే నిగమ లక్ష్య నిజస్వరూప
కామాదిదోష పరిహారిత బోధదాయిన్
దైత్యారి మర్దన జనార్దన వాసుదేవ
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్లో. తాపత్రయం హరవిభో, రభసంమురారే
సంరక్షమాం కరుణయా సరసీరుహాక్ష
మచ్ఛిష్య మప్యనుదినం పరిరక్ష విష్ణో
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్లో. శ్రీజాతరూప నవరత్నలసత్కిరీట
కస్తూరికా తిలక శోభిలలాట దేశ
రాకేందు బింబ వదనాంబుజ వారిజాక్ష
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్లో. వందారులోక వరదానవచో విలాస!
రత్నాఢ్యహార పరిశోభిత కంబుకంఠ!
కేయూరరత్న సువిభాసి దిగంతరాళ!
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్. ౭

శ్లో. దివ్యాంగదాంచిత భుజద్వయమంగళాత్మన్
కేయూర భూషణ సుశోభిత దీర్ఘబాహో
నాగేంద్ర కంకణ కరద్వయ కామదాయిన్
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్. ౮

శ్లో. స్వామిన్ మహాజనన వారిధి మధ్యమగ్నం
మాముద్ధరాద్య కృపయా కరుణాపయోధే!
లక్ష్మీంచ దేహి విపులామృణ వారణాయ
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్. ౯

శ్లో. దివ్యాంగరాగ పరిపోషిత కోమలాంగ
పీతాంబరావృతతనో! తరుణార్క భాస
సత్కాంచనాభ పరిధానసుపట్టబంధ
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్. ౧౦

శ్లో. రత్నాఢ్యధామ సునిబద్ధ కటిప్రదేశ!
మాణిక్య దర్పణ సుసన్నిభ జానుదేశ!
జంఘద్వయేన పరిమోహిత సర్వలోక!
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్. ౧౧

శ్లో. లోకైకపావన సరిత్పతి శోభితాంఘ్రే
త్వత్పాదదర్శన దినేశ మహాప్రసాదాత్
హార్దం తమశ్చ సకలం లయమాప విష్ణో
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్. ౧౨

శ్లో. కామాదివైరి నివహోఽప్రియమంప్రయాతః
దారిద్ర్య మప్యపగతం సకలందయాళో
దీనంచ మాం సమవలోక్య దయార్ద్ర దృష్ట్యా
శ్రీ వెంకటేశ మమ దేహి కరావలంబమ్. ౧౩

శ్లో. శ్రీ వెంకటేశ పద పంకజ షట్పదేన
శ్రీమన్నృసింహ యతినారచితం జగత్యాం
యే తత్పఠంతి మనుజాః పురుషోత్తమస్య
తే ప్రాప్నువంతి పరమాం పదవీం మురారేః. ౧౪

---

శ్రీ వేంకటేశ్వరస్వామి - ఉత్సవ విగ్రహములు



# ఉత్సవములు _ వ్రతములు

## (కార్తికమాసము నందలివి)

కార్తికమాసము మాసములలోకెల్ల పవిత్రమైనది. ఈ మాసము విష్ణుభక్తులకును, శివభక్తులకునుకూడ సత్తమమైనదై తత్తద్దేవతలకు సంబంధించు పూజలొసర్చి తరించుట కర్తవ్యమైనది.

విష్ణుభక్తులు మాసమంతయు నుషఃకాలమునందు తీర్థస్నానము లొనరించి విష్ణుప్రీతి కొరకు దీపదాన మొసగుదురు.

శివభక్తులు - శక్తిగలవారు - మాసమంతయు నక్తవ్రతముచేసి సాయంకాలమందు శివార్చనచేసి నివేదితమును భుజింతురు. అశక్తులగువారు మాసమునందలి సోమవారము లన్నిటియందుగాని, ఒక్కవారమునందైననుగాని శివునికి రుద్రాభిషేకము- సహస్రనామార్చనలు చేసియు చేయించియు ఆ దినమున నక్తవ్రతమాచరింతురు.

**10-11-56** తేదీ కార్తీక శుద్ధ ౮ అష్టమీ శనివారము గోపాష్టమి.

ఈ దినమునందు గోపూజ, గోప్రదక్షిణము చేయుదురు. ఈ పూజ ఆంధ్రదేశమున క్వాచిత్కముగ నున్నది. ఈ పూజ, ప్రదక్షిణములు ఇష్టకామ ప్రదములు.

**11-11-56** తేదీ కార్తిక శుద్ధ నవమీ ఆదివారం - విష్ణు త్రిరాత్రవ్రతము. ఈ దినమున విష్ణువు నావాహనచేసి క్షీరాబ్ధి ద్వాదశి దినమునందుద్వాసనముచేయు నాచారము.

**14-11-56** తేదీ కార్తీక శుద్ధ ౧౧ ఏకాదశీ బుధవారము:—ఈ ఏకాదశి బోధనైకాదశియనియు, ఉత్థానైకాదశియనియు వ్యవహరింపబడును. చాతుర్మాస్యవ్రతముకూడ- ఆషాఢ శుద్ధ ఏకాదశి - శయనైకాదశికి - ప్రారంభింపబడి ఈ బోధనైకాదశితో ముగింపబడును.

ఈ దినమునందు భీష్మపంచక వ్రతముకూడ చేయుదురు. ఈ వ్రతము ఏకాదశియందారంభించి పౌర్ణమియందు ముగింపబడును.

**15-11-56** కార్తీక శుద్ధ ౧౨ ద్వాదశీ గురువారము:—క్షీరాబ్ధి ద్వాదశి, మథన ద్వాదశియని వ్యవహరింపబడును. ఈ దినమందు తులసీ వ్రతము సౌభాగ్యము కొరకై స్త్రీలచే చేయబడును.

ఈ తులసీవ్రతమునందీ కథ కలదు—

ఈశ్వరుని ఫాలమునందలి స్వేదబిందువు సముద్రమున బడి జలంధరునిగా యావిర్భవించెను. ఆజలంధరునికి బ్రహ్మవరమిచ్చెను. "ఎంతవరకు జలంధరుని భార్య జలంధరుని తప్ప యితరులను పొందదో అంతవరకు జలంధరు నెవ్వరును చంపలేరు." అని. జలంధరునిచే పీడితులగు దేవతలు విష్ణువుని ప్రార్థింపగా విష్ణువు జలంధర రూపమున తులసిని బొందెను. అంతట ఇంద్రుడు జలంధరుని తలను దునుమ నాతల తులసి ముందఱపడెను. తులసి సర్వముతెలిసికొని విష్ణువును 'రాయి కమ్ము' అని శపించెను. గండకీనదినందు లభించు సాలగ్రామ శిలలే ఈ శాపఫలిత శిలలని యైతిహ్యము. విష్ణువుకూడ తులసికి మొలకయై యుండుమని ప్రతిశాపమిచ్చెను. తులసిచే ప్రార్థింపబడిన విష్ణువు తులసి దేవతగా యెల్ల లోకములందును పూజింపబడునని యనుగ్రహించెను.

**18-11-56** తేదీ కార్తీక శుద్ధ పౌర్ణమీ ఆదివారము - ఈ పౌర్ణమియందు ధాత్రీపూజ యొనర్తురు భక్తేశ్వర వ్రతమును స్త్రీలు మాంగళ్యముకొరకు చేయుదురు. దీనినే 33 పున్నముల వ్రతమనికూడ యందురు. ఈ దినమునందు జ్వాలాతోరణము నొనర్చెదరు. విష్ణ్వాలయములందును, శివాలయములందును గూడ ఈ జ్వాలాతోరణ మహోత్సవము చేయుదురు. ఈ జ్వాలాతోరణమును గురించి పండిత శ్రీ పెనుమెత్స సత్యనారాయణరాజుగారు రచించిన పద్యము ఈ యుత్సవ వైశిష్ట్యమును తెలుపుచున్నది.

"కార్తికకవేళ భీమశంకరుని వీట
దూరునెవ్వాఁడు చిచ్చుర తోరణంబు
వాఁడు దూరఁడు ప్రాణ నిర్వాణవేళ
ఘోర యమమందిర ద్వారతోరణములు'

# మోక్ష మార్గము

బులుసు - వేంకటరమణయ్య

నశ్వరమైన సంసారంనుంచి విడుదలపొంది శాశ్వతమైన ముక్తిని పొందడానికి ప్రయత్నించడం జ్ఞానులందరికీ సహజం. సంసారమనే జంబాలంలో పడి కొట్టుమిట్లాడుతూ, అందులోనుండి తప్పించుకోలేని వారికి ముక్తి లేదనీ, సంసారబంధంలో చిక్కుకోకుండా యోగి అయిన వారికే మోక్షప్రాప్తి కలుగుతుందని కొందరి అభిప్రాయం. కాని మన ప్రాచీనులు నిర్ణయించిన బ్రహ్మచర్యాది ఆశ్రమములనుబట్టి, సనాతన ధర్మాలనుబట్టి పరిశీలించగా— సంసారికికూడా మోక్షాన్ని పొందే అవకాశం పూర్తిగా ఉన్నదని తెలుస్తున్నది. జనకుడు మున్నగువారు సంసారులుగా ఉండే మోక్షాన్ని పొందారు. అంతేకాకుండా కప్పదాట్లువేసి, ఆశ్రమ వ్యతిక్రమం చెయ్యడం తగదనీ, తాను సంసారంనుంచి తప్పించుకోవడానికి ప్రయత్నించినా—ఆ ప్రయత్నం సఫలం కాదనీ, ఏరూపంగానైనా సంసారాన్ని సాగించిన తర్వాతనే మోక్షం పొందడం సుగమమనీ తత్త్వవేత్తలు చెప్పుదురు. గృహస్థాశ్రమాన్ని తిరస్కరించడం తప్పని తెలియచేస్తూ, మోక్షమార్గాన్ని తెలియజేసే ఉపాఖ్యానం—అయుతుని చరిత్ర సుప్రసిద్ధమై ఉన్నది.

పూర్వకాలంలో ప్రయుతుడు అనే మహర్షి ఉండేవాడు. అయుతుడు, నియుతుడు అతని కుమారులు. వారిద్దరూ మంచి బుద్ధిమంతులు. సుప్రసిద్ధుడైన అగస్త్యమహామునికి అంతేవాసులయి, వారు స్వల్పకాలంలోనే సమస్త విద్యలూ నేర్చుకొన్నారు. విద్యాభ్యాసకాలంలో వారు ఆకలి దప్పులను లెక్కించలేదు. తగిన గుడ్డలు లేకున్నా విచారించలేదు. తలలు మాసిపోయినా చికాకుపడలేదు. బడలికను లెక్కించలేదు. కూర్చున్న చోటునుండి కొంచెమైనా కదలకుండా—రాత్రింబగళ్లు అధ్యయనం సాగించేవారు. వినయవిధేయతలు కలిగి, శిష్యులందరికీ తలమానికములైవుండేవారు. అందువల్ల అగస్త్యమహర్షికి వీరిద్దరి మీదా ప్రత్యేకమైన వాత్సల్యం ఏర్పడింది.

విద్యాభ్యాసం పూర్తికాగానే వీ రిద్దరికీ తగిన కన్యల నిచ్చి వివాహం చెయ్యాలనే సంకల్పం అగస్త్యమహర్షికి కలిగి, వారిద్దరూ తన మాట మీరరనే నమ్మకంతో బ్రహ్మదేవునివద్దకు పోయి, అతని పుత్రికలను యాచించి తెచ్చాడు. భూలోకంలో తన శిష్యులకు తగిన కన్యకలు లేరనే అభిప్రాయంతోటే అతడు సత్యలోకానికి వెళ్లి బ్రహ్మసుతలూ, అందకత్తెలూ అయిన గాయత్రి, సావిత్రి అనే వారిని తెచ్చి, తన శిష్యులను పిలిచి "మీకోసం ఎంతో శ్రమపడి యీ కన్య లిద్దరినీ తెచ్చాను. మీలో పెద్దవాడు పెద్దదానినీ, చిన్నవాడు చిన్నదానినీ పరిగ్రహించి, గృహస్థులయి నాకు తృప్తికలిగించవలెను" అని చెప్పెను.

గురువుమాటలకు చిన్నవాడైన నియుతుడు సమ్మతించాడు. కాని పెద్దవాడైన అయుతుడు అంగీకరించలేదు. అతనికి మొదటినుంచీ సంసారమంటేనే ఏవగింపు. స్త్రీలు మాయలకు నిలయాలనీ, వారిని నమ్మరాదనీ, సంసారంకంటె నరకం మరొకటి లేదనీ అతని అభిప్రాయం. అందువల్ల అతడు గురువుమాట వినక తన కుద్దేశింపబడిన కన్యను వివాహమాడ తిరస్కరించెను. అగస్త్యునకు మితి మీరిన కోపము వచ్చి, అయుతుని తన ఆశ్రమము నుండి తరిమివేసి, ఆ కన్యల నిద్దరినీ నియుతునికే పెండ్లి చేసెను. విచారముతోకూడిన మనస్సుతో అయుతుడు చేయునదిలేక అగస్త్యాశ్రమమును విడిచి, పట్టుదలతో బ్రహ్మచర్యమును పూని ఒక వనములో ముక్తికొరకు తపస్సుచేయ నారంభించెను. క్రమముగా, అతని తపస్సు తీవ్రమయి, లోకములను మండింపచేయు విధమున నుండెను.

ఎవ్వరైనను ముక్కు మూసుకొన్నయెడల తన పదవికి భంగము కలుగునని భయపడుట ఇంద్రుని స్వభావము. అయుతుని తపస్సువల్ల అతనికి ఎక్కువ కలతపాటు కలిగినది. ఏవిధముగానైనా సరే—అయుతుని తపస్సునకు భంగం కలిగించి, అతడు సంసారంలో దిగేటట్లు చెయ్యాలని ఇంద్రునికి పట్టుదల ఏర్పడినది. అందువల్ల అతడు ఒక ముసలి వానప్రస్థుడుగా మారి, శచీదేవిని ముసలి ముత్తయిదువుగానూ, కామధేనువును ఒక ముసలి ఆవుగానూ మార్చి అయుతుడు తపస్సు చేస్తూవున్న వనములో ప్రవేశించెను.

శిష్యులతో వచ్చుచున్న ఆ మాయా వానప్రస్థుని వాలకము మిక్కిలి జాలిని గొలుపుచుండెను. పాత జింక చర్మం చుట్టిన పుస్తకాల కట్టను ఒక విద్యార్థి మోసికొని వచ్చుచుండెను. అతని కంబళాలనూ, కావిగుడ్డలనూ మరొకడు తెచ్చుచుండెను. ఉప్పు, పప్పు, చింతపండు మొదలైన వంటకు కావలసిన వాటిని మరొకడు మోసికొని వచ్చుచుండెను. సమిధలూ, నెయ్యి నింపిన వెదురు గొట్టాలూ మొదలైన యాగసామగ్రిని ఇంకొకడు తెస్తూ వచ్చుచుండెను. దూడతోకూడిన ముసలి ఆవును ఒక

చిన్న వడుగు రొప్పుకొని వచ్చుచుండెను. ముగ్గుబుట్టలా బాగా పండిపోయి, వణుకుతూ ఉన్న తలతో ఆ వానప్రస్థుని అర్ధాంగి—అతని శరీరంలో ఇముడలేక బయటికి వచ్చిన—మూర్తీభవించిన జరాదేవతవలె మెల్లిగా నడచి వచ్చుచుండెను.

ఈవిధంగా—తీర్థయాత్రలు చెయ్యడానికి వచ్చేవాని విధంగా అయుతుడున్న వనంలోకి వచ్చి, అతనికి కొంత దూరంలో పటకుటీరం నిర్మించుకుని, దానిమధ్య కూర్చుని మాధ్యాహ్నికాదులు నిర్వర్తించుకుని భోజనంచేసి కొంత సేపు గోసేవచేసి దాని దారిబడలికను తీర్చెను. తర్వాత ఆ వానప్రస్థుడు కొంతసేపు విశ్రమించి చల్లబాటువేళ శిష్యులతోకూడా అయుతుడున్న ఆశ్రమానికి వెళ్ళెను. అయుతుడు అతనికి అతిధిసత్కారంచేసి, ఆసనంమీద కూర్చుండజేసి, ఆగమనకారణాన్ని ప్రశ్నింపగా ఆ మాయావి ఇలా చెప్పినాడు—

"మా నివాసం మేరుప్రాంతంలో ఉన్న ఆశ్రమం. అక్కడ అమరులు నివసిస్తారు. కామక్రోధాదులు ఆచుట్టుపట్లకూడా కానరావు నే నక్కడ నా మిత్రులతోకూడి సుఖంగా కాపురం చేస్తున్నాను. తీర్థయాత్రకు పోవాలనే ఉద్దేశంతో శ్రీరంగం, కంచి, తిరుపతి, ప్రయాగ, గయ, శ్రీ జగన్నాథం, సింహాచలం మొదలైన దివ్యక్షేత్రాలు సేవించాను. కల్పవృక్ష సమానుడయిన విఠలదేవుని సేవించాలనే ఉద్దేశంతో పాండురంగక్షేత్రానికి వెళ్ళుతూ మార్గవశమున ఇక్కడ బసచేశాను. ఇదీ నానంగతి. నాయనా! నువ్వెవరవు? ఏ కోరికతో-ఇట్టి చిన్నవయస్సులో ఘోరమైన తపస్సు చెయ్యడానికి పూనుకొన్నావు? నీసంగతి చాలా ఆశ్చర్యంగా వున్నదే!"

వేషధారి అయిన ఇంద్రుడు ఇలా పలుకగా అయుతుడు "స్వామీ! నేను అయుతుడనేవాడను. ప్రయుతుని పుత్రుడను. నా తమ్ముడు నియుతుడు. మహా తపశ్శాలి అయిన అగస్త్య మహామునికి మేమిద్దరమూ శిష్యులము. తక్కిన శిష్యులందరికంటేకూడా ఆ మహామునికి మాపైని ఎక్కువ వాత్సల్యం వుండేది. దాత, దైవము, గురు, తల్లి, తండ్రి, సమస్తమూ అతడే. మామీదవున్న అభిమానంకొద్దీ మా విద్యాభ్యాసం పూర్తిఅయాక అతడు బ్రహ్మపుత్రికలూ, అందకత్తెలూ అయిన గాయత్రి, సావిత్రి అనే ఇద్దరు కన్యకలను తెచ్చి మాకు వివాహం చెయ్యడానికి సిద్ధపడ్డాడు. స్త్రీల దుఃస్వభావంనుంచి మొదటినుంచీ వివాహం చేసుకోరాదనే నిశ్చయంతోవున్న నేను గురువుగారి కోరికను నెరవేర్చలేక పోయాను. అందువల్ల ఆయనకు విపరీతమైన కోపం వచ్చింది. నామీదవుండే వాత్సల్యంకొద్దీ శపించక ఆశ్రమంలోంచి వెళ్లిపోవాలని శాసించాడు. ఆ యిద్దరు కన్యలనూ నా తమ్మునికే వివాహము చేసినాడు. శపించకుండా నన్ను విడవడమే పదివేలని భావించి నేను-బ్రహ్మచర్యమూలంగా మోక్షాన్ని పొందాలనే కోరికతో ఉగ్రమైన తపస్సు చేయుచున్నాను విషయాభిలాషలన్నీ విషసమానాలని నా అభిప్రాయం" అని పలికెను.

ఈమాటలువిని ఆ మాయలాడు చిరునవ్వు నవ్వి తల పంకిస్తూ ఇట్లనెను—

"నాయనా! నీవు ప్రయుతుని కొడుకువా! చాలా సంతోషం. అతడు నాకు మిత్రుడు. అతనికొడుకు ఇంతవాడైనందుకు అవధిలేని ఆనందం కలుగుతున్నది. కాని నీ విపరీత ప్రవర్తనమాత్రం మనస్సుకు ఎక్కువ బాధ కలిగిస్తున్నది సుమా! నీవు కులధర్మాన్ని విడిచావు. గురువుమాట తిరస్కరించావు. ఆశ్రమాన్ని విడిచావు. బంధువులను విడిచావు. బ్రహ్మచర్యం పూనినావు; కాని, యింద్రియాలను నిగ్రహించడం సామాన్యం కాదు. సంసారం మోక్షానికి ప్రతిబంధకం అని నీకెలా తోచిందో? జనకుడు మున్నగువారు ఎలా ముక్తిని పొందినదీ తెలియదా? సంసారాన్ని నిందించడం గొప్ప తప్పు. పసులకొట్టనుంచి పాలువస్తూ, పంటలు సమృద్ధిగా పండగా, వడుగులతోనూ, పెండ్లిండ్లతోనూ ఇల్లు కలకలలాడుతూ ఉండగా, ఇంటికివచ్చిన అతిధులు తృప్తిపడి సంతోషంతో వెళ్ళుతూ ఉండగా, పరిచారికలు పనిపాటలు చేస్తూవుండగా, చుట్టపక్కాలతో నిండిన యిల్లు ఎంతో కలకలలాడుతూ వుంటుంది. గృహయజమాని గ్రామంలోని తగు మనుషులకు పెద్దగాఉండి, అతని మాట ఊళ్ళో సాగుతూవుంటే అంతకన్నామించిన సంతుష్టి లేదు. అలాంటి గృహస్థు నిర్విఘ్నంగా నిత్యనైమిత్తికాలు జరుపుతూ, ఇలువేల్పునకు నివేదించిన చతుర్విధాహారాలూ భార్య వడ్డింపగా, భుజిస్తూ కాలం గడపడమే మేలైనది. అంతకంటె వేరే ముక్తి యేమున్నది? నీవు గృహస్థాశ్రమాన్ని నిరసించడం చాలా పొరబాటు."

మాయావానప్రస్థుడు ఇలా చెప్పగా అయుతునికి చాలా కష్టం అనిపించింది. "జ్ఞాన వయో వృద్ధులూ, అనుభవజ్ఞులూ అయిన మీరు ఇలా చెప్పడం చాలా వింతగాఉన్నది. మమకారం లేనివానికి మిత్రులూ, సంసారమూ, బంధువులూ మున్నగువాని సంబంధం ధర్మమగునా? మీరు ఇతరుల బోధవల్ల జ్ఞానంసంపాదించిన జనకునిపేరు ఎత్తుతారు కాని, సహజంగా విజ్ఞానాన్ని సంపాదించిన శుకమహర్షి పేరు ఎత్తరేమి? మోక్షము మునిజనుల భాగధేయం! గృహస్థులకు అది చాలా దూరము! బూడిదబొట్టువంటి గృహస్థధర్మాన్ని నీవు చాలా గొప్పగా కొనియాడుతున్నావు. గృహస్థధర్మం చక్కగా సాగాలంటే సంపదలుండవలెను. అవి పూర్వజన్మ సుకృతంవల్లగాని లభించవు. ఆ సంపదలు

కలిగితే ఎంతగొప్పవానికైనా మదం ఏర్పడుతుంది. కాబట్టి దయయుంచి యిలాటి బోధలుమాత్రం నాకు చేయకుము" అని అయుతుడు పలికాడు. మరిన్నీ యింద్రుడు ఏమి బోధించినా ఒకటికి పదిగా సమాధానాలు చెప్పి అతని నోరు కట్టించాడు. అందుమీద అతనికి విపరీతపు కోపం కలిగింది.

"నాయనా! క్షమించు. ఏదో చిన్నవాడవుగదా! అని అనుభవం వున్న నేను నీ మేలుకోరి యింతవరకూ చెప్ప వలసి వచ్చినది. మహామహుడూ, గురుపూజ్యుడయిన అగస్త్య నంతటి వానిని ధిక్కరించిన నీకు నామాట లెక్కయేమి? గుడిమ్రింగేవానికి తలుపులు అప్పడాలవంటివి కదా! నీవు శుకాదులకు సమానమైనట్టు భ్రాంతిపడుతున్నావు. బొందెతో కైలాసానికి పోవాలని అనుకుంటున్నావు. అందని మ్రాని పండ్లకు అర్రు చాస్తున్నావు. నీకర్మం! నే పోతున్నాను" అని కోపంతో అతడు వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు—తన మాట సాగలేదని కోపంతో వెళ్లేనేగాని—అయుతుని పూర్తిగా విడువలేదు. అతనిని చిక్కులలో దింపి బాధలు పెట్టాలని అతని ఉద్దేశం. ఆ ఉద్దేశంతో తాను భార్యతోనూ, శిష్యులతోనూ, ఆ స్థలం విడిచి పోతూ తన కామధేనువును మాత్రం ఆ అడవిలో విడిచిపెట్టాడు. ఇంద్రుని ప్రభావంవల్ల ఆ గోవు మర్నాటికి చాలా బక్క చిక్కి ప్రాణావశిష్టమై అయుతునికి ఆశ్రమప్రాంతంలో కనిపించెను. దాన్ని చూడగానే ఆ మునికుమారునికి చాలా ఆశ్చర్యం కలిగింది. అది నిలవలేక నిలుస్తూ, దర్భ గడ్డిని కొరకలేక కొరుకుతూ, బాధతో కన్నీరు కారుస్తూ ఉండెను. దాని శరీరంనిండా వ్రణాలు నిండి రక్తం ప్రసరిస్తూ ఉండెను. అడవియీగలు ఆ గాయాలను గొలుకుతూ ఎక్కువ బాధ కలిగిస్తూ ఉండెను. ఇట్టి గోవును చూడగా అయుతునకు చాలా జాలికలిగెను. అది వానప్రస్థుని గోవని అతడు గ్రహించి, ఒకటి రెండు దినాలలో అది యీవిధంగా తయారైనందుకు మిక్కిలి ఆశ్చర్యపడ్డాడు ఈ కామధేనువువల్లనే తన కార్యం సాధించుకోవాలని యింద్రుడు ఇలా పన్నుగడ పన్నిన సంగతి—పాపం!—అయుతునికి తెలియదు.

ఆ గోవును ఎలాగయినా ఉద్ధరించాలని అయుతునికి కోరికకలిగి, చాలాకాలము దాని సంరక్షణముననే వినియోగించేవాడు. అతని సంరక్షణవల్ల కొద్దికాలంలోనే ఆగోవు స్వస్థతపొంది బలిసి, తక్కిన పశువుల కన్నింటికీ బెదరు కలిగిస్తూ, ఆ అడవిలో విచ్చలవిడిగా సంచరింపసాగినది. అది ప్రతి సంవత్సరమూ దూడలను కనడంవల్ల అయుతునికి తన సంసారం లేకపోయినా గోసంసారవు భాధ్యత ఎక్కువై కొంతకాలానికి చాలా చికాకుకలిగింది. సంసారాన్ని ఏవగించి, తపస్సుచేసుకుంటున్న తనకు ఈ గోవు లంపటం ఎందుకు ప్రాప్తించినదని అతడు చాలా క్షోభపడే వాడు. చాలాసార్లు అతడు ఆ గోవును దూరపు టడవుల్లో విడచి వచ్చేవాడు. కాని, మరునాటికి అది తన ఆశ్రమం వద్ద ప్రత్యక్షమయేది. చివరకు అతడు విసిగి వేసారి, దానిమెడలో ఒక పెద్ద తుండు (టొంప) కట్టి, దుడ్డుకర్రతో దానిని బాది, కొట్టి, మరొక అడవిలోనికి తరిమివేసెను. అది మరల వెనుకకు వచ్చునేమో అనే అనుమానంతో తానుకూడా దానివెంట పోసాగెను. చివరకు—అతని బాధలు పడలేక—ఆ ధేనువుకు చాలా కోపం వచ్చి, వేగంగా పోయి మరొకవనంలో గొప్ప తపస్సమాధిలోవున్న వాధూల మహామునిని త్రొక్కివేసి, అతని సమాధికి భంగం కలిగించెను.

యోగభంగంవల్ల ఆ మహాముని మేల్కొని అలా జరిగి నందుకు మిక్కిలి కోపించి చూడగా, తన్ను మట్టిన గోవూ, దానిని వెంటపరుముతూ దుడ్డుకర్ర చేత పుచ్చుకుని యమునివలె ఉన్న అయుతుడూ కనబడ్డారు. అతనికి మునికుమారునిమీద విపరీతపు కోపం కలిగి "ఓరీ! దురాత్మా! ఈవిధంగా పశువును తరిమి, నన్ను మట్టించి నియమభంగం చేసినందుకు నీవు కప్పవై పుట్టుదువుగాక" అని ఘోరంగా శపించెను.

అయుతుడు వెంటనే గడగడ వడుకుతూ ఆ మహాముని కాళ్లపై పడి "తండ్రీ! నేనుకోరి యీగోవును మీపైకి విడువ లేదు. ఎంత ప్రోదోలినను పోకున్నందున దీనిని తరుమ వలసి వచ్చినది. పరుగులెత్తిన యీ అవు ప్రమాదమున మిమ్ము త్రొక్కినది" అని తన వృత్తాంతం యావత్తూ పూస గ్రుచ్చినట్లు విన్నవించాడు. వాధూల మహాముని విషయం సమగ్రంగా గ్రహించి "నాయనా! నీ వృత్తాంతం జాలిని కలిగిస్తున్నది. నేను తొందరపడి నిన్ను శపించాను. ఇలా జరగవలసి యున్నది. మనం ఏమీ చెయ్యలేము. ఉత్తమమైన గృహమేధి ధర్మాన్ని నీవు తిరస్కరించి తగినదానిని తగనిదాన్నిగా తలచినందున యిటువంటి గొడవలు కలిగాయి. జరిగినదానికి విచారించి లాభంలేదు. పూర్వజన్మలో చేసుకొన్న కర్మలకు తగిన ఫలాన్ని దేవతలుకూడా అనుభవించి తీరవలసిందే! అందుకోసం విచారించకు. నీవు పౌండరీకక్షేత్రంలో నరసింహస్వామి సన్నిధిని ఉన్న కొలనును ఆశ్రయించి కప్పవై కొంతకాలం గడపవలెను. నీవు దర్దురంగా వుండే గృహస్థ ధర్మం నెరువేరుస్తూ, దర్దురాంగనయందు సంతానంపొందిన తర్వాత నీ శాపం విడుదల కాగలదు. అంతవరకూ ఓర్చి ఉండవలెను" అని పల్కి ఊరడించాడు.

తర్వాత వాధూలమహర్షి శాపం ఫలితంగా అయుతుడు మండూకమై హరిదాసమనే పేరుతో నృసింహస్వామి సన్ని

ధిలో ఉన్న పుష్కరిణిలో నివసించుచుండెను. రంగు రంగుల పొడలుకల్గి ఆ మండూకము జనుల మనస్సును ఆకర్షించుచుండెను. మండూకరూపంతో ఉన్నా, అయు తుడు పూర్వజన్మ వాసన వుండడంవల్ల సదా హరినే ధ్యానం చేస్తూ, హరికి నివేదించిన ప్రసాదాన్నే భుజిస్తూ శాపవిముక్తి కోసం ఎదురుచూస్తూ వుండెను.

ఇలావుండగా ఒకప్పుడు— కన్యాకుబ్జ దేశపు రాజు కుమార్తె తన చెలికత్తెలతోకూడా ఆ పౌండరీకక్షేత్రానికి వచ్చి, నృసింహస్వామి పుష్కరిణిలో స్నానము చేయుటకు వచ్చెను. ఆమె చెలికత్తెలతో హాస్యాలాడుకొంటూ నీటిలో దిగి వినోదంగా జల్లులాట ఆడసాగెను. ఆ సమయంలో ఆమెకు చిత్రవర్ణదేహం కల హరిదాసము కానవచ్చెను. ఆ కప్ప ఆమెమనస్సును ఆకర్షించెను. ఆ మండూకం జనులతో ఎక్కువ పరిచయం ఉన్నది కావున, ఏమీ బెదరుపాటులేక ఉండెను. రాజకుమార్తె ఆ కప్పను పట్టుకొని కొంతసేపు వినోదించి, తర్వాత కప్పనుచూచి భయపడే ఒక ముసలి బ్రాహ్మణునిమీద—చెలికత్తెల ప్రోత్సాహంతో—ఆ హరిదాసమును పడవేసినది. ఆ వృద్ధ బ్రాహ్మణుడు భయపడి—మిక్కిలి కోపించి, చెలికత్తెలతో కూడా ఆ రాజకుమార్తె కప్ప అగునట్లు శపించాడు. వెంటనే రాజపుత్రిక, చెలికత్తెలుకూడా కప్పలైపోయారు. హరిదాసమునకు, నాయకురాలైన ఆ అడుకప్పకు పరస్పరం ప్రేమ ఏర్పడి, దాంపత్యం కుదిరింది. అవి కొంతకాలం వినోదంగా కాలంగడిపాయి. తర్వాత సంతానప్రాప్తికూడా కలిగినది. అంతతో అయుతునికి శాపవిముక్తి కలిగింది. తర్వాత అతడు జ్ఞానాన్ని సంపాదించి, విష్ణుపదాన్ని పొంద గలిగాడు.

గృహస్థాశ్రమమంటే ఏవగించే అయుతుడుకూడా చివ రకు గృహస్థధర్మాన్ని అనుసరిస్తేనే కాని ఉత్తమగతి కలగలేకపోయినది. గృహమేధిధర్మాన్ని నిరసించేవాడు కుమతి అనిన్నీ, అతడు సహింపరాని కష్టపరంపరకు పాత్రుడు అగుననీ పెద్దలు పలికే మాట సత్యమైనది.

ముక్తిని పొందడానికి సంసారం విడిచిపెట్టి సన్న్యాసం గ్రహించడం సరియైన మార్గం కాదనీ, గృహస్థాశ్రమం స్వీకరించి, అందలి ధర్మాలను నిర్వహిస్తూ, భగవదారాధన చెయ్యడంవల్ల ముక్తిని పొందవచ్చుననీ తెలుసుకోవాలి. ఈ అంశాన్ని తెలుసుకోడానికి ఈ అయుత చరిత్రం ఎంతో ఉపయోగిస్తుంది.

[పాండురంగ మాహాత్మ్యమును అనుసరించి.]

---

సంస్కృతమున ప్రకటింపబడిన "అ-కా-మా-వై-కో నస్నాతా" అను కథ అంత రార్థముకూడ జీవి తన ప్రారబ్ధకర్మముల ననుభవింపనిదే ముక్తిఁబొందఁజాలడనియు, సన్యాసమును స్వీకరించికూడ శ్రీ మాధవభట్టు యను శ్రీ విద్యారణ్యస్వామి అఖం డైశ్వర్యములతో రాజ్యమునేలి తుదకు ముక్తినొందెననికూడ తెలియనగును. కథ శీర్షిక కర్థము - అషాఢ, కార్తీక, మాఘ, వైశాఖపౌర్ణమిలయందు స్నానముచేయని వాడెవ్వడనియు, "త్వం నస్నాతా" యను ప్రత్యుత్తరమునకు "నీవే స్నానము చేయనివాడ"వనియు యర్థము.

# గాయత్రి

## బందరు శ్రీ గాయత్రీ పీఠ తృతీయ వార్షికోత్సవ ప్రారంభోపన్యాస వివరణము

*లింగన సోమయాజి—ఆత్రేయ*

[ఈ వ్యాసమున కనుగుణముగ శ్రీ గాయత్రీ చిత్రము తుది కవరుపుటయందు ప్రకటింపబడినది.]

గాయత్రి యనునది మూడు పాదములు, ఇరువది నాలుగక్షరములు గల యొక మంత్రవిశేషము. గాయత్ర్యుపాసన ముపాసనలలో ముఖ్యతమము. ఈ మంత్రోపాసనము యొక్క శ్రైష్ఠ్యము ఛాంధోగ్యము 3 . 12 ఖండమున విస్తరింపబడినది. ఈ మంత్రమున కుపాస్యము పరబ్రహ్మము. గాయత్రీదేవతయందు బ్రహ్మదృష్టిని నిలిపి భావించుట యీ యుపాసనా తత్త్వము. హృదయాకాశమున నున్న పరబ్రహ్మమును గాయత్రీ రూపమున నుపాసించి తెలుసుకొనువాడు బ్రహ్మభావమును బొందునని ఛాందోగ్యము చాటుచున్నది. గాయత్ర్యుపాసనా విధానమె సంధ్యావందనము. సంధ్యావందనము నిత్య మాచరింపవలసిన యొక కర్మరాజము. 'అహరహః సంధ్యాముపాసీత' యను శ్రుతి సంధ్యావందనమును నిత్య మాచరింపవలయునని విధించుచున్నది. శ్రుతిస్మృతులచే చోదితములగు వైదిక కర్మ లనేకములు గలవు. కాని వాని కన్నింటికిని సంధ్యావందనము నియతమగు పూర్వాంగము. మున్ముందు సంధ్యావందనము నాచరించి పిదప నితర కర్మల నొనర్పవలయును. నిత్యప్రాప్తములు గాని కర్మ లన్నియు కామనవలననో ఇతర నిమిత్తములవలనో సంప్రాప్తము లగుచున్నవి. అవి యన్నియు ప్రత్యేక ప్రత్యేక ఫలములతో సంబద్ధములై యథోక్తముగ నాచరింపబడినపు డాయా ఫలము నిచ్చును. అవి వైకల్పికములు; కారణ మున్నపుడు మాత్రమే అవి యాచరణీయములు. సంధ్యావందన మటుల గాక యవశ్యము ప్రథమ కర్తవ్య మగుచున్నది స్వర్గాద్యభ్యుదయ మితర కర్మ ఫలము. మరికొన్ని కర్మలు పుష్టి మొదలగు ఫలముల నిచ్చును. సమస్త కర్మాచరణమున కాతంకకారి యగు పూర్వదురితమును క్షయింపజేసి నిఃశ్రేయసము నొసంగుటయె సంధ్యావందన ప్రయోజనము. సృష్టిలో నంతర్భూత లగు నింద్రాది దేవత లితర కర్మల కధిష్ఠాన దేవతలు. సృష్టి స్థితిలయ కారణమగు పరబ్రహ్మము సంధ్యావందనమున కధిష్ఠాన దేవత. సంధ్యావందనము జేయనివానికి వేదాధ్యయనాధికారము లేదు. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను శ్రుతి వేదాధ్యయనమును నియతముగ విధించుచున్నది. ద్విజు లాచరింపవలసిన కర్మలలో సంధ్యావందనము కనిష్ఠము. దాని ఫల ముత్కృష్టము.

సర్వసృష్టికి పరమ కారణమగు బ్రహ్మచైతన్యము సంధ్యాశబ్దార్థము. సూర్యబింబమునందభివ్యక్తమగు నాదిత్యుని రూపమున నిరూపింపబడు పరబ్రహ్మ రూపమగు చిచ్ఛక్తియే సంధ్యాదేవత. అట్టి దేవత నుపాసించు విధానము వందన మని సామాన్యముగా జెప్పబడుచున్నది. చిచ్ఛక్తిరూపమును ధ్యానించుటయే సంధ్యావందన తాత్పర్యము. రాత్రింబవళ్ల సంధిసమయము సంధ్యావందనమునకు ముఖ్యకాలముగ విధింపబడుటచే తత్కాలమున నాచరింపబడు కర్మగూడ సంధ్యావందన మని గౌణముగ వ్యవహరింపబడుచున్నది.

సంధ్యావందనమున ప్రాణాయామపూర్వక సంకల్పము, అర్ఘ్యప్రదానము, గాయత్రీహృదయము, గాయత్రీజపము, సూర్యోపస్థానము, సంధ్యారూప పరదేవతా ప్రార్థనము - అని యారు భాగములుగ విభజింపబడినది. ప్రథమ ద్వితీయ చతుర్థ భాగములలో గాయత్రీ మంత్రము వ్యాహృతి శిరస్సహితముగ పఠింపబడుచున్నది. గాయత్రీ హృదయమునందు సర్వాత్మ స్వరూపమగు బ్రహ్మము నుపపాదించు గాయత్రీదేవత జపమునకు మున్ముం దాహ్వానింపబడుచున్నది. ఇట్టి స్తోత్రముచే ప్రసన్నయగు గాయత్రీ దేవత యొక్క మంత్రము నష్టోత్తరశత సంఖ్యాపరిమితముగ నయినను జపించవలెను. ఆరవ విభాగము సంధ్యారూపిణి యగు గాయత్రీ పరదేవతను గూర్చిన ప్రార్థన. ఈ యారు భాగములలోను సూర్యబింబమునందు బ్రకాశించుచున్న పరబ్రహ్మమే గాయత్రీ రూపమున విషయ మగుచున్నది. అట్టి పరబ్రహ్మము హృదయాకాశమున నెల్లప్పుడు బ్రకాశించుచున్న యాత్మకంటె నన్యము కాదని "సయశ్చాయం పురుషే। యశ్చాసా వాదిత్యే। స ఏకః" అను తైత్తిరీయక శ్రుతి చాటుచున్నది. పరబ్రహ్మము సుప్రసిద్ధమైనను మన యల్పబుద్ధుల కందరాకున్నది. అజ్ఞాత వస్తువును జ్ఞాత వస్తు ముఖమున దెలియజెప్పుట సహజము. సూర్యుడు సుప్రసిద్ధుడు, అమితతేజోరాశి, సర్వకర్మ సాక్షి, ఆరోగ్య భాగ్యప్రదాత. శ్రుతి యాతని ముఖమున ప్రత్యక్ పరబ్రహ్మల కనన్యత్వము నుపదేశించుచున్నది. అందువలననే

గాయత్ర్యుపాసనమునందాలంబనముగ సూర్యుడు గ్రహింప బడుచున్నాడు.

భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం అను నేడును వ్యాహృతు లనబడుచున్నవి. "ఓమాపో జ్యోతీ రసోஉ మృతం బ్రహ్మ భూర్భువః సువరోమ్" అనునది గాయత్రీ మంత్ర శిరస్సు. ప్రతి వ్యాహృతిని ఓంకార సహిత ముగ నుచ్చరింపవలయును. ఓంకారము బ్రహ్మమును బొందుటకు ముఖ్య సాధనములలో నొకటి. అది యంగీకా రార్థకము. భక్తి శ్రద్ధలతో భూలోకాద్యభిమాన దేవతలకు నాచే చేయబడు గర్మనివేదనమును వా రంగీకరింతురు గాక యని తాత్పర్యము. భూరాది సప్తవ్యాహృతులా నామ ముతో బిలువబడు సప్తలోకములను వాని యభిమాని దేవతలనుగూడ జెప్పుచున్నవి. ఈ సప్తకము మన కూర్ధ్వ మున నున్న లోకములు. అందుచే నధోలోకము లేడును గూడ నవగతములగు చున్నవి. చతుర్దశలోక విశిష్టమగు బ్రహ్మాండమంతయు సప్తవ్యాహృతులచే గ్రహింపబడు చున్నది. ఓంకారము బ్రహ్మమును జెప్పునట్టి పదమగుటం జేసి యయ్యది బ్రహ్మపరముగ వాడబడుచున్నది. బ్రహ్మాండమేగాక తదంతర్గతమగు బ్రతిలోకముగూడ బ్రహ్మ నన్యమని జెప్పుటకై యోంకారము భూరాది ప్రతిపదము తోను వాడబడుచున్నది. ఈ ప్రకారము "సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మై వేదగ్ సర్వం" మొదలగు శృతు లుప పాదించు పరమ రహస్యముపాసకుల భావనావిషయ మగు చున్నది. సంధ్యావందనమున కంతయు బ్రతిష్ఠాభూతమగు నీ యద్వితీయ బ్రహ్మతత్త్వము సంధ్యావందన సంకల్పము లోనే వ్యక్తీకరింపబడుచున్నది.

సూర్యుడు ప్రకృతపు బ్రహ్మోపాసనమునకు ద్వారము. కనుక నుభయులకు తాదాత్మ్యము నాపాదించి గాయత్రీ మంత్రమును పఠించి యాయన కర్ఘ్య మివ్వబడుచున్నది. "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్ర ముభయుల తాదాత్మ్యమును చూపించుచున్నది. ధ్యానమునకు బూర్వ ముపాస్యదేవత మహిమను స్తోత్రము చేయుట సహేతు కము, సంప్రదాయ సిద్ధము. అందువలన నుపాస్య దేవత ప్రసన్న యగుటయే గాక సదానియం దుపాసకునకు గౌరవాతిశయము గలిగి మనస్సున గట్టిగ నారూపము నాటుకొనును. గాయత్రీ హృదయమున నా దేవతామహిమ వర్ణింపబడినది. గాయత్రీ మంత్రము మూడు పాదములు గ్రమముగ ఋగ్యజుస్సామములను వేదత్రయమునకు సారభూతములగుచున్నవి. గాయత్రి నాశరహితము. సమస్త శరీరమునకు నింద్రియములకు గూడ శక్తి నిచ్చు నది. దేవతల కోజస్సును గల్పించునది. నిఖిల జంగమ జాలమున కాయుఃస్థానమై సర్వపాపముల బారతోలునది.

ఉపనయన సంస్కార మంతయు గాయత్రీ మంత్రమును జుట్టుకొని యున్నది. విలక్షణ మహిమోపేతయగు గాయత్రీ దేవత యుపాసకుని మనమున బ్రవేశించి సకలాభీష్టముల నొసంగుగాక యని గాయత్రీ హృదయ తాత్పర్యము. ఇట్టి గాయత్రీ దేవతాకమగు మంత్రమును సవ్యాహృతి శిరస్క ముగ జపించుదుము. గాయత్రీ మంత్రము సంధ్యావందన మునకు మకుటము. ఇతర ధ్యానముచే భంగము గాక నవిచ్ఛిన్నమగు ధ్యాన పరంపరచే నేకాగ్ర్యమగు చిత్తమున నిష్టదేవతను భావించుట జప మనబడును.

గాయత్రీమంత్రార్థ మేమన :—

**తత్**— ఈ శబ్దము సుప్రసిద్ధార్థము. అపరిమిత తేజోరాశియగు నాదిత్యుడు సుప్రసిద్ధుడు. తచ్ఛబ్దము సుప్రసిద్ధమగు బ్రహ్మపరముగూడ నగును. ఈ శబ్దము చేత బ్రహ్మాదిత్యుల కనన్యత్వ మాపాదింపబడుచున్నది. ఇందుచే గాయత్రీ మంత్రమున కదిష్ఠానము సృష్టి స్థితి సంహారకారియగు బరబ్రహ్మమనియు, నదియె యీ మంత్ర మున నుపాస్యమనియు నవగత మగుచున్నది. తత్-అను ప్రథమాంతమునకు తస్య—యని షష్ఠ్యర్థమును గ్రహించ వలయును. అపుడు దేవస్య అను పదమునకు విశేషణ మగును.

**సవితుః**— అనగా నిచ్చువాడని యర్థము. పర బ్రహ్మము నిరాకారము నిర్గుణము నైనను నద్దాని యే యాకారమున నుపాసించెదరో ఆ యాకారమున నీప్సి తార్థము నొసంగును. లేదా, సకల లోకముల కుపాదాన కారణము బ్రహ్మమని భావము. ఉపాదాన మన వస్తురూప కారణము. సువర్ణ మాభరణముల కుపాదాన కారణము. ఇట్లనుటచే జగజ్జన్మ స్థితిలయ హేతుత్వ మాతనికి జెప్ప బడుచున్నది. "యతోవా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయం త్యభిసంవిశంతి" యను శ్రుత్యర్థ మిచట ప్రదర్శింపబడుచున్నది.

**వరేణ్యం**— పురుషార్థముల నర్థించువారికి శ్రేష్ఠ మగు నాశ్రయము. ఈ పదమునందు మూడక్షరము లున్నను 'వరేణియం' అని నాలుగక్షరములు గ్రహించ వలెను. లేనిచో మంత్రమునందిరువదినాలుగక్షరములేర్పడ జాలవు. కాని త్ర్యక్షరముగనే జదువవలెను.

**భర్గః**—అవిద్యాది దోషములం బారద్రోలు తేజః పుంజము. అజ్ఞానమువలన బ్రహ్మాత్మైక్యము నెఱుంగలేక సంసారమున వేసారు మనుజుని బుద్ధిని ప్రకాశింపజేయు వెలుగు.

**దేవస్య**—ఉదయాస్తమయములచే లోక యాత్రను చేయువాడు. భూమితోపాటు సూర్యునికిగూడ భ్రమణము గలదు. లేక నమిత తేజోరాశియై ప్రకాశించువాడు. లేక

ద్యులోకమున నుండువాడు. లేక ధ్యానించువారి హృదయ కమలముల గ్రహించుచు వికసింపచేయువాడు—అని యర్థము.

ధీమహి —అట్టివానిని ధ్యానించెదముగాక. అవిచ్ఛిన్న మగు ధ్యానపరంపర బహువచనార్థము. ఇట్టి ధ్యానప్రయో జన మేమన—

యః—సత్యజ్ఞానానంతాది లక్షితమగు నే పరబ్రహ్మము గలదో యాతడు,

నః—జీవప్రత్యక్ పరమాత్మల కభేదమును దెలిసికొన లేకు గుందుచున్న మా యొక్క—

ధియః—అన్తః కరణ వృత్తులను —

ప్రచోదయాత్—సన్మార్గమున ప్రేరణము చేయుగాక.

"సుప్రసిద్ధమగు పరబ్రహ్మమునకంటె నన్యము గాన ట్టియు, నిర్విశేషమైనను యేయే యాకారమున నుపా సించిన యా యాకారమున నుపాసకులకు ఫలముల నిచ్చునట్టియు, పురుషార్థముల గోరువారికి శ్రేష్ఠమైన ఆశ్ర యమైనట్టియు అజ్ఞానమును బారద్రోలు తేజోమూర్తి యయి నట్టియు, అఖండానందైక రస స్వరూపమైనట్టియు నా పర బ్రహ్మమును మే మవిచ్ఛిన్నమగు ధారాసంతతితో ధ్యానించు దుముగాక-ప్రత్యక్పరమాత్మ జీవులు భిన్నులని దలంచు మా బుద్ధులం దా పరమాత్మ ప్రవేశించి వారల ఐక్యబుద్ధిని ప్రేరణము సేయుగాక" యని మంత్రముయొక్క దండా న్వయము.

"యో దేవస్సవితాస్మాకం ధియో ధర్మాదిగోచరాః।
ప్రేరయేత్తస్య యచ్ఛక్తి స్తద్వరేణ్య ముపాస్మహే॥

అను ధ్యానశ్లోకముగూడ నీ యర్థమునే ప్రతిపాదించు చున్నది. ఈ విధముగ గాయత్రీ మంత్ర మౌపనిషదమగు బరమ రహస్యము నుపాసనావిధానమున నుపదేశించు చున్నది. మనుజుని హార్దాకాశమున జీవరూపమున నింద్రి యములద్వారా బహిర్గతమై అభివ్యక్త మగుచున్న శుద్ధ చైతన్యమే ప్రత్యగాత్మ యని బిలువబడుచున్నది. అంత టను బ్రకాశించు చైతన్య మొక్కటియే. అయ్యది ప్రపంచ సృష్ట్యపేక్షయా పరబ్రహ్మము, లేక పరమాత్మ యనియు మనుజాది ప్రాణికోట్యపేక్షయా ప్రత్యగాత్మ యనియు వ్యవహరింపబడుచున్నది.

సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మచైతన్యమును సూర్య ముఖమున నుపాసించు విధానమును గాయత్రీ మంత్ర కలాపము ప్రదర్శించుచున్నది. ఈ యఖండ బ్రహ్మచైత న్యమే తిరుమల, శ్రీశైలము మొదలగు బుణ్యక్షేత్రముల లోకకళ్యాణము గోరి యాగమ శాస్త్రాను సారముగ బ్రతిష్ఠి తములైన బవిత్ర మూర్తుల రాజిల్లుచు మహావైభవముతో శ్రద్ధాభక్తుల నర్చింపబడుచున్నది. విగ్రహారాధనయందు బాహ్యమునకు కాన్పించు శిలాది రూపములు గాక వాని యం దన్తర్నిహితమగు చైతన్యము ముఖ్యము. బ్రహ్మ చైతన్యమే సగుణరూపమున విగ్రహాదులయం దారాధింప బడుచున్నది. ఇదియె విగ్రహారాధనతత్త్వము. పవిత్రమగు విగ్రహారాధనకు నియతులగు నారాధకు లనింద్యమగు శీలమును విధ్యుక్తమగు నర్చనాధికారమును గలిగి తమ ధర్మమును నిర్వర్తించుట యెంతయు నవశ్యము. విగ్ర హారాధనా విధానము వీరలకు కేవలము జీవిక కాదు. పుణ్య స్థలముల యందలి దివ్యవిగ్రహము లన్నియు నర్చకుల కును భక్తులకునుగూడ నుపచరించు పెన్నిధానము లగు చున్నవి. అర్చకులుగూడ మున్ముందు సంధ్యావందన మాచరింపక తమ తమ ఉత్తమ ధర్మముల నిర్వర్తింప నర్హులు గారు. కాని నేటి యర్చకులలో కొంతమందిలో శీలము మృగ్య మగుచున్నది. సంధ్యావందనమునకే దూరు లగుచుండ తమ యధికార యోగ్యతనుగూర్చి యేమి చెప్పవలయును! ఈ విషయమును గమనించి ఆంధ్ర ప్రభుత్వ హిందూ దేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖ వారు గడు జాగరూకతతో నిట్టి లోపముల దొలగించి దేవాలయముల పునరుద్ధారణమునకు జేయుచున్న ప్రయ త్నము లెంతయు శ్లాఘాపాత్రములు. వీరి ప్రయత్నము లనతికాలములో సఫలములై దేవాలయములన్నియు పూర్వపు టుచ్చైఃస్థితిని విరాజిల్లుచు లోకకళ్యాణమునకు కారణము లగుగాక! అని భక్తియుతముగ నాశించు చున్నాను.

---

## గాయత్రీధ్యానము

ముక్తావిద్రుమహేమ నీలధవళచ్ఛాయైర్ముఖైస్త్ర్యక్షైః
యుక్తామిందుకలానిబద్ధమకుటాం తత్త్వార్థవర్ణాత్మికాం।
గాయత్రీం వరదాభయాం కుశకశాశ్శుభ్రం కపాలంగదాం
శంఖంచక్రమథారందయుగళం హస్తైర్వహంతీం భజే॥

# భారతీయ ధర్మము - IV

"కా శ్య ప"

## శౌ చ ము

జీవరాసులలో మానవునకు మాత్రమే ప్రయత్నపూర్వకముగ శౌచము నలవఱచుకొను శక్తిగలదు. బాహ్యాభ్యంతరములని శౌచము ద్వివిధము. బాహ్య శరీరమును శుభ్రముగ నుంచుకొనకున్న, దేహమున వ్రణాదులు కలుగుటయే కాక సంఘమున గౌరవముగూడ సన్నగిల్లును. కావున నీనాడు శరీరముపట్ల, వస్త్రములపట్ల మితిమీరిన శ్రద్ధ కలుగుచున్నది. ఆహారము పరిశుభ్రముగ నుండవలయును. లేకున్న నజీర్ణాదివ్యాధులు, మనోమాలిన్యము సంభవించును. ఆహార విహార నియమము శరీరారోగ్యమునకు ప్రధానము. ధర్మసాధనములలో మానవజీవితము, మానవశరీరము నత్యంత ప్రధానములు. అనంతపుణ్యపణ్యము వెచ్చించినగాని మానవశరీరము లభింపదు. నిరతిశయ నిరవధికసుఖ రూపమయిన చతుర్థ పురుషార్థము మానవశరీరము చేతనే సంపాదింపనగును. మానవజీవితమునకు, జనన మరణములు పరమలక్ష్యములుగావు. జననమరణ రహితమయిన దివ్యత్వము మనుష్య శరీరము చేతనే సాధింపదగినది. అలక్ష్యమును విస్మరించెడు మానవ జన్మమునకును, పశుజన్మమునకును తారతమ్యము గమనించుట కష్టము. పంచభూతాత్మకమయిన శరీరములో దివ్య చైతన్యము ప్రవేశించిన ఏమ్మట జీవసంచార మేర్పడును. కనుక 'దేహోదేవాలయః ప్రోక్తః' అను సూక్తి కలిగినది. దేహములో దృశ్యాదృశ్యముగ గోచరించు జీవుని జాడ గనిపెట్టి, ఆ వ్యష్టిజీవునకును, విశ్వాత్మ యయిన సమిష్టి జీవునకును అభేదము సాధించుటే మానవుడు నేర్వవలసిన పరమ విజ్ఞానము. బాహ్యాభ్యంతర శౌచప్రాబల్యముచే చిత్తదర్పణము నిర్మలము కాగా నందు సచ్చిదానంద జ్యోతి సందర్శనము కలుగును. కావున ధర్మసాధనములలో శౌచము ప్రథమ గణ్యమగుచున్నది.

కాయిక వాచిక మానసికములని శౌచము త్రివిధము. పుణ్యతీర్థావగాహనముచే, తులసీ రుద్రాక్షమాలాది ధారణము చేత, అశ్వత్థనారాయణ, దేవాయతనాది ప్రదక్షిణాదికముల, యోగాసన ప్రాణాయామాది సాధనములవలనను కాయిక శౌచమును సమకూర్చుకొనవచ్చును. దేహమెంత విశుద్ధమయిన, దేహగత దివ్యచైతన్యమంత విస్పష్టముగ ప్రకాశించును.

## చేతులారంగ శివుని బూజింపవలయు

ఆపన్నాశ్రిత జీవరక్షణము, యథాశక్తి తత్తజ్జీవ సహాయకరణము గావించినపుడే కరణేంద్రియములు శివపూజాఫలమునందగలవు. అధర్మ్యములయిన స్వచ్ఛందన వనితాద్యుపభోగములయందు దుర్వినియుక్తమయిన శరీరమునకపవిత్రత సమకూరును. మైలసోకిన శరీరమున దివ్యతేజము అస్తినాస్తి విచికిత్సకు హేతుభూతమగును. పుణ్యపురుషుల శరీరములు అపూర్వ పరిమళ సమ్మిళితములని అనుభవజ్ఞులందురు.

## నోరునొవ్వంగ హరికీర్తి నుడువవలయు

శుచిత్వముగల వాక్కు లమోఘములు. సత్యప్రవచనము, మితభాషిత్వము వాక్కును పవిత్రము చేయును. అతిప్రసంగము, అసత్య సంభాషణము వాక్కునకు అశుచిత్వ మాపాదించును. శాంతి సౌమనస్యముల పెంపొందించు వాక్కులు సత్యాలాప ఫలమునంది హరికటాక్షపాత్రములగును. అజ్ఞానాంధకారము తొలగించు విజ్ఞాన ప్రబోధములు, సౌహార్దము సమకూర్చు సాంత్వన ప్రసంగములు, అసూయా ద్వేషముల సరికట్టు హితమనోహరి సుభాషితములు, జిహ్వేంద్రియమున కమూల్యాలంకరణములు. శాన్తి స్వస్తికల్యాణ సంపాదకమగు వాణి దివ్యవాణి. కల్లలాడి కలహములు పెంచి విప్లవముల రేకెత్తించు దుర్వచః ప్రసంగములు సంక్షోభ మహాసాగరోత్తుంగ తరంగములు. సూనృత ప్రసూనమాలికలనంది యానందించువాడు ముకుందుడు. జ్ఞానప్రసూనాలంకృతుడు సదాశివుడు. సత్యజ్ఞానానంద సంవర్ధకములైన వాక్కులు వేదవాక్కులు. దేశకాలావధుల నతిక్రమించి లోకసేవ చేయజాలిన శక్తి ఋషిసూక్తములకు మాత్రమే కలదు. 'ఋషయః సత్యవచనః' నత్యమునే పలుకువారు ఋషులు. సకలలోక కల్యాణము నుద్దేశించి చేయు మంత్రజపములు, శాంతి సౌమనస్యముల నభిలషించి గావించు భగవన్నామ సంకీర్తనములు, విజ్ఞానామృత వృష్టిసృష్టించు బ్రహ్మయజ్ఞము, ఈతిబాధానివారకమయిన స్వస్తి పుణ్యాహవాచనములు, వాఙ్మయ తపః సంవిభాగములు, వాగ్దేవీ మధురమందహాస భాసురవిలాసములు, అర్థవద్వాగ్వాద సంపన్నుడు మానవుడొక్కడే. సరస్వతీ సేవానిరతునకు బ్రహ్మసాక్షాత్కారము కరతలామలకము. నిగ్రహానుగ్రహ సామర్థ్యముగల వాక్శక్తిని సద్వినియోగము చేసికొనుటయందే మానవుని చరితార్థత నిర్ణయింపనగును. నియమ నిగ్రహములు శక్తి నుద్దీపింపజేయగలవు. అనవసర ప్రసంగముల మానివైచి మితముగను, సత్సమ్మతముగను భాషించు నేర్పుగలవాడు వాక్సిద్ధినందును. వశ్యవాక్కులనిండు మనంబు నవ్యనీత సమానము, పల్కు దారుణాఖండల వజ్రతుల్యము.

ఉపవసించిన నజీర్ణ వ్యాధి యంతరించి ఆరోగ్య మభి వృద్ధినందును. పనిబూని మౌనవ్రతము పాటించిన వాఙ్మాలిన్యము సమసిపోవును. వాక్పాటవ మినుమడించును.

## దయయు సత్యంబు వేనుగా దలపవలయు

"సోఽకామయత" బ్రహ్మ సంకల్ప బలమువలన సర్వజగత్సృష్టిస్థితిలయములు సాగుచున్నవి. సంకల్ప శక్తితో సమానమైన శక్తి - సభూతాన భవిష్యతి - క్షణకాలములోనసంఖ్యాక సంకల్ప వికల్పములుత్పన్నమ్ము లగుసని ప్రాజ్ఞులు నిర్ణయింతురు. 'మానససంచరణే - పరే బ్రహ్మణి.' దిక్కాలాద్యనవచ్ఛిన్నమయిన బ్రహ్మాండమంతయు, బీజంబున మహావటవృక్షంబువలె, మానసంబుననొదిగియుండును. దాన మనస్సును విశ్వదర్పణమందురు. మానస బృహచ్ఛక్తి వాచామగోచరము. "చంచలం హిమనః కృష్ణ ప్రమాథి బలవత్ దృఢమ్। తస్యాహంనిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్॥" మనస్సు ఎంత దృఢమో, అంత చంచలము. ఎంత బలిష్ఠమో అంత బాధాకరము. 'మన ఏవ మనుష్యాణాం కారణంబంధ మోక్షయోః.' అగాధాపారదుఃఖ సముద్రములో ముంచివైచునది మనస్సు. బ్రహ్మానంద వీచికలలో దేలియాడించునదియు మనస్సే. అందియు నందకుండునది మనస్సు. మనోవ్యాపారములు ఆ మనస్సునకును సర్వభూతాంతరస్థుడయిన పరమాత్మకు మాత్రమే విదితములు మనస్సునకు లొంగినవాడు లోకులందఱికి లోకువయే యగును. ఆ మనస్సే లొంగెనా, త్రింశత్కోటి దేవతలు కైంకర్యము చేయ నాయత్తమయ్యెదరు. మానవునకు సంక్రమించిన అనంతశక్తిరత్నరాసులలో మన శ్శక్తి నాయకరత్నము. మనః పవిత్రత - మనో నైర్మల్యము సర్వథా వాంఛనీయములు.

కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాదులు మానస శత్రువులు. అవి యెల్లపుడు మనస్సునపవిత్రము చేయుటకే ప్రయత్నించుచుండును. అరిషడ్వర్గమును జయింపవలయునని యుపదేశించుట మిగుల సులభము. జయించుట మాత్రము ఊహకందని విషయము. 'పరోపదేశ వేలాయాం సర్వే వ్యాసపరాశరాః। స్వస్యానుష్ఠాన వేలాయాం మునయోఽపి న పండితాః॥' త్రిలోచనుడు కాముని శరీరమును మాత్రమే దహింప గలిగెను. అనంగుడయ్యును మనసిజుడు నేటికిని లోకమున వీరవిహారము చేయుచునే యున్నాడు. కామమును జయించుటమాట యటులుంచి, కామ్యము నిర్ణయించుపట్ల శ్రద్ధ వహింపనగును. కామ్యములలో, కొన్ని మనస్సును పవిత్రము చేయునవి. మఱి కొన్ని యపవిత్రము చేయునవి. అధర్మ్యములయిన కామ్యముల నుపేక్షించుటకే యావచ్ఛక్తి నుపయోగింపనగును. ధర్మ్యములై మనోనైర్మల్య సంపాదకములైన కామ్యములను సంపాదించుట యందే తాత్పర్యము వహింప వలయును. మధుర మధుర పదార్థంబులు చేజిక్కిననాడు మందుడైనను అల్పమాధుర్యము గల తుచ్ఛ పదార్థముల కానగొనడు. 'మందారమకరంద మాధుర్యమున దేలు మధుపంబుపోవునే మదనములకు' మనశ్శుద్ధి సమకూర్చు కామ్యముల నన్వేషించుటయే మనీషుల కర్తవ్యము.

సత్యంశివం సుందరమ్ :-మృదుమధుర సురూపసురభిళ శ్రావ్యపదార్థములు సుందరములయి కామ్యములగుచున్నవి. కేవలము సుందరములయిన పదార్థములు క్షరములగుటచే మనస్సునకఖండానందము సమకూర్పజాలవు. ఖండానందము చేకూర్చునవి కాలాంతరమున దుఃఖభాజనములగును. సుందరవస్తుజాతము, కల్యాణకరము, స్థిరమునగునేని మనస్సునకు విశుద్ధిని గలుగజేసి బ్రహ్మానందప్రాప్తికి దారి చూపును. అనిత్యములు అకల్యాణకరములునగు కామ్యములను గోరి జీవుడు దుఃఖనిమగ్నుడగుచున్నాడు. సత్యశివసుందర కామ్యముల నిరూపించుట సుకరముగాదు. 'భిన్న రుచిర్హిలోకః' ద్రష్టలయిన ఋషులు ప్రసాదించిన శాస్త్రములు, అనుభవజ్ఞులైన గురువు లుపదేశించిన విశేషములు, స్వానుభవముచే గణించిన విజ్ఞానము, తత్సత్యశివసుందర కామ్యనిర్ణయ వ్యాపారమున నక్కఱకు వచ్చును.

శరీరమును లొంగదీయుట సులభము. వాఙ్నియమనము ప్రయత్నసాధ్యము. మనోనిగ్రహము దుష్కరము, అచింత్యము. మనస్సు సంకల్పాత్మకము. 'తన్మే మనః శివసంకల్పమస్తు' మనస్సు సంకల్పరహితమగుట అసంభవము. సంకల్పములు చేయకతప్పదు. కావున శివసంకల్పములు మాత్రమే చేయుటకు సాధకుడు సర్వదా యత్నింపనొప్పును. పరాపకార దూరములయి, తత్త్వజ్ఞాన సంపాదన సాధకములగునవి శివసంకల్పములు. రాగద్వేష వర్జితములు, సర్వభూత హితాభిరతములగు సంకల్పములు శివసంకల్పములు. 'బ్రహ్మకృపాహి కేవలమ్' సత్యమగు బ్రహ్మయొక్క స్వరూపము కారుణ్యము. కారుణ్యముచే హృదయ మార్ద్రమగును. ఆర్ద్రహృదయము నుండి మాలిన్యము క్షాలితమై జారిపోవును. మాలిన్యరహితమయిన హృదయక్షేత్రమున సత్యప్రకాశము సంపూర్ణముగ వ్యాపించును. హింసాక్రౌర్యముల కాలవాలములు అశివసంకల్పములు. హింసాక్రౌర్యములచే హృదయము వజ్రకఠినమగును. కఠినహృదయమున బాతుకొనిపోయిన మాలిన్యము తొలిగిపోవు మార్గము గానరాదు. మలినహృదయులకు దివ్యానుభూతి గలుగదు. సాధుసజ్జన సాంగత్యము చిత్తమాలిన్యము దొలగించు సత్యానురక్తి, సర్వభూతహితాసక్తి సమకూర్చును. (సశేషము)

-: దర్శనాదేవ సాధవః :-

# ఉపాసనారహస్యము

జ్యోతిష విద్వాన్, ఆగమవిశారద తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి

(దుర్ముఖి-ఆషాడ మాసము-సంచికయందు ప్రకటితమగు వ్యాసము తరువాయి)

ఇట్లు సాధకుడు అర్వణము చూచుకొని ఉత్తమ గురువును ఆశ్రయించి మంత్రదీక్షను పొందవలయును; మరియూ తంత్రములయందు గురులక్షణము యిట్లు చెప్పబడియున్నది.

> అనూచానః ప్రసన్నాత్మా శివదీక్షాభిషేచితః
> శివాగమజ్ఞోమతిమాన్ శివపూజా పరాయణః
> రుద్రాక్షమాలాం బిభ్రాణః త్రిపుండ్రాంకిత విగ్రహః
> విశుద్ధ దేశకులజః శీలాచార సమన్వితః
> వేదశాస్త్రార్థ తత్వజ్ఞః జ్ఞానవాన్ గురురుచ్యతె.

పై లక్షణములు గల గురువునొద్ద దీక్షనుపొందుట యుత్తమము. ఉత్తము డగు గురువు అర్హుడై సద్గుణము లతో గూడిన శిష్యునకుమాత్రమే దీక్షను యివ్వవలయును; దుర్గుణములు గలవానికి చెప్పతగదు. శిష్యలక్షణ మిట్లు చెప్పబడినది. ఉత్తమకులమందు జన్మించినవాడు, సర్వ భూతములయందు దయగలవాడు, వేదశాస్త్రములను చదివినవాడు, తెలివి గలిగినవాడు, అకామి, ఆస్తికుడు, స్వధర్మ నిష్ఠగలవాడు, దేవుడు గురువు-వీరియందు భక్తిగలవాడు, మాతాపితృపూజకుడు గుర్వాజ్ఞాపాలకుడు, మితభాషి, యువకుడు. ఈ లక్షణములు గల శిష్యుని వత్సరకాలము పరీక్షించి గురువు దీక్షితుని గావింపవలయును. లక్షణహీనుడగు శిష్యునకు ఉపదేశ మిచ్చిన గురువునకు పాపము గల్గును. శృతి యిట్లు చెప్పుచున్నది—

> మం॥ విద్యాహవై బ్రాహ్మణమాజగామగోపాయమా సేవ
> ధిష్టేఽహమస్మి। అసూయకాయానృజవేఽయతాయ
> నమాంబ్రూయాత్ వీర్యవతీ తథాస్యామ్॥

విద్యలు యిట్లు చెప్పుచున్నవి. 'అసూయ గలవానికి కుటిలునకు నియమము లేనివానికి ఉపదేశించనియడల మేము వీర్యము గలవారమై యుందుము, అనుటవలన అశిష్యునకు ఉపదేశమువలన విద్య నిర్వీర్య మగునని తెలియుచున్నది. కావున ఉత్తముడగు గురువు ఉత్తముడగు శిష్యునకు ఉత్తమ క్షేత్రమున దీక్ష నొసంగవలయును. ఉత్తమ క్షేత్రములనగా పుణ్యక్షేత్రములయందు (కాశీ, ప్రయాగము మొదలగునవి) నదీతీరము, పర్వతగుహ, నదీ సాగరసంగమము, ఉద్యానవనము, బిల్వవృక్షసమీపము, పర్వతశిఖరము, దేవాలయము, గోశాల, స్వగృహము, గురుసన్నిధి మొదలగు ఉత్తమ ప్రదేశములయందు దీక్షను పొంది జపించవలయును. ఈ క్షేత్రములలో జపించిన మంత్రములకు ఫలతారతమ్య మిట్లు చెప్పబడినది

> గృహేజపః సమః ప్రోక్తో గోష్ఠే శతగుణస్తు సః
> ఆరామేచ తథారణ్యే నద్యాం లక్షగుణంభవేత్
> కోటిర్దేవాలయే ప్రాహుః అనంతం గురుసన్నిధౌ.

గృహమందు జపించిన ఫలముకన్న గోశాలయందు నూరు రెట్లునూ తోటగాని అరణ్యమునగాని వెయ్యి రెట్లున్నూ పుణ్యపర్వతమందు పదివేల రెట్లున్నూ నదీతీరమందు లక్ష రెట్లున్నూ దేవాలయమందు కోటిరెట్లున్నూ గురుసన్నిధి యందు అనంతఫలమునూ యిచ్చును. కావున సాధకుడు యిట్టి క్షేత్రములలో తారాబల యుక్తమగు శుభదినమున దీక్ష బొందవలయును. దీక్షకు యుక్తకాలము యీ క్రింద విధముగా నిర్ణయింపబడియున్నది :—చైత్రాది మాసముల యందు వరుసగా మంత్రోపదేశమునకు అసహనము, ధన లాభము, మృత్యువు,పుత్రలాభము, శుభము, జ్ఞానహాని, సర్వ సిద్ధులు, జ్ఞానసిద్ధి, శుభము, దుఃఖము, మేధావృద్ధి, సర్వ వశ్యమున్నూ ఫలితములుగా చెప్పబడినది మరియు శుక్ల పక్షమున ఐశ్వర్యమును గోరువారు దీక్షను పొందవలయును. మరియున్నూ పూర్ణిమ పంచమి ద్వితీయా సప్తమీ త్రయోదశి దశమి యీ తిథులు దీక్షాకర్మయందు ప్రశస్తము.

> ఉత్తరాత్రయ రోహిణ్యో రేవతీ పుష్యవాసవం
> ధనిష్ఠా వాయు మిత్రాశ్వి పిత్ర్యంత్వాష్ట్రంచ నైరుతం
> ఈశ వైష్ణవహస్తాశ్చ దీక్షాయాంతు శుభావహాః

ఉత్తరా, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్రా, రోహిణి, రేవతి, పుష్యమి, జ్యేష్ఠా, ధనిష్ఠా, స్వాతి, అనూరాధ, అశ్విని, మఘా, చిత్రా, మూల, ఆర్ద్ర, శ్రవణా, హస్తా—యీ నక్షత్రములు దీక్షాదులయందు ముఖ్యములు. వారములలో సోమ బుధ గురు శుక్రవారములు ముఖ్యములు. మరియూ గురుశుక్రులు అస్తంగతులు, నీచస్థులు, వక్రము అతిచారము గలవారు అయినప్పుడున్నూ, సింహరాశియందు గురువు ఉన్నప్పుడునూ దీక్ష పనికిరాదు. మరియూ మంత్రదీక్షకు గ్రహణ సమయములు ముఖ్యములు—

> దీక్షాయా మభిషేకే చ తథామంత్ర పరిగ్రహె
> వ్రతగ్రహణ మోక్షేచ ద్రవ్యారంభణ కర్మణి.
> కార్తిక్యాం చైవ వైశాఖ్యాం స్వర్భానో రపిదర్శనె
> చంద్ర సూర్యోపరాగేచ షడశీతి ముఖేషుచ.
> అయనేషుచర్వేషు యోగస్సర్వార్థ సిద్ధిదః.

ఇందువలన గ్రహణ సమయములయందు మంత్రదీక్ష ముఖ్యమని తెలియుచున్నది. మరియూ ఉత్తముడగు

గురువునకు అనుగ్రహము గలిగినపుడు తిథివార నక్షత్ర ములతో నిమిత్తము లేదు. రాసులయందు స్థిరరాసులు ముఖ్యములు; లగ్నమునకు మూడు, ఆరు, పదకొండు స్థాన ములలో పాపగ్రహములున్నూ 1-4-7-10, స్థానముల యందు శుభగ్రహములున్నూ 1-5-9 స్థానములలో శుభ గ్రహములున్నూ అష్టమ స్థానమున యే గ్రహములు లేకుండా మంత్రదీక్ష పొందవలయును.

చరన్సరై ్వర్వి వర్జ్యస్యాత్ స్థిరరాశిషు సౌఖ్యదాః
త్రిషడాయగతాః పాపాః శుభాః కేంద్రత్రికోణగాః
దీక్షాయాంతు శుభాస్సర్వే రంధ్రస్థా స్సర్వనాశకాః

ఇట్లు తెలిసి ముఖ్యమగు కాలములయందు దీక్షను పొందుట ముఖ్యము—

(9)

మాతృకలు మంత్రములు శివశక్త్యాత్మకములు గనుక మంత్రములయందు గల దోషములను పోగొట్టుకొనుటకు యోనిముద్రా శోధనము అవసరమై యున్నది. ఆధార మందు గల కుండలినీ శక్తి ఆధారాదిషట్చక్రములలో వామ దక్షిణ మార్గములగు ఇడా పింగళానాడులగుండా పరిభ్రమించునప్పుడు అగ్నివాయు సంయోగముచే వర్ణ ములు ఉత్పన్నమై ఆ వర్ణములే మంత్రాకృతిని పొందుట వలన మంత్రములు శివశక్త్యాత్మకములున్నూ అగ్నీషో మాత్మకమున్నూ అయివున్నవి. వీనిలో సోమసంబంధము లగు మంత్రములు సౌమ్యములని అగ్ని సంబంధము లగు మంత్రములు క్రూరములనిన్ని చెప్పబడును. ఇట్లు అహోరాత్రములయందును నాడీ మార్గములగుండా ప్రయాణముచేయు శక్తివలన ఉత్పన్నములగు వర్ణములు అహోరాత్ర రూపములు; ఇట్లు పరిభ్రమించుటలో రాత్రి కాలమున వామనాడిలో ప్రయాణము చేయు వాయువు వలన ఉత్పన్నమగు మంత్రములకు అగ్నిత్వమున్నూ క్రూరత్వమున్నూ కలదు. పగటి కాలములో దక్షిణనాడిలో ప్రయాణము చేయు వాయువువలన ఉత్పన్నమైన మంత్ర ములకు సోమత్వమున్నూ సౌమ్యమున్నూ గలదు. కాబట్టి రాత్రి స్వప్నసుషుప్త్యవస్థలలోనూ, పగలు జాగ్రదవస్థలోనూ ఉత్పన్నమగు మంత్రములను జపించుటవలన సిద్ధి కలు గక పోగా అనర్థములుగూడా కల్గును. కావున ఉభయ రూపమగు (అనగా రెండు మార్గములలోనూ వాయువు ప్రవహించు కాలము) ప్రబోధకాలములో ఉత్పన్నమగు మంత్రములు సిద్ధిని కలుగజేయును. ప్రబోధ కాలమనగా శివశక్తి సంపుట కాలమగు ప్రాణాయామకాలము; కావున సాధకుడు ప్రాణాయామముచే శివశక్తి రూపములగు ఇడా పింగళానాడులను రేచకపూరకములతో ఏకము చేసి కుంభ కమందుండు కాలము ప్రబోధకాలము. ఇట్టి ప్రబోధకాల మున జపించిన మంత్రములు సర్వసిద్ధులను కలుగ చేయును. మరియూ మాతృకలకు శివశక్త్యాత్మకత్వము ఉండుటవలన మాతృకలే మంత్రోత్పత్తికి కారణమగుట వలననూ శక్తితత్వమందుగల అణ్వాది మలరూపములగు దోషములు మంత్రములయందు గూడి విరుద్ధఫలములు యిచ్చును. కావున ఆ మలరూపములగు మంత్రదోషములు పోగొట్టుకొని సిద్ధిని పొందుటకు శివశక్తి మేళనాత్మక మహా యోని ముద్రాశోధనముచేసి దోషములను పోగొట్టుకొని మంత్రములను జపించవలయును. మంత్రములకు ఛిన్నా రుద్ధా కీలిత స్తంభితా సుప్త మత్త మూర్ఛిత హతవీర్య దగ్ధ త్రస్త మీలిత విపక్షస్థ సత్వహీన ఖండిత దారిత మూక నగ్న బుజంగక శూన్య హత మొదలగు అనేక దోషములు గలవు. సాధకునిచే జపించియూ కార్యసిద్ధిని యివ్వని మంత్రములు మీలితములు. శతృపక్షమునకు అనుకూలము లగు మంత్రములు విపక్షములు. మొదటగాని మధ్య గాని చివరగాని ధ్రువములగు వర్ణములు లేని మంత్ర ములు దారితములు. కరాంగన్యాసములు లేని మంత్ర ములు మూకములు. పల్లవములు లేని మంత్రములు నగ్నములు ఋషి దేవతఛందములు లేని మంత్రములు బుజంగములు. మంత్రము జపించునపుడు యితరులు వినిన మంత్రములు శూన్యములు. ఇట్టి దోషములు పోవుటకు మహాయోని శోధనము అవసరము.

సాధకుడు యెడమకాలి మడమతో గుదస్థానమును పీడించి ప్రాణాయామము చేసి రేచకపూరకములచే అపానవాయువును ఊర్ధ్వగతిచేయగా మూలబంధ మగును; ఇట్లు మూలబంధముచే ఉత్థానమగు వాయు వును కుంభకము చేశి మూలాధారమునుండి క్రమ ముగా ఉత్పన్నమగు వర్ణములనుండి యిష్ట మంత్ర మును నిర్మించుకొని ఆ మంత్రమును బిందురూపముతో ఏకము చేసి ఉన్మనీ స్థానమును పొందించి అచ్చట వెయ్యి మార్లు జపించుటవలన మంత్రగత దోషములన్నియూ పోయి సిద్ధిని కలిగించును. ఇట్లు మంత్రమును శోధిం చుటయే మహాయోని శోధన మనబడును. శోధించిన మంత్రము వీర్యవంతమై సాధకుని సర్వకోరికలు యిచ్చు టకు సమర్థమై యుండును.

పైన చెప్పిన ప్రకారము వాయుధారణము చేయుటకు శక్తి లేనివారలకును యోనిముద్రా శోధనము తెలియనివారి కిని మంత్రదోషములు పోవుటకు మంత్రదశ సంస్కారములు చెప్పబడియున్నవి. జననం జీవనం తాడనం బోధనం అభి షేకం విమలీకరణం ఆప్యాయనం తర్పణం దీపనం గుప్తిః అను యీ పదియును:-ఈమంత్రసంస్కారములచే సంస్క రింపబడిన మంత్రము దోషరహితమై అనుష్ఠాన యోగ్య మగును.

1. జననం—సాధకుడు శుద్ధమగు పీఠమందుగాని తండులపుంజమందుగాని భూర్జపత్రమందుగాని కుంకుమ గోరోచన కుశాదులచే మాతృకాపద్మమును లిఖించి తన కిష్ట మంత్రవర్ణములను వరుసగా మాతృకాపద్మమునుండి ఉద్ధరించుకొనుట జనన మనబడును—

2. జీవనం—మంత్రవర్ణములను ప్రణవముతో సంపుటి చేసి నూరు పర్యాయములు జపించుట జీవన మనబడును. దీనిచే మంత్రమునకు జీవము గల్గును.

3. తాడనం—భూర్జపత్రాదులయందు మంత్రవర్ణములను లిఖించి సాధకుడు మంచిగంధ మిశ్రితతోయములతో "యం" అను వాయు బీజమును ఉచ్చరింపుచూ ప్రతి వర్ణమునూ నూరు పర్యాయములు కొట్టుటయే తాడన మనబడును—

4. బోధనము — పూర్వమువలెనే పత్రాదులయందు లిఖించిన మంత్రవర్ణములను వర్ణసంఖ్య గల ఎర్ర గన్నేరు పూవులతో "రం" అను అగ్నిబీజమును ఉచ్చరించుచూ తాకుటయే బోధన మనబడును—

5. అభిషేకము—మంత్రాక్షరములను భూర్జపత్రమందు వ్రాసి అక్షర సంఖ్యగల రావిచిగుళ్లతో యీ మంత్రమును (అముక మంత్రస్య అముకాక్షర మభిషించామినమః, అని నూటయెనిమిది సార్లు జపించుచూ అభిషేకము చేయుట అభిషేక మనబడును—

6. విమలీకరణము — మంత్రమునందు సహజము, ఆగంతుకము, మాయికము అను మూడు మలములు గలవు ఆ మలములను జ్యోతిర్మంత్రముచే దహింపచేసిన, మంత్రము మలహీనమై శుద్ధమగును; గాన సాధకుడు యిష్ట మంత్రమును మనస్సులో స్మరించుచూ (ఓంహౌం) అను జ్యోతిర్మంత్రమును సంపుటి చేసి జపించుటయే విమలీకరణము—దీనిచే మంత్రము నిర్మలమగును—

7. అప్యాయనము—పూర్వమువలెనే మంత్రవర్ణములను లిఖించుకొని ఆ మంత్రమునే జపించుచూ ప్రత్యేక ప్రత్యేకము మంత్రవర్ణములను కుశోదకముచే ప్రోక్షణము చేయుట అప్యాయనము; దీనిచే మంత్రమునకు తృప్తి కలుగును.

8. తర్పణము— అట్లె లిఖితమంత్రవర్ణములమీద మంత్రమును జపిస్తూ శుద్ధజలముచే "అముక మంత్రం తర్పయామి" అని 108 సార్లు తర్పణము చేయుటయే తర్పణ మనబడును—

9. దీపనం—ఇష్టమంత్రమునకు ముందు "ఓం హ్రీం శ్రీం" అను బీజములను చేర్చి యేడు పర్యాయములు జపించుటయే దీపనమనబడును—

10. గుప్తి—సాధకుడు గురువుయొద్దనుండి గ్రహించిన మంత్రమును జపించునప్పుడు యితరులకు వినబడకుండా రహస్యముగా జపించుటయే గుప్తి యనబడును- ఈప్రకారము పై దశసంస్కారములచేతను మంత్రము శుద్ధమై అనుష్ఠాన యోగ్యమై సాధకునకు సర్వఫలములు యిచ్చునది అగును.

వెనుక చెప్పబడిన ప్రకారము సిద్ధారిశోధనము చేసి గ్రహించిన మంత్రమును మహాయోనిశోధనము దశ సంస్కారముల చేతనూ సంస్కరించి దృష్టాఽదృష్ట ఫల రూపమగు మంత్రమును స్థానషట్క ప్రకారము శుచిగల సాధకుడు జపించి ఫలమును పొందును—స్థానషట్కమును గురించి శివుడు—

> శుచిరారాధయేన్మంత్రం దృష్టాఽదృష్ట ఫలప్రదం
> సకలం నిష్కలం సూక్ష్మం తథా సకల నిష్కలం
> కలాభిన్నం కలాతీతం షోఢామంత్రం శివోఽబ్రవీత్
> సకలం బ్రహ్మరంధ్రస్థం తదధోవిద్ధి నిష్కలం
> మానసం సూక్ష్మనామానం హృత్స్థం సకలనిష్కలం
> బిందుస్థితం కలాభిన్నం కలాతీతం తదూర్ధ్వతః
> కలాకుండలినీ సైవనాదశక్తిః శివోదితా ॥

బ్రహ్మరంధ్రమందు జపించు మంత్రము సకల మనియూ (సర్వకోరికలును) సహస్రారమున జపించు మంత్రము నిష్కలమనియూ (కేవలముక్తిని) నాసికాగ్రమున జపించు మంత్రము సూక్ష్మమనియూ (ఆత్మసాక్షాత్కారమును) హృదయమందు జపించు మంత్రము సకల నిష్కలమనియూ (ఐహికాముష్మికఫలములు) ఆధారమందుగల బిందువులో జపించు మంత్రము కలాభిన్నమనియూ (స్వరూపదర్శనము) ఆధారమందుగల బిందువు పైభాగమున జపించు మంత్రము కలాతీతమనియూ (ముక్తిని) కల అనగా శివునివలన అభివ్యక్తమైన నాద రూపిణియగు కుండలినీ శక్తి అనియూ యిట్లు తెలసి ఆయా స్థానములయందు మంత్రమును జపించిన సాధకునకు ఆయా ఫలములు కల్గునని భావము—ఇట్లు తెలియక స్థానబాహ్యముగా జపించిన మంత్రము సుసిద్ధమైననూ అరి మంత్రమువలెనే ఘాతచేయును—ప్రసంగవశముచే అరిమంత్రత్యాగము చెప్పబడుచున్నది—సాధకులు అజ్ఞానముచే సిద్ధారిమంత్ర శోధనముచేయక జపించిన మంత్రముచే బాధలు గలిగిన అట్టి మంత్రమును త్యాగముచేయుటవలన స్వస్థత గలుగును—

శుభదినమందు కర్త అనుకూల తారాబల యుక్తమగు ముహూర్తమున ఉత్తముడై విధిజ్ఞుడగు గురువునుగ్రహించి స్వగృహమందుగాని నదీతీరమునగాని దేవాలయము గోశాల వీనిలో యొక రమ్యక్షేత్రమున దీక్షావిధి ప్రకారము సర్వతో

భద్రమండలమందు కుంభమును ఉంచి శుద్ధజలముచే పూరించి పంచపల్లవ పంచగవ్య పంచామృత అష్టమృదములను అందు ఉంచి తాను జపించిన మంత్రమును తల క్రిందుగా ఉచ్చరించి ఆ మంత్ర దేవతను కుంభమున అవాహనముచేసి సాంగావరణ యుక్తముగా షోడశోపచారములతో పూజించి మండలసమీపమున స్వశాఖోక్తవిధిగా అగ్నిని ప్రతిష్ఠించి మంత్రమును విలోమముగా జపించుచూ ఆవు నేతితో అష్టోత్తర సహస్రముగాని అష్టోత్తర శతముగాని హెూమముచేసి బ్రహ్మార్పణ బుద్ధితో త్యాగముచేసి పూర్ణాహుత్యంతమున ఆజ్యమిశ్రిత పరమాన్నముతో దిక్పాలకులకు క్రింద మంత్రములతో బలియొసంగవలయును.

ఆయాహీంద్రసురాధీశ శతమన్యో శచీపతే
సమస్తుభ్యం గృహాణేమం పుష్పధూపాదికం బలిం
"ఇంద్రాయనమః బలిందదామి" ఇతి సర్వత్ర.

ఆయాహితేజ సాంనాథ హవ్యవాహ వరప్రద
గృహాణ పుష్పధూపాదింబలిమేనం సుపూజితం ॥
ప్రేతరాజసమాయాహి భిన్నాంజనసమద్యుతె
బలిందత్తం గృహిత్వేమం సుప్రీతోవరదోభవ॥
నమస్తే రక్షసాంనాథ నిర్ఋతేత్వమిహాగతః
గృహాణబలిపూజాదిమయాభక్త్యా నివేదితం ॥
ఏహిపశ్చిమ దిక్పాల జలనాథ నమోస్తుతే
భక్త్యానివేదితాం పూజాంగృహీత్వా ప్రీతిమావహ ॥
ప్రభంజన ప్రాణపతెత్వమేహి సపరిచ్ఛద
మయాప్రయుక్తం విధివత్ గృహాణ బలిమాదరాత్ ॥
కుబేరతారకాధీశావాగచ్ఛేతాం సురోత్తమౌ
పుష్పధూపాదిభిః ప్రీతౌ భవేతాం వరదౌమమ ॥
ఈశత్వమెవభగవాన్ సర్వవిద్యాశ్రయప్రభో
పూజితః పుష్పధూపాద్యైః ప్రీతోభవవిభూతయె ॥
ఆయాహి సర్వలోకానాంనాథ బ్రహ్మన్ సమర్చనం
గృహాణ సర్వాన్విఘ్నాన్మే నివర్తయనమోస్తుతే ॥
ఆగచ్ఛవరదావ్యక్త విష్ణో విశ్వస్యనాయక
పూజితః పరయాభక్త్యా భవత్వం సుఖదోమమ ॥

ఈ ప్రకారము బలియిచ్చి అనంతరము అవరణసహితమగు మంత్రదేవతను తిరిగి పూజించి ప్రార్ధించవలయును.

ఆనుకూల్యం అనాలోచ్య మయా తరలబుద్ధినా
యదుపాత్తం పూజితంచ ప్రభోమంత్ర స్వరూపకం
తేనే మే మనసఃక్షోభమశేషం వినివర్తయ
పాపం ప్రతిహతంచాస్తుభూయాచ్ఛ్రేయస్సనాతనం
తనోతు మమ కళ్యాణం పావనీభక్తిరేవతే॥ ఇట్లు ప్రార్థించి మంత్రవర్ణములను తలక్రిందుగా యంత్రమందు వ్రాసి కర్పూర అగరు చందనములచే ఆలది యంత్రమును కలశమందుంచి పూజించి ఆ యంత్రము శిరమున నిడుకొని కలశోదకముచే కుశలతో గురువుచే అభిషేకించుకొన్నవాడై తిరిగి కలశమును ఉదకముతోనింపి యంత్రముతో గూడిన కలశమును భుజమున ధరించి నదియందుగాని తటాకమునగాని లోతునీటిలో ప్రక్షేపముచేసి యింటికివచ్చి గురువును పూజింపవలయును. ఇట్లు అరిమంత్రమును త్యాగముచేయుటవలన సాధకునకు సర్వారిష్టములు పరిహారమై శుభములు గల్గి వంశాభివృద్ధియగును.

---

ఓం ఆర్ద్రం జ్వలతి జ్యోతిరహమస్మి।
అహమస్మి బ్రహ్మాహమస్మి
అహమేవాహం మాం జుహోమిస్వాహా॥

[పై శీర్షికయం దిటుపిమ్మట "ఆరాధన" యందు "వాస్తుశాస్త్రోత్పత్తి", తత్స్వరూపము, ప్రయోజనములను క్రమముగా వివరించు వ్యాసములు ప్రకటింపబడును.]

కూర్చునియున్నది కనుక ఎత్తు 5 అడుగులును వుండును. ఎదుట శిలాసింహమున్నది, దేవి దక్షిణముఖముగానుండి తటాకమునే చూచుచున్నది.

వికృతినామ సంవత్సర నిజాషాఢశుద్ధ పూర్ణిమా శని వారము 29-7-50 రోజున పురజనుల సహాయముతో సంప్రోక్షణాదికములు జరిగినవి. అప్పటినుండి, సక్రమ ముగా అహింసాత్మకముగా నిత్యపూజలు జరుగు చున్నవి.

దేవీమహిమ.

ఇచ్చటి అర్చకులు స్మార్తులు. శ్రావణమాసములోను, దేవీ నవరాత్రములందును ఉత్సవములు, సహస్రనామా ర్చనలు, కుంకుమపూజలు జరుగును అక్కడకు ఎవ్వ రును అపరిశుద్ధముగా వెళ్లకూడదు. వెళ్లినచో తప్పక కష్టనష్టములు కలిగితీరును. 4 సంవత్సరములక్రిందట శ్రావణమాసములో ఉత్సవములు జరుగుచుండగా ఉదయం 10, 11 గంటల మధ్య ఎచ్చటనుండియో ఒక తెల్లని త్రాచుపాము వచ్చి ఒకస్త్రీని కాటువేసినది. కొలది గంటలలో ఆమె మరణించినది; ఆమె అపరిశుద్ధముగా వచ్చినందుననే అట్లు జరిగినదని అర్చకులు గణేశ్వరరావు గారు చెప్పినారు. సర్పమును చంపవలెనని ఎంతయో ప్రయత్నము చేసినారు, కాని అది ఎక్కడనుండి వచ్చినది, మరల ఎక్కడకు పోయినదికూడ తెలుసుకొనలేకపోయి నారు. పూర్వము దేవీపాదములవద్దనుండెడి సర్పమేనని గణేశ్వరరావుగారు గుర్తించినారు. రాత్రులందు అప్పు డప్పుడు దేవియొక్క సన్నిధానమునకు వచ్చుచుండును. ఒకసారి గణేశ్వరరావుగారి వంటయింట్లో ప్రత్యక్షమైనది. బుసలుకొట్టుచు పడగవిప్పి ఆడుచుండగా, ఎట్లైనా చంప వలెనని చాలమంది ప్రయత్నముచేసినారు. పాము నిలు వెత్తున లేచి బుసలుకొట్ట నారంభించినది- అందరును భయభ్రాంతులైరి. గణేశ్వరరావుగారు పసపుకుంకుమలతో దూరమునుండియే పూజించినారు. అట్లు 4, 5 గంటల కాలముచేసిన తర్వాత సర్పము శాంతించి వెళ్లిపోయినది. క్రిందటిరోజున ఆయనభార్య బహిష్టుతోనుండి ఏదో పని మీద దేవాలయ సమీపమునకు వచ్చినదనియు అందువల ననే సర్పరాజునకు ఆగ్రహము కలిగియుండవచ్చుననియు గణేశ్వరరావుగారు చెప్పినారు. ఎన్నిసార్లు వచ్చినను ఒకే సర్పము వచ్చును. భక్తులకు కోరిన కోర్కెలను తీర్చుట



శ్రీ భద్రకాళిదేవి - ఓరుగల్లు

యందు దేవి బద్ధకంకణురాలై యున్నది. అనేక ప్రాంత ములనుండి భక్తులువచ్చి మొక్కుబడులు చెల్లించు చుందురు. తిరుపతి దేవస్థానములోవలెనే ఇక్కడకూడ, వివాహములు, ఉపనయనములు జరుపుకొనుటకు భక్తులు వచ్చుచుందురు.

వరంగల్, హనుమకొండ, పట్టణములలో ఇటువంటి ప్రాచీన దేవాలయములు ఎన్నియోకలవు. కాని తగినంత ఆర్థికసహాయము లేక శిథిలావస్థలో నున్నవి.

యత్రాస్తి మోక్షో నచతత్ర భోగః
యత్రాస్తి భోగో నచతత్ర మోక్షః ।
శ్రీ సుందరీ సేవన తత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥

# ఉత్సవములు - వ్రతములు

(పుష్యమాసము నందలివి)

పుష్యశుద్ధ ౧౧ ఏకాదశీ శనివారం (12-1-1957) వైకుంఠ ఏకాదశి. వైష్ణవాలయములయందు ప్రాతఃకాలము నందు శ్రీస్వామివారికి విశేషపూజలు జరుపబడి తిరువీది జరుపబడును.

పుష్యశుద్ధ ౧౨ ద్వాదశీ ఆదివారం (13-1-1957) భోగిపండుగ. రాత్రి 12-20 నిమిషములకు మకర సంక్రమణ ప్రవేశము.

పుష్యశుద్ధ ౧౩ త్రయోదశీ సోమవారం (14-1-1957) మకరసంక్రాంతి—ఈ దినమున ఉత్తరాయణపుణ్యకాల మునం దొనర్చుదేవ పితృకార్యములు చేయనగును.

పుష్యశుద్ధ ౧౪ చతుర్దశీ మంగళవారం (15-1-1957) కనుముపండుగ.

ఈ దినమునందే హనుమదాలయములందు హనుమత్కళ్యాణోత్సవము జరుపబడును.

ఇందు కనుబంధముగా నీ క్రిందను "సువర్చలాకళ్యాణము" అను వ్యాసము పొందుపరుపబడినది.

---

# సువర్చలా కల్యాణము

*శ్రీ మాన్ కవిరాజశిరోమణి, పండిత, దేవి నరసింహాచార్యులు*

మేనేజింగు ట్రస్టి. శ్రీ ఆంజనేయస్వామివారి దేవస్థానం - అవనిగడ్డ.

శ్రీ ఆంజనేయస్వామివారికి వివాహము కలదా? వివాహితుఁడైన బ్రహ్మచారి యెట్లగును? వివాహమెప్పుడు జరిగినది? అను సందేహములు పలువురు పండితులకు సహితము కలుగుచున్నవి. కారణమేమన:—శ్రీ మద్వాల్మీకము, అధ్యాత్మము మున్నగు రామాయణములందీ హనుమద్వివాహప్రశంస లేకపోవుటవల్లను, ముల్లోకములలోను, చర్మమోహితులు కానివారు, భీష్ముఁడును, హనుమంతుఁడునుఁ దక్క నితరులు లేరని,

"అన్యత్ర భీష్మాద్గాంగేయాదన్యత్రచ హనూమతః
హరిణీఖురమాత్రేణ చర్మణా మోహితం జగత్"

అని పురాణములు పలుకుటచేతను, దీని వివరము స్పష్టముగాఁ దెలియదయ్యెను. హనుమంతున కేకాదశమూర్తులు, తంత్రగ్రంథములందు పేర్కొనఁబడినవి. ఇందు స్వామి లీలలనుఁబట్టి యుపాసకు లేర్పరుచుకొనినవి యారు మూర్తులు. తక్కినవి యవతారభేదములు. ఈ హనుమదుపాసనమును నద్వైతులు యీశ్వరాంశసంభూతులనియు, విశిష్టాద్వైతులు విష్ణుభక్తుడనియు, ద్వైతులు భగవత్కార్యసాధకులనియు సేయుచున్నారు. ఇట్లు మతత్రయము వారికి నుపాస్యుడైనను ద్వైతులకు మాత్రము వీరభిమానదైవము. ఏలనన? మధ్వులకు "హరిరేవపరః" అను సూక్తివలన పరమహంసవాచ్యుఁడైన శ్రీమన్నారాయణుడే పరమదైవమైనను, ప్రమథగణములలో ప్రథముఁడు వాయుదేవుఁడు. వాయుదేవునికి "ముఖ్యప్రాణదేవర" యని వారి సంప్రదాయనామము. భగవత్సేవ సేయుటకు, సమీరాంశసంభూతులే ముఖ్యులనియు, నా ముగ్గురిలోను, హనుమంతుఁడు ప్రథమాచార్యుఁడైనటుల,

"ప్రథమోహనుమన్నామా ద్వితీయో భీమఏవచ
తృతీయఃపూర్ణప్రజ్ఞస్తు భగవత్కార్యసాధకాః"

అను వారి గురుపరంపరవలన తెలియుచున్నది. ఈ పూర్ణప్రజ్ఞులే మధ్వాచార్యులు. ఇట్లు హిందువులేఁగాక, అన్యమతస్థులగు బౌద్ధ, జైన, మహమ్మదీయులుఁగూడ నీ హనుమదుపాసనము నంగీకరింతురు. కనుకనే, హిమవత్పర్వతములోని, సిమ్లా (Simla) లో "జాకో" (Jaco) నగాగ్రమునుండి సింహళద్వీపము (Cylon) లో "జాఫ్నా"

(Jafna) వరకు నీ హనుమదాలయములు ప్రతిష్ఠింపఁబడి యున్నవి. పశ్చిమదేశమున నేటికిని "వాలాయుదం, వేలాయుదం" లేని గ్రామముండదని యొక ప్రతీతి కలదు. "ఉపాసనార్థం భక్తానాం బ్రహ్మణోరూపకల్పనమ్" అని ఆగమములు నిర్వచించినవి. ఇటులే హనుమంతుని యేకాదశమూర్తులలో 1, ప్రపత్తి 2, వీర 3, దాస 4, పాదగతాభిముఖ 5, వార్తావాహ 6, రాజముఖి యను నీ యారును లీలావతారములు 7, యోగపట్టధర 8, చతుర్భుజ 9, పంచముఖి 10, వింశతిభుజ 11, సువర్చల యను నీ యైదును అంశావతారములు. ప్రపత్తిమూర్తికే ప్రసన్నుఁడనికూడ యందురు. సాధారణముగా నన్ని దేవాలయములందును, స్వామి కభిముఖముగ నీ మూర్తిని ప్రతిష్ఠించుట యాచారమైయున్నది. కొన్నిక్షేత్రములందు వీరాంజనేయ విగ్రహములనుఁగూడ ప్రతిష్ఠించుట యుల వాటు. ఈ మూర్తి రణరంగమున, లక్ష్మణమూర్ఛానంతరము సుషేణోపదేశమున సంజీవాద్రినిఁ దెచ్చునప్పటి దృశ్యము. "ప్రసన్నవదనం శ్రీ ఆంజనేయం భజే" అని ప్రపత్తిమూర్తి ధ్యానము. "వీరాకారం త్రినేత్రం మమ శుభ ఫలదంవాయుపుత్రం నమామి" అని వీరాంజనేయ ధ్యానము. దాసాంజనేయుఁడన శ్రీరామపరివార పట్టాభిషేకమున శ్రీరామపాదారవిందముల నాశ్రయించి యవనత ముఖుడై, యంజలి ఘటించి కూర్చున్నప్పటి చిత్రము. "శ్రీరామదూతం శిరసానమామి" అని వీరి ధ్యానశ్లోకము. పాదగతాభిముఖస్వామి, రామచంద్ర పరమాత్మ సీతాన్వేషణముకొరకు లంకకుఁ బంపునపుడు, తన ముద్రిక నానవాలుగానిచ్చి వెళ్లుడని చెప్పగా స్వామి వెనుకకు తిరిగి యొక యడుగువేయగా, తిరిగి స్వామివారు పిలుచుటచే నటులే నుంచుని రామచంద్రుని కభిముఖులై చూచిరి. ఇట్టి మూర్తికి "పాదగతాభిముఖుఁడ"ని పేరు. ఇట్టి సుందరమూర్తి కృష్ణవేణికి పశ్చిమతీరమున, రేపల్లె తాలూకా "పెనుమూడి" గ్రామములోఁ గలదు. వీరి ధ్యానమిట్లు కలదు. "ఏకపాదగతంశాంతం - ద్విభుజం చ కృతాంజలిం। కందర్పకోటిలావణ్యం ముఖాంభోజం హరిం భజే" అని. వార్తావహమూర్తికే "ముద్రికాదత్తుఁడ"ని కూడపేరు. ఈ మూర్తి గుంటూరు మండలాంతర్గత వినుకొండలో వెలసియుండెను. సీతావృత్తాంతమును శ్రీరామమూర్తికి నివేదించుటచే నీతని వార్తావహుఁడందురు. ఇక్కడొక ప్రభావము కలదు. పూర్వము భక్తులెవరైన తమ బంధువులయొద్దనుండిగాని, స్నేహితులయొద్దనుండిగాని, వార్తలు వినఁగోరువారు, తామొక లేఖను వ్రాసి, స్వామి నర్చించి, నమస్కరించి వారి పాదములయొద్ద రాత్రి యుంచినచో మరునాడుదయమునకు సమాధాన మొచ్చి యుండెడెనట. ఇందువలన నీ దేవునకు, "వార్తావహుఁడ"ని, "టపా" ఆంజనేయుఁడనికూడ ప్రసిద్ధి కలదు. పెక్కురు ప్రభువులీ సత్యమును పరీక్షించి భూరి దానములనిచ్చి, శాసనములను వ్రాయించిరి. ఆగమ గ్రంథములందు "రక్షః పుంగవ గర్వపర్వతపవిః-కాకుత్స్థ వార్తావహః" అని వీరిని వర్ణించిరి. శ్రీ రాజముఖి హనుమంత విగ్రహము, కృష్ణామండలాంతర్గత అవనిగడ్డలో గోపురము ముందువైపు నుత్తరభాగమునఁ గలదు. ఈ లావణ్య చక్రవర్తి, ప్రతాపమనంతము. వీరు విద్యాప్రదులు, విద్యాపరీక్షకులు, వీరి నుపాసించువారి జిహ్వాగ్రమున సమస్తవిద్యలు తాండవమాడు చుండును. "సంరక్తాంబరలోచనం పవనజం శ్రీ రాజ వక్త్రాంబుజమ"ని తంత్రకారులు ధ్యానించిరి. వీరి మాహాత్మ్యమును "ఆరాధన" పత్రికలో "అవనిగడ్డ - ఉభయనారాయణ క్షేత్రము"ను వ్యాసమునఁ జూడనగును. శ్రీ యోగపట్టధరాంజనేయమూర్తి నూజివీటి సంస్థానములో చేరిన 'శోభనాద్రి క్షేత్రము (ఆకిరిపల్లె) లో వ్యాఘ్ర నృసింహస్వామి సన్నిధిలోఁ గలదు. స్వామి యోగాసనాసీనులై, నిమీలిత నేత్రులై, ధ్యానినిష్ఠులై, యోగపట్ట భద్రులై కన్పట్టు చున్నారు. పూర్వము కొందరు వీరి ప్రసాదమగ్రాహ్యమని సన్నిధి నుండి వెళ్లగించుటకు ప్రయత్నింపగా నా విగ్రహము కంపించి యూగనారంభించెనట. అంత వారు భయపడి తమ యుద్యమమును విరమించు కొనిరట్లు నిచట వృద్ధులు చెప్పుదురు. ఇట్లు విగ్రహములు "టపాలు" (tappals) మోయునా? కదలునా? యను సందియము నేటి విమర్శకులకు కలుగ వచ్చును. ఇట్లు విగ్రహములు కదలుట మొదలుకూడ ప్రత్యక్షమగుట మున్నగునవి జరుగుచుండును. తిరుపతిలో శ్రీనివాసునితో హత్తీరాం చదరంగ మాడుట, మేలు కోటలో "శల్వపిళ్ల స్వామి" చూడుకుడుత్త వివాహము, భద్రాచలములో రామదాసు చెరసాల మోచనము, పొన్నూరు భావనారాయణ సాక్ష్య మిచ్చుట, శ్రీకాకుళములో శిఖాదర్శనము, సాక్షిగోపాలము, కంచి, కాళహస్తి మున్నగున వెన్నియో క్షేత్రములు సాక్ష్యమిచ్చు చున్నవి. ఇటీవల రానున్న యాపదనుఁ గూర్చి, హైదరాబాదులో "మూసీ" నది స్త్రీ రూపమున నవాబుకు ప్రత్యక్షమై చెప్పినట్లును, తరువాత నట్లులే జరిగినట్లును, వార్తా పత్రికలలో ప్రచురించిరి. ఇట్లు దేవాలయములందలి విగ్రహములు, నర్తనముఁ జేసినను నాదముచేసినను, నవ్వినను, కనులు విప్పినను, మూసినను, రాష్ట్రక్షోభము కలుగునని, మహాభారతము, సభా పర్వములో 68 వ అధ్యాయమున శ్రీ వ్యాసభగవానుఁడు

"అర్చాయత్ర ప్రనృత్యంతి, నదంతిచ, హసంతిచ
ఉన్మీలంతి నిమీలంతి రాష్ట్రక్షోభం వినిర్దిశేత్"

అని యుపదేశించిరి. ఇట్టి శక్తి చైతన్యరహితమైన విగ్రహములకెట్లు కలుగును ? అను ప్రశ్నకు సమాధానము.

" సర్వాతి శాయిషాడ్గుణ్యం సంస్థితం మంత్ర బింబయోః
అర్చాపి లౌకికీ యాస్యాత్సాపి షాడ్గుణ్య విగ్రహః "

అని లక్ష్మీ తంత్ర ప్రమాణము కలదు. అగ్నిచే తప్తముఁ జేయబడిన " అయఃపిండము " (యినపగుండు) సహితము పూర్వకాఠిన్యతనుఁబాసి మృదువుగా నెట్లగునో, అటుల మంత్ర తప్తములైన విగ్రహములును తమ సహజకాఠిన్యమును విడిచి చైతన్యముకలవై, చలన సంభాషణాది కార్యకరణ సమర్థములగును.

ఇట్లు భగవంతుఁడు, ప్రతీకము (విగ్రహము) నందు ప్రవేశించును. అప్పుడు భగవంతుని షడ్గుణముల సవి కలవియగును. కనుకనే శ్రీ మద్భాగవతములోకూడ,

కం॥ కదలెడి వేల్పులరూపులు
వదలెడిఁ గన్నీరు వానివలనం జెమటల్
పొదలెడిఁ బ్రతిమలు వెలిఁజని
మెదలెడి నొక్కొక్క గుడిని మేదిని యందున్ ॥

అని వర్ణింపఁబడినది. ఈ విషయమందు విశ్వాసము లేని వారు యీ శతాబ్దములోనే ది 28-8-1925 తేదీన వెలువడిన 'హిందూ' పత్రిక యందు నాగపూరులోని పాండురంగ స్వామి రుక్మిణీదేవి కన్నులనుండి పంద్రెండు గంటలు కన్నీరు ప్రవహించెనను ప్రకటననుఁ జూడకోరెదను. అందిట్లు కలదు.

"Idol's tears, curious, Nagpur incident." A Nagpur message to "The times of India" tells of hand bills signed by Mr. Narayanarao. Hedas was describing a strange incident. On the 17th August, tears were seen for 12 hours rolling down the cheeks of the idols of Vittal and Rukmini, in the temple of Panduranga Budvari, Nagpur, and thousands of people witnessed the incident. As a result of this strange phenomenon special prayers are being offered in the temple. Several people ascribe this effusion of tears from the idol's to the death of Tajuddin Sahib, the Mahomedan saint which occurred on that day".

శ్రీయోగపట్టధరాంజనేయ ధ్యానము.

" యోగపట్టేన బద్ధాంగం త్రినేత్రం చోగ్రవిగ్రహం
ధ్యాయేత్సమస్త దోషఘ్నమశోకద్రుమమూలగమ్ "

ఇంక చతుర్భుజ, పంచముఖి అవతారములు, పురుషార్థ సాధనమునకును, విద్యాప్రదానమునకును, వింశతిభుజ మూర్తి సహస్రముఖ రావణాసుర విజయముకొరకును యెత్తఁబడిన అవతారభేదములు. వారి మూర్తి ధ్యానము లిట్లుండును.

" చతుర్భుజశ్చంద్రసమప్రభావస్స్వర్ణోపవీతీ నవరత్న కుండలః "

అనియు, పంచముఖికి,

"వందేవానరనారసింహఖగరాట్క్రోడాశ్వవక్త్రాంచితం "

అనియు, వింశతిభుజస్వామికి,

" ఏవం వింశతి బాహుభిశ్చదధతంధ్యాయేద్ధనూ మత్ప్రభుం "

అనియు వర్ణింపఁబడినవి.

వెండియు సువర్చలా సహితబింబములు, అవనిగడ్డలోను, విజయవాడ గవర్నరుపేటలోను, మచిలీపట్టణములో కన్యకాపరమేశ్వరీ దేవాలయములోనుఁ గలవు. ఈ హనుమద్విషయము పరాశరసంహిత, శౌనకసంహిత, ఖగేంద్ర సంహిత సుషేణసంహితలలో విపులముగా వివరింపఁబడియున్నది. ఖగేంద్రసంహిత పంచాశీతి పటలమున సువర్చలా జననమునుఁ గూర్చియు హనుమత్కళ్యాణమునుఁ గూర్చియు నిట్లు వర్ణింపఁబడినది.

" ఉషానామ్నీం విశ్వకర్మా స్వసుతాంభానవేదదౌ
తస్యతీక్ష్ణాంశు సంతాపమశక్తా సోఢుమంజసా
స్వఛాయామంగనాం కృత్వానివేశ్యపతిసన్నిధౌ
అజ్ఞాతాసాపతింత్యక్త్వా జగామపితురంతికం
ఏతద్జ్ఞాత్వా ప్రభామాలీశ్వశురస్యగృహం యయౌ
విశ్వకర్మాతుతంవీక్ష్య జామాతరమథాబ్రవీత్
త్వయాసాకం నశక్నోతిస్థాతుంమె దుహితా రవే!
బడబారూపమాస్థాయ వనేచరతిమేసుతా
ఇత్యుక్తశ్శ్వశురేణాసౌ వాజీభూత్వావనంగతః
తయోస్సంగతయోర్జాతౌ దేవాంశావశ్వినౌ తదా
భానోర్వర్చాంసియంత్రేణ శాతయామాస విశ్వసృట్
శాతితైరంశుభిః కృత్వాకన్యాం నామ్నాసువర్చలాం
దదౌ సపూష్ణేతాంబాలాంవవృధేసాపితుర్గృహే
తదాప్రభృతి సూర్యస్య సన్నిధావాససాప్యుషా
ఛాయాప్యువాస తత్రైవ భార్యేద్వేరశ్మిమాలినః
త్రేతాయాం హనుమన్నామా సప్తాశ్వంసముపేయివాన్
శబ్దశాస్త్రం సమధ్యేతుంప్రార్థయామాస తంరవిం
మయాఽధీతాని చత్వారిపూర్వవ్యాకరణానివై
శేషాణిపంచమేబ్రహ్మన్ అధ్యాపయితు మర్హసి
తచ్ఛ్రుత్వాసమ్యగాలోచ్య భాస్కరః కపిసత్తమం
తేజోబలసమాయుక్తం స్వపుత్ర్యాస్స దృశంవరం

ఇదమాహకపిశ్రేష్ఠ ! త్వదుక్తం శాస్త్రసంచయం
అధ్యేతవ్యంహి గృహిణానావికారోస్తివైవలోః
తస్మాన్మమసుతా మూఢ్వాగృహణాఽన్యాని పంచచ
ఇత్యుక్త్వాస్వసుతాంప్రాదాత్ శాస్త్రాణ్యోపదిదేశహ
పుష్యేమాసిసితేపక్షే చతుర్దశ్యాం సుబెతిథౌ
హనుమాన్కపివర్యస్తాం శ్రీమానుదవహత్తదా
తదారుద్వాహమారభ్య బభూవుస్సుఖినోజనాః ।

* * *

ఇతిఖగేంద్ర సంహితాయాం మంత్రశాస్త్రే సువ
ర్చలోద్వాహ కథనంనామ పంచాశీతి తమఃపటలః ॥

ఇది మంత్రశాస్త్రము. విశ్వకర్మ తన కూతురైన, ఉషా దేవిని సూర్యునికిచ్చి వివాహముచేసెను. ఆమె మార్తాండుని కిరణవేడిమికి సహింపఁజాలక, తన ఛాయను తన వలె నొనర్చి భర్తృ సన్నిధినుంచి, తన పుట్టినింటికి వెళ్లి, యీ విషయమును తండ్రికిం జెప్పగా నాతఁడు సర్వమును విని, నీవు భర్తను విడిచివచ్చితివి. కనుక, నా యింట నుండ వీలులేదని యామెను తిరిగి పంపగా నామె వెళ్లుటకు భయపడి, ఆడు గుర్రమై యరణ్యమున సంచరించు చుండెను. కొంతకాలమునకు తన యంతికమున నున్నది ఛాయాదేవిగా తెలిసికొని సూర్యపరమాత్మ తన మామగారింటికేగి జరిగిన విషయమును విని, దివ్యదృష్టిచే జరిగిన యుదంతమును గ్రహించి, తానుకూడ అశ్వరూపమును ధరించి యా వనమున కేగి ఆమెతో సంచరించుచుండ, వారిరువురి సంయోగంబున నామెకు సద్యోగర్భమై అశ్వినీ దేవులు కలిగిరి. వీరే దేవవైద్యులైరి. అంత నాయుషాసుందరి భర్తతోకూడ పుట్టినింటికి వెళ్లి, తన కష్టమును తండ్రితో విన్నవించుకొనగా నా విశ్వకర్మ దయాళుడై తన అల్లుడైన సూర్యదేవుని తేజస్సును కొంత తగ్గించుటకై నాదేవు నొక యంత్రముననుంచి వరిపిడిచేయ (తరణినివైచి సానఁబట్ట)గా కొన్ని కాంతులు తరిగెను. విశ్వకర్మ ఆవర్చస్సులను వ్యర్థముగా పోఁగొట్టజాలక, వాటిని ప్రోవుఁజేసి నొక బాలగా సృష్టించి యామెను కూతురు జామాతలగు ఉషా మార్తాండులకిచ్చెను. అంత నా ముువ్వురును తమ లోకమునకుఁబోయి ఛాయాదేవికీయుదంతయు నంతయుఁ జెప్పి వారందరు సుఖముగానుండిరి. అప్పటినుండియు సూర్య దేవునకు "ఉషా, ఛాయ"లను యిరువురు భార్యలైరి. ఈ బాల, సూర్యుని సువర్చస్సులవలన పుట్టుటచే నామెకు "సువర్చలా" అని పేరిడిరి. ఇంతలో నాంజనేయుఁడు తన తండ్రియైన "కేసరివర్మ" వద్ద, నాలుగు వ్యాకరణములను మాత్రము చదువుకొని, మిగతా వ్యాకరణములను చదువుటకై భాస్కరునిఁజేరి ప్రార్థింప నాతఁడు నేను నిత్యము ఉదయాద్రినుండి అస్తాద్రికి పయనింతును. ఒక్కచో నుండను. నీ కెట్లు కుదురునని ప్రశ్నింప, ఆంజనేయుఁడు తన విశ్వరూపమును పెంచి ఉదయాద్రిపై నొక కాలును, అస్తాద్రిపై నొకకాలునుపెట్టి, మీరథముపెంట తిరుగుచుందునని చెప్పగా, శ్రీ సూర్యనారాయణమూర్తి అంజనాసూనుని సాహసమునకును తేజోబలవిజ్ఞానముల కచ్చెరువంది, బ్రహ్మచారికి నవవ్యాకరణములుఁ జదువు అధికారము లేదనియు, నాలుగు వ్యాకరణములు మాత్రమే చదువుట కధికారమున్నందువల్ల, వారి విద్యాసక్తికి మెచ్చి గృహస్థునిఁజేయఁబూని తనకూతురైన సువర్చలాదేవి నిచ్చి పుష్యశుద్ధ చతుర్దశినాడు వివాహమొనర్చి, మిగిలిన పంచ వ్యాకరణముల నుపదేశించెను. అందువలన శ్రీ ఆంజనేయుఁడు నవవ్యాకృతి పండితుడాయెను. ఇట్టి సువర్చలా హనుమత్కళ్యాణమును పుష్యశుద్ధ చతుర్దశీ రోజున నే దేశమందు నెవ్వరు చేసినను, శ్రీ స్వామి అనుగ్రహమున లోకములు సుఖముగ వర్ధిల్లుచుండునని ఫలశ్రుతి. ఈ సువర్చలాంజనేయధ్యానములు నీక్షింప నుదహరించుచున్నాను.

### శ్రీ వైఖానససకలాగమసార సంగ్రహము

"వందే పంచముఖం సుకుండలధరం వందే కపీనాంపతిం
వందే సూర్యసుతాసఖం ప్రియఫలం వందే హనూ
మత్ప్రభుమ్"

### వా న ర గీ త

"మాతా సువర్చలాదేవీ పితామే వాయునందనః
బాంధవా హనుమద్భక్తా స్స్వదేశం భువనత్రయమ్"

### హనుమదుపాసనా కల్పద్రుమము

"అథధ్యాయేత్కపిశ్రేష్ఠం చతురాభరణాన్వితం
వామభాగ స్థితాంపత్నీం సూర్యపుత్రీం సువర్చలామ్"

### హనుమత్పంజరము

"సువర్చలాధిష్ఠితవామభాగం వరాసనస్థంకపిబృంద
సేవితం
నృపాదమూలం శరణంగతానామభీష్టదం శ్రీ హను
మంతమీడే"

మరియు "శ్రీమద్భాను సుతామరుత్తనయయోః కుర్యాత్సదా మంగళం" అను యిత్యాది లగ్నాష్టకములున్నూ, "హనుమత్పర్యంకానసోత్సవము" (ఏకాంతసేవ) ప్రభాత సేవ మున్నగు విశేష ప్రబంధములున్నూ కలవు. ఇందువలన శ్రీ ఆంజనేయ స్వామివారికి వివాహము కలదనిన్నీ, ఆ కల్యాణము పుష్యశుద్ధ చతుర్దశినాడు చేయవలసి యుండునని నిన్నీ సిద్ధాంతము. ఇట్లు సువర్చలా హనుమత్కల్యాణముఁజేయు, చేయించు, పుణ్యదంపతులకు నీ పురాణమిధునము అఖిలైశ్వర్యములు ఆయురపవర్గము లిత్తురని ఫలశ్రుతి.

# ఆత్మసమర్పణ

బులుసు - వేంకటరమణయ్య.

భగవంతుడు భక్తపరాధీనుడని అందరికినీ తెలియును. తాను ఎట్టి కష్టములనైనా సహించి అతడు తన భక్తులను ఆపదలనుండి రక్షిస్తూవున్నాడనేటందుకు చాలా ఉదాహరణాలున్నాయి. అయితే, దేవుడు భక్తపరాధీనుడు గదా! అనే ధీమాతో ఏ భక్తుడూ అతన్ని శ్రమపెట్టేందుకు సిద్ధపడడు. తనకు తెలియకుండా—తనకోసం భగవంతుడు శ్రమపడితే అల్పజ్ఞుడైన భక్తుడు ఏమీ చెయ్యలేడు. కాని తెలిసివుంటే—శ్రమపడనియ్యడు. సరికదా—అతని కోసం—తన సర్వస్వమూ ధారపోయడానికీ, తన్ను అర్పించుకోడానికి సంతోషంతో సర్వదా సిద్ధపడివుంటాడు. అంతేకాదు- యథార్థమైన భగవద్భక్తుడు సహజంగా సాత్విక స్వభావం కలవాడగుటవల్ల అందరికీకూడా సేవ చెయ్యడానికిన్నీ, వారి కోరికలను నెరవేర్చడానికిన్నీ సంసిద్ధుడయి ఉంటాడు. ఆవిషయంలో ఆత్మార్పణకున్నూ ఎంత మాత్రమూ వెనుదీయడు. అట్టి ధైర్యసాహసాలు ఉన్న భక్తుని ప్రాణాలకు భగవంతుడు అడ్డుపడి, కాపాడి, ఎక్కువ సంతృప్తిని కలిగించుచుండును. దీనికి ఉదాహరణముగా మనము మయూరధ్వజుని చరిత్రను గ్రహించవచ్చును.

మయూరధ్వజుడు గొప్ప పరాక్రమశాలియగు రాజు. సాటిలేని విష్ణుభక్తుడు. అతడేకాదు—అతని రాజ్యములో ఉన్న ప్రజలందరును విష్ణుభక్తులే! వారు ఏ కర్మ నాచరించినను విష్ణువును ధ్యానించుచునే చేయుచుందురు. పిల్లవాండ్రు ఆటలలోనూ, పాటలలోనూ కూడా విష్ణువునే స్మరిస్తూ ఉందురు. రత్నపురం అతనికి రాజధాని.

మయూరధ్వజుడు ప్రజానురంజకుడై రాజ్యాన్ని పాలిస్తూ విష్ణుదేవుని ప్రీతికయి ఏడు అశ్వమేధయాగములు చేసెను. అశ్వమేధయాగము మహా పరాక్రమశాలులకే తప్ప సామాన్యులకు అసాధ్యమయినది. మయూరధ్వజుని కుమారుడు తామ్రధ్వజుడు కూడా తండ్రివలెనే గొప్ప పరాక్రమశాలి కావడంవల్లనూ, సేనాధిపతియైన నకులధ్వజుడున్నూ ఎదురులేని మహా వీరుడగుటవల్లను—ఆ యిద్దరి సాయంవల్లనూ అసాధ్యాలయిన అశ్వమేధయాగాలు ఆ రాజునకు సుసాధ్యాలయినవి.

ఏడు యాగాలు చేసినా మయూరధ్వజునికి సంతృప్తి కలగలేదు. ఎనిమిదో యాగం చెయ్యడానికి సిద్ధపడి యాగదీక్షవహించి దేశభ్రమణంకోసం యాగీయాశ్వాన్ని విడిచిపెట్టాడు. దాని రక్షణకోసం తామ్రధ్వజుడూ, ససైన్యంగా నకులధ్వజుడూ వెంటపడ్డారు.

అదే సమయంలో పాండవజ్యేష్ఠుడైన ధర్మరాజున్నూ అశ్వమేధయాగం చేయడానికి సంకల్పించుకున్నాడు. పాండవులకు కౌరవులతో జరిగిన యుద్ధంలో చాలమంది బంధువులూ, మిత్రులూ, చివరకు గురువులూకూడా వధించబడినందున, పాపపరిహారార్థం అశ్వమేధయాగం చేయవలసినదిగా వ్యాసమహర్షి సలహాయిచ్చాడు. ఆ సలహాను అనుసరించియే ధర్మజుడు యాగమునకు పూనుకొని దీక్షవహించి, అశ్వాన్ని దేశంమీదికి విడిచిపెట్టాడు. ఆ యాగాశ్వాన్ని రక్షించుటకు శ్రీ కృష్ణార్జునులు ప్రద్యుమ్నాదులతోపాటు ససైన్యంగా బయలుదేరి వెళ్లారు. ఆ యాగీయాశ్వము భూభ్రమణం చేస్తూవుండగా మయూరధ్వజుడు విడిచిన అశ్వం అతడు పరిపాలిస్తూవున్న రత్నపురి సమీపంలోనే ఎదురుపడినది. ఆ గుర్రాలు రెండూ ఒకదానిని ఇంకొకటి ఎదుర్కొని భయంకరంగా సకిలిస్తూ, దగ్గిరపడి ఒకదాని ముఖంమీద ఇంకొకటి ముఖం చేరుస్తూ కయ్యానికి సిద్ధపడినవి. కొంతసేపు పోట్లాట జరుగగా మయూరధ్వజుని గుర్రము పాండవుల హయమునకు లొంగిపోయినది.

కొలది సేపటిలోనే యీ సంగతి తామ్రధ్వజుడికి తెలిసిపోయినది. అతడు ఆ గుర్రాన్ని పట్టుకుని, వివరాలు తెలుసుకోవలసిందని తన సేనానాయకుడైన నకులధ్వజునికి ఆనతి యిచ్చాడు. నకులధ్వజుడు వెంటనే చతురంగ బలాలతో పాండవాశ్వాన్ని చుట్టుముట్టి, పట్టుకొని దాని లలాటంపై కట్టబడిన పట్టికను పరిశీలించి అశ్వమేధయాగం కోసమై పాండవాగ్రజుడైన ధర్మరాజు దానిని విడిచిపెట్టిన సంగతి యువరాజుకు తెలియజేసినాడు. వెంటనే ఆ గుర్రాన్ని కట్టిపెట్టి వారిద్దరూ యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు.

అంతకు ముందుదినం రాత్రియే నారదుడు ప్రసంగవశాత్తూ తామ్రధ్వజుడితో—పాండవుల సైన్యంలో వృషకేతుడూ, అర్జునుడూ తప్ప మరిచెప్పకోదగిన వీరులు లేరని చెప్పివుండెను. అందువల్ల అతడు పాండవసైన్యాన్ని ఎదుర్కోవడానికి ఏమాత్రమూ జంకలేదు.

తమ యాగాశ్వాన్ని తామ్రధ్వజుడు కట్టివేసినాడన్న వార్త తెలియగానే అర్జునుడు సైన్యంతో అతనిమీదికి యుద్ధానికి వచ్చాడు. ఇరుపక్షాలకూ చాలాసేపు యుద్ధం ఘోరంగా

జరిగింది. ప్రద్యుమ్నాదులు తామ్రధ్వజుని యెదుట నిలువలేకపోయారు. తర్వాత కృష్ణార్జునులు చాలాసేపు యుద్ధంచేసి, వారూ నిలవలేకపోయారు. తామ్రధ్వజుడు వారిద్దరినీ మూర్ఛగొట్టి, అశ్వమేధాశ్వాలు రెండింటినీ తీసుకుని సేనలతో గృహం చేరాడు.

తామ్రధ్వజుడు రత్నపురి చేరగానే నకులధ్వజుడు మహారాజువద్దకుపోయి యువరాజు కృష్ణార్జునులను ఓడించి రెండు అశ్వాలనూ తీసుకువచ్చిన సంగతి మనవిచేశాడు. అలా మనవి చెయ్యగా ఎంతో సంతోషించవలసిన మయూరధ్వజుడు కుమారునిపై మండిపడ్డాడు 'నీవు కృష్ణార్జునులను తీసుకొని రాకుండా ఉత్త గుర్రాలను తీసుకుని రావడం మంచిదికాదు; ఇది పౌరుషమున్నూ కాదు. యజ్ఞానికి కర్తా, భోక్తా శ్రీకృష్ణుడే! యజ్ఞఫలాన్ని ఇచ్చే వాడుకూడా అతడే! ఎవరిని ఉద్దేశించి యీ యాగాన్ని తలపెట్టినానో, అతడు ప్రత్యక్షంగా వున్నప్పుడు, స్వాధీనంగా వున్నప్పుడు—అతనిని తీసుకొని రావద్దా? ఏం పని చేశావు?' అని అతడు కుమారుడిని నిందించి, చాలా విచారించాడు. కృష్ణుని చూడలేమికి మహారాజు పట్టమహిషికూడా చాలా విచారించినది.

అప్పటికి సాయంకాలమైనది. కృష్ణార్జునులు యింకా మూర్ఛ తేరనందులకు సైనికు లందరూ చాలా కలత పడ్డారు. ప్రద్యుమ్నాదులకు దారీ, తెన్నూ తోచడంలేదు. కొంతసేపటికి సాయంకాలపు పిల్లవాయువులు వీచడంవల్ల కృష్ణార్జునులు కొంత తెప్పరిల్లినారు. ఇంకా యుద్ధం జరుగుతునే ఉన్నదనే భావనతో అర్జునుడు చటుక్కున లేచి "కృష్ణా! మన యాగీయాశ్వాన్ని కట్టివేసిన ఆ తామ్రధ్వజుడెక్కడ? అతన్ని సులభంగా ఓడించి, ఆ గుర్రాన్ని విడిపించి తెస్తాను." అని అన్నాడు. ఆ మాటలు విని శ్రీకృష్ణుడు చిన్న నవ్వు నవ్వి "అర్జునా! తామ్రధ్వజుడు సామాన్యుడు కాడు. అతడు మన యిద్దరినీ గెలిచాడు. నిన్ను మూర్ఛనొందించి నాచేతిలోని చక్రాన్ని సులిమి లాగుకొని నన్నూ మూర్ఛపోయేటట్లు చేశాడు. అతని గుర్రంతోపాటు మన గుర్రాన్నికూడా తీసుకుని రత్నపురానికి వెళ్లిపోయినాడు. ఇకమీద అతనిని గెలవడం మనతరం కాదు- సరేకదా, బ్రహ్మరుద్రులతరంకూడా కాదు. నేను అతనికి ఎలా లొంగిపోయానని అడుగుతావేమో! తండ్రివలెనే అతడుకూడా గొప్ప విష్ణుభక్తుడు. భక్తులతో పోరాడి నేను వారిని జయించలేనుకదా! ఆ తండ్రి కొడుకులే కాదు- రత్నపురిలోని జనులందరూ గొప్ప విష్ణుభక్తులు. మయూరధ్వజుడి భక్తి యెటువంటిదో చూపిస్తాను. నాతోరా. మనిద్దరమూ మారువేషాలు వేసుకుని నగరంలో ప్రవేశిద్దాం. సిద్ధంగాఉండు" అన్నాడు.

తర్వాత శ్రీ కృష్ణుడు ప్రాత ముతకనీరు కావి దోవతి—బ్రహ్మకమ్మి వేసినది ధరించి చినిగిన ఉత్తరీయం కప్పుకొన్నాడు. నుదుట గోపీచందనపు బొట్టు ఉంచుకుని, మెడలో తామరపూసల మాలికను ధరించాడు. చెవిలో తులసిదళాలు ఉంచుకొన్నాడు. భుజానికి యాయవారపు సంచీ తగుల్చుకున్నాడు. కృష్ణాజినానికి చుట్టిన సంపుటిని చంకలో ఇరికించుకుని కుడిచేతిలో పుష్పవెదురూత కోలను పట్టుకొన్నాడు. గూనివీపూ, బడుగుదేహమూ తన వృద్ధత్వాన్ని స్పష్టంచేస్తూ వుండగా, వేషధారియైన కృష్ణుడు మునలిబ్రాహ్మణుడైనాడు. అర్జునుడు అతనికి శిష్యుడుగా తయారయ్యాడు.

తర్వాత వీరిద్దరూ రత్నపురంలో ప్రవేశించారు. అప్పటికి జాము రాత్రి అయినది. వీరు ఎక్కడికి వెళ్లినా హరినామ సంకీర్తనలే వినబడుతూ ఉండినవి. వినోదాల్లోకూడా హరి సామ్యమే! ఎక్కడచూచినా భక్తిభావనే కనబడుతూ, ఆ నగరం భూలోకవైకుంఠముగా తోచినది. వారిద్దరూ రాత్రి అంతయు ఆ నగరవీధులు తిరుగుతూ, తెల్లవారుజామున నర్మదానదికిపోయి స్నాన సంధ్యావందనాది కాల్యకృత్యాలు తీర్చుకుని తిన్నగా రాజభవనానికిపోయి మయూరధ్వజుని చూచి, అతనిచే గౌరవింపబడినారు. అప్పుడు శ్రీ కృష్ణుడు 'రాజా! మేము అర్థులమై నీ వద్దకు వచ్చినాము' అని అనగా, రాజు సంతోషంతో ఇలాగున అన్నాడు—అయ్యా! 'అభ్యాగతః స్వయం విష్ణు' వని పెద్దలందురు. కాబట్టి నీవు సాక్షాత్తుగా జనార్దనుడవనియే నా భావన. నీవు ఏమాత్రమున్నూ సందేహపడనక్కరలేదు. నీ కోరిక యెటువంటిదైనానరే - దాన్ని తప్పకుండా నెరవేరుస్తాను.'

మయూరధ్వజుడు యీ విధంగా పలుకగా వృద్ధబ్రాహ్మణ రూపంలో వున్న శ్రీ కృష్ణుడు యీ విధంగా పలికెను—'రాజా! నా నివాసం ధర్మపురము. నాపేరు కృష్ణశర్మ ఇతడు నా శిష్యుడు. నేనీ శిష్యునితోనూ, నా కుమారునితోనూ బయలుదేరి నీ పట్టణానికి వస్తున్నాను. నాకుమారుడు విద్య పూర్తి చేసుకుని వివాహయోగ్యవయస్సు కలిగి ఉన్నాడు. వానికి తగిన కన్య నీ పురోహితుడైన సుశీలుని దగ్గర ఉన్నట్లు విని, వివాహార్థం ఆ కన్యను కోరదలచి వస్తూవుండగా దారిలో గొప్ప చిక్కు ఏర్పడినది. అది యేమిటని అడుగుతావా?—మేము వస్తూవున్న దారిలో పెద్ద అరణ్యం ఒకటి వున్నది. ఆ అడవిలోనుంచి మేము వస్తూవుండగా ఒక సింహం అమాంతంగా నా కుమారుడి మీదపడి కంఠం పట్టుకొన్నది. దాన్ని విడిపించడం మాతరం కాలేదు. నాకు ఉపాయాంతరం తోచడంలేదు. అప్పుడు నేను 'శ్రీ నృసింహా! శ్రీ నృసింహా!' అని నూట యెనిమిదిసార్లు జపంచేస్తే, ఆ దేవుడు ప్రత్యక్షమయీకూడా

ఏమీ చెయ్యలేకపోయాడు. పిదప నేను ఏమీ చెయ్యలేక కొయ్యబారి నిలిచివుండగా ఆ సింహమే మనుష్యుల మాటలతో "ఓ బ్రాహ్మణుడా! నానోట జిక్కిన ప్రాణిని తప్పించడానికి ఎవ్వరికీ తరంకాదు. ఊరికే ఆలోచించినా, విచారించినా ప్రయోజనం లేదు. నీవూ, నీ శిష్యుడూ యింటికి వెళ్లిపోవడం మేలు" అని పలికినది. నేను "ఓ సింహమా! రా కుమారుని విడిచిపెట్టి ఎలాగు పోగలను? పుత్రహీనులకు ఊర్ధ్వగతి లేదుకదా! నా కుమారుడికి బదులుగా నా దేహం తీసుకుని వానిని విడిచిపెట్టుము" అని పలుకగా 'క్రూరజంతువులమైన మేము మృత్యువుకు భృత్యులం. నేను అల్పాయుస్సుకలవారినేతప్ప నీవంటి దీర్ఘాయుష్కుల జోలికి రాను.' అని అన్నది. నేను సంపాదించిన పుణ్యాన్ని పూర్తిగా ఇస్తానన్నా సమ్మతించినది కాదు. 'నాకు మయూరధ్వజునివల్ల ప్రయోజనం వున్నది కాని, నీవల్ల యేమీ లేదు' అని అన్నదని బ్రాహ్మణుడు పలికెను.

అతడు ఈవిధంగా చెప్తూవుండగా మయూరధ్వజుడు అడ్డమువచ్చి "ఆ సింహము సాక్షాత్తుగా నరసింహదేవుడే కాని వేరొకరుకారు. నారాజ్యంలోని అడవులలో సింహశార్దూలాది క్రూరమృగాలు ఉన్నా, అవి యేవీ జీవహింస చెయ్యవు. అయితే నేమి? నీవు ఏమి అడిగినాసరే, అణుమాత్రమైనా సందేహించకుండా తప్పకుండా నెరవేరుస్తాను. అడుగదలచిన దేదో అడుగుము" అని అన్నాడు.

తర్వాత బ్రాహ్మణవేషధారి యిలా అన్నాడు—"ఓ రాజా! 'దుర్బలస్య బలం రాజా' అని పెద్దల వచనం ఉన్నది. మావంటి యాచకులకు మీవంటివారే ఆధారంకదా! నేను సంశయించకుండానే అడుగుతాను. నాబాధను పోగొట్టడమే నీవు చేయవలసిన పని. నీదేహంలో సగం తనకు ఇచ్చిన యెడల నా కుమారుని విడిచిపెడతానని ఆ సింహం పలికినది. దానికి నేనన్నానుగదా—'ఓ సింహమా! మహారాజులు బహుజన రక్షకులు! వారిని, దేహాన్నికోసియివ్వవలెనని అడగడం నావంటివానికి భావ్యమవుతుందా? ఇది జరగని పని' అని. అలా అంటే ఆసింహం 'ఓయీ! పిచ్చివాడా! మయూరధ్వజుడు సామాన్యుడని అనుకున్నావా? ఆయన దీనజనరక్షకుడు; ఆత్మవిద్యావిశారదుడు; ఉత్తమోత్తముడు; ఉదారుడు; సత్యసంధుడు; అతన్ని అడిగిన ఉత్తరక్షణంలోనే ఏలాటి అభ్యంతరమూ చెప్పకుండా అతడు నీకోరికను నెరవేరుస్తాడు. మరొక్క మాట! నీవు నీశరీరాన్ని నీకొడుకునకు బదులుగా యిస్తానంటున్నావు. ముసలితనంచేతను, తపస్సుచేతను, ఉపవాసాలచేతను చిక్కిపోయిన నీ బడుగు దేహంవల్ల నాకేమి ప్రయోజనం? ఆ రాజుదేహమా- వెన్నముద్దవలె ఎంతో ఇంపుగా ఉంటుంది. ఇక వేరే ఆలోచన విడిచి వెంటనే మయూరధ్వజునివద్దకు వెళ్లుము; అతడు నీకోరికను తప్పకుండా నెరవేరుస్తాడు."

ఈమాటలు వినగానే మయూరధ్వజుడికి ఉత్సాహం ఎక్కువైనది. బ్రాహ్మణకుమారునికోసం తన శరీరమును అర్పించడానికి సిద్ధపడి మంత్రిపురోహితులనూ, బంధుమిత్రులనూ చూచి "రాజులకు యుద్ధాలలోగాని, పరోపకారార్థంగాని ప్రాణాలువిడుచుట ధర్మం. పూర్వం శిబి, దధీచి మొదలైనవారు పరార్థం దేహాన్ని అర్పించి గొప్ప కీర్తిని సంపాదించారు. నేనూ అవిధంగానే యీబ్రాహ్మణుని పుత్రుని రక్షించడానికై ఆత్మార్పణ చేస్తాను. దీనికి మీరెవ్వరూ వ్యతిరేకంగా ఏమీ చెప్పవద్దు" అని అన్నాడు. తర్వాత అతడు తన కుమారుడైన తామ్రధ్వజుడికి రాజ్యం అప్పగించి, తాను నర్మదానదికిపోయి స్నానంచేసివచ్చి యజ్ఞవేదికమీద దర్భాసనంమీద కూర్చుండి మొగలిరేకువంటి రంపాన్ని తెప్పించి, తన శరీరంలో సగంభాగం కోసి యివ్వడానికి సిద్ధంగా వుండెను.

ఆ సమయంలో మయూరధ్వజుని పట్టపుదేవియైన కుముద్వతీదేవి వచ్చి ఆ బ్రాహ్మణునితో యిట్లు అన్నది— "అయ్యా! నాభర్త శరీరంలో అర్ధభాగం కావాలనిగదా సింహము కోరినది! భార్య, భర్తశరీరంలో సగంభాగమగును కదా! ఆ సింహానికి నేను ఆహారంగా వస్తాను; నా భర్తను విడిచిపెట్టండి" అని. ఆ మాటలువిని ఆబ్రాహ్మణుడు 'ఆసింహం కుడివైపుభాగమే కావలెనని ఎడమవైపుది తీసుకురావద్దనీ గట్టిగా చెప్పినది. మరి భార్య, పురుషుడి శరీరంలో ఎడమభాగం కదా! ఎడమభాగమైన నిన్ను ఎలాగ అంగీకరించగలను?" అని చెప్పాడు.

తర్వాత మయూరధ్వజుని కుమారుడు తామ్రధ్వజుడు "అయ్యా! 'ఆత్మావై పుత్రనామాసి' అని ఆత్మయే పుత్రుడై పుట్టునని వేదవాక్యం ఉన్నదిగదా! నా తండ్రికి ప్రతినిధిగా నా శరీరాన్ని సమర్పించుకుంటాను; దీనికి సమ్మతించి, నాతండ్రిని విడిచిపెట్టండి!' అని ప్రార్థించాడు. అందుకు ఆ విప్రుడు 'రాజకుమారా! ఆ సింహం యేమన్నదీ పూర్తిగా తెలుసుకుంటే నీవిలాగు పలికి ఉండవు. 'మయూరధ్వజుని భార్యయు, కుమారుడును అతనిశరీరం కోసియివ్వగా—అందలి కుడిభాగాన్నిమాత్రం తీసుకురావాలని ఆ సింహం చెప్పినది ఇక నువ్వే ఆత్మార్పణకు సిద్ధపడితే—ఆ నియమం జరగడమెల్లాగ? అందువల్ల మీరు మరేమీ అడ్డుప్రశ్నలు వెయ్యక జరుగవలసినదాన్ని జరపడం ధర్మం' అని జబాబిచ్చినాడు.

అప్పుడు మరి మారుమాటాడకుండా కుముద్వతీదేవియు, తామ్రధ్వజుడున్నూ రంపాన్ని చెరియొక కొనా పట్టుకొని, రాజుతలపైనుంచి కోయసాగారు. తల కొంత తెగి, రక్త

ప్రవాహాలు వరదలై కారసాగినది. రాజు, అతనిదేవీ, కుమారుడూకూడా భగవన్నామస్మరణచేస్తూ నిశ్చలచిత్తు లయియే ఉన్నారు.

కొంచెంసేపు యీ విధంగా కోయగా, మయూరధ్వజుని ఎడమకంటినుండి బొటబొట కన్నీరు కారసాగినది. కపట బ్రాహ్మణుడు దాన్నిచూచి, కోపించి, తన వేణువండాన్ని నేలపై పడవేసి, యిటూ అటూ గంతులు వేస్తూ "పుత్రులు లేకపోయినందున నాకు ఉత్తమగతి కలుగక, నరకం వస్తేరానీ- కాని ఏడుస్తూ యిచ్చినదానాన్ని నేనెంతమాత్రం గ్రహించను. ఇక ఈ దానమూ వద్దు; ధర్మమూ వద్దు" అంటూ శిష్యుని రెక్కపట్టుకుని యీడ్చుకుపోవుచుండెను. వృథాగా రాజు దేహం కోయించి, వెళ్లిపోతూవున్నందుకు రాణీ, రాజకుమారుడూ చాలా క్షోభపడ్డారు. అప్పుడు మయూరధ్వజుడు ఆ బ్రాహ్మణుని దగ్గరగా పిలిచి "మహాత్మా! కోపించి యెందుకు పోయెదవు? నేను విచారంతో కన్నీరు విడుస్తున్నానని నీవు భావించడం పొరపాటు. మనస్ఫూర్తిగా నా శరీరాన్ని నీ కర్పిస్తూ వున్నప్పుడు నాకు దుఃఖం ఎందుకు కలుగుతుందో నీవే యోచించు. మరి, ఎడమకంటినుంచి నీరు కారడానికి కారణం ఏమిటని అడుగుతావా- విను. నీవేమో సింహానికి శరీరంలోని కుడిభాగమే కావాలనీ, ఎడమభాగం ఎంత మాత్రమూ వద్దని చెప్పావు. అందువల్ల నాశరీరంలోని వామ భాగం ఎందుకూ పనికిరానిదని తేలింది. 'నేనెందుకూ పనికిరాకపోతిని గదా!' అని ఎడమభాగం చాలా విచా రిస్తూన్నది. దాని ఫలితమే యీ విధంగా ఎడమకంటి నుండి నీరుకారుట! శరీరం కొయ్యడంవల్ల కలిగిన బాధ చేత నీరు కారితే, రెండుకన్నులనుంచీ నీరు కారవద్దా? నా కుడికంటినుంచి నీరు కారుతూవుండలేదే! గమనించి చూడు. కోపంతో వెళ్లిపోకు. నా శరీరంలోని అర్ధభాగం తీసు కుని వెళ్లి ఆ సింహానికి అర్పించి నీకుమారుని ప్రాణాలను కాపాడుకొని, నాకు ఉత్తమగతిని కల్పించు" అని అన్నాడు.

రాజు యిలా పలుకుతూ వుండగానే ఆ బ్రాహ్మణుడు శ్రీ కృష్ణుడుగా మారిపోయినాడు; అతని శిష్యుడు అర్జునుడుగా మారిపోయాడు. అక్కడి అందరికీ ఈ దృశ్యం చాలా ఆశ్చర్యాన్ని కలిగించినది. శ్రీ కృష్ణుడు మయూరధ్వజునిచూచి "ఓరాజా! నీ ధైర్య స్థైర్యాలకూ, సాహసౌదార్యాలకూ, భక్తి తాత్పర్యాలకు నాకు అంతులేని ఆనందం కలిగింది. నీవంటి ఉదారుడూ, భక్తుడూ "నభూతో, నభవిష్యతి". నీ భార్యా పుత్రులుకూడా ఏవిషయంలోనూ నీకు తీసిపోరు. సాటిలేని నీ లోకోత్తర గుణాలను అర్జునుడికి చూపించడానికే నేనీ పన్నాగం పన్నివున్నాను. యాగీయాశ్వాలను రెండింటినీ నువ్వే తీసుకొని, రెండు యాగాలూ నెరవేర్చు. కర్మనూ, కర్తనూ అయిన నేనే స్వయంగా దగ్గరవుండి సర్వమూ నిర్వ హిస్తాను. నీ కుమారుడు తామ్రధ్వజుడు తానొక్కడే మా యిద్దరినీ యుద్ధంలో జయించాడు. నీవు నీదేహాన్ని సమర్పించి లోకాన్నే జయించావు. ఈ లోకంలోని రాజ లోకంలో వీరవితరణ గుణాల్లో నిన్నుమించినవా రెవ్వరూ లేరు." అని అంటూ తనచేత్తో మయూరధ్వజుని శరీరం అంతా నిమిరేసరికి, అతడు ఎట్టి గాయమూలేక యథా పూర్వంగా అయినాడు. అక్కడవున్న అందరూ అపరిమి తానందంపొందారు.

మయూరధ్వజుడు శ్రీకృష్ణుని పాదాలకు సాష్టాంగ నమ స్కారంచేసి "ఓ దేవదేవా! నీవు కర్మఫల ప్రదుడవు. నమస్తయాగ సమారాధ్యుడవు. యజ్ఞస్వరూపుడవు. అట్టి నీ దర్శనం నాకు లభించినది. పునరావృత్తి రహితమైన మోక్షసామ్రాజ్యాన్ని ప్రసాదించే నిన్ను ప్రత్యక్షంగా చూచిన్నీ, యింకా కర్మలు చెయ్యాలనే వ్యామోహంలో పడుదునా? ద్రవ్యాన్ని నేలమీద కుమ్మరించి, ఉత్తనం చులు తెచ్చిన వెర్రివానివిధమున నాకుమారుడు మీ యిద్ద రినీ తీసుకుని రాక, నిరుపయోగాలయిన అశ్వాలనుమాత్రం తీసుకువచ్చాడు. అతని తప్పులు క్షమించు. ఇక్కడ కొన్ని దినములు ఉండి నాగృహాన్ని పావనం చెయ్యి" అని పరిపరివిధాల స్తుతించి, ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు ప్రసన్నుడై, మయూరధ్వజుని ప్రశంసిస్తూ, అతని గుణ గణాలను అర్జునుడికి వివరించి చెప్పాడు. తర్వాత ఆరాజు కోరికపయి కృష్ణార్జునులు ససైన్యంగా మూడు రోజులు అక్కడవుండి, మయూరధ్వజుని ఆతిథ్యాన్ని గ్రహించారు. నాలుగవనాడు ఆ రెండు హయాలతోనూ, సేనాసమూహంతోను తిరిగి దేశభ్రమణానికి బయలుదేరారు.

పరమభక్తుడైన మయూరధ్వజుడు బ్రాహ్మణుని కోరిక పయిన తన శరీరాన్ని అర్పించి శిబి, దధీచులకు సాటి యైన ఔదార్యాన్ని చూపాడు. అతని భక్తిగరిమను పరీక్ష చెయ్యడానికే శ్రీ కృష్ణుడు ఇట్లుచేసి, అతని కీర్తిని శాశ్వ తంగా నిలిపాడు. భగవద్భక్తులు కేవలం భగవంతుని గురించే కాకుండా అర్థుల కోరికలను నెరవేర్చడంలో ఆత్మ సమర్పణానికికూడా వెనుదీయరని మనం నిశ్చయించ వలసి ఉన్నది.

---

# దేవాలయములు - ఉత్సవములు

పండిత, పార్థసారథి భట్టాచార్య

ఉత్సవారంభమును మరీచిమహర్షి యీ క్రింది విధముగ చెప్పుచున్నారు.

'అథోత్సవారంభః - యజమానః సర్వదోషశాన్త్యర్థం విష్ణోరుత్సవం కారయేత్, ఆలయాభిముఖే అన్యస్మిన్ శుభ్రదేశేవా ఆస్థానమండపం కృత్వా పంచహస్తాదిభేదేన ప్రాఙ్ముఖం దక్షిణాభిముఖమాలయద్వారదిఙ్ముఖం వా పరికల్ప్య తత్ప్రముఖే ద్వాత్రింశత్ స్తంభాదిశతస్తం భాన్తైః స్తంభైర్యుక్తం నృత్తమండపం కూటం ప్రపాంవా కృత్వా ప్రపాయాం మధ్యే వర్షనివారణం కూటం యుక్తితః కారయేత్। తత్సర్వం వితానధ్వజపతాకాముక్తా దామస్తంభ వేష్టనతరంగదర్భమాలాద్యైరలంకృత్య ద్వారేషు తోరణ పూర్ణకుంభ దర్భమాలాక్రముకదీపాంకురై రలంకుర్యాత్। శిబికారథరంగ డోలాయన్త్ర ముఖమండప గజతురగ గరుడ సింహ వ్యాలహంస భ్రమణాదీని యానాని శక్తితః కారయేత్। మాలాదీపయన్త్ర దీపహస్తాదిదీపశూలదీపాదీన్ భేరీపటహ మర్దలగోముఖతాలకాహలమురజ శంఖజర్ఝరమంజు లదర్దురశంఖశ్శృంగధారావీణా వేణుఝల్లరీశ్చ యుక్తితః కారయేత్। ఛత్రాణి నానావిధాని పింఛాన్యనేకవిధాని వ్యజనాని చామరాణి వివిధాన్ ధ్వజాన్ పతాకాశ్చ వితానతరంగ స్తంభవేష్ట నాన్యాహృత్య యథోక్తం సమిత్పుష్పదర్భహోమ ద్రవ్య బలిద్రవ్య పుష్పగంధ ధూప దీపార్ఘ్యద్రవ్యం హవిర్ద్రవ్యం నవవస్త్రతంతుహేమరత్న ధాన్యతండుల ఘృత దధిక్షీరాణి దీపార్థంఘృతం తైలం వా ఆహరేత్। హవిరర్థం తండులం బహూపదంశగుడఫల సహితం భక్తానాం బ్రాహ్మణాదీనాం భోజనార్థానియాని ద్రవ్యాణి తాని సర్వాణిచ సంభరతి। నర్తకాన్ గాయకాన్ భక్తాన్ పరిచారకాంశ్చ యత్నేన అహ్వాయేత్। తద్గ్రామ వాసినః సర్వే అనన్యతత్ప రాశ్చ అలంకృతా హర్షయుతా భవేయుః, తద్గ్రామవీధీశ్చ సంశోధ్య గృద్వారాణి దీపాంకురోదకుంభాద్యైరలంకృత్య దేవాలయం మృష్టసిక్తోపలేపనాద్యైః సంశోధ్య పైష్ట్యా భూమిమలంకృత్య లాజాక్షతకుసుమాన్యవకీర్య' (౫౨వ పటలము).

(భగవానుని ఉత్సవము నారంభించుటను చెప్పెదను. ఆలయమున యే కారణముచేతగాని సంభవించెడి సకల దోషములను పోగొట్టుటకై ఉత్సవమనునది యేర్పరుపబడినది. ఆ దోషనివృత్త్యర్థమై ఉత్సవమును చేయవలయును. ఆలయమునకు యెదురుగగాని లేక పరిశుభ్రమై విశాలమగు మఱియొక చోటునందుగాని అస్థానమండపమును నిర్మించవలెను. అది శిల్పశాస్త్రోక్తరీతిని ఐదు హస్తముల పరిమాణమాదిగ చెప్పబడిన కొలతలో తూర్పు ముఖముగగాని దక్షిణముఖముగగాని ఆలయద్వారముండెడి దిక్కునకు ముఖముగలిగినదిగగాని ఉండవలయును. ఆయాస్థానమండపమున కెదురుగ ముప్పది రెండు స్తంభములు మొదలు చేసికొని నూరు స్తంభముల వరకు యథాశక్తిగ స్తంభములతోకూడిన చక్కని నృత్తమండపమును కూటమును పందిరనుగాని నిర్మించి దాని మధ్యను వర్షము పడకుండునట్లు కూటమును యుక్తి యుక్తముగ కట్టవలయును. ఆ నిర్మింపబడిన అచ్ఛాదిత ప్రదేశమునంతను చాందిని ధ్వజము పతాకము ముక్తాదామము స్తంభవేష్టనము తరంగము దర్భమాల మొదలగు నలంకారములచే యలంకరింప చేయవలయును. ద్వారములందు తోరణము, పూర్ణకుంభములు దర్భమాల క్రముకములు దీపములు అంకురములు మొదలగు నలంకారములనుంచవలయును. భగవానుని గ్రామవీథులలో నూరేగించుటకు ఉపకరించునట్టి శిబిక, రథరంగము, డోలాయన్త్రము, ముఖమండపము గజము తురగము గరుడుడు సింహము వ్యాలము హంసము మొదలగు వాహనజాలమును యథాశక్తి సిద్ధ పరుపవలయును. మాలాదీపము యంత్రదీపము హస్తాదిదీపము శూలదీపము మొదలగు దీప భేదములను భేరీపటహము మర్దలము దర్దురము శంఖము శృంగము ధారవీణ వేణువు ఝల్లరి మొదలగు వాద్యవిశేషములను యుక్తి యుక్తముగ సంపాదించ వలయును. అనేక విధములగు ఛత్రములు అట్లే పింఛములు వ్యజనములు చామరములు వివిధములగు టెక్కెములు పతాకములు వితాన తరంగ స్తంభవేష్టనాదులు మొదలగు పరికరములను సంపాదించవలయును. శాస్త్రోక్తములగు సమిధలు దర్భలు పుష్పములు గంధము ధూపద్రవ్యము దీపద్రవ్యము అర్ఘ్యద్రవ్యము హవిర్ద్రవ్యము బలిద్రవ్యములను నూతన వస్త్రములు తంతువులు బంగారు రత్నములు ధాన్యము తండులము ఘృతము దధి క్షీరము మొదలగు ద్రవ్యములను సిద్ధ పరుపవలెను. దీపమునకై ఘృతమునైనను తైలమునైనను శక్తి ననుసరించి ఉపయోగపరుపవలెను. భగవానునికి ఆయా కాలములందు నివేదనముచేయు ప్రసాదములకు వలయు తండులములను ఉపదంశ సామగ్రిని బెల్లము ఫలద్రవ్యములను చేర్చవలయును. ఉత్సవసేవార్థమై వచ్చెడి సేవార్థులగు భక్తులందరకు సమా

రాధనకు వలయు భోజన పదార్థములను తేవలెను. ఈ సంభారముల నన్నిటిని సేకరించిన పిదప తన శక్తి ననుసరించి నర్తకులను గాయకులను పరిచారకులను చేతనైనంతవరకు యెక్కువ సంఖ్యగా నుండునట్లుచూచి ఆహ్వానించవలెను. ఉత్సవములో వైదిక కార్యములను నిర్వహించుటకు ఆచార్యుని ఋత్విక్కులను విశేషించి ఆహ్వానించవలయును.

ఆ గ్రామమందు నివసించెడి ప్రజలందరును ఇతర ధ్యానలేక భగవత్సేవాతత్పరులై అలంకరించికొని సంతోషపూరితులై యుండవలెను. గ్రామమందలి వీధులను పరిశుభ్రపరచి గృహస్థులు తమ తమ గృహముల ద్వారములందు దీపములు అంకురములు పూర్ణకుంభములు మొదలగు వానిచే అలంకరించికొని యుండవలయును. దేవాలయమును ప్రాకార సహితముగ అన్ని చోటులందును సంమార్జనముచేసి ఉదకము చల్లి అలికి శుద్ధి చేసి బియ్యపు పిండితో భూమినంతను చక్కని రంగ పల్లులతో అలంకరింపచేసి లాజలు అక్షతలు పుష్పములు మొదలగు శోభనద్రవ్యములను వెదజల్లవలయును).

ఈ సంభారసేకరణము అలంకార ప్రకారము ననునవి బాగుగ చెప్పబడినవి. ఈ విధానము యెంతవరకు మన దేశమున ఆలయములందలి ఉత్సవసమయములలో అనుసరింపబడుచున్నదనునది మనము సావధానముగ విచారించి చూపదగియున్నది. గ్రామ వీధుల నలంకరించి గృహస్థులందరును తమ గృహముల నలంకరించికొని ఆ శుభ దినములందు ఊరువారలు ఉత్సాహపూరితులై భగవత్సేవయందే మనసు కలవారై ఉత్సవములను జరుపవలయుననునది ప్రధానమైన అంశము. మన గ్రామములందు ఏదొక కారణాంతరము వలన ఆ గ్రామమునందు పార్టీలు యేర్పడి పరస్పరముగ అనుకూల్యములేక ఉత్సవములలో గ్రామస్థులందరుగాని ఏయొక పార్టీ వారుగాని పాల్గొన జాలక విధిలేక యెండోమెంటువారికి ఉత్తరవాదిత్వమును నిలుపుకొనుటకై ఆలయాధికారి ఉత్సవారంభము చేయుటయు ఉత్సవ సమయమున ఆలయమందు పూజ చేయు అర్చకులు వాద్యము చేయువారు వాహనము మోయువారు కోలలు వేయువారు తప్ప ఇతరులెవ్వరును దేవునితో నడచువారు లేని ప్రదేశములు అనేకములు నాయనుభవమందు కలవు. ఇట్టి యాచారము మిక్కిలి విచారకరమైనది నృత్తగీతాదులు ఉత్సవము లందును నిత్యమందునుకూడ విభవము ననుసరించి తప్పని సరిగా ఆలయములందుండి తీరదగినవి. వేదపారాయణము ప్రధానమైనది. వాహనములు కావలెను. ఛత్రములు చామరములు దీపములు మొదలగునవి సంపాదించి ఉపయోగపరుపబడవలెను. బ్రాహ్మణభోజనము ఇతర భక్తజన సమారాధనము అవసరము. స్వామివార్లకు ఊరేగింపు కాలములందును గర్భగృహమునందును ఆయా కాలములందు లభ్యములగు పుష్పములు సమృద్ధిగా మాలలకును సహస్రనామార్చనములకును తులసి మొదలగు పూజాద్రవ్యములను సేకరించవలయును. స్వామికి త్రికాలములందును నివేదనముచేసి భక్తజనులకు పంచిపెట్టుటకై అన్న ప్రసాదములు ఇతర ప్రసాదములు విరివిగా చేయవలెను. ఉత్సవకాలములందు ప్రసాదములను చేయుటకును భక్తులగు సేవార్థుల నాదరించుటకును యాగశాలయందు వైదికకార్యములను నెరవేర్చుటకును అర్చకసహాయమునకై ఇతర కైంకర్యపరులను తేవలెను ప్రక్క ఊళ్ల నుండి ఉత్సవసేవకై వచ్చెడి భక్త జనులకు నివసించుటకు వసతులను నిర్మాణముచేసి వారలకు వలయు నివేశన సాధనములను సమకూర్చ వలయును ఈ యేర్పాటులు భగవానునికి వచ్చెడి ద్రవ్యవిభవము స్వల్పమైనచో గ్రామస్థులుగాని ప్రభుత్వముగాని అవసరము ననుసరించి దానిని పూర్తి చేయవలెను.

మన దేవాలయములలో (కృష్ణా గుంటూరు గోదావరి జిల్లాలను గురించి) చూచి సంతలో ఆలయాధికారులు తప్పక గమనించదగిన వానిని మనవి చేసెదను. ఆలయమును శుద్ధిచేసి 'సమ్మార్జనోప తాపనాదులు' చేయుటకు ముందుగ దేవాలయము విమానమును సొంతముగ శిఖరము పర్యంతము ప్రతి సంవత్సరము తప్పకుండా సున్నము కొట్టటయును మాన్పించుట గొప్ప ఉపచారముగ గ్రహించదగును. శాస్త్రరీతిని దేవాలయము (అనగా దేవుని మూలవిగ్రహము ప్రతిష్ఠింపబడినచోటు అందుపై కట్టబడిన విమానము) పైన కొన్ని దేవతావిగ్రహములు ప్రాణప్రతిష్ఠ చేయబడియుండును. విమానముపై యొకశక్తి ప్రతిష్ఠింపబడియుండును. ఆకారణముచే విమానముపై యెవ్వరును యెక్కకూడదని నిషేధము కలదు. విమానమునకు ఏదైన శైథిల్యము యేర్పడి జీర్ణోద్ధారము చేయవలసిన నిమిత్తము కలిగి నప్పుడు ఆవిమాన శక్తిని బాలాలయమందు ప్రతిష్ఠించి ఆ వెనుక దానిని తాకవలయునని శాస్త్రములందలి విధియై యున్నది. పల్లెటూరులందేమి, పట్టణములందేమి విమానములందు ఉండెడి గూళ్లలో నివసించియుండు పావురములను పట్టుకొనుటకై అవి కావలసిన వారలు విమానములపై నెక్కి ఆ పని చూచుకొనుట అనేక చోటులందు అలవాటు పడియుండుట తెలియని వారు ఉండరని తలచెదను. ఇది అనివార్యము. ఆలయము సర్వస్వామ్యము గనుక నను దుర్వాదము విచారకరము. విగ్రహములపై సున్నము కొట్టుట మహా అపచారము. దీనిని నిషేధమని

తలచుటకు శాస్త్ర మక్కరలేదనియే నాకు తోచుచున్నది. ఆలయము నిర్మింపబడినప్పుడు అతడు నేర్పరియో కాదో ఒకానొక శిల్పిచే ఒక విగ్రహము చేయబడినది. దానికి అవయవ సంస్థానము యథోచితముగ వానికి తెలిసినట్లు నిర్మించియుండును. సున్నముచే దాని స్వరూపము మరుగు చేయబడి కొన్ని సంవత్సరములకు విగ్రహమే మరుగుపడి పోయెడి దుర్గతి సంభవించుచున్నది. విగ్రహమంపలి మంత్ర పూర్వకమగు నొక ప్రాణశక్తిని అటుంచి బాహ్య రూపమే నష్టపరుపబడుట ప్రత్యక్షముగ నున్నది. ఈ యతిక్రమము మన ప్రాంత్యములందే అంధ పరంపరగా అనుష్ఠింపబడుచుండుట దేశాంతర సంచారముచేయు వారలకు తెలియవచ్చును. దక్షిణదేశమందు సుప్రసిద్ధ ములో అప్రసిద్ధములో యే దేవాలయమందుగాని ఈ వాడుక కనుబడదు. ఈ నడుమ తిరుమల శ్రీ శ్రీనివాస మూర్తి సన్నిధి యందు 'ఆనందనిలయ'మను శ్రీ స్వామి వార్ల విమానమునకు బంగారు రేకులను తయారు చేయు టకుగాను అధికారులు సంకల్పించి విమానపు కొలతలను తీసికొనుటకై విమానముపైకి పరంజాలు కట్టి కొలతలు యెత్తినారు. విమానముపైన యెక్కుటగాని తాకుటగాని చేయక పరంజాలపై నుండి దగ్గరలో నిలచి కొలతల నెత్తుటయైనది. అట్లు విమాన సంబంధము కల్పించుకొను టకు శ్రీస్వామి వార్లకు బాలాలయముచేసి రు 20,000 ల రూపాయిలకు పైబడిన ఖర్చు చేయవలసి వచ్చినది. విమానముపై కెక్కుట ఉచితము కాదనియు సున్నము కొట్టుట న్యాయము కాదనియు శాస్త్రముయొక్క మతమని నేను మనవి చేయుచున్నాను. మన చిన్న గ్రామములందలి ఆలయములకు అలంకారములును రక్షకములునగు ప్రాకారములు చాల చోటులందు లేక పోవచ్చును. ప్రాకా రములుండు చోటులందు ప్రాకారపు గోడలకు సున్నపు పట్టెలు వేయవచ్చును. విమానములకు సున్నము కొట్టె అలవాటు మన ప్రదేశమునందుకూడ కొన్ని పెద్ద స్థలము లందు లేదు. వానిని చూచి చిన్న చోటులు వాని యాచా రమును అలవరచు కొనుట మంచిది. అత్యావసరము.

ఉత్సవమునకు యాగశాల అవసరము. ఉత్సవ సంబంధమైన హోమము మొదలగు చాల వైదిక కార్యము లందు జరుగును. చిన్న దేవాలయములలో యాగశాలలను ప్రత్యేకించి నియతముగ నుండు కట్టడములు కట్టి యుంచుట కవకాశము లేక పోవచ్చును. పెద్ద ఆలయము లలో యాగశాలలు ప్రత్యేకముగ గట్టి కట్టడములే కట్టబడ వలెను. విత్త సహాయము లేని చోట తాత్కాలికముగ యాగశాలకై నిర్మించెడి పాకలనైనను వర్షబాధ లేకుండునట్లైనను నిర్మించవలయును. అట్టి పాకలలో కాకులు మొదలగు పక్షులు శునకములు రాకుండునట్లు కట్టవలెను. చాల ఆలయములకు పదిలములగు ప్రాకా రములు లేకుండుటచే అట్టి ఆలయములలో కట్టబడెడి పాకలు పందిళ్లు ఇతర జంతువులు సంచరించుటకు వీలు కలుగచేయుట సహజము. యాగశాలలు తోరణపూర్ణ కుంభ కదలీక్రముకాదులచే అలంకరింపబడవలెను. హోమమునకు వలయు ఘృతము చరువు మొదలగు పదార్థములు కావలయును.

భగవానునకు వీదులయందు ఊరేగింపుకు చక్కని వాహనములను సమకూర్పవలెను. విత్తసౌకర్యము నను సరించి వివిధములగు వాహనములను చేయవలెను. విత్తము లేని చోటుల మన దేశమందు ఆచారమున నున్న 'చలవ చప్పరము' నైనను అందముగను గట్టిదిగను విగ్రహముల పరిమాణమునకు తగినదిగను చేయవలెను. కొయ్య పరికరములకు వర్షము పోకుండునట్లును లోహ మయములగునవి దుమారము పడకుండగను తగిన బందో బస్తు అయినచోటుల నుంచవలెను. వాహన శాలలను కట్టి అందు వాహన సామానులను భద్రపరచలేని చిన్న ఆల యములందు ఒక్క చలవ చప్రమును మాత్రము ఆల యములోపలనైనను భద్రపరచవలెను. వాహనములు లేని వారు పొరుగూళ్లనుంచి వాహనములను అరువు తెచ్చి ఉప యోగపరచుట అంత యుక్తము కాదేమోననిపించు చున్నది. వాహనములను చలవ చప్పరములను భక్తులు తండ్లు లేక కొయ్యలను కట్టి బుజములతో మోయుట మంచిది. అది భక్తిని వృద్ధి పఱచును. అది నాగరికతకు మూలము. కొన్ని చోటులందు ఏకారణముననో వాహనము లను మనుష్యులు మోయక బండ్లమీద కట్టి కొన్ని చోటు లందు యెద్దులచేత లాగించుటయు కొన్ని చోటులందు మనుష్యులచే లాగించుటయు కనబడుచున్నది. ఇంత కంటె బుద్ధి బలము హెచ్చు పెరిగి మామూలు యెద్దు బండ్లకు మాఱుగ 'లారీ'లు మొదలగునవిగూడ యేర్ప రుపబడు దురవస్థ సంభవింపగూడునని యనుమానింప వలసి నట్లున్నది. మనుష్యులు మోయు వాహనముల చక్కదనమునకును బండ్లమీద కట్టబడెడి వాని స్థితికిని పరమార్థమంపటుంచి, చూచుట కెంతటి వైలక్షణ్యమైనను కలదు. బండ్లమీది ఊరేగింపుకు మన దేశమందు కారణాం తరము కలదని తోచుచున్నది.

శాస్త్రములందు ఉత్సవములందు ఊరేగింపుకొక నియతి చెప్పబడినది. నవసంధియనియు బలిహరణ మనియు ఒక విధి కలదు. ఆలయమును చుట్టి ఈ బలిహరణము వేయుటయు బలిహరణము వేసిన త్రోవను శ్రీ స్వామి వార్లు ఊరేగింపబడుటయు చెప్పబడినది. ఈ నవసంధి

సామాన్యముగ ఆలయమును చుట్టి మాత్రమే జరుగుట దక్షిణ దేశమంతటి ప్రతి చోటునందు ఆచారమై కనుబడు చున్నది. శాస్త్రముల మతమును అట్లే ఉండవచ్చునని తోచుచున్నది. ఒకవేళ ఆ నవసంధి గ్రామమును చుట్టి అని అర్థముకూడ కావచ్చునని యెంచినను గ్రామమునందు అన్ని వీధులును సందులును మాత్రము ఈ ఊరేగింపుకు మాత్రము తావులు కాజాలవు. కొన్ని పెద్ద గ్రామములలో ఊరేగింపు ఆరంభమైన తరువాత స్వామి ఆలయమునకు వచ్చుటకు పది పండ్రెండు గంటల కాలముకూడ పట్టు సందర్భములు కలవు. ప్రతి వీధియు సందును స్వామి సందర్శించవలసినదే. ఇట్టి యెడల మనుష్యులు మోయుట కష్టమని బండ్ల ఊరేగింపు చేయబడునేమో! అట్టైన యెడల మోతగాండ్రను మార్చి క్రొత్త జట్టును వినియోగించ వచ్చును. దక్షిణ దేశమందుకూడ ఆలయమును మాత్రము చుట్టి ఊరేగింపు చేయబడు చోటులందును సుప్రసిద్ధులగు నాగస్వరగాండ్రు ఇతర మేళగాండ్రు ముందు వాద్యము లను పాడునప్పుడీ యూరేగింపు కాలము గంటల కొలదిని జాముల కొలదిని పొడిగింపబడి మనుష్యులచేతనే వాహ నములు ఓపికతో మోయ బడుచున్నది. ఇది కష్టముకాదు. వీధులందు ఊరేగింపు సమయములలో గృహస్థులు తమ ఇండ్ల యెదుట శ్రీ స్వామి వార్లకు హారతులిచ్చి ప్రత్యుత్థా నము చేయుటకలదు. స్వామివార్లు ప్రక్క వీధిని వేం చేయు చుండగా ముందుగనే తరువాత వీధి వారలు హారతులను సిద్ధపరచి ఇంటి గుమ్మమున కెదురుగ స్వామికి ముందు వీధిలో నిలచుట న్యాయ్యము. స్వామి తమ యింటి ముందు హారతికై కాచి యుండునట్లు ఉప చారము చేయుట, న్యాయ్యము కాదు, కొబ్బరి కాయను పీచు తీసి పగుల గొట్టుట కనుకూలముగ చేసియుంచ వలెను. పీచు నిండియున్న కాయను పీచు తీయక పగుల గొట్టినచో సగమునకు చక్కగా పగులదు. అట్లు సరిగా పగులని యెడల అది మంచి శకునము కాదని పెద్దలు చెప్పుదురు. పీచు తీయుట కారంభించినంతట ఆలస్య మగును. హారతిలో యథా శక్తిగ నుపహారమును సమ ర్పించవలెను. మన ప్రదేశములలో పట్న వాసముల నటుంచి పల్లెటూళ్లలో ఈ విషయమున జరిగెడి అప చారమునకు అవధిలేదు. స్వామి ఒకానొక గృహస్థుని యింట వాకిట నిలచినపుడాగృహస్థుడు నిద్రించియో యేమరుపాటునో హారతి సిద్ధపరచి యుంచలేక పోయి నపుడు స్వామి ఆ యింటి గుమ్మమును విడచి ముందుకు పోరాదు. అట్లు పోవుట ఆ గృహస్థునకు అవమానముగ తలపబడును. నిద్రించెడి గృహస్థును ఆ స్వామి పరివార మందలి యెవరైనను నిద్రనుండి మేల్కొలిపి అతని హారతి కలదాయని వివరమును అడిగి తెలిసికొని అతని నుండి సమాధానము వచ్చువరకు స్వామి అక్కడనే నిలచి యుండ వలయును. ఈ మొదలగు కారణములచే ఊరేగింపు సకాలములందు పూర్తి కాజాలదు. ఇట్టి యలవాట్లను పెద్ద మనసుచేసి గ్రామస్థులు సవరించు కొనుట మంచిది.

స్వామి ఊరేగింపుతో గ్రామస్థులందరును అలంకృతులై తమ యిండ్లలోని శుభకార్యములందు కంటె యెక్కువ ఆద రముతోను ఉత్సాహముతోను నడువ వలయును. ముందు చక్కని శ్రోత్ర పేయములగు వాద్యములను నృత్యములను అలంకారములను వెనుక వేదపారాయణమును భజన పాటకులను నియోగించి అధ్యాపనము చేయించ వలయును. పగటి ఊరేగింపులందు సన్నిధి కోలల (దివిటీల) ను రాత్రి ఊరేగింపులందు విరివిగా అనేక రకములగు ఇలా యిలగు దీప విశేషములను యేర్పరుపవలెను. విభవము ననుసరించి గుర్రములు ఏనుగులు వృషభములు మొద లగు రాజోపచారములను చేయవలెను. మందు సామగ్రి (బాణసంచా) కాల్పులుకూడ ఒక వినోదవిశేష మన వచ్చును.

స్వామిని ఊరేగించు నప్పుడు విలువగలట్టియు అంద మైనట్టియు వస్త్రములచేతను ఆభరణములచేతను పుష్ప మాలలచేతను అలంకరింప చేయవలయును. మృదుమధు రములగు హవిర్విశేషములను పాకము చేయించి ఉత్స వాంతమున భగవానునకు నివేదించి భక్తులకు వినియోగమ చేయించవలయును.

సేవార్థులై వచ్చిన దేశాంతరస్థలాంతరవాసులగు భక్తు కును కైంకర్య పరులగు వారలకును భోజన వసతి ఇతరములగు నపేక్షిత సకల సదుపాయములను ఉత్సవ నిర్వాహకులు సమకూర్చవలయును.

మన దేశమందు రానురాను ఉత్సవ సమయములు హరికథలకును నాటకములకును నిలయములై పోయినవి. హరికథలలోని పార్టీవారికి అయ్యే పుష్పమాలోపచార వైభవము స్వామివార్లకుకూడ జరుగునట్లు చేయుట న్యాయ్యము. ఉత్సవము మొత్తముమీద వైదికములగు ఖర్చులకంటె చాలచోటులందీ ఐటముల ఖర్చులు ఎక్కు వగా నగుచున్నవని నేను తరుచుగా వినుటకలదు. విద్వాం సులగు కథకులను నర్తకులను ఆదరించుట యెంతయో యుక్తమేగాని దానికొక వ్యవస్థ ఉండుట ఉచితము. దక్షిణ దేశమున ఒకానొక పెద్ద దేవాలయమున పది దిన ములు నాగస్వరపు వాద్యమును పాడెడి సంగీత విద్వాంసు నకు ముందువెనుక విచారింపక వేయిన్నినూట పదారు లిచ్చి అతని పరివారమునకు వేరుగ వేతనమిచ్చి వారలకు మొదటి తరగతి ప్రయాణపు ఖర్చులనిచ్చి ఉచితమగు

భోజనవసతినిచ్చి ఆదరించుట సర్వులకు తెలిసినదే. ఈ గౌరవము మామూలు నాగస్వరపు పాటగానికి చిక్కదు. హరికథలలోకూడ ఇట్టి గొప్పతనము ఆదరించబడవచ్చును. దానికొక కాలనియతి ఉండవలయును. నాటకములను గురించిన విశేషమును మధ్యస్థులు నిర్ణయించవచ్చును. ఈ నడుమ ఆంధ్రప్రభుత్వమువారు జోక్యము కల్పించుకొనగా ధర్మాదాయాధికారులు కొన్ని ద్రవ్యసంపత్తిగల ఆలయములందు పండిత సభలను జరిపించి విద్వాంసులను ఆదరించు ప్రకారమునకు మార్గము చూపియున్నారు. ఇదియొక శుభ సూచనమే.

హరికథల కాలక్షేపములు నాటకములు విద్వత్సభలు వీనిని జరిపించుటకు ప్రధానోద్దేశము ప్రజలలో భక్తిని మత సదాచారాదరమును నీతిని బోధించుటకని యనవచ్చును. దేవాలయముల ఉద్దేశముకూడ అదియే. దేవాలయములందు విధిగా జరుగవలసిన నిత్యారాధనము, మరమ్మతులు, నైమిత్తికపూజలు మొదలగునవి జరుగగా మిగిలియుండెడి ద్రవ్యమును యితర విధములగు తుల్యోద్దేశములగు సత్కార్యములందు వినియోగింపవచ్చు ననుటలో కొంత ఔచిత్యము ఉండవచ్చును. ఉండినను ఉండకపోయినను ఆ చిత్తవృత్తి ప్రజాసామాన్యమందు ప్రతిష్ఠితమైపోయినది. కనుక హరికథా కాలక్షేపాదులను జరిపించి కలాసేవను సారస్వతసేవను చేయగోరినప్పుడు ఆ సేవను చేయుటకు ప్రత్యేక సమయములను నిర్ణయించి యథేష్టముగ వానిని జరిపించుటలో ఆక్షేపముండదు. ఉత్సవసమయములలో సక్రమముగ కాలమును కేవలమును భగవత్సేవకు మాత్రమే వినియోగించుట యుక్తము. ఉత్సవము లందుకే యేర్పరుపబడినవి. ఉత్సవదినములలో తెంపులేక భగవత్సేవను జరుపుటకు మాత్రమే అంతరంగములగు కార్యములు లేకపోలేదు. భక్తిని నీతిని లోకజ్ఞానమును సంపూర్ణముగ యెరిగినవారలకు భగవత్సేవ కంటె యెక్కువగు కార్యాంతర మెద్దియులేదు. హరికథలకును నాటకములకును సాక్షిగా భగవానుని విగ్రహములను కూడ వేంచేపించి వినోదము చూచెడి ప్రదేశములుకూడ అక్కడక్కడ కలవు. ఇదియును ఉచితముకాదని తోచుచున్నది.

కల్యాణోత్సవమునందు మొట్టమొదటిది అంకురార్పణము ధ్వజారోహణము మన దేశములందు ప్రథమ రాత్రియందు జరుగును. రెండవ దినము మూడవ దినము ప్రాతఃసాయంకాలములందు బలిహరణము స్వామివార్ల గ్రామోత్సవము జరుగును. నాల్గవ దినముకూడ ఉదయము బలిహరణము గ్రామోత్సవము, రాత్రికి కల్యాణ మహోత్సవము. ఐదవ దిన ముదయము బలిహరణము గ్రామోత్సవము, రాత్రికి రథయాత్ర. ఆరవదినము ఉదయము చూర్ణోత్సవము (కొట్నాలు) వసంతము, తీర్థవారి, రాత్రికి ధ్వజారోహణము. ఏడవ దినము రాత్రి పుష్పయాగోత్సవము. ఇట్లు దినచర్య పంచాహ్నికోత్సవ క్రమమందు జరుగుచుండును. ఆయా ప్రదేశములందలి ప్రాచీన సంప్రదాయము ననుసరించి ఎన్నెన్ని విధములగు విశేషములు జరుగుట కలదు. దీనికి కేవల శాస్త్రప్రమాణమునే కాక పౌరాణికములును శిష్టాచారసిద్ధములును స్థలపురాణ ప్రసిద్ధములునగు సంప్రదాయములు ప్రవర్తకాధారములై యుండుటలో విరోధము ఉండదని తలపవచ్చును. కల్యాణ దివసమున జగజ్జ్యోతి యను నొక యుత్సవము జరుగుట చాల స్థలములందు కలదు. ఇది శిష్టాచారసిద్ధముగ మన ఆంధ్రభూమియందు శివాలయములందును విష్ణ్వాలయములందునుగూడ జరుపబడుచున్నది.

కల్యాణోత్సవకాలమున నా దేవాలయ ప్రతిష్ఠాపకుల వంశమునకు చెందిన ధర్మకర్తలు అంకురార్పణ దినమున ఆచార్యఋత్విగాదులతోపాటుగ దంపతియుతముగ దీక్ష వహించి రక్షాబంధనము చేసికొను ఆచారము కలదు. మరి కొన్నిచోటులందు తాత్కాలికముగ ఆయా కైంకర్యములను స్వంత ఖర్చులతో నెరవేర్చెడి కైంకర్యపరులుకూడ దీక్షలోనుండుట పీటలమీద కూర్చొనుట మొదలగు నాచారములు కలవు. ఇవన్నియు శాస్త్రమునకు అవిరోధములగు నాచారములుగ తీసికొనబడవచ్చును.

విభవము ననుసరించి ఉత్సవదినముల సంఖ్యను వృద్ధిచేసి వేరువేరు దినములందు వేరువేరగు వాహనములను ఉపయోగించుటయు యుక్తమే.

ఉత్సవఫలమును శ్రీ వైఖానస సంహితులలో నొక్కటగు జ్ఞానకాండమునందు కశ్యపమహర్షి అతిసంగ్రహముగ నీ క్రింది విధమున ప్రశంసించిరి.

'ఈ యుత్సవముచే భగవానుడు మిక్కిలి ప్రసన్నుడగును. ఈ యుత్సవము చేయుటచే గోబ్రాహ్మణాది చాతుర్వర్ణ్యసమృద్ధియు సస్యవివృద్ధియు సర్వసంపత్సమృద్ధియు అశుభనాశమును గ్రామశాన్తియు సర్వకామావాప్తియు కలుగును. దీనివలన ముక్కోటిదేవతలు తృప్తి వడయుదురు. అందువలన శ్రీ మహావిష్ణుని యుత్సవమును భక్తిశ్రద్ధలతో యెవ్వరు చేయుదురో వారలకు పూర్వజన్మములందేమి ఈ జన్మమందేమి రహస్యముననైనను ప్రకాశముననైనను చేసిన పాపములనుండి రసవర్జముగ విమోచనము కలిగి సర్వకామ ఫల లాభము కలుగగలదు. ఏ పుణ్యపురుషుని యత్నముచే ఒకానొక ఆలయము అగ్నిహోత్రసమమై శాశ్వతముగ సంరక్షింపబడి నిత్యనైమిత్తికారాధనములతో విలసిల్లుచున్నదో అట్టి పుణ్యపురుషుడు

శ్రీ వైకుంఠనాధుడగు శ్రీనాధుని పరమపదస్థానమును పొందగలడు. అని బ్రహ్మవేత్తలు పలుకుదురు! అని చెప్పియున్నారు.

వైదికప్రక్రియ ననుసరించి సమూర్తారాధనమును విధించిన వైఖానస సంహితలందు ఉత్సవశబ్దార్థమును, ఉత్సవ నిమిత్తములను, ఉత్సవప్రయోజనములను, ఉత్సవభేదములను పురస్కరించి, ఈ దిగువరీతిని జెప్పబడినది.

అత్రిప్రోక్త సమూర్తార్చనాధికరణమున ౩౪-వ అధ్యాయమునందు.

'అతః పరం తు వక్ష్యేఽహముత్సవారంభముత్తమమ్
దేవదేవస్య విష్ణోర్హి సర్వలోకశుభప్రదమ్ ॥
ఉత్సవం సర్వలోకానాం శాన్తిపుష్టికరం విదుః
సవో యజ్ఞః సమాఖ్యాతః సర్వయజ్ఞవిశేషతః ॥
ఉత్కృష్టోఽయం యతస్తస్మాదుత్సవ స్త్వితి కీర్త్యతే'

దేవదేవుడగు భగవానునికి ఉత్సవముచేయుట సర్వలోకములకు శుభప్రదమును శాంతి కరమును అగును. సవశబ్దమునకు త్రేతాగ్ని సాధ్యమగు యజ్ఞమునందు వ్యవహారము ప్రసిద్ధమైనది కదా. (భగవదాలయములందు ప్రతిసంవత్సరము చేయబడెడి) ఈ చెప్పబోయెడి క్రియాకలాపము ఉత్సవమని మాచే సంకేతము చేయబడినది. సవశబ్దమునకు యజ్ఞము అర్థమైనప్పుడు ఉత్కృష్టమగు సవము కాగా దీనికి ఉత్సవమను వ్యవహారము కలిగినదని చెప్పబడినది-అని ఉత్సవశబ్దార్థమును నిర్వచించి మఱియు, అదే సంహితయందు ౩౩-వ అధ్యాయమున,

'అతః పరం ప్రవక్ష్యామి విష్ణోరుత్సవముత్తమమ్
శాన్తిదం వర్షదం నిత్యమారోగ్యం పుష్టిదం శుభమ్ ॥
రాష్ట్రాభివృద్ధిదం చైవ రాజ్ఞశ్చ బలవర్ధనమ్'

ఇట్లే కాశ్యపసంహిత 90-వ పటలమున,

'ఏతదుత్సవేన దేవేశః సుప్రీతో భవేత్, అనేనైవ గోబ్రాహ్మణాది చాతుర్వర్ణ్య సమృద్ధిః సస్యవివర్ధనం మంగల్యం సర్వసంపత్కర మశుభనాశనం గ్రామాదిశాన్తిః సర్వకామావాప్తిశ్చ భవతి. ఏతేన సర్వే దేవా శ్చ ప్రీతా భవేయుః. తస్మాద్విష్ణోరుత్సవం భక్త్యాయః కుర్యాత్ సోఽయం రహస్యాని ప్రకాశాని చ పాపాని పూర్వజన్మని ఇహ జన్మని చ కృతాని సర్వాణి మోచయిత్వా సర్వకామానవాప్నుయాత్. ఏవం యస్య విష్ణోరాలయార్చన మగ్నిహోత్రం శాశ్వతం తిష్ఠేత్ న తద్విష్ణోః పరమం పదం గచ్ఛతీతి బ్రహ్మవాదినోవదన్తి.' అనియు,

ఇట్లే భృగుప్రోక్త యజ్ఞాధికారమున,

'ఏవం యః కురుతే భక్త్యా దేవదేవస్య చోత్సవమ్
పంచసంబంధిభిస్సార్ధం విష్ణులోకం స గచ్ఛతి
సర్వలోకస్య శాన్తిః స్యాత్సర్వదుఃఖనివారణమ్
వర్షదం సర్వలోకస్య సస్యానామభివృద్ధిదమ్
రాష్ట్రస్య వృద్ధిదం చైవ రాజ్ఞాం చ బలవర్ధనమ్
సంతతీనాం సమృద్ధిస్స్యాద్వేదానాముపబృంహణమ్
భేరీపటహశంఖానాం యావద్వ్యాప్నోతి వై ధ్వనిః
పిశాచాః ప్రేతరక్షాంసి తావన్నైవ విశన్తి వై

పాద్మసంహిత ౧౧-వ అధ్యాయమున,

'శ్రద్ధయా వాసుదేవస్య సాంగోపాంగం సదక్షిణమ్ ॥ ౨౬౯
ఉత్సవం దేవదేవస్య యః కుర్యాత్స కులం స్వకమ్
ఉత్తారయన్ స్వయం విష్ణోః సాయుజ్యం గచ్ఛతి ధ్రువమ్ ॥ ౨౭౦
హయమేధసహస్రేణ యజతే యః సమాహితః
యశ్చోత్సవేన యజతే తయోస్తుల్యఫలాన్వయః ॥ ౨౭౧
యాగానామపి సర్వేషాం ఫలముత్సవకర్మణా
దేవస్యాప్నువతే సర్వం యష్టారో నాత్ర సంశయః ॥ ౨౭౨
ఉపకుర్వన్తి యే మర్త్యా దేవస్యోత్సవకర్మణి
కర్మణా మనసా వాచా తేఽపి యాన్తి యథేప్సితమ్ ॥ ౨౭౩
గ్రామే వా నగరే వాఽపి పత్తనే వా మహోత్సవః
విష్ణోః ప్రవర్తతే యత్ర దేశే రాష్ట్రేఽపి వా భవేత్ ॥ ౨౭౪
భయం న మృత్యోః న వ్యాధేః న దుర్భిక్షాదిసమ్భవః
నశ్యన్తి తస్కరాస్తత్ర నాధర్మస్తత్ర వర్తతే ॥ ౨౭౫
ధర్మయుక్తో భవేద్రాజా, నరా ధర్మపరాయణాః
భవన్తి సుఖినః సర్వే సర్వదుఃఖవివర్జితాః ॥ ౨౭౬
మహోత్సవే వర్తమానే యదర్థిభ్యః ప్రదీయతే
పానీయమన్నం వస్త్రం వా తత్సహస్రగుణం భవేత్॥ ౨౭౭
పుష్పమూలఫలైరిజ్యా దేవస్యాభరణాదికైః
క్రియమాణా యథాశక్తి ఫలానన్త్యాయ కల్పతే ॥ ౨౭౮
సేవన్తే తత్ర యే దేవమహర్నిశమతన్ద్రితాః
తేషామిదమియచ్చేతి ఫలం వక్తుం న శక్యతే ॥ ౨౭౯
ఆలేపనం మార్జనం చ రజఃప్రశమనం తథా
వారిభిః దీపికారోపం క్ష్వేలనాస్ఫోటనాదికమ్ ॥ ౨౮౦
కుర్వన్తి యే బ్రహ్మలోకం తే యాన్త్యమరదుర్లభమ్
యానం వహన్తి యే విప్రా తే యాన్తి బ్రహ్మణః పదమ్ ॥ ౨౮౧

ఇట్లు ఉత్సవఫలము సంహితలందు వివరింపబడెను.

---

# భారతీయ ధర్మము - VI

"కాశ్యప"

అవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ, కౌంతేయ ! దుష్పూరేణానలేనచ ॥

భవబంధము దొలగించు జ్ఞానము కష్టసాధ్యము. జ్ఞానమునకు ప్రబల శత్రువు కామము. జ్ఞానమూషికమును భక్షించుటకు కామమార్జాలము నిత్యము పొంచియుండును. కామమునకు తృప్తియనునది లేదు. దానికి మేత దొరికినకొలది ఆకలి రెచ్చిపోవును. "కామమాశ్రిత్య దుష్పూరం మానమోహమదాన్వితాః । మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః॥"ఎంతవారి నైన కామము లొంగదీయును. పరాశర విశ్వామిత్రాదులుగూడ కామోపహతులైననాడు తక్కినవారిమాట దడవ బనిలేదు. కాముని యడుగుజాడలలో దంభాభిమానాదులు సంచరింతురు. కామావిష్టులు జ్ఞానమును గోల్పోయి అసద్విషయముల జిక్కికొని భక్ష్యాభక్ష్య గమ్యాగమ్య కార్యాకార్య వివేచనలేక అశుచివ్రతులగుచున్నారు. ధనేషణ, దారేషణ పుత్రేషణ మానవుని యధఃపతనమునకు కారణభూతములైన మూడు సాధనములు. ధనేషణకన్న దారేషణ బలవత్తరము. ధర్మ్యమార్గముల నీ వాంఛాత్రయము శాంతి నొందింపవచ్చును. అయినను కామాంధకారము స్వపర జ్ఞానప్రకాశమున కవకాశమీయదు. ఏకకాలమున నవకోటి శివాలయముల నర్చింపజాలిన రావణబ్రహ్మ రామ సహధర్మచారిణి యందపచారము గావించి శాశ్వతా ప్రతిష్ఠకు బాల్పడినాడు. దుర్యోధనాదులు ద్రౌపదికి గావించిన యవమానమే భారతసంగ్రామమునకు నాంది. నిరంతరము జరుగుచున్న హత్యాప్రయత్నములకు పరదారాభిలాష హేతువగుచున్నది. అట్టి ప్రబల శత్రువును జయించుట సాధారణ మానవుల కసాధ్యము.

సుందరయువతీసందర్శనము చిత్తమును జలింపచేయును. దుర్బలుడు, అశక్తుడు, పిరికిపంద, పాపభీతి గలవాడు, సాహసము చేయలేక మానసిక పాపాచరణముతో తృప్తిచెందుదురు. ఇహలోకమున మానసిక పాపములకు శీఘ్రముగ శిక్ష చేకూరదు. కొంత తెగువకలవాడు మానసికదోషమునకు దోడుగ వాచిక దోషమునుకూడ జోడించును. వాగ్దోషమునకు శిక్ష చేకూరునుగాని సాధారణముగ నది యింత తీవ్రముగ నుండదు. దిట్టతనము గలవాడు కాయికదోష దూషితుడుగూడ నగును. మూడు తరగతులకు జెందినవారును తరతమ భావములచే దోషులే. ఇతరులు తెలిసికొనలేరని భ్రాంతిచెంది మూర్ఖుడు మానసిక పాపముల కొడిగట్టుకొనును. మానవు లెఱుంగలేకపోయినను సర్వభూత హృదయాంతర్వర్తియగు పరమేశ్వరునకు విదితముగాని విషయములుండబోవు. సర్వశక్తి సమన్వితుడైన పరమేశ్వరుడు మానసికపాపములనుగూడ గని పెట్టుచున్నాడని గుర్తించినచో కొంత మేలు కలిగిన కలుగవచ్చును. మోహపరవశులైన వారికట్టి వివేకము కలుగదు. కలిగినను ఆ మూఢులు దానిని లెక్కసేయరు.

మదన! పరిహర స్థితిం మదీయే మనసి ముకుంద పదారవిందధామ్ని ।
హరనయనకృశానునా కృశోఽసి స్మరసి న చక్రపరాక్రమం మురారేః ॥

ఓ మదనహతకా ! నా మనస్సునుండి తొలగిపొమ్ము. పూర్వము శివనేత్రాగ్ని కాహుతియై యనంగుడవైతివి. మురారి చక్రపరాక్రమ మింకను చవిచూడవైతివి. నా హృదయమున ముకుంద పాదారవిందములను నిలిపికొనియున్నాను. బలవంతముగ నా హృదయమున బ్రవేశింతువేని నక్రమును ఖండించి గజరాజునుగాచిన చక్రధరుడు నీపని పట్టించును. ఏనాడో నీ రూపము మంటగలిసినది. ఇపుడు నీ నామముగూడ సోదెలోనికైన రాకుండ మాసిపోవునుసుమీ ! మనసిజా ! నన్ను బరవశుని జేయకుము. నీ మానమును గాపాడుకొనుము - అనతోపూ సద్గమయ - అసన్మార్గమును విడనాడి నన్ను సన్మార్గమున సాగనిమ్ము. నీకివే వందనపరస్సహస్రంబులు. జిలిబిలి చిలుక పలుకులు పలుకునది జిహ్వ. దురాలోచనలు సేయునది మనస్సు. బహిర్ద్వారముల నన్నిటిని బంధించినను, మానస కుహరమున, స్వయంభువుడయి అవతరించి మనస్సును మధించువాడు కాముడు.

వేదాంతోపన్యాసపరంపరలు గావించుట నల్లేరుపై బండినడక. ధర్మపన్నంబులు వల్లించుట వెన్నతోబెట్టిన విద్య. పరుల కుపదేశించుట పరమాన్న భక్షణము. కాని ధర్మాచరణము గగనకుసుమము, శశవిషాణము. ఇంద్రునకు స్వర్గము నివాసము, దేవతలరిగాపులు, ధనదాదులు సహచరులు, సాధ్వీశిరోమణి అదితి జనని, నిరతిశయ తపస్సంపన్నుడు కశ్యపుడు తండ్రి, త్రివిక్రముడు తమ్ముడు, సౌందర్య సౌశీల్యవారాశి శచీదేవి యిల్లాలు, రంభోర్వశీ ప్రముఖాద్యప్సరస్సుందరీ రత్నంబులు దాసీగణంబులు, గీష్పతియగు బృహస్పతి గురుత్వ మంత్రిత్వములు వెలపు శ్రేయోఽభిలాషి. అంతకుమించి యపేక్షింపదగిన గుణ

సంపత్తి మీఱి యేమియుండును. ఆ యజ్ఞభాగాధీశ్వరుడు, శాపాయుధుడైన గౌతముని గృహిణి నపేక్షించెను. పాపము పంటి బ్రద్దలయ్యెను. ఒడలంతయు యోనిమయ మయ్యెను. క్షణకోపులయిన పెద్దల యనుగ్రహమున సహస్రాక్షుడయి, అతడు నిజమాన సంరక్షణము గావించు కొనియెను. మన్మధుని యప్రతిహత పరాక్రమమున కింతకన్నమంచి యుదాహరణము చూపబనిలేదు. 'ఎంత వారలైన కాంతదాసులే'యని లోకజ్ఞుడగు త్యాగరాజు కాంతా సమ్మితముగ నుపదేశించెను. శత్రువు బలవంతుడు అజేయుడు అని తలయొగ్గుట దీరలక్షణముకాదు. జయాప జయంబులమాట యటులుంచి, చేతనైన ప్రయత్నము చేసితీరవలెను. ఈజన్మమున కామమోహములు లొంగక పోయిన పోవుగాక. చచ్చి మఱుమేననైన వాని సాధించుటకు తగినశక్తి నలవఱచుకొన యత్నించుట సాధకులకు, ముముక్షువులకు కర్తవ్యము. 'ఆత్మవత్సర్వభూతాని' తానెంతో జగమంతయను న్యాయముగలదు. తా నితరుల యెడ చేయునత్యాచారము, ఇతరులే తనవారియెడల గావిం చినపుడు తనకెటులుండునో యూహించుట కష్టముగా బోదు. ఊహించుకొన్నచో కొంత వెఱపుగలుగును; అడుగు ముందుకుబడదు. మనస్సును లొంగదీయుటకు ఒకొక్క ప్పుడు యుక్తు లుపకరించును. అవి సర్వత్ర ఫలవంతము లైతీరుననుటకును వలనుపడదు. "జహిశత్రుం మహా బాహో! కామరూపం దురాసదమ్." లొంగని కామరూప శత్రువును లొంగదీయుమని గీతాచార్యుల యుపదేశము. మొసలినోట జిక్కినవాడు బ్రతికి బయటపడుట యూహ కందని విశేషము. సంసార మహాసాగరమున కామరూప మహానక్రముగలదు. అది చాలపెద్దది, బలిష్ఠమయినది, భయంకరమయినది; దానిని దప్పించుకొనుట దుష్క రము. స్థానబలము దానికధికము. అది గజరాజునే నిర్వీర్యుని జేసినది. ఇంక దుర్బలులమాట యేడ. పదివేల సంవత్సరములు కరిరాజు ఘోరముగ బోరాడియు, స్వశక్తిచే మొసలిపట్టు తప్పించుకొనలేకపోయె. రూపలాలస, సుఖభ్రాంతి, పాశవోద్రేకము, కామప్రవృత్తికి మూలకారణ ములు. సుందరరూప సందర్శనము డెందము నాందోళి తము గావించును.

ఫహల్వాను ధనుర్దాసు ఆజానుబాహువు, సింహబలుడు. వేశ్య హేమాంబ అనన్య సామాన్య లావణ్యవతి. హేమాం బను ధనుర్దాసు మోహించెను. హేమాంబాతనియందు బద్ధానురాగయయ్యె. ఇరువురు భార్యాభర్తలై జీవించు చుండిరి. ధనుర్దాసు పత్నీసౌందర్యమునకు ముగ్ధుడై క్షణమైన ఆమెయెడబాటు సహింపలేకయుండె. నడచునపు డామె కెండసోకకుండ ధనుర్దాసు గొడుగుపట్టుచుండు వాడు. ఆమె కెదురుగ నిలిచి, తన్ముఖమండలమును చంద్రబింబమును చకోరపక్షి సందర్శించు చందంబున తనివిదీర చూచి యానందించుచు, పోవలసిన మార్గము నకు వెన్నుజూపుచు వెనుకకు నడచుచుండువాడు. అది యతనికి ఆనంద సంధాయకమేయైయున్నను చూపఱులకు మాత్రము విడ్డూరముగ దోచుచుండెను. కామినీరూపలావణ్యా సుధారసమును అహరహము నేత్రాంజలుల గ్రోలుచు మానవజీవితమును చరితార్థము గావించుకొంటినని యా కాముకాగ్రేసరుడు మురిసిపోవుచుండెను. దైవవశమున శ్రీమద్రామానుజ పూజ్యపాదుల దృక్పథమున నీ యపూర్వ రసజ్ఞ శిఖామణి గోచరించుట సంభవించెను. స్వామి వారికి కామినీకింకరునియందు జాలిగలిగెను. తమ్ము కలిసి మాటలాడవలయుననీ, ధనుర్దాసునకు యతిరాజుల వారు వర్తమానమంపిరి. తన యకృత్యమునకు మంద లించుటకే శ్రీవారు కబురంపిరని ధనుర్దాసు వెఱచియు, చేయునదిలేక, వారి దర్శనమున కేగెను. పుత్రవాత్సల్యా మున వాని జేరజీరి, కారణజన్ములయిన దేశికేంద్రులు వాని వింతప్రకృతికి కారణమడిగిరి. అతడును సిగ్గుచెంది, సంకోచించుచు "స్వామీ! నా సుందరీ సౌందర్యము నాడెందమున నానందమమందముగ సంధించును. కామా భిలాష నాకంత లేదు కాని, ఆమెను జూడనిది యొక్క నిమిషమైన నిలువలేను. తమరేది యాజ్ఞాపించిన దాని నీదాసుడు తప్పక చేయగలడు. కాని, హేమాంబ ముఖార వింద సందర్శనముచేయక బ్రతుకలేడు." అని విన్నవించు కొనియె. "కామవాసనకన్న రూపలాలస నీ కధికమను చుంటివికదా! నీ ప్రేయసి చక్కదనమును ధిక్కరించు త్రిజగన్మోహన దివ్యమంగళ విగ్రహము పొడగట్టినచో నేమిచేయుదు"వని దీనజనావనుడు ప్రశ్నించెను. "హేమాంబ సౌందర్యమున కీడువచ్చు నందచందమ్ములు త్రికాలములగాని త్రిలోకములగాని కానరావనియే నా నిశ్చితాభిప్రాయము. అట్టి సోయగముండుటయే తట స్థించిన, హేమాంబను వెంటనే పరిత్యాగము చేయుదును. ఇది శ్రీవారి పాదముల నానయిడి బాసచేసెద" నని ధనుర్దాసు బదులుపలికె. "తండ్రీ! నీవంత త్యాగము చేయవలసినపనిలేదు. ఈనాడు హేమాంబ వేశ్యాంగన కాదు. నీయందు బద్ధానురాగముగల కులాంగన. ఆమెను బరిత్యజించి పాపమున కేల యొడిగట్టుకొనియెదవు. ఈ సాయంసమయమున, శ్రీరంగమందిరమునకు రమ్ము. ఒంటరిగనే రావలయునుసుమా!" అని గురువర్యులు సెలవిచ్చిరి.

స్వామివారి సౌజన్యము, సౌహార్దము, వాత్సల్యము దాసుని ముగ్ధుని గావించెను. అతడు నిజగృహముచేరి

వృత్తాంతమంతయు హేమ కెఱంగించెను. భర్త శ్రేయస్సునే కోరునదికాన, దాసుని రంగనాధుని దర్శనమున కేగ తొందరించెను. సద్గురు పురుషకారముచే పెరుమాళ్ల యనుగ్రహము లభించి తననాధుడు సదాచార సంపన్నుడు కాగలడని యాపతి దైవత యాశించెను. "దయామయా! దీనజనశరణ్యా! నీ యపూర్వ సౌందర్యరేఖ జూపి ఒక విముఖజీవుని భవదభిముఖుని గావించి యుద్ధరింపు"మని రామానుజలవారు శ్రీరంగనాధుని బ్రార్థించిరి. ప్రొద్దు గ్రుంకినది. ధనుర్దాసు దేవాలయముచేరి రామానుజులవారి పాదారవిందముల కభివందనము చేసెను. "వత్సా! మంగళారార్తిక సమయమున, ధ్యాననిశ్చల నయనములతో శ్రీరంగని దివ్యస్వరూప మవలోకింపు"మని దేశికు లాశీర్వదింప, దాసు దేవతాసన్నిధిజేరెను. అది భూలోకస్వర్గము, కలియుగ వైకుంఠము, వాచామగోచరము. కట్టెదుట క్షీరసాగరము. అనంతభోగి భోగమండల దివ్యరత్న ప్రకాశాంచితము. దాసునిచూపులో దోసము మాసిపోయినది. పంచోపనిషన్మయ సచ్చిదానంద ఘనఘన శ్యామ దివ్య సుందరమంగళ విగ్రహము. ద్వాదశాదిత్య తేజోవిరాజితము. సహస్రరాకేందు సంకాశలీలావిలాసము. శృంగార రస సర్వస్వము. కోటిమన్మథ లావణ్య స్ఫోరకము. మధుర మధుర మందస్మిత సుందర వదనారవిందము. దివాకర సుధాకర లోచనద్వయము. శ్రీకరాకార శ్రవణయుగళము. సౌందర్యోపాసకుని మేన పులకాంకురములు. క్షీరసముద్రరాజతనయ మృదులకర పల్లవముల నొత్తుచున్న శ్రీ మచ్చరణ సరోరుహములు. పాదతలమున నవతరించుచున్న మందమందాకినీ ప్రవాహ పరంపరలు. గాంగ జలముల నోలలాడి, ఆనందడోలికల దేలియాడుచున్న బృందారక సందోహము. కింకరుని శిరము భక్తిన మ్రమము. నాభీ సరోజాత సంజాత చతుర్ముఖ ముఖాంభోజ వినిస్సృత శ్రుతి మకరంద పరిమళ సమ్మేళనము. నారద తుంబుర ప్రముఖ సరసనంగీతస్తోత్ర పారము. ఆశ్రితాజ్ఞాన దుర్వాసనాక్షయము. శంఖచక్రగదా పద్మాలంకృత విరాజమాన భుజచతుష్టయము. ఆత్మసాక్షాత్కార పరవశ చంద్రశేఖర సదాశివానంద తాండవము. సేవకనేత్రద్వయ మానందబాష్ప సంకులము. పారవశ్యాక్షినిమీలనము. సాధకక్షీణ పుణ్యప్రతిహత విశ్వమోహన సౌందర్యావలోకన సౌభాగ్యము. నిరాశాతిమిర ప్రాచుర్యము.

దివ్యానుభూతి క్షణికమయ్యును, దాసుని హృదయమున నాటుకొని మొలకలెత్తుచుండెను. వియోగవ్యధ దుర్భరమగుచుండెను. ధనుర్దాసు పెన్నిధి గోల్పోయిన పేదచందమున, కింకర్తవ్యతా విమూఢుడై శూన్యదృక్కుల నలుదిక్కులు కలయజూచి, కించిల్లబ్ధ చైతన్యుడై ఉడయవరుల పాదారవిందముల వ్రాలి "ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమ్. నంబెరుమానార్ తిరువడిగళే శరణమ్." స్వామీ! ఈ దీనుని, పాపాత్ముని కనికరింపుడు. నంబెరుమానార్ దివ్యరూప సందర్శనము చేసికొన్న యీ నేత్రములతో తుచ్ఛక్షణిక పదార్థంబుల చూనొల్లను. పెరుమాళ్ల దివ్యరూపమే సర్వదా గోచరించునటులను గ్రహింపుడు. శ్రీవారి పాదారవింద సేవాసౌభాగ్య మీ దాస దాసానుదాసునకు బ్రసాదింపుడు. ఇంక నైహిక బంధములనుండి విముక్తుని గావింపుడు. అని వెక్కివెక్కి యేడ్చుచుండెను. కరుణాలవాలుడైన భాష్యకారప్రభువు దాసుని బరమాదరమ్మున గ్రుచ్చియెత్తి "కుమారా! నీ భాగ్య మనన్య సామాన్యము. సుకృత విశేషమ్మున నీకు విశ్వరూపసందర్శనమే గలిగినది. నిన్ను నమ్మియున్న గృహిణిని విడనాడుట కిది యదనుగాదు. సద్వితీయుడవై గృహస్థాశ్రమమున నద్వితీయానంద మందు" మని దీవించి పంపెను.

'మందార మకరంద మాధుర్యమునదేలు మధుపంబు వోవునే మదనములకు.' పిండియారబోసినలీల పండువెన్నెల దిఙ్మండలమునం దంతటను అఖండముగ నిండియుండెను. సజలజలదోదయంబు నపేక్షించు చకోరాంగనవోలె హేమాంబ మనోహరురాక కెదురుచూచుచుండెను. ధనుర్దాసు నిజమందిరమున నుదాసీనతతో బ్రవేశించెను. హేమ ప్రత్యుత్థానముచేసి నాథుని సుఖాసీనుని జేసెను. అతడు పరధ్యానముననుండెను. గృహిణికి పాలుపోలేదు. సుధాసాగరము విడచి లవణవారాశిచేరిన హంసవలె, స్వర్గమునుండి పాతాళమునకు భ్రష్టుడైన తపస్సంపన్నుని వలె, అతడు ఖిన్నుడైయుండెను సంభ్రమాశ్చర్య భయ విహ్వలయై ఆమె పరితపించుచుండెను. "అవాఙ్మానసగోచరమయిన ఆ యఖండ దివ్యసౌందర్య పారావారమెక్కడ? క్షణికాల్ప క్షుద్ర మర్త్యరూప రేఖావిలాసమెక్కడ? సహస్ర రశ్మి యనంత తేజోవిశేషమెక్కడ? ఖద్యోత సముద్భూత కాంతిలేశమెక్కడ?" అని యున్మత్తునివలె దాసు వ్యక్తావ్యక్త ప్రలాపముల పలవరించుచుండెను. జన్మతో భవహావ భావవిలాసముల నామె యెట్టకేలకు దాసును ప్రకృతిస్థుని గావించెను; మెల్లమెల్లగ విషయమెల్ల గ్రహించెను. భర్తృమతానుసారిణియై ఆ సాధ్వి సేవచేయుచుండెను. ఆ పుణ్య దంపతులు ముకుందపాదారవింద భజనామందానందంబున దేలియాడుచు పరమవైష్ణవాగ్రగణ్యులై ఆదర్శప్రాయులై చరించిరి, తరించిరి. గురుదేవతాభక్తులకు కష్టములు తొలంగును, అభీష్టములు నెఱవేరును, పరమపదము లభించును.

నారీస్తన భర నాభీదేశం। దృష్ట్వా మాగా మోహావేశమ్।
ఏతన్మాంసవసాదివికారం। మనసి విచింతయ వారం
వారమ్ ॥

అస్త్ర శస్త్రములు ప్రతిఘటింపగలవారుగూడ కుసుమాస్త్రాయుధములగు యువతుల మృదుమధుర ముగ్ధ మనోహర హావభావ విలాసముల బద్ధులై యావజ్జీవ దాస్యమున కొడిగట్టుదురు. దాస్యవిముక్తి నందలేక పతితులై భగవంతునకు దూరులైపోవుదురు. మాయామోహములు జ్ఞానదృష్టిని గప్పివేయును. అశుచిని శుచిగను, నరకమును స్వర్గముగను, దుఃఖమును సుఖముగను, పాపము నపాపముగను దోపజేయును. ప్రాణులలోనుత్తము డనదగు మానవుడును మోహజాలము ద్రెంపజాలడన నందసత్యము లేదు. తత్త్వవేత్తలకు మాంసవసాది వికారమయిన దేహమునందు మమత్వము కలుగదు. కాని పామరజనుల కదియే యుపాస్యముగ దోచును. అందే సక్తచిత్తులై ధన మానశక్తి ప్రాణముల గోలుపోయెదరు. "విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః" ఆహారము లభింపకున్న విషయములు మఱలిపోవునని పెద్దలందురు. పర్ణపవనాంబు భక్షులై వేలకొలది సంవత్సరములు ఘోరతపస్సు చేసిన విశ్వామిత్ర ప్రభృతులు మునివరేణ్యులుగూడ తామరస నేత్రల యూడిగమునకు సిద్ధపడిరి. ఇతరుల మాట యేమి? విషయములయందు ఇంద్రియములద్వారమున మనస్సు ప్రవేశింపనినాడు విషయవాంఛయే గోచరింపదు. మనోనిగ్రహము దుర్లభము. - చంచలం హిమనఃకృష్ణ! - మనస్సతి చంచలమయినది. అది నిరంతరము వ్యసనాభిముఖముగ బ్రవర్తించును. వ్యసనములయందు విముఖత గలిగి భగవద్విషయములయందు అభిముఖ్య మలవఱచు కొనుట దానికి సాధ్యముగానిపని. స్త్రీసుఖమును మించిన సుఖములేదని బహుజనాభిప్రాయము. ఆ సుఖము క్షణికము, దుఃఖజనకము, బంధహేతువు, నిరయమార్గము. అందుచే నింద్యము త్యాజ్యము అని గుర్తింపగల సంసార సాగర పారంగతుల సంఖ్య కడుంగడు స్వల్పము. సామాన్య మానవుల కట్టి యభిప్రాయమే గలుగదు. పెద్దలు స్ఫురింప జేసినను, పాశవోద్రేకముచే నా తాత్కాలిక జ్ఞానస్ఫూర్తి కామాంధకారమున లీనమై యంతరించిపోవును. పశువులు పాశవధర్మము ననుసరించుటలో వింతయేమిగలదు? భార్యను అక్రమమార్గములనుండి తప్పించి, ధర్మమార్గముల బ్రవర్తింపజేయువాడు గనుక భర్త పతిశబ్ద వాచ్యుడగుచున్నాడు. అట్లే భర్తను దురాచారములనుండి మఱలించి సదాచారములయందు ప్రవర్తింపజేయు భార్య పత్నీపదార్థార్హాలగుచున్నది. పరస్పరము పతనమునొందకుండ రక్షించుకొనగల శక్తిగలవారు పతిపత్నీశబ్ద యోగ్యులగుచున్నారు. స్త్రీపురుషసంబంధము అనాదిసిద్ధము. సకల జీవ లోకసాధారణము. శాస్త్రాదు లెంత యుపదేశింప బ్రయత్నించినను తత్సంబంధము నమసిపోవునదికాదు. కనుక మానవులు, వివాహధర్మ నియమాదులకు బద్ధులై యుండిన నందలి ప్రమాదము చాలవఱకు తగ్గిపోవును.

కేవల మానవశక్తిచే వ్యసనాభిముఖ్యమును, విషయాభిలాషను, అరికట్టుట సాధ్యముకాదు. మానవశక్తి కతీత ములైన కార్యములను భగవదనుగ్రహముచే సాధింప వలయును. 'న దేవా యష్టిమాదాయ రక్షన్తి పశుపాలవత్। యంహి రక్షితు మిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తితమ్॥' దండము చేబట్టి గోపాలుడు పశువులను కాపాడునటుల దేవతలు మానవులను రక్షింపరాదు, ఎవనిని రక్షింపదలతురో వానికి సద్బుద్ధి ప్రసాదింతురు. - ఉద్ధరేదాత్మ నాత్మానమ్. - మానవుడు తన్ను తనబుద్ధిచేతనే రక్షించుకొనవలయును. ఈశ్వరానుగ్రహముచే సద్బుద్ధిగలుగును. 'కలౌ సంకీర్తనాత్.' ఈ కలికాలమున భగవన్నామ సంకీర్తనముచేతనే తరింపవీలగును. ఆ సంకీర్తనము విచ్ఛిన్నముగగాక, అవిచ్ఛిన్నముగ సిద్ధి పర్యన్తము సాగించుచుండవలయును. కీర్తనామృతమాధుర్యము చవిచూచునంతవఱకే ప్రయాసపడవలయును. అధికసుఖ మాధుర్యానందములు లభించిననాడు అల్పసుఖ మాధుర్యానందముల నపేక్షించు వెఱ్ఱివారుండరు. - స్మరణే సుఖమ్–శ్రీరామనామస్మరణే సుఖమ్ - అని త్యాగరాజస్వామి—శ్రీరామ నీనామ మెంత రుచిరా— అని రామదాసాగ్రగణ్యుడు అనుభవపూర్వముగ గ్రహించి సంకీర్తనాచార్యులై లోకుల ననుగ్రహించియున్నారు. "అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ-మృత్యోర్మా మమృతంగమయ" అని వేదపురుషుని సూక్తి. అసన్మార్గమునుండి సన్మార్గమునకు, అంధకారము నుండి దివ్యప్రకాశమునకు, మృత్యువునుండి అమృతత్వమునకు నన్ను జేర్పుము.

యోదేవః సవితాస్మాకం ధియో ధర్మాదిగోచరాః - ప్రేరయేత్ - సకల లోకప్రేరకుడు శ్రీమత్సూర్యనారాయణుడు మాబుద్ధులను పెడదారుల ద్రొక్కనీయక ధర్మమార్గముల యందే ప్రవర్తించునటు లొనరించి నిజాశ్రితులను మమ్ము సర్వథా సర్వదా యనుగ్రహించుగాక! లోకములకు శాంతి కల్యాణములు సమకూర్చుగాక!! (సశేషము)

---

## భాష—అపౌరుషేయము

వేదము లీశ్వరునివైపునుండి మనుష్యునికి ప్రాప్తము లైనవనుటకు ప్రమాణము వీటి భాష. ప్రతిభాసంపన్నుడైన కళాకారుడు మేలిక మూహించును. వైజ్ఞానికుడు నవీన వస్తుసృష్టి చేయును. అపఠిత సాధువు గూఢ తత్త్వమును తన వాక్కులతో వ్యక్తపఱచును; గాని యెవ్వడును భాష నవీనముగ జేయలేదు. హృదయైకాగ్రతవలన మనుష్యుడు జ్ఞానోపలబ్ధినయితే చేయగలుగుచున్నాడు. సాధువులు ధర్మప్రవర్తకు లీమార్గముననే విశుద్ధ జ్ఞానమును బడసిరిగాని మనుష్యుడు తన జ్ఞానమును ప్రచలిత భాషలో— అత డెరిగిన భాషలోనే వ్యక్తము చేయును. అపఠితసాధుపురుషుల వాక్కులధ్యయనము చేయునప్పుడు వారికడ పర్యాప్త రూపములో శబ్దజాలము లేనందున వారు తమ భావముల ననేక రూపములలో నస్పష్టరీతిని వ్యక్తపఱుపవలసి వచ్చినదని మనకు విశదమగుచున్నది. అంతరికైకాగ్రతలో వారు శబ్దములను బొందజాలక పోయిరి. వారు చదువుకొన్నవారై యున్నచో వారి కింతటి గూఢ దృష్టాంతము లాశ్రయింపవలసి యుండెడిది కాదు. మనుష్యుని యేకాగ్రత వానికి జ్ఞానానుభూతి మాత్రమే యిచ్చును. భాష యన్నది మనుష్యునికి సృష్టికి ఆదిలో ఈశ్వరునివైపునుండియే ప్రాప్తించియున్నది.

భాషాకోవిదులు—మనుష్యుడు మొదట చాలకాలము వఱకు మూగివాడై యుండెననియు సంజ్ఞలద్వారా తన పని జఱపుకొనుచుండెడి వాడనియు, పిదప కొన్నాళ్లకు ప్రాకృతిక శబ్దములచే తన భాషను వికసింప జేసుకొని యున్నాడనియు చెప్పుదురు. మాక్సుముల్లరు—'మనుష్యుడు వ్యర్థముగానే సంజ్ఞలు చేయుచుండెడివాడా? సంకేతముల అర్థ మత డెట్లు గ్రహించె'? నని అడిగియున్నాడు. నేడు మూగవాళ్లు సంకేతము చేయుట వారికి నేర్పబడినది గనుక అట్లు చేయుచున్నారు. అధికాంశముగ మూగవాళ్లు బధిరులు గనుకనే మూగవాళ్లయి యుండెరని స్పష్టబడినది. బధిరు లేశబ్దమును వినజాలరుగాన మాట్లాడను జాలరు. ఇప్పుడు బధిరులు వినగల, మూకులు మాట్లాడగల, యంత్ర మొకటి కనిపెట్టబడి ప్రచలితమై యున్నది. దీని ద్వారా వారికి విద్య గరపబడుచున్నది. మనుష్యుడు గనుక భాషను తయారు చేయ సమర్థుడై యుండియున్న యెడల సృష్టి ప్రారంభము నుండి యిప్పటివఱకు మూకు లేదోభాషను తయారు చేసి యుండెడివారే. ఈ యన్ని విషయములచేత మనుష్యుడు స్వయముగ నే భాషను దయారు చేయజాల డనునది స్పష్టమగుచున్నది.

భాషకు అర్థమునకు నిత్యసంబంధము గలదు. మన మొక అర్థముయొక్క యొక శబ్దమునకు పర్యాయ వాచిక శబ్దమును దయారు చేయగలముగాని నూతనార్థమందు నూతన శబ్దమును జేయలేము. ఏలనన - మనము తయారు చేసిన—పలికిన శబ్దమును విను వా డిదివఱలో నెఱింగి యుండనిచో మనము పలుకుట వ్యర్థమే కాగలదు; దాని నెఱిగించుటకు మనము మన శబ్దముయొక్క పర్యాయ వాచక శబ్ద మింకొకదానిని చెప్పవలెను. దీనియర్థము మనశబ్దము క్రొత్తది కాదని అది పురాతన శబ్దార్థ సూచకమని తెలియుచున్నది.

శబ్దార్థములు నిత్యసంబంధముగలవని - శబ్దము లేనిదే మన జ్ఞానమితరులవఱకును జేర్చుట దుష్కరమని ఎఱిగి యుండుటచేత జ్ఞానము మనుష్యుని కీశ్వరుని వైపునుండి లభించి యున్నదని—అదికూడ భాషతోపాటుగా లభించి యున్నదని తలంప వలసియుండును.

ఇక జడవాదులగు వైజ్ఞానికుల తర్క మొకటిగలదు. అది యెంతటి అనంగతమైనదో చూడుడు—వారు చెప్పునది మనుష్యుడు హర్షశోకాదుల స్వాభావిక భావాధిక్యముచే భాషను దయారుచేసియున్నాడని—కాని మూగవాడెప్పుడైన "అహా, వహ్వా" "అయ్యో కుయ్యో" యనుట యెవ్వరును జూచి వినియుండలేదు. తమవద్ద శబ్దములుగలవారే యీ ఉద్గారములు ప్రకటించగలరు. రెండవది, శబ్దార్థము కల్పించి పూర్తిగ నవీన శబ్దము దయారుజేయుట శక్యముగాదని కూడ స్పష్టమైనది. వాణి - భాష, సృష్టికి ఆదిలోనే ప్రాప్తించి యున్నది. అదియును పూర్ణముగనుండెను. భాషకు జ్ఞానమునకు నిత్యసంబంధము గలదు గనుకనే భాషతోకూడనే మనుష్యునకు పూర్ణజ్ఞానముకూడ సృష్ట్యాదియందు ప్రాప్తించియుండెను. హృదయైకాగ్రతవలన మానవుడు జ్ఞానము పొందగలుగునేగాని భాషనుగాదు. గనుక సృష్ట్యాదిలో మనుష్యుడు పొందియున్న పూర్ణభాషతోడి పూర్ణ జ్ఞానము మానవుని ఏకాగ్రతయొక్క పరిణామముగాదు. అది యీశ్వరుని వైపునుండి లభించినదిగావుననే యది పూర్ణజ్ఞానమయమగు యీశ్వరవాణి 'వేద'మని చెప్పబడుచున్నది. సృష్టికి ప్రారంభములో మనుష్యుడు సమ్యక్

పూర్ణ భాషయు పరిపూర్ణజ్ఞానము నెట్లు బడసియుండెను? భాషయొక్క ఇన్ని ధాతువులను - వాటి అర్థములతోబాటు ఇంత శీఘ్రమున నతడెట్లు తెలిసికొనె నను ప్రశ్నలకు సరియైన సమాధాన మెఱుగరాకుండుటచేతనే భాషాకోవిదులు భాషసంబంధమైకూడ డార్వినుయొక్క వికాసవాదము నంగీకరించు కల్పనా వివేచనమున బడుచున్నారు. ఈశ్వరీయ సత్తాపైగల అవిశ్వాస హేతువుచేత వారెచ్చటను ఏ వ్యవస్థిత కారణము నొసగజాలలేక పోవుచున్నారు. మెస్మరిజంచేయు వాడొక బాలుని మూర్ఛాగతునిగ జేయుట మనము చూచుచున్నాము. ఆ బాలకు డా మెస్మరిజం చేయువానిభాష యెరుగడు. మాట్లాడజాలడు. ఇది సంకల్ప శక్తివలననే జఱుగుచున్నది. ఇట్లే సృష్టి ప్రారంభములో ఈశ్వరీయసంకల్పముచేత మనుష్యునికి సంపూర్ణ భాషయు సంపూర్ణజ్ఞానము ప్రాప్తించియుండె ననుటలో సందేహమేమియును లేదు.

## ఆ ది భా ష

అదిజ్ఞానము—ఆదిభాషయు ఈశ్వరుని వైపునుండి మనుష్యునికి ప్రాప్తించినది. అదేవేదము ;—ఏలనన అదే పూర్ణమైనది. ఆ అదిజ్ఞానము - అదిభాష ఏది? అది యింతవఱకు అవికృతమై యున్నదా లేక దానిలో నేవైన పరివర్తనములు - వికారములుగలిగినవా అను ప్రశ్నలపైననే అపౌరుషేయ వైదికజ్ఞానము నిర్ణయించబడియున్నది.

నిస్సందేహముగ మనుష్యుని మూలభాష ఒక్కటేయని ప్రాఫెసరు మాక్సుముల్లరు కథనము. ఈశ్వరుడు మనుష్యునకు భాష యొసంగియుండె నన్నచో అందు భేద మెట్లుండగలదు? మనుష్యున కనేక భాష లీశ్వరు డెందుల కీయ దొడంగును?

మూలభాష యగు సంస్కృతము నుండియే సమస్త భాషలు వెలువడినవి. మనుష్యులు భారతదేశమునుండియే నాల్గు మూలల కేగి నివాసము లేర్పరచుకొనిరి. ఒకే మానవ పరివారము భాషయొక్క మూల మొక్కటేయై యుండవలెను. ఈ సంగతు లితర వ్యాసములలో నృష్టీకరించదగును. ఇట నెఱుగవలసినది. గ్రీకు లాటిను హిబ్రూ జెందు, అరబ్బి. చైనాలోని యొక భాష సామోపేడికు—యీ అన్నింటిలోను సంస్కృతమునందువలెనే స్త్రీ లింగ పుంలింగ నపుంసక లింగముల భేదములు గలవు. వచనములుగూడ మూడు గలవు. సంస్కృతమందు వలెనే స్త్రీ లింగ శబ్దములనుండి పుంలింగ శబ్దములు కొన్నింటియందును, లేక పుంలింగములనుండి స్త్రీలింగములును అగుచుండు నియమము గలదు. కొన్నింటియందు సంస్కృతమందువలెనే యెన్మిది విభక్తులు గలవు.

మూలభాష యొకటైనను అనేక భాషలు వికృతములై పుట్టినవి. ఈ వికారము లనేక ప్రకారము లుండును. ఒకటి, ఆ విద్వాంసుల ఉచ్చారణ దోషకారణములు. రెండవది అక్షరముల కొఱత కారణములు. ఆంగ్లేయులు 'త' నుట పలుకునట్టివి. వ్యాపారముకొఱకు రాజనైతిక కార్యములనుండి సాంకేతిక భాషగూడ తయారు చేసుకొన బడుచుండెడిది. సాంకేతిక భాష ఏ పరంపరలోనికిని రాదు. నేడు "కోడ్ వర్డు' చాల నడచుచున్నది. మహాభారతమందు నిట్టి సాంకేతిక భాషా ప్రసంగము గలదు. శబ్దముల అజ్ఞానహేతువుచేత తదర్థము లనేక క్రియలకు లాక్షణిక నామములుగూడ నుంచబడుచున్నవి. లేడిఫింగర్ (స్త్రీయొక్క వ్రేళ్లు) ఇది బెండకాయ పేరు. చెఱకును షుగర్‌కేన్ అందురు. ఇట్టి సాంకేతిక, లాక్షణిక శబ్దములే పరంపరయందును బొందబడజాలకున్నవి. ఈ శబ్దములను విడిచివేసినచో మనకు మూలభాషలేవో యొకే పరివార సంబంధమైనవని స్పష్టపడుచున్నది.

ముఖ్యమైన మూలభాషలలో ఆది భాష యేది? దీని నిర్ణయముపై విద్వాంసులలో పెద్ద వివాదము లేదు. భాషాకోవిదులు మతభేదము లేకుండ, సంస్కృతము వైదిక సంస్కృత భాషనుండియే మూలభాషలన్నియు వెలువడియున్నదని యంగీకరింతురు. ఈ సంగతి ప్రమాణములతో ఋజువు చేయుట కష్టము గాదు. మూలభాషలో ఇతర భాషలయొక్క వికృత శబ్దము లుండరాదు. ఇతర భాషలలో దాని శబ్దములు యథాతథంగా—వికృతరూపమున గూడ నుండవచ్చును. అన్ని ఇతర బాషల లాక్షణిక సాంకేతిక శబ్దములు తప్ప శేష శబ్దములన్నింటి యొక్క మూల రూపమందులో గలిసియుండవలెను. ప్రస్తుతపు భాషలన్నింటి యొక్క వికృతులకందున మూలాధారముండవలెను. అది అన్నింటికంటె నధికముగ దానిలో అక్షరము లుండవలెను.

లాటిను, గ్రీకు హిబ్రూ మున్నగు మూలభాషలని చెప్పబడువాటియందు సంస్కృత శబ్దములు నిండియున్నవి. సంస్కృతశబ్దములకు వికృతములైన పిదపనే శేషశబ్దములు కూడయైనవి. సంస్కృతములో 47, రష్యను భాషలో 35 పారసీ భాషలో 31 టర్కి, అరబ్బిలలో 28, స్పానిష్ భాషలో 27 అంగ్లేయములో 26 ఫ్రెంచిలో 25 లాటిను-హిబ్రూలలో 20, బాల్టికులో 17 అక్షరములు గలవు. చైనీస్ భాషలో అక్షరములకు మాఱుగా శబ్దములు గలవు గనుక వాటిని నిట లెక్కింప దగదు. పై భాషలలో ఒకటే యుచ్చారణ గల అక్షరములు చాల గలవు. (సశేషము)

['కళ్యాణ్' నుండి అనువాదము]

# వార్తలు - విశేషములు

## మచిలీపట్నము - శ్రీ నాగేశ్వరస్వామి ఆలయము,

*ధర్మకర్త శ్రీ అవటపల్లె హనుమంతరావుగారి సమ్మాన మహోత్సవము.*

**1956** సంవత్సరం డిశంబరు **23, 24** తేదీల యందు శ్రీ నాగేశ్వరస్వామి ఆలయమందు పై సమ్మాన సభ జరుపబడినది. ఈ సభకు అధ్యక్షులుగా ఆచార్య, శ్రీ పింగళి లక్ష్మీకాంత కవి, యమ్. ఏ., ఆల్ ఇండియా రేడియో, విజయవాడ స్టేషను, తెలుగు శాఖాధిపతి గారధ్యక్షత వహించిరి. దేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖ డిప్యూటీ కమిషనరు వారగు, శ్రీ గుండు శ్రీనివాస నరసింహరామమూర్తి బి.ఏ., బి.యల్., గారు శ్రీ హనుమంతరావుగారి చిత్రపటమును, నాగేశ్వర స్వామి ఆలయమునందలి కార్యాలయమున నావిష్కరించిరి.

సభకు పురజనులు - స్త్రీ బాల వృద్ధులు - సుమారు 2 వేల మంది వచ్చిరి. ప్రాతః కాలమున శ్రీ హనుమంతరావుగారి ఆయురారోగ్యైశ్వర్యములను కోరుచు, ఆలయమునందు విశేష పూజలు జరుపబడెను. మధ్యాహ్నము సభ వేద పఠనముతొ ప్రారంభమయ్యెను. సభాప్రారంభమున సమ్మాన సంఘాధ్యక్షులు శ్రీ కాశీపట్నం నరసింహమూర్తిగారు, తమ స్వాగతోపన్యాసము నొసంగిరి. పురజనుల పక్షమున శ్రీ మల్లాప్రగడ రంగారావుగారు సన్మాన పత్రమును సమర్పించిరి. కార్యదర్శి, శ్రీ గురుజాడ రాఘవశర్మగారు పద్యములతో అతిథిని సత్కరించిరి. అధ్యక్షులు చమత్కృతి విశిష్టమగు సుపన్యాసము నొసగిరి. వివిధ కవి పండితులు తమ పద్యోపహారములను సమర్పించిరి.

శ్రీ అవటపల్లె హనుమంతరావుగారి సమ్మాన సభ



సుప్రసిద్ధ కవి పండితులు - అధ్యక్షులు

తరువాత శ్రీ హనుమంతరావుగారి చిత్రపటము నావిష్కరించుచు, దేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖ డిప్యూటీ కమిషనరు వారు క్రింది విధముగ నుపన్యసించిరి.

"అధ్యక్షా! సోదర సోదరీమణులారా!

శ్రీ నాగేశ్వర స్వామివారి ఆలయ ధర్మకర్తలుగా యిప్పటికి సుమారు ఎనిమిదిసంవత్సరములుగా పనిచేయుచు అనన్యసామాన్యమైన కృషిగావించిన శ్రీ ఆవటపల్లె హనుమంతరావుగారికి మీరు చేయుచున్న సత్కారములో వారి ఛాయా పటమును ఆవిష్కరించు గౌరవము నా కొసంగినందులకు మీకు నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

మన భారతదేశమే పుణ్యభూమి. ఈ దేశమునందు గల ధర్మసంస్థ లిక యే దేశమునందును గానము. అందులో ఆంధ్రులమైన మన కొక ప్రత్యేక విశిష్టత గలదు. భావోద్రేకము మన జన్మహక్కు. అందువలననే భక్తి మన నాట వేవిధముల విజృంభించినది.

మనసార నమ్మినపని నిర్వహించుటలో మనము కష్ట నిష్ఠురములకుగాని, ధనవ్యయమునకుగాని యేనాడును జంకము. ఉత్సాహముతో పని జరుగుచున్నప్పుడు మీనమేషములు లెక్కించుకొనుచు, ఆదాయవ్యయములు సమీక్షించు కొనుచు రూపాయి, అణా, పైసల లెక్కలలో మునిగి కార్య విఘాతమొనర్చుట మన నైజమునకే వ్యతిరేకము. అందు వలననే మన ఆంధ్రదేశములో వేలకువేలు దేవాలయము లుద్భవించినవి. ఇంకను ఉద్భవించుచున్నవి. ఈ కట్టడములకు ఉపయోగపడు ప్రతిరాతిలోను ప్రతి ఇటుకలోను వానికి చేయూతనిచ్చిన భక్తుల భక్తిపారవశ్యత యిమిడియున్నది. ఈ దేవాలయములు అందుచేతనే యెక్కడ నిర్మింపబడినను వాని శిఖరములతో, కుడ్యములతో మనోహ్లాదకరదృశ్యముల నిచ్చుటయేగాక భక్తిభావజనకములై యొప్పుచున్నవి.

* * * *

ఇట్టి పవిత్రసంస్థలు మనదేశమున వేనకువేలుగలవు వీనిని సరిగా కాపాడుకొని వానిని నిర్మించిన భక్తిపరుల ఆదర్శములను సఫలీకృత మొనర్చవలసిన బాధ్యత మనపైన యెంతయేనిగలదు ఇందు కొన్నిసంస్థలకు కొలదిగనో, గొప్ప గనో ఆస్తులుఁగలవు. అట్టి ఆస్తులు దుర్వినియోగముకాకుండ చూచుకొనవలసిన పవిత్రమైనబాధ్యత మనపైన యెంతయేని కలదు. ఆస్తులు ఉన్నను లేకున్నను ఆచారముప్రకారము నిత్య దీప ధూప నైవేద్యములు, నిత్యోత్సవములు, పక్షోత్సవ ములు, మాసోత్సవములు, సంవత్సరోత్సవములు క్రమముతప్పక జరుగవలెను. ఇది అంతయు మన బాధ్యత.

పై బాధ్యతల నిర్వహించుటకే "ధర్మకర్త" లనెడి వారిని నియమించవలసివచ్చుట. ఈ బాధ్యతలు నిర్వ హించుట కష్టసాధ్యము. ఆస్తిపరిపాలనలో జాగరూకత అత్యావసరము. ఎప్పటికప్పుడు ఏ ఆస్తియు చెడిపోకుండ చూచు కొనుచుండవలెను. దేవాదాయకట్టడము లెప్పటి కప్పుడు శిధిలములుకాకుండ కనిపెట్టుచుండవలెను. అవకాశమును బట్టి కళాఖండములైన క్రొత్త కట్టడముల నేర్పరచు కొనుచుండవలెను. ఇతర స్థిరాస్తులు అన్యాక్రాంతము కాకుండ కని పెట్టుచుండవలెను. చరాస్తి జాగ్రత్తగా వాడుకొనుచు, అదియు నన్యహస్తముకాకుండ వేయికండ్లను కనిపెట్టవలెను. సరియగు ఆదాయము రాబట్టుటకు తీసికొనవలసిన చర్యలు చాలగలవు. పబ్లికు వేలములలో హెచ్చు పాటదార్లకు మాత్రమే, అందులోను సరిఅయిన హామీ చూపగల వారికే, క్రమమయిన కవులుకాగితము అవుసరమయినచో రిజిష్టరుచేసి యిచ్చిన వారికే, భూములు కవుళ్ళ కీయవలెను. రాబడి ఎప్పటికప్పుడు జాగరూకతతో వసూలుచేయుచు, కవుల షరతుల ప్రకారము గుత్తనీయని కవులుదార్లను అలస్యము చేయకుండ తప్పించి నష్టము వారివలన రాబట్టుకొనవలెను. ఏ పద్దులకు కాలదోషము పట్టకుండ అవసరమయినయెడల కోర్టుకు ఎక్కి హక్కుల రక్షించుకొనవలెను.

ఇంతటితో కాదు - దేవాలయములో, అచటి సాంప్రదాయముల ప్రకారము, ఆగమశాస్త్రములకు వ్యతిరేకము కాకుండ, అర్చనాదివిధులు జరుగునట్లు చూసుకొనవలెను. వేదపారాయణము, వాద్యగోష్టి, హరికథా పురాణకాల క్షేపములు, మొదలగు వానితో సర్వకాలములయందును దేవాలయము దైవభక్తికి, అన్నికళలకు ప్రధాన కేంద్రముగా వ్యవహరించునట్లు చూచుకొనవలెను. క్రమము ప్రకారము జరుగవలసిన ఉత్సవములు దుర్వ్యయములేకుండ సకలజనరంజకముగ, శాస్త్రానుగుణ్యముగ, దాతల ఆదర్శమునకు భిన్నముకాకుండ, జరుగునట్లు చూచుకొనుచుండ వలెను.

ఆస్తులు ఉన్నను లేకున్నను, ప్రతిదేవాలయము అన్ని విషయములలోను మనఃజ్ఞానమునకు, కళలకు కేంద్ర ముగా ఉపకరించవలెనన్న - ప్రజాదరణ పొందవలయును. ఇందులకు చేయవలసిన కృషియు కష్టసాధ్యము. వయోభేద మునుబట్టి ఇతర దృక్భేదములనుబట్టి ఏర్పడు విభిన్నరుచులకు రుచియించునట్లు కార్యకలాపములు సరిదిద్దుకొనవలెను.

ఇటువంటి విధ్యుక్తధర్మములు ధర్మకర్తలభుజములపైన ఎన్నియోగలవు. అట్టివానినన్నిటిని, అతి నైపుణ్యముతో నిర్వహించుచున్న శ్రీ అవటపల్లె హనుమంతరావు పంతులుగారికి నా తరపున, మీయందరి తరపునను, కృతజ్ఞతా పూర్వక వందనములు.

'ఆచంద్రతారార్కముగా వారి ఆశయములు ఈడేరి, ఈ పవిత్రదేవాలయము దినదినాభివృద్ధి గాంచి, భక్తజనులకు ఇతోధికముగా నుపయోగించునుగాక!' యని ఆశీర్వదించవలసినదిగా శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత శ్రీ నాగేశ్వరస్వామి వారిని ప్రార్థించుచు, అధ్యక్షుల యొక్కయు, మీ యొక్కయు అనుమతితో శ్రీ అవటపల్లె హనుమంతరావుగారి ఛాయా పటము నావిష్కరించు చున్నాను.'' 24 తేదీ సభ శ్రీ గాయత్రీ పీఠాధిపతుల అధ్యక్షతను జరిగినది.

---

శ్రీ అవటపల్లె హనుమంతరావుగారి సమ్మాన సభ



ఛాయా చిత్రము నావిష్కరించుటకు ముందు దేవాదాయ ధర్మదాయ పరిపాలనాశాఖ డిప్యూటి కమిషనరు వారు ఉపన్యసించుట

# DAKSHA'S PRAYER TO THE IMPERSONAL

(From Srimad Bhagavatam)

"Our salutations to the most high!
Pure consciousness is thy nature:
Thou art the ruler of Māyā and Lord of all beings.

They know not thy divine nature
Who live within the bonds of the Guṇas.
Who can define thee, who art self-existent and self-luminous?

"Objects seen know not the sense of sight,
Nor does any man know the true seer!
Thou art the seer, omniscient,
Dwelling in the hearts of all.

"We salute thee: thou art Hamsa, the pure spirit;
Thy nature is revealed in deepest contemplation,
When the mind becomes absorbed in thee
And soars beyond all consciousness of name and form.

"As fire remains hidden in wood,
So dost thou remain hidden in the body!
With heart and intellect absorbed in thee,
The wise find thee in thy hiding place.
Shower thy mercy upon us!

"Thou art the seer of thyself,
Thou dost experience thine own bliss,
Thou dost control thy Māyā, which bringeth forth this manifold universe.

"Thy power is infinite,
Thy form is universal,
Thou art the Soul in all beings and things.

"Words cannot express thee,
Intellect cannot know thee,
Senses cannot find thee,
Mind cannot conceive thee:
Thou art beyond all.

*(With the kind courtesy of Sri Ramakrishna Math)*

# ANDHRA ARCHITECTURE

*BY*

V. V. TONPE

### III-FOREIGN INFLUENCE ON HINDU ARCHITECTURE

*(ii) Muslim Influence (Continued)*

In the previous two articles we dealt with the Muslim influence on North India. The surge of Muslim culture there was so huge that it threatened to obliterate the native cultures of India. But before long India reasserted her individuality though she did not grudge to assimilate certain of the foreign potentialities into her very fibres.

The Aryans stepped on Indus soils from Central Asia to make "the land of the five rivers" their home once and for all. In course of centuries they spread their culture over the whole of the North of India and precipitated South on to the peninsula. Like wise the Muslim invaders of India for a long time confined themselves to the North of Vindhyas. But gradually their influence was to be felt in the whole country.

*The History of the Deccan*

As Vincent Smith has rightly observed: "Most historians of ancient India have written as if the South did not exist."[1] He explained this neglect of the South in two ways as follows. "The historian of India is bound by the nature of things to direct his attention primarily to the North, and is able to give only a secondary place to the story of the Deccan plateau and the far South." Secondly, "the northern record is far less imperfect than that of the peninsula. Very little is known definitely concerning the southern kindgdoms before A.D, 600, whereas the history of Hindustan may be carried back twelve centuries earlier. The extreme deficiency of really ancient records conerning the peninsula leaves an immense gap in the history of India which cannot be filled." Though what Smith said is true, it is not so helpless a situation as he depicts it.

Our knowledge of the Deccan has greatly advanced during the last fifty years and many important discoveries, archaeological and literary are now available. But much of these lie in the different branches of the Archaeological Survey of India, and of the important Indian states, such as Hyderabad,* Mysore* and Madras*.

*Muslim Influence in the Deccan*

As long as the Deccan belonged to the Delhi Empire, the Muslims that settled there had their artistic and cultural inspiration from Delhi. Their buildings were either assemblages of dismantled Hindu shrines or constructions based on Khalji or Tughluq styles.

When once, the political connection with Delhi was severed, the Muslims of the Deccan, in the normal course of things, should have succumbed to the Hindu influence which was dominating. But as a fact quite the reverse happened. The foreign culture took a very long time to assimilate the indigenous art in the South. It was a slow and steady process unparallalled in India.

---

1. "Oxford History of India"—V. A. Smith. Ed. 1923.

* Before the Reorganization of States.



Fig. 1.

*Architecture under the Bahmanis*

To the Bahmanis Delhi was the fountain head of architectural inspiration. From 1347 down to the close of the fourteenth century and during the following century also to some extent, they built their constructions basing on the Delhi style of architecture. From the beginning of the fifteenth century, other and more remote influences began to make their impressions on them.

The Bahmani rulers were generous patrons of art, science and learning. To the scholars, artists, and soldiers of the land, the Bahmani court was always a centre of attraction. Thus the military architecture of the Bahmanis was introduced directly from the West while the civil architecture had its inspiration from Persia.

*The Military Architecture of the Bahmanis*

During the period between 1294 A.D. when Ala-ud-din Khalji invaded the country and 1347 A. D. when Bahman established his dynasty, much substantial work must have been done by the Muslims into the military architecture. Strongholds like Daulatabad (Devagiri) were wested by them from the Hindus but they must have improved the fortresses and improvised them to answer their taste and requirements. But unfortunately we have little authoritative information on the military architecture of the Deccan.

*The Fortification at Daulatabad Fig. 1.)*

Yet the fortification at Daulatabad throws some light on it. Some of the defences were devised by the Yadavas and some other by the Bahman rulers or their successors. About 1339 A. D. Tughluq transferred his capital from Delhi to Daulatabad and he introduced the military architecture of Delhi into the Deccan.

The inner citadel stands on an isolated rock conical in shape, 600 ft. in height

with its sides scarped sheer for 150 ft. There is a moat hewn out of the living rock at its base. The only entrance to it is through a devious tunnel. During the times of war, it is made impassable by an ingenious contrivance: small chamber is provided with a flue pierced through the wall and is fitted with a staging of iron plates on which a charcoal fire is lit. It is fanned by the incessant winds through the flue, so that the smoke would quickly fill the tunel and suffocate the intruders. Round about this, a highly complex fortification designed to protect the city is built. The outer wall measures $2\frac{3}{4}$ miles. Between this and the inner citadel there are three inner walls, each having loop-holes and battlements and fortified gateways and bastions. In addition to these the outer wall is surrounded by a moat and glacis resembling the mediaeval fortresses of Europe.

The Bahmanis seem to have concentrated their engineering skill on military architecture than on any other. Threatened constantly by many powerful enemies on all sides—the Rajas of Vijayanagar from the South-west, Telingana and Orissa from the South-east and East, by the Gonds, and the Sultans of Khandesh, Malwa and Gujarat from the North and North-west—the Bhamanis were forced to construct defences second to none for strength and ingenuity in the whole of the country. Some of these fortresses originally belonged to Hindu states but were acquired and trans-formed by the Muslims to that extent as to retain little of their original character. Such were Raichur which was built by Gore Gungaya Ruddivaru in 1294 A.D.; Mudgal, once the seat of local Yadava governors; Warangal, Gulbarga and Bidar captured by Muhammad bin Tughluq, and Golcondaceded to Muhammad Shah I in 1364 A.D. Others like Mahur and Naldrug, were constructed on precipices or among the hills. They were artificial defences situated in the midst of natural fortifications.

Like Daulatabad and only second to it come the forts at Bidar and Parenda. Bidar Fort was constructed by Ahmad Sahah I in 1426—'31, when it replaced Gulbarga as the Bahmani capital. Its walls are about 50ft. in height and three miles in circumference, and are provided with battlements, bastions and outworks. These are protected by three pitches each 75ft. wide and 45ft. deep, hewn out of the solid rock. The Parenda fort (Fig. 2.), is traditionally attributed to Mahmud



Fig 2.



Fig. 3.

Gawan, which is questionable. Though comparatively small in area, it possesses singularly efficient defences. It has an inner and outer wall which are separated by a covered passage, a moat from 80 to 110 ft. in width, a second and broader covered passage outside the counter scrap and a glacis. The outer wall is strengthened by 22 bastions. They too are provided with loopholes, battlements and projecting galleries. There is only one entrance at the North-west corner which is approachable through a draw-bridge and a gate-way.

These military defences of Deccan resemble the European counterparts so closely that one is tempted to conclude that they are the imitations of the military architecture of the West. But on closer study one will find that the Indian builders accepted what was essential and utilitarian without any prejudice to their indigenous styles.

*The Civil Architecture under the Bahmanis*

The capitals of the Bahmanis having first been at Gulbarga and next at Bidar, they naturally left the best of their civil architecture in these two places.

At Gulbarga, the two groups of royal tombs are of interest. The first group, which is near the south gate of the fort, consists of the tombs of Ala-ud-din Hasan, Bahman Shah (d. 1358), Muhammad Shah (d. 1375) and Muhammad Shah II (d. 1397 and two anonymous tombs of a later date; the second group, known as *Haft Gumbad* (Seven Domes) is to the east of the town, and contains the tombs of Mujahid Shah (d. 1378, Dau'd Shah (d. 1378), Prince Sanjar, Ghiyas-ud-din (d. 1397) and his family, and Firuz Shah (d. 1422) and his family. All these tombs, (Fig. 3.) in their general form and shape seem to belong to the same school of architecture. The single ones are, however,

simple sqare chambers which have battlements and corner turrets at the top and possess a single dome for the roof. The complete structure stands on a low square plinth. The two double ones are more duplication of two such single ones.

In their details, these tombs reveal the phases through which the Deccan architecture passed during these times. The tomb of Hasan, for example, with its battering walls and low dome, its fluted turrets, tall narrow doorways and band of blue enamel tiles under the springers of the dome represents the Tughluq style of Delhi while the tomb of Ghiyas-ud-din which was built in the later years of the 14th C., shows Hindu craftsmanship in the carvings of the prayer-niche. A generation later the beautiful mausoleum of Firuz Shah and his family represents the steady growth of Hindu influence along with the new taste for Persian ornament. The outside of the carved and polished black stone pilasters of the entrance and the dripstones and elegant brackets that support them are typical Hindu entrances and brackes while the resplendent plaster and painted decorations of the interior are Persian; they suggest the painted decorations of the interior of the tombs of the Sayyid and Lodi kings at Delhi.

*Jami Masjid*

This mosque was built by Rafi, 'the son of Shams, the son of Mansur of Qazwin'. His liking for Persian architecture can be noticed in the masjid he got constructed: the domes of it are stilted and the entrances are narrow. In other respects the construction seems to be done in the Delhi style of architecture. There are, however, two note-worthy features in this building: one is the broad squat arches of the cloisters (Fig. 4.) which appear for the first time but later on seem to be one of the redeeming features of the Deccan style. The other feature is the covered courtyard which has 63 small domes carried on arched bays. The cloisters at the sides are roofed with coresponding vaults. Light and air are allowed in through open archways in the outer walls. At the four corners are four shapely domes and the fifth a larger one dominates the rest and is raised on a square clerestory. On the whole there is a dignified simplicity in the construction which is all its own and is an example to the Deccan style of constructions.

*Monuments at Bidar*

From the reign of Ahmad Shah Vali the scene of action of Deccan architecture seems to have shifted from Gulbarga to Bidar. These are also two separate groups of royal tombs. They proclaim the growth and development of the South. The later Bahmani kings have twelve tombs to commemorate them



Fig. 4.

which are generally akin to the tombs of the same royal line at Gulbarga. But the scale of these is larger, the dome bigger and more bulbous and the facades adorned with a greater number of arched recesses or screened windows than those at Gulbarga. The most impressive of the monuments at Bidar is the tomb of Shah Vali. The interior of this tomb contains bright coloured paintings done in Persian style. It is full of bands of Kufic, *Tughra* and *Naskh* inscriptions which are done in letters of gold on a deep blue or vermilion background. This Persian influence grew stronger during Ala-ud-din Shah's reign and is evident in the *Chand Minar* (Fig. 1.) at Daulatabad. This Minar is completely designed in Iranian style along with the tomb of Ala-ud-din shah, which has a facade covered with a veneer of enamel tiles in various shades of blue. But of all the monuments constructed in the Persian style during that period, the most noteworthy one is the *Madrasa* or College at Bidar.

*The College at Bidar*

It was built by Mahmud Gawan, the minister of Muhammad Shah III. It is said that this resembled the College of Ulugh Beg at Samarquand. It was a three-storied construction with two corner minarets in the front. Its area was 205' by 180'. It comprised of a mosque, library, lecture halls, professors' quarters and students' cubicles. There was an open courtyard a hundred feet square. In shape the corner minarets resembled the *Chand Minar* at Daulatabad; but unlike it they were emblazoned with a glittering surface of encaustic tile-work. The front facade was also emblazoned in the like manner. On them were inscribed sacred texts in deep bold bands, which is a typical Persian characteristic.

Mention may be made of some other monuments of the time like *Sola Khamb* Mosque and the group of palace buildings including the Gagan, Tarkash Chini and Nagina Mahals which are situated in the vicinity of Bidar. Sir John Marshall rightly describes them as follows: "Shorn of all ornament, modernised and converted to baser uses as record office, court and jail, these palace buildings are impressive even in their decay and with their spacious halls, their water courses and cascades, still awaken echoes of their former splendour."[1]

I will not be indulging in much of a digression if I point it out that the evil tendency of converting the monuments into utility buildings has not died away with the British rule in India. If transfer of power from the British hands to our own administrators' meant transfer of red tape and certain bureaucratic idiosyncracies, here is, perhaps, a good example of it. I, in my recent tour of the South, learnt with much pain that this tendency of converting monuments into record offices, courts and preferably jails, was growing stronger day by day under the pretext of solving the accomodation problem. No doubt, the various new offices that have come into existence after Independence do require accomodation. But that does not mean that we should disfigure the monuments. They are Antiquitie's legacy to Posterity and we of the Present have no right to meddle with them. At the most we can play the trustees of them.

*(to be continued)*

1. "The cambridge History of India" Vol III. Ed. 1928. p. 636

# HINDU IMAGES - 5

*By*

T. N. SRINIVASAN, M. A.

As *Saligramas* are for the Vaishnavites, *Banalingas* are very important for the Saivites. They are mostly clear quartz pebbles, which are rounded of by river erosion to get the shape of ovoid bodies. They are to be found in particular in Amareswara on the Mahendra mountain and in the river bed of Narmada. According to Trilochana Sivacharya "*Banalingas* are liked by Iswara and worshipped according to strict *Saiva-Siddanta vidhis*" (*siddanta-saravali*). Hence in addition to temples like those at Srisailam, Chidambaram, these sacred objects are worshipped in households also by *gruhasthas*.

*Banalingas* are of several varieties and range in size from an eighth of an *angula* to one *hasta* or cubit. They are also of varying colours, either white, dark red, deep green or blue sometimes.

Next but equally in importance are what are called "*Yanthras.*" They are certain mystic and magical diagrams conforming both to science and ethics. These diagrams are usually engraved upon metallic plates or sometime drawn on paper or cloth. Intersperced between the angular points of the diagram, certain mystic letters are also added and these plates which may be on sheets of gold, silver, copper, lead and iron, are invoked with suitable pujas.

Such *yantras*, when properly consecrated, are supposed to have immense power to protect the worshipper and also to ward off evil spirts and bestow happiness, wealth and health to the devotee. Sometimes they are worn about the person of the worshipper encased in small gold or silver cases to serve as amulets. It is also believed that such *yanthras* duly consecrated, are placed under the images in temples, especially the *dhruva-beras*, before they are installed for worship, when the cosmic power of the divinity, which the image represents, is said to manifest itself in a greater degree. Of course, *yanthras* are drawn on paddy, or riceflour which is spread on the flour in places where sacred rites are performed.

Though *yanthras* are numerous and many of them being very intricate and complex in design, it is worth while to mention here a few of the most important. The predominantly common *yanthra* is what is known as 'Sri chakra'

To know the real significance of this *chakra*, it is essential to learn something about the *tantric* cult of Devi worship and a brief description of that esoteric form of adoration is given below.

God according to our philosophy and religious traditions, may be received as being either with or without attributes-that is as *Saguna* or *Nirguna*. In the former aspect, God is spoken of as HE or SHE but in the latter case as IT. In the *Saguna* form of worship, which is prescribed for all the common people, the Vaishnavas worship Him as *Vishnu* and the Saivas as *Siva*. Those Hindus, who worship the Supreme Being exclusively as a female principle are called Saktas and the deity is adored as *Sakti*.

The classification of Hindu worshippers as Vaishnavas and Saivas on the one hand and Saktas on the other is not, however exclusively rigid or inviolable, in as much as both Vaishnavas and Saivas also worship the Devi in her aspect as the

consort of their Lord—as *Lakshmi* and *Parvati* respectively, although the supreme place of honour is exclusively reserved for the male Deva in each case, while His Devi comes only next to Him.

But the Saktas make the Devi supreme Deity and assert that without the co-operation of this goddess, the absolute *Brahman* of itself can achieve nothing. To them this Sakti is conceived to be the personificating universal Energy in the abstract.

The greatness of Sakti as Primeval-Energy finds expression even in the *Upanishads*, like the *Tripuropanishad*, *Devyupanishad*, *Bhavanyupanishad* and others. In later periods Her greatness was emphaised even in the great acharyas like Sri Shankara in his *Saundarya-Lahari*, Sri Vedanta Desika in his *Sristuti* and *Dayasataka*. Exclusively composed puranas like *Sri Devi Bhagvvatham*, denote themselve to praise the supremacy of Sakti, to whom these authorities attribute supreme power and manifestation.

*Sakti* resides in the macrocosm as well as in the microcosm. The discovery and development of *sakti* or psychic energy in man is the aim of the *mantra-sastras*. The *Sakti* which resides in man and the development of which is one of the aims of the *yoga-sastra*, is called the

SRI CHAKRAM



'*Kundalini Sakti.*' The place where it resides is called the *Muladhara*, which is indicated as the lower extremity of the spinal cord near the pelvic region of the body. By a successful development and working of this *Sakti* at the *Muladhara*, even the attainment of *moksha*—the liberation of the soul, is possible. In the ordinary condition the *Kundalini sakti* is latent and sleeps quietly. The yogic aspirant must first awaken it either by yogic exerecise like *pranayama* or by means of appropriate *manthras.* Thus awakend, this *Sakti* is believed to travel upwards from the *Muladhara*, to the next higher centre known as *Svadhishthana*, thence to *Manipura*, *Anahata*, when the *Sakti* becomes purified and attains a *Sattvic* nature. From there it travels to *Visuddhi* and then at last up to the centre *Ajna*, where it becomes manifest as a flash of light. The Yogis who had successfully practised the stationing of the *Kundalini Sakti* at *Ajna* centre, feel the attainment of power, energy and psychic realisation.

The effects produced at each of the six centres mentioned above is depicted diagramatically which form the objects of concentration by students of *Sakti* cult and *Srichakra* is the general *Yanthra* that connotes this aspect of Yogic Cult.

*Sri chakra*, as may be seen from the accompanying diagram consists of symmetrically arranged triangles which are forty three in numbers, of which the apex of some are turned upwards and that of other are pointing downwards. The '*Meru*' is the same as the plane of Sri Chakra in plan. The other triangles are piled over that in different planes in the form of a pyramid. The top most layer, which has only one triangle with a circle in the middle is called the '*Bindu*'. Each of the triangles are marked with special *bija aksharas*, or *seed letters*, and the entire chakra is surrounded by two circles of eight and sixteen petalled design. The outer side is again covered with a plain circle in two or three concertic layers.

*Yanthras* of this kind are still under worship in temples and the noteworthy example is the famous *Sri chakara peetham*, installed in front of *Kamakshi Devi* at Kancheepurama place which was once much noted for Devi-cult. This *Chakra* is said to have installed by Srl Adi Shankra himself and from that time, it forms the nucleus of worship and also the chief object of worship of the acharyas that adorn the *kamakoti peetham* of the Advaitic School.

Similar to this is the *Sudarsana Yanthra*, which the Vaishnavite adherants of *Sakti* worship, esteem much. It signifies the cosmic power of Vishnu in the aspect of *Sudarsana* or *Chakra*—the Discus. It is found installed in Vishnavite temples, especially in shrnies specially dedicated to Narasimha and others.

Besides these, the Hindus worship many other objects-like animals and birds. To a devout Hindu, cow is a very sacred animal and is said to represent the mythological *Kamadenu*—the divine animal that came out of the milk ocean, *Kshirabdhi*, when it was churned by the Gods and Demons for getting the divine ambrosia — *Amritha*. *Gopuja*, as it is called, ordains worship of the cow and it is not uncommon to see in villages cows being bathed expecially on fridays and ornamented with sandalpaste and *Kumkuma*. Of course, it is more significant on the day after the *Makara-Sankranti* day, when special worship is done to this animal.

Cow is also used in the daily worship in Vaishnavite temple, when every morning, a fine looking cow is brought in during

